# ఆంధ్ర సాహిత్యములో
# సత్యభామ పాత్రచిత్రణము



డా॥ పి.ఎస్. పార్వతీదేవి

# ఆంధ్ర సాహిత్యములో సత్యభామ పాత్ర చిత్రణము

( The Character Portrayal of Sathyabhama
in Telugu Literature)

1985లో నాగార్జున విశ్వ విద్యాలయము వారి
పిహెచ్. డి. పట్టము పొందిన సిద్ధాంత గ్రంథము

డాక్టర్ పి. ఎన్. పార్వతీ దేవి ఎమ్.ఏ., పిహెచ్.డి.
రీడరు & తెలుగు శాఖాధ్యక్షులు
మారిస్టెల్లా కళాశాల, విజయవాడ - 8

# Andhra Sahityamulo Satyabhama Patrachitranamu

BY

*Dr. P. N. Parvati Devi* M.A., Ph.D.

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 1999

వెల : రు. 125/-

ప్రతులు : 1000

ప్రతులకు :
ఎస్. నారాయణన్
సెకండ్ ఫ్లోరు, అరబిందు అపార్టుమెంట్సు
రామచంద్రనగరు, విజయవాడ-8
ఫోన్ : 474623

విశాలాంధ్ర బుక్‌హౌస్
అన్ని బ్రాంచ్‌లు

నవోదయ బుక్‌హౌస్
ఏలూరు రోడ్డు, విజయవాడ-2

గ్రాఫిక్స్ :
సక్సెస్ గ్రాఫిక్స్, విజయవాడ -2

ముద్రణ :
శ్రీ పాండురంగ ఆఫ్‌సెట్ ప్రింటర్సు
అరండల్ పేట , విజయవాడ-2



నీవు కొండంత దైవమని మఱి నీకు
నెటుల కొండంత కానుక నీయ గలను
కొమ్ము ఈ చిన్ని పొత్తము కోరి యిత్తు
వేడెదను నన్ను దయజూడు వేంకటేశ


ఈ సిద్ధాంత గ్రంథము
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి
'ధార్మిక గ్రంథ ప్రచురణమునకిచ్చు ఆర్థిక సాహాయ్యము'న
ముద్రితమైనది

Dr. **V. RAMACHANDRA** M.A., Ph.D.,
Professor and Head (Retd)
Dept. of Telugu
University of Madras
MADRAS - 600 005.

# భామా తిలకం

లోకంలో కథల కెక్కిన ప్రఖ్యాత స్త్రీలెందరో ఉన్నారు. మన దేశంలోని అటువంటి స్త్రీలలో సత్యభామ ఒక సమ్మోహన శక్తి. బహుశః ఆ దృష్టితోనే ముక్కు తిమ్మన కూడా "జగంబులోనఁ బేరెక్కిన దాన"నని సత్యభామ గర్వించి నట్లుగా వ్రాసి ఉండవచ్చు. తెలుగు కవులకు సత్యభామ పాత్ర ఒక బంగారపు ముద్ద. చాలామంది కవులు ఎవరి నేర్పును బట్టి వాళ్ళు ఆమె పాత్రను అనేక విధాలుగా చిత్రించి కావ్యకర్తలై జన్మ తరించినట్లుగా భావించి తృప్తి చెందారు. ఆ విధంగా సత్యభామ పాత్ర ఆధారంగా తెలుగులో రసవంతమైన సాహిత్యం ఎంతో వెలసింది.

సత్యభామ ఒక విచిత్రమైన వ్యక్తి. ప్రధానంగా శృంగార రసాధి దేవత కాగలిగిన నాయికామణి ఆమె. కాని ఆమె మనస్తత్వాన్ని పురస్కరించుకొని చూచినప్పుడు ఆమెతో కాపురం చేయడం భర్తకు కత్తిమీది సామే అనిపిస్తుంది. అయితే, ఆమె అదృష్టం బాగుండి శ్రీకృష్ణు డామెకు భర్త అయ్యాడు. లోకంలో శ్రీ కృష్ణుణ్ణి మించిన దక్షిణ నాయకుడు లేడు. అంతటివాడు కాబట్టే సత్యభామ తోడి తన సాంసారిక జీవితాన్ని శృంగార మహితంగా మలచుకో గలిగాడు. ఫలితంగా శ్రీకృష్ణ సత్యల జీవితం కవులకు రమ్యాతి రమ్యమయిన కథా వస్తువయింది.

ఆకాలంలో బహు భార్యాత్వం పురుషులందరకూ మామూలే. శ్రీకృష్ణుని విషయం చెప్పనే అక్కఱలేదు. అటువంటి శ్రీకృష్ణుడు తనకు విధేయుడై ప్రవర్తించాలనేది సత్యభామ పంతం. అటువంటి విచిత్రమైన మనస్తత్వంతో ఆమె కృష్ణుడికి కలిగించిన కష్టాలు, తా ననుభవించిన వేదనలు ఎన్నో ! కడకు "నే నొక్క కృష్ణుడితోనే వేగలేక పోతున్నాను. నువ్వు ఐదురుగు భర్తల్ని ఎలా చెప్పుచేతల్లో ఉంచుకోగలిగావు ? ఏమైనా మందులు మాకులు పెట్టావా" ? అని ద్రౌపదిని ప్రశ్నించి, "నువ్వు శ్రీకృష్ణుని భార్యవు కాదగవు" అని ఆమెచే చీవాట్లు తినేటంతటి దీనస్థితికి దిగజాఱిందంటే, శ్రీకృష్ణుణ్ణి తన చెప్పు చేతల్లో ఉంచుకోవాలన్న సత్యభామ ఆరాటం ఎంతటిదో మన కర్థమవుతుంది. ఆమె ప్రేమ అంత తీవ్రమయింది. శ్రీకృష్ణుడు కూడా తనపట్ల అంతటి ప్రేమానురాగాలు చూపడం లేదనుకున్నప్పుడు ఆమె కోపతాపాలు కూడా అంత తీవ్రస్థాయినే అందుకొంటాయి. ఆ విధంగా సత్యభామపాత్ర చిత్ర విచిత్రంగా గోచరిస్తుంది.

అటువంటి సత్యభామపాత్రను సమగ్రంగా చిత్రించడం ఏ ఒక్కరికీ అలవి కాని పని. అందుకే ఎందఱో కవులు సత్యభామ పాత్రను స్వీకరించి ఆమెలోని నాయికా లక్షణాలను ఆవిష్కరిస్తూ కావ్య నాటకాది అనేక సాహిత్య ప్రక్రియలను వెలయించారు.

ఇలా ఎందఱో కవులు ఎన్నో విధాలుగా చిత్రించిన సత్యభామ పాత్రను గుఱించి సమగ్రంగా పరిశీలించి, క్లిష్టమైన ఆమె మనస్తత్వాన్ని, ఆధునిక మనస్తత్త్వ శాస్త్రవేత్తల

పరిశోధన లాధారంగా సమన్వయ దృష్టితో ప్రకటించే పనికి పూనుకొన్న పి. ఎన్. పార్వతీదేవిది ఒక సాహసమే అని చెప్పాలి. ఆ సాహసంతో పాటు సడలని పట్టుదల, నిరంతర కృషి కూడా లేని పక్షంలో పార్వతీదేవి తన సిద్ధాంత వ్యాసంలో ఆంధ్ర సాహిత్యంలో జరిగిన సత్యభామ పాత్రచిత్రణను గుఱించి ఇంత సమర్థంగా, సమగ్రంగా వ్యాఖ్యానించ గలిగి ఉండేది కాదు. తెలుగు సాహిత్య మంతటా బహుముఖంగా విస్తరించి యున్న సత్యభామ పాత్రతత్త్వాన్ని సమగ్రంగా ఆకళించుకొని, సహృదయ పాఠకులకు దాన్ని పార్వతీదేవి విశదపరచిన తీరు ప్రశంసనీయం. తమిళం మాతృభాష ఆమెకు. తెలుగు సాహిత్యాన్ని ఆమె అధ్యయనం చేసిన విధానం, తెలుగు సాహిత్యంపట్ల ఆమెకున్న అభిమానం అద్భుతావహాలు.

సంస్కృత పురాణేతిహాసాదుల నుండి తాను సేకరించిన అనేక విషయాల నుదాహరిస్తూ, తెలుగు సాహిత్యంలో సత్యభామ పాత్ర చిత్రింపబడిన విధానాలను సమగ్రంగా పరిశీలించి, తాను గ్రహించిన విషయాల నామె యీ సిద్ధాంత వ్యాసంలో ఏడధ్యాయాలలో పొందుపఱచారు. సత్యభామ పుట్టింది మొదలు ఆమె నామకరణం దగ్గఱనుండీ, ప్రబంధ నాయికగా రూపొందిన ఆమె వ్యక్తిత్వ వైచిత్రిని సప్రమాణంగా నిరూపించేంత వఱకూ సాగిన యీ యే డధ్యాయాలలో వ్యక్తమయ్యే పార్వతీదేవి ప్రజ్ఞా విశేషాలు, సాహిత్యానురక్తి విమృశ్యకారిత, పరిశోధనా పాటవం, నిష్పాక్షిక దృష్టి మొదలైన గుణ విశేషాలు చదువరులను తప్పకుండా ఆకట్టుకుంటాయి. సత్యభామ బాల్యాదులను గుఱించీ ఆమె వివాహానికి సంబంధించిన విషయాలను గుఱించీ, అష్ట మహిషులలో ఆమె స్థానాన్ని గుఱించీ, ఆమె సాంసారిక జీవితాన్ని గుఱించీ, స్వభావాన్ని గుఱించీ, ఆమెలోని నాయికా లక్షణాలను గుఱించీ, పార్వతీదేవి ఆరు ప్రకరణాల్లో సమగ్రంగా వివరించి, సత్యభామపాత్రను కన్నులకు కట్టేటట్లు చేసారు. ఈ సిద్ధాంత వ్యాసానికి ఏడవ అధ్యాయం మకుటాయ మానమైనది. ఈ ప్రకరణంలో మనస్తత్త్వశాస్త్ర దృష్టిలో సత్యభామ పాత్ర విశ్లేషణం జరిగింది. మానవ మనస్తత్త్వాన్ని గుఱించి ఫ్రాయిడాదులైన పాశ్చాత్య శాస్త్రవేత్తలు పరిశోధనలు సాగించి నిగ్గు దేల్చి నిగదించిన సత్యాలను సత్యభామ మనస్తత్త్వాని కన్వయించి పార్వతీదేవి వ్యాఖ్యానించిన తీరు ప్రామాణికమై సత్యభామ ప్రవర్తనకు శాస్త్రీయమైన ప్రాతిపదికను నెలకొల్పుతున్నది. ఈ పని యిదివఱకెవ్వరూ చేసినది కాదు. ఆపని చేసి తన గ్రంథాన్ని పార్వతీదేవి ఒక "సత్యభామా సర్వస్వం"గా రూపొందించారు. ఆమె యీ కృషికి తెలుగు సాహిత్య లోకంలో ఒక విశిష్టమైన స్థానం ఉంది. ఉంటుంది.

పార్వతీదేవికి చదువుల్లో స్వర్ణ పతకాలు సాధించిన అర్హతలున్నాయి. ప్రాచార్యులు కీ॥శే॥ డా॥ దోణప్పగారి శిష్యత్వం చేత అలవడిన ప్రజ్ఞా పాటవాలున్నాయి. రచయిత్రిగా ఆర్జించుకొన్న పేరున్నది. సంస్కృత తమిళ భాషల్లో మంచి పరిజ్ఞానం ఉంది. వీటన్నింటినీ రాణింపజేసే వినయశీలం ఉంది. ఇన్ని అర్హతలతో విలసిల్లే వ్యక్తిత్వంతో అంకితభావంతో ఈమె చేసిన పరిశోధన విశిష్టమై విరాజిల్లడంలో వింత యేమున్నది ? చి॥ డా॥ పార్వతీదేవి ఇతోధికమూ హితాధికమూ అయిన కృషి సాగించి తెలుగు సాహిత్య లోకంలో వెలుగులు నింపగలదని ఆశిస్తున్నాను. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా ఆశీర్వదిస్తున్నాను.

చెన్నపురి - 29 **వి. రామచంద్ర చౌదరి**
19-1-99

# అభినందనము

- నాగళ్ల గురుప్రసాదరావు

"ఆంధ్ర సాహిత్యములో సత్యభామ పాత్ర చిత్రణము" అను నీ గ్రంథము సిద్ధాంత ప్రబంధము. దీనిని ఆయుష్మతి పి.ఎస్. పార్వతీదేవి రచించెను. ఇది 1985వ సం॥న నాగార్జున విశ్వవిద్యాలయమునకు సమర్పించిన పరిశోధన రచనము. ఈనాడు ముద్రిత మయినట్టిది.

నామధేయమే సత్యభామ ప్రకృతి యీ గ్రంథ ప్రమేయమని ప్రకటించుచున్నది. ఈ సత్రా జిత్తనయ సామాన్య మహిళ గాదు. పరమాత్మగా పరిణమించిన మదనగోపాలుని యష్టమహిషులలో ముమ్మొదట లెక్కకు వచ్చు వన్నె, వాసి కలిగిన కలికి. ఈమె పేరు చెప్పిన చాలును తెలుగువారు పులకించి మై మఱతురు. కవిబ్రహ్మ తీర్చిదిద్దిన మహాభారత స్త్రీ పాత్రముల తరువాత ఆంధ్రుల హృదయములలో స్థిరమైన యాసనమున నధిష్ఠించిన పాత్రము సత్యభామయే.

సత్యభామ పండిత పామరులను సమానముగా పరవశింపఁజేయుచున్నది. దీనికిఁ గారణభూతులయిన వారిద్దఱు. వారిలో నొకడు సిద్ధేంద్రయోగి. రెండవ వాడు మహాకవి నంది తిమ్మన. భామా కలాపము, పారిజాతాపహరణ ప్రబంధము రెండును సత్యభామను తెలుగువారు మఱవనయితి గాని మగువనుగా మార్చినవి.

ఇట్టి సత్యభామ చరిత్రమును, స్వభావమును లోతుగా పరిశోధించి, పరిశీలించి చిరాయువు పార్వతీదేవి నేటికి త్రవ్వి తలకెత్తెను. రచయిత్రి సత్యభామ చరిత్రమును సాంగోపాంగముగా వర్ణించినట్లు సహృదయులు గ్రహింపగలరు. వివిధ సాహిత్య ప్రక్రియలలో సత్యభామ పాత్రము సాక్షాత్కరించుచున్న తీరు తెన్నులను వెల్లడించిన విధానము విశేషమే కాక విశిష్టమును. నవీన మనస్తత్త్వ శాస్త్రము ననుసరించి రచయిత్రి సత్యభామ స్వభావము నావిష్కరించుట గాఢ పరిశోధనకు ఫలముగా పట్టి చూపుచున్నది. ఈ సిద్ధాంత ప్రబంధ మింత ప్రామాణికముగా నవతరించుటకు హేతువు ఒక మహిళ మఱియొక మహిళను గూర్చి పరిశోధన కుపక్రమించుట యగునా ? ఆలోచింపుడు.

సత్యానురాగముతో, సమ్యగార్జవముతో, పటిష్ఠ పరిశ్రమముతో ఈ గ్రంథమును రచించిన పార్వతీదేవి యితోఽధికముగా సాహిత్యసేవ చేయును గాక !

Dr. Indla Ramasubba Reddy
M.D. (PSYCH) D.P.M. (NIMHANS) F.I.P.S.
PSYCHIATRIST
*Formerly Psychiatrist :*
NIMHANS - BANGALORE
C. M. C. Hospital, VELLORE &
JIPMER - PONDICHERRY

"PRASANTI"
Devi Oil Mill Road
Suryaraopet
VIJAYAWADA - 520 002

# అభిప్రాయము

డాక్టర్ పి.ఎన్. పార్వతీ దేవి గారి, "ఆంధ్ర సాహిత్యములో సత్యభామ పాత్ర చిత్రణము" అనే సిద్ధాంత గ్రంథం, సాహితీ ప్రియులకు ఒక అద్భుతమైన కానుక. ముఖ్యంగా, చివరి ప్రకరణమైన "మనస్తత్త్వశాస్త్ర దృష్టిలో సత్యభామ పాత్ర విశ్లేషణము" - మానసిక వైద్యుడినైన నన్ను ఎంతగానో అలరించింది. పార్వతీదేవి గారు, 13 సంవత్సరాల క్రిందట, ఈ పరిశోధన చేస్తున్న సమయంలో, సత్యభామ సైకాలజీకి సంబంధించి, శాస్త్రీయంగా ఆమె మనస్తత్వాన్ని విశ్లేషించేందుకు, నాతో చర్చించి ఎన్నో గ్రంథాలను చదివి, ఎంతో శ్రమకోర్చి ఈ గ్రంథాన్ని రచించారు. అపూర్వమైన ఈ గ్రంథం ఈ రోజు ఇలా మన చేతుల్లో ఉందంటే, దీని వెనుక పార్వతిగారి కృషి, శ్రమ, దీక్ష ఎంతో ఉన్నాయి.

తెలుగు సాహిత్యంలో ఎన్నోవేల పాత్రలుండవచ్చు. శ్రీకృష్ణునికి పదహారువేల యెనమండుగురు భార్యలుండవచ్చు. అయినా, మన మనసులో నిలిచిపోయే పాత్ర సత్యభామదైతే, శ్రీకృష్ణుని మదిలో అత్యంత ప్రీతిపాత్రమైన భార్యగా, సత్యభామదే మొదటి స్థానమనడంలో, ఎటువంటి అతియోక్తి లేదు. దీనికి ముఖ్యకారణం సత్యభామలోని విలక్షణమైన ఆమె మనస్తత్త్వమే! మానసిక శాస్త్రరీత్యా పరిశీలించినప్పుడు, సత్యభామలోని విలక్షణ లక్షణాలన్నీ "హిస్టీరికల్ మనస్తత్వానికి" చాలా దగ్గరగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఈ మనస్తత్వం గల వారిలో ఆవేశం ఎక్కువగాను, ఆలోచన తక్కువగాను, తొందరపాటుతనం, దూకుడుతనం, మొండితనం, రోషం, పౌరుషం, చిన్న పిల్లల మనస్తత్వం, పొగరుబోతుతనం, అలక, తమ పంతం నెగ్గించుకునేందుకు ముందూ వెనక చూడకుండా ఎంతటి చర్యకైనా, చివరకు ఆత్మహత్యా ప్రయత్నాలు కూడా చేయడం - ఇటువంటి లక్షణాలెన్నో వుంటాయి. సత్యభామ సైకాలజీని పరిశీలిస్తే పైన చెప్పిన లక్షణాలన్నీ కనిపిస్తాయి. వీరిలో ప్రేమానురాగాలు ఏ స్థాయిలో ఉంటాయో, ఈర్ష్యాద్వేషాలు కూడా అదే స్థాయిలో వుంటాయి. శ్రీ కృష్ణుడు యుద్ధానికి బయలుదేరినప్పుడు, ఆయన ఎనమండుగురు భార్యల్లో సత్యభామ ఒక్కతే, భర్తతోపాటు సిద్ధమై వెళ్ళినప్పుడు, ఆమెకు కృష్ణునిపై గల ప్రేమ, ఆమెకున్న త్యాగనిరతి ఒకవైపు అర్థమవుతే, పారిజాతాన్ని తనకివ్వలేదనే కోపంతో, చివరకు కృష్ణుడు తన పాదాలకు మొక్కుతున్నా, ఆయన్ను కాలితో తోసివేసి, తనకు బాధ కలిగిస్తే, ఎంతకైనా తెగించే వ్యక్తినని తన వ్యక్తిత్వాన్ని బయట పెట్టుకుంది. ఇంతటి విలక్షణ లక్షణాలు గల స్త్రీ ఈమె; కాబట్టే సత్యభామ పాత్ర చిరస్థాయిగా తెలుగు సాహిత్యంలో నిలిచిపోయింది.

స్త్రీలోకానికి సత్యభామ, కొన్ని 'పాజిటివ్' విషయాల్లోనే మార్గదర్శి కావాలి తప్ప, ఆమె మూర్తిమత్వంలోని 'నెగటివ్' లక్షణాల ద్వారా మాత్రం కాకూడదు. ఆమె ప్రేమ, త్యాగనిరతి, అనురాగం, ఆత్మీయత, ఆమె వ్యక్తిత్వంలో ఎంతో ఉన్నతమైన విషయాలైతే, ఆమె హిస్టరికల్ మూర్తిమత్వ లక్షణాలు మాత్రం అంత ఆరోగ్యవంతమైనవి కావు. ఆమె మనస్తత్వాన్ని పూర్తిగా అర్థం చేసుకొని, అందులోని బలహీనతలను వదిలేసి, మంచిని మాత్రం అన్వయించుకుని వైవాహిక జీవితంలో ముందుకు సాగిపోతే, ప్రతీ స్త్రీ కూడా ఉత్తమ జీవిత భాగస్వామినిగా తనను తాను మలుచుకోగలదు. అందుకోసమైనా, ప్రతీవారు ముఖ్యంగా స్త్రీలు, ఈ సత్యభామ సైకాలజీని చదివి, 'అనలైజ్' చేసుకుని, తమను ఆత్మపరిశీలన చేసుకుని తప్పొప్పులను సరిదిద్దుకునేందుకు ఈ గ్రంథం ఎంతగానో ఒక "కౌన్సిలర్"లా ఉపయోగపడుతుందని నమ్ముతూ, ఇంతటి మహోన్నతమైన గ్రంథాన్ని రచించిన డాక్టర్ పార్వతీదేవి గారిని మనసారా అభినందిస్తున్నాను.

# కృతజ్ఞతలు

సాహిత్యములో స్త్రీపాత్ర చిత్రణానుశీలనము చేయవలెననెడి నా ఆసక్తిని గమనించి, ఆంధ్రసాహిత్యములో సత్యభామపాత్రచిత్రణమును గూర్చి పరిశీలింపుమని సూచించుటతోపాటు, ఈ సిద్ధాంత గ్రంథమునకు గురుతరమైన పర్యవేక్షణా బాధ్యతను కూడ వహించిన గురుదేవులైన ఆచార్య తూమాటి దొణప్పగారికి నాహృదయపూర్వకమైన నమస్సుమాంజలులు.

నా ప్రియతమ సోదరి అకాలమరణము వలన తీవ్రమనోవేదనకు గురియై నిరాశా నిస్పృహలతో క్రుంగిపోవుచున్న సమయములో ఒక తండ్రికి వలె నన్ను ఓదార్చి, ధైర్యమును చెప్పి, మరల నాలో ఆత్మ విశ్వాసమును కల్గించి ఈ సిద్ధాంత గ్రంథమును నేను పూర్తి చేయునట్లు, ఉత్సాహపరచిన కీ॥ శే॥ ఆచార్య దొణప్పగారి సౌజన్యమును శిష్యవాత్సల్యమును నేనెన్నటికిని మరువలేను. అంతేకాదు ఎన్నో పర్యాయములు, తమ సంభాషణలోను 'మంచి కృషి మరుగున పడిపోరాదు' (లేఖ - 28.12.90), "నీ థీసిస్సును త్వరలో అచ్చులో చూడాలని ఉంది" (లేఖ 10-4-91) అని ఉత్తరములలోను, ఈ సిద్ధాంత గ్రంథ ప్రచురణకై పూనుకొనుమని అభిమానముతో హెచ్చరించినారు. ఆ గురువర్యుని జీవితకాలములో దీనిని పుస్తకరూపములో తీసికొని రాలేకపోతిననెడు బాధ ఉన్నను, వారి అభీష్టానుసారముగ ఈనాడు దీనిని 'అచ్చులో' తీసికొని రాగలిగినందులకు ఆనందముగ నున్నది.

అడిగినదే తడవుగ తమ అమూల్యాభిప్రాయమును వ్రాసియిచ్చిన గురు తుల్యులు, సాహితీమూర్తులు, నా పిహెచ్.డి. పరీక్షాధికారులైన డా॥ వి. రామచంద్రగారికి ప్రణామాంజలులు.

బహుకార్యమగ్నులైనప్పటికిని తమ విలువైన సూచనలతోపాటు "అభినందనము"ను కూడ అందించిన ప్రముఖ సాహితీవేత్త, విజయవాడ పి.బి. సిద్ధార్థ కళాశాల మాజీ ప్రిన్సిపాలుగారైన శ్రీ నాగళ్ల గురు ప్రసాదరావుగారికి హృదయపూర్వక నమస్సులు.

సత్యభామ పాత్రను మనస్తత్త్వశాస్త్ర దృష్టితో పరిశీలించుచున్న అంశములను వివరించి చెప్పగానే, ఇట్లు విశేష దృక్కోణముతో పరిశీలించుచున్నందులకు నన్ను అభినందించుచు, తగిన సూచనలను, విలువైన పుస్తకములను సహృదయముతో ఇచ్చి, నన్ను మరింత ప్రోత్సాహపరచుటతోపాటు, ఈనాడు ఈ గ్రంథమునకు తమ "అభిప్రాయము"ను కూడ వ్రాసియిచ్చిన విజయవాడలోని ప్రముఖ మనోరోగ చికిత్సకులు డాక్టర్ ఇండ్ల రామసుబ్బారెడ్డిగారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాంజలులు.

పరిశోధనా కాలములో విలువైన పుస్తకము లెన్నింటినో ఇచ్చి, సహకరించిన మారిస్టెల్లా కళాశాల గ్రంథాలయ యాజమాన్యమునకును, లయోలా, సిద్ధార్థ కళాశాల గ్రంథాలయముల వారికిని, విజయవాడలోని రామమోహన, ఠాగూరు, భ్రమరాంబ మల్లికార్జున గ్రంథాలయముల వారికిని కాకినాడలోని సాహిత్య పరిషత్తు, రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయముల వారికిని నా కృతజ్ఞతాభివందనములు.

పరిశోధనాకాలములో విలువైన పుస్తకములను తెచ్చియిచ్చి, సాపుప్రతిని తయారు చేయుటలో సహకరించిన నా పూర్వవిద్యార్థినులు డా॥ జె. వరుణ కుమారి, కుమారి బి. పద్మావతులకును, ప్రూఫులను దిద్దుటలో సహకరించిన నా మేనల్లుడు చి॥ ఎస్. నారాయణన్‌కును నా శుభాశ్శీసులు.

ఈ పుస్తక ప్రచురణలో ముఖ్యపాత్ర వహించి ఆర్థిక సాహాయ్యము చేసిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభి వందనములు.

తోబుట్టువుల అభ్యుదయ పరంపరయే తన జీవితలక్ష్యముగ భావించి జీవించిన నా జ్యేష్ఠ సోదరుడు కీ॥ శే॥ పి.ఎన్. గోవిందస్వామి వాత్సల్యము మరువరానిది. ఈ పుస్తక ముద్రణ విషయములో విశేషమైన ఆసక్తిని కనబరచి ప్రోత్సహించిన మా కుటుంబ సభ్యుల అభిమానమునకు కృతజ్ఞురాలను.

శ్రేయోభిలాషులైన సంస్కృత పండితులు నిమ్మగడ్డ రామశేషయ్యగారికి, ధూళిపాళ రామకృష్ణగారికి, డా॥ విద్యేశ్వరిగారికి, ముద్రణ విషయములో విలువైన సూచనల నిచ్చుటతోపాటు ముఖచిత్రాలంకరణ యొనర్చిన విక్రమ్ పబ్లిషర్స్ అధినేత శ్రీ జి.యన్. రావుగారికి, డి.టి.పి. విషయములో ప్రత్యేక శ్రద్ధను తీసికొనిన సక్సెస్ గ్రాఫిక్స్ అధినేత శ్రీ వెలగపూడి కృష్ణారావుగారికి, మిక్కిలి సహనముతో డి.టి.పి. చేసి యిచ్చిన కుమారి వల్లభనేని నళినికి, ఈ గ్రంథమును అందముగ ముద్రించి యిచ్చిన శ్రీ పాండురంగ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ అధినేత శ్రీ వి. గోపాలకృష్ణమ రాజుగారికి నా కృతజ్ఞతాభివందనములు.

**- పి. ఎన్. పార్వతీ దేవి**

# అవతారిక

తెలుగు శిష్ట సాహిత్యములోను, శిష్టేతర సాహిత్యములోను స్త్రీ పాత్ర లెన్నియున్నను మన సాహితీ స్రష్టలకు సత్యభామ ప్రీతిపాత్రమైనట్లు మరొకటి కాలేదు. సంస్కృత పురాణేతిహాస కవులకన్నను తెలుగు పురాణేతిహాస కవుల చిత్రణలో సత్యభామ ప్రత్యేకమైన వ్యక్తిత్వమును సంతరించుకొని తెలుగువారికి చేరువైనది. ఆంధ్ర పురాణేతిహాస కవులు వీర శృంగారరసమూర్తియైన సత్యభామ మూర్తిని అందీయగా ప్రబంధకవుల పోషణలో ఆమె నవరసములొలికించుచు మానినీత్వ ప్రదర్శనము చేయు కథానాయికయై, తెలుగువారికి మరింత ఇష్టురాలైనది. శృంగార మొలకబోయుచు, విరహముచే తపించుచు, అష్టవిధ నాయికావస్థలను, ఆ యా సందర్భములందు అభినయించుచు 'భామాకలాపపు' సత్యభామ తెలుగు వారి మనస్సులలో మరువలేని మధురమూర్తిగ ముద్ర వేయించుకొనినది. సత్య శృంగారవీరములకు మురిసిపోవుచుండినను, ఆమె మానినీత్వమును మాత్రము అహంకారముగా భావించిన యక్షగాన, నాటక, హరికథా కర్తలును తమ తమ సాహిత్య ప్రక్రియలయందు సత్యభామకు సుస్థిరమైన స్థానమునిచ్చి సమ్మానించినారు. వీరి మార్గములోనే నడచిన జానపద సాహిత్యకర్తల చిత్తములను కూడ సత్యభామ ఎంతగా కొల్లగొట్టినదనిన, వారి పెక్కు పాటలలో నీమె గట్టిగా చోటు చేసికొనినది. సాహిత్యలోకములోనే కాదు, సామాన్య లోకమునందును "సత్యభామ"కు ప్రత్యేకమైన స్థానమున్నది. కొన్ని యిండ్లయందు అపర సత్యభామలే గోచరించుచుందురు. సత్యభామపేరు విన్న పరవశించని సహృదయుడుగాని, సరసుడుగాని ఉండడు.

కవి పండితులనేగాక సామాన్యజనమును కూడ సత్యభామ అంతగా ఆకర్షించుటకు కారణము, ఇతర కావ్యనాయిక లెవ్వరిలోను కనిపింపని ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వము ఈమెకుండుటయే! ఇంతటి ప్రత్యేకత గల సత్యభామ యొక్క సమగ్ర వ్యక్తిత్వమును తెలిసికొనుటకు సాహిత్య సమాలోచనము చేయవలసి యున్నది. సంస్కృత పురాణేతిహాస కవుల చిత్రణలోని సత్యభామకును, తెలుగు పురాణేతిహాసకవుల పోషణలో పెరిగిన సత్యభామకును గల భేదమును గమనించుచు, ఆంధ్ర సాహిత్యమునందలి ప్రబంధ, యక్షగాన, భామాకలాప, నాటక, హరికథ, జానపద కవులును, సత్యభామను ఏయే విధముగా చిత్రించినారో సమీక్షించుటయే "ఆంధ్ర సాహిత్యములో సత్యభామ పాత్ర చిత్రణము" అను ఈ సిద్ధాంత గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము. సత్యభామ ఆభిజాత్యము, వివాహము, అష్టమహిషులలో ఆమె స్థానము, ఆమె సాంసారిక జీవితము, స్వభానుశీలనము, ఆమెలోని నాయికా లక్షణములు మొదలైన అంశముల పరిశీలనముతోపాటు, ఆధునిక మనస్తత్త్వ శాస్త్ర దృష్టిలో ఆమె మూర్తిమత్వ విశ్లేషణము కూడ చేయబడినది.

ఈ సిద్ధాంత గ్రంథ రచనకు సాహిత్యములోని పలు ప్రక్రియలకు సంబంధించిన గ్రంథము లెన్నింటినో పరిశీలింపవలసి వచ్చినది. ఒకే గ్రంథమునకు గల వివిధ పరిష్కరణలను పరిశీలించినప్పటికిని అందు ప్రముఖమైన ఏదో ఒక గ్రంథమునే ప్రధానముగ స్వీకరించుట జరిగినది.

సత్యభామ పాత్రచిత్రణమును కవులెందరో చేసియున్నను ఆ పాత్రకు జీవముపోసి ఆంధ్రసాహిత్యములో ఆమెను మరువలేని మగువగ తీర్చిదిద్దినవాడు నంది తిమ్మన. కావున ఈ సిద్ధాంత గ్రంథమున తిమ్మన పారిజాతాపహరణ పరిశీలనము కొంత అధికముగ చేయబడినది.

సంస్కృత పురాణేతిహాసముల పరిశీలనము ఇందు ప్రముఖముగ నుండుట వలనను, అధిక సంఖ్యలో పద్యముల నుదహరింపవలసి యుండుటవలనను ఈ గ్రంథమును గ్రాంథిక భాషలో వ్రాయవలసి వచ్చినది.

ముఖ్య గ్రంథముల సంజ్ఞావివరణము కూడ ప్రత్యేకముగ నీయబడినది. ఎంత జాగ్రత్త వహించినను కొన్ని అచ్చుతప్పులు తప్పలేదు. గుణ గ్రహణ పారీణులగు సహృదయులు 'సత్యభామ'ను నిండు మనస్సుతో ఆదరింతురు గాక!

**- పి. ఎన్. పార్వతీ దేవి**

# సంజ్ఞా వివరణము

1. అ. మ. క. .................................... అష్టమహిషీ కల్యాణము
2. ఆము .......................................... ఆముక్తమాల్యద
3. ఉ. హరి ...................................... ఉత్తర హరివంశము
4. కా. చూ. ...................................... కావ్యాలంకార చూడామణి
5. కాశీ .............................................. కాశీఖండము
6. కాళ.............................................. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము
7. చంద్ర. చ. .................................... చంద్రభాను చరిత్ర
8. చిదం. పద్మ. పు............................ పిసుపాటి చిదంబర శాస్త్రి పద్మపురాణము
9. జై. భార ...................................... జైమినీ భారతము
10. తా. సీ. వి. పు .............................. తాడేపల్లి సీతారామస్వామి విష్ణుపురాణము
11. ద్వి. భాగ ...................................... ద్విపద భాగవతము
12. ద్వి. భార ...................................... ద్విపద భారతము
13. దీపా. నాట..................................... దీపావళి నాటకము
14. నర. నాట ...................................... నరకాసుర వధ నాటకము
15. పారి ............................................ పారిజాతాపహరణ ప్రబంధము
16. పారి. నాట .................................... పారిజాతాపహరణ నాటకము
17. పారి. యక్ష..................................... పారిజాతాపహరణ యక్షగానము
18. భాగ ............................................ పోతన భాగవతము
19. భామా .......................................... భామాకలాపము
20. భార ............................................ (కవిత్రయ) భారతము
21. భా. ప్ర. ........................................ భావప్రకాశనము
22. బ్రహ్మ. పు ...................................... బ్రహ్మపురాణము
23. భై. హరి ....................................... నేమాని భైరవకవి హరివంశము
24. మను ........................................... మనుస్మృతి
25. మను. చ ....................................... మనుచరిత్ర
26. రస .............................................. రసమంజరి

27. రాజ. గో. వి. .................................. రాజగోపాల విలాసము

28. రాధా. నాట .................................... రాధాకృష్ణ నాటకము

29. వసు ............................................. వసు చరిత్ర

30. విజ. వి. ....................................... విజయ విలాసము

31. విష్ణు. పారి. యక్ష .......................... విష్ణు పారిజాత యక్షగానము

32. విష్ణు. మా. నాట. ప్ర. ...................... విష్ణుమాయానాటక ప్రబంధము

33. సం. పద్మ. పు. ............................... సంస్కృత పద్మపురాణము

34. సం. బ్రహ్మ. పు. ............................. సంస్కృత బ్రహ్మపురాణము

35. సం. భాగ ........................................ సంస్కృత భాగవతము

36. సం. భార ........................................ సంస్కృత భారతము

37. సం. వి. పు. ................................... సంస్కృత విష్ణుపురాణము

38. సం. హరి. భ. ప ............................. సంస్కృత హరివంశము - భవిష్యపర్వము

సం. హరి. వి. ప .............................. సంస్కృత హరివంశము - విష్ణుపర్వము

సం. హరి. హ. ప .............................. సంస్కృత హరివంశము - హరివంశపర్వము

39. సత్య. సాం. ..................................... సత్యభామా సాంత్వనము

40. సత్య. చం. నాట .............................. సత్యామోద చంద్రోదయ నాటకము

41. సత్యా. వి. ...................................... సత్యావివాహము (ప్రబంధము)

42. సా. ద. ........................................... సాహిత్యదర్పణము

43. సాత్రా. ప. ....................................... సాత్రాజితీ పరిణయము (ప్రబంధము)

44. సాత్రా. ప. నాట .............................. సాత్రాజితీ పరిణయము-నాటకము

45. సాంబ. ............................................ సాంబోపాఖ్యానము

46. సిం. పద్మ. పు ................................ మడికి సింగన పద్మపురాణము

47. సూ. వి. పు. ................................... వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము

48. శ్రీకృష్ణా .......................................... శ్రీకృష్ణాతిమానుష తత్త్వము

49. శ్రీకృష్ణ. తు. నాట ........................... శ్రీకృష్ణతులాభార నాటకము

50. శ్రీకృష్ణ. తు. హరి ............................ శ్రీకృష్ణ తులాభార హరికథ

51. శ్రీ పారు. ప. ................................... శ్రీ పారుజాత తరు పల్లవి (జానపద గేయము)

52. హరి. .............................................. ఎఱ్ఱన హరివంశము

# విషయసూచిక

# మొదటి ప్రకరణము
# సత్యభామ - ఆభిజాత్యము

## పాత్రపోషణము :

కవి నేపథ్యమును బట్టియు, సమకాలిక సామాజిక జీవిత ప్రభావమును బట్టియు, మూలకథారీతి ననుసరించియు, కథాగతి యందు ఆయా పాత్రలకు గల ప్రయోజనము ప్రాముఖ్యము మున్నగువానిని అనుసరించియు, పాత్ర చిత్రణ రీతి ప్రాయికముగ ఆధారపడి యుండును.

పాత్ర చిత్రణ మనునది మహాకవి ప్రతిభా సంపదకు గీటురాయి వంటిది. ఔచిత్యము కావ్యమునకు ప్రాణము వంటిది. క్షేమేంద్రుడు కావ్య జీవితము ఔచిత్యమే యనుచు, కావ్యము యొక్క సర్వావయవములందు అనగా రసము, భావము, అలంకారము, అర్థము, శబ్దము, పాత్రలు మొదలగు వానియందును, దానిని ఉదాహరణ ప్రత్యుదాహరణలతో సమన్వయించి చూపినాడు. అనగా రస, భావ, అలంకార, శబ్ద, పాత్రాదులు ఉచితరీతిని కావ్యక్షేత్రమున విలసిల్లుట ఔచిత్యమనబడును. అనౌచిత్యముచే రసభంగము వాటిల్లును. కావ్యేతి వృత్తమునకుపనిబద్ధమైన పాత్రలు రసస్ఫూర్తిమంతములై కావ్యమహత్వమునకు దోహదకారులగుచున్నవి.

పాత్రలను ప్రధాన పాత్రలని, అప్రధాన పాత్రలని రెండు విధములుగ విభజింపవచ్చును. వాస్తవమునకు కొన్ని కావ్యాదులందు అత్యల్పకాలము మాత్రమే నిల్చు కొన్ని పాత్రలు సహృదయ హృదయరంజకములై, మనమున చెరగని ముద్రవేయుచుండును. కొన్ని మారులు ఇవి ప్రధాన పాత్రలను మించి కూడ సహృదయుల మదిని నివాసమేర్పరచు కొనుటయు కలదు.

పాత్రకు కథ శరీరము వంటిది. స్వభావము ప్రాణము వంటిది. పాత్ర లేనిదే కావ్యము లేదు. కావ్యేతివృత్తమంతయు పాత్రల నాశ్రయించుకొనియే అల్లబడును. పాత్రలచే రసము నిష్పన్నమగును. కథాగమనమునకు పాత్రలే మూలములు. కవి పాత్రను కథాభిముఖముగ తీసికొనిపోవుచు కావ్యార్థమైన రసమును పరిపుష్టము చేయుటయే పాత్రోన్మీలనమనబడును.

పాత్ర చిత్రణమనగ, పాత్ర యొక్క స్వరూపస్వభావముల రెంటిని చిత్రించుట. స్వరూప చిత్రణమనగ ఆ పాత్ర యొక్క బహిర్గతమైన శారీరక వర్ణనము. స్వభావ చిత్రణమన, ఆ పాత్ర యొక్క అంతరంగిక మనః ప్రవృత్తి వర్ణనము. పాత్రల బహిరాకార చేష్టలతో పాటు తదీయ హృదయగత అభిప్రాయములను కూడ వ్యక్తము చేయవలయును. దీనినే మనోవృత్తి వివరణ కౌశలమందురు.

"పాత్ర చిత్రణమును ప్రత్యక్షమనియు, పరోక్షమనియు రెండు విధములుగ విభజింప వచ్చును. పరోక్ష పద్ధతి యనగ బాత్రల మనో భావములను బాత్రల ముఖముననే పలికించుట. ప్రత్యక్ష పద్ధతి యనగ గవి దనంతట దానే పాత్రలను గూర్చియు, వాని యింగితాకార చేష్టాదులను గూర్చియు బలుకుట."[1]

కవి ఆ పాత్ర ప్రవర్తన చేత కాని, సంభాషణ చేత కాని, ఇతర పాత్రల సంభాషణల చేత కాని, లేక ఆ యా సమయములందు ఆ పాత్ర ప్రవర్తించిన విధానము చేత కాని పాత్ర స్వరూప స్వభావములను చిత్రించుట పరోక్ష పద్ధతి. కవి తానై కావించు పాత్ర యింగితాకార చేష్టాది ప్రత్యక్ష వర్ణనచే పాత్ర నిర్జీవమై యుండును. ఆఖ్యాన కవులు ప్రత్యక్ష వర్ణనము

1. కె.వి.ఆర్. నరసింహము - ఆంధ్రప్రబంధము - అవతరణ - వికాసములు -పు. 55.

ఆదరింపగా, నాటక కవులు పరోక్ష పద్ధతిని అనుసరించిరి. తిక్కన పరోక్ష పద్ధతికి ఆద్యుడనవచ్చును.

ప్రతిభావంతుడైన కవి, పాత్ర స్థిరభంగిమలతోపాటు చలద్భంగిమలను కూడ అద్భుతముగా చిత్రించును. "క్షణ క్షణ పరివర్తనమానమైన ఆంగికాభినయ వర్ణనము కన్నులకు గట్టినట్లు వర్ణించు నేర్పులో ఆంధ్ర సాహిత్యమందే గాక ప్రపంచ వాఙ్మయమున తిక్కనకు సాటియైన కవులరుదు"[1], ఉత్తముడైన కవి, యేనాడును పాత్రను నిలబెట్టి తాను వర్ణింపడు. పాత్రలకదలికలచేత కాని, ఇతర పాత్రల సంభాషణ చేత కాని, ఆ పాత్ర యెడ ఇతర పాత్రల ప్రవర్తన చేత కాని, ఆ పాత్ర స్వరూప స్వభావములు ద్యోతకమగునట్లు చేయును. శబ్దౌచిత్యము, సంభాషణౌచిత్యము, అర్థౌచిత్యము మున్నగువానిచే పాత్ర పోషణకు మెరుగులు దిద్దుట కవి చతురతకు చిహ్నము.

పాత్రలను సజీవ, నిర్జీవ పాత్రలని రెండు విధములుగ విభజింపవచ్చును. పాత్రలు చైతన్యవంతములై సహృదయుల మనోనిలయమున నాలుగుకాలముల పాటు నిలువ వలయును, అట్లు నిలుచు పాత్రలను సజీవపాత్ర లనవచ్చును.

"పాత్రలు కొఱడుపారి కొయ్యబొమ్మలవలె నుండక, చైతన్యసహితములై యుండవలయును. సచేతనత్వమునకు ముఖ్య లక్షణము వైవిధ్యము" అని కె.వి.ఆర్. నరసింహముగారు సజీవ పాత్రలక్షణమును నిర్వచించినారు.[2] అనగా చైతన్యము, వైవిధ్యము సజీవ పాత్రలకు ప్రాణ భూతములు. సజీవ పాత్ర చిత్రణము సామాన్యకవులకు సాధ్యమగునది కాదు. దీనికై అత్యంత సమర్థత చూపవలసియుండును. సజీవ పాత్ర చిత్రణము వలననే తమ రచనలకు అసాధారణమైన కీర్తిని తెచ్చుకొనిన వారును కలరు.

ప్రపంచ ప్రఖ్యాత నాటక కర్త "షేక్స్పియరు" గొప్పతనము ఇతివృత్త స్వీకారమునందు కాని అతని భావప్రకటనయందు కాని లేదు. విస్మరింప సాధ్యము కాని సజీవ పాత్ర చిత్రణమునందే అతని ఉపజ్ఞ యంతయు కనిపించును.[3]

ఆంధ్ర సాహిత్యమున సజీవ పాత్ర చిత్రణమునకు మొదట పేర్కొనదగిన వాడు తిక్కన, సంస్కృత భారతమునందలి పాత్రలే అయినను, అవి తిక్కన చేతిలో గొప్ప చైతన్యమును, వైవిధ్యమును సంతరించుకొనినవి. నేటికిని లోకమున ధర్మము తప్పని వారిని ధర్మరాజు లనియు, ప్రతినలు చేసి, నియమము తప్పక మరణాంతము వరకు కాపాడుకొను వారిని భీష్ములనియు ప్రశంసగాను, బీరములు పలుకువారిని ఉత్తర కుమారులని హేళనగను, పనికి అడ్డుతగులు వానిని సైంధవుడని నిందాపూర్వకముగను పిలుచుచుండుట చూచు చున్నాము. పాత్రల కనువగు ఆంగిక, సాత్వికాభినయ వర్ణనము చేయుటలో తిక్కన ఆరితేరినవాడు. మూలమందలి కేవల వాస్తవిక పాత్రలనే, కవి స్వీకరించి తన చతురతచే వానిని పాఠకుల మనో నేత్రముల ముందు సాక్షాత్కరింపజేయుచు, వారి మనఃఫలకములపై శాశ్వతముగ ముద్రింప ప్రయత్నించును.

ఒక గ్రంథమును చదివినపుడు అన్ని పాత్రలును మన మనో నిలయమున నిలుచుట లేదు. మనుచరిత్రలోని వరూథినీ ప్రవరులకు లభించిన స్థానము, స్వరోచికిగాని, స్వారోచికిగాని, మనోరమాదులకు గాని లభింపలేదు. సజీవ పాత్ర చిత్రణమున పెద్దనతో పోటీ పడి అతనిని అధిగమించిన వాడు నంది తిమ్మన.

---

1. *నండూరి రామకృష్ణమాచార్యులు - తిక్కన భారతదర్శనము - పు. 158*
2. *ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు - పు. 34*
3. *Marjorie Boulton - "Anatomy of Drama" - Page - 91*

పారిజాతాపహరణ ప్రబంధమున, తిమ్మన సత్యభామ పాత్రోన్మీలనమున కడుజాగరూకత వహించినాడు. శ్రీకృష్ణునిపై, ప్రగాఢమైన అనురాగాతిశయము కలదయ్యు స్త్రీ సహజమగు సపత్నీమాత్సర్యముతో క్రోధావేశములకు లోనై క్షణ క్షణ వివర్తమానములగుచు ఆ మానిని పొందెడు మనస్సంక్షోభమును క్రమ క్రమముగా వర్ణించుచు, ఆమె అంతరమూర్తిని సువ్యక్తము చేయుటలో తిమ్మన మిక్కిలి జాగరూకతను చూపినాడు. అపూర్వ సౌందర్యరాశిగా, కృష్ణుని ప్రియభామగా, మానినీత్వపు ప్రతీకగా సత్యభామ స్వరూప స్వభావములకు సమగ్రతనిచ్చి,ఆ తరువాత కవుల స్త్రీ స్వభావ చిత్రణకు మార్గదర్శకుడై నిలిచినాడు. ఈ ప్రబంధ సత్య, గిరిక, ప్రభావతుల వలె కేవల సాంప్రదాయికమైన ఆలంకారిక ప్రతిమకాదు. ఈ సత్య మనకందరికిని పరిచయమైన వ్యక్తిగనే అనిపించును. సజీవత అనిన ఇదియే! స్త్రీ సహజమైన తత్త్వమును, మనస్తత్త్వమును కవి ఈమెలో నింపి శృంగారరససీమ, మానవతీలలామయైన సత్య శాశ్వతరూపమున ఆంధ్రలోకమున కందించినాడు. సిద్ధేంద్రయోగి ఆ మానవతీలలామను అష్టవిధావస్థలకు లోనుచేసి, అసాధారణ శృంగార నాయికగా ఆంధ్రులకు ప్రియాతి ప్రియమైన నవరస భామగా తీర్చి దిద్దినాడు. సత్యభామ అనెడు నామమునకు సార్థక్యమును కల్పించినవారు వీరిరువురే.

ఆంధ్ర సాహిత్యమున్నంత వరకును, ఆంధ్రులలో రసికత చావక మిగిలియున్నంత కాలము, తిమ్మన సిద్ధేంద్రుల సత్యభామను ఆంధ్రలోకము ఏనాటికిని మరువలేదు. ఎఱ్ఱన సోమన, పోతనలు కూడ సత్యభామను సజీవ పాత్రగనే చిత్రించినారు. కాని, చెన్నాప్రగడ తిరుపతిరావుగారనినట్లు "తిమ్మన కైవాడము మాత్రము వారి కబ్బలేదు"[1]

మానవ స్వభావము గుణ దోష సమ్మిశ్రితము. ఏ మానవుడును పరిపూర్ణముగ సద్గుణవంతుడు కాని, కేవలము దుర్గుణవంతుడు కాని కాడు. ఎంత మంచివాడైనను ఏదో ఒక లోపము ప్రతి వ్యక్తిలోను ఉండును. కవి పాత్ర చిత్రణము చేయునపుడు ఆ పాత్రలోని గుణములతో పాటు దోషములను కూడ సూచింపవలయును. అపుడే ఆ పాత్ర పాఠకులకు సహజ సిద్ధముగ తోచు నవకాశముండును. పాత్ర గుణములలో ఏది మంచి, ఏది చెడు అని నిర్ణయించుట కానాటి దేశ కాల పాత్రములే ప్రమాణముగ నుండును. కవి, సామాన్య దృష్టితో కాక, ఒక విశేష దృష్టితో పాత్ర చిత్రణము చేయును. కావున పాఠకుడు పాత్ర స్వభావమును విమర్శించునపుడు, కేవలము ఈనాటి దృష్టితోనే గాక, ఆనాటి దేశకాల సంఘ పరిస్థితులను కూడ నొకింత దృష్టియందుంచుకొని పరిశీలన జరుపుట శ్రేయము.

కొందరు కవులు తమ కావ్యములందు ధర్మ ప్రబోధము కొరకును, వ్యక్తి జీవితమును క్రమబద్ధము చేయుట కొరకును తమ కావ్య పాత్రలను విశేషగుణసంపన్నములుగను ఆదర్శవంతముగను చిత్రించుట కలదు. ఇట్టివి, లోకాతీతమైన వ్యక్తిత్వము కలవిగ అనిపించును. కొందరు కవులు, మానవ స్వభావమును తరచి చూచి, తమ పాత్రలయందును సామాన్య జనులకుండు చిత్త వృత్తుల నారోపింపజేసి వాస్తవికతా వికాసము గల సహజ పాత్రలను చిత్రించుట కలదు. లోకజన సన్నిహితములగు ఈ పాత్రలు ఆదర్శ పాత్రలకువలె పూజలందుకొన లేక పోవచ్చును కాని, ఇవి పాఠకుల కతి సన్నిహితములై సుపరిచితములై యుండుట వలన వారి హృదయమున చెరగని ముద్రవేసికొని శాశ్వతముగ నిలిచిపోవును.

పెక్కురు ఆంధ్రకవులు రుక్మిణిని ఆదర్శవంతముగను, సత్యభామను వాస్తవికతతోను చిత్రించినారు. సత్యభామయు, సీత, దమయంతి, రుక్మిణులకు వలె పురాణేతిహాసాంగనయే కాని, వారికి వలె ఆదర్శమూర్తిగ చిత్రింపబడలేదు. ఈమె, వారికి వలె నతులందు కొనలేక

1. పంచకన్యలు - పు. 22

పోయినను, మాన్యులగు కవులకును, సామాన్యులగు జనులకును చేరువై మిగుల ప్రియమైన పాత్ర కాగలిగినది.

"పఠితల భావ ప్రపంచము నుద్రేకింపజేసి, వారి యనుభవములను దర్పణమున వలె సాక్షాత్కరింపజేయు పాత్ర చిత్రణయే రస సిద్ధికి జీవగఱ్ఱ"[1] అనిన కేశవపంతుల నరసింహశాస్త్రి గారి మాటలెంతయు అర్థవంతములు. అనగా పాత్రపోషణలో వాస్తవికత యుండినపుడే ఇది సాధ్యమగును.

ప్రతి యోగ సంఘటనముచే (By Contrast) అనగా సమాన ప్రతిపత్తి గల రెండు పాత్రలను ఒకే సన్నివేశమున నిలిపి, అచట వారి సంభాషణమును బట్టియు ప్రవర్తించు విధమును బట్టియు, ఆ పాత్రల స్వభావమును వ్యక్తము చేయుట మరియొక విధానము. "ప్రతి యోగ సంఘటనముచే (By Contrast) పాత్రల స్వభావమును గాని, రూపముగాని, ప్రతిభాసించుట శిల్ప ధర్మములలో నుత్తమమైనది" అని కె.వి.ఆర్. నరసింహము గారనినారు.[2]

కళాపూర్ణోదయమున కలభాషిణి - రంభలకును, మనుచరిత్రయందు వరూథినీ - ప్రవరులకును, ఇట్టి ప్రతియోగ సంఘటనము కల్పింపబడినది. బాలకృష్ణ లీలా విలాసము, రుక్మిణీ-సత్యభామా సంవాదము మున్నగు యక్షగానములలో సత్యా రుక్మిణుల నడుమ నిట్టి ప్రతియోగ సంఘటనము కల్పింపబడుటచే ఆ పాత్రల శీలతారతమ్యములను గ్రహించుటకు మిక్కిలి అనుకూలముగ నున్నది.

పాత్రల గుణ విశేషములను ముందు సూచించుచు, దాని కనుగుణముగ పాత్ర పోషణ చేయుటయు మరియొక విధము. "పారిజాతాపహరణ" ప్రబంధమున, కవి, నారదుని "అరివేరంపు దపసి" (1.44) అనియు, సత్యను "సౌందర్యవతి, మానవతి, మహనీయ సౌభాగ్యవతి" అనియు (1.70) పరిచయము చేసి, ఆ విశిష్ట గుణముల కనుగుణముగ ప్రబంధమున ఆ పాత్రలను పోషించినాడు.

అంతరంగికులైన చెలి లేక చెలికాని వలన, ప్రధాన పాత్రను గూర్చి తెలిసికొనుటకు అవకాశము కల్గును. ఒక ప్రముఖ పాత్ర స్వజాతి వర్గమునకు చెందిన విశ్వాసపాత్రమైన తన చెలి లేక చెలికానితో మనసువిప్పి మాట్లాడుట వలన ఆ పాత్ర స్వభావము నరయుటకు వీలుపడుచున్నది.

హేమ్లట్‌లో హోరాషియో, "ఏజ్ యు లైక్ ఇట్"లో "సీలియా" ఉదాహరణములుగ చెప్పుకొనవచ్చును. పై లక్షణము, నాటకములకే చెప్పబడినను కావ్యములకు కూడ అన్వయింపవచ్చును. పారిజాతాపహరణ ప్రబంధమునను, భామాకలాపాదులందును, సత్య తన చెలితో సంభాషించుటలో ఆమె స్వభావము అధికముగ వ్యక్తమైనది.

సాహిత్యమునందు ఒక పాత్రను గూర్చి పరిశీలించునపుడు ఆ పాత్రతో సమాన ప్రవృత్తి గల, వేరొక కావ్యమునందలి మరియొక పాత్రతో సరిపోల్చి చూచుటలో నెట్టి దోషమును లేదు. మానినీమణియైన పారిజాతాపహరణ ప్రబంధ సత్యను, మానినీలలామ యైన భారతేతిహాస ద్రౌపదితోను, పురాణాంగన వీరవనితయైన సత్యభామను రామాయణ కావ్యములోని వీరాంగనయగు కైకతోను, పోల్చి చూచుటలో అనౌచిత్యము లేదు. దీనిని ప్రతియోగ సంఘటనగనే పరిగణించిన, ఇట్టి వాని వలన ఆ పాత్రలోని విశిష్టత, విలక్షణత మరింత స్పష్టమగుట కవకాశము కలుగును.

అట్లే ఒకే పాత్ర, వివిధ ప్రక్రియలందు చిత్రింపబడగా వానిని సరిపోల్చిచూచుటయు

1. *ప్రబంధ పాత్రలు - పు. 12*
2. *ఆంధ్రప్రబంధము - అవతరణ వికాసములు - పు. 56*

ఉచితమే. ఇతిహాస సత్యను, ప్రబంధ సత్యతోను, ప్రబంధ సత్యను జానపద సత్యతోను, అవసరమగు సందర్భములందు పోల్చుట వలన ఆ పాత్ర స్వరూప స్వభావములు మరింత సుస్పష్టమగును.

స్త్రీ పాత్రను, అందును శృంగార నాయిక పాత్రను సమీక్షించునపుడు ఆలంకారికమైన స్వీయాది భేదములలో నేవర్గమునకు చెందుననుటయు, విమర్శకుడు పరిశీలింప వలయును. స్త్రీ పరిపూర్ణజీవితము వివాహోత్పూర్వావస్థ, వివాహావస్థ, వివాహానంతరావస్థ - అను మూడు భాగములతో నుండును. కావున ఈ మూడు దశలను దృష్టి యందుంచుకొని కూడ విమర్శకుడు పరిశీలించుట అవసరమగును.

ప్రకృత సమీక్ష ఒక కవికి, ఒక కాలమునకు, ఒక గ్రంథమునకు, ఒక భాషకు పరిమితమైనది కాదు. ఆంధ్రసాహిత్యములో విభిన్నయుగములకు చెందిన అనేక కవుల సాహిత్య సృష్టియందు చిత్రితమైన, సత్యభామ పాత్రను గూర్చి వర్ణించుట యనగా, వివిధ దేశ కాల పాత్రములను బట్టి ఉల్లేఖితమైన ఒకానొక కావ్యనాయిక యొక్క సమగ్ర స్వరూపమును శాస్త్రీయముగ రూపించుట, ఈ సమీక్షా వ్యాపారమునందలి పరమార్థము. అంతే కాదు. సంస్కృతాంధ్ర సాహిత్యములలోని మూర్తి చిత్రణమును తులనాత్మకముగా సమీక్షించుట కూడ ఆవశ్యకము. విశేషించి, శిష్ట సాహిత్యముతో పాటు, శిష్టేతర (జానపద) సాహిత్యమును సైతము విలోకించి విశ్లేషించి వివరించిననే గాని సత్యభామ విరాడ్రూపమును సమ్యగ్రుచిరముగా సందర్శించుట సాధ్యముకాని పని.

ఈ యన్ని యంశములను దృష్టిలో పెట్టుకొని సత్యభామ స్వరూప స్వభావములను, చిత్రించుట కిందు ప్రయత్నము చేయబడినది. కథాగతిలో అన్ని పాత్రలకును సమానావకాశము లుండవు. ఒక కావ్యమున ప్రధాన స్థానమాక్రమించిన పాత్ర, ఇంకొక కావ్యమున అప్రధాన పాత్ర కావచ్చును. పారిజాతాపహరణములో "సత్యభామ" ప్రముఖ పాత్ర. చేమకూర వేంకటకవి "విజయవిలాసము"లో ఆమె రేఖామాత్ర పాత్ర. మహాభారత కథలో ఈమె ద్రౌపది, కుంతి మున్నగు పాత్రలతో పోల్చి చూచిన అప్రధాన పాత్రగా కన్పట్టును. కథాగతికి అవసరమైనంతవరకే పాత్రల ప్రవేశ, నిష్క్రమణాదు లాధారపడి యుండును. ఈ దృష్టితో పరిశీలన చేసినపుడు సత్యభామ కొన్నింట ప్రధాన పాత్రగ, మరికొన్నింట అప్రధాన పాత్రగ, ఇంకను కొన్నింట రేఖామాత్ర పాత్రగ పొడగట్ట వచ్చును. కాని, కవులు ఆమెకేపాటి అవకాశమిచ్చినను సహృదయుల మనోరంగమున ఆమె ఆక్రమించుకొను స్థానము మాత్రము పెద్దది.

దేశ కాల రాజకీయ పరిస్థితులతో, కవితాకన్య చెలిమి చేయుటచే కావ్య గతిలో మార్పు లేర్పడుచుండును. కావుననే సత్యభామ పురాణేతిహాసములం దొక్కొక్క దానియందు ఒక్కొక్క విధముగా వివిధ రూపములతో కనిపించుచున్నది. ఎవరేవిధముగ చిత్రించినను ఆమె సహజ స్వభావము నాధారముగ చేసికొనియే, చిత్ర విచిత్రముగా చిత్రించుట జరిగినది. శ్రీకృష్ణుని పదియారువేల యెనమండ్రు భార్యలలో నీమె కొకతెకే ఇట్టి ప్రత్యేకతయు, ఆదరమును కలిగినది. వీరము - శృంగారము, మానము - మంచితనము, చలము - చిలిపితనము, స్వాతంత్ర్యాభిలాష - సనాతనసంప్రదాయ విశ్వాసము, నాగరికత - సదాచార పరాయణత, విరసము - సరసము, అన్నియు కలబోసి యున్న కలికి "సత్యభామ". ఎంత అహంకారముగా కనిపించునో, అంతటి వినయమూర్తి. ఎంత కోపనయో, అంతటి కరుణార్ద్రహృదయ. ఎంత నాగరిక ప్రవృత్తి కలదో, అంత సనాతన సంప్రదాయిని. ఎంత గడుసుగ కనిపించునో, అంతటి అమాయికురాలు. ఎంతటి ప్రగల్భగా వ్యవహరించునో అంతటి పతిభక్తితత్పర. ఇట్లు విభిన్నమైన రెండు ప్రవృత్తులు నెలకొనియున్నట్లుగ చిత్రింపబడిన "సత్యభామ" సత్యముగ ఆంధ్ర సాహిత్యములో విశిష్టమైన, విలక్షణమైన పాత్రయే యగును.

## సత్యభామ నామ మీమాంస :

శ్రీకృష్ణుని అష్ట మహిషులలో నొకతెగ ప్రసిద్ధి కెక్కిన సత్యభామకు సాత్రాజితి అనియు, సత్య అనియు, భామ అనియు కూడ వ్యవహారములు కలవు. సత్రాజిత్తు యొక్క పుత్రిక యగుటచే అపత్యార్థకముగ "సాత్రాజితి" అని వ్యవహారము కలిగినది.

*"నగ్న జిన్నామ కౌసల్యో ఆసీద్రాజాతి ధార్మికః*
*తస్య సత్యా భవత్కన్యా దేవీ నాగ్నజితీ నృప" ....(భాగ- 10-58-32)*

అనెడు భాగవత శ్లోకమును బట్టి నగ్నజిత్తు తనయ యగు నాగ్నజితికి "సత్య" అనెడు పేరున్నట్లు తెలియుచున్నది. ఆమెకు "సత్య" అనునది నిజమైన పేరు కాగా "నాగ్నజితి" యనునది నామాంతర మగుచున్నది. కాని లోకమున అపత్యార్థకముగ ఆమె "నాగ్నజితి" గానే ప్రసిద్ధిని పొందినది. లోక వ్యవహారమున, "సత్య" అనెడు పేరు నాగ్నజితికి గాక సత్యభామకే స్థిరపడినది. అష్ట మహిషులలో నొకతెయైనను నాగ్నజితికి, సత్యభామ కున్నంత ఖ్యాతి లభింపలేదు.

"నామైక దేశే నామ గ్రహణం" అనెడు పాణిని సూత్రము ననుసరించి, "సత్యభామ"ను, "సత్య" యని వ్యవహరింప వచ్చును.

రఘువంశమున "అత్రానుగోదం, మృగయా నివృత్తః" అను శ్లోకమున "గోదావరి" శబ్దమునకు బదులు "గోదా" శబ్దము ప్రయోగింపబడినది. అది సమంజసమే యనుచు ఆ శ్లోకమున కీయబడిన చారిత్రవర్ధన వ్యాఖ్యలో "శబ్దా అవయవేష్వపి వర్తన్తే" - ఇతి న్యాయాత్, అనుగోదమితి సదైక దేశ ప్రయోగోయమ్ - భీమో భీమసేనః సత్యా సత్యభామా ఇతి[1]" అని అనుచు సత్యభామకు సత్యా యనెడు వ్యవహార ప్రసిద్ధి ప్రమాణముగ చూపబడినది.

"ఆమెకసలు సత్య యని మాత్రమే పేరు. భామా శబ్దము స్త్రీ సామాన్య వాచి" యని యస్వీ జోగారావు గారును,[2]

"ఈమెకు వాళ్ళ నాన్న పెట్టిన పేరు "సత్య" అని అయివుంటుంది. "భామ" అనే బిరుదు ఆమె కష్టపడి సంపాదించు కొన్నది".... అని పుట్టపర్తి నారాయణాచార్యులు గారును[3] అనినారు.

కాని, సత్యకు సత్యభామ అనునదే నిజమైన పేరు అయి యుండును. సంస్కృత పురాణేతి హాసములందు పెక్కింట సత్యభామ పాత్ర పరిచయ సమయమున ఆమెను "సత్యభామ" అనియే పేర్కొనుట గమనింపదగినది. భారతమున అరణ్య పర్వమునందు సత్యభామా పాత్ర ప్రవేశము జరుగును.

"ద్రౌపదీ సత్యభామాచ వివిశాతే తదాశ్రమమ్"..... (అరణ్య - 237 - 1)

అని మహాభారతమున సాత్రాజితిని "సత్యభామ" అనియే పేర్కొనినది. హరివంశాదులందు సత్రాజిత్తు, శ్రీకృష్ణునకు సత్యభామనిచ్చి వివాహము చేయు ఘట్టముననే సత్యాపాత్ర పరిచయము జరుగును.

*"సత్యభామోత్తమా స్త్రీణాం" ...(హరి. హరి. ప-38-47)* అని హరివంశమును,

*"స్వసుతాం సత్యభామాం భగవతే భార్యార్థం దదౌ" .....(4-13-64)* అని విష్ణు

---

1. *వేదము వేంకటరాయశాస్త్రి - ఆముక్తమాల్యదాసంజీవనీ వ్యాఖ్య - పు. 532*
2. *ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పు. 32.*
3. *"సమర రంగంలో సత్యభామ" - ఆంధ్రప్రభ దినపత్రిక - అక్టో 31. 1978*

పురాణమును,

*"తాం సత్యభామాంభగవానుపయేమే యథావిధి" (10-56-44)* అని భాగవతమును, సాత్రాజితిని "సత్యభామ" అనియే పేర్కొనినవి.

ఇక తెలుగున, భారతమందు, అరణ్యావాసము చేయుచున్న పాండవులను చూచుటకు "...దేవకీ సుతుండు ప్రియంబున సత్యభామాన్వితముగ" వచ్చెననుచు (అరణ్య 4-152), సాత్రాజితిని సత్యభామ యనియే పేర్కొనుట జరిగినది. ఎఱ్ఱన హరివంశమునందు".... "తన నందన నానతుడై సత్యభామ నతనికినిచ్చె" ననియు (పూ. భా. 3 - 199), భాగవతమునందు "...సత్యభామను ముఖద్యుతి నిర్జిత సోమ నయ్యెడన్" కృష్ణుడు పెండ్లి యాడెననియు (10 ఉ. భా. 81), వెన్నెలకంటి సూరన విష్ణు పురాణమునందు "సత్రాజిత్తుఁడాత్మీయనందనఁ జంద్రాస్యను సత్యభామయను కన్యారత్నమున్" (6-274) కృష్ణునకిచ్చి పెండ్లి గావించె ననియు, వర్ణించుచు, సాత్రాజితిని సత్యభామ యనియే పేర్కొనినవి. నాచన సోముని ఉత్తర హరివంశమును, నరకాసుర వధార్థమేగు కృష్ణుడు 'సత్యభామతో నా విహగేంద్రునెక్కె'నని వర్ణించుచు, సత్యను సత్యభామ యనియే పేర్కొనినది (1-138).

సిద్ధేంద్రయోగి విరచితమైన భామాకలాపమునందు సత్యభామ తన చెలితో "భామామణీ సత్యభామ నాపేరు" అని (పు. 13) చెప్పుకొనును.

"...... సత్యభామ నాపేరు" (పు. 30) అని తరిగొండవెంగమాంబ రచించిన "విష్ణుపారిజాత యక్షగానమందు సత్య తనపేరు "సత్యభామ" యని ఆయెయే స్పష్టముగా చెప్పుకొనినది.

నామైక దేశముచే నీమె "సత్య" అనియు ప్రసిద్ధి పొందినది. "సత్య" అని కవులామెను పేర్కొనుట మాత్రమే కాదు, ఇతర పాత్రలును ఆమెనట్లే సంబోధించుట కూడ కలదు.

"అసత్ స్త్రీణాం సమాచారం సత్యే మామను పృచ్ఛసి
అసదా చరితే మార్గే కథం స్యాదనుకీర్తనమ్" ......(భార. ఆరణ్య. అ. 237 - 10)

అని భారతమున, ద్రౌపది సత్యభామను మందలించు సందర్భమున ఆమెను "సత్యా" యని సంబోధించినది. సంస్కృత భాగవతమున ద్రౌపది తన అత్తగారి ఆదేశమున అష్టమహిషులను ఇతర కాంతలను సత్కరించునపుడు

"ఆనర్చ రుక్మిణీం సత్యాం, భద్రాం జాంబవతీం తథా" (10-71-42) అనియు, పద్మపురాణమున" సత్రాజితస్య తనయో నామ్నా సత్యాయశస్వినీ" (ఉ. ఖం. ఉ. అ. 249.1) అనియును, కవి "సత్యభామ"ను సత్య అని పేర్కొనుట జరిగినది.

ఆంధ్ర పురాణేతిహాసకవులు సత్యభామను "సత్యభామ" అనియే అధికముగ పేర్కొనినవారు. ఎఱ్ఱన హరివంశమునందు "సత్యభామ" ప్రయోగము పదునారుమారులును. "సత్య" శబ్ద ప్రయోగము ఒకమారును, ఉత్తర హరివంశమున "సత్యభామ' అని పదునెనిమిదిమారులును, "సత్య" అని మూడు మారులును, భాగవతమున 'సత్యభామ' ప్రయోగము పదియేను పర్యాయములును, "సత్య" అను ప్రయోగము ఒక మారును, సూరన విష్ణు పురాణమున "సత్యభామ" అని పందొమ్మిది పర్యాయములును పేర్కొనుట జరిగినది. నంది తిమ్మన తన పారిజాతాపహరణ ప్రబంధమున "సాత్రాజితి" అనియు ఏడుమారులు పేర్కొనినాడు. అంతేకాదు. ఇరువది యొక్క పర్యాయములు, 'సత్యభామ'

ప్రయోగమును. ఇరువదిమూడు మారులు "సత్యా" ప్రయోగమును చేసి, సత్యా శబ్ద వ్యవహారమునకు మరింత ప్రసిద్ధిని కల్గించినాడు. ఆ తరువాత వచ్చిన తెలుగు కవులందరును "సత్యభామ" "సత్య" శబ్దములకు సమప్రాధాన్యము నిచ్చి వ్యవహరించినారు.

ఇక భామా ప్రయోగమును గూర్చి చూతము. "భామ" అనగానే సత్యభామ గుర్తునకు వచ్చును.

"రైష్మీ జాంబవతీ భామా సత్యా భద్రాచ, లక్ష్మణా కాళిందీ, మిత్రవిందా చేత్యష్టౌ పట్టమహాస్త్రియః" (పు. 434) అని సంస్కృత భాగవతమునకు వ్యాఖ్యాతయైన శ్రీధరస్వామి అష్టమహిషుల క్రమము నిచ్చుచు, తన వ్యాఖ్యానమున "సత్యభామ"కు బదులు 'భామా' శబ్ద వ్యవహారము చేసినాడు. సంస్కృత సాహిత్యమున సత్యభామకు "భామ" శబ్ద ప్రయోగము అరుదుగ నున్నది. కాని, తెలుగున భామా శబ్దము సత్యభామకు మరియొక పేరై స్థిరపడినది. "భామతికుప్యతీతి భామా" అని భామా శబ్దవ్యుత్పత్తి.

"భామా క్రోధే కోప శీలా" అనగా సులభ కోపన "భామ' అని అర్థము.

"భామా" అనగా "కోపన", సత్యభామ" అని సంస్కృత శబ్దార్థ కల్పతరువు చెప్పుచున్నది.[1] "భామా" అనగా సులభముగా కోపము వచ్చెడు స్త్రీ, వనిత, కృష్ణుని భార్యయగు "సత్యభామ" అని సూర్యరాయాంధ్ర నిఘంటువు నందున్నది.

తెలుగున కావ్యవ్యహారమునను, లోక వ్యవహారమునను భామా శబ్దము స్త్రీ సామాన్య వాచిగ నుపయోగింపడుట కలదు. హరివంశమున "ఈ భామ సత్యభామ" (4-152) అనియు, భాగవతమున "వాని భామలెల్ల..." (1-ఉ.భా.84) అనియు, పారిజాతాపహరణ ప్రబంధమున "ప్రియభామ తోడ" అనియు (2-77), "భామా" శబ్దము స్త్రీ సామాన్యవాచిగ నుపయోగింప బడినది.

"ఒప్పులకుప్పా! వయ్యారి భామా!" అని పాటలలోను, భార్యకు వశవర్తియైన మగవానిని "భామావిధేయు'డని ఎగతాళిగ లోకమున వ్యవహరించుటయందును, స్త్రీ యనెడు అర్థముననే భామా శబ్దము ప్రయోగింప బడుచున్నది. సత్యకు భామ యనియు, రూఢ్యర్థమున పర్యాయ వ్యవహారము కలిగిన దనగా ఆమెలో ఆ భామాత్వమంతగా మూర్తీభవించిన దన్నమాట. పడుచు పిల్లలలో ఠీవి, గర్వము అధికముగనున్న వారిని "భామా" అని గేలిగ పిలుచుటయు వాడుక యందున్నది. కావ్య భాషలో కోపమధికముగా గల కాంతలకు "భామా' శబ్దము వాడుటకలదు. వసుచరిత్రకారుడు, సీతాదేవి కోపము తెచ్చుకొనిన ఘట్టములో రాముని "సీతాభామాపతి" (వసు - 1.1) అని సంబోధించినాడు.

సత్యభామలో నితర కాంతలకన్నను కోపము, రాజసము, గర్వమధికముగ నుండుటచే ఈ భామాశబ్దము ఆమె కెంతయు తగియున్నది. సత్యభామ, మానినియగుటచే ఇతరులవలన ఏ చిన్న అపరాధము జరిగినను, మానహాని జరిగినను తీవ్ర కోపావేశములకు లోనగుచుండును. సత్యాగ్రహ శబ్దమును సార్థకముచేయు సాత్రాజితికి ఈ భామా శబ్దము అన్నివిధములుగ సార్థకమే యగును. తెలుగున జానపద కళారూపమైన "భామాకలాపము" వాస్తవముగా "సత్యభామాకలాపమే!" మన పౌరాణిక పాత్రల స్త్రీ వ్యక్తి నామములలో "భామా" శబ్దము ఒక్క సత్యభామకు తప్ప నితరుల పట్ల వాడుకయున్నట్లు కన్పట్టదు.

---

*1. సంస్కృత శబ్దార్థ కల్పతరువు ... పు. 1115*

## సత్యభామ వంశక్రమము :

ఆంధ్ర సాహిత్యమున సత్యభామ పాత్రపోషణము చేయబడిన విధానమును పరిశీలించు నపుడు, ఆమె జన్మించిన వంశమును గూర్చి కూడ తెలిసికొన వలసిన అవసరమున్నది.

దేవయాని యయాతుల కుమారులలో, యదువొకడు. యదువు వంశమునకు చెందినవారు యాదవులుగ ప్రసిద్ధిని పొందినారు సత్యభామా కృష్ణు లిరువురును యదువంశమునకు చెందుటచే వారు యాదవులగుచున్నారు. యదువు మూడవ కొడుకైన "క్రోష్టువు"[1], వీరి వంశమునకు మూలపురుష డగుటచే, వీరు క్రోష్టువంశజులుగ కూడ పేర్కొనబడుచున్నారు.

యదువంశ వర్ణనము చేయుటలో, హరివంశ, భాగవత, విష్ణు, బ్రహ్మ, పద్మ పురాణములొక క్రమమును పాటింపలేదు. ఇదే సందర్భమున, "యదువంశము" అను శీర్షిక క్రింద, డాక్టర్ ఇరావతీకర్వేగారును, ఇట్లనిరి.

"పురాణాలలో యీ వంశాన్ని గురించి ఏకాభిప్రాయం లేదు"[2]

సంస్కృత, తెలుగు హరివంశముల నడుమ, ఈ వంశవృక్షవర్ణనలో ఎంతోభేదము కనిపించుచున్నది. అంతేకాదు సంస్కృత హరివంశములోనే, ముప్పది నాల్గవ అధ్యాయమున పేర్కొనబడిన అక్రూర వంశవర్ణనకు, ముప్పది యెనిమిదవ అధ్యాయమున పేర్కొనబడిన 'అక్రూర వంశవర్ణనకు' నడుమ చాల భేదము కలదు. ఒకే గ్రంథమున, ఒకే వ్యక్తిని గూర్చిన విషయమునందే, ఇంత భేదము కనిపించుచున్నప్పుడు, ఒక వంశవృక్ష వర్ణనమున, వేర్వేరు గ్రంథములనడుమ భేదము కనిపించుటలో నాశ్చర్యము లేదు.

ప్రాచీనాంధ్ర పురాణములలో మడికి సింగిన రచించిన పద్మపురాణమునందు యదువంశ వర్ణన మంతగా లేదు. పోతన భాగవతము, సూరన విష్ణుపురాణములకన్నను, ఎఱ్ఱన రచించిన హరివంశము ప్రాచీనమగుట చేతను, అందు యదువంశ వర్ణనము విపులముగ నుండుట చేతను, ఇచట హరివంశములోని యదువంశ వర్ణనమును ఆధారముగ చేసికొని సత్యభామ వంశవృక్షమును, పరిశీలించుట జరిగినది. దానితోపాటు, ఆమె భర్తయైన కృష్ణుని యొక్కయు, ఆమె జీవితమున అత్యంత ప్రాధాన్యము వహించిన అక్రూర, కృతవర్మ, శతధన్వుల యొక్కయు వంశములను గూర్చి తెలిసికొనుట అప్రస్తుతము కానేరదు.

యదువు యొక్క కుమారుడైన క్రోష్టునకు ముప్పదియైదవ తరమునకు చెందినవాడు సత్వతుడు. ఇతని సంతతివారు సాత్వతులనబడిరి. అతనికి భజమానుడు, దేవావృధుడు, అంధకుడు, మహాభోజుడు, వృష్ణి అని అయిదుగురు పుత్రులు.

సత్వతుడు

| భజమానుడు | దేవావృధుడు | అంధకుడు | మహాభోజుడు | వృష్ణి |
|---|---|---|---|---|

మహాభోజుని వంశములోని వారిలో, ప్రసిద్ధుడైన శ్వఫల్కుని యొక్క కుమారులలో, అక్రూరుడొకడు[3] మహాభోజుని వంశములోనివారు 'భోజులని' ప్రసిద్ధిని పొందిరి. కావున అక్రూరుడు భోజుడగుచున్నాడు.

---

1. హరి - పూ. భా - 3 - 118
2. డా ॥ ఇరావతీకర్వే - యుగాంతం - పు - 315
3. హరి - పూ - భా - 3 - 147
4. హరి. పూ. భా. - 3 -151

సత్వతుని మూడవ పుత్రుడైన అంధకుని కుమారులలో ఒకడైన "కుకురుడు' ఒక శాఖకు మూలపురుషుడైనాడు. కుకురుని వంశములో తొమ్మిదవ తరమునకు చెందిన ఉగ్రసేనుని కుమారుడు కంసుడు.[4] ఉగ్రసేనుని సోదరుడైన దేవకుని సంతానములో, దేవకియు ఒక బిడ్డ. ఈవిధముగ కంసుడును, దేవకియును, కుకుర వంశీయు లగుచున్నారు.

సత్వతుని మరొక పుత్రుడైన అంధకుని యొక్క రెండవ కుమారుడు భజమానుడు. భజమానుని నాల్గవ తరమునకు చెందినవాడు హృదికుడు. హృదికుని సంతానములోనివారు కృతవర్మ, శతధన్వులు. అంధకుని సంతతివారగుటచే, వీరిరువురును అంధక వంశీయులగుచున్నారు.[1] వీరిలో కృతవర్మ అన్నయనియు, శతధన్వుడు తమ్ముడనియు భారతము చెప్పుచున్నది.[2]

సత్వతుని కనిష్ఠ పుత్రుడైన వృష్ణికి, గాంధారి, మాద్రి అని ఇరువురు భార్యలు.అందు మాద్రికి, యుధాజిత్తు, దేవమీఢుడు, అనమిత్రుడని ముగ్గురు సంతానము. అందు, దేవమీఢుని కుమారుడు శూరుడు. శూరునకు వసుదేవుడు[3] మొదలైన తొమ్మండుగురు పుత్రులును, పృధుకీర్తి (శ్రుతకీర్తి), శ్రుత దేవ, శ్రుతశ్రవ, పృథ, రాజాధిదేవి అని అయిదుగురు పుత్రికలును జన్మించిరి. శ్రుతశ్రవ కుమారుడు శిశుపాలుడు.[4] పృథ, కుంతీభోజుని పెంపుడు కూతురై, కుంతిగా, పాండవుల తల్లిగా ప్రసిద్ధిని పొందినది. రాజాధిదేవి, శ్రీకృష్ణుని భార్యలలో నొకతైన మిత్రవిందకు తల్లి[5].

వసుదేవుడు బాహ్లిక పుత్రికయైన రోహిణివలన, బలభద్రుడు మొదలైన తొమ్మండుగురు కుమారులను, చిత్ర అనబడు 'సుభద్ర' అను పుత్రికను పొందెను. దేవకి వలన శ్రీకృష్ణుని పుత్రునిగ పొందెను.[6] వృష్ణి యొక్క మరియొక పుత్రుడు యుధాజిత్తు. ఇతని మనుమడు నిఘ్నుడు. అతని పుత్రులు ప్రసేన, సత్రాజిత్తులు[7]. సత్రాజిత్తు యొక్క తనయ సత్యభామ[8]

సత్యభామ వృద్ధప్రపితామహుడైన యుధాజిత్తును, కృష్ణుని ప్రపితామహుడైన దేవమీఢుడును స్వయము అన్నదమ్ములు. ఒకే తల్లి పిల్లలు. ఇట్లు, తెలుగు హరివంశమును బట్టి చూచిన సత్య భామా కృష్ణులిరువురును వృష్ణి వంశమునకు చెందినవారే అగుచున్నారు.

చైద్య, దాశార్హ, మాధవ, సాత్వత, భోజ, అంధక, కుకుర వృష్ణి వంశములు యాదవ వంశములోని ఉపశాఖలగుచున్నవి.

---

1. *హరి - పూ. భా - 3 - 153*
2. *కృతవర్మ ననుజుండు శతధన్వుడు..." భార - మౌసల - 1 - 45*
3. *హరి - పూ. భా - 3 - 156*
4. *పైది - 3 - 160*
5. *పైది - 3 - 161*
6. *పైది - 3 - 162*
7. *హరి - పూ. భా - 3 - 166*
8. *పైది - 3 - 199*

# సత్యభామ తల్లిదండ్రులు

సత్యభామ చరిత్రను తెలిసికొనుటకు ఆమె తల్లిదండ్రులను గూర్చి తెలిసికొనుటయు ముఖ్యమే. సత్యభామ తండ్రిపేరు సత్రాజిత్తు. తల్లి పేరు పురాణేతిహాసము లెందచటను పేర్కొనబడలేదు. కాని పందొమ్మిదవ శతాబ్దమునకు చెందిన తరిగొండ వెంగమాంబ రచించిన "విష్ణుపారిజాత యక్షగానము" నందు సత్యభామ

*"పన్నుగా నిరతంబు పతి భక్తి చేత*
*వన్నె కెక్కిన సత్యవతియె మా తల్లి"* ......(పు. 30)

అని చెలితో ననుటను బట్టి సత్యభామ తల్లిపేరు సత్యవతి అని విదిత మగుచున్నది. కాని ఇది ఆ యక్షగాన రచయిత్రి కల్పన కావచ్చును.

సంస్కృత హరివంశమును బట్టి సత్రాజిత్తునకు పదిమంది భార్యలుండి రనియు పుత్రికలలో సత్యభామ ఉత్తమ అనియు తెలియనగును.[1] బ్రహ్మ పురాణమునందు నిటులే వర్ణింపబడినది.[2] కాని ఇతర సంస్కృత పురాణేతిహాసములందుగాని తెలుగు పురాణేతిహాసములందు గాని సత్రాజిత్తునకు భార్యలెందరను విషయము ప్రస్తావింపబడలేదు. కాని ఆంధ్రభాగవతమున, సత్రాజిత్తును శతధన్వుడు వధించిన వేళ "వాని భామలెల్ల మొఱవెట్ట" (10-ఉ. భా.84) అనుట చేతను, సూరన విష్ణుపురాణమునందును "తత్పుత్రకళత్రము లఱవఁగ" (6-279) అనుటచేతను, సత్రాజిత్తునకు బహుభార్యలుండి రనియే విశ్వసింపవచ్చును. ఆ భార్యల నామములను గూర్చి గాని వారి ప్రాధాన్యముల గూర్చి గాని, పురాణేతిహాసములందు ప్రస్తావింపబడుట చూడము. "సత్యభామ", యేభార్య యొక్క పుత్రిక? యినుటయు నెచటను సూచింపబడలేదు.

శ్రీకృష్ణాతిమానుషతత్త్వమను ఆధునిక ప్రబంధమునందు మాత్రము సత్యభామతల్లి, బిడ్డమనసెరిగిన ఆర్ద్రహృదయగ, అనుకూలవతియైన భార్యగ సూచన చేయబడినది. (ఖం. 2-3-24). ఇందును ఆమె పేరు పేర్కొనబడలేదు.

## సత్రాజిత్తు ద్వారకానగర వాసి :

మధురాధిపతి యగు కంసుని వధించిన తరువాత కృష్ణుడు కంసుని తండ్రి యగు ఉగ్రసేనుని రాజును చేసెను. నిజమునకు శ్రీ కృష్ణుని పరాక్రమాతిశయము కారణముగా విస్తరిల్లిన ఆ రాజ్యమున కధిపుడు శ్రీకృష్ణుడే కావలయును. "యయాతి శాపమున యాదవ వీరులకున్ నరేశ్వరాసనమున నుండరాదు (భాగ .10 - పూ.భా. 1394). కావున కృష్ణుడు, ఉగ్రసేనుని రాజుగా చేసి, ముఖ్య రాజ్యాధికారములను తాను వహించి, పాలించుచుండినట్లు భాగవతము వలన స్పష్టమగుచున్నది. మగధాధిపుడైన జరాసంధునికి భయపడి, యదువంశ సంభూతులైన వృష్ణి భోజాంధకులు కృష్ణ నిర్మితమైన ద్వారకాపురికి చేరిరి.

*"ప్రసేనశ్చాథ సత్రాజిచ్ఛత్రుసేనా జితావు భౌ*
*ప్రసేనో ద్వారవత్యాంతు, నివసంత్యాంమహామణిమ్"* ......(హరి హరి ప.38-13)

---

(1) *సం. హరి - హరి - ప - 38 - 45, 46, 47*

(2) *సం. బ్రహ్మ. పు. - అ 16 - 44, 46, 47*

అనుటను బట్టి సత్రాజిత్తు ద్వారకావాసి యనుట స్పష్టము బ్రహ్మపురాణమునందు (16-12) తప్ప, సంస్కృతమునందలి ఇతర పురాణములందు దీని ప్రసక్తి అంత విపులముగా కానరాదు.

సూర్యుడిచ్చిన శమంతకముతో, "మగుడి సత్రాజిత్తు ద్వారకానగరంబున కరుగుదేరె" (హరి. పూ.భా.3-172) అనుట చేత, అతడు తన పట్టణమైన ద్వారకకు తిరిగి వచ్చెనని అర్థమగుచున్నది. సూరన విష్ణుపురాణమునందును, శమంతకమును ధరించి అతడు "మగిడి ద్వారకా పురంబునకు వచ్చుచుండె'' ననియు (6-243), ''సత్రాజితుండును నిజనివాసంబునకు వచ్చి సుఖంబునుండె" (పైది 248) అనియు, అనుటచే ద్వారకానగరమే అతని నివాస స్థానమని తెలియనగును.

శ్రీకృష్ణుడు పాండవుల లాక్షాగృహ దహన వృత్తాంతమును విని, హస్తిన కేగిన సమయమున, శతధన్వుడు సత్రాజిత్తును వధించును. (భాగ.10. ఉ.భా.83,84). అనగా ద్వారక యందు శ్రీకృష్ణుడు లేని సమయమును చూచి అతడీ క్రూరకృత్యమును చేసెను. కావున, దీనిని బట్టి చూచినను సత్రాజిత్తు ద్వారకానివాసి యనుట స్పష్టము. కాని మడికి సింగిన రచించిన ద్విపద భాగవతమున రాజైన సత్రాజిత్తు మణిని పొందిన తరువాత హరిని చూచు వేడ్కతో నొకనాడు ద్వారకకు వచ్చెననియు కృష్ణుని అతిథిగ కొన్ని నెలలచట నుండెననియు కలదు[1]. కాని పదునారవ శతాబ్దమునకు చెందిన రామరాజు రంగప్పరాజు రచించిన సాంబోపాఖ్యాన ప్రబంధము "ద్వారకన్, సత్రాజితుఁడు వృత్తశాలి మను" (2-3), అని అతని ద్వారాకా నివాసిగానే వర్ణించెను. ఆ తరువాత రచించిన కవులందరును సత్రాజిత్తును ద్వారకావాసిగానే నిరూపించినారు. దీనిని బట్టి సత్యభామయు ద్వారకావాసిని యనుట స్పష్టమగుచున్నది.

## సత్యభామకు ప్రసేనునితో గల బంధుత్వము :

ఇక ప్రసేనునితో సత్యభామకు గల బంధుత్వమును గూర్చి తెలిసికొనుటయు అవసరమే యగును. "ప్రాప్త రత్నుండైన యా ప్రసేనానుజన్ముండు" (పూ.భా.3-198) అని హరివంశము సత్రాజిత్తును పేర్కొనుటచే, సత్రాజిత్తు తమ్ముడనియు ప్రసేనుడగ్రజుడని అనిపించును. భాగవతమున, కేవలము "సహోదరుండని" (10 ఉ.భా.57), మాత్రము చెప్పబడినది.

> *".......సామవాదముల సత్రాజిత్తుఁ*
> *డీ నేరఁడని కదా యిప్పుఁడతని*
> *తమ్మునిఁజంపి రత్నముఁదెచ్చుకొన్నవాఁడు........." ......(6-256)*

అని సూరన విష్ణుపురాణమును, "అమ్మనుజ వరుఁడు, తన తమ్ముఁడగు ప్రసేనున

---

(1) *".....ఆ మణి వక్షమునందొప్పఁదాల్చి*
*తామరసాప్తుఁడితండొకో యనఁగ*
*ధరణి యేలుచు నుండి ద్వారకాపురికి*
*నరుదెంచి యొకనాఁడు హరిఁజూచు వేడ్క*
*సరసిజ సఖుఁడేల చనుదెంచె ననుచు*
*బురము వారెల్ల నద్భుతమందిచూడ*
*శౌరి గేహమునకుఁజను దేరకృష్ణుఁ*
*డా రాజుఁమన్నించి యర్ఘిఁ బూజించి*
*యొక్క కొన్ని నెలలుండి................"* *.......(ద్వి.భాగ.పు. 93,94)*

కిచ్చుటయు" (10-51) అని సింగన పద్మ పురాణమును, "వనజాక్షునకు నీక వంచించి రత్నమనుజునకిచ్చి....." (పు. 94) అని ద్విపద భాగవతమును, ప్రసేనుని సత్రాజిత్తునకు తమ్మునిగానే పేర్కొనినవి. "అనుజన్మోగ్రవధాభి తప్త హృదయుండై కుందు నా తండ్రి" (10-2796) అని శ్రీరామ నృసింహమూర్తి కవులకృతమైన శ్రీమదాంధ్రభాగవతము నందలి సత్యభామ పలుకులును, ప్రసేనుడు సత్రాజిత్తున కనుజుడనుట స్పష్టము చేయును. యక్షగాన, నాటకాది రచనలయందును, ప్రసేనుడు సత్రాజిత్తునకు తమ్ముడనియే వర్ణింప బడినది. కావున పైవాని వలన ప్రసేనుడు సత్యభామకు పినతండ్రి యగునని అవగత మగుచున్నది.

## సత్యభామ దివ్యాంశసంభూత :

సత్యభామ మానవ వనితగ జన్మించినను, నిజమున కామె దివ్యాంశసంభూతురాలని పురాణేతిహాసములు వర్ణించుచున్నవి. శ్రీదేవి భూదేవులు శ్రీమహావిష్ణువు భార్యలు శ్రీదేవియే రుక్మిణిగ నవతరించినది.[1] భూదేవియే సత్యభామగ నవతరించెనని పురాణములు చెప్పుచున్నవి.

సత్రాజిత్తు తనయయైన సత్యభామ యను పేరు గల యశస్విని, భూదేవి యొక్క యంశమునందు జన్మించి శ్రీకృష్ణుని మరియొక భార్యయైనదని ఈ క్రింది పద్మ పురాణము నందలి శ్లోకము స్పష్టము చేయుచున్నది.

*"సత్రాజితస్య తనయా నామ్నా సత్యా యశస్వినీ*
*పృథివ్యంశేన సంభూతా భార్యా కృష్ణస్యచా 2 పరా " ......(ఉ.ఖ.ఉత్త.249-1)*

"ఇవ్విధంబున ధరణ్యంశంబున జనియించిన సత్యభామ ద్వితీయ పత్నిగా వరించి...." (ఉ.ఖం.10-48) అని సింగన ఆంధ్ర పద్మ పురాణమును, సత్యభామను భూమ్యంశ కలదిగానే వర్ణించినది.

గోపీనాథము వేంకటకవి ఆంధ్రీకరించిన ఆంధ్ర బ్రహ్మ వైవర్త పురాణమునందు (శ్రీకృష్ణ ఖండము) భూసతి సత్యభామగా (1- పు.33) జన్మింప గలదని బ్రహ్మతో కృష్ణుడనినట్లు కలదు.

ఇదియును సత్యభామ భూమ్యంశ కలదనుటనే నిర్ధరించుచున్నది. మూల హరివంశ, విష్ణుపురాణ, భాగవతాదులయందు సత్యభామ భూమ్యంశ కలదనుటను స్పష్టముగా చెప్పకపోయినను ధ్వని ప్రధానముగా నా విషయము సూచింపబడినది.

*"తతః సహైవ చక్రేణ శంఖ గదాసి భృత్*
*ప్రతస్థే గరుడేనాథ సత్యభామా సహాయవాన్" .....(హరి. విష్ణు. ప. 63 - 39)*

అనుటచే శంఖ చక్ర గదాధరుడై సత్యభామా సహాయుడై శ్రీకృష్ణుడు గరుడునిపై అధిరోహించి నరకాసుర వధార్థమేగినట్లు హరివంశము చెప్పుచున్నది. క్రూర రాక్షసునితో జరుగు యుద్ధమునకేగుచు, సుకుమారి యైన ప్రియపత్ని సత్యభామను కూడ కృష్ణుడు తోడ్కొని పోవలసిన నవసర మేమియో హరివంశ కర్త యెచటను వివరింప లేదు.

---

(1) *తేషా మవరజా కన్యా రుక్మిణీ వర వర్ణినీ*
*కమలాంశేన సంభూతా సర్వలక్షణ సంయుతా"* .......... *పద్మ.పు. ఉ.ఖం. ఉత్త. అ. 247 -15*

*"సంచిన్త్యాగత మారూహ్య గరుడం గగనేచరమ్*
*సత్యభామాం సమారోప్య, యయౌ, ప్రాగ్జ్యోతిషంపురమ్"* ......(5-29-14)
....అని విష్ణు పురాణమును,

*" సభార్యో గరుడారూఢః ప్రాగ్జ్యోతిషమ్పురం యయౌ*
*గిరి దుర్గైశ్శస్త్ర దుర్గైర్జలాగ్న్యనిలదుర్గమమ్ "* ...(10.59.3) అనిభాగవతమును,
*" సంచిన్తిత ముపారుహ్య గరుడం గగనే చరమ్*
*సత్యభామాం సమారోప్య యయౌ ప్రాగ్జ్యోతిషంపురమ్ "* ...(202 -14)
...అని బ్రహ్మపురాణమును,

*" తమారుహ్య ద్విజశ్రేష్ఠం సత్యయా సహ కేశవః*
*సంస్తూయమానోమునిభిః ప్రయయౌ రాక్షసాలయం"*..(ఉ.ఖం.ఉత్త. 249 -51)
....అని పద్మ పురాణమును,

నరకాసుర వధార్థమేగుచు శ్రీకృష్ణుడు సత్యభామను తన వెంట తోడ్కొనిపోయెననియే చెప్పినవి గాని, అందులకు గల కారణమేమి యనుటను మాత్రము వివరింపలేదు. నిజమున కట్లు తోడ్కొని పోవుటలో గొప్పపరమార్థము, విశేష ప్రయోజనమున్నట్లు పురాణేతి హాసములందు పైశ్లోకములలో కొన్నింటికి వ్యాఖ్యలు వ్రాసిన వ్యాఖ్యాతలు ఊహించినారు.

పై నీయబడిన హరివంశ శ్లోకమునకు, "శ్రీనీలకంఠుడు" తన "భారతభావదీప' వ్యాఖ్యానమున, నరకుడు భూదేవి కుమారుడనియు, సత్యభామ భూదేవి యంశతో పుట్టుట వలన, ఆమె అనుజ్ఞతోనే వాని చావు నిర్ణయింప బడియుండుట వలన, ఆమె అనుజ్ఞ చేతనే, నరకుని చంప గోరి, శ్రీకృష్ణుడు సత్యభామను సహాయముగా తీసుకొని వెళ్ళెనని చెప్పుచు ఇట్లు వర్ణించెను.

"సత్యభామా సహాయ వాన్ఇతి అస్యాః సత్యభామాయాః పృథివ్యంశత్త్వాత్ పృథివ్యాజ్ఞయైవ తస్యమృత్యుః విహితోఽస్తి ఇతి సత్యభామాజ్ఞయైవ,తం, హనిష్యా మీత్యాశయః" (హరి. చిత్రశాలప్రెస్ -భారత. భావ. దీప.పు. 308)

దీనిని బట్టి సత్యభామ భూమ్యంశమునందు జన్మించిన దనుట తెలియనగును. ఇట్లే విష్ణుపురాణమునందలి శ్లోకమునకు

*"సత్యభామా సమారోపణం తస్యాః భూమ్యంశత్వాత్ త్వత్పుత్రం త్వదనుజ్ఞయా హనిష్యామీతి వరదానాత్తదనుజ్ఞయా భౌమం హంతుం తదా"* (విష్ణు.పు. ఇయ్యణ్ణి జగన్నాథాచార్య పరిష్కృతము. పు.404) అని అనుచు సత్యభామ భూదేవి యంశ యగుటచే, ఆమెకు తానిచ్చిన వరము ప్రకారముగా ఆమె మహిమతో మాత్రమే వధింప వీలగుటచే సత్యను వెంట నిడుకొనిపోయెనని, వ్యాఖ్యాతయగు శ్రీధర స్వామి వివరణమునిచ్చినాడు.

ఇక భాగవతమునందలి వ్యాఖ్యానము పరిశీలింతము :

*"త్వదనుజ్ఞయైవ త్వత్పుత్రం హనిష్యామీతి ఇతి హాసోక్తం భూమ్యైవరం దత్తం సత్యం కర్తుం సత్యభామయా భూమ్యంశత్వాత్తయా సహయయౌ"* (భాగ - వావిళ్ళముద్రణ - పు. 435) అని శ్రీధరాచార్యుడు వ్యాఖ్యానించెను. దానినే

*"త్వనుజ్ఞయైవ త్వత్సుతం హనిష్యామీతీతి హాసేనోక్తం భూమ్యైవరందత్తం సత్యాపయితుం సత్యభామాయా భూమ్యంశత్వాత్తయా, సహయయావితి"* (పు. 680) అని

వీరరాఘవీయమును నిట్లు వ్యాఖ్యానించింది. ఇతిహాసోక్తమైనట్లుగా భూదేవికిచ్చిన వరము ప్రకారము, నరకుని చంపుట కవకాశము లేక, సత్యభామ భూమ్యంశముగా జన్మించుట చేత, నామె అనుమతితో చంపుటకు, నామెను వెంట బెట్టుకొని పోయెననియే పై వ్యాఖ్యనములును చెప్పుచున్నవి. పైవ్యాఖ్యల ననుసరించియే కాబోలు కల్యాణ కల్పతరు సంచికలో ప్రకటితమైన భాగవత ప్రతుల నడుగు భాగమున............

"The Lord had conferred a boon on Mother Earth saying that He would not take the life of her son Naraka without her consent. And Satyabhama being an incarnation of Mother Earth, the Lord took her with him in order to secure her consent before killing the demon"[1]

అని సత్యభామను వెంట బెట్టుకొని పోవుటకు గల కారణములలో, నొక కారణముగా పై దానిని పేర్కొనుట జరిగినది.

ఈ వ్యాఖ్యలన్నిటిని బట్టి చూడ సత్యభామ భూమ్యంశ యందు జన్మించిన వనితగ నంగీకరింప వలసి వచ్చుచున్నది.

భూదేవియే సత్యభామగాను, సత్యభామయే తరువాత జన్మమున గోదాదేవిగ నవతరించినదనుట ఆముక్తమాల్యద వలన తెలియనగును. దీనికి మూలమైన ద్రావిడ ప్రబంధమున గోదాదేవి లక్ష్మ్యంశగ వర్ణింపబడగా, కృష్ణ దేవరాయల చిత్రణమున నామె భూదేవి యంశయైనది. మన్నారుస్వామి విష్ణుచిత్తునితో గానోపచార ప్రాశస్త్యముగ్గడించుచు శ్రీమహావిష్ణువు వరాహావతారము దాల్చినపుడు, బ్రహ్మారాక్షస్సంవాదమును, అందలి గాన ప్రభావమును వినిన భూదేవి గానోపచారమన్ని సేవలకన్నను విశేష ఫలదమని యెరింగి ఈ జన్మమున గోదాదేవిగ జన్మించినదనుచు "ఇప్పుణ్య కథ వహన సమయంబున గుహనా వరాహంబు వలన మహీమహిళ మదీయ పూజోపచితోపచారంబుల విశేష ఫలదంబు గానంబ యన విని, వైష్ణవియుం దా గావున దదాకలన కుతూహలంబునం గూతురై నీ కొదవె" (6-90) అని వివరించును. శ్రీరంగేశుని యెడ విరహతప్తయైన గోదాదేవితో, పూర్వపుజన్మమున నాగకన్యలైన ఆమె చెలులు "సత్యవీవు" అనెడు గోదాదేవి పూర్వ జన్మ విషయమును గుర్తు చేసినారు. (పైది 5 - 74). తాను పూర్వ జన్మమున సత్యభామయని తెలిసిన వెంటనే, ప్రత్యుత్పన్న విజ్ఞానయై విరహతాపమును తాళలేక ఆ మానిని, తనను తండ్రి ఇతరులకిచ్చి వివాహము చేయుటకు ముందే "యోగశక్తి"చే ఈ తనువును విసర్జింతుని నిశ్చయించుకొనినది. "తాను సత్యభామయని యెరింగిన వెంటనే తానే భూదేవియుం గావున తన దివ్య శక్తులన్నియు తనకు నావిర్భవించినవి".[2]

దక్షిణాంధ్రయుగమునకు చెందిన లింగనమఖి కామేశ్వరకవిచే రచింపబడిన "సత్యభామా సాంత్వనము" నందు నరకాసురునితో సత్యభామ పోరాడుచున్న వేళ

*"తెలి చూపు మెరుగు పొత్తుల*
*వలెఁదగస్తనకలశ హారవల్లరిస్త న్యా*
*కలనఁదగ దల్లిగావున*
*నల చెలి తాబెంచనెంచె నసురకులేంద్రున్" ........(4-పు.143)*

---

(1) *Sri Bhagavata - Book - 10- Dis - 59 - P. 406 ( foot notes) Pub lishing - Kalyana Kalpataru - Gita Press*

(2) *వేదము వేంకటరాయశాస్త్రి - ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్య - పు 535*

అని వర్ణించి, కవి సత్యభామ భూమ్యంశ సంభూత యనుటను సూచించినాడు.

సత్యభామ భూదేవి యవతారమనుట నాటకములందు కూడ కాననగును. వేదాల వేంకటప్పలాచార్య కృతమైన "దీపావళి" నాటకమున, శివుడు సత్యభామా ప్రయుక్త శరముచే తపించు నరకునితో "విహిత సమస్తలోక శుభ విస్త్రృత సద్గుణ ధర్మశీల భూమహిళయె సత్యభామయె" యనెడు దివ్య రహస్య మెరింగించును (అం. 8 వు. 78).

సత్యభామ పృథివ్యంశ కలది గావున భగవంతునికి జన్మసిద్ధమైన భార్యయగుటచే సత్యభామపై నీ వరకే కృష్ణునకు దృష్టి యున్నదనియు మరియొకనికీమె నిశ్చయింప బడియుండుటచే సత్రాజిత్తు తన కన్యనిత్తునని రాగా, కృష్ణుడు కొంత సంశయించినట్లు ప్రభుదత్త బ్రహ్మచారి వ్రాసిన శ్రీకృష్ణ కల్యాణమను వచన గ్రంథమునందొక కథ యున్నది[1]

సత్యభామ పూర్వజన్మ వృత్తాంతము నింకను పలువురు పలువిధములుగ వర్ణించి యున్నారు. భూదేవియే సత్యభామయని చెప్పిన సంస్కృతపద్మపురాణమే, కృతయుగమున సత్యభామ అత్రేయగోత్రాన్వితుడు, రవ్యుపాసకుడు, పుత్రరహితుడైన దేవశర్మయను బ్రాహ్మణునకు సకల గుణాలంకృతయగు "గుణవతి' యనెడు తనయగ జన్మించి యుండెననియు, విష్ణుప్రీతి పాత్రములైన ఏకాదశి కార్తీకవ్రతములను దీక్షగ సల్పుటచే, ద్వాపరయుగమున కృష్ణు నెడబాయని ప్రియసతి సత్యభామగా జన్మించెననియు కూడ చెప్పుచున్నది. (పూర్వా. 89. శ్లో 8 - 27). ఆ గుణవతి చరిత్ర నేలనో, మడికి సింగన తన అనువాదమున స్మరింపనైనను లేదు. అధునికకవి పినుపాటి చిదంబరశాస్త్రి యథామూలకముగా కొనసాగిన తన అంధ్రానువాదమునందు గుణవత్యుపాఖ్యానమును విపులముగా వర్ణించెను.

దేవశర్మ సుగుణవతియగు తన పుత్రియకయైన గుణవతిని చంద్రుడనెడి తన శిష్యునకిచ్చి యుద్వాహము గావించి, ఆత్మగృహమునందె యుంచుకొనెననియు, ఒకనాడా యిర్వురును "నిధ్మములకై" వనంబునకేగగా, ఒక రాక్షసుని వలన నాహరింపబడి, వైకుంఠ ప్రాప్తి పొందగా, గుణవతి, తన తండ్రియు, భర్తయు జచ్చిన వార్త యెరింగి కన్నీరు కాల్వలుకట్ట నేడ్చుచు, చివరకు వారికి తగినట్టి కర్మలు జరిపి, విష్ణు పదములపై నెమ్మనంబు నిలిపి, "కాయ ముడిగెడు దాకను గార్తికవ్రతంబు చేయుచుండెననియు, వృద్ధయై తానమాడువేళ నొకనాడు గంగలో మేనువిడిచి కార్తీకవ్రతాధిక్యము కారణముగా విష్ణుసాయుజ్యము పొందెననియు, ఆమెయే సత్యభామ యనియు, కృష్ణుడు సత్యభామతో నామె పూర్వజన్మ వృత్తాంతమును వివరించును (4. - 321 - 328).

*"త్వత్పితయైన సత్రాజిద్వసుంధరా*
*ధీశ్వర మౌళియె దేవశర్మ*
*యాదవ గణమె నాయతి ముఖ్య సహచర*
*సంఘమక్రూరుండె చంద్ర శర్మ*
*గుణవతి నీవె........."* *......(చిదం. పద్మ పు. ఉ. ఖం - 4 - 328)*

అను కృష్ణుని మాటలచే ఆ గుణవతియే సత్యభామగను, అమెకు భర్తయైన చంద్ర శర్మయే అక్రూరునిగను జన్మించిరని తెలియనగును. సత్యభామను అక్రూరుడు సదా

(1) *శ్రీకృష్ణ కల్యాణము (2వ భాగము) -అనువాదము-కుందుర్తి వేంకట నరసయ్య - పు.436*

...చుండెననుటకు కారణము[I] పూర్వ జన్మమున నాతడు భర్త యగుటయే కావచ్చును.

*"మఱియును కార్తిక మాసంబునను నీవొ*
*నర్చిన దీప దానంబు వలనఁ*
*జేకుఱె నీకిట్టి స్థిరలక్ష్మి పతిరూప*
*మున నన్ను భావించి మనసులోన*
*నర్చించుటను గార్తికా చరిత్ర వ్రత*
*ఫలమునాకైతివి భార్యవీవు"* ....... *(పైది - 329)*

అని కృష్ణుడు "గుణవతి తన భార్య సత్యభామ"గ జన్మించుటకామె గావించిన కార్తిక వ్రతమే కారణమని వివరించును.

భారతమున సత్య లక్ష్మ్యంశగా పేర్కొనబడినది. కృష్ణ నిర్యాణానంతరము అష్ట మహిషులతో, అనుమరణంబున "రుక్మిణి లక్ష్మిని చెందగా". తక్కుఁగల వామలోచనలేడ్వురుం" "లక్ష్మి యంశముల కావున" "తదీయ, నుతతను ప్రవేశన సమాచరణం బొనరించిరి" (స్వర్గా.పర్వ. 1 - 72).

ఎఱ్ఱన హరివంశమును, సత్యభామ పూర్వమున "ఆదిసురాంగన" యని చెప్పినది. నరకాసురవధానంతరము, కృష్ణునితో కలసి అమరావతి కేగినపు డందలి నందోనోద్యానమున నున్న"జాతిస్మరత్వము" కల్గించు పారిజాతమును చూడగనే సత్యభామ తననాదిసురాంగనగా దలచినది" (హరి ఉ.భా - 4 - 217).

సత్యభామ విశ్వామిత్రుని యంశలో జన్మించినట్లుగ కొందరు కవులుకల్పించి నారు. దీనికి ప్రాచీన పురాణములందాధారము మృగ్యము. సింగన పద్మపురాణమునందు దండకారణ్యవాసులై తపము చేయు మునులు రామచంద్ర దర్శనముతో తనివి చెందక, సుందర వనితలుగ జన్మించియైన అమ్మహాత్ముని శరీర స్పర్శ సౌఖ్యము అనుభవింపవలెనని తలంపగా, రామచంద్రుడు కృష్ణునిగా జన్మించి వారలు గోపికలయై జన్మింపగా, వారి కోరికల నట్లు సఫలము చేసినట్లు కలదు[2]. మూలమున పాతాళ ఖండమున నీ వృత్తాంతమున్నది.

రాముడిచ్చిన వరములకు మును లంద రానందము చెందగా కౌశికుండు మాత్రము "చింతాక్రాంతుడై" "అనుతాపము వహించి" వీడకయ బిట్టార్వగా రఘూద్వహుఁడు "సాత్రా జితివై జనించెదవు నిన్నాలించి పాలింతుఁ బాయని కూర్మిన్ గుశికాత్మజా" (2-3-5).

---

*(I) సదాహి ప్రార్థ యామాస సత్యభామా మనిందితాం*
*అక్రూరో 2 న్తరమన్విచ్ఛన్ మణించైవ స్యమంతకమ్" (హరి. హరి. ప. ఆ 39 - 2)*

*2) "దండకారణ్యా వాసులై తపము సేయు*
*నమ్మునీంద్రులు మును రామ చంద్రుఁజూచి*
*యమ్మహాత్ముని నిజమూర్తి నాత్మలందు*
*దలఁచి సౌఖ్యంబు నొందియుఁదనివి సనక"* *(సిం.పద్మ.పు. 9 - 221)*

*వ॥ సుందరులమై జనించియైన నమ్మహాత్ముని స్పర్శ సౌఖ్యంబులనుభవించి నిత్య ముక్తులగుదమని తలంచుచున్న మహామునులు గోపికలై జనించిరి. రామచంద్రుడు కృష్ణుండై యవతరించి, వారల కోరికలు సఫలంబులు గావించె".*

*(సిం.పద్మ.పు.ఉ.ఖం. 9 - 222)*

అని వరమిచ్చి ఆనందింప చేసెనని శ్రీకృష్ణాతిమానుషతత్త్వమునందు వర్ణింపబడినది. సత్యభామగా జన్మించియు, పూర్వపు ప్రవృత్తి నాతడు వీడలేదు. "తన్నెన్నక చిన్న జూపిన సహింపక యల్క వహించు" సత్యనుచూచి "అప్పలీ యన్నులమిన్నకెట్లు కుశికాత్మజు కోపమువచ్చెనో......." (పైది -7) అని ఆశ్చర్యపోవుచుండిరి. "సతీవయోపి త్రప్రకృతి స్సునిశ్చలాపు మాంసమభ్యేతి భవాన్తరేష్వపి" అని మాఘుడనినాడు. అనగా ప్రాక్తనమగు ప్రకృతి జననాంతనర మందైనను వీడదట. ఇందలి సత్యభామ ప్రవర్తన పై మాట నిజమేయని యనిపింప జేయుచున్నది.

అయినాపురపు సుందరరామయ్య వ్రాసిన "శ్రీకృష్ణ విలాసము" అను 'అష్ట మహిషీ కల్యాణ' నాటకమున, సత్యభామ పూర్వజన్మమున విశ్వామిత్రుడే యని వక్కాణింపబడినది. ...(పు. 105).

అష్ట మహిషులలో రుక్మిణి గాక, మిగిలిన వారు సప్తర్షుల యంశలో జన్మించినారనియు, అందు సత్యభామ విశ్వామిత్ర యంశసంభూతయనియు కేతవరపు రామకృష్ణ శాస్త్రి రచించిన "శ్రీకృష్ణ తులాభారమ"ను హరికథయందు కూడ చెప్పబడినది. ....(పు. 44).

ఇట్లు సత్యభామను విశ్వామిత్రుని యంశగా భావించుటకు ఆమె కోప స్వభావమే మూలకారణమైనట్లు తలంప వలయును.

ఇట్లు సత్యభామ పూర్వవృత్తాంత మెవరేవిధముగా చిత్రించినను, ఆమె దివ్యాంశ సంభూతయని సూచించుట గమనింపవచ్చును.

## సత్యభామ తోబుట్టువులు :

సత్యభామకు గల సోదరీసోదరుల విషయమున పురాణేతిహాసము లొక ఐక్యమును పాటింపలేదు. మూల సంస్కృత గ్రంథమునందు చెప్పబడిన సంఖ్యకును అనువాదము నందున్న వానికిని నెంతయో భేదము కనిపించుచున్నది. అట్టి యెడ భిన్న భిన్న పురాణములు విభేదించుటలో నాశ్చర్యము లేదు.

మూల హరివంశము వలన సత్యభామకు బహు సంఖ్యాకులైన సోదరులును ఇద్దరు అక్క చెల్లెండ్రు లున్నట్లు అవగతమగును. సత్రాజిత్తునకు గల పదిమంది భార్యలకు వందమంది కుమారులు గలరనియు, వారిలో ముగ్గురు ప్రసిద్ధులనియు, వారిలో పెద్దవాడు "భంగకారుడు", రెండువ వాడు వీరుడైన "వాతపతి", మూడవ వాడు ఉపస్వానుడనియు, వీరేగాక ముప్వురు పుత్రికలు కూడ కలరనియు వారిలో సత్యభామ ఉత్తమ కాగా, "వ్రతిని" యనునామె దృఢవ్రతధారిణి యనియు, "ప్రస్వాపిని కూడ నటువంటిదేయనియు, సత్యభామను, కృష్ణునికిచ్చి వివాహము చేసెననియు హరివంశము వలన తెలియును.[1] సంస్కృత బ్రహ్మపురాణమును హరివంశము వలెనె వ్రతిని ప్రస్వాపినులను సత్యభామకు సోదరీమణులుగ పేర్కొనినది.[2]

మూలహరివంశము సత్యభామ సోదరీమణులను పేర్కొనినదే గానీ, ఆమె వారికి అగ్రజయా? అనుజయా యనుటను స్పష్టము చేయలేదు. కాని తెలుగు బ్రహ్మ పురాణము, సోదరీ సోదరుల వివరణమున హరివంశమును, మూలబ్రహ్మపురాణము ననుసరించుచునే, సత్యభామను ముప్వురు పుత్రికలలో నగ్రజగా నిరూపించినది.

---

*(1) సం. హరి. హరి. ప. - అ. 38 - 45, 46, 47*

*(2) సం. బ్రహ్మ. పు. - అ. 16 - 46, 47*

*"వినుఁడు సత్రాజిత్తు వనితలు దశ సంఖ్య*
*నలరి రా భార్యలయందు నతఁడు*
*శతపుత్రులంగాంచె సర్వ విధంబుల*
*ఖ్యాతి నొందిరి మువ్వురందు భంగ*
*కారుఁడే వారికగ్రజఁడుయి తన రారె*
*వాతపతియు దరువాతి వాఁడు*
*వసుమేధసుఁడు వెన్క వాఁడయ్యె నతనికిఁ*
*తరువాతి వారెల్లఁ దలఁప నిట్లు*

*పేరుకల్గు వారుగారు కుమారికల్*
*మువ్వురు దిశలందు మ్రోయువినుతి*
*గల్గు వారలిట్టి కన్యకామణులందు*
*సత్యభామ యగ్రజ యగుఁజుండి....."* ..(*తె. బ్రహ్మ. పు. అధ్య - 14 - 854)*

*వ॥దృఢవ్రతయు బ్రస్వాపినియు నామె ననుజాతలు" .....(పైది - 855)*

హరివంశమునందలి ఉపస్వాను డిందు వసుమేధసుడైనాడు.

ఆధునిక కవి పిసుపాటి చిదంబరశాస్త్రి విరచితమైన ఆంధ్ర పద్మ పురాణమునందు "సత్రాజిత్తునకు నేకోత్తర శత సంఖ్యాకులగు పుత్రులును సత్యయను పుత్రికయు నుద్భవించిరి. అందు భంగకారుండు పుత్రులలో జ్యేష్ఠుండగు. సత్యయందరకును జ్యేష్ఠురాలుగ నుండె" అని కలదు.[1] దీనిని బట్టి సత్యభామ సత్రాజిత్తు సంతానములో నగ్రజయని విదితమగు చున్నది.

సంస్కృత హరివంశ బ్రహ్మ పురాణాదులు, సత్యభామ సోదర ప్రశంసను చేసినను ప్రాచీనాంధ్ర పురాణేతిహాసకవులు మాత్రము వారి సంఖ్యను గూర్చి గాని, సత్య అక్క చెల్లెండ్రుల విషయమును గూర్చి గాని, సరియైన వివరణ మీయలేదు. ఎఱ్ఱన హరివంశమున సత్రాజిత్తు "తన నందన" సత్యభామను కృష్ణునకిచ్చి వివాహము చేసెనని చెప్పబడినదే గాని (పూ.భా. 3 - 199), ఇతర పుత్రీపుత్రుల ప్రసక్తి సూచనా మాత్రముగ నైనను లేదు. వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము నందు సోదరీమణుల ప్రశంస లేకపోయినను, సూచనామాత్రముగ సోదరీ ప్రస్తావన గావించాడు. శతధన్వుడు సత్రాజిత్తును వధించి మణి నపహరించువేళ "తత్పుత్ర కళత్రములఱచిరి" అని కలదు. ఇచట పుత్ర శబ్దముచే సత్రాజిత్తు పుత్రవంతు డనుట మాత్రము స్పష్టము. కాని సత్యభామకు అక్కచెల్లెండ్రున్నట్లు ఈ పురాణ వర్ణనను బట్టి తెలియవచ్చుట లేదు.

*"తదియం త్వదీయాపహాసనా, తదాలోచ్య యదత్రయుక్తం తత్క్రియతామితి కృష్ణమాహ" "తయాచైవ ముక్తః పరితుష్టాంతః కరణోపి, కృష్ణః సత్యభామా, మమర్షతామ్రనయనః ప్రాహ"* (విష్ణు . పు. అం. 4 -13 - 73, 74)

అని, కృష్ణునితో శతధన్వుడు తన తండ్రిని వధించి మణి నపహరించిన వృత్తాంతమును సత్యభామ వివరింపగా కృష్ణుడు కోపము చెందెననెడు పై శ్లోకమునకు సత్రాజిత్తు అపుత్రడగుటచే ఆ మణియు నిక సత్యకే చెందగలదని పరితుష్టుడయినను, అన్యాయముగా సత్రాజిత్తు చంపబడుటచే కోపము కలవాడయినట్లుగా

*'అవహాసనా పరిభవ : - 73 - తయేతి ॥ అర్థలుబ్ధ స్యాజ్ఞా లంఘిన స్సత్రాజితస్య మృతత్వాత్తస్యా పుత్రత్వేన తన్మరణే సత్యభామా గామిత్వాచ్చ పరితుష్టాంతః కరుణోపి'* (పు-311)

---

*(1) చిదం. పద్మ. పు. - సృష్టి. ఖం. సం. 3 - 331*

అనెడు శ్రీధరస్వామి వ్యాఖ్య యందు నిరూపింబడినది. దీని వలన సత్యభామకు సోదరులు లేనట్లు విశ్వసింప వలసివచ్చుచున్నది.

మూలభాగవతమును, పై విషయమునే సమర్థించుచున్నది. సత్రాజిత్తును వధించిన శతధన్వుడు తానపహరించిన మణిని అక్రూరుని యొద్ద దాచి యుంచెననని కృష్ణుడు గ్రహించి, అక్రూరునితో "సత్రాజిత్తునకు పుత్రులు లేరనియు, కావున అతని పుత్రికయగు సత్యభామ యొక్క పుత్రులే అతని కార్యమాచరించి విత్తంబును, ఋణంబును పంచుకొందు రనుచు, ఇట్లు అనును.

"సత్రాజితోఽనపత్యా త్వాద్గృహ్ణీ యుర్దుహితుస్సుతాః

దాయంనినీయాప : పిండాన్విముచ్యర్ణం చ శేషితమ్" ....(భాగ. 10 - 57 - 37)

దీని వలన సత్యభామ ఏకైక సంతానమనుట స్పష్టము. కాని పోతనగారి ఆంధ్రాను వాదమునందు సత్యభామకు అన్నదమ్ములు లేరనియు, అక్కచెల్లెంద్రు కలరనియు కలదు. "సత్రాజిత్తునకు బుత్రకులు లేమి నతనికి గార్యంబులాచరించి, విత్తంబు ఋణమును విభజించు కొనియెదరతని పుత్రికలెల్ల" అని కృష్ణుడు అక్రూరునితో ననును. (భాగ ఉ.భా.98) శతధన్వుని వధానంతరము కృష్ణుడు "శతధన్వుని మరణంబును, మణి లేకుండుటయు, సత్యభామకుంజెప్పి, సత్యభామా ప్రియంకరుడు గావున సత్రాజిత్తునకు బరలోక క్రియలు సేయించెను" (పైది-95). మూలభాగవతమునందును శ్రీకృష్ణుడే సత్రాజిత్తునకు పరలోక క్రియలు చేయించినట్లున్నది. (10.57.29). సత్రాజిత్తునకే పుత్రు లుండియున్న శ్రీకృష్ణుడా బాధ్యతను స్వీకరింపవలసిన అవసరములేదు.

అక్రూరుడు మణిని చూపినపుడు సత్యభామ ".....మదీయ జనకుని పడసిన యర్థంబు తనుఁజేరు"నని తలంచినట్లుగా (పూ.భా.3. - 243) హరివంశ కథనము. సూరన, విష్ణు పురాణమునందును 'తండ్రి సొమ్ముగానఁ దనకిత్తురో యని, సత్యభామ మిగులఁజనవు నెరపె'ననియున్నది. (6 - 341). తోబుట్టువులే యున్నచో, సత్యభామ మణి తనకే దక్కునని నెట్లు ఆశించి యుండగలదు? తన తండ్రియైన సత్రాజిత్తును, శతధన్వుడు వధించి, మణి నపహరించినాడను విషయమును, హస్తినగరమునకేగి సత్యభామ కృష్ణునకు తెలియ పరచినది. తోబుట్టువులు పలువురుండియున్న యెడల, అందును సోదరులుండినట్లయిన, జరిగిన అకార్యమును గూర్చి ప్రభువునకు తెలుపు బాధ్యత సత్యభామ తీసికొనవలసిన అవసరమేమున్నది? దీనిని బట్టి మూలభాగవతములో చెప్పినట్లుగా సత్రాజిత్తునకు పుత్రులు లేరని గ్రహించుట యుక్తము. సత్యభామ యొక్క బాధ్యతాయుతమైన ప్రవర్తనయు కృష్ణుని కర్తవ్య పరాయణతయు చూడ, సత్రాజిత్తునకు సత్యభామ ఏకైక సంతానమని గాని, లేక పుత్రికలలో నగ్రజయని గాని నిర్ణయింపవలసి వచ్చును.

మడికి సింగన ద్విపద భాగవతమునందు "సత్రాజిత్తు" "నాకూర్మి పట్టి యీ కన్య" (పు.108) యని, సత్యభామను పేర్కొనుటచే సత్యభామ సత్రాజిత్తునకు మిగుల ప్రియమైన పుత్రికయని నిశ్చయింపవచ్చును.

ఆధునిక కవులును, సత్యభామ తోబట్టువులను పేర్కొనుటయందు భిన్న భిన్న మార్గములను త్రొక్కినారు. సత్యా వివాహమను ప్రబంధమునందు భంగకారుడు వాతపతి ఆమెకు సోదరులనుచు, "సత్రాజిత్తు" "అరుదుగా గాంచె కూఁతు"నని సత్యభామను వర్ణించుట జరిగినది. (పు.15). దీనివలన సత్యభామ ఏకైక పుత్రిక యని ధ్వనితము. శ్రీకృష్ణాతిమానుషతత్త్వమునందును "ఏకైకసుత"గా సత్యభామ వర్ణింపబడినది. (2.3.19). కాని పుత్ర సంతానమును గూర్చిన ప్రస్తావన మందులేదు.

"సత్యభామ బాల్యము"

సత్యభామ వివాహానంతర జీవితమును గూర్చి యెంతగానో వర్ణించిన ఆంధ్ర పురాణేతిహాసకర్తలు గాని, ప్రబంధకవులుగాని ఆమె బాల్య జీవితమును గూర్చి స్మరింపనైన లేదు. వీరే కాదు. వీరికి మూలమూర్తు లనదగు సంస్కృత కవులును సత్యభామ బాల్యమును గూర్చి తమ గ్రంథములందు తడువనైన లేదు. రుక్మిణీ చేత తెలుగింటి బాలికవలె బొమ్మ పెండ్లిండ్లు, గుజ్జన గూళ్లు, బంతులాటల నాడించి భర్మడోలికల నూగించిన పోతన, సత్య వీరత్వమునకు మురిసిపోయినాడే గాని, ఈ వీరవనిత పెరిగి వచ్చిన వాతావరణమును గూర్చి ఆలోచన చేయలేదు. యక్షగాన కవులలో నొక్కడైన "మాతృభూతకవి" మాత్రము సత్య "చిన్న వయస్సున", "బొమ్మ పెండ్లిండ్లు, అమ్మనలు, చిట్ట పొట్ల కాయలు, గుజ్జన గూళ్లు, ఓమనగుంటలు, ఓదురు కుప్పలు, గుజ గుజ రేకులు, దేవుడుగిన్నెలు" మొదలైన ఆటలాడినట్లు తన "పారిజాతాపహరణ" యక్షగానమందు వర్ణించినాడు. (3-159).

శ్రీకృష్ణాతిమానుషతత్త్వమునందు సత్యభామ చిన్న వయస్సునందే 'విద్యాశ్వారోహణ యుద్ధ కౌశలములన్' "దిక్సీమలందు స్థాపించినట్లు" వర్ణితము (2-3.6) చిలకమర్తివారి నరకాసురవధ నాటకమున సత్య

*" విల్లు వంచుట కూర్చుట వింట నారి*
*నలుగుఁదొడుగుట వేయుట యద నెరుఁగుట*
*రథముఁదోలుట మొదలైన రణపుఁబనులు*
*జిన్న నాటను మా తండ్రి చెప్పెఁగాదె "* ...........*(పు.57)*

అవి కృష్ణునితో అనుటను బట్టి, యుద్ధ విద్యలన్నియును బాల్యముననే నేర్చినదని భావింపనగును.

తుంబురునిపై మాత్సర్యము వహించి, గాన విద్యావిశారదత్వము సంపాదింప బూనుకొనిన సంగీత కళాకోవిదుడైన నారదునకు, తన ప్రియుడైన కృష్ణుని ఆజ్ఞచే, సత్యభామయు, రుక్మిణికివలె తానును, "సంతసమొప్ప నప్పరమ సంయమి నొక్క యేడు దిదిద్ది"నదని (2.36) సూరన కళాపూర్ణోదయము వలన తెలియుచున్నది. నారదుడంతటి గాన కళాచణునికి గురుస్థానము వహించినట్టి సత్యభామ, చిన్నతనముననే సంగీతాది కళలను గురు సన్నిధిలో నేర్చినట్లుగా భావింపవచ్చును. కలభాషిణిని చూచి "జాంబవంతియు, సత్యభామయు భోజాత్మజయును, హరియు, గురువులుగ గానకళలెల్ల గరిడిముచ్చు దనముతో నేర్చితివి గద" (పైది 2-47) అనెడు నారదుని ప్రశంసా వాక్యముల వలన కలభాషిణికి కూడ, సత్యభామ గురుత్వము వహించినదనుట స్పష్టము.

వీణావాదనమునందును సత్య నేర్పరి. నరకాసునితో యుద్ధము చేయుటకై పోయి, అచట సత్యమీది విరహముతో తపించు శ్రీకృష్ణుడు

*"చల్లగా మనసు రంజిల్లగా నీచేత*
*వెలదిరో యెపుడు నే వీణె విందు"* .........*(సత్య. సాం. పు. 92)*

అని సత్యభామ వీణానాదము వినుటకై తపించుట లింగనమఖి కామేశ్వరకవి కృతమగు సత్యభామా సాంత్వనప్రబంధమునందు కాననగును. ఆధునిక కవి జంగా హనుమయ్యా చౌదరి వ్రాసిన సత్యా వివాహ ప్రబంధమందు, సత్యభామ కిన్నెర వాయింపుచు, కుత్తుక దానిలో కలిపి పాడగా ఆసమయమున

"ఎండిన మ్రాకులెల్ల చిగురించెను, ఆల్జైమరించె బుట్టలం
దుండిన పాప తేండ్లు తలలూపి చివాలున లేచె నన్నువల్
కొండొక రిచ్చపాటు మది కూరిన బొమ్మల యెమ్మెజెందిరి..." (సత్యా.వి. పు-61)

.... .... ..... .... .... ..... .... .... ...... .... ..... .....

అంతేకాదు, దీనిని వినుచున్న ప్రబంధనాయకుడైన కృష్ణుడును మైమరచి అప్సరసల గానమును మించిన ఆమె దివ్యగామున కబ్బురపడినాడు.

"తేటగా దేనె చిట్టుగా నీ చేత, నతివరో యెపుడు పద్యములు విందు" (పు. 92) అనెడు "సత్యభామా సాంత్వన" మందలి కృష్ణుని పలుకులచే, సత్య పండితురాలనియు భావింపనగును.

ఉత్తర హరివంశమున నరకాసురతోడి యుద్ధ సమయమున అసమాన సాహసముతో యుద్ధము చేయు సత్య "ప్రమద నర్తన కేలి బరిఢవింపని పదం బైదురాణంబులనలతఁ బడలేదని (1-161) ప్రశంసింప బడును. ఇదే సందర్భమున భాగవతమునందును "నీలకంఠములకు నృత్యంబు గరపుచు, నలసి తలఁగిపోవునలరుఁబోణి" (10 ఉ.భా. 180) ఆలీఢాది మానముల నెట్లుండెనని, కవిచే ఆశ్చర్యము ప్రకటింప బడినది. దీనిని బట్టి సత్యకు నాట్యకళతో కూడ మంచి పరిచయమున్నట్లు తలంపవచ్చును.

"శౌరి బలుమరు" "నెత్తము" లాడుటయందు గెల్చిన సత్యభామ (3-128) ఆవిద్యయందు నారి తేరినదని ఉత్తరహరివంశ మాధారముగ చెప్పవచ్చును.

సంగీత, సాహిత్య నాట్యాది లలితకళలయందును, విలువిద్యాది యుద్ధవిద్యలందును, నెత్తము లాడుట మొదలగు వినోదక్రీడల యందును చతురయైన సత్య ఈ విద్యలన్నింటిని బాల్యమునందే అభ్యసించి యుండునని తలంపవచ్చును.

# రెండవ ప్రకరణము

## సత్యభామ వివాహము

ప్రాచీన పురాణేతిహాసములలో సత్యభామ పాత్రపరిచయము ఆమె వివాహమునాడే చేయబడినది. వివాహమునకు ముందుగల సత్యభామ పాత్ర విశేషములేవియు సందు వర్ణితములు కావు. పతియైన శ్రీకృష్ణుని స్వాధీనుని చేసికొని స్వాధీన భర్తృకగా జగత్ప్రసిద్ధి పొందిన సత్యభామ యొక్క ప్రణయము, వివాహానంతరమావిర్భవించినదే. రుక్మిణీదేవి వలె దివ్యాంశ సంభూతురాలిగ చిత్రింపబడినను, ఆమెవలె గాక, సత్యభామ తన తండ్రి నిర్ణయించిన వివాహమునే చేసికొనినది. వివాహమునకు ముందామె యెవ్వరిని వరింపలేదు. తండ్రి మొదట తనకు పతిగా ఒకరిని నిశ్చయించినపుడు గాని, ఆ తదుపరి కృష్ణునకిచ్చి వివాహము చేసినపుడు గాని , సత్యభామ తన సొంత అభిప్రాయమును గాని, అభిలాషను గాని వ్యక్త పరుప లేదు. తండ్రి నిర్ణయమునే శిరసావహించినది.

సత్యభామ కృష్ణపత్ని యగుటకు ముందు ఆమెకై నిర్ణయింపబడిన వరుడెవ్వరనుట చూతముః

### శతధన్వుడే సత్యభామకు మొదట నిర్ణయింపబడిన వరుడు :

సత్యభామ విశేష రూపగుణ సంపన్న. సంస్కృత భాగవతము నందలి "బహుభిర్యా చితాం శీల రూపౌదార్య గుణాన్వితామ్"(10-56-44) అనెడు శ్లోకమును బట్టి, సత్యభామ శీలమును, రూపమును ఔదార్యగుణమును చూచి పలువురామెను వివాహమాడగోరుచుండిరని తెలియుచున్నది.

సత్రాజిత్తు యొద్ద దినమున కెనిమిది బారువుల బంగారమునిడు శమంతకమణి యున్నది. సత్యభామను వివాహమాడిన వానికి, సుందరాంగి, గుణవతియగు సత్యభామతో పాటు, దివ్యైశ్వర్యప్రదాయినియగు మణియు లభింపగలదు. అందుచే అక్రూరుడును సత్యభామను మణితో పాటు సదా గోరుచుండెనని సంస్కృత హరివంశమున కలదు. సంస్కృత బ్రహ్మపురాణమును నిదే యభిప్రాయమును ప్రకటించినది. (17-2). కాని సంస్కృత విష్ణు పురాణము అక్రూరునితోపాటు, కృతవర్మ శతధన్వాది యాదవులును సత్యభామను వివాహమాడ కోరుచుండిరనుటను ఇట్లు చెప్పినది. "తాంచా క్రూర, కృతవర్మశతధన్వ ప్రముఖా యాదవాః ప్రాగ్వరయాం, బభూవుః (4-13-65).

ఇక తెలుగు ప్రాచీన పురాణేతిహాసములందు నీవిధముగానే యున్నది."అక్కుమారిక నక్రూర కృతవర్మ శతధన్వ ప్రముఖులగు యాదవులెందఱేని నెప్పుడు నడుగుచుండి" రను (పూ. భా. 3-200) హరివంశమునందలి వాక్యములచే, అక్రూరాదులలో ఎవరికి వారు సత్యభామను తామే వివాహమాడ వలయునని కోరికతో నుండిరని తెలియుచున్నది. ఆంధ్ర భాగవతమునందును సత్రాజిత్తు సత్యభామను కృష్ణునికిచ్చి వివాహము చేయుట తమ కవమానముగ భావించిన అక్రూర కృతవర్మలు శత ధన్వునితో ".......అప్త వృత్తి, మనకిత్తు ననుచు సమ్మతి జేసి తన కూఁతుఁబద్మాక్షునకు నిచ్చి పాడి తప్పె, ఖలుఁడు సత్రాజిత్తు........ (10 ఉ.భా. 84) అనుటను బట్టి, అక్రూరాదులలో నొకరికి తన పుత్రికనిత్తునని సత్రాజిత్తు వారికి మాట యిచ్చియుండినట్లు తెలియుచున్నది. ఇదే సందర్భమున, సూరన విష్ణు పురాణమునందును, అక్రూర, కృతవర్మలు శతధన్వునితో ....

*"మునుపు సత్యభామ మనలోన నొకరున*
*కిత్తుననుచు నిశ్చయించి పలికి*
*యాలతాంగి నిప్పుడబ్జాక్షునకు (బెండ్లి*
*సేసె మమ్ము నిన్ను సిగ్గు వఱచి"* .....(సూ.వి.పు. 6-276)

అనుమాటల వలనను, ఇదే సందర్భమున,

*"కంటిమె మనలోనె కలికి నిచ్చెదనని*
*పలికి యిప్పుడు సత్యభామ నచ్యు*
*తునకిచ్చె సత్రాజితుఁడు......"* .......(4-364)

అను కలిదిండి భావనారాయణ విరచితమైన విష్ణుపురాణము వలనను, సత్రాజిత్తు సత్యభామను అక్రూర, కృతవర్మ శతధన్వులలో నొకరికిత్తునని ముందే వాగ్దానము చేసియుండెనని స్పష్టమగుచున్నది.

కాని నిజమునకు ఈ ముగ్గురిలో సత్యభామను సత్రాజిత్తు నేరికీయ నుద్దేశించెనో తెలిసికొనుట ముఖ్యము. మూలభాగవతమున, ద్రౌపదితో అష్టమహిషులు తమ తమ కల్యాణ వృత్తాంతములను వర్ణించునపుడు, సత్యభామ తన వివాహవృత్తాంతమును గూర్చి యిట్లనును.

"యోమే సనాభివధ తప్తహృదా తతేన లిప్తాభిశాప మపమార్ష్టుముపాజహార జిత్వార్క్షరాజమథ రత్నమదాత్యతేన భీతః పితాదిశత మాం ప్రభవేక పిదత్తామ్"(10-83-9).

ఆధునిక కవులగు శ్రీరామనృసింహమూర్తి కవులు తమ శ్రీమందాంధ్ర భాగవతమునందు మూలభాగవతమును నిట్లు అనువదించిరి.

*"అనుజన్మాగ్రవధాభి తప్తహృదయుండై కుందు నాతండ్రి వే*
*తనపై మోపిన నిందఁబాపుకొనఁబంతంబూని భల్లూక నా*
*థుని నిర్జించియుఁదెచ్చి యిచ్చెను ముకుందుఁడమ్మణిన్ దత్త నై*
*నను నన్నున్ జగదేకనాథునకిడెన్, నాతండ్రి భీతాత్ముడై"* .....(10-2796)

దీని వలన సత్యభామకును, తన వివాహమునకు ముందే తానింకొకరికి వాగ్దత్త యై యుండినదనెడు విషయము తెలియునని భావింప నగును. ద్రౌపదికి సత్యభామ తన వివాహవిధానమును గూర్చి వర్ణించు ఈ ఘట్టము పోతన భాగవతమున కానరాదు.

ఇంక, సత్యభామను అక్రూర, కృతవర్మ, శతధన్వులలో నెవరికై సత్రాజిత్తు యుద్దేశించి యుండెననుటను ద్విపద భాగవతమును బట్టి కనుగొనుటకు వీలుపడుచున్నది. అక్రూర, కృతవర్మలు, శతధన్వునితో

*" ఆడరుచు సత్రాజితనువాఁడు నీకుఁ*
*గడఁగుచు యీనున్న కన్యయు హరికి*
*నిచ్చె ............ "* ........(ద్వి. భాగ. పు. 1011)

అనుట వలన, శతధన్వుడే సత్యభామకై నిశ్చయింపబడిన వరుడనుట విదితమగుచున్నది. ఆధునిక కవి "పొ. అచ్యుతకవి" రచించిన "శ్రీమదభినవాంధ్ర విష్ణుపురాణమునందును.....

*"అతి దురాత్ముకుఁడసమ్మతుఁడు సత్రాజిత్తు*
*నేము నీకత్తన్వినిచ్చు నడుగ*
*మనకిత్తుమనుచు సంభాషించి మము నిన్ను*
*నపహాస్యమొనరించి యచ్యుతునకు*
*పత్నిగా నిచ్చె ........."* .......( అభినవాంధ్రవిష్ణుపురాణము 4-282)

అని అక్రూర కృతవర్మలు శతధన్వునితో ఆరోపణము చేయుట వలనను, వారు సత్యభామను శతధన్వునికై అడిగిరనియు, అద్దానికి సత్రాజిత్తు సమ్మతించియుండె ననియు తెలియుచున్నది. పైవాని వలన "శతధన్వుడే" సత్యభామకు మొదట నిశ్చితుడైన వరుడని భావింప నగును.

అక్రూర కృతవర్మలును, సత్రాజిత్తును సత్యభామ కరగ్రహణమునకై ముందే యాచించియున్నారు. సత్యభామతో మణియు లభ్యమగునని ఆశించిన వారికి సత్యాకృష్ణుల వివాహము గొప్ప ఆశాభంగము కల్గించినది. కృష్ణుడనిన అక్రూర కృతవర్మలకు భయము, భక్తియున్నవి. కావున తమంత తాము కృష్ణు నెదిరింపగల సమర్థతగాని, ధైర్యముగాని వారికి లేవు. శతధన్వునకు కృష్ణుడనిన ప్రత్యేక ద్వేషమున్నది. అందుచే "అక్రూర కృతవర్మలా కృష్ణుతోడ వక్రుడౌ శతధన్వునితో" (ద్వి. భాగ. పుట 101) సత్రాజిత్తు పై పగదీర్చు కొనుమని ప్రేరేపించినారు. వారట్లు ప్రేరేపించుటకు మరియొక ముఖ్యకారణము కూడ నున్నది. అతనికే సత్యభామ వాగ్దత్త యగుటచే, అతనిని ప్రేరేపించుటయే న్యాయము. ఆకారణము చేతనే, శతధన్వుడును అంత తీవ్రకోపావేశములకు లోనగుటయు జరిగినది.

మొదట, శతధన్వునకే సత్యభామ వాగ్దత్తయైనకన్య యను విషయము పై ప్రాచీన పురాణేతిహాసములందు అంత స్పష్టముగా నీయకపోయినను కొంత సూచనామాత్రముగా నున్నది. కాని ఆధునిక గ్రంథములు ఈ విషయమునకు కొంత కల్పనలు జోడించుచు పై విషయమును స్పష్టముగా నంగీకరించుచున్నవి.

"శ్రీకృష్ణాతిమానుషతత్త్వ" ప్రబంధమునందు శతధన్వుడు సత్రాజిత్తు సోదరి సుతుడు. "సత్రాజిత్తు తదీయ సోదరి సుతున్ జామాతగ నెంచె"ను (2-3-16). కాని సత్యభామ దాని కంగీకరింపక కృష్ణునికి తన నేలుకొనుమని ఒక లేఖ వ్రాసి పంపును. శతధన్వుడు సత్యభామకు మొదట నిశ్చయింపబడిన వరుడనుట నాధారముగా చేసికొని, యిందాతడు సత్రాజిత్తునకు మేనల్లుడను బంధుత్వమును కల్పింపబడినది. "బాంధవుఁడయ్యున్ శతధన్వుఁడిప్పుడిదె సత్రాజిత్తునింజంపె" (సూ. వి. పు. 6-286) అని విష్ణుపురాణమును శతధన్వుని సత్రాజిత్తునకు బంధువుగానే చెప్పుచున్నది. సత్రాజిత్తు వృష్ణి వంశజుడు కాగా, శతధన్వుడు భోజుడగుచున్నాడు. వీరందరు యాదవులే యగుటచే వీరందరు పరంపరా సంబంధులగుదురే గాని, సమీప బంధువులుకారు. సత్రాజిత్తునకు శతధన్వుడు సోదరి సుతుడనుట పూర్తిగా కల్పితము.

జలిజేపల్లి లక్ష్మీకాంతము గారి సాత్రాజితీయ నాటకమునందు శతధన్వుని మిత్రుడైన శంబరాసురుడు, శతధన్వునితో "నీకు కన్య నిచ్చుటకు నొప్పుకొని యిదివరకే వివాహప్రయత్నములు సయితము చేసినాడు కదా! "అని అడుగగా" అయ్యో! అంతయు సిద్ధమైన వివాహమునకే యిన్ని యగచాట్లు, ఏమిచెప్పుదు?" నని శతధన్వుడు వాపోవును. (పుట 20). శంబరాసురునితో శతధన్వుడు సంభాషించుట, సత్యభామ కరగ్రహణమునకై కుట్రలు పన్నుట యాదిగా కల్పితములే అయినను నతడే సత్యభామకు మొదట నిర్దేశింపబడిన వరుడనుట మాత్రము స్పష్టము.

బసవరాజు సీతాపతిరావు గారి సాత్రాజితీపరిణయ నాటకము నందును కృష్ణుడు, సత్యభామను, విదూషకునకు చూపి "శతధన్వునకు నీయ సంసిద్ధమైయున్న కన్యకామణియ యీ కంబుకంఠి?"అని అడుగును. (పుట-47).

వీని నన్నింటిని పరిశీలించి చూచిన సత్యభామకు మొదట నిశ్చయింపబడిన వరుడు శతధన్వుడే యనుట స్పష్టమగుచున్నది.

## సత్రాజిత్తు సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి వివాహము చేయుటకు గలకారణములు

సత్రాజిత్తు తన పుత్రికయగు సత్యభామను మరియొకనికి నిశ్చయించియు, చేసిన వాగ్దానము నతిక్రమించి, కృష్ణుని కామెనిచ్చి వివాహము చేసినాడు. ఇట్లాతడు ప్రవర్తించుటలో గల అతని ఆంతర్యమేమో పరిశీలింపతగును. సూర్యవరప్రసాదితమైన దివ్యము, మహిమాన్వితమైన శమంతకమును, శ్రీకృష్ణు డుగ్రసేనునకై నడుగగా దానినీయ సత్రాజిత్తు నిరాకరించినాడు. ఆ మణిని ధరించి, వేటకేగిన ఆతని తమ్ముడగు ప్రసేనుడు, సింహముచే వధింపబడగా, సత్యమును గ్రహింపలేని సత్రాజిత్తు కృష్ణునిపై ప్రసేనవధ, మణియ పహరణమను రెండు నిందలను మోపగా, కృష్ణుడా యపనిందలను రూపుమాపు కొనుటకై బహుప్రయాసలకు లోనై చివరకు మణిని సంపాదించి, తెచ్చి సత్రాజిత్తున కద్దానినినిచ్చినాడు.

కృష్ణుడు శత్రువును నిర్జించి తనకేర్పడిన మిథ్యాపవాదమునకు కారణమైన శమంతక మును తెచ్చి, అందరికి చూపి తన నిర్దోషిత్వము నిరూపించుకొనగా, సత్రాజిత్తు తన ముగ్గురు తనూజలలో ఉత్తమమయిన "సత్యభామ"ను శ్రీ కృష్ణున కిచ్చినట్లు యీక్రింది శ్లోకములు చెప్పుచున్నవి.

*"ఏవం మిథ్యాఽభి శప్తేన కృష్ణేనా మిత్ర ఘాతినా*
*ఆత్మా విశోధితః పాపాత్ వినిర్జిత్య స్యమంతకమ్* - 44
*కుమార్యశ్చాపి తిస్రోవై దిక్షుఖ్యాతా నరాధిప* - 46
*సత్యభామోత్తమా స్త్రీణాం వ్రతినీచ దృఢవ్రతా*
*తథా ప్రస్వాపినీ చైవ భార్యాం కృష్ణాయతాం దదౌ"* - 47
*(హరి.హరి.ప.అ.38)*

***"భార్యా : కృష్ణాయతా, దదావితిపాఠే తిస్రోఽపిదత్తాః అన్యథా***
***తామ్ ఉత్తమత్వేన ఖ్యాతాం సత్యభామాం ఏవేతి వ్యాఖ్యేయః"***
***(హరి. భారతభావదీప. పు-100)***

అనెడు పై శ్లోకములకు చెప్పబడిన యీ వ్యాఖ్య వలన, సత్రాజిత్తు సత్యభామనే గాక ప్రస్వాపిని, వ్రతిని అనెడు మిగిలిన ఇరువురు పుత్రికలను కూడ కృష్ణునికిచ్చి వివాహము చేసినట్లు తెలియుచున్నది. హరివంశ శ్లోకముల వలన, సత్రాజిత్తు తాను మోపిన నిందకు పరిహారార్థముగానే, సత్యభామను కృష్ణునకిచ్చి వివాహము చేసినట్లు స్పష్టముగా చెప్పక పోయినను, ఆ భావమే ఇందు స్ఫురింప గలదు. ఈ సందర్భమునందలి బ్రహ్మపురాణ శ్లోకములు హరివంశములోని శ్లోకములనే పోలియున్నవి.[1]

సంస్కృత భాగవతము నందు శమంతకోపాఖ్యాన ప్రారంభమున శ్రీ శుకుడాకథను వినిపించుటకు ముందు, పరీక్షిత్తు, అతనితో "సత్రాజిత్తు ఏమి దోషమాచరించెను? కృష్ణుని తన పుత్రికను, మణినెందులకర్పించెను" అని అడుగును[2]. ఈ మాటలును సత్రాజిత్తు దోష ప్రాయశ్చితమునకై సత్యా వివాహము చేసియుండు ననెడు భావము కల్గింప గలదు. కథాగమనమున సత్రాజిత్తు తన దుహితను కృష్ణునకిచ్చి వివాహము చేయుటయే తన పొరపాటునకు తగిన ప్రాయశ్చిత్తమనియు, దీని కన్నను పరిహారము మరియొకటి లేదనియు, ఇది చక్కటి ఉపాయమని తలచి స్త్రీరత్నమైన తన తనయ సత్యభామనిచ్చి మణిని కానుకగా

---

1. *సం. బ్రహ్మ. పు. 16 - 46, 47*
2. *"సత్రాజిత స్స్వతనయాం కృష్ణాయకృతకిల్బిష : ।*
*స్యమంతకేన, మణినా స్వయముద్యమ్య దత్తవాన్" ॥ (భాగ. 10 - 56 -1)*

నర్పించెనని తెలియుచున్నది.[1]

అంతేకాదు, తెలుగు పురాణేతిహాసములందు నిదే భావము కనిపించును.

*"లేని ప్రయి వెట్టితిమి హరి*
*పై నక్కట దీనికిది ప్రాయశ్చిత్తం*
*బైనది యని తన నందన*
*నానతుఁడై సత్యభామ నతనికినిచ్చెన్" ......(హరి పూ.భా.3 - 199)*

అని ఎఱ్ఱన హరివంశమును,

"మిథ్యాపవాద కల్పనాలజ్జితుండగు సత్రాజిత్తు" ( 4-361) "అపరాధక్షమార్పణంబునకై తన కూఁతు సత్యభామ నచ్యుతున కిచ్చెనని" (4-363) కలిదిండి భావనారాయణ కృత విష్ణుపురాణమును,

*"అతడు లజ్జించి యపరాధమణిచి కొనద*
*లంచి యా రత్నమును సుకళాకలాప*
*యైన యా సత్యభామ ప్రియాశయమున*
*వచ్చి సద్భక్తి కానుక యిచ్చె హరికి" ... (1-306)*

అని అల్లాడ నరసింహకవి విరచిత నారదీయపురాణమును, పై అభిప్రాయమునే సమర్థించుచున్నవి.

భామా కలాపమునందలి సత్యభామ,

*"ప్రణతుఁడై మా తండ్రి పంకజాక్షునకు*
*నామణినిచ్చి స్వీయాపరాధంబు*
*తామది నెంచి దండహ్యామానసుఁడై*
*నను గూడ నర్పించె.... " ...... (పుట. 13)*

అని అనుటయు, చూడ, సత్రాజిత్తు అపరాధ ప్రాయశ్చిత్తముగనే సత్యను శ్రీ కృష్ణునకిచ్చి వివాహము చేసినట్లు భావింపవలసివచ్చుచున్నది.

కాని, సత్యాకృష్ణులకు వివాహమునకు కేవలమిది యొకటియే కారణము కాదు. బలమైన వేరొక కారణమున్నది కూడ. సత్రాజిత్తునకు కృష్ణుడనిన భయభక్తులున్నట్లు పై వర్ణనలు బట్టి తెలియును. అతడు భగవంతుడనియు గ్రహించియున్నాడు. అట్టి మహనీయ మహిమాన్వితునిపై తానకారణాపవాదము మోపి బాధించినాడు. గొప్ప పాపము చేసినాడు. ఆ పాపము తీరుటెట్లు? తాను చేసిన ఘోరపాపమునకు ప్రాయశ్చిత్తముగా ఆ దివ్యమణినిచ్చుటే ఉచితము. శ్రీ కృష్ణుడును, దానిని మున్నే కోరియున్నాడు. కావున దానినిచ్చివేయుట తగు మార్గము. కాని సత్రాజిత్తు మణిని మాత్రమే గాక తన దుహితను కూడ నెందులకీయవలయును? అందును సత్యభామ, మున్నే ఒకనికై నిశ్చయింపబడిన కన్య. అట్టి కన్యను కృష్ణునికి నడుగకుండగనే ఇచ్చుటలోని అంతరార్థమేమి?

సత్రాజిత్తు గొప్ప రాజకీయ చతురుడు. తాను వీరుడేయైనను తన కన్నను మించిన కృష్ణుడనిన, అతనికి చాల భయమున్నది. కృష్ణుడప్పటికే కాలయవనాదులను పరిమార్చిన శూరుడు. బలవంతుడు. అట్టి వానితో విరోధము పెట్టుకొనుట ప్రమాదము. కృష్ణుడే, ప్రసేనుని వధించి మణిని నపహరించి యుండునని "రాజసుతు బంధుసముదయంబు" ఒండొరులతో నొయ్య నొయ్యన పలుకుచుండి" రని హరివంశ కథనము (పూ.భా. 3-180). కృష్ణుడనిన

1. *సం. భాగ - 10.56 - 42, 43*

సత్రాజిత్తునకే కాదు, బంధువర్గమునకును భయమే. అందుచేతనే బిగ్గరగా అనలేక, ఒయ్యనొయ్యన పలుకుచుండిరి. భాగవతము నందును, సత్రాజిత్తునకు కృష్ణుడనిన గల భయము స్పష్టముగా చెప్పబడినది. "మణి యీకున్న మీఁద నేమౌనను చు" (భాగ. 10 ఉ. భా. 53) భయపడుచునే తమ్మునకిచ్చినాడు. "ఏమౌనో?" అనుటయే, అతనిలోని భయమును స్పష్టము చేయును. ఇట్లు అతనిలో కృష్ణుడనిన భయము ముందే చోటు చేసికొని యున్నది. ఇప్పుడు అతనిపై తాను ఘోరమైన అపనిందను కూడ వేయుటచే ఆ భయము మరింత అధికమైనది.

సంస్కృత విష్ణుపురాణము వలన, సత్రాజిత్తు మణినపహరించినాడనుచు కృష్ణునిపై తాను మోపిన నిందకు "భయపడి", దానిని తొలగించుకొనుటకై తన తనయ సత్యభామనిచ్చి వివాహము గావించినట్లు తెలియును.[1]

వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమునందును, కృష్ణుడు మణిని కోరుచున్నాడని తెలిసికొనిన సత్రాజిత్తు.....

*"ఇమ్మణి రత్నముం గృష్ణుం*
*డిమ్మనినఁ బ్రియంబుతోడ నీవలయును నీఁ*
*బొమ్మని త్రోచినఁగడు విర*
*సమ్మగు బలవంతు తోడి చలమేమిటికిన్" .... ( సూ. వి. పు. 6 - 252)*

అని భయపడుచునే ప్రసేనుని రప్పించి అతనికిచ్చును. కృష్ణుడు బలవంతుడగుట చేతనే అతనికట్టి భయము కల్గినది. ఈ పురాణమునందు సత్రాజిత్తు, కృష్ణునిపై అపవాదు మోపినట్లుగా చెప్పబడలేదు. యాదవవీరులే, కృష్ణునిపై నేరము మోపుదురు. అట్టి యెడ సత్రాజిత్తు కృష్ణునిపై అపవాదము మోపిన దోషము లేదు కదా? అయినను కృష్ణుడామణిని తెచ్చి యీయగా

*"తన చిత్తంబు భయంబుఁబాయుటకు సత్రాజిత్తుడాత్మీయ నం*
*దన జంద్రాస్యను సత్యభామ యను కన్యకా రత్నమున్"*
కృష్ణునకిచ్చి *"వేడ్కన్ బెండ్లి గావించును" ........(పైది - 6 - 274).*

సింగన ద్విపద భాగవతము నందును సిగ్గును దుఃఖము చిడుముడిపాటు, అగ్గలముగ పొంది, "పద్మాక్షు చిత్తమేపాటినొచ్చెనో యేమి కాగలదో"? యని భయపడుచు "హరి మానసము రోషమడగెడు నట్టి వెరవేదియో" అని ఆలోచించి చివరకు సత్యభామను నిచ్చి వివాహము చేయును. (పుట. 99, 100).

వీనినన్నిటిని బట్టి చూడగా అతనికి మొదట కల్గినది భయమే యనుట సుస్పష్టము. ఆ భయము రాజకీయమైనది. సత్రాజిత్తు ధరాధీశుడనుటను పద్మపురాణ,[2] ద్విపద భాగవతములు,[3] చెప్పినవి. రాజులకు పరస్పర మొండొరులవలన ఆపద వాటిల్లుట సహజము. బలహీనుడు బలవంతునకు భయపడుచుండును. సామోపాయమున కాని, దానోపాయమున కాని, తనకు మిత్రునిగ చేసికొని నిర్భయముగా జీవించును. రాజులు తమ నడుమ బంధుత్వమేర్పరచుకొని, వారి జీవితములకు భద్రత నేర్పాటు చేసికొనుట చరిత్రయందు సహజము. సత్రాజిత్తును, దివ్యమణితో పాటు, తనయను కూడ కానుకగానిచ్చి కృష్ణునితో బంధుత్వము నేర్పరచుకొని, జీవితమునకు భద్రత కల్గించు కొనినాడు.

---

1. *"సత్రాజితోపి, మయా స్యా,భూతమలిన మారోపిత మితిజాత సంత్రాసాత్ స్వసుతాం సత్యభామాం భగవతే భార్యార్థందదౌ" (వి.పు.అం. 4-13-64)*
2. *పద్మపురాణము ...... 10 - 47*
3. *ద్విపద భాగవతము .... పుట 93*

ఆంధ్ర భాగవతమున, ఇతడు మనసులో తర్కించుకొనిన విధమును, చివరకాతడొక నిర్ణయమునకు వచ్చిన విధమును పరిశీలించిన ఈ విషయము మరింత విశదము కాగలదు. కృష్ణుడు మణిని తెచ్చి తనకీయగా మొదట తానుచేసిన పనికి "సిగ్గుపడి", తన దోషమునకు "పశ్చాత్తాపమునొంది"నాడు. దానితోపాటు "బలవద్విరోధంబునకు వెరచుచు" నింటికి జని (ఉ.భా. 10-76) "పాపాత్ముల పాపములను పోగొట్టునట్టి" పరమాత్మునిపై పాపము కలదని నొడివిన, పాపాత్ముడైన తన పాపమునకు పారము లేదని పశ్చాత్తాప పడుచు (10-77), మితభాషిత్వము మాని, హరిపై మిథ్యా ప్రయోగము చేసిన తన తొందరపాటునకు పలువిధముల ఆత్మనిందను చేసికొనినాడు (10-78). కంసారి ప్రసన్నుడై కారుణ్య భావమున తనను మనుచు మార్గమునుగూర్చి అన్వేషించినాడు. రాజకీయ చతురుడు కావున, చివరకు

*"మణియు గూఁతునిచ్చి మాధవు పదముల*
*బట్టుకొంటినేని బ్రతుకు గలదు*
*సంతసించు నతఁడు సదుపాయమగునిది*
*సత్య మితర వృత్తి జక్కఁబడదు... "          ......(భాగ. ఉ. భా. 10-79)*

అని ఒక నిర్ణయమునకు వచ్చినాడు. "ఇభ్భంగి బహు ప్రకారంబుల నేకాంతస్థుడై యింటిలో దన బుద్ధిం బరికించి నీతి గనినాఁడు" (10-80). ఇది రాజకీయ మైన నీతి. ఇట్లాలోచించిన తరువాతనే అతడు "సంప్రాప్తశోభనుడై" నాడు. "నా తండ్రి భీతాత్ముఁడై నన్నున్ జగదేకనాథున కిడెన్" (10-796) అని, సత్యభామ ద్రౌపదికి చెప్పుకొనుటయు ఆధునిక కవికృత భాగవతమున కనగలము.

*"సత్రాజిత్తుండని యెడు*
*ధాత్రీశ్వరు పుత్రి సత్య దామరసాక్షిన్*
*మైత్రి పెను పొంద నంబుజ*
*నేత్రుండు వివాహమయ్యె...." .........(10-47)*

అను సింగన పద్మపురాణము వలనను, కృష్ణుడు "మైత్రి పెనుపొందుటకై" సత్యభామను వివాహమాడినట్లు తెలియును. సత్రాజిత్తునకు కల్గిన భయమును గమనించి దానిని తొలగించి మిత్రత్వము నెరపుటకై సత్యభామను కృష్ణుడు వివాహమాడినట్లు తలంపనగును.

"కృష్ణుడు యాదవుల్లో ముఖ్యుడు. అతనితో మనస్తాపము దేనికి దారి తీస్తుందో? ఈ భయంతో తన బిడ్డ సత్యాదేవిని రత్నాన్నీ కృష్ణునికే అర్పిస్తాడు" అని పుట్టపర్తి నారాయణా చార్యులుగారును వీరి వివాహమునకు రాజకీయమైన కారణమున్నట్లుగానే సూచించినారు[1].

పై వానినన్నింటిని పరిశీలించి చూడగా సత్రాజిత్తు తన సుతయగు సత్యభామను కృష్ణునకిచ్చి వివాహము చేయుటలో రాజకీయ కారణము కూడ ప్రధాన పాత్ర వహించినట్లు నిర్ధరింపవచ్చును.

పై రాజకీయ కారణముల వలన సత్రాజిత్తు శతధన్వునకై నిశ్చయించిన తన కన్యను, వాగ్దానము తప్పి కృష్ణునకిచ్చెను. "ఒకరికీయగలనని ప్రతిజ్ఞ చేసిన కన్యను మరియొకరికిచ్చు ఈ యకార్యమును సాధువులగు వారు పూర్వము చేయలేదు. ఇప్పుడు చేయుట లేదని మనువు చెప్పెను.[2] బహుశః అట్లు చేయుట, పాపమని కాబోలు, ఆ విధముగ అనినాడు. కాని యాజ్ఞవల్క్యుడు ఒకరికి వాగ్దత్త అయిన కన్యను మరింత అర్హుడైన వరుడు దొరకిన

---

1. *సమరరంగంలో సత్యభామ - ఆంధ్రప్రభ, దినపత్రిక, అక్టోబరు 31, 1978*
2. *మను - 9 - 99*

నీయవచ్చునని సమర్థించెను[1]. అతని భావమునే "హేరంబా ఛటర్జీ శాస్త్రి" తన "ది సోషియల్ బేగ్రౌండ్ ఆఫ్ ది ఫార్మ్స్ ఆఫ్ మేరేజస్ ఇన్ ఏనిషియంట్ ఇండియా" అను గ్రంథమున ఇట్లు ప్రకటించెను.

"The importance of the rite is lessened to a certain extent in view of the observation of 'Yagnavalkya' to the effect that a maiden though promised in marriage may be given over to another, provided such a groom is of better attainments" (P. 29)

ఈ కారణము చేతనే సత్రాజిత్తు, శతధన్వుని కన్నను, కృష్ణుడు వీరుడు, శక్తి మంతుడు, సమర్థుడునని భావించుటచే పూర్వపు వాగ్దానమును మీరి తన పుత్రిక యగు సత్యభామను కృష్ణునకు నిచ్చి వివాహము చేసినాడు.

## వివాహాత్పూర్వము సత్యాకృష్ణులు ప్రణయమునకు లోనైనట్లు కవులుకావించినకల్పిత వర్ణనలు :

ప్రాచీన పురాణేతి హాసములందు వాగ్రత్తగా చిత్రింపబడిన సత్యభామ అనంతరకవుల భావ చిత్రణలో స్వయందత్తగా ప్రతిపాదింపబడినది. ప్రాచీన పురాణేతిహాసములన్నిటి యందును సత్యభామ ప్రణయము వివాహానంతరమావిర్భవించినట్లుగనే వర్ణించబడినది.

అతిలోక సుందరి, అద్భుత ప్రణయిని యగు సత్యభామ పాత్ర చిత్రణలో ఔచిత్యమును ప్రదర్శింపవలెననెడి తాపత్రయముచే కాబోలు ప్రబంధ యుగమునకు తరువాత వచ్చిన కొందరు ప్రబంధ కర్తలును, కొందరు యక్షగాన కవులును, ఆధునిక ప్రబంధ నాటక హరికథా కర్తలును సత్యాకృష్ణులు పరిణయమునకు మున్ను, వారిరువురును ప్రణయమునకు లోనైన సన్నివేశములను కల్పించినారు. సీతారాముల నడుమ కూడ, వివాహాత్పూర్వమే ప్రణయము కొనసాగినట్లుగ కొందరు కవులు కొన్ని సన్నివేశములను కల్పించియుండుటయు ప్రసిద్ధమే.

## ప్రబంధములలో :

సత్యభామ శ్రీకృష్ణుని వివాహమునకు ముందే వరించి యుండినదను భావ కల్పనకు "సత్యభామా సాంత్వనము" చేసిన "లింగనమఖి కామేశ్వర కవి" ఆద్యుడనదగును. కృష్ణుని వరియింపగా నెంచి, మున్ను సత్యభామ ఉద్యానవనమున గౌరినోము నోచ అంబ ప్రత్యక్షమై, కోరిన వరమునొసంగినదట. ఈ విషయమును నరకాసురవధార్థమై యుద్ధభూమి కేగి, అచట సత్యభామా విరహముచే తపించు కృష్ణునితో, సత్యభామ పెంపుడు చిలుక, సత్య ప్రణయాతిశయమును వివరించుచు

*"నిన్ను వరియించగా నెంచి మున్ను సత్య*
*భామ యుద్యాన వనమున గౌరి నోచ*
*నంబ ప్రత్యక్షమై కోర్కు లతివ కొనఁగె" .... అని తెలుపును (సత్య. సాం. పుట. 107)*

*"ఏ సతి బెండ్లాడ నెనయ రుక్మిణి చేత*
*వడి సుళ్ళనేప్రొద్దు జడియ వలసె"*

అని సత్యభామను వివాహమాడు విషయమున నాతడు రుక్మిణికి జడిసిన విషయమును కూడ గుర్తు చేయును. నిజమునకు కృష్ణుడట్లు జడిసినట్లుగా పురాణేతిహాసము లందెందు నాధారము లేదు. ఇదియు ఈ కవి రమ్య కల్పనమే.

ఇక ఆధునిక ప్రబంధాదులలో పరిణయమునకు ముందు సత్యాకృష్ణుల నడుమ ప్రణయము కొనసాగినట్లును, వారు విరహమునకు లోనైనట్లును వర్ణింపబడినది. ఆధునిక

1. యాజ్ఞ - 1 - 65

ప్రబంధములలో వీరి ప్రణయ, విరహములు ప్రబంధ నాయికానాయకులను గుర్తు చేయును. పురాణేతిహాసములలో తనకై ఒక ప్రత్యేక వ్యక్తిత్వమును నేర్పరచుకొని విలక్షణమై వెలిగిన సత్యభామ, విరహమునకు లోనై, ఆలంకారిక సంప్రదాయగామినులగు గిరిక, ప్రభావతులవంటి చైతన్య రహితమైన పాత్రయై వర్తిల్లుట అడవి సాంబశివరాయ కృత "సాత్రాజితీపరిణయ" ప్రబంధమునందు చూడగలము. సత్రాజిత్తు యొక్క ఐశ్వర్య భాగ్యమునకచ్చెరువడి, కృతవర్మ వలన శమంతక వృత్తాంతము వినిన కృష్ణుడు, సత్రాజిత్తు ఆహ్వానముపై అతని యింటనాతిథ్యము స్వీకరించి తిరిగి పోవునపుడు పసిండిమేడపై "మెరంగు దీవె" వంటి "మనోహరాకృతి" తోడ సత్యభామ మెరయగా అతని చిత్తమున వలపుల వర్షము కురిసినది. సత్యకును కృష్ణుని "కన్గొనగ నుత్కంఠానురాగోత్థమౌ సంతోషంబు మనంబు నిండినది" (పు. 1 - 191). హరి, నర్మసచివుని వలన సత్య అభిజాత్యనామాదుల నెరింగుటయే గాక, ఆమె తన యందే బద్ధానురాగయను రహస్యమును కూడ నెరింగి ముందడుగు వేయుటకు తగిన ప్రోత్సాహమును పొందును. సత్యభామయు తన ఆత్మీయుల వలన నిరంతరము పెక్కు తెరంగుల హరిరూపసందలను గూర్చి మక్కువతో వినుచుండెను. చవితి చంద్రుని దర్శన కారణముగా తనపై పడిన నీలాపనిందలు బాపుకొనుటకై కృష్ణుడు మణిని సాధించి సత్రాజిత్తునకీయగా, పశ్చాత్తాపమును చెందిన సత్రాజిత్తు మణి సహితంబుగా సత్యభామను కృష్ణునకర్పింపవలయునని తీర్మానించుకొనును. ఈ విషయమును వినిన సత్యాకృష్ణులిరువురును పరిణయోత్సవమునకు కుతూహలముతో నుందురు. కవి, వీరి వివాహ నిశ్చయమునకును, వివాహోత్సవమునకును నడుమ, విరహ వర్ణనకై కొంత విరామమును కల్పించినాడు. కృష్ణునితో తన వివాహము నిశ్చయమైనదని తెలిసియు సత్యభామ, గిరికాది ప్రబంధనాయికల వలె తీవ్ర విరహమునకు లోనై ప్రాణత్యాగమునకు పూనుకొని, చెలుల ప్రయత్నముచే నివారింపబడును. చెలుల ప్రోత్సాహముచే తన క్రీడాశుకముద్వార, నాయకునకు తనవలపు నెరింగించుచు ప్రణయసందేశమంపును. వసురాజువలె నాయికాధ్యానమగ్నుడైయుండు కృష్ణుడాశుకసందేశము నందుకొని, ఆ చెలువ లేఖ యందలి గూఢార్థ సందర్భమునకు తలయూచి, సాహితీ వైచిత్ర్యంబును మెచ్చి ఆమెను చేర కుతూహపడుట నెరింగించి, కూరిమితో తానొక లేఖ వ్రాసి పంపును. ఒకనాడు సత్రాజిత్తు, హితబంధుజనానుమతమున, నొడ్డోలగంబున ఇష్టగోష్ఠియందున్న కృష్ణునికడకేతెంచి, తన తొందరపాటునకు క్షమార్పణను గోరి, మణిసహితంబుగా కన్యామణినర్పింప కుతూహలపడగా, కన్యామణిని మాత్రము గురు వృద్ధజనంబుల ననుమతిని స్వీకరించుటకు సమ్మతించును.

"సాత్రాజితీ పరిణయప్రబంధము" న, సత్యభామ కృష్ణుని చూచిన తరువాత వలపు గొనగా, "సత్యావివాహము" అను శుద్ధాంధ్ర నిర్వచన ప్రబంధమునందు "సత్య వెన్ను నందలి గొనముల్ మెచ్చందగు నందంబును, నెచ్చెలి గమి సెప్పగా విని, తగులూనినది" భాగవత రుక్మిణికి వలె నీమెదియు, ఇందు వినుకలి ప్రేమయేయైనను ఆ రుక్మిణి విరహమునందు శృంగారము కన్నను భక్తి యధికముగా నుండగా,

*"...... వేడ్కలిగురించగ గూర్మి గవుంగలించిన*

*న్నెన్నడు దన్ను గంతునిక నెన్నడు బంటుగ నేలుకొందునో" (సత్యా. వి.పు. - 22)*

అను ఈ ప్రబంధ సత్యవిరహములో శృంగారాతిశయమే అధికము. రుక్మిణి ఒక బ్రాహ్మణునిచే వరునికడకు రాయబారమంపగా, ప్రబంధ సత్య, నెచ్చెలిచే ప్రణయ సందేశమంపినది. నల్ల వానిని నాదు మగని చేయుమనుచు, గంగానమ్మ, రావలమ్మ గంటలమ్మ, గుగ్గిలమ్మ, మున్నగు గ్రామదేవతలను కూడ మ్రొక్కినది. ఎల్లియొ, నేడొ కృష్ణుడు కనుపించి,

వలపించునని చెలి ధైర్యము చెప్పినను, మదనాతురయైన సత్య "అల్ల నల్లని వాఁడు నాకబ్బు వరకు నెట్టులే నూపిరిని బిగపట్టుదాన" అని తపించిపోయినది (పుట-48). ఉద్యానవనమున నేకాంతమున నున్నవేళ, కృష్ణుడు తన ముందు అకస్మాత్తుగ సాక్షాత్కరించి, ఒక తేటినుద్దేశించుచు, అన్యాపదేశముగా నామె అధరపానమాశింపగా, హరి బహుకాంతాకాంతుడను కారణమున ముందు కొంత సంశయించినను, సత్య నెరజాణ కావున తానును అన్యాపదేశముగానే, మధురాధరపానమునకు తన సమ్మతిని నెరింగించినది. సత్య "తను గోరుటెరింగిన" కృష్ణుడు, "తన బిగి కౌగిట" నామెనుచేర్చియు అకస్మాత్తుగా వినవచ్చిన నామె చెలులపిలుపుల కులికి, సత్యప్రార్థనచే నామెను విడిచినాడు.

సత్యలోని మార్పునకు కారణమూహింపలేని చెలులు, శైత్యోపచారములు చేసి కంతుని ప్రార్థింపగా, అచటనే దాగియున్న కృష్ణుడు వీలమరెనని బయట పడినాడు,- మన్మథుడని పొరబడి వారు ప్రార్థించిరి. కొంత తడవునకు నిజము తెలిసికొనిన చెలులు ఆమెను ఆట పట్టించగా, సత్య చెలుల ముందే మనసు స్పష్టమగునట్లు "మోము సొబగు వింతై యొప్పునట్లు నిల్చినది". వసుచరిత్రాది ప్రబంధములందు చెలులు రాయబారములు చేసి నాయికా నాయకుల ప్రణయాభివృద్ధికిని, పరిణయమునకు తోడ్పడగా, ఇందు సత్యాసఖులు కొందరు, సత్యాకృష్ణులను "దొంగ పెండ్లి"కి ప్రోత్సహించినారు. "దొంగపెండ్లి" చేసికొనినను సత్య రుక్మిణికి వలె సాహసించి వరునితో పారిపోవుటకు సిద్ధపడలేదు. "పులుంగు రేనిపయి సెజ్జకు రమ్మని కేలువట్టి" కృష్ణుడు పిలువగా, తల్లిదండ్రుల యెడల భయభక్తుల కారణమున వెనుకాడినది (పైది పుట 78). ఇంతలో సత్రాజిత్తు, తాను మణి కారణముగా గావించిన అపరాధ ప్రక్షాళనమునకై, కృష్ణునకు తన పుత్రిక నీయ ముందుకు రాగా "వెరతోను నొసంగెదవేని మాను మేవెరపును లేదు నా వలన" అనుచు "వేడ్క నొసంగెదవేని నిమ్ము సంబరమున బెండ్లియాడి చెలి బట్టపు రాణుల మిన్న జేసెదన్ .... " (పుట-124) అని చెప్పి స్వీకరించును. ఈ రెండు ప్రబంధములందును సత్రాజిత్తునకును, సత్యాకృష్ణుల నడుమ జరిగిన ప్రణయ వృత్తాంతము తెలియనే తెలియదు.

కాని, "శ్రీ కృష్ణాతిమానుషతత్త్వము" న, తన కల్యాణ విషయమై తండ్రితో వాదించి వలచిన వానినే వరునిగా చేపట్టు సత్యభామ కనిపించును. రామభక్తుడైన విశ్వామిత్రుడే సత్యభామయై జనించెను. కృష్ణుడు సాక్షాత్తు రాముడేయని గ్రహించి. సత్య భక్తి కుదుర "సతతమా గోపాలక ధ్యానయై" "తచ్చరణ సేవ జింతించుచు" అహోరాత్రములు వేగించు చుండెడిది. సత్రాజిత్తు తన సోదరి సుతుడైన శతధన్వుని జామాతగా ప్రకటించుటచే సత్య, తండ్రిపైనల్గి, వినోదములను వన విహారములను, అలంకారములను కినుకతో నిరాకరించినది. ఆమె ప్రవర్తన వ్యత్యస్తముగా నుండుటను గమనించి ప్రయత్నముచే, ఆమె మనో భావములను గ్రహించిన సత్రాజిత్తు, "కృష్ణుడు బహుపత్నీయుతుడనియు, అతని నుద్వాహమాడిన సవతి బాధ కల్గుననియు, గోపకాంతలతో నాతడు రమించుచుండుననియు, ధర్మ విరుద్ధముగా రుక్మిణిని గొంపోయిన నాతనిని, కోరవద్దని హిత బోధ చేయగా, సత్య అతడే తన భర్తయనుచు తన మనోహరుని తృణీకరించిన తండ్రిని మందలించినది. అంతేకాదు,

*"ప్రాజాపత్య విధాన నాకతనికిన్ వైవాహిక స్ఫూర్తి య*
*వ్యాజ ప్రేమనొసర్పకున్న యెడ మీ బంధమ్ము నాకేటికిన్" .... (శ్రీకృష్ణా-2-3-30)*
అని బెదిరించినది..."
శరణుకోరి యైనను కృష్ణునినే పతిగ చేపట్టుదునని నిశ్చయముగా పల్కినది. సత్య వాదనా

పటిమకు చలించిన సత్రాజిత్తు, ఆమెను కృష్ణునకిచ్చుట కంగీకారమును చూపినను ప్రాణాధికమైన శమంతకమును బలరాము డడుగునేమోయని భయపడగా నవ్వి, అట్లు ఆశించు వాడుకాడని కృష్ణుని పక్షమున తానే, అభయమిచ్చి "అనుగ్రహింపగదె నా యిష్టానుసారంబు లోకేశున్, హరిని వివాహమాడ" అని బ్రతిమాలు కొనినది. భాగవత రుక్మిణికివలె దాస్య భక్తిని ప్రదర్శించుచు దూతికచే తనను స్వీకరింపుమని కృష్ణునకు రాయబార మంపినది. తండ్రి తనను శతధన్వునకు, నిచ్చుటకై దలంపగా, అతని పెడబుద్ధి మాన్పితిననియు , తండ్రి ధన కృపణుడనియు, తదీయ రత్నమున్ గొనక ననున్ వరింపరని భయపడుచుండుననియు, అని వివరించుచు "ఉదారగతి న్నను జే కొనందగున్" అని ప్రార్థించినది (పైది 45). ఉదార గతి అనగా మణిని కోరక, నన్ను మాత్రము గ్రహింపుమను ధ్వని యున్నది.

*"నిను నే నీ జన్మంబునఁ*
*బెనిమిటిగాఁ బొందకున్నఁబేరెలమిఁదపం*
*బున మేనుఁదొఱఁగి నినుఁజే*
*కొనెదను మరుజన్మమునను గోపాలమణీ!"* .......(*శ్రీకృష్ణా - 2 - 3-47*)

అని హెచ్చరించినది. మణి నన్వేషించుటకై కృష్ణుడు ద్వారకను విడిచి నాడని తెలిసి సత్య రాత్రింబవళ్ళు మురారి గమనంబు నిరీక్షించుచుండెను. నిజమునకు భాగవతాదులయందు ఈ సమయమున సత్యభామ ప్రవర్తన యెట్లుండినదో మనకు తెలియరాదు. కాని ఈ ప్రబంధ సత్య కృష్ణుని దైవముగా గుర్తించిన దగుటచే, సప్తాహద్వయము గడచియు, కృష్ణుడు తిరిగి రాకపోవుటచే, నాతడసువులు బాసి యుండునని బంధుజనులు భావించినను, సత్య మాత్రము "గోవిందు మార్కొను మృగము గలదె?, కింవదంతుల నాదిరి కృపణమతులు" (142) అని వదంతుల యెడ అవిశ్వాసమును, కృష్ణ దివ్యత్వముపై విశ్వాసమును ప్రకటించినది.

శతధ్వనుడు సాత్రిజితీ కరగ్రహణమునకై, సాహసముతో హెచ్చరికలు చేయగా, "ఒక మాసము దన పరిణయ విషయమాపదగు" నని తన తండ్రి నర్థించినది. ఆ సమయమునకు తన నాయకుడు తప్పక తిరిగి వచ్చునని నమ్మకమున్నదీ ప్రణయినికి.

"నామనోహరుఁగన్నార గాంచిన గాని, చూడనెన్నాళ్ళకీపాడు జగము" (143) అనుచు "గనుల గంతలను గట్టి", "మానసమున సద్భక్తి శ్రీశు గీల్కొల్పి ప్రాయోపవేశమూనిన" ప్రణయ తపస్విని సత్య. శ్రీ కృష్ణుడును సాత్రాజితి భక్తికి, ముదితుడై మణినిచ్చు వ్యాజమున సత్రాజిత్తును ముందుగా దర్శించును. మణి విషయకముగ తా గావించిన అపరాధమునకు పశ్చాత్తాపము చెందిన సత్రాజిత్తు, పుత్రిక మనసెరిగిన వాడగుటచే, అతనికై తపించు తన పుత్రికను స్వీకరించి, ప్రోవుమని అర్థించి, సత్యా కృష్ణుల వివాహమును జరిపించును.

## నాటకములలో :

నాటకములందు సత్యభామ వివాహోత్పూర్వమే శ్రీకృష్ణుని వలచి యుండిన విధమెట్లు చిత్రింప బడినదో చూతము :

కలహ ప్రియుడైన నారదుని మాటలను విశ్వసించిన సత్రాజిత్తు, ప్రసేన వధ, మణిఅపహరణము - అను నేరములు కృష్ణునిపై మోపగా, కృష్ణుడు నారదుని సూచననను సరించి జాంబవంతుని కడనున్న మణిని యాచించి, భంగపడి, తుదకు తలపడగా, కృష్ణుని దైవముగా గుర్తించిన జాంబవంతుడు, తనయను, మణి నర్పింపగా వానిని గ్రహించిన కృష్ణుడు, మణిని సత్రాజిత్తునకిచ్చి, సత్రాజిత్తు వలన కన్యకామణియైన సత్యభామను పొందుటయే, అయ్యగారి విశ్వేశ్వరరావు గారి "శ్రీకృష్ణజాంబవంత యుద్ధ"

నాటకము నందలి ఇతివృత్తాంతము. ఇందును, సత్యభామ, వివాహమునకు పూర్వమే కృష్ణుని వలచి, ఆరాధించిన కృష్ణ భక్తురాలు. కలహభోజనుడు, కలహసంభ్రమ పరతతో, కృష్ణుడు మణిని హరింపగలడని యనగా, సత్యభామ కోపముతో, దివ్యముని యని కూడ నాతనిని పరిగణింపక.....

*"ఉన్నవి కొన్ని కల్పనలు యూహలు కొన్ని సమీకరించి నీ*
*కున్న కళాప్రదర్శనవుటుత్సవమిప్పుడు జూపినావు"* .... *(పుట 41)*

అని మందలించుచు

*"అన్యులను పెండ్లి యాడెడి ఆశ లేదు*
*మతము మార్చుటకావంత మనసు లేదు*
*కృష్ణ మందిర వాసాన కీర్తి గనుట*
*లేక - రుద్రభూములను చీకాకు గనుట"* .....*(శ్రీ కృష్ణ. జాం - నాట - పు - 56)*

అని నిర్ణయించుకొనినది. కృష్ణుని పతిగా పొందుట మహాభాగ్యమని భావించినది. కృష్ణుని పతిగా పొందిన రుక్మిణి వంటి భాగ్యశాలిని తానును కావలయుననుచు, సతతము కృష్ణ ధ్యానము చేసి, కృత కృత్యురాలైన ప్రణయ తపస్విని ఇందలి సత్యభామ.

అయినాపురపు సుందరరామయ్య వ్రాసిన "శ్రీకృష్ణవిలాస" మను 'అష్టమహిషీ కల్యాణ' నాటకమున సత్యాకృష్ణుల ప్రణయేతివృత్తాంతము వర్ణితమైనను, అందు సత్యభామ తన వివాహము కృష్ణునితో నిశ్చయింపబడినదని తెలిసికొనిన పిదపనే, అతనిపై వలపు గొనును. "సుప్రసేనుడ"ను సత్రాజిత్తు చెలికాడు, శత్రుత్వము లేని మిత్రత్వమునకు, సత్యాకృష్ణుల వివాహమే ఉచిత మార్గమని సత్రాజిత్తున కుపదేశించిన పిదప, వారి వివాహమును అతడు నిశ్చయించును.

బసవరాజు సీతాపతి రావు" గారి "సాత్రాజితీ పరిణయ" నాటకమునందు సత్యభామ, శతధన్వునకై నిశ్చయింప బడినదయ్యు, శ్రీకృష్ణునినే వరించును. వ్యక్తిగత ద్వేషముతో రుక్మి, శ్రీకృష్ణునిపై ప్రతీకారము తీర్చుకొనుమని శతధన్వుని ప్రేరేపింపగా, నతడు, కృష్ణుడు తనకు బాల్యమిత్రుడనుటను కూడ పరిగణింపక, కృష్ణుని నారాధించు సత్యను సుముఖురాలిగ చేసికొనుటకై ఆమె చెలికి లంచములిచ్చి, ఆమె వలన కార్యసాధనకు పూనుకొనును. గోపికావల్లభుడని విమర్శింపబూను తన చెలికిని, కృష్ణుని నిందించు శతధన్వునికిని, సత్య కృష్ణుడవతారమూర్తియని తెలియచెప్పును. రుక్మి ప్రేరణచే శతధన్వుడు కృష్ణునిపై మణి అపహరణము, ప్రసేనవధయనెడు నిందలు మోపి, సత్రాజిత్తుని విశ్వసింపజేయగా, ఇది తెలిసిన కృష్ణుడు, తనను చేపట్టునా యనెడు భయముతో సత్య

*"జనకుండాడిన మాటలన్ బరులు పూసల్ గ్రుచ్చినట్లెంచి చె*
*ప్పిన బ్రేమన్ విడనాడి నా యెడల గోవిందుడు గోపించునో*
*నను నిందించునొ లేక నా చెలిమి కానందించి రక్షించునో*
*మన మందేమి తలంచునో, యిటుపయిన్ మత్సౌఖ్యమెట్లుండునో"* *(సాత్రా. ప.నాట.పు. 42)*

అని కలవరపడినది. అంతే కాదు. అతడు చేపట్టకున్న బ్రతుకు వ్యర్థమను నిర్ణయమునకు వచ్చినది. సత్యభామ నంతకు పూర్వమెన్నడును చూసియుండని కృష్ణుడు, ఆమెను వనమున చూడగనే, "సత్య" యనుట గుర్తించి.... "వలచిన కృష్ణుండు తన కేలు పట్టకున్న బ్రతుక నని చెలియ యీమె?" అని సత్య ప్రణయారాధనమును గ్రహించి ముదితుడగును.

ఇంత ఆరాధనము సత్యకున్నను సంప్రదాయము మీరి నడువదు. ఏకాంతమున నున్న సత్యను చూచి, అచటనే చేపట్టుమని కృష్ణుడర్థింపగా, సమ్మతింపక, అతని ప్రేమను గుర్తించినదగుటచే, శతధన్వుడు మణి విషయకముగా కల్పించిన ఆరోపణ మిథ్యయనుట నిరూపించిన తదుపరి తన నుద్వాహమాడుమని చెప్పును. అంతేకాదు "... నిను గోరు నన్ను నెందులకు ద్యజింపనంచని మనోహర! నాకు గరం బొసంగవే?" అని గడుసు దనముతో వాగ్దానము కూడ చేయించుకొనినది. (పైది-పుట-54). మరుబాధకోర్వలేని శతధన్వుడు, మోహమును తనముందు ప్రకటింపగా, సత్య, అతనిని "అన్నా" అని పిలిచి, "పరభామల గ్రహించి, యమబాధల నొందకుమని", తానప్పటికే కృష్ణ పత్ని యైనట్లుగా భావించుకొని హెచ్చరించినది. (పైది పుట 57). ఆమె తననంగీరింపకున్న తన కరవాలమున కాహుతి కాగలదని బెదిరించు శతధన్వునితో, తలపడుటకు కూడ సిద్ధపడినది. మూర్ఖుడైన శతధన్వుడు సత్యను చంపబోవును. కృష్ణ రక్షితయైన సత్య, శతధన్వుని పలుకులను విశ్వసించి, కృష్ణునితో పోరాడుటకు తలపడు తన తండ్రికి, సత్యమును వివరించి, చివరకు తండ్రిచే, కృష్ణునకు దారగా ధారవోయబడినది.

బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి "సత్రాజితీయము" నందు, కృష్ణుడు యాదవ రాజు నకై, మణి నడుగుటకై సత్రాజిత్తు కడకు వచ్చినపుడు, సత్యాకృష్ణులు పరస్పరాకర్షితులై, వారి నడుమ ప్రణయావిర్భావము జరుగును. ఇందలి సత్యది మధురభక్తి. ఇందును శతధన్వుడే, కృష్ణునిపై నపవాదులు కల్పించి సత్రాజిత్తును నమ్మింప యత్నింపగా, సత్రాజిత్తు మణిని తెచ్చి యిచ్చిన వానికే కన్య యని ప్రకటించును. మణిని తెచ్చి యిచ్చుటకై నెలగడువు ముగిసియు, కృష్ణుడు తిరిగి రాకపోవుటచే, సత్య ఆందోళన పడుచు, అతని కొక సందేశమంపును, కంస మిత్రుడును, కృష్ణ ద్వేషియు, శతధన్వ సాహాయ్యకుడునగు శంబరాసురుడు, కృష్ణ సమాగమ లబ్ధికై, దుర్గాదేవి నుపాసించు సత్యభామను వంచించుటకై కృష్ణుడు సజీవుడు కాడనియు, సత్య శతధన్వుని చేపట్టక తప్పదనియు ననుచు దేవి విగ్రహము చాటునుండి హెచ్చరింపగా, అవి దుర్గాదేవి పలుకలని నమ్మిన సత్య, శతధన్వుని వివాహమాడవలసివచ్చు ననెడు భయముతో, చివరకు పూలతీగెలతో నాత్మహత్యకు కూడ పూనుకొనినది. శతధన్వుడాయత్నమును వారించి, ఆమె నపహరించి గొంపోవుచుండ, శ్రీకృష్ణునిచే రక్షింపబడినదై, జరిగినదంతయు తండ్రికి వివరించి, అతనికి కనువిప్పు కల్గించి, తండ్రిచే కృష్ణునికి నర్ధాంగిగ నర్పింబడినది.

హరికథలలో :

దేశి సాహిత్యమనదగు హరికథలయందును, కొన్నిట, సత్యభామ శ్రీకృష్ణునిపై వివాహాత్పూర్వమే మరులు గొనినట్లు వర్ణితము. బలిజేపల్లి వారి సత్రాజితీయమునే చాల వరకు పోలి యున్న, పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్ గారి "శమంతకమణి" అనబడు "సత్యభామా కళ్యాణము" అను హరికథయందును, సత్యభామ తనను వలచిన శతధన్వుని గాక, తాను వలచిన కృష్ణునినే కల్యాణమాడినది. ఆమె శృంగారమిందు మధుర భక్తి భరితము. ఆమె "వాక్సుమంబుల హరి గొల్చుచుండి"నది. సత్య ప్రేమాతిశయమును గ్రహించిన తదుపరియే, కృష్ణుడామె యెడల తన అనురాగమును ప్రకటించును. కృష్ణుని, తన మనో నాథునిగ చేయుమనుచు హరు రాణిని, పురందరు రాణిని, నలిన సంభవు రాణిని, హరి రాణిని, చివరకు గరుడ, గంధర్వ, కిన్నెర కాంతలనందరిని ప్రార్థించినది.

"నిను దక్క నన్యుల న్నే వరింపను జుమ్ము
నను జెట్ట బట్టుమో నల్లవాఁడ
నీ పయి న్నా తండ్రి నింద మోపెనటంచు
నలుగకు మోయి దయాలవాల
చెనటి రుక్మిని లెక్క సేయక రుక్మిణిం
గొన్న ప్రేముడి, జూపు గొల్లవాఁడ
సాధించిమణినెట్లొ శతధన్వు తెచ్చినన్
వాని నొల్ల సమాశ్రితానుకూల
తావకీన సురూప రేఖా విలాస
ములు నిజమ్ము మదీయ హృత్ఫలకముసను
జిత్రితములయ్యె నెటు బెండ్లి సేసి కొనెదొ
భక్త పాలన కృష్ణ గోపాల కృష్ణ" ...... (పుట 12)

అని తన భక్తిని, ప్రేమను, తన నిర్ణయమును ప్రకటించుకొనుచు తనలో తాను వగచినది. తనపై అనురాగము కలదా?యని ఏకాంతమున కృష్ణుడడుగగా "సమ్ముఖమున లజ్జ వాపి నిన్వరిణయ మౌదునంచు, వచియింతురొకో? "అని తన మనసులోని కోరికను నర్మ గర్భముగా మొదట సూచించినను "కోరి వచ్చితి"నని నిర్భయముగా వెల్లడించు కొనుచు, మణినన్వేషించి, తనను చేపట్టు కార్యసాధన చేయుమని పరోక్షముగ ప్రోత్సహించినది. సాత్రాజితీయ నాటకములో వలెనే, ఇందును సత్య, మణి నన్వేషించుటకై పోయిన కృష్ణుని తలంచి, విరహమునకులోనగుచు అతని మురళిగానైన, నెమలి పింఛముగానైన, వ్రేలి భూషగానైన, తొడుకుగానైన పుట్టక, మానవజన్మ నేల నెత్తితిననుచు, ఆత్మనింద చేసి కొనుచు, మధురభక్తి ప్రదర్శన చేసినది.

సత్యభామా కృష్ణులకు, పరిణయమునకు పూర్వమే ప్రణయావిర్భావము పొందినట్లు కవులింతగా కల్పించినను, వీని యన్నిటియందును సత్యభామయే కృష్ణుని కన్నను ముందుగా తన ప్రణయ భావమును తనంత తానుగా గాని, దూతికచే గాని, నాయకునకు ప్రకటించుట గమనింపదగిన అంశము. సత్యభామలో సహజముగా నెలకొనియున్న ధైర్య సాహస ప్రవృత్తి కనుగుణముగా నుండునని తలచి కాబోలు, కవులు సత్యభామనిట్లు చిత్రించినారు.

## సత్యభామను చేపట్టుటకు ముందు కృష్ణుడు పడిన ప్రయాసలు :

సత్యభామా కృష్ణుల వివాహమంత సులభముగా జరిగినది కాదు. సత్యభామను చేపట్టుటకు ముందు శ్రీకృష్ణుడు ఎంతయో మానసిక, శారీరక ప్రయాసలకు లోనుకావలసివచ్చినది. ప్రసేనుని నాతడు వధించినాడనియు, మణిని నపహరించినాడనియు నీలాపనిందలాతనిపై మోపబడినవి. చవితి చంద్రుని చూచుట చేతనే అతనికా నీలాపనింద కల్గినదని పద్మపురాణము మాత్రము చెప్పుచున్నను[1], భాగవతాదులు సత్రాజిత్తు యొక్క తొందరపాటునే కారణముగా చూపుచున్నవి. "రాజసుతు బంధుసముదయంబు" కృష్ణునిపై

1. *అని పలుకు జనాపవాదంబున కులికి కృష్ణుండు చింతించి యింతయుఁ జతుర్థీ చంద్ర దర్శన దోషంబుగానోపు నిట్టి మిథ్యాభియోగంబు బాపుకొనవలయునని యూహించి" (సిం. పద్మ. పు. ద్వి. ఖం. 10 - 58)*

అపవాదము మోపినట్లు తెలుగు హరివంశము చెప్పుచున్నది.[1] దుఃఖ వివశులైన "యాదవ వీరులచే" కూడ నాతడపనిందలు పొందినట్లు విష్ణుపురాణము వలన తెలియుచున్నది[2]. సత్రాజిత్తే స్వయముగ నేరారోపణము చేసినట్లు భాగవతమున కలదు[3]. ఇట్లు అకారణముగా నిర్దోషి యైన తనపై అపనింద రాగా తీవ్ర మనఃక్లేశమునకు లోనై "యే, వ్రణమున్ నా యెడ లేదు నింద గలిగెన్ వారించుటేరీతియో" అని వితర్కమునకు లోనైనాడు (భాగ. 10 - ఉ. భా. 58). అపనిందను రూపుమాపుకొనుటకై అప్టులు వెరవరులు నగు పరిచరులను గొని, చని వింధ్యంబు, ఋక్షమంతంబు నను పర్వతంబులు తిరిగి, యొక్క ప్రదేశమున సింహముచే వధింపబడిన ప్రసేనుని శరీరమును కనుగొని, మణిని కానక, అనతి దూరమున పడియున్న సింహశవము గమనించి, ఎలుగుబంటిజాడలు గుర్తించి యయ్యేలువు నడుగుజాడల బిలముచేరి, సహచరుల బయట నిల్పి, ఏకాంతముగా బిలము సొచ్చి, జాంబవంతుని పుత్రునకు ధాత్రి యొనరించు లాలింపుల యందు ప్రసేన వధా వృత్తాంతంబంతయు గ్రహించి, అంతర్బిల ప్రవేశమొనర్చి, రత్నమును సమీపింప బోవగా, దాది చేసిన ఆక్రందనకు జాంబవంతు డరుగ దేరి, కోపముతో నెదిరింపగా, అతనితో తలపడెను. ఏడెనిమిది దినములు గాచికొని యుండిన అనుచరులు, బిలము విడిచి కృష్ణుడు రాకపోవుటచే ప్రాణములు కోల్పోయి యుండునని తలంచి, బంధువులకు తెలుపగా వారు, శంకించి పరలోక విధులనడపిరి. బలహీనుడై యుద్ధమున నోడిన జాంబవంతుడు "కృష్ణుని" "రాముని"గ గుర్తించి, తన కూఁతు జాంబవతిని నిచ్చి, శమంతక రత్నంబును సమర్పింపగా, ప్రణతుని చేతిది గొనదగనిదైనను, బరివాద పరిహారార్థంబయ్యర్థ విదుండు ఆ మణిని, కూడ గైకొనవలసి

---

1. *"రాజ సుతు బంధు సముదయంబు" - 178*
*"మృగయా తత్పరుఁడై చని*
*మగుడండు ప్రసేనుఁ డేమి మాయయొ రమ్యం*
*బగు మణికై యే పాపులు*
*దెగిరో ప్రాణమునకేమి తెఱఁగిఁక ననుచున్" - 179*
*"ఇవ్విధంబు కృష్ణ కృత్యంబు కానోపునని యొండొరులతోడ నొయ్య నొయ్యన పలుకుచుండ" ....... (హరి. పూ. భా. 3 - 180)*

2. *అంత యాదవ వీరులా ప్రసేనుని చావు,*
*విని యెంతయును దుఃఖ వివశులగుచు*
*దామోదరుఁడు శమంతక ముగ్ర సేనున*
*కిప్పింత మనుచుండు నెల్ల నాఁడు*
*దానికి సామవాదముల సత్రాజిత్తుఁ*
*డీనేరఁడని కదా యిపుడతని*
*తమ్మునిఁజంపి రత్నముఁదెచ్చు కొన్న వాఁ*
*డింత సాహస కృత్య మెవ్వఁడోపు .......(సూ. వి. పు. 6-256)*

3. *"అంత సత్రాజిత్తుండు తన సహోదరుండైన ప్రసేనునింగానక దుఃఖించుచు" - 57*
*"మణి కంఠంబున దాల్చి నేఁడడవిలో మావాఁడు వర్తింపగా*
*మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మర్యాద లేదంచు దూ*
*షణముం జేయఁగ వాని దూషణముఁగంస ధ్వంసి యాలించి" ..(భాగ. 10-ఉ. భా. 58)*

వచ్చినది. (హరి. పూ. భా. 3 - 180 - 195). వారు ఇరువది యెనిమిది దినములు పోరాడినట్లు భాగవతమును, ఇరువదియొక్క దినములు అతుల సాహసమున పోరాడినట్లు విష్ణు పురాణమును చెప్పినవి.

ఇట్లుపలు కష్టములకు లోనై మణిని సంపాదించి, సత్రాజిత్తునకు సమర్పించిన తదుపరియే, సత్యభామా కరగ్రహణ భాగ్యము కృష్ణునకు కలిగినది.

## సత్యాకృష్ణుల వివాహ విధానము :

అష్ట విధ వివాహములలో సత్యభామాకృష్ణుల వివాహ మేవిభాగమునకు చెందునో ఇచట అనుశీలనము చేయబడినది. ప్రాచీన కాలములో అష్ట విధ వివాహ పద్ధతులున్నట్లు మనుస్మృత్యాదులవలన[1] తెలియుచున్నది. అవి బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచికమనియు తెలియనగును.[1]

వేదాధ్యయనము చేసి యాచారవంతుడైన నొక వరుని, తానుగా రప్పించి, యతనిని వస్త్రాదులచే నలంకరించి, మర్యాదలు సలిపి సాలంకృత కన్య నొసగుట బ్రాహ్మ మనబడునని యీ క్రింది శ్లోకము వలన స్పష్టమగును.

*"ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతి శీలవతే స్వయమ్*
*ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః" (మను - 3 - 27)*

సత్రాజిత్తు, తన తనయ సత్యభామకు, మొదట వేరొకని వరునిగ నిశ్చయించియు, శ్రీకృష్ణుడు ఆ వరునికన్నను బలవంతుడు, సమర్థుడని భావించుటచే, కృష్ణుని పిలచి, తన కన్యను నాతనికిచ్చి పెండ్లి చేసెను. "సత్యభామోత్తమా స్త్రీణాం.... భార్యాం కృష్ణాయ తాం దదౌ (హరి. హరి. ప. 38. 47) అని హరి వంశమును, "స్వసుతాం సత్యభామా భగవతే భార్యార్థం దదౌ" (4-13-64) అని విష్ణు పురాణమును, స్వయముగా సత్రాజిత్తే తన సుతను కృష్ణునకు భార్యగా నిచ్చెనని చెప్పినవి. సత్రాజిత్తు, మణితోపాటు సత్యభామను కృష్ణున కర్పించెననియు, అట్లు సమర్పింపగా,

"తాం సత్యభామాం భగవానుపయేమే యథావిధి" (10-56-44) అని అనుటచే కృష్ణుడామెను యథావిధిగా వివాహమాడినట్లును భాగవతమువలన తెలియుచున్నది. తెలుగు నందు, "సత్రాజితుండు" "తన నందన నానతుడై సత్యభామ నతనికినిచ్చెన్" (పూ. భా. 3 - 199) అని హరి వంశమును, "దనుజాధీశ విదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్ ఇచ్చె" నని భాగవతమును (10 ఉ. భా. 80),

*"..... ... సత్రాజిత్తుఁడాత్మీయ నం*
*దనఁజంద్రాస్యను సత్య భామ యను కన్యారత్నమున్ గోపికా*
*జన వక్షోరుహ శాతకుంభ కలశాంతర్వ్యస్త కస్తూరి కా*
*ఘనసారాంచిత పీన వక్షునకు వేడ్కన్ బెండ్లి గావించినన్" ......(6-274)*

అని సూరన విష్ణు పురాణమును వర్ణించినవి.

*"తన దార గైసేసి తన వారుఁ దాను*
*మణి తోడ గామినీ మణి నొప్పనిచ్చె"* నని ....(పుట *100)* ద్విపద భాగవతమును సత్రాజిత్తు "సాలంకృత కన్యయైన" "సత్య"ను వరునికిచ్చినట్లు వర్ణించినది.

---

*1. మనుస్మృతి - 3 - 21*

*"కులమును శీలము విద్యయు*
*గలవానిం బిలిచి ప్రీతిఁగన్నియ నీఁగా*
*వలయు నుదక ప్రదానా*
*కలితంబుగ బ్రాహ్మ కర్మగతి యిది"* .... *(భార. అను. ప. 2 - 222)*

అని భారతమును బ్రాహ్మ వివాహ విధానమును వర్ణించినది. సత్రాజిత్తు "ఉత్తమ కులజుడు, శీలవంతుడు, విద్యావంతుడైన కృష్ణుని తానుగ పిలిచి, మర్యాదలు సలిపి, సాలంకృతయగు కన్యనిచ్చుటచే, మనుస్మృతి, భారతాదులయందు చెప్పిన విధముగా సత్యాకృష్ణుల వివాహము బ్రాహ్మ వివాహమే యగును.

కాని, "శ్రీకృష్ణాతిమానుషతత్త్వ" ప్రబంధమునందు సత్యభామ తనకు, ప్రాజా పత్య విధిని వివాహము చేయుమని తండ్రిని కోరినట్లు కల్పింప బడినది.[1] "మీరిరువురు గలసి ధర్మ మాచరింపుడని చెప్పి తల్లిదండ్రులు వరుని పూజించి, పిల్లనిచ్చుట ప్రాజాపత్య మనబడునని మనుస్మృతి వలన తెలియనగును.

*"సహోభౌ చరతాం ధర్మమితి వాచాను భాష్యచ*
*కన్యా ప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః* ......*(మను - 3. 30)*

బ్రాహ్మమునకు, ప్రాజాపత్యమునకును వివాహవిధి చాల వరకు నొకే విధముగ నుండుట వలన, రెండును ఒకటే అని కూడా కొందరు భావించిరి. కాని ప్రాజాపత్యమందు

"చిట్ట చివర వరకును నీవు ఈమెతోనే సహధర్మమున చరింపవలసియున్నది. ఆశ్రమాంతరమును ప్రవేశింపరాదు. మరి యొక స్త్రీని పొందనురాదు"[2] అను అర్థములుగల మంత్రముతో నిందు విశేషముగా శపథము చేయబడి యుండును. ఆంధ్ర ధర్మ సింధువును నిట్లే చెప్పినది[3]. అప్పటికే ఇరువురు స్త్రీలను వివాహమాడి యున్న శ్రీకృష్ణుడిట్టి శపథమును చేయలేడు. కావున సత్యభామను ప్రాజాపత్యవిధిని కృష్ణుడు వివాహమాడుట పొసగదు.

అన్ని విధముల "సత్యాకృష్ణుల వివాహము" "బ్రాహ్మ వివాహమే" అగును.

## వివాహ వర్ణనము :

రుక్మిణి వివాహార్భాటమును కొంతయైన వర్ణించిన పురాణ కవి "పోతన", సత్యభామా వివాహవర్ణనము సుంత కూడ చేయలేదు. పురాణేతిహాస కవులెవరును పట్టించుకొనక పోయినను భామాకలాపకర్త మాత్రము, సత్యభామకు తెలుగింటి పెండ్లి వేడుకనే జరిపించినాడు. ఖండితయైన సత్య, కృష్ణుని నేరములెన్నుచు ఆతనిని శాస్త్రోక్త విధిని వివాహమాడిన విధమును స్మరించుచు, నిందితునిగా నిపుడాతనిని నిరూపించినది.

*"గుడ జీర మిశ్రమున్ గురుతుగా శిరము పై*
*బెట్టు ప్రమాణమే విపిన మేగె*
*కాడి సూత్రాన జారెడు పయస్సు శపథ*
*మే గంగ గలసె నీ కెరుక గలదె*

---

1. *శ్రీ కృష్ణా. ఖం. 2 - 3 - 30*
2. *గౌతమ ధర్మ సూత్రములు -* ........*పుట - 69*
3. *నీవీ స్త్రీ తోడనే గృహస్థ ధర్మమాచరింపవలెను. ఈ బిడ్డ జీవించిన వరకును, వివాహేతరము గాని, చతుర్థాశ్రమ మనగా సన్యాసముగాని చేయకూడదని యొప్పించి కన్యనిచ్చుట "ప్రాజాపత్య వివాహము".*
   *కొల్లూరి కామశాస్త్రి - ఆంధ్రధర్మసింధువు* .........*పుట - 319*

*అగ్నిసాక్షిగ వీడనంచును ముమ్మారు*
*యజ్ఞేశు మ్రోల నీవనవె మున్న*
*ధర్మేచ - కామేచ - అర్థేచ - నాతిచ*
*రామి యని మరువ నేమనందు?*
*పోని మాంగల్యా తంతు నానేన యనుచు*
*ను - మమ జీవన హేతు వనుచును తాలి*
*గట్టిన యపుడు - బల్కవే? అట్టి బాస*
*లెల్ల కల్ల జేయగ నీక జెల్లె నయ్యా"* .....*(భామాకలాపం, మినర్వాప్రెస్ పుట 71)*

ఇందలి వివాహవర్ణన నేటికిని జరుగు ముమ్మూర్తుల "ఆంధ్రుల యింటి కల్యాణ" విధానమే.

## సత్యభామా కృష్ణుల వివాహము శాస్త్ర సమ్మతమైనదేనా?

సత్యభామా కృష్ణుల వివాహము శాస్త్రసమ్మతమైన దేనా యనుట పరిశీలించుటయు అవసరము. దీనితోపాటు అక్రూర, కృతవర్మ, శతధన్వులు సత్యభామను వివాహమాడ దలచుటలోని ఔచిత్యమును గూర్చి చర్చించుటయు అప్రస్తుతము కానేరదు.

మొదట అక్రూరాదుల అభిలాషలోని ఔచిత్య పరిశీలన చేయుదము. హరి వంశాదులను బట్టి, అక్రూర, కృతవర్మ, శతధన్వులు ముచ్చురును సత్యభామ కరము నాశించినారనుట స్పష్టము. సంస్కృత హరివంశమును బట్టి చూచిన సత్యభామ "శతధన్వ, కృతవర్మల" కన్న మూడు తరముల, ముందు వ్యక్తిగ తోచును. సత్యభామ, కృతవర్మ, శతధన్వు లందరును సాత్వతులే.[1]

తెలుగు హరివంశము నందు సత్యా, కృతవర్మాదుల నడుమ రెండు తరముల భేదము కనిపించుచున్నది.

(1) సత్వతుడు

(2) అంధకుడు
(3) భజమానుడు
(4) విదూరథుడు
(5) శూరుడు
(6) శమి
(7) ప్రతిక్షితుడు
(8) హృదికుడు
(9) కృతవర్మ, శతధన్వుడు

(2) వృష్ణి
(3) యుధాజిత్తు
(4) అనమిత్రుడు
(5) నిఘ్నుడు
(6) సత్రాజి
(7) సత్యభామ

1. సం. హరి. హరి. ప - 38 - 1 - 5

తమ కన్న రెండు, మూడు తరముల ముందున్న స్త్రీని వారు వివాహమాడ అభిలషించి యుందురా? హరివంశమునందీయబడిన వంశవృక్ష వివరణమున కొంత తప్పు ఉండి యుండును. సత్యభామ - అక్రూరుల మధ్య బాంధవ్యమును వివరించుట యందును పురాణేతిహాసములొక క్రమమును పాటింప లేదు. తెలుగు హరివంశమును బట్టి అక్రూరుడు భోజ వంశీయుడు. కాని సంస్కృత హరివంశమును బట్టి అతడు వృష్ణి వంశీయుడును, సత్యభామా కృష్ణుల తరమునకు చెందిన వాడగుచున్నాడు.

సంస్కృత హరివంశమునందిట్లు కలదు :

(1) క్రోష్టు

| గాంధారి (భార్య) | మాద్రి (భార్య) | |
|---|---|---|
| (2) అనమిత్రుడు | (2) యుధాజిత్తు | (2) దేవమీఢుడు |
| (3) నిఘ్నుడు | (3) వృష్ణి (పృశ్ని) | (3) శూర సేనుడు |
| (4) సత్రాజిత్తు | (4) శ్వఫల్కుడు | (4) వసుదేవుడు |
| (5) సత్యభామ | (5) అక్రూరుడు | (5) కృష్ణుడు |

దీనిని బట్టి చూచిన వీరందరును తండ్రి వైపు బంధువులగుటచే వీరి మధ్య సోదరీ సోదర బంధుత్వమే యున్నట్లు కాననగును. కాని భాగవతమునందు యుధాజిత్తు యొక్క మరియొక పుత్రుడైన అనమిత్రునకు "ప్రశ్ని" అను మరియొక కుమారుడు కలడనియు, అతనికి శ్వఫల్కుడు, అతనికి అక్రూరుడును జన్మించిరని పేర్కొనబడినది[1]. దీనిని బట్టి చూచిన అక్రూర సత్యభామ లిరువురికిని "ముత్తాత" అనమిత్రుడే అగుచున్నాడు.

పురాణేతిహాసములలో వర్ణించిన విధమును బట్టి ఆ యా వ్యక్తుల పరస్పర బాంధవ్యమును నిర్ణయించుటకు వీలుపడుట లేదు.

చేది, విదర్భ, భోజ వృష్ణి, అంధక, శైనేయులు - వీరు తండ్రి వంశమునకు సంబంధించిన బంధువులు. వారిలో పరస్పర వివాహములు జరుగుచుండినట్లు ఈ క్రింది ఉదాహరణములవలన బోధపడుచున్నది. భోజ వంశీయురాలైన దేవకి వృష్ణి వంశజుడైన వసుదేవుని పెండ్లాడెను. వృష్ణి వంశజులైన శ్రుతశ్రవ చేది వంశీయుని చేపట్టగా, శ్రుత దేవ, కేకయేశ్వరుని వివాహ మాడెను. కావున అంధక లేక భోజ వంశీయులైన కృతవర్మ, శతధన్వులు వృష్ణి వంశీయురాలైన సత్యభామను వివాహమాడ దలచుటలో దోషము లేదు.

ఇక సత్యా కృష్ణుల వివాహమెంతతవరకు శాస్త్ర సమ్మతమనుట చూతము.

సత్యా కృష్ణు లిరువురును నొకే వంశమునకు చెందిన వారని పురాణేతిహాసము లన్నియు స్పష్టము చేయుచున్నవి. సంస్కృత హరి వంశమును బట్టి చూడ, వీరిరువురును ఒకే

1. *"మరియు ననమిత్రునకు బ్రశ్నియను వేరొక కొడుకుంగలడు. వానికి శ్వఫల్క చిత్రకులు గలిగిరి. అందు శ్వఫల్కునకు గాందినియందక్రూరుండను... జనియించిరి."* (భాగ. 9-712)

తరమునకు చెందిన వారగుచున్నారు. అంతే కాదు వీరిరువురి నడుమ సోదరీసోదర బంధము వంటి సంబంధమే ఏర్పడ నగును.

తెలుగు హరివంశమును బట్టి సత్యభామ, శ్రీకృష్ణునకు ఒక తరము తరువాతదిగా కనిపించును.

(1) వృష్ణి
- గాంధారి
- మాద్రి
  - (2) యుధాజిత్తు → (3) అనమిత్రుడు → (4) నిఘ్నుడు → (5) సత్రాజిత్తు → (6) సత్యభామ
  - (2) దేవ మీఢుడు → (3) శూరుడు → (4) వసుదేవుడు → (5) కృష్ణుడు

వీరిరువురును తండ్రి వైపు బంధువులే అగుటచే వీరిరువురి నడుమ వివాహోచితమయిన బంధుత్వము కానవచ్చుట లేదు. కాని ఎస్. సి. సర్కార్ 'సోదరీసోదరుల మధ్య వివాహ బంధములును, పితృసంబంధమైన కాముక వ్యవహారములును పురాణములందున్నట్లుగా' తన సునిశిత విశ్లేషణమున పేర్కొనెను[1]

"గోత్రాణి" అనగా "వంశాన్" (ఋగ్వే. 3 - 39 - 4) అని అర్థమున్నది. వంశమునకు మూల పురుషుడైన వాని పేరు ఆ వంశమునకు, గోత్రనామమగుచున్నది. శ్రీకృష్ణునకు వార్ష్ణేయుడని పేరున్నది. "వృష్ణిః గోత్రః యస్యసః" అని వార్ష్ణేయ శబ్ద వ్యుత్పత్తి. అనగా వృష్ణి గోత్రమునకు చెందిన వాడని అర్థము. సత్యయు వృష్ణి వంశమునకు చెందుటచే ఆమెయు వృష్ణి గోత్రజురాలేయగుచున్నది. తెలుగు హరివంశము బట్టి సత్య యొక్క వృద్ధ ప్రపితామహుడును, కృష్ణుని ప్రపితామహుడును ఒకే తల్లి బిడ్డలగుటచే వీరిరువురును ఒకే గోత్రమునకు చెందినవారగుచున్నారు. "వరుడును కన్యయు ఒకే వంశమునకు చెందుట సగోత్ర మనబడును."[2] "తండ్రి తరపున ఏడు తరములు, తల్లి తరపున ఐదు తరముల వరకు సపిండులుగా పరిగణింప బడుదురు. తండ్రి వైపున అనగా తాను గాక, తన ముందటి ఆరుగురును సపిండులు, అట్లే, తాను గాక, తన ముందటి నలుగురును తల్లి వైపున సపిండులగుదురు[3].

---

*1. Heramba chatterjee Sastri - The social Background of the forms of marriages in Ancient India - Vol - 1 - P - 131.*

***2. జంగమకోటి శ్రీనివాసరావు - వివాహనిషేధ ధర్మప్రదీపిక - పుట 16***

***3. సం. విష్ణు. పు - 3 - 10 - - 23, 24***

సత్యా కృష్ణులు తండ్రివైపు బంధువు లగుటయేకాదు, వీరి సంబంధము అయిదారు తరముల లోపలదే అగుచున్నది కావున పై కారణములచే సత్యాకృష్ణులిరువురును "సగోత్రీకులే"గాక "సపిండులు" కూడ నగుచున్నారు. "వివాహమందు కన్య తండ్రి యొక్కయు, వరుని యొక్కయు మూలపురుషు డొక ఋషిగా నుండ కూడదని" తెలియుచున్నది.[1] ఏక గోత్రీకుల్లు, సపిండులు వివాహ మాడరాదని మనుస్మృత్యాదులు చెప్పుచున్నవి.[2] తల్లి వంశ మునకు చెందనదియు, తండ్రి గోత్రమునకు చెందనదియునగు కన్య వివాహమాడ తగినది.

వసిష్ఠ, విష్ణు, వరాహ, యాజ్ఞవల్క్యా మొదలగు హిందూశాస్త్రకారులును, తండ్రి తరపున ఏడు తరముల వరకును. తల్లి తరపున ఐదు తరములవరకును చెందిన కన్యకను వివాహమాడుటను నిషేధించిరి. ఎవరైనను ఒక వ్యక్తి, సగోత్రీకురాలితో సంభోగించినచో అతడు చాంద్రాయణము చేయవలయుననియు, తరువాత, ఆ స్త్రీని బహిష్కరింపక, తల్లి లేక సోదరి వలె చూచుచు ఆమె పోషణ భారమును వహింపవలయుననియు, ఒక వేళ ఆ స్త్రీకి శిశువు జన్మించిన, ఈ పాపము ఆ శిశువునకు తగలదనియు, ఆ శిశువు 'కశ్యప" గోత్రమును స్వీకరింప వలయుననియు బోధాయనుడు పేర్కొనెను.
సగోత్రీకుల, సపిండుల వివాహమునకింతటి అభ్యంతరముండగా, సత్యాకృష్ణుల వివాహమెట్లు జరిగినదనెడు సందేహము కల్గుట సహజము.

"క్రోష్టున"కు కీర్తి సంపన్నుడైన "వృజినీ" కుమారుడు కలడనెడు హరివంశ శ్లోకమునకు[3] వ్యాఖ్యానము చేయుచు శ్రీమత్ నీలకంఠుడు, "సత్యభామాదులు శ్రీకృష్ణుని వలెనె క్రోష్టు (వృష్ణి) వంశమునకు చెందిన వారనియు, క్షత్రియులలో సగోత్రీకుల వివాహము చెల్లదు కావున, సాపిండత్వము నివారించి, సగోత్రీకులు జ్ఞాతులైయుండుట కొరకు పురోహితుని యొక్క గోత్రమును స్వీకరించి పరస్పర గోత్ర భేదమున ఆ కాలమున వివాహము జరుగుచుండె"నని తన భారత భావ దీప వ్యాఖ్యానమున వివరించెను.[4] "క్షత్రియాణాం పురోహిత భేదేన గోత్రప్రవర భేదస్తేన" (ధర్మ సింధువు - 3 పూర్వార్థమ్) అనుటచే క్షత్రియులకు పురోహిత భేదముచే గోత్ర భేదమేర్పడుట శాస్త్రము నంగీకరించినదని తెలియుచున్నది.

పూర్వము క్షత్రియులు తమ పురోహితుల కులగురువుల గోత్రములనే తమ గోత్రములుగా స్వీకరించుచుండిరి. దశరథుని పూర్వులకు, జనకుని పూర్వులకును వసిష్ఠుడే కుల గురువగుటచే, వారిది వసిష్ఠగోత్రమై యుండెను. కాని, "నిమి చక్రవర్తి" వసిష్ఠుని వదలి, శతానందుని, తమ గురువుగా వరించినందున వారిది గౌతమగోత్రమైనది. ఆ వంశమున జన్మించిన జానకిని, వసిష్ఠ గోత్రజుడు వికుక్షి వంశజుడైన శ్రీరాముడు గోత్ర భేదమేర్పడిన కారణముగా వివాహమాడుట జరిగినది. ఈ వివాహమును వసిష్ఠ, శతానంద, విశ్వామిత్రాది మహర్షులు, సమీపమున నుండి జరిపించిరి. కావున ఇది శాస్త్ర సమ్మతమైదే యగును.[5]

---

1. *జంగమకోటి శ్రీనివాసరావు - వివాహనిషేధ ధర్మప్రదీపిక - పుట 16*
2. *మనుస్మృతి - 3 - 5*
3. *క్రోష్టోరే వా భవత్పుత్రో వృజినీ వాన్మహాయశాః*
   *వృజినీవత్సుత శ్చాపి స్వాహి : స్వాహాకృతం వరః (హరి. హరి. ప. 36 - 1)*
4. *"క్రోష్టో రేవేతి యథా కృష్ణః క్రోష్టుర్వంశే జాత ఏవం సత్యభామా దయోऽపి తత్రైవ జాతా ఇతి వక్తు మేవ కారః, క్షత్రియాణాం సమానాన్వయేऽపి సాపిండ్య జా, నివృత్యర్థ్వం, పురోహిత గోత్రేణ అన్యోऽన్యం గోత్ర భేదా ద్వివాహా భవంతీతి యుజ్యత ఏవేతి భావః" (హరి. భారతభావదీప. పుట. 94)*
5. *పాలడగు శేషాచలవర్మ - కూర్మరాజీయము - పీఠిక - పుట 22*

వేదాదులందు సగోత్ర వివాహము నిషేధము కాదు. "పితృతః సప్తమాదూర్ధ్వం" అను నిత్యాది శాస్త్ర ప్రమాణములననుసరించి సగోత్రవివాహము దూష్యము కాదని తెలియుచున్నది. తన కులమునందు గాని దేశమందు గాని యనుకల్పముగ సాపిండ్య సంకోచమాచారమై యున్నచో, నట్లు వివాహము దోషము కాదు. అట్లు గాక స్వకుల దేశ విరుద్ధమై నడచునప్పుడట్టి వివాహము నిషిద్ధమేయగునని ధర్మసింధువు చెప్పుచున్నది.[1] ముందు పేర్కొనబడిన హరివంశ శ్లోక వ్యాఖ్యానమువలన ఆనాడు సాపిండ్య సంకోచమాచారమై యున్నట్లుగా తెలియుచున్నది. అది దేశకాలసమ్మతమే అని కూడ అవగతమగుచున్నది. ఈ కారణముచే సత్యాకృష్ణుల వివాహమునకు సాపిండ్యబాధకము తొలగుచున్నది. ఈ విధముగా వారు వివాహమునకు అర్హులగుచున్నారు.

## వివాహమునకు సత్యభామ సమ్మతి :

సత్రాజిత్తు, సత్యభామ వివాహ విషయమున నామె అభిప్రాయమును తెలిసి కొనినట్లు గాని, అభిలాషను గుర్తింప ప్రయత్నించినట్లు గాని, పురాణేతిహాసములందు కనిపింపదు. మొదట శతధన్వునకీయదలచిన నిర్ణయమును గాని, ఆ పిమ్మట దానిని మార్చుకొని కృష్ణునకీదలచిన విషయమును గాని సత్యభామతో సంప్రదించినట్లు కన్పట్టదు. అట్టి అవసరము లేదని సత్రాజిత్తు భావించి యుండవచ్చును. కాని ఆధునిక కవుల రచనలలో సత్యా - సత్రాజిత్తుల నడుమ ప్రగాఢానుబంధము, ఆత్మీయత యున్నట్లు కనగలము. వార్ష్ణేయుడే రాముడని తెలిసికొనిన సత్యభామ, అతనిపై ప్రేమను పెంచుకొని, విరహముచే శృంగార విహారములనుజ్జగించినది. సత్రాజిత్తు ఆమె ప్రవర్తన వ్యత్యాసముగా నుండట కాందోళన పడి,

*"ఎఱుఁగక దోస మేమొ ఘటియించితినా? భవదీయ మాతక*
*న్నొఱఁగి దొసంగొనర్చెన? వినోద విశేషములన్ గలంచి రే*
*నెఱి చెలులెవ్వరేని? తరుణీమణులెవ్వరొ నొవ్వఁబల్కి రే?*
*యఱమఱలేల? బాలిక? యథార్థము నాకెరిగింపవే...."*

*(శ్రీకృష్ణాతిమానుషతత్త్వము 2-3-22)*

అని బ్రతిమాలుకొనును. తనయ మనోగతిని గ్రహింపలేక అర్ధాంగిని బిలిచి విషయము తెలిసికొనును. బహుభార్యాయుతుడైన వానిని వివాహమాడిన వనితకెట్టి సౌఖ్యముండదని తెలిసిన వాడగుటచే, పుత్రికను "డాయగ జేరి", "ఆత్మజ", "మిటారి", "కుమారి" అని ఆప్యాయముగా పిలుచుచు, రాధ, రుక్మిణి వంటి సవతులెందరో ఉన్నారను యథార్థమును వివరించుచు, గోపకుని కోరవలదని హితోపదేశము చేసి "సవతుల్ పోరు సహింపరానిది సుమా" అని హెచ్చరించును. కృష్ణ ప్రణయారాధన సలుపు సత్య ఆ పలుకులను సహింపలేక కృష్ణుడే తన భర్తయని, అతనిని ద్వేషించిన సహింపలేనని, తండ్రి పలుకులు అహంకారముతో కూడియున్నవని క్షంతవ్యములు కావని, అనుచు తననాతనికిచ్చి వివాహము చేయనిచో, తండ్రితో గల బంధము సహితము తెంచుకొనగలనని బెదిరింపగా, సత్రాజిత్తు ఆమె పటుతర సంభాషణలకు వ్యాకులితుడై, చివరకు కృష్ణుని కిచ్చుటకే నిర్ణయించును. ఇంతలో ప్రసేన వధ, మణి యపహరణము కారణముగా కృష్ణునితో నీ విషయము ప్రస్తావించుటకు వీలుపడలేదు. మణిని సాధించి, కృష్ణుడు తెచ్చి యీయగా

---

1. *వివాహ యేన్మను: ప్రాహ, పారాశర్యో యమోంగిరా: యస్తుదేశాను రూపేణ కులమార్గేణ చోద్య హేత్! నిత్యం సవ్యవహారస్స్యాద్వేదాచ్చై తత్రపతీయతే!! ......(ధర్మసింధువు 3 - పు. 294)*

*"... ... ... ... శ్రీకృష్ణ నా పుత్రి యా*
*సాత్రాజిత్రి తపించు నీ కొరకునై స్వాంతంబునందెంచి నీ*
*మైత్రిన్ జేకొని ప్రోవవే కృపను భామా రత్నమున్, రత్నమున్" (శ్రీ కృష్ణా 2-3-186)*
అని తనూజ మనోభీష్ట సిద్ధికై కృష్ణుని అర్థించును. ఇది ఈ ఆధునిక కవి చేసిన కల్పనయే గాని, పురాణేతిహాసముల బట్టి చూచిన సత్యభామ తన వివాహ విషయములో నెట్టి స్వాతంత్ర్యము చూపలేదనియే తెలియుచున్నది.

## వివాహకాలము నాటికి సత్యభామ వయస్సు :

సత్యభామ వివాహకాలము నాటికి, ఆమె వయసింతయని నిర్ణయించుట కష్టమే యైనను, ఆంధ్ర సాహిత్యమునందు లభ్యమగు కొన్ని గ్రంథములను బట్టి, కల్యాణ కాలమునాటికి ఆమె బాలికయా? లేక యువతియా? అనునది కొంతవరకు నిర్ధరింప వచ్చును. వివాహసమయ వర్ణన మందు ఆంధ్రహరివంశము "సత్యభామ" అని మాత్రమే (పూ. భా. 3 - 199) ఆమెను పేర్కొనినది గాని, ఆమెకు ఎట్టి విశేషణములను చెప్పలేదు. "నా నా మనుజేంద్ర నందిత గుణస్థితి లక్షణ", ఉద్దామ ప్రతివ్రతాత్వ నయ ధర్మ విచక్షణతా దయా యశః కామ", "ముఖ ద్యుతి నిర్జిత సోమ" (10. ఉ.భా-81) అని భాగవతమును, 'చంద్రాస్య', "కన్యారత్న"మని (6-274) విష్ణు పురాణమును వివాహకాలమున నాటి సత్యభామను వర్ణించినవి. "పతివ్రతాత్వ నయ ధర్మవిచక్షణతా దయా యశఃకామ" అని భాగవతము అనుటచే పతివ్రతా ధర్మములు తెలిసిన యుక్త వయస్కురాలైయుండునని భావింపనగును.

వివాహమైన కొద్ది కాలమునకే ఆమె తండ్రి మరణించగా, ఆ సమయమున సత్య ప్రదర్శించిన మనో ధైర్యము, సమయస్ఫూర్తి, విజ్ఞతలను బట్టి చూడ, ఆమె బాలిక గాక, ప్రాజ్ఞురాలైన యువతియై యుండవచ్చునని కూడ అనిపించుచున్నది. అర్ధరాత్రివేళ సుప్తుడై యున్న తన తండ్రిని, శతధన్వుడు లుప్తధర్ముడై మణికై వధించి దానిని అపహరింపగా "అత్యంత వేగము గల గుఱ్ఱాలఁ గట్టినట్టి తేరెక్కి చెచ్చెర వారణావతమున కరిగి యా తెఱఁగు నారాయణునకు సర్వంబు నెఱిఁగించెను" (హరి. పూ. భా. 3 - 205). దేహము చ్యుతము గాకుండుటకై, అతనిని "తైలద్రోణి యందు బెట్టించెను" (భాగ. 10 - ఉ. భా. 85). ఇంతటి సమయస్ఫూర్తి మనోధైర్యము ఆటప్రాయముననున్న బాలికకుండదు.

అష్టమహిషీ కల్యాణ ద్విపద ప్రబంధమునందు కల్యాణ సమయమున సత్యభామ "అతులిత యౌవనసీమ" (పుట 234) అని పేర్కొనబడినది. అంతే కాదు,

*"పసిడి తీవెల మేలు పట్టు బాహువులు*
*మేఁటి జక్కవలలోమీటు చన్దోయి*
*తేటి దాఁటుల మీది తేట నూగారు*
*గగనంబు లోపలఁగల మేన నడుము*
*జిగి మీరు పులినంబు చెలువంబు పిఱుదు*
*మించు రంభలలోని మెరపులు తొడలు*
*మంచి తామరల మర్మములు పాదములు*
*నని మెచ్చుదఁగు నవయవముల నొప్పు" ... (అ. మ. క. పు -226)*

అని కల్యాణ కాలము నాటి సత్యభామా సౌందర్య వర్ణనము చేయబడినది. దీనిని బట్టి చూచిన అప్పటికి సత్యభామ నిండు యౌవనము గల, అనగా పదునారేండ్లకు పైబడిన వనిత అని అవగతము కాగలదు.

కాని విష్ణు పారిజాత యక్షగానమున

*"..... బాల్యము నందే*
*చుట్టములు సమ్మతించగ*
*గట్టిగ నా మెడను బొట్టును గట్టిన వాడే"* .......*(పుట 32)*

అని పతియైన కృష్ణుని గూర్చి చెలి "వక్రభాషిణి"తో ననుట వలన సత్యభామ వివాహ సమయమున బాలిక యని అనిపించును. కాని, యక్షగాన రచయిత్రి, సత్యాకృష్ణుల ప్రణయాతిశయబంధమును బలపరచుటకై, బాల్యమునందే, ఆమెకు వివాహమైనట్లు కల్పించి యున్నది. అంతేకాని, ఆ సమయమునకు సత్యభామ బాలిక కానేరదు. పురాణేతిహాసములను బట్టి చూచినను, నాటకాదులందు వివాహమునకు పూర్వము శతధన్వునితో వాదించిన విధమును చూచినను, సత్య, కల్యాణ కాలము నాటికి "యువతి"యే యనుట నిశ్చయము. "అష్ట వర్షాభవేత్కన్యా" అనెడు న్యాయము క్షత్రియకన్య యగుటచే సత్యభామకు వర్తింపకపోవచ్చును.

## వివాహ శుల్కము :

కన్యాదాన సమయమున వధువు తండ్రి వరునికి, కానుకగ కొంత ధనమునుగాని, పశు సంపదనుగాని, శుల్కముగ నిచ్చుట మన దేశమునందాచారముగ నున్నది. వధువునకును తండ్రి ధనధాన్యాదులను, బహుమతిగ నిచ్చుచుండును. అట్లు తండ్రి వలన పొందిన ధనము స్త్రీ ధనమగుచున్నది. దానిపై, వారికి సమస్తాధికారములుండును. రాజు లైనచో తమ పుత్రికలకు దాసదాసీజనమును, కవులను కూడ అరణముగనిచ్చుట కలదు. మహైశ్వర్య సంపన్నుడగు సత్రాజిత్తు, తన తనయ సత్యభామను కృష్ణునకిచ్చి వివాహము చేయునప్పుడు అరణముగ నేమి యిచ్చెనో చూతము.

సంస్కృత హరివంశమునందును, విష్ణుపురాణమునందును సత్యాకృష్ణులవివాహ కాలమున వారికేదియు, ప్రత్యేకముగా ఇచ్చినట్లు చెప్పలేదు. అట్లే తెలుగు హరివశ విష్ణుపురాణములందును పేర్కొనబడలేదు.

"సంస్కృత భాగవతము" నందు మాత్రము సత్యతో పాటు సత్రాజిత్తు మణిని నర్పింపగా, మణి వలదని, కన్యామణిని స్వీకరించినట్లు తెలియుచున్నది.[1] ఇదే విధముగ ఆంధ్ర భాగవతమునందును కలదు. కన్యారత్నముతో, దినమున కెనిమిది బారువుల బంగారమునిచ్చు రత్నమును నీయగా

*"మణి యిచ్చినాఁడు వాసర*
*మణి నీకును, మాకు గలవు మణులు కుమారీ*
*మణి చాలును నంచు గృష్ణుడు*
*మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్"* ....(10 ఉ. భా. - 82)

సత్రాజిత్తును వధించి, శతధన్వుడు, అక్రూరుని యొద్ద శమంతకమణిని దాచియుంచినాడని గ్రహించిన కృష్ణుడు అద్దానిని అక్రూరుని నుండి పొందియు "నీవ తదీయ ధారణయోగ్యుండవు నీక యిచ్చితి" నని (హరి పూ. భా. 3 - 244) దానిని అతనికే తిరిగి యిచ్చివేయును. అట్లే "క్రమ్మర, నక్రూరున కిచ్చెమణి గృపాకలితుండై" (10 ఉ. భా. 101) అని భాగవతమును, "ఆ రత్నము గాందినేయునకు నెయ్యంబారఁగా నిచ్చి పొమ్మనె"నని (6-345) విష్ణుపురాణమును చెప్పుచున్నవి.

---

*1. భగవానాహ న మణిం ప్రతీచ్ఛామో వయం నృప ।*
*త వాస్తాం దేవ భక్తస్య వయం చ ఫల భాగినః ॥ ... (10 - 56 - 45)*

సంస్కృత హరివంశ విష్ణుపురాణ, భాగవతములందు నిట్లే శమంతమును అక్రూరునకే, తిరిగి యీయబడినట్లున్నది. కాని సంస్కృత పద్మపురాణము నందు మాత్రము -

*"సత్రాజితే దదౌ రత్నం స్యమంతాఖ్యం యదూత్తమం*

*దుహిత్రే ప్రదదౌ సోఽపి కన్యాయై మణిముత్తమం" (పద్మ పు.ఉ.ఖం.ఉ. 249-36)*

అని వర్ణించుచు, సత్రాజిత్తునకు కృష్ణుడు శమంతకమును తెచ్చి యీయగా అతడు తన కూతురైన సత్యభామకు ఆ మణినిచ్చెనని చెప్పుచున్నది. కాని ఇది వివాహకాలమున కట్నముగ నిచ్చినట్లుగ మాత్రము చెప్పలేదు. పై శ్లోకము వలన శమంతకమణి సత్యకు తండ్రి వలన లభించినట్లు తెలియుచున్నది. తెలుగు పద్మపురాణమున నీ విషయమే లేదు. బహుశః, సంస్కృత పద్మపురాణమునాధారముగా చేసికొనియే కాబోలు పెక్కురు తెలుగు ప్రబంధ యక్షగానాది కవులు శమంతకమణి సత్యకు సొంతమైనదిగ వర్ణించినారు.

తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధమున ఈర్ష్యామానక్రోధచిత్తయైన సత్య భర్త ప్రణయాపరాధమును క్షమింపలేక ప్రాణత్యాగము చేయదలచియు.,

"ఉవిద యెవ్వతె నోచి యున్నదో యీ శమంతక రత్నమింక నౌదల ధరింప (1-131) అని శమంతకమును తలచి దానికై వగచును. పెక్కురు కవులు ఈ మణి సత్యకు వివాహకాలమునందు స్త్రీ ధనముగా లభించినట్లు భావించినారు. అష్ట మహిషీ కల్యాణ ప్రబంధమున సత్రాజిత్తు, కన్యతో పాటు నీ మణినీయ సిద్ధపడగా, కృష్ణుడు "ఈ వేళ మాణిక్య మేనొల్ల నాకు, నీ వధూమాణిక్యమే చాలు" (పు. 227) అని మణిని తిరస్కరించును. కాని, మరల కల్యాణ సమయమునందు

*"అతుల యౌవన సీమయగు సత్యభామ*
*కతిమోదమున బ్రసేనాగ్రజుఁడపుడు*
*సామజతతులతో సతులతోఁగూడ*
*నా మణి నర్పించె నరణము గాఁగ"* ...... ( అ-మ-క- పుట. 234)

దీనివలన సత్యకు, మణి మాత్రమే గాక సామజతతులు సతులు అరణముగా లభించిరని విదితమగును. నాటక హరికథా కర్తలును ఈ మార్గమును అనుసరించి తమ తమ గ్రంథములందు శమంతకమణి సత్యకు వివాహకాలమునాడు లభించినట్లుగా వర్ణించినారు.

# మూడవ ప్రకరణము

## అష్టమహిషులెవరు ?

కృష్ణ పత్నియగు సత్యభామ అష్ట మహిషులలో నొకతెగ ప్రసిద్ధురాలు. కృష్ణుని పదియారువేల యెనమండ్రు భార్యలలో అష్టమహిషు లెవరనుట తెలిసికొనవలసిన అంశమేయగును.

అష్ట మహిషులలో రుక్మిణి అగ్ర మహిషిగ విఖ్యాతిని పొందినది. కృష్ణుడు, మేనమఱందలయిన "నీళ" అనునామెను వివాహమాడినట్లు తెలుగు హరివంశములోనున్నది. (పూ. భా. 6 - 170, 171). ఇందు కృష్ణుడు, కంస వధానంతరము రుక్మిణిని చేపట్టినట్లుండగా, కంస వధకు ముందే నీళా కరగ్రహణము చేసినట్లు వర్ణింపబడియుండుట వలన, రుక్మిణికన్నను ముందే నీళ కృష్ణపత్ని యైనట్లుగా విదితమగుచున్నది.

కాని దీని వలన రుక్మిణి పట్టమహిషి యనుటకాటంకము కల్గవచ్చునని కాబోలు, భాగవత కారుడు "నీళ" ను గూర్చి ప్రస్తావింపనే లేదు. అదే విధముగా కృష్ణునకు రుక్మిణిని వివాహమాడుటకు ముందే రాధతో అనుబంధమున్నట్లుగా బ్రహ్మ వైవర్త పురాణ[1], దేవీభాగవతాదుల[2] వలన తెలియనగును. కాని భాగవతకారుడు రాధను కూడ స్మరింపలేదు.

*"తేజరిల్లును బేరిళా దేవి యనగ*
*రాజ గోపాలు పట్టపు రాణి.... "* ........*(1-11)*

అనెడి రాధికా సాంత్వన ప్రబంధమందలి మాటలను బట్టి, "ఇళాదేవి" రుక్మిణికన్నను ముందుగా కృష్ణుని పట్టపురాణియని యనిపించును. కాని హరివంశ, విష్ణుపురాణ భాగవతాదులను "ఇళా" ప్రస్తావన చేయనే లేదు. నీళను గాని, రాధను గాని ఇళాదేవిని గాని - అష్ట మహిషులలో నొకరిగా పురాణేతిహాసము లేవియు, నంగీకరింపలేదు. సర్వజ్ఞ సింగ భూపాలుని "రత్నపాంచాలిక" అనెడు నాటికయందు, "కువలయావళి" అను భూమ్యంశ గల కన్యను కృష్ణుడు వివాహమాడినట్లుకలదు. అప్పటికే కృష్ణుని అష్టమహిషులు నిర్ధరింపబడియుండుటవలన, వీరిచే ఆమె కృష్ణుని దేవేరిగ అంగీకరింపబడినను ఆమెయు అష్ట మహిషులలో చేరదు.

ఇక ప్రసిద్ధులగు కృష్ణ కాంతలలో అష్ట మహిషు లెవరనుటను పరిశీలింపవలయును. సంస్కృత హరి వంశమున అష్ట మహిషులను పేర్కొనునపుడు అందు రుక్మిణిని చేర్పలేదు. *"ఏతాః పట్టనాయికా రుక్మిణీతు సాక్షాత్ శ్రీరేవేత్యాసు న గణితా" (భారత భావ దీప పు. 303)* అని, రుక్మిణీదేవి సాక్షాత్తు శ్రీదేవి అవతారము గనుక వీరిలో ఆమెను పరిగణించుట లేదని హరివంశమునకు గల భారత భావదీప వ్యాఖ్యలో చెప్పబడినది. చిత్రశాల ముద్రణము వారి, హరివంశమునందు శ్రీకృష్ణుడు రుక్మిణిని గాక మరి యేడుగురను వివాహమాడెనని *"మహిషీః సప్త కల్యాణీస్తతోఽన్యామధుసూదనః" (హరి. వి. వ. 60 - 40)* అని సంఖ్యా నిర్దేశము చేసియు, వారి నామములను పేర్కొనునపుడు మాత్రము "గీతాముద్రణము" వారి హరివంశమునందు వలెనె యెనమండుగు రతివల నామములను పేర్కొనినది.[3] సూర్యపుత్రియైన యమున అను పేరుగల "కాళింది" మొదటిది. మేనత్తకూతురును అవంతీ రాజకుమారియునైన "మిత్రవింద" రెండవది, అయోధ్యాపతియైన నగ్నజిత్తు కూతురును, సత్య అను పేరు గల "నాగ్నజితి" మూడవది, జాంబవంతుని పుత్రికయైన "జాంబవతి"

*1. బ్రహ్మ వైవర్త పురాణము... పుట 74*
*2. రామామాత్యుడు - దేవీ భాగవతము - 9 - 1543*
*3. సం. హరి. వి.వ - 60 - 40, 41, 42, 43, 44*

నాల్గవది, శ్రుతకీర్తియందు కైకేయుని వలన పుట్టిన భద్ర అను పేరుగల "రోహిణి" అయిదవది, మద్రరాజపుత్రి "లక్ష్మణ" అను వ్యవహార నామముగలది ఆరవది, సత్రాజిత్తు కూతురైన "సత్యభామ" యేడవది, శైబ్యుని పుత్రికయైన "గాంధారి" యెనిమిదవది - వీరు కృష్ణుని అష్టనాయికలని ఆ హరివంశ శ్లోకములకు గల భారత భావదీప వ్యాఖ్య యందు చెప్పబడినది. వీరినే గాక పదహారువేల మందిని యోగరూపముచే అన్ని రూపములు ధరించి కృష్ణుడు ఒకే మారు వివాహ మాడెననియు తెలియుచున్నది [1]. దీనివలన కాళింది, మిత్రవింద, నాగ్నజితి, జాంబవతి, భద్ర (రోహిణి), లక్ష్మణ, సత్యభామ, శైబ్య (గాంధారి) -- ఈ ఎనిమిదిమందియు కృష్ణుని ప్రధాన మహిషులని తెలియుచున్నది. రుక్మిణితో కలసి మొత్తము తొమ్మిది మంది యగుచున్నారు. ఇందువలన, అష్ట మహిషుల సంఖ్యకు ఒకటి అధికమగుచున్నది. హరి వంశములోని అష్ట మహిషుల వర్ణనమును, ఇతర పురాణములతో పోల్చి చూచిన, వీరి సంఖ్యలోను, నామములలోను కొంత భేదము కన్పించుచున్నది. విష్ణు పురాణమునందును, దాదాపు హరివంశమునందు వలెనె కాళింది, మిత్రవింద, నాగ్నజితి, జాంబవతి, సుశీల, సత్యభామ, లక్ష్మణలు కృష్ణ భార్యల నామములుగా పేర్కొనబడినవి.[2] హరివంశములో నున్న శైబ్య (గాంధారి) మాత్రమిందు లేదు. అనగా హరివంశ వ్యాఖ్యననుసరించి వీరు ఏడుగురు కావలయును. శ్లోకములు చాలవరకు ఒకే విధముగా నున్నను, వ్యాఖ్యలయందు మాత్రము చాలా భేదముండుటవలన వారి నామములయందును భేదము ఎక్కువగ కనిపించుచున్నది. "భారత భావదీప" యందు రోహిణి భద్రకు నామాంతరముగ చెప్పబడగా, జాంబవతికే అది నామాంతరముగ విష్ణు పురాణమునకు గల "శ్రీధరస్వామి విరచితాత్మప్రకాశాఖ్య" పేర్కొనినది[3]. అంతేకాదు, జాంబవతి ఋక్షజాతికి సంబంధించినది కావున కామరూపిణి అనునది ఆమెకు విశేషణమనియు, జాంబవతికే రోహిణి నామాంతరమగుటచే, సంఖ్యాధిక్యము గాక ఏడుగురగుచున్నారనియు ఆ వ్యాఖ్య చెప్పుచున్నది. కొందరు రోహిణి అనునది పట్టమహిషి తుల్యయగు వేరొకయామె అని అందురు కాని, అనంతరము వీరి సంతానోత్పత్తి క్రమము చెప్పబడును. కావున అది సరి కాదనియు పై వ్యాఖ్య వివరించినది. కావున దీని వలన రుక్మిణిగాక కాళింది, మిత్రవింద, సత్యయను పేరుగల నాగ్నజితి, కామరూపిణియు రోహిణి నామాంతరము గల జాంబవతి, మద్రరాజసుత సుశీల, సాత్రాజితియగు సత్యభామ, చారుహాసిని యగు లక్ష్మణ అను ఈ ఏడుగురును, కృష్ణుని ఇతర భార్యలగుచున్నారు.

సంస్కృత హరివంశ వ్యాఖ్య, మద్రరాజసుత లక్ష్మణ అని పేర్కొనగా, విష్ణు పురాణము సుశీల అని తెలుపుచున్నది. సుశీల, చారుహాసిని అనునవి లక్ష్మణకు విశేషణములుగా హరివంశ వ్యాఖ్యయందు గ్రహింపబడగా విష్ణుపురాణమునకు వేరొక వ్యాఖ్యయగు విష్ణుచిత్తీయవ్యాఖ్య యందు చతుర్థాంశలో లక్ష్మణకు చారుహాసిని మరియొక పేరుగా చెప్పుచు, లక్ష్మణయు, సుశీలయు భిన్న భిన్న వ్యక్తులుగా పేర్కొనబడిరి[4] అంతేకాదు, మిత్రవింద, సత్య (నాగ్నజితి), జాంబవతి, రోహిణి, సుశీల, సత్యభామ లక్ష్మణ - వీరు ప్రధానులైన ఏడుగురు మహిషులు అనియు, వీరిలో కాళింది మొదలగునవి క్రమముగా విశేషణములనియు ఈ లక్ష్మణ చతుర్థాంశములో చారుహాసిని అనియు కూడ పై వ్యాఖ్య చెప్పుచున్నది.

---

*1. సం. హరి. భారతభావదీప - పు. 303 - 41, 42, 43*
*2. సం. వి. పు - అం 5 - 28 -3, 4, 5*
*3. సం. వి. పు. శ్రీధరస్వామివ్యాఖ్య. పు. 402*
*4. సం. వి. పు - విష్ణుచిత్తీయవ్యాఖ్య - పు. 402*

ఒకే శ్లోకమునకు గల భిన్న భిన్న వ్యాఖ్యలలో ఇట్లు భేదము కనిపించుట గమనింపదగినది. జాంబవతికి రోహిణి నామాంతరమని "శ్రీధరీయాత్మ ప్రకాశాఖ్య" వివరింపగా, "విష్ణు చిత్తీయ" వ్యాఖ్య జాంబవతీ రోహిణులను భిన్న భిన్న వ్యక్తులుగా చెప్పుటయే గాక కాళిందిని సప్త ప్రధాన కాంతలలో చేర్చకపోవుటయు ఆశ్చర్యము.

ఇదే విష్ణు పురాణమునందు, మరల "అయిదవ అంశము" నందు శ్రీకృష్ణ సంతానమును వర్ణించునపుడు "రుక్మిణి, సత్యభామ, రోహిణి, జాంబవతి, నాగ్నజితి, శైబ్య, మాద్రి, లక్ష్మణ, కాళిందులు" ప్రధాన పత్నులుగ పేర్కొనబడిరి.[1] అష్ట మహిషుల నడుమ "శైబ్య"ను చేర్చుటచే మొత్తము వీరు తొమ్మండుగురైరి. హరివంశము శైబ్యను ప్రధానిపత్నిగా పేర్కొని, అదియును మహిషులను తొమ్మండుగురుగ చూపినది. కాని, "అత్రాష్ట ప్రధాన మహిషీ మధ్యే శైబ్యానుప్రవేశః ప్రఖ్యాత పుత్రవతీ ప్రస్తావాత్" (వి. పు. విష్ణుచిత్తీయ వ్యాఖ్య - పు. 411) అని వ్యాఖ్యానించుటచే ప్రఖ్యాతులైన పుత్రులను పొందుటవలననే ప్రధాన మహిషుల నడుమ శైబ్యయు చేర్చబడినదని తెలియుచున్నది. ఇట్లగుటచే శైబ్య అష్ట మహిషులలో నొకతె కాదనియు తెలియనగును. ఇందును మాద్రి లక్ష్మణలిరువురును వేర్వేరని తెలుపబడినది. రోహిణి జాంబవతుల నిరువురును వేర్వేరుగ పేర్కొనుటచే రోహిణి, జాంబవతికి నామాంతర మనెడు శ్రీధరస్వామి విరచితాత్మ ప్రకాశాఖ్య వ్యాఖ్య సరి కాదని తేటపడును. ఇందు "మిత్రవింద" పేర్కొనబడలేదు.

సంస్కృత పద్మపురాణమునందు "రుక్మిణీ, సత్యభామ, కాళింది, జాంబవతి, మిత్రవింద, నాగ్నజితి, సులక్షణ, సుశీల"లు అష్టమహిషులుగా పేర్కొనబడినారు.[2] ఇందలి "సులక్షణ" యే "లక్ష్మణ" కావచ్చును. మడికి సింగన అనువదించిన పద్మ పురాణము యథామూలకముగ నుండుటచే అది ఇచట ప్రస్తావింప బడుచున్నది. 'ఇవ్విధంబున రుక్మిణియును, సత్యభామయును, కాళిందియు, మిత్రవిందయు, నాగ్నజితియును, జాంబవతియును, సులక్షణయును, సుశీలయు నను నెనమండ్రును, దనకు నగ్రభార్యలుగా నిష్టోపభోగంబులననుభవించుచుండె" నను (10-75) సింగన పద్మపురాణమునందును, పైవారే అష్ట మహిషులుగా పేర్కొనబడిరి. విష్ణు పురాణ వ్యాఖ్య మద్రరాజతనయ అనగా "సుశీల" అనియు, హరివంశ వ్యాఖ్య "లక్ష్మణ" అనియు చెప్పుచున్నవి. కాని పద్మ పురాణమున సుశీల సులక్షణ లిరువురును మద్రరాజకన్యలుగా ధ్వనింప చేయబడుచున్నారు. అష్ట మహిషుల వివాహ విధాన వర్ణనము చేయుచు జాంబవతి వివాహవర్ణనాంతరము

*"ధరణి మద్రరాజు తన పుత్రికల స్వయం*
*వర మహోత్సవంబు వరఁగఁజేయ*
*నచట కరిగి కృష్ణుఁడయ్యిద్దఱను దాన*
*తెచ్చి పెండ్లి యయ్యెనిచ్చ వెలయ"* .... (సిం. పద్మ. పు. పైది *10 - 74)*

అని మద్ర రాజ తనయలను వివాహమాడుట వర్ణింపబడినది. సుశీల, సులక్షణలు వారని ప్రత్యేకముగా చెప్పకపోయినను, అయ్యిద్దరిని అనుటచేత, వారిరువురే మద్రరాజతనయలని భావింపనగును. ఇతర మహిషుల నామములను పేర్కొనుచు వారి వివాహ విధానమును కవి తన కావ్యమున వర్ణించియుండెను. కాని వీరిరువురి కల్యాణము మాత్రము ప్రస్తావింప బడక పోవుటవలన ఇచట పేర్కొనబడిన మద్రరాజ కన్యలు వీరిరువురే కావచ్చును. సంస్కృత

1. సం. వి. పు. - 5 - 32 - 1, 2, 3
2. సం. పద్మ. పు. ఉ. ఖం. ఉత్త. అ - 249 - 41, 42

బ్రహ్మపురాణమును[1] అష్టమహిషుల నామ వర్ణన యందు విష్ణు పురాణముతో పూర్తిగా అభేదమును చూపినది. పై సంస్కృత పురాణేతిహాసము లన్నింటికన్నను సంస్కృత భాగవతమునందు దశమస్కంధము ఏబది ఎనిమిదవ అధ్యాయమున అష్ట మహిషుల నామములు స్పష్టముగా పేర్కొనబడినవి. అందలి శ్లోకముల నాధారముగా చేసికొని భాగవత వ్యాఖ్యాతయైన శ్రీధరాచార్యుడును ***"భీష్మీ జాంబవతీ భామా సత్యా భద్రాచ లక్ష్మణా కాళిందీ చేత్యష్టౌ పట్ట మహస్త్రియః" -- శ్రీధరీయోఽయం శ్లోకః"*** (భాగ - పు. 434) అని రుక్మిణి, జాంబవతి, సాత్రాజితి, సత్య (నాగ్నజితి), భద్ర, లక్ష్మణ, కాళింది, మిత్రవిందలను అష్ట మహిషులుగా నిర్ధరించెను. భద్ర పేరును హరి వంశముకాని, విష్ణు పురాణము కాని పేర్కొనియుండలేదు.

సంస్కృత భాగవతమున, ధర్మరాజును రాజసూయ యాగమునకు సిద్ధ పరచుటకై శ్రీకృష్ణుడు భార్యా సమేతముగా రాగా ద్రౌపది, కుంతి ఆదేశానుసారము అష్ట మహిషులకును, ఇతర కృష్ణ భార్యలకును వస్త్రాభరణములనిచ్చి సత్కరించును. అందు రుక్మిణి, సత్యభామ, భద్ర, జాంబవతి, కాళింది, మిత్రవింద, శైబ్య, నాగ్నజితులు - అష్ట మహిషులు అనునట్లు చెప్పబడినారు.[2] ఇందు లక్ష్మణకు బదులు శైబ్య పేర్కొనబడినది. శైబ్య అనగా లక్ష్మణ అగునా? కాని అదే భాగవతమున 83వ అధ్యాయమున శైబ్య అనగా మిత్రవింద అనునట్లు శైబ్య శబ్దము ప్రయోగింపబడినది. శ్రీ కృష్ణుడు సకుటుంబముగా కురుక్షేత్రమునకు గ్రహణస్నానమునకై పోయిన సమయమున పాండవులను కలిసి కొని ముచ్చటలాడుచుండగా, పాంచాలి అష్ట మహిషులను చూచి వారి వారి వివాహ వృత్తాంతములను వినిపింపుమని అడుగువేళ - వారి నిట్లు సంబోధించును.

*"హే వైదర్భ్యచ్యుతే భద్రే హే జాంబవతి కౌశలే ।*

*హే సత్యభామే కాళింది శైబ్యే రోహిణి లక్ష్మణే ॥ "* ... *(భాగ - 10 -త అ. 83-6)*

వైదర్భి (రుక్మిణి), భద్ర, జాంబవతి, కౌసల (నాగ్నజితి), సత్యభామ, కాళింది, శైబ్య, రోహిణి, లక్ష్మణ -- అని ఇచట తొమ్మండుగురున్నారు. దీనికిగల శ్రీధరీయ వ్యాఖ్య యందు "రోహిణి" ఒక "పట్టమహిషీతుల్య" అని చెప్పబడినది.[3] కావున ఆమెను అష్ట మహిషులలో ఇందు చేర్చవలసిన అవసరము లేదు.

అష్ట మహిషుల సంతాన వర్ణనము చేయునపుడును రోహిణియు ఆ పట్టికయందు చేర్చబడినది. దీప్తిమంత తామ్రపత్రాదులు రోహిణీకృష్ణుల సంతానమని చెప్పబడిన శ్లోకమునకు[4] గల వ్యాఖ్యను బట్టియు, రోహిణి అష్ట మహిషులలో నొకతె కాదని తెలియగలదు. శ్రీకృష్ణుడు నరకుని చెరనుండి తెచ్చిన వనితలలో నీమెయు ఒకతె. అష్టమహిషులందరును తమ తమ కల్యాణవృత్తాంతములను చెప్పునపుడు వారి నామములను కూడ పేర్కొనినాడు.[5] ద్రౌపది రోహిణిని కూడ సంబోధించి ఆమె వివాహవృత్తాంతమును చెప్పుమని అడుగును. అట్లు ఇతరులందరు తమ తమ వివాహవృత్తాంతములను వర్ణింపగా, ఆ వర్ణనలో పేర్కొనబడకుండా విడువబడిన నామములలో రోహిణి మాత్రమే మిగిలినది. కావున నరకుని చెరనుండి కృష్ణుడు విడిపించి, వివాహమాడు కథనమును వినిపించిన కాంతలలో రోహిణి

---

1. బ్రహ్మపురాణము - 201 - 3, 4, 5
2. సం. భాగ - 10 - 71 - 41, 42
3. "రోహిణీనామ కాచిత్పట్టమహిషీతుల్యా" (భాగ, శ్రీధరీయవ్యాఖ్య, పు. 524)
4. సం. భాగ - 10 - 61 - 18
5. భాగ - 10 - 83 - 40

కూడ ఒకతె కావలయును. అట్లు గ్రహింపబడిన పదునారు వేల స్త్రీలలో నీమె ప్రముఖురాలయయుండును. సంతాన వర్ణనమునందును రోహిణి పేర్కొనబడుటకు కారణమిదియే. ఇతర కాంతలకును బిడ్డలున్నారని చెప్పుటకే రోహిణీ విషయము పేర్కొనబడినది[1]. కావున రోహిణి అష్ట మహిషులలో నొకతె కాదు.

ఇక శైబ్య అనగా మిత్రవింద అనుటకు - "శైబ్యేహే మిత్రవిందే" (పు. 524) అనెడు శ్రీధరీయ వ్యాఖ్యానమే ఆధారము. శైబ్య అనగా గాంధారి అని హరివంశ భారత భావ దీప వ్యాఖ్య చెప్పుచున్నది. "రాజితాన్వయ గాంధార రాజకన్యఁ గోరి గ్రహియించె..." (హరి ఉ. భా. 6 - 258) అని కృష్ణుడు గాంధారిని వివాహమాడుట తెలుగు హరివంశమున చెప్పబడినది. ఆ గాంధారికి శైబ్య నామాంతరమున్నట్లు ఇందులేదు. శైబ్యను గూర్చిన వృత్తాంతము వివరముగ నెందును కనిపించుట లేదు.

కాని, ఆధునిక ప్రబంధమైన "శ్రీకృష్ణాతిమానుషతత్వ ప్రబంధమున" శైబ్య, "శిబి" అను వాని కూతురనియు, కరవీర పురాధిపతియగు ఆమె పినతండ్రి "సృగాలవాసు దేవుడు" ఆమెను పెంచెననియు, "చారుహంసిని" ఆమె పేరనియు తెలియుచున్నది. (ఖం. 5 - 1 - 18). రాక్షస వంశమున పుట్టుటచే కపట స్వభావము కలదై శ్వేత కేతువను అమాయిక బ్రాహ్మణునకు మరులు గొల్పి, చివరకాతడు తన ప్రేమను ప్రకటింపగా, కత్తిని ఝళిపించి నోటికి వచ్చినట్లు తూలనాడును. కృష్ణుడు, తన గురువైన సాందీపని యొక్క శిష్యుడైన శ్వేత కేతువునకు కల్గిన అవమానమును సహింపజాలక ఆమెను స్వాధీనపరచుకొని పరివర్తనము కల్గించి తనపై అనురాగము గొనునట్లు చేసి, చివరకు వివాహమాడును. రుక్మిణీ వివాహానంతరము కృష్ణుడీమెను పరిణయమాడుటకు అంగీకరించును. ఈ ప్రబంధకవియు, అష్టమహిషులను పేర్కొనునపుడు శైబ్యనందు చేర్చలేదు. విష్ణు పురాణ వ్యాఖ్యయు, "శైబ్య" ప్రసిద్ధసంతానవతి కావున అష్ట మహిషుల నడుమ చేర్చబడినదని చెప్పినది. దీనిని బట్టి భాగవతమునందు మిత్రవింద అను అర్థమున ప్రయోగింపబడిన శైబ్యకును, హరివంశములోని "గాంధారి" అను నామాంతరమున ప్రయోగింపబడిన శైబ్యకును సంబంధము లేదని తెలియనగును.

ఇక ఆంధ్రసాహిత్యమున అష్ట మహిషులను పేర్కొనిన విధమును చూతము. ఆంధ్ర భారతమును, ఉత్తర హరివంశమును అష్ట మహిషు లెవరనుటను వివరింపలేదు. ఎఱ్ఱన హరివంశము సంస్కృత భాగవతము ననుసరించినను "రుక్మిణీ వివాహానంతరంబుఁ గ్రమంబున కృష్ణునకు మిత్ర విందయు, జాంబవతియు, సత్యభామయు, గాళిందియు, నాగ్నజితియు, లక్షణయు సుదంతయు నన నేడ్వురు భార్యలైరి" ( హరి ఉ. భా. 3 - 176) అని అనుచు, భద్రకు బదులు సుదంతను పేర్కొనెను. అనగా దీనిని బట్టి సుదంత అనగా భద్ర కావచ్చుననిపించుచున్నది. కాని పారిజాతాపహరణ ప్రబంధమునకు వ్యాఖ్యాతయైన దూసి రామమూర్తిగారు "సుదంత ఈమెకు నాగ్నజితి అను నామాంతరము" అనినారు.[2] "సూరన" విష్ణుపురాణమున ప్రత్యేకముగ అష్టమహిషులను పేర్కొనలేదు. కాని కృష్ణ సంతాన వర్ణనము చేయుచు "ప్రద్యుమ్నాదులయిన రుక్మిణీ తనూజులును, భానుకాదులయిన సత్యభామా కుమారులును, సాంబాదులయిన జాంబవతీపుత్రులును, నాగ్నజితీ సూనులైన భాను విందాదులును, సంగ్రామజితాదులయిన శైబ్యాత్మజులును, ప్రకాశాదులయిన లక్ష్మణా పత్యంబులును, శ్రుతాదులయిన కాళిందీసుతులును మొదలుగా" (8-146) అని కృష్ణ పత్నులను వారి సంతానమును పేర్కొనెను. ఇందు రుక్మిణి, సత్యభామ, నాగ్నజితి, శైబ్య, లక్ష్మణ, కాళింది - వీరు ఏడుగురు మాత్రమే చెప్పబడినారు. భద్ర, మిత్రవిందయు, ఇందు చేర్చబడలేదు. సంస్కృత భాగవతము నందు సంగ్రామజితాదులు భద్ర సంతానముగ

1. *"రోహిణ్యాస్సుతానాముక్తిరన్యాపా ముపలక్షణార్థం" (భాగ. శ్రీధర - వ్యా. పు. 448)*
2. *సురభి వ్యాఖ్య ... పుట 29*

చెప్పబడగా[1] ఇందు వీరు శైబ్యాత్మజులైరి. దీనిని బట్టి చూచిన శైబ్య అనగా భద్ర కావచ్చునని అనిపించుచున్నది. అట్లయిన పై అష్ట మహిషుల క్రమములో మిత్రవింద పేర్కొనబడక విడువబడినదని తలంప వచ్చును. శైబ్య అనగా కొన్ని చోట్ల లక్ష్మణగా, కొన్నియెడల భద్రగా కొన్నియెడల గాంధారిగా, కొన్ని తావుల మిత్రవిందగా చెప్పుకొనవలసి వచ్చుచున్నది.

"ఇట్లు హరి రుక్మిణియు, జాంబవతియు, 'సత్యభామయు, కాళిందియు, మిత్రవిందయు, నాగ్నజితియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు ననగ నెనమండ్రు భార్యలైరి. మరియు నరకాసురని వధియించి తన్నిరుద్ధకన్యల షోడశ సహస్ర సంఖ్యల రోహిణి మొదలైన వారిం బరిగ్రహించె" (10 - ఉ. భా. 58 - 148) ... అని భాగవతము వర్ణించిన అష్ట మహిషీ వర్ణనమే నిర్దుష్టముగాను, ప్రసిద్ధముగాను నున్నది. రోహిణిని అష్ట మహిషులలో నొకతెగ, పోతనయు చేర్చలేదు. ఆంధ్ర సాహిత్యములో ఆ తరువాత వచ్చిన పెక్కురు కవులు ఈ వర్ణనమునే అంగీకరించి తమ కావ్యము లందాదరించినారు. భాగవత వర్ణనమునననుసరించి...

*"వరలు రుక్మిణి జాంబవతి సత్యభామ*
*మెరయ కాళిందియు మిత్రవిందయు*
*సత్యయు భద్ర లక్షణయును ననఁగ*
*నత్యుదాత్తత భామ లయ్యెనమండ్రు*
*పట్టపు దేవులై భాసిల్లు చుండ... " -- (ద్వి భాగ - పు. 112)* .. అని ద్విపద భాగవతమును, "ఈ రీతి కృష్ణు డింపార రుక్మిణి సత్యను లక్ష్మణ జాంబవతిని గాళిందీ భద్రను, గర మర్థిన్ మిత్రవిందను, నాగ్నజితిని ముదంబు తోడఁ బెండ్లి యై" (శ్రీకృష్ణ ఖం. గుజనీ ప్రతి - 7 - పు. 373) ... అని బ్రహ్మ (కై) వైవర్త పురాణమును,

*"భవ్యమగు రుక్మిణియును జాంబవతి సత్య*
*భామ కాళింది మిత్రవిందా మృగాక్షి*
*నాగ్నజితి భద్ర లక్షణా నలిన ముఖియు*
*ననఁగ నెనమండ్రు ప్రియభార్యలగుచు నుండ" ... (పు. 1.331)*

అని అల్లాడ నరసింహకవికృతమగు నారదీయ పురాణమును వర్ణించినవి.

కాని బ్రహ్మ పురాణము మాత్రము అష్ట మహిషులనుచు పది మందిని పేర్కొని కొంత గందరగోళమును సృజించినది.

*" ... ... .... ....*
*సీ॥ హరికి రుక్మిణి గాక యతివ లేడ్గు*
*తే॥ రైరి కాళిందియను లేమ యట్లె మిత్ర*
*విందం సత్యయు రోహిణి వెలఁదు లందు*
*జాణయగు నాగ్నజిత్తియు జాంబవతియు*
*మద్రరాజాత్మ జాతయు మాన్యలైరి" .......(బ్రహ్మ. పు. 3.92.1175)*

అని అష్టమహిషులుగ రుక్మిణి, కాళింది, మిత్రవింద సత్యభామ, రోహిణి, నాగ్నజితి, జాంబవతి, మాద్రులను కొంత భేదముతో పేర్కొనుటయే గాక "సాత్రాజితియు సత్యభామయు లక్ష్మణయు ననువారునుం గలరు" (పైది - 1176) అని మరల సాత్రాజితి సత్యభామ లక్ష్మణలను ప్రత్యేకముగ వేరు వ్యక్తులుగ పేర్కొనినది. సాత్రాజితియన్నను, సత్యభామయన్నను ఒకరే. నాగ్నజితికే సత్య అను నామముండుట వలన మిత్రవింద

*1. సం. భాగ. 10-61-17*

తరువాత పేర్కొనబడిన సత్య నాగ్నజితియే యగును. మద్ర రాజాత్మజ లక్ష్మణ అని సంస్కృత భాగవతమువాచ[1]. అట్టి యెడ మద్రరాజాత్మజ అనియు, లక్ష్మణ అనియు ఇద్దరు వేరు వేరైన వ్యక్తులకు వలె చెప్పుట అనవసరము. ఈ ఒక్క పురాణము తప్ప మిగిలిన పురాణములన్నియు భాగవతమార్గమునే అనుసరించినవి.

"హరి, రాక్షస వివాహంబున రుక్మిణిం బెండ్లియాడి తదనంతరంబ క్రమంబుగా జాంబవతీ, సత్యా, మిత్రవిందా, కాళింది, లక్షణా, భద్రా, నాగ్నజితులనువారి యథా విధిగా గ్రహణంబు సేసికొనియె" (స్కం. 4 - 568) అని ఆధునిక కవి రామామాత్య అనువాద కృతియగు "దేవీభాగవతము" నందును భాగవతమునందలి అష్టమహిషులే పేర్కొనబడిరి.

*పారిజాతాపహరణ ప్రబంధము --*

*"..........రుక్మిణీ సత్య జాంబవతి మిత్ర*
*విందా భద్ర సుదంత కాళింది లక్ష*
*ణ యనగా మున్న కలరబ్జనాభునకును*
*మహిషులైనమంద్రు సమతాభిమానవతులు" .......(పారి 1 - 38)*

అని రుక్మిణీ, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, భద్ర, లక్షణ, సుదంత, కాళిందులను అష్ట మహిషులుగా వర్ణించినది. ఇచట సుదంత అనగా దూసి రామమూర్తి గారనినట్లు "నాగ్నజితి"గా అంగీకరింపవలయును.

ఇదే విధముగా కూచిమంచి జగ్గకవి సుభద్రాపరిణయమునందును (5-108), సత్యభామా సాంత్వనమునందును (పు. 44), ఆధునికమైన సాత్రాజితీపరిణయమునందును (5-113) పై వారే అష్ట మహిషులుగా పేర్కొనబడినారు. చెంగల్వకాళకవి రచించిన రాజగోపాల విలాసమునను వీరే అష్ట మహిషులుగ కవిచే అంగీకరింపబడి, వారు అష్ట విధ నాయికావస్థల ననుభవించుచున్నారనుటయు, ప్రబంధమునందు వర్ణింపబడినది.

అంతేకాదు, భామాకలాపమునందును (మినర్వా ముద్రణ, పు. 60), స్త్రీల పౌరాణిక పాటలలోను (రుక్మిణీ దేవి సీమంతము పు. 159, 160), పై విధముగా, రుక్మిణీ, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, భద్ర, సుదంత, కాళింది, సులక్షణలే అష్ట మహిషులుగా చెప్పబడినారు.

నాగ్నజితికి పర్యాయనామముగా "సుదంత"పై గ్రంథములందు పేర్కొనబడగా, ఈ క్రింది గ్రంథములందు నాగ్నజితి (సత్య) అనియే, కవులు వ్యవహరించి, భాగవత మార్గమున అష్ట మహిషుల నామములను వర్ణించినారు. అష్ట మహిషీ కల్యాణమునందు, హరి....

*"మదవతీ కులశిరోమణి రుక్మిణిని*
*వదనేందు సౌభాగ్యవతి జాంబవతిని*
*నమిత గుణ స్థేమయగు సత్యభామ*
*గమల శోభన గాత్రి కమలాప్తపుత్రి*
*నమిత శోభన విందయగు మిత్రవింద*
*నమర జాతిస్తుత్య యైనట్టి సత్యఁ*
*బ్రకట లావణ్య సంపద్భద్ర భద్ర*
*సకల కల్యాణ లక్షణను లక్షణను" ....(అ. మ. క. పుట. 282)*

... వివాహమాడినట్లు వర్ణించెను. ప్రభావతీప్రద్యుమ్నమునందును (2-15) రుక్మిణీ, సత్యభామ, జాంబవతి, కాళింది, మిత్రవింద, భద్ర, లక్షణ, నాగ్నజితులే అష్ట మహిషులనునట్లుగా వర్ణింపబడినారు.

విష్ణు పారిజాత యక్షగానమునందు...

---

*1. "సుతాంచ, మద్రాధిపతేర్లక్ష్మణాం లక్షణైర్యుతామ్" (భాగ. 10-58-57)*

*"... రుక్మిణీ, జాంబవతియు కాళింది*
*యుఱ మిత్రవిందయు నాగ్నజితియును*
*లలితురాలగు భద్ర లక్ష్మణ యనెడి*
*వేసాల మారులు వింత గత్తెలును*
*నాసాటి సవతులెన్నంగ నేడ్గురును"* .... *(పుట 30)*

అని సత్యభామ తన సవతులను పేర్కొనును. శ్రీకృష్ణ భాగవతమను "సత్యా వివాహమ" నబడు హరికథయందును (పుట.168), శ్రీకృష్ణతులాభారమను తులసీదళ మాహాత్మ్య మనబడు హరికథయందును (పుట. 5) పై వారే అష్ట మహిషులుగా పేర్కొనబడినారు.

వీనిని బట్టి చూచిన రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, భద్ర, మిత్రవింద, నాగ్నజితి, లక్షణలే అష్టమహిషులనుట స్పష్టము. ఈ అష్టమహిషుల నామములు పేర్కొనుటయందు పురాణేతిహాసములు కొంత కొంత విభేదించినను సత్యభామ అష్ట మహిషులలో నొకతె అను విషయమును మాత్రము సమస్త పురాణేతిహాసములును, తదితర సర్వ గ్రంథములును అంగీకరించినవి.

## అష్టమహిషులలో సత్యభామ స్థానము

వివాహ క్రమమును బట్టియు, వివాహ విధిని బట్టియు అష్ట మహిషులలో సత్య స్థానమెట్టిదో నిర్ణయింపవలయును. రుక్మిణీదేవి శ్రీదేవి అవతారము కావున ప్రధాన మహిషులను పేర్కొనునపుడు ఆమెను అందుచేర్చుటలేదని సంస్కృత హరివంశ భారత భావ దీప వ్యాఖ్య రుక్మిణి ప్రత్యేకతను చెప్పినది.[1] సంస్కృత పద్మపురాణమును అష్ట మహిషులందరిలోను రుక్మిణి మొదటిదనియు, మహాత్మురాలనియు ఆమె ప్రథమస్థానమును, ప్రాముఖ్యమును సూచించినది[2]. ఇతర దేవేరులనామముల నిర్దేశమున విభిన్నతను చూపినను, రుక్మిణి పట్టమహిషి అనుటలో పురాణేతిహాసము లన్నియును ఏకత్వమునే ప్రకటించినవి. అష్ట మహిషులందరిలోను నీమెనే కృష్ణుడు మొదట భార్యగా స్వీకరించుటచే, ఈమెయే పట్టమహిషి యగుచున్నది.

ఇక మిగిలిన మహిషులలో, సత్యభామ స్థానమెన్నవది యనుట చూడవలయును. సంస్కృత హరివంశము అష్ట మహిషులనుపేర్కొనుచు[3] సత్యభామను ఎనిమిదవ స్థానము నను, విష్ణుపురాణము ఏడవస్థానమునను[4] పద్మపురాణము రుక్మిణి తరువాత రెండవ స్థానమునను[5] పేర్కొనినవి. అష్ట మహిషుల నామములను చెప్పుటయే ఇచట ప్రధానముగా పరిగణింపబడినదే గాని, వారు వివాహమాడిన క్రమమును బట్టి కాదు. కావున పై పురాణేతిహాసములను బట్టి సత్యభామ స్థానమును నిర్ణయించుటకు వీలుపడదు.

ఎఱ్ఱన హరివంశమునందు.... "రుక్మిణీ వివాహానంతరంబ క్రమంబునఁ గృష్ణునకు మిత్రవిందయు, జాంబవతియు, సత్యభామయు గాళిందియు, నాగ్నజితియు, లక్షణయు, సుదంతయు నన నేడ్వురు భార్యలైరి. "(ఉ. భా. 3 - 176)... అని కలదు. క్రమముగా అనుటచే సత్యభామను శ్రీ కృష్ణుడు నాల్గవ భార్యగా గ్రహించినట్లు తలంప వలసి వచ్చును. కాని ఇది సరి కాదనిపించుచున్నది. సూరన విష్ణు పురాణమున కొందరివి తప్ప, అందరి వివాహ విధానములు పూర్తిగా వర్ణింపబడలేదు.

సింగన పద్మపురాణము వలన సత్యభామను రెండవ భార్యగా, కాళిందిని మూడవ

---

*1. సంస్కృతహరివంశము- భారత భావదీప - పుట 303*
*2. సంస్కృత పద్మపురాణము - ఉ. ఖం. ఉ. 249 - 41*
*3. సంస్కృతహరివంశము - వి.ప. 60 - 40, 41, 42, 43*
*4. సంస్కృత విష్ణుపురాణము - 5 - 28 - 3, 4, 5*
*5. సంస్కృత పద్మపురాణము - ఉ. ఖం. ఉ. - 249 - 41*

భార్యగా, మిత్రవిందను నాల్గవ భార్యగా, నాగ్నజితిని పదవ భార్యగా హరి స్వీకరించినట్లు తెలియుచున్నది. అందు రుక్మిణీవివాహవర్ణనా నంతరమున.... "ఇవ్విధంబున ధరణ్యంశంబున జనియించిన సత్యభామ ద్వితీయ పత్నిగా వరించిన తదనంతరంబ" (పద్మ పురాణము 10 - 48) అని సత్యభామను రెండవ భార్యగా చెప్పినది. కాళింది మూడవ భార్యయని ధ్వనించునట్లు సత్యభామ తదుపరి పేర్కొనుచు "మరియు స్వయంవర దత్తయగు విందానువిందుల తనయ "మిత్రవింద"యను నిందువదన జతుర్థ భార్యయు, సప్త వృషభుండను రాజు కూఁతు నాగ్నజితిఁ బంచమ భార్యయుంగా వివాహంబయి కృష్ణుండు రమించుచుండె" (పద్మ. పు 10 - 50) అని వర్ణించినది. జాంబవతీ కరగ్రహణము నాగ్నజితీ పరిణయానంతరము వర్ణింపబడినది. (పద్మ పు. 10-69). ఈ కారణమున జాంబవతిని ఆరవపత్నిగా కృష్ణుడు స్వీకరించినట్లు భావింప వలసి వచ్చును. కాని ఇది సమంజసముగా లేదు. సత్యా వివాహమునకు కారణభూతమై నిలిచిన శమంతకము నన్వే షించుట కేగినపుడు కృష్ణునకు జాంబవతీ పాణిగ్రహణము యాదృచ్ఛికముగా లభించినది. కావున ఆమె సత్యభామ కన్నను ముందుగా శ్రీకృష్ణ పత్నియైనది. పద్మపురాణమున ఈ విషయముననే గాక, మరి కొన్నిటియందును అవకతవకలు కనిపించుచున్నవి.

మిత్రవింద స్వయంవరదత్త యనియు, విందానువిందుల తనయ యనియు అందు పేర్కొనబడినది. మిత్రవిందను కృష్ణుడుస్వయంవర సమయమున చెలరేగిన యుద్ధమున గెలిచి, రాక్షసపద్ధతిని ఆమెను చేపట్టును. అంతేకాదు, ఆమె విందానువిందులకు సోదరి. ఈ విషయము భాగవతమున స్పష్టముగా కలదు.[1] అట్లే భాగవతమున మద్రరాజకన్య అయిన లక్షణను వివాహమాడినట్లుండగా (10 ఉ. భా. 147), ఇందు ఇద్దరను తెచ్చి పెండ్లియయ్యెనని (పద్మపురాణము 10 - 74) చెప్పుటయు విలక్షణము. అదియును, జాంబవతీ వివాహానంతరము, అని ధ్వనించునట్లుగా, ముందు జాంబవతీ కరగ్రహణమును వర్ణించి, "అటు కృష్ణుండు విహరించుచున్న గొన్ని దినంబులకు" (పద్మ-పు-10 - 73), అని అనుటయు అసమంజసముగానున్నది. జాంబవతీ వివాహానంతరము జరిగినది సత్యా వివాహమే కాని, తదన్యులది కాదు.

పై అన్నింటికన్నను సంస్కృత భాగవతమార్గమును అనుసరించి రచించిన పోతన భాగవతమునందు వర్ణితమైన అష్ట మహిషుల వివాహ వర్ణనమును బట్టి, వారి వారి స్థానములను నిర్ణయించుటకు వీలుపడును.

రుక్మిణి అగ్రమహిషి యనుటలో ఎట్టి విప్రతిపత్తిలేదు. కృష్ణుడు శమంతకాన్వేషణకై అడవికినేగినపుడు జాంబవంతునితో పోరి, జయమును పొందగా "జాంబవంతుండు మణియును, దన కూఁతు జాంబవతియను కన్యకామణియునుం తెచ్చి హరికిం గానుకగానర్పించె"ను (భాగ - 10 ఉ. భా. 71). జలధారా పూర్వకముగా కన్యాదానము చేయుట బ్రాహ్మణుల కుత్తమమనియు, క్షత్రియాదులగు తక్కినవర్ణముల వారికి నుదకపూర్వముగానే కన్యాదానము చేయువలయునను నియమము లేదనియు పరస్పరాంగీకారమును, తల్లిదండ్రుల వాగ్దానమును చాలుననియు మనుస్మృతి వలన తెలియుచున్నది.[2] కావున కృష్ణుడు జాంబవతిని వివాహమాడినట్లుగానే అంగీకరింప వచ్చును. ఇట్లగుట వలన హరికి జాంబవతి ద్వితీయ పత్నియగును. ఆ మణిని తీసికొని వచ్చి

1. *భాగవతము .... 10 - ఉ. భా. 124*
2. *మనుస్మృతి - 3 - 35*

భద్ర లక్షణలు వరుసగా శ్రీకృష్ణుని భార్యలైరనుట విదితము. "ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయు, కాళిందియు, మిత్రవిందయు, నాగ్నజితియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు ననగ నెనమండ్రు భార్యలైరి" (పైది. 148) అనెడు వాక్యమును వారి వివాహక్రమమునే నిర్ధరించుచున్నది. "మరియు నరకాసురుని వధియించి తన్నిరుద్ధ కన్యల షోడశ సహస్ర సంఖ్యల రోహిణి మొదలయిన వారిం బరిగ్రహించె" (పైది), అను ఈ వాక్యము అష్ట మహిషీ కల్యాణానంతరమే, హరి పదునారువేల మంది కన్యలను పత్నులుగా స్వీకరించినాడనుటను స్పష్టము చేయుచున్నది. దీనిని బట్టి చూచిన అష్ట మహిషులలో సత్యభామ స్థానము మూడవదని గ్రహింపనగును.

"అష్ట మహిషీ కల్యాణ" ద్విపద ప్రబంధమునందు కృష్ణుడు -

*"అలఘు శోభన వతియగు జాంబవతిని*
*హసిత నిర్జిత భామయగు సత్యభామ*
*నసమానలగు చెలులటకు దోఁ తేర*
*... ... ... ...*
*... ... కన్యకామణులను నాగమవిధి*
*కన్యకాధవుడు లోకములు గీర్తింప*
*వరియించె ... ... "* ....(అ. మ. క. పు. 228, 229)

అని జాంబవతి, సత్యభామల నేకకాలమున వివాహమాడినట్లు కలదు. కాని సత్యభామ కన్నను ముందుగా, జాంబవతిని ఆమె తండ్రి కృష్ణునకిచ్చుటచే, జాంబవతియే సత్యభామ కన్నను ముందు స్థానమును పొందును. జాంబవతీ వివాహమునకు ముందు కృష్ణునకు రుక్మిణిగాక మరికొందరు భార్యలున్నట్లుగా "సాంబోపాఖ్యాన" ప్రబంధమునందలి జాంబవంతుని పలుకులు స్ఫురింపచేయును. జాంబవతిని కృష్ణునకిచ్చిన తదుపరి, కూఁతునకు బుద్ధులు గరపుచు, జాంబవంతుడు "రుక్మిణీ ప్రముఖ పద్మదళాక్షుల కెక్కుడైతివో పట్టి" (3-160) అనియు,

*"సవతుల గుణ రూపసౌందర్యముల గాంచి*
*సుళుగులు వన్ని యసూయ పడకు"* ... (సాంబ - 3 - 161)

అనియు అనును. బహుశః, రాధను సవతిగ భావించి అట్లు చెప్పియుండవచ్చును.

కృష్ణుడు రుక్మిణీ, కాళిందులు తనను కోరగా చేపట్టెను. తనను కోరు నాగ్నజితి, మిత్రవింద, భద్ర, లక్షణలను, కూరిమితో గ్రహించెను. జాంబవతీ సత్యభామలు మాత్రము అయాచితముగ లభించిన వారలు. అష్టమహిషులలో సత్యభామ స్థానము మూడవదే అయినను, ద్వితీయ స్థానము నందున్న జాంబవతిని మించిన ఆధిక్యముతో వర్తించుచు, జగదీశ్వరుని హృదిలోమాత్రము అద్వితీయ స్థానమును సంపాదించుకున్నది.

అష్ట మహిషుల వివాహవిధానమును బట్టియు సత్యభామకు గల స్థానమును నిర్ణయింప వచ్చును. ఇతర పురాణముల నన్నింటికన్నను ఆంధ్ర భాగవతమున అష్ట మహిషుల వివాహ విధానము వివరముగా వర్ణింపబడి యుండుటచే అదియే ఇచట ప్రమాణముగా స్వీకరింపబడు చున్నది. రుక్మిణీ కృష్ణులిరువురకును పరస్పరానురాగమున్నది. కాని కృష్ణుని వివాహమాడుటకు రుక్మిణి యొక్క బంధుజను లంగీకారము చూపక పోవుటచే -

*"రాజీవలోచనుఁడు హరి*
*రాజ సమూహముల గెల్చి రాజసమొప్పగన్*
*రాజిత యగు తన పురికిని*
*రాజాననఁదెచ్చె బంధు రాజినుతింపన్"* .......*(భాగ - 10 పూ. భా. 1778)*

కన్యక యొక్క బంధువులంగీకరింపనప్పుడు వారిని చంపికాని, చీల్చికాని, బంధు వాశనమునకై దుఃఖించుచున్న కన్యను బలవంతముగా తెచ్చుట రాక్షసమనబడును[1]. స్త్రీ పురుషులొండొకరులపేక్షతో సమ్మతించి కలియుట గాంధర్వమనబడును[2]. రుక్మిణీకృష్ణు లిరువురకు నంగీకారముండుటచే "గాంధర్వము"ను, ఆమె బంధు జనులనెదిరించి కృష్ణుడామెను అపహరించుటచే "రాక్షసము"ను అగును. కావున ఈ వివాహము "గాంధర్వరాక్షస సమ్మేళన"మగుచున్నది.

జాంబవంతుడు "మణియును దనకూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి హరికిం గానుకగా నర్పించెను" (భాగ- 10-ఉ. భా. 71). వధువు తండ్రి వరుని పిలిచి కన్యనిచ్చుటచే బ్రాహ్మము వంటిదే యగును. సత్యభామ వివాహము బ్రాహ్మ విధిని జరిగినట్లు ముందే నిరూపింపబడినది.

"భాస్కర సంకల్పిత గేహమందు నదిలో గంజాక్షు విష్ణుం బ్రభున్ వరుగా గోరి తపంబు సేయు" కాళిందిని "ఒక పుణ్య దివసంబున శుభ లగ్నంబున" (భాగ. 10 ఉ. భా. 124) హరి పెండ్లాడెను. ఇదియు పరస్పర అంగీకారముతో జరిగిన వివాహము కావున, గాంధర్వ మగును.

హరి మేనత్తయగు రాజాధిదేవి కూతురైన మిత్రవిందను, ఆమె సోదరులును అవంతీ దేశాధీశ్వరులగు విందానువిందులు దుర్యోధనునకు వశులై, అతనికిచ్చి చేయుటకై, యుద్యోగించి స్వయంవరము చాటింపగా, "భూ రమణులు సూడఁగ హరి, మిత్రవిందను వీరతఁ జేకొనియెను (భాగ. 10 ఉ. భా. 125). కావున మిత్రవిందా కృష్ణుల వివాహము రాక్షసమగును.

వధువు తనకు తానుగా వరుని ఎంపిక చేసికొను పద్ధతి స్వయంవరమనబడును. యువతి తల్లిదండ్రులు కాని, సంరక్షకుడు కాని తగిన వరుని చూచి పెండ్లి చేయక పోయిన మూడు సంవత్సరములవరకు వేచి యుండి, ఆమె స్వయముగా వరుని నిర్ణయించుకొని వివాహమాడవచ్చునని తెలియుచున్నది[3]. ఈ స్వయంవరము మహాభారత రామాయణము లందు రెండు విధములుగ కనిపించుచున్నది. దేశ దేశముల నుండి ఆహ్వానింపబడిన యువకులలో తనకు నచ్చిన ఒకరిని, వధువు దండ వేసి వరించుట యొకటి. దమయంతీ వివాహము దీనికి ఉదాహరణము. దీనిని యథార్థ స్వయంవర మనవచ్చును. ఇందు కన్య యొక్క ఇష్టమే గాని తల్లిదండ్రుల ప్రమేయముండదు. వరునకు శక్తి యుక్తులతో కలసిన ఏదైన ఒక పరీక్ష పెట్టి అందు అతడు జయించిన, అట్టి వానికి వధువునిచ్చి వివాహము చేయుట రెండవపద్ధతి. దీనిని లక్ష్యసాధనకై ఏర్పరచిన స్వయంవరమనవచ్చును. సీతారాములు, ద్రౌపదీ అర్జునుల వివాహములు దీనికి ఉదాహరణములు. హరి, కోసల దేశమేలెడు నగ్నజిత్తు ప్రకటించినట్లుగా "ఏడు వృషభంబుల నన్నింటిని గట్టి యాడ్చి" "తనను విభుఁడు కావలెనని కోరు" నాగ్నజితిని తనకు నగ్నజిత్తుడీయగా "విధివత్ప్రకారంబున బెండ్లియాడెను" (భాగ. 10 ఉ.భా. 141). ఈసుతో తన నెదిరించిన రాజుల నెల్ల నోడించి

---

*1. మనుస్మృతి - 3-33*
*2. మనుస్మృతి - 3 - 32.*
*3. మనుస్మృతి - 9 - 90.*

ఆమెను స్వీకరించెను. (భాగ. 10 ఉ. భా. 143). ఇందు లక్ష్యభేదముండుటచే ఇది స్వయంవర వివాహమగును. రాజబంధువుల నెదిరించి ఆమెను గ్రహించుటచే కొంత రాక్షసమును సమ్మిళితమైనది. శత్రువులు భీతిల్లునట్లు మేనమఱందలు భద్రను పెండ్లియాడెను (10-145).

కృష్ణుడు తననిష్టపడిన మద్రరాజకన్య లక్షణను గ్రహించుటకై స్వయంవరమున మత్స్యయంత్ర భేదనము చేసి (భాగ-10 ఉ.భా-1091) తన నెదిరించిన సకల రాజలోకమును జయించి ఆమెను ద్వారకా నగరమునకు తెచ్చి వివాహమాడెను. కావున నిదియును స్వయంవర రాక్షస సమ్మేళనమే యగును.

ఆ యా వివాహములందొక రీతిచే కన్యను గ్రహించి తిరుగ దన గృహ్యా సూత్ర ప్రకారమున వివాహము జేసికొనవలెనని శాస్త్రము చెప్పుచున్నది[1]. కృష్ణుడును పై వనితలనందరిని తిరిగి యథావిధిని వివాహమాడినట్లు భాగవతము (దశమ) వర్ణించినది. అయినప్పటికిని కృష్ణుడు వారిని చేపట్టిన విధానమును బట్టియే వారి వివాహ పద్ధతిని నిర్ణయించుట ఉచితము.

*"షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోఽవరాన్*
*విట్షూద్రయోస్తు తానేవ విద్యా ధర్మ్యానరాక్షసాన్" .... (మను - 3 - 23)*
అనుటచే అష్ట విధ వివాహములలో బ్రాహ్మణునికి, మొదటి ఆరు వివాహములు, అనగా బ్రాహ్మ, దైవ, ఆర్ష ప్రాజాపత్య, అసుర, గాంధర్వములును, క్షత్రియునికి ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములును, వైశ్య శూద్రులకు రాక్షసము తప్ప, తక్కిన వివాహములును ధర్మశాస్త్ర విహితములని తెలియనగును.

శాస్త్ర గ్రంథములు క్షత్రియులకు గాంధర్వ రాక్షస వివాహములు శ్రేష్ఠములనియు, ఆ రెండును మిశ్రమమైన వివాహము శాస్త్ర సమ్మతమనియు మనుస్మృతి చెప్పుచున్నది.[2] రుక్మిణీ కృష్ణుల వివాహము గాంధర్వ రాక్షస సమ్మిళితమైనది. గాంధర్వ రాక్షసంబులు క్షత్రియులకు నుత్తమ వివాహంబులని అర్జునుడు కన్య సుభద్రను గాంధర్వమునకై ప్రోత్సహించుట భారతమున కనిపించును[3]. అందే, భీష్ముడు అంబాదులను విచిత్ర వీర్యునకై అపహరించు సమయమున, తన నెదిరించు రాజలోకముతో క్షత్రియులకు గాంధర్వ రాక్షసంబు లుత్తమంబు లనియు, స్వయంవరమున జయించి వివాహంబగుట యింత కంటె నత్యుత్తమంబని చాటును.[4] కాని అదే భీష్ముడు ఆనుశాసనిక పర్వమున ధర్మరాజునకు వివాహ పద్ధతులను వివరించుచు, బ్రాహ్మము, క్షాత్రము, గాంధర్వము ఆసురము, రాక్షసములలో మొదటి మూడును ధర్మకృతులనియు, ఆసుర రాక్షసములు ధర్మ దూర సంవిధాన దూషితములనియు ఉపదేశించును[5]. అనగా రాక్షస వివాహము క్షత్రియులకు సమ్మతమని శాస్త్రము చెప్పినను, భారత కాలము నాటి సంఘములోని వారే ఆ పద్ధతిని అంతగా మెచ్చలేదని తెలియుచున్నది. ఈ అష్ట విధ వివాహములలో "బ్రాహ్మము" అత్యుత్తమమైనదని వాత్స్యాయనుడనివాడు.[6]

దీనిని బట్టి చూచిన బ్రాహ్మ విధిని జరిగిన సత్యాభామా వివాహమే ఉత్తమమైనదగు చున్నది. జాంబవతీ వివాహము బ్రాహ్మమని చెప్పుకొనినను, జాంబవంతు డామెను హరికి

---

*1. ఆంధ్ర ధర్మ సింధువు ... పుట. 320*
*2. మనుస్మృతి - 3 - 26*
*3. భారతము - ఆదిపర్వము - 8 - 188*
*4. భారతము, ఆది - 4 - 200*
*5. భారతము - అనుశాసన పర్వము - 2 - 226*
*6. పి. వరలక్ష్మి - "యుగయుగాలలో భారతీయమహిళ" ... పుట. 329*

కానుకగా సమర్పించెనని మాత్రమే చెప్పబడుటచే అది శాస్త్రోక్తమైన బ్రాహ్మవిధిగ చెప్పలేము. తండ్రియైన సత్రాజిత్తు హరిని పిలిచి, కన్యనీయగా "అచ్యుతుఁ డుదార యశోనిధి పెండ్లి యాడెను" (భాగ 10 ఉభా 10.81). కావున ఇదియే సరియైన బ్రాహ్మ వివాహ విధి యగును.

బ్రాహ్మ వివాహమునకు మరియొక ప్రత్యేకమైన విశిష్టతయు కలదు. దైవ వివాహముచే జన్మించిన వాడు ముందేడు, వెనుకేడు తరముల వారిని, ఆర్ష వివాహమువలన జన్మించిన వాడు ముందు మూడు, వెనుక మూడు తరముల వారిని, ప్రాజాపత్య వివాహజాతుడు ముందారుతరముల, వెనుక ఆరు తరములవారిని, తరింప జేయును.[1] ఆసురాది వివాహము వలన జన్మించిన సుతులు క్రూరులు, అసత్యవాదులు, దేవ విరోధులు, యాగాది ధర్మ కార్య ద్వేషులగుదురు[2]. కాని బ్రాహ్మ వివాహము వలన జన్మించిన పుత్రుడు పుణ్యాత్ముడై తన ముందు పది తరములవారిని, వెనుక పది తరముల వారిని పాపములనుండి తరింప జేయునని యీ క్రింది శ్లోకము చెప్పుచున్నది.

*"దశ పూర్వాన్ పరాన్ వంశ్యానాత్మానం చైక వింశకమ్*
*బ్రాహ్మీపుత్రః సుకృత కృన్మోచ యద్యేనసః పితౄన్"* ... *(మను. 3 - 37)*

బ్రాహ్మ వివాహవిధిని కృష్ణ పత్నియైన సత్యభామ, యీ విధముగా కూడ అష్ట మహిషులందరిలోను ఉత్కృష్ట స్థానము వహించుటకు అర్హత కలదగుచున్నది.

శ్రీ మహా విష్ణువు భార్యలగు శ్రీదేవి, భూదేవులలో "ఆదిలక్ష్మి రుక్మిణి కాగా" (భాగ. 10 పూ. భా. 1784), భూదేవి "సత్యభామ" యైనది. కావున పట్ట మహిషితో పోటీ పడగల అర్హత సత్యభామకు మాత్రమే యున్నది. అష్ట మహిషులలో నొకతె యయ్యు, లోకమున అగ్ర మహిషితో సమానస్థానమును, ఆమె కన్నను మించిన స్థానమును కూడ పొంద గలిగిన ఏకైక కృష్ణపత్ని "సత్యభామ" మాత్రమే. అగ్రమహిషితో సమానముగ పూజలందుకొనిన కృష్ణ పత్నియు సత్యభామ మాత్రమే.[3]

జగత్ప్రభువే, తన ఏకైక హృదయ రాణిగ, ఆమెను సంభావించునెడ లోకమును ఆమెనట్లు సమ్మానించుటలో వింత లేదు.

----

1. మను - *3 - 38, 39*
2. పైది - *3 - 41*
3. *పుట్టపర్తిలో సత్యసాయిబాబాగారి తాతగారు రత్నాకరం కోదండమ రాజుగారు సత్యభామకు ఆలయమును కట్టించినారట! తిరుపతిలోని పార్థసారధి ఆలయములోను, పలు వేణుగోపాలస్వామి ఆలయములలోను, రుక్మిణీ కృష్ణులతోపాటు సత్యభామయు పూజలందుకొనుటను మనము చూచుచున్నాము.*

# నాల్గవ ప్రకరణము
# సత్యభామ - సాంసారికధర్మ నిర్వహణము

## సత్యభామ - సాంసారిక ధర్మ నిర్వహణము

సత్యభామ పురాణ పాత్రయే అయినప్పటికి మనకామె నాగరిక వనితగనే అనిపించును. నాగరిక వనిత అనినంతనే అవినయము, స్వేచ్ఛాప్రవృత్తి, నియమోల్లంఘనము కలదిగ భ్రమపడరాదు. తన అపూర్వ సౌందర్య, శృంగార రాజసములచే భగవానునినాకర్షించి తనకధీనుడనునట్లు కొంత వర్తింపచేసికొనినప్పటికిని సత్యభామ విశ్రుంఖలత్వము, అవినయము గల స్వేచ్ఛావిహారిణి మాత్రము కాదు. శ్రుతులు, స్మృతులు విధించిన కులకాంతాధర్మములన్నింటిని ఆచరించిన కులపాలిక యీమె.

తండ్రికి కూర్చు తనయగ, పతికి కూరిమి సతిగ, వంశోద్ధారకునికై తపించు మాతృమూర్తిగ, అత్తకు అణగి నడచు కోడలిగ, ఆడుబిడ్డను కొంటెతనముతో ఆట పట్టించినను ఆత్మీయతను పంచియిచ్చు వదినెగ, తోడికోడలి అభిమానముపొందిన అతివగ, అతిథి మర్యాదలను విధ్యుక్తముగ చేయు గృహిణిగ, సోదరవాత్సల్యముతో చిలిపితనము చూపు చెలియలుగ, సపత్నులతో అపుడపుడు కయ్యమాడినను వెనువెంటనే మరచిపోయి, స్నేహము చూపు సౌజన్యవతియైన సవతిగ, కష్టసమయమున బంధువులనోదార్చి ఆత్మీయతను చూపు ప్రియబాంధవిగ, పతి అభ్యుదయమునకై వ్రతాదులు చేయు సంప్రదాయ వనితగ - - ఇట్లు సత్యభామ తన జీవితమున వివిధ పాత్రలను సమర్థవంతముగ నిర్వహించినట్లు ఆంధ్ర సాహిత్యమున చిత్రింపబడినది.

పురాణేతిహాస, ప్రబంధ, యక్షగాన, నాటక, హరికథ, జానపదసాహిత్యముల నాధారముగ, సత్యభామ వివిధ సాంసారిక ధర్మములనెట్లు నిర్వహించినదో చూతము.

## తనయగ :

పురాణేతిహాసముల నన్నిటిని బట్టి చూచిన, తండ్రియగు సత్రాజిత్తు యెడల సత్యభామ భయభక్తులు, ప్రియగౌరవములు కలదిగనే చిత్రితము. సత్రాజిత్తు మొదట ఈమెను అక్రూర, శతధన్వ, కృతవర్మలలో నొకరికిత్తునని వాగ్దానము చేసినాడు[1]. కాని కృష్ణుని పై మణి విషయకముగ నపవాదు వేసినందులకు ప్రాయశ్చిత్తముగను, బలవంతుడైన కృష్ణుని యెడల గల భీతితోను కూతురైన సత్యభామను అతనికే యిచ్చి వివాహము చేసినాడు. అయినప్పటికిని తన మనోభీష్టమేదియో అడుగకయే ఒకమారు ఒకనికి నిర్ణయించి, మరియొకమారు ఇంకొకనితో వివాహము జరిపించినను నెదురాడక, తండ్రి అభీష్టానుసారమే వ్యవహరించిన యుత్తమ తనయ సత్య. అంతేకాదు, తండ్రిపై గొప్ప భక్తి ప్రపత్తులును, అభిమానమును కలది యీమె. శతధన్వుడు, తనకు సత్య దక్కలేదనెడు కోపముతో, సత్రాజిత్తును పగతో చంపి, మణినపహరింపగా "హతుండయిన తండ్రినిగని శోకించి"నను (భాగ - 10. ఉ. భా. 85) "అతనిం దైల ద్రోణి యందు బెట్టించి, హస్తిపురంబునకుంజని" "హరికి సత్రాజిత్తు మరణ వార్త విన్నవించినది" (పైది). ఇట్లు తండ్రి శరీరము చ్యుతము కాకుండా తగునేర్పాట్లు చేయుట, యెందుకనగా, దానిని చూచిన కృష్ణుడు శతధన్వుని వలన జరిగిన ద్రోహమును గ్రహించుటకు, అది సాక్ష్యముగ నిల్చునని ఆమె ఉద్దేశ్యము కావచ్చును. ఇట్లు పతిని శత్రువుపై ప్రతీకారము తీర్చుకొనుటకై పరోక్షముగప్రేరేపించి, శత్రువును చంపించి, తండ్రి ఆత్మకు శాంతిని ప్రసాదించినదీ సత్యభామ.

*1. సూ. వి. పు. - 6 - 276*

భామాకలాపము నందలి సత్యభామ *"కలడు సత్రాజిత్తు ఘనుడు మా తండ్రి"* *(పు. 12)* అని గర్వముతో పేర్కొనును.

ఆధునిక కవులు తమ గ్రంథములందు సత్యభామ తండ్రి యెడల వినయ విధేయతలు కనబరచు సన్నివేశములను కొన్ని కల్పించి, ఆమె పితృభక్తిని మరింత ప్రకాశమానము చేసినారు. జంగా హనుమయ్య చౌదరి వ్రాసిన "సత్యా వివాహము"ను ప్రబంధమున కన్యయగు సత్య, చెలుల ప్రోద్బలమున కృష్ణుని మెడయందు విరిదండ వైచి, "దొంగ పెండ్లి" చేసికొనినను, కృష్ణుడాతురతతో "చెలియ! పులుంగు రేని పయి సెజ్జకు రమ్మని కేలు వట్టి ముద్దులు మురిపెమ్ములూర వడితో పెడత్రోవను బట్టి పిల్వగా" సత్య "వెనుకాడిన"ది. (పు. 78) అట్లు వెనుకాడుటకు ఆమెకు తండ్రి యెడల గల భయభక్తులే కారణము. ఆమె మనసెరింగిన వారు కావున చెలులును, 'తన యయ్య యొసంగు వరకు దాళగ వలయు' నని కృష్ణుని హెచ్చరించినారు. సత్యభామకును ఆమె పినతండ్రి ప్రసేనునకును నడుమగల ఆత్మీయతను గూర్చి పురాణేతిహాసములం దెచటను ప్రస్తావింపబడలేదు. కాని ఆధునిక ప్రబంధకవుల సృష్టిలో మాత్రము సత్య పితృవ్యుని యెడ కొంత చనవు స్నేహముకలది. ప్రసేనుడడవికి వేటకై పోవునపుడు సత్య తన పినతండ్రిని ఏదైన తనకై తెమ్మని అడిగెడు ఆత్మీయత చనువు ఉన్నది. తెచ్చి యిచ్చెడు ప్రేమ ప్రసేనున కున్నది. కావుననే వేటకై పోయిన ప్రసేనుడు తిరిగి రాకపోవుటచే, అతని కొరకు ఆందోళన పడుచు, వెదకు వేట దొరలు- -

*"... ... ... సొంపారు సత్య*
*సన్న మనలను బిల్చి మా చిన్నతండ్రి*
*వచ్చెనే నాకు నేమేమి దెచ్చె ననిన*
*నే బదులు మాట నుడువుదుమేది తెరువు?" ......(సత్యా. వి. - పు. 92)* అని

కంగారు పడిరి.

## షట్కర్మయుక్తగ సత్యభామ :

సత్యభామ అనగానే వామపాదమున పతిశిరమును తొలగ ద్రోచిన ప్రగల్భయే గుర్తునకు వచ్చును. కాని నిజమునకు సత్యభామ శ్రీకృష్ణ భక్తురాలు. పతినే దైవముగా సేవించిన పతివ్రత. పతినెడబాసి జీవింపలేని సహధర్మచారిణి. శాస్త్రములు విధించిన ధర్మముల నన్నింటిని పాటించిన కులకాంత. సత్యభామను ఆలంకారికముగ మానవతిగను, స్వాధీన పతికగను, మానినీలలామగను, శృంగారరససీమగను నిరూపింప తలచిన తిమ్మన ఆమెచే మొదటి మారుగా పాదతాడనము చేయించినాడు. ఈ కల్పనను మెచ్చిన ఆ తరువాత కవులునట్లే ఆమెచే పాదతాడనము చేయించి తృప్తి చెందినారు. అంతేకాని, పురాణేతి హాసములం దెచటను సత్య పాదతాడనము చేయలేదు. ఇతర పతివ్రతల కేమాత్రము తీసిపోని "కులసతి" సత్య.

*"కార్యేషు దాసీ కరణేషు మంత్రీ*
*భోజ్యేషు మాతా శయనేషు రంభా*
*రూపేచ లక్ష్మీ క్షమయా ధరిత్రీ*
*షట్కర్మయుక్తా కులధర్మపత్నీ" ... (చాటువు)*

పతికి సేవలు చేయటయందు దాసిగ, మంత్రాలోచనలయందును, అవసర సమయము లందు సహకరించుటయందు మంత్రిగ, భోజన సమయమునందు తల్లిగ, శయన కాలమున రంభగ, రూపమున లక్ష్మిగ, క్షమాగుణమున భూదేవికి వలె సహనమూర్తిగ ఇట్లు ఆరు విధములుగ కులకాంత వ్యవహరింప వలయునని తెలియుచున్నది.

సంస్కృత పురాణేతిహాసములకన్నను ఆంధ్ర సాహిత్యమునందు, కుల కాంతాధర్మ ములు నిర్వహించిన కులసతిగా సత్యభామ ఎక్కువగా కనిపించును. సత్యభామ వివాహము నాటికే "పతివ్రతాత్వనయ ధర్మ విచక్షతా దయా యశఃకామ" అని భాగవతము వర్ణించినది (10 ఉ.భా. 81). సత్య "పరమ సతి" (బై. హరి. ఉ. భా. 5 - 33).

*"గతి పతియ చువ్వె భార్యకు*
*నతని గడచి నట్టి సత్పరాయణము కృపా*
*యుత గలదే కావున దా*
*నతనికి భక్తియగుటిచ్చునఖిల శుభంబుల్"* ... *(భార. అను - 5 - 297)*

అని శివుడు పార్వతికి పతివ్రతా ధర్మమును చెప్పును. అదే విధముగా సత్యయు

*"పతి ప్రాణ సదృశ బంధువు*
*పతి దైవంబేడుగడయు బతి సతులకు"* ....*(పారి - 1 - 96)*

అని నమ్మిన సాధ్వి. గురువు, తల్లి, తండ్రి, పురుషుడు, విద్య, దైవము, దాత - ఇట్లేడు విధములైన వాడును భర్తయే అని పూర్తిగా విశ్వసించిన కులకాంతయగు సత్య పతివ్రతయే యగును. కులకాంతాధర్మములు పాటించు కులసతి సత్యభామ అని కృష్ణుడు ఆమెను ప్రశంసించును. అట్టి కులపాలికను చేరి సుఖించు తాను ధన్యుడని కూడ అతడు భావించినాడు[1].

సత్యయు షట్కర్మాచరణమున తాను కులసతి యనుటను, పలు సందర్భములందు నిరూపించుకొనినట్లు ఆంధ్ర సాహిత్యమునందు చిత్రింపబడినది.

## కార్యేషుదాసీ :

తాను కార్యేషు దాసి అనుటను సత్యభామ అనేక సందర్భములందు నిరూపించుకొనినది. ఈ ధర్మనిర్వహణ మధికముగ, నరకాసురునితో కృష్ణుడు పోరు ఘట్టమున ప్రకాశమానమైనది. సంస్కృత పురాణేతిహాసములందు ఇప్పట్టున "దాసి"గ వ్యవహరించిన సత్య కానరాదు.

ఎఱ్ఱన హరివంశమునందు కృష్ణుడు, నరకునితో పోరునపుడు, అతని ఫాలము గాయపడునట్లు అసురుడు శరములనేయగా రక్తంబాస్యమును ముంప, గరుత్మంతుని స్కంధ పీఠంబుపై, హరి మూర్ఛితుడై వ్రాలగా, "సత్యభామ" "కనుగొని", ధీర వనిత కావున, "మది గంపము నొందక" వివేకముతో సమయ స్ఫూర్తితో "నాఁటియున్న యా సునిశిత బాణమున్నెరికి శోణితమున్గర పల్లవ ప్రమార్జనముల నొయ్య బాపుచును, జామర మారుత సంప్రయుక్తిచే దను పొనరించి", "ముహూర్తమాత్రలో"న్, 'వల్లభు గత వ్యధుజేసి' నట్లు (హరి. ఉ. భా. 4 - 160) చిత్రింపబడినది. ఈ ఘట్టమునందలి సత్య, నిపుణుడైన ఒక వైద్యుని, అనురాగ హృదయ యైన ఒక మాతృమూర్తిని, స్వామికి భక్తితో సేవలుచేయు దాసిని తలపింప చేయును. రాజపుత్రియయ్యు సామాన్య గృహిణికి వలె పతికి సేవలు చేసినది. ఉత్తర హరివంశమునందు ఇదే ఘట్టమున ఇట్టి సత్యనే చూడగలము. తనపై నాటిన బాణముచే కృష్ణుడు సొలసి, శిరము వ్రేలాడుచుండ, చేయాడక మూర్ఛపోవగా, గరుత్మంతుడు రెక్కలచే విసురుచు సేవలు చేయుచుండ, సత్యభామ యూరకుండక తోడుగా తానును "తాలవృంతముల దూకొని చల్లనిగాలి చల్లె"ను (ఉ. హరి 1 - 154). విభుండును ఆ సేవలకు తేరుకొని "చెచ్చెర" "కను రెప్పలు విచ్చి" చూసినాడు.

ప్రగల్భత్వమునకే ప్రాధాన్యతనిచ్చిన ప్రబంధాదులయందును "కార్యేషు దాసీ" యై వ్యవహరించిన సత్యభామను చూడవచ్చును. ప్రభావతీప్రద్యుమ్నమునందు, శుచిముఖి

---

*1. సత్య. సాం - పు . 102*

శ్రీకృష్ణ దర్శనమునకేగు సరికి, రుక్మిణి తన తొడలను కృష్ణునకు తలగడగా నమర్చి యుంచగా, సురటిని చేకొని భద్ర విసరుచుండగా, విరిచామరము మిత్రవింద యిడగా, కాళింది "కాళంజి దాల్చ", జాంబవతి తాంబూలము మడిచి యొసగ, గొడుగు పావలు కేలగొని నాగ్నజితి యుండగా, జలముల గిండి లక్షణ వహింప, కృష్ణుడు "సత్యభామ యూరువుల పయి పాదములుంచగా" ఆమె యొత్తుచుండెను (పైది 2 - 20). రుక్మిణి తొడలపై తన శిరమును, సత్య యూరువులపై తన పాదములను కృష్ణుడుంచినాడు. ఇతరకాంతలందరును సత్యకు వలెనె సేవలు చేయుచున్నను, సత్య చేయు పాదసేవలో "దాసి"గ వ్యవహరించు కులకాంతాతత్త్వ మధికముగ కనిపించుచున్నది.

విజయవిలాసమునందు మాయాసన్యాసి రూపమున విచ్చేసిన విజయుని రహస్యమును, కృష్ణుడు తన సతులలో సత్యారుక్మిణులకు మాత్రము చెప్పి "మీ మతిలోనన యుండ నిండు" అని హెచ్చరించి, "అతనికిం బూజలొనర్పుడిపుడు", అని ఆదేశమీయగా తదాజ్ఞానుసారము విజయుని వింత రహస్యమును కాపాడుచు, రుక్మిణితోకూడ నేగి, "ఏకాంతమునన్ ప్రియోక్తులను బు...స్సేసి" నది (2-126).

దాసీజన ...దరున్నను స్వయముగా సత్య పతికి సేవలు చేయును. "తలంటి స్నానము" కూడ చేయించెడిదిగ సత్యభామా సాంత్వనమున చిత్రింపబడినది.

*"మురువుగ నిల్పి యవ్వేలది మున్నొకనాడు తలంటుచున్నచో" (సత్య. సాం. పు. 103)*... అని సత్య చేసిన సేవలను కృష్ణుడు విప్రలంభ శృంగారలోలుడై, స్మరించుకొనుచు తపించును.

హరి వంశ, ఉత్తర హరివంశ భాగవతములందు, నరకాసుర యుద్ధమున తోడ్పడిన సత్యకు కృష్ణుడనేక ఉపచర్యలు చేసి, ఉపహారము లిచ్చినట్లుండగా, సత్యభామా సాంత్వనమున, గురు విజయము గైకొనిన పతికి

*".. ... ... కొమ్మ కడు సంతో*
*షమ్మునను కౌఁగిటను బమ్మి హరిమేనఁజిఱు*
*చెమ్మటల నొత్తె జిలుఁగు మ్మెఱుఁగుపైటన్"* ..... *(సత్య. సాం. పు. 146)*

ఆధునికమైన శ్రీ కృష్ణాతిమానుషతత్త్వ ప్రబంధము నందును పతి మూర్ఛితుడుకాగా, శత్రువు నెదుర్కొనుచునే "మురరిపు మూర్ఛదేర్చిన"ది (3-1-80). తీవ్రముగా యుద్ధము చేయుచున్నను, పతి సేవలను మరువలేని మగనాలు సత్య.

*"ఉపచరించిన నాయందు గపట మెంచి*
*ముదిత చేయు తిరస్కారమునకుఁజిక్కె".... (పారి. యక్ష. 2 - 120)* అను "పారిజాతాపహరణ యక్షగానము"లోని విప్రలబ్ధయైన సత్యభామ వాక్కులును, ఆమె పతికి ఉపచర్యలు చేయుచుండెడిదను విషయమునే చాటును.

జానపద సత్యయు, పారిజాతము తనకు తెచ్చియిచ్చెదనని పతి సాంత్వన పరుపగా సంతసించుటయేగాక, పతి స్నానమాడు వేళ

*...."సంపెగతైలము కృష్ణుని కంటెను సత్య*
*భామదేవి అలరుచు గంధము అలదీ మలయుచు మేనునూలచే*
*జలకములార్చి వలిపెము లిచ్చి ......"* ...*(శ్రీపారు. ప. పు. 22)*

తనపతికి సపర్యలు చేసినది. ఇట్లు ఆంధ్ర సాహిత్యమునందు పలుచోట్ల కార్యేషు దాసియై వర్తిల్లిన సత్యభామ మనకు గోచరమగును.

## కరుణేషు మంత్రీ :

సత్యభామ ఇతర కృష్ణ కాంతలవలె కాదు. క్షత్రియోచితమైన వీరవిద్యలన్నియు నేర్చినది. యుద్ధతంత్రములనెరిగినది. పతికి రాజకీయ విషయములందును, యుద్ధ సమయము లందును పలు విధములుగా తోడ్పడినది. విపత్తులలో ఆదుకొనుటయందు మంత్రివలె పతివ్రత ప్రవర్తించును.

'నరకాసురునితోడి యుద్ధ ఘట్టమున సత్య కరణేషు మంత్రిగా వ్యవహరించు తత్త్వము మనకు గోచరమగును. సంస్కృత పురాణేతిహాసములందు సత్య యుద్ధమున పాల్గొనదు. కావున అందు ఈమెలోని ఈ గుణము ప్రకాశమానము కాలేదు. తెలుగు కవుల చిత్రణలో వీరవనిత కావున కరుణేషు మంత్రియై సుగోచరమగుచుండును.

హరివంశ ఉత్తర హరి వంశములయందు, కృష్ణుడు తనను యుద్ధమునకు తోడ్కొని పోగ, ఏమియు అడుగక అతనిని అనుసరించినది. శత్రువు సునిశిత బాణముచే నొవ్వచేయగా, మూర్ఛితుడైన హరి, సత్య సపర్యలకు తేరు కొనినను, అలసి యుండుటచే ఆ వీరవనితను చూచి "ఏను పరిపీడితుండనై డస్సితి నొక్కింత నీవు కయ్యంపు మోపు మోవు" మని ఆదేశింపగానే, అతని పరిస్థితిని గ్రహించి, శత్రువునట్లు విడచుట యుక్తము కాదని తెలిసికొని, భర్తకు తోడ్పడుట సహధర్మచారిణి ధర్మమని భావించినది. పతి తన శార్ఙంబిచ్చి, యంప పొదవులనువుగా నమర్చియీయగా ఆ క్షణములోనే "ధీరోదాత్త పతి ప్రియాచరణ భక్తి ప్రౌఢ యాతన్వి", 'వీరం బాడుదనంబు నొందెనా", యనునట్లు విజృంభించి అరివీరునకు వెరపును, ప్రియ వరునకు మోదమును కల్గించి, ఖేచరుల ప్రశంసలను కూడ పొందినది. (హరి. ఉ. భా. - 161, 162)

నాచనసోముని ఉత్తర హరివంశమునం దీమె మంత్రిత్వము మరింత విపులముగ నున్నది. పతి తనను యుద్ధమునకు ప్రోత్సహించుటకు ముందే అతనిని ఆ ఆపద నుండి రక్షించుటకై తానయై అసురవీరునితో సత్య తలపడు ఘట్టమొకటి యిందు కలదు. నరకాసురునితో పోరుటకు ముందు మురాసురుడు వీరిని ఎదుర్కొనును. మురాసురుని గదా ఘాతములకు హరి నొచ్చినాడు. హరి కోపముతో మురాసురుని కంఠమును ఖండింపగా, నిశుంభుడు విజృంభించి, కృష్ణునిపై బాణములను వేసినాడు. రెండు విధములైన ఆయుధముల తాకిడికి తట్టుకొనలేక, హరి తపించుచుండగా, అది చూచిన సత్యభామ యూరక నుండలేకపోయినది. వెంటనే "నిశుంభుడు" రుధిరధారలు గ్రక్కు"నట్లు "దుర్దాంత మదంబుతో పెద్ద గదను తీసికొని," "అత్యంత రయంబున" అతనిపై వైచినది. (1-142). సమయమున కిట్లు సత్య సాహాయ్యపడుటచే కృష్ణున కొకింత విశ్రాంతి కల్గినది. ఇట్లు తేరుకొనిన మురాంతకుడామె "వీరమునాలోకించి," ద్విగుణీకృతోత్సాహముతో సమరమునకు తిరిగి కడంగినాడు.

హరివంశమునకు వలెనె ఇందును, నరకునితోడి యుద్ధమున, నడుమ మూర్ఛితుడై, సత్యసేవలచే తేరుకొనిన కృష్ణుడు, తానలసి యుండుటచే "సత్యభామను జూచి"

"... .. ... చంద్ర వదన
శార్ఙ్గమిందు నీవు సమరంబె కోరుదు
*నవసరంబు వచ్చె .... "* ......*( ఉ. హరి. 1-155)* అనుచు ఆదేశింపగనే, పత్యాజ్ఞ ననుసరించి వీరోత్సాహముతో విజృంభించి శత్రువును కలంచి "మొక్కలంపు గెలుపు" గైకొనినది.

భాగవతమునందును కలహంబునకు నరకాసురుండు సిద్ధమగుచుండగా చూచి

సంభ్రమమున పతి తననాదేశించుటకు ముందే తనకు తానుగా యుద్ధము చేయుటకు పూనుకొనినది. "మగ వారిఁ గనినఁ, దా మఱుఁగున కేఁగెడు నింతి" యయ్యు పతికి నాపద వచ్చినవేళ పగవాని ముందు ఆమగనాలు మగతనమును చూపినది.

తెలుగు బ్రహ్మపురాణమున, సత్య మంత్రిత్వము తెలిసియే కృష్ణుడామెను నరకాసురవధ కేగునపుడు తోడ్కొని పోయినట్లున్నది. ఇతర కాంతలకు వలె సత్యకు, పతి ఏదియు వివరింప నవసరము లేదు.

*"తన మనసుం గనుంగొనుచు దానెఱిఁగింపక యున్నఁగార్యముం, బొనరుచును"* అని "లోఁదలచియు" పొంగెడు వేడుక సత్యభామనుంగొని చన నెంచినాడు. (బ్రహ్మ.పు.4-93-14). సత్యయు నుత్తమ కులకాంత కావున "పతి యానతి మౌళిఁ దాల్చె"ను (పైది).

పారిజాతాపహరణ ప్రబంధమునందు, సత్య

*"పూనుకొని మేలు గీళ్ళకు*
*లోనయి విహరించు వారిలోకమెఱుఁగదో*
*యా నరకాసురదమనుఁడు*
*దానెఱుఁగఁడొ భోజకన్య తానెఱుఁగదొకో" .....(1-91)*

అని అనును. దీని వలన సత్య, కృష్ణునకు కష్టసుఖములందు పలుమారులు తోడ్పడి, సహకరించిన మంత్రిణి అని అవగతము కాగలదు. భాగవత సత్యకు వలెనె 'సత్యభామా సాంత్వ'న సత్యయు, నరకుడు' 'కృష్ణుని చూచుచు'తనసేనను పురికొల్పగా సహింపలేక తనకు తానుగా దుష్ట శిక్షణకు పూనుకొని పతికి సహకరించును. (పు - 139).

ఆధునిక ప్రబంధములందు సహితమిట్టి మంత్రిత్వము నెరపు సత్యభామయే చిత్రితమైనది. శ్రీకృష్ణాతిమానుష తత్త్వమున మూర్ఛితుడైన కృష్ణుని చూచి నరకుడు 'గర్వమున అరవగా, "సత్య సామర్థ్యశౌర్యస్థైర్య ప్రతిభల్ సెలంగ బతి సంరక్షింప నుద్యుక్తయై"నది (3-1-77). ఒక వైపు శత్రు సైన్యము నదలించుచు, శరవర్షమును కురియించుచు, శాత్రవుల పన్నుగడలను సడలించుచు, భీకరముగా పోరాడుచున్నను పతికి సేవలు మరువక చేయుచునే యున్నది. "ముర రిపు మూర్ఛ దేర్చి" ధైర్యముతో, నరకుడు తూలిపడునట్లు చేసినది (పైది. 80). "నరకాసుర వధ' (ప్రసన్న యాదవము) అనబడు చిలకమర్తి వారి నాటకమున, సత్య పతితో, తనను యుద్ధ భూమికి వెంటగొని పోవలసిన అవసరమున్న దనుచు, దానికి కారణముల నిట్లు చెప్పినది.

*"ఆహవంబున మీరలసి నపుడు మేని*
*చెమ్మటల్ దుడిచెద చెఱఁగు తోడ*
*పరమేశ! శరపరంపర లేయ దమకింప*
*నలుగులందించెద నండనుండి*
*సూతుండు శ్రాంతుడై సొమ్మవోయిన వేళ*
*నరదంబు గడపెద నమవెఱింగి*
*పగతుండు చెలరేఁగి పయిపయిం గవిసిన*
*బురికొల్పి పంచెదఁ బోరొనర్ప*
*మఱచు పనులను జ్ఞప్తికి మరలఁదెత్తు*
*గలసి చేదోడు వాదోడుగాఁ జరింతు*
*వేయునేటికి హృదయేశ! విను, తెలిపెద*
*వాలుఁగైకొని పోరెద వలయునేని"* ... *(నర. నాట. - 3 అం.)*

అని కార్యేషు దాసిగ, కరణేషు మంత్రిగ కూడ వ్యవహరింపగలనని ముందే వాగ్దానము చేసినది. నరకాసుర వధానంతరము చెరలోని కన్యలను చూసి జాలినొంది 'వారిని భరింపు' మని (3-అం.) ఉపదేశించి అంగీకరింపచేసినది. పారిజాతాపహరణ నాటకమునందు సత్య, పతికి అత్యంత అవసరకాలమున సమయోచితమైన ఆలోచనను చెప్పి, కార్యసాధనకు తోడ్పడు వివేకవతిగ కూడ దర్శనమిచ్చును.

సత్యకు వాగ్దానము చేసిన పారిజాతమును, కృష్ణుడు భువికి తెచ్చుటకై దివికేగ వలయు ననిన తగు కారణమొకటి ఉండవలయును. పురాణేతిహాస ప్రబంధాదులయందు, కృష్ణుడు తానే ఒక మార్గమును సూచించును. కాని ఈ నాటకమునందు, అతడు ఏ కారణమును కల్పించుకొని యేగవలయునో తెలియక, సతమతమగుచుండగా "నాథా! కారణము లేకేమి? నరకాసురునిచేత మున్నపహరింపబడిన యదితి కుండలములను మీరా రక్కసుం దునిమి తెచ్చినదాది దేవరయె స్వయముగ నమర లోకంబునకు బోయి దేవమాతకా కుండలముల నర్పింప పలుమాఱనుచుండువారు కదా! ఇపుడా వంక గల్పించుకొని మన మమరావతికి బోవుదము" (పు. 36) అని సమయజ్ఞతతో ఆలోచనను చెప్పిన మంత్రిణి సత్యభామ.

## భోజ్యేషు మాతా :

సత్యభామ రాజపుత్రియగుట చేతను, నానా దాస దాసీ జన పరివృతయగుట వలనను 'భోజ్యేషు మాతగా వ్యవహరింప నవకాశము కలిగియుండదు. కావుననే సాహిత్యమునందెందును ఈ కులకాంతా ధర్మ నిర్వహణమును కావించిన సత్యభామ చిత్రితమగుట కానము.

## శయనేషు రంభా :

శృంగార రససీమ, అతిలోక సౌందర్యభూమి యగు సత్యభామ సమర రంగములోనే 'ఒక తూపుచే అరిని, ఒక చూపుచే వరుని' కలవర పరచినది.[1] సమర రంగము నందె శృంగారమును మరుగుపరచలేని ఆ ప్రణయదేవత, శయనాగారమున పతికి రంభ గాకుండ నెట్లుండ గలదు?

సత్యభామకు ఎఱ్ఱ చీరలనిన ఇష్టము.[2] దైవ దర్శనార్థమేగునపుడు సాధారణముగా తెల్లచీర కట్టును.[3] కోపము వచ్చినపుడు తెలుపు చీర కట్టుట కలదు. కాని సాధారణముగా "సన్నకావుల నెందును మానలేదు"[4]. సత్యను తలచుకొని "పొలతి మేనెల్ల గప్పుకయుండ జెంగావిచీర యేపుణ్యంబు చేసెనొక్కొ" (పు. 95) అని సత్యభామాసాంత్వన మందలి కృష్ణుడనును.

కావి వర్ణము సౌందర్యకారకములని ఆనాటి యువతులు భావించి యుందురు.

"శృంగార నాయికలుద్దీపమునకై నున్నగావులు అనగా ఎఱ్ఱ చీరలు కట్టెడివారట.! సత్య శృంగార రసఖని యగుటచే, ఈ విషయమును గ్రహించియె సన్నకావులే ధరించి యుండును. సన్నకావులు ధరించి, మై తొడవు లలంకరించుకొని తాంబూలపుకాంతులు పెదవులపై తులకించగా, పలుకుల తేనెలుట్టిపడ పల్కుచు, వాలుగన్నుల నును సిగ్గు నూల్కొన, పతిని కనుంగొనుచు, యురఃస్థలంబు జన్నుల నెదురొత్తి, మక్కువ బిగికౌగిటం జేర్చి రసికుడైన పతిని ఆహ్వానించునని పారిజాతాపహరణ ప్రబంధము వర్ణించినది.[5]

స్వాగత మిచ్చువిధమే యింత శృంగార రసభరితముగా యుండిన, శయ్యాగారమందలి

1. భాగ - 10 - ఉ. భా. - 178
2. భై - హరి - 5 - 45
3. పైది
4. పారి - 1 - 115
5. పారి - 1 - 117

శృంగారము నింక ఊహించుకొనవచ్చును. కోపముతో ఆమె చేసిన పాదతాడనము సహితము 'మన్ననగానే' అనిపించినది అరసికశేఖరునకు.[1] సత్య విరసములో, కూడ సరసమే తొంగి చూచును. పారిజాతాపహరణమునకై సత్యా కృష్ణు లిరువురును దివికేగిన తరి, వైజయంతమున ఆనాడు, విడిసి

*"ఆ రాత్రి సత్యఁగూడిము*
*రారి ముదంబెసఁగ వైజయంతమున మనో*
*భూరాజ్యసౌఖ్య నిద్రా*
*పారీణత నుండె......"* ... *(పారి - 4 - 48)*

ఈ పద్యము సత్య 'శయనేషురంభ' యనుటను పరోక్షముగా నిరూపించు చున్నది. పారిజాతాపహరణ సత్య యొక్క శృంగారములో సొగసున్నది. కాని దక్షిణాంధ్రయుగ కవుల చిత్రణలోని శృంగారరసాధి దేవతయైన సత్య ఔచిత్యపు హద్దులను కూడ దాటినది.

సత్యభామా సాంత్వన ప్రబంధసత్య పతిని మించినదై, శృంగారమున పతికి నెదురొత్తులిచ్చును[2]. ఇందలి సత్య యొక్క అతివేలపు పురుషాయిత శృంగారములో సొగసుకన్నను వెగటుదనమే ఎక్కువ. ఆ తప్పు సత్యది కాదు. ఆనాటి యుగ సాహిత్యమునకును, సమాజమునకే ఆదోషము చెందును. జానపద సత్యలో గ్రామ్యతయున్నను, సభ్యత యొక్క సరిహద్దులను దాటలేదు. పతికొరకై, వంతు దినమని, తన యింటిని శయ్యను, అలంకరింపచేసి, తానును అలంకరించుకొనినది. పచ్చ పట్టు చీరె, నల్లపట్టు రవికె తొడిగి, ముత్యంపుకురులు దువ్వి, చెంప కొప్పున చేమంతి పువ్వుల తురిమి, చుక్కబొట్టు నుదుట చక్కగా దీర్చి, ముక్కరనత్తు దాల్చి నాను మెడనిండ ధరించి, సవరమ్ము కొప్పులో నుంచి, పాంజేలు, పట్టెడలు, కడియములు పెట్టుకొన్న ఈ జానపదసత్య[3], జానపద కృష్ణునకు రంభను మించిన శృంగార దేవతగానే గోచరించి యుండును.

## రూపేచ లక్ష్మీ :

రూపేచ లక్ష్మి అనగా శ్రీమన్నారాయణుని దేవేరి లక్ష్మీదేవిలో ప్రస్ఫుటమగుచున్న ఉత్తమోత్తమ గుణములైన రూపము, సౌభాగ్యము, ఐశ్వర్యము - కల్గియుండుట. ఇవి స్త్రీకి ఉత్తమ స్థానమును కల్పించునట్టివి. పతివ్రత, పుత్రవతియైన ఉత్తమసతికి ఇంతకంటె మించిన ఉత్తమ సంపత్తి యుండదు. ఇవన్నియు ఒక్క చోట సమకూడిన నారీశిరోమణిగ సత్యభామను భావింపవచ్చును.

సత్యభామ అతిలోక సుందరి. అక్రూరాదులు సత్యభామను వివాహమాడవలయునని కోరుకొనుటకు ఆమె రూపమును ఒక కారణమని తెలియుచున్నది. తారుణ్యమును స్త్రీల రూప సౌందర్యమునకు ఒక కారణమగును. సత్యభామ తరుణ వయస్కురాలు. "సలలిత రూపయౌవన విశాల సముచ్ఛ్రయ మత్త చిత్త"యైన (5-31) సత్య భైరవకవి హరివంశమున సాక్షాత్కరించుచున్నది. పారిజాతాపహరణ ప్రబంధమున కృష్ణుడు, పట్టమహిషి రుక్మిణితో సమానముగ తరుణీమణి సాత్రాజితికిని మిగుల చనవు లిచ్చుచుండెను.[4] అందరు భార్యలున్నప్పుడు పట్టమహిషి రుక్మిణితో సమానముగా సాత్రాజితికి మాత్రమే చనవులిచ్చుటకు కారణమామె రూపతారుణ్యములనుటను "తరుణీమణి" అనెడు విశేషణముచే కవి

1. *పారి - 1-123*
2. *లింగనమఖికామేశ్వరకవి - సత్యభామా సాంత్వనము, ... పు. 68, 69.*
3. *స్త్రీల పౌరాణికపాటలు - సత్యభామ సరసము - పు. 170*
4. *పారి - 1- 41*

సూచించినాడు. నారదుడును "ఎలజవ్వనినంచు" సత్య కాంతల గణింపక విఱ్ఱవీగుచున్నదని రుక్మిణీ కృష్ణులముందు విమర్శించును. (పైది. 66). దీనివలన సత్య ఎలజవ్వని యనుటయు నిర్ధారణమగుచున్నది. విలాసము విభ్రమము యౌవన లక్షణములు. సత్యలోని ఈ ఎలజవ్వనమె పతిని వశపరచుకొని అతని వలన ఏరికిని దక్కని, అరుదైన చనవులను పొందగల్గునట్లు చేసినది. ఇదియే స్త్రీకి సౌభాగ్యమగును.

కృష్ణకాంతలలో సత్యకు మరియొక ప్రత్యేకత కూడ కలదు. వారెవ్వరికిని లభ్యము కాని, అరుదైన "నిత్య యౌవనము" సత్యకు మాత్రమే దక్కినది. ఈ విషయమును హరివంశ, విష్ణుపురాణములు తెలియపరచును. నరకాసుర వధానంతరము, సత్యా కృష్ణులు దివికేగి, అదితిని గని ఆశీస్సులను పొందు సమయమున, ఆమె నుండి, కృష్ణుడు మనుష్య రూపమున నున్నంత కాలము, సత్యభామ "ప్రియదర్శినియు, సర్వలోకములలో విఖ్యాతయు, దివ్య గంధము గలదియు, మనోరమయు, సుస్థిర యౌవనమును, సౌభాగ్యమును గలదియు, స్త్రీలలో ఉత్తమ యగునట్లు వరమును పొందినదని సంస్కృత హరివంశము వర్ణించినది.[1]

ఎఱ్ఱన హరివంశమునందును

*"వనితలకెల్ల నెక్కుడన వాలిన పేర్మివహించు నివ్వారా*
*ననయగు సత్యభామయు ననన్యవిలాసమెలర్ప నిత్యయౌ*
*వనరుచి నొప్పుఁగాత, మనవద్యత నీవు మహీతలంబుపై*
*ననఘ మనుష్యమూర్తి నెలరారఁగ నుండెడు నంతగాలమున్"* ...(హరి.ఉ.భా. 4- 211)

అని అదితి 'నిత్యయౌవన' వరమును సత్యకు ప్రసాదించినట్లు చెప్పబడినది. సంస్కృత విష్ణుపురాణము వలెనె,[2] సూరన విష్ణుపురాణమునందును, అదితి

*"ముదిత! మత్ప్రసాదమున సార్వ కాలంబు*
*ముదిమియును విరూపమును దొలంగి*
*సంతతానవద్య సౌభాగ్యమూర్తివై*
*యుల్లసిల్లు మనుచు నొసఁగె వరము"* .... (సూ-వి.పు. - 8 - 118)

అదితిచే ముదిమియు విరూపములేని సార్వకాల యౌవనమును, నిత్యసౌభాగ్యమును వరముగ పొందినట్లు సూరన వర్ణించినాడు. యౌవనమందే స్త్రీలు రూపవంతులై పురుషుల యొక్క వల్లభత్వమును పొందుదురు.

పారిజాతాపహరణానంతర వృత్తాంతముగల "విష్ణు మాయానాటకము"న సత్య "శోభన యౌవన గర్వమును మనోహర నవరూప గర్వము" (1-150) కలదిగ చెప్పబడినది. అనన్య విలాసమెలర్చు సహజతారుణ్యమునకు తోడుగ అరుదైన నిత్యయౌవనమును దక్కిన ఏ వనిత గర్వింపదు?

భామా కలాపమునందలి సత్య విరహమునకు లోనై "భరియింప జాల యౌవనప్రాయ భరము" (పు. 45) అని అనుటను బట్టి సత్య యువతియనుట స్పష్టము. "నిత్య యౌవన వతియగు సత్య" (పు. 50) అని రుక్మిణీ సత్యభామా సంవాద యక్షగానమును వర్ణించినది. సాహిత్యమునందు గల వివిధ ప్రక్రియల యందును ఇట్లు యౌవనవతిగానే చిత్రింపబడుటచే సత్య యువతి యనుట రూఢియగుచున్నది.

శరీరఛాయయు సౌందర్య పోషకమే యగును. సత్యకు చక్కని శరీర ఛాయ యున్నట్లుగా వర్ణితము. ఆమె మెఱపుతీగెవలె ప్రకాశించును. ఆమెతో భుజగారి స్కంధముపై

---

*1. సం. హరి. వి. ప - 64 - 61, 62*
*2. సం. వి. పు. - 5 - 30 - 27*

నున్న కృష్ణుడు "శుంభద్రాజబింబోపరిస్థల శంపాన్వీత మేఘమో" అనునట్లుండినాడు (భాగ - 10 - ఉ. భా. - 168). పారిజాతపహరణమున భోజనశాలకు సత్యాకృష్ణులు నారదుని వెన్నంటగా "..తటిల్లతయు న్జలదంబు యామినీపతి వెనుకొన్న కైవడి" (2.17) ఉండిరట. సత్య బంగారురంగుతో ప్రకాశించు చుండును కావున ఆమె "హేమ నిభగాత్రి" (పారి. 5.54). "బంగారు బొమ్మ" అని రుక్మిణీ సత్యభామా సంవాద యక్షగానమును సత్యను వర్ణించినది. (పు. 50). వీని కన్నింటికితోడుగా సత్య 'పాటలగంధి' కూడ (పారి. 1 - 120). "శాస్త్రకారుడు చెప్పిన పద్మినీజాతి స్త్రీ యీమె. అందుచేతనే ఆమె శరీరమే సువాసనలను వీచెడిది" అని చన్నా ప్రగడతిరుపతిరావు గారు ప్రశంసించినారు.[1]

సత్యభామ చక్కని రూపము కలది. రూప విశేషమున రుక్మిణీతో పోటీ పడినట్లు పారిజాతాపహరణము వలన తెలియును (1-42). నారదుడును "చక్కని దాననంచు", సత్య విఱ్ఱ వీగుచు కాంతల గణింపదని ఆరోపణముచేసినాడు (పైది. 66). అతడు కలహ సంభ్రమపరుడై సత్యపై అట్లు ఆరోపణలను చేసినను, ఆమె 'చక్కని' దనుట మాత్రము స్పష్టము. రసార్ణవసుధాకర నిర్వచనానుసారము అంగముల ఉపాంగముల కూర్పు తగిన రీతిని ఉండి అంగ సంధుల పొందిక కల్గి యుండుటయే సౌందర్యమనబడును.[2]

సత్యా సౌందర్య మితరులను ప్రలోభపెట్టునది. అక్రూర శతధన్వ, కృతవర్మలు సత్యభామ సౌందర్యమున కాకృష్టులై ఆమెను వివాహమాడ దలంచినారు. సత్య దక్కలేదనెడు కోపముతోనే అక్రూర కృతవర్మలు శతధన్వునితో, సత్రాజిత్తును చంపి, శమంతకమణిని గ్రహింపుమని ప్రేరేపించుట హరివంశ[3], విష్ణుపురాణ[4], భాగవతాదు[5]ల యందున్నది. అపురూప గుణ సుందరియగు సత్యభామతోపాటు, ఎందును నలభ్యమగు మణియు తమకు లభించునని ఆశించియుండిరి. సత్రాజిత్తు సత్యను శ్రీకృష్ణుని కిచ్చి వివాహము చేయుటచే నిరాశను పొంది, తమ ద్వేష, రోషముల నుపశమింప చేసికొనుటకై ప్రతీకారేచ్ఛతో, శతధన్వుని అట్లు ప్రేరేపించినారు. సత్యభామ అను కన్యారత్నమచట లేకుండిన, మణి మీద లుబ్ధతచే మాత్రము, వారింతటి సాహసమునకు ఒడిగట్టి యుండెడివారు కారు. సత్యభామ సౌందర్యమే, ఆమెకు తెలియకుండనే, ఆమె తండ్రి మరణమునకు కారణమైనది. యుద్ధ రంగమునకు వచ్చిన శత్రువును సహితము సమ్మోహన పరుపగల్గిన సౌందర్యరాశి సత్య. యుద్ధము చేయవచ్చిన నరకుడు సత్యా సౌందర్యమున కాకృష్టుడై కృష్ణుని చూచి. "ఈ వారిజనయన యెవ్వ రేర్పడజెపుమా" (హరి. ఉ. భా. 4 - 150) అని అడుగుచు, "నిన్ను నీ ప్రొద్ద చలమొప్ప నిహతుఁ జేసి యేను గైకొనఁగలవాఁడ నీలతాంగి"నని ... (పైది - 4 - 151) అనును. కృష్ణుడును 'ఈ భామ సత్యభామ యనునది. మదీయ ప్రేయసి" (పైది - 152) అని గర్వముతో ఆ అతిలోకసౌందర్యవతిని గూర్చి సమాధానమిచ్చును.

ఇట్లే 'దీపావళి' నాటకమునందును, నరకుడు "ఈ సమస్తలోకేశ్వరుడగు దైత్యేశ్వరుడు నీ సౌందర్యోపాసకుడై దాసుఁడు కాగల"డని (పు. 75) మోహావేశముతో అనును.

యుద్ధ వేళలయందు సహితము ఆ సహజసుందరి శోభ తరుగదు. పైగా మరింత శోభించుటయు కలదు. నరకాసురునితో యుద్ధము చేయు సమయమున కూడ "అలినీలాలక

1. *పంచ కన్యలు - పు. 26.*
2. *రసార్ణవసుధాకరము. 1-182*
3. *హరి - పూ. భా. - 3 - 201*
4. *సూ. వి. పు - 6 - 277*
5. *భాగ - 10 - ఉ. భా. - 84*

చూడ నొప్పెసఁగెను" (భాగ - 10 - ఉ.భా. 179). "శరముల నరవిందనయన యనువు చూపగా "చాపము గుడుసై" జగము నుతించునట్లు "మొగము" "పరివేషముగల చంద్రుని సరివేషము దాల్చె"ను. (ఉ. హరి. 1-158).

'కిన్నెరకంఠి' (పారి. 2-89) యగుటచే సత్య స్వరము అవ్యక్తమధురమై యుండును. ఆమె ఏడ్చినను అది వికారముగ నుండదు. మీదు మిక్కిలి "బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠవధూ కల కాకలీధ్వని" (పారి. 133) వలె వినసొంపుగా నుండును.

సత్యభామ సౌందర్యమునకు జోడైనది సౌకుమార్యము. రసార్ణవ సుధాకర నిర్వచనాను సారము పుష్పాదుల సంస్పర్శనుకూడ ఓర్వనిది ఉత్తమ సౌకుమార్యమని తెలియ గలదు.[1]

"తంత్రీ వినోదములను తడవుసైపని వ్రేళ్ళు", అద్దంబు పిడిముట్టనలయు పాణి తలంబు", చెలికత్తె నొత్తిలి చీరలేని యెలుంగు', 'ప్రమదనర్తనకేలి బరిఢవింపని పదంబు, "సోయగంపు జిత్రంబు జూచుచోట వేసరు విలోచనంబు" (1-161) కల సుకుమారి ఉత్తర హరివంశపు సత్యభామ. ఊచనకళ్ళను కూడ వంపలేదీమె. (పైది. 162). భాగవతమునందును, "సఖులకోలాహల స్వనమున కోర్వలేని కన్య", "నీలకంఠంబులకు నృత్యంబు గఱపుచు నలసి తొలగిపోవు" నంతటి లాలిత్య సౌకుమార్యములు కలదిగా వర్ణింపబడినది. (10- ఉ. భా - 180). కాని సమయమాసన్నమైన, ఈ సుకుమారియే అరివీరభయంకరయైన వీరలక్ష్మిగా కూడ ప్రకాశించును.

సత్యభామ "హంసగమన". ఆమె పసిండి యందెల రవళి నాయంచ లంతత" వెన్నంటి వచ్చునని పారిజాతాపహరణము వర్ణించినది (2-14). దీనివలన ఆమె హంసలకు కూడ నడకలు నేర్పింప గలదని తెలియును. ఈ వర్ణనముచే సత్యభామ నడకలోని తిన్నదనము నొయ్యారంబును వ్యజ్యమానంబు అగుచున్నది.

"మంజీర రవము మించ హంసలు మగువను వెంబండించు"నని (పు. 7) 'సతీపతి దాన విలాస యక్షగానమును' సత్య హంసగమనమును మెచ్చినది. దీపావళి నాటకమున "కదిలెడిరాజహంస" (పు. 65) అని సత్య ప్రశంసింపబడినది. కొన్నిమారులు సత్యగమనము గజగమనము వలె గంభీరముగను నుండును. ఆమె 'గంభీరవేది గమన' (పారి - 2 - 93), వారణ రాజయాన" (పైది 4 - 8) అనియు చెప్పబడినది.

ఆమె నడకలో ఒక విధమైన ఠీవి, ఒయ్యారము, లాలిత్యము, గాంభీర్యములున్నవి. "నాగరికమైన నడలు నయము మీఱ" (పు. 50) సత్య నడచునని సత్య నడకలోని నాగరికతను 'రుక్మిణీ సత్యభామాసంవాద యక్షగానము పొగడినది. సత్యభామ అంగ ప్రత్యంగ సౌందర్యము అష్టమహిషీ కల్యాణమునందు మాత్రము సమగ్రముముగ నీయబడినది.[2] దానిని బట్టియు సత్యభామ సమగ్ర రూపమును కొంతవరకు ఊహింప వచ్చును.

సత్యభామ "లతాంగి" (వి.పు. 6. 276) లలితాంగి (పారి. 1 - 133) కూడ! ఈ విశేషణముల నాధారముగా చెన్నాప్రగడ తిరుపతి రావుగారు "నామట్టునకు నాకు సత్యభామ అనగానే ఈ విధముగా తోచుచుండును. ఆమె సన్నగా పొడవుగా నుండెడిది. లలితాంగి అనగా ఆమెయే అనిపించును" అని అనినారు.[3]

సత్య "అలి నీలాలక" (భాగ - 10 - ఉ. భా - 179). కుంతలములు వక్రములై

---

*1. రసార్ణవసుధాకరము - 1 - 185*

*2. అ. మ. క - పు. 225, 226*

*3. పంచ కన్యలు - పు. 21.*

యుండును. కావున "ఆరాళకుంతల" కూడ (పారి. 1 - 123). సంస్కృత భాగవతము సత్యగుణశీలౌదార్యములు కలదిగా వర్ణింపగా, పోతన ఆమెను "చారు చికుర సీమ"గా (భాగ - 10 - ఉ. భా - 181) కూడ వర్ణించెను. ఆమె జట్టు ఇంద్ర నీలమణివలె నల్లగా నుండును కావుననే లలితేంద్ర నీలశకలోపమకైశిక" (పారి - 1 - 135). సత్యభామ అనగానే జడ ముందునకు వేసికొని "భామనే సత్యభామనే" అని స్వాతిశయ భావముతో నడచివచ్చు వనితామణియే మన కనుల ముందు నిల్చును. స్త్రీలకు పొడవైన జట్టు [redacted]ండుట సౌందర్య లక్షణము. సత్యకు పొడవైన జుట్టు ఉండి యుండును. కొన్ని మారులు కొప్పుగా ముడుచు కొనుచుండును. భాగవతమున నరకాసురునితోడి, యుద్ధ సంరంభమున "వేణింజొల్లెము వెట్టినది (10 - ఉ. భా - 170). ఉత్తర హరివంశమునందును "జడగొప్పు" (1-151) ధరించినట్లుగ వర్ణింపబడినది. దీనిని బట్టి సత్య యుద్ధ సమయములందు 'కొప్పు' పెట్టుకొనుటకే ఇష్టపడునని తెల్లమగును. సాధారణ సమయములందు సత్య వాల్జడనే ధరించినట్లు కనిపించుచున్నది. అదియే ఆమె కిష్టమైనదిగాను అనిపించును. జడ అనగానే మనసులో ఒక విధమైన మధుర భావము, ఆహ్లాదము కలుగును. పొడవైన జడ స్త్రీలకు అందముగానే గాక ప్రత్యేకమైన ఠీవిని కూడ కల్గించును. "త్రివేణీ విశిష్ఠాయా స్త్రీ" అని జడ ఉత్తమ స్త్రీలక్షణములలో ఒకటని కూడ శాస్త్రము చెప్పుచున్నది. ఎంతటి మగధీరుడైనను, వాల్జడ ధారిణులకు వశ్యుడగును.

వాల్జడలో ఎంత శృంగారమున్నదో దానితో ప్రియుని కొట్టులో మరింత శృంగార మున్నది. శృంగార నాయికలు అపరాధియైన ప్రియుని వాల్జడతో శిక్షించుట పలుచోట్ల సాహిత్యమునందు కనిపించును. 'సత్యభామాసాంత్వన' ప్రబంధ సత్య, ఖండితయై ప్రియుని "జడ గొట్టును" (పు. 158)."లేమలందరు జూడ జడతో వేమరు నినుగొట్టకుంటే" (పు. 86) అని 'భామా కలాపపు' సత్యభామ పతిని బెదిరించినది. వాల్జడలో పూలును ధరించుటయు" సత్యకు ఇష్టము. బాలకృష్ణ లీలా విలాస సత్య, కురులు నున్నగ దువ్వి గొజ్జంగి విరులసరులచే బెనగొన్న జడ జంఘులంట" (పు. 120) కనిపించును. 'వెలయగీల్జడ నిండ విరిసరుల్దాల్చి' నది (పు. 6). 'సతీపతి దాన విలాస' సత్య "కఱుకు జడను విరిసరములు మెఱయ" (పు. 50), అభిసారికయై వచ్చినది. రుక్మిణీ సత్యభామాసంవాద యక్షగానమున, "సత్యభామ! నీచక్కని జడకు జాజులైన ముడిచేనే" (తలుపు దగ్గరపాట)! అని ప్రణయకుపితయైన జానపద సత్యను, కృష్ణుడు లాలించును.

*"చెలువంపు కుందనములూ - దాని మంచి చెక్కుటద్దముల బోలు*
*చక్కెరకంటె మిగుల విధినమరి -సఖియ చిగురు బోణి*
*మొలకనవ్వుల కృష్ణుడు - ఆ తరుణిని మోహించక తీరడమ్మ"*

*.....(రుక్మిణీదేవి ముచ్చట్లు - పు. 176)*

అని జానపద రుక్మిణి, సత్యభామ సౌందర్యమును తలచి భయపడినది. దినమున కెనిమిది బారువుల బంగారము నిచ్చు శమంతకమున కధిపతియైన సత్రాజిత్తు పుత్రియు, కృష్ణప్రభు పత్నియునగు సత్య ఐశ్వర్యమునకు లోటేమి యుండును.

ఇంతటి సౌందర్య సౌభాగ్యరాశి యగు ఈ అద్భుత సుందరియగు సత్య "రూపేచ లక్ష్మి"యే అనదగును.

## క్షమయా ధరిత్రీ :

కులకాంత, క్షమా గుణమున ధరిత్రి వలె ఉండవలయునని పెద్దలందురు. కొందరు కవుల వర్ణనలను బట్టియు, భామాకలాపాది ప్రజాకళల ప్రదర్శనలను బట్టియు, హరికథా

పురాణ శ్రవణాది మౌఖిక ప్రచారములను బట్టియు, సత్యభామ తీవ్రకోపనయను అభిప్రాయము లోకమున వ్యాపించి యున్నది. నిజమునకది కోపము కాదు. ఆత్మాభిమానమునకు విఘాతము కలుగునపుడు మాత్రము ఆ మానిని సహింపలేదు. ఆ సమయమునందు కొంత రోషముతో వర్తించుట ఎట్టి మానినికే కాదు, ఎంతటి మానిసికైనను సహజమే. కాని సత్యలో కోపము తృణాగ్నికి వలె అల్పకాలము మాత్రమే నిల్చును. అది క్షణికము. పతి అర్ధాపరాధియైనపుడు వివశయై కొంత కఠిన పరుష జాలమును వాడినను, పాదము విసిరినను, అతని లాలింపులు తనకు సాంత్వనము కల్గించిన మరుక్షణముననే అంతయు మరచి, పతితో నెప్పటియట్ల ప్రేమాతిశయముతో నడచుకొను క్షమా హృదయ సత్యభామ.

భైరవ కవి హరివంశమున, పారిజాతవిషయకముగ, మొదట ఈర్ష్యా క్రోధములకు లోనయ్యు, పతి పారిజాతమును తెచ్చి యీయగలనని·వాగ్దానము చేయగానే ప్రసన్నయైనది. సత్యభామను ఆంధ్ర సాహిత్య లోకమునకు అద్వితీయ మానినీలలామగా అందించిన వాడు తిమ్మన. ఆమె మానినీత్వమును చెదరక కాపాడిన వాడు సిద్ధేంద్రయోగి. అయినప్పటికిని వీరివురి చిత్రణలోను, సత్యభామ సహనమును నేర్చినది. పారిజాతాపహరణ ప్రబంధమున పారిజాతపుష్ప ప్రదాన విషయమున ప్రణయాపరాధము చేసిన పతిని మొదట సత్య తీవ్ర వాగ్జాలముతో నిందించినను, కోపమును నిగ్రహించుకొనలేక, మ్రొక్కిన పతి శిరమును వామ పాదముచే 'తొలగ ద్రోచి' శిక్షించినను (పారి 1 - 121), పుష్పమునకు బదులు వృక్షమునే తెచ్చియిత్తునని అనగానే, జరిగినదంతయు మరచి, "అంబుదశ్యాముని గర్జిత మధుర వాక్యములకు సత్యామానిని ఉల్లము, "నీ పలతిక వోలె" పల్లవించెను. (పారి-1-137). కోపముపశమింపగానే ఇంచుకయు మనంబున గణింపక భర్తకు మజ్జనాద్యుపచారములు సలుప గడంగినది. (పైది. 2 - 4).

"ఉత్తమే క్షణ కోప స్స్యాత్! మధ్యమే ఘటికాద్వయం అధమే స్యాదహోరాత్రం! పాపిష్ఠే మరణాంతకం" (భోజ చరితమ్).

'ఎట్టివారికైనను ఏదో ఒక సమయమున కోపము రాకుండ ఉండదు. కాని ఉత్తములైన వారిలో ఆ కోపము కొంచెముసేపు మాత్రమే యుండి తగ్గిపోవును. మధ్యములలో రెండు ఘడియల సేపును, అధములలో ఒక దినమంతయు నుండును. పాపిష్ఠులందు బ్రతికియున్నంత కాలము నుండునని పై శ్లోక భావము. సత్యభామ ఉత్తమయగుట చేతనే కోపము వెంటనే తొలగినది.

సత్యభామాసాంత్వన ప్రబంధమునందు చిత్రితమైన సత్య, పతి నరకుని చెరనుండి విడిపించిన పదునారువేల వనితలను చేపట్టినాడని ఆగ్రహించి, ఆగడము చేసినను, చివరకు పతి చేసిన కొంటెపనికి, శృంగార చర్యకు పరవశించి, కోపము నంతయు మరచి 'కలకల నవ్వి' వేయును. (పు.161).

ఇట్లే, భామా కలాపమునందును పతి తన నుపేక్షించి సవతి రుక్మిణి నాదరించుట భరింపరాని అవమానముగ అనిపించినను, ఆవేదనను కల్గించినను, అతని మహాను భావత్వమును గూర్చి చెలి వివరింపగానే, బంగారు పూవులతో పూజ సేయుదుననియు, చెంగల్వ పూలదండలు మెడనిండవేసి, శృంగారముగ గన్నుల నిండ చూతునని (పు. 87) అనుచు, ఆరాధనా భావముతో అర్చించును.

పతియెడలనే కాదు, ఇతరుల యెడ కూడ, సత్య క్షమాగుణమును ప్రదర్శించును. నారదుడు తన పరోక్షమున, సవతి ముందు, తనను గూర్చి అంతగా న్యూనపరచి మాట్లాడి

తనకు తీవ్ర మానహాని కల్గించినను, అతడు తన యింటికి అతిథిగా రాగా, సత్య పూర్వపు క్రోధమునంతయు విస్మరించి, అతిథేయ మర్యాదలు చేయును. ఇట్టి సత్యభామ, భైరవ కవి హరివంశమునందును[1], పారిజాతాపహరణము[2] నందును కన్పట్టును.

## సత్యభామ సంతానము :

పూర్వకాలమున, గంపెడు సంతానము ఉత్తమ సౌభాగ్యవతి లక్షణముగా భావించెడి వారు. స్త్రీ జీవితమున వివాహమును మాతృత్వమును ముఖ్యమైన ఘట్టములు. వీనిని బట్టి స్త్రీ యొక్క స్థానమును నిర్ణయించుటయు కలదు. సత్యభామ తల్లిగా నిర్వహించిన పాత్రను పరిశీలించుటకు ముందు, ఆమె సంతానమును గూర్చి పురాణేతిహాసములు పేర్కొనిన అంశముల నరయుట ముఖ్యము.

సత్యభామను బహు సంతానవతిగ పురాణేతిహాసములన్నియు వర్ణించినవి. కాని సత్యభామ సంతానము యొక్క సంఖ్యను పేర్కొనుట యందును, వారి నామములను పేర్కొనుట యందును ఇవి అన్నియు కొంత కొంత భేదమును చూపినవి.

ముందు సంస్కృత పురాణేతిహాసములందలి వర్ణనము దర్శింపనగును. హరివంశము వృష్ణివంశ వర్ణనము చేయుచు అష్ట మహిషుల సంతానమును పేర్కొనునెడ, సత్యభామ సంతానమునిట్లు పేర్కొనినది.

*జజ్ఞిరే సత్యభామాయాం భానుర్భీమరథః క్షుపః*
*రోహితో దీప్తిమాంశ్చైవ తామ్రజాక్షో జలాన్తకః1*
*భానుర్భీమాలికా చైవ తామ్ర పర్ణీ జలంధమా 11-8*
*చతస్రోజజ్ఞిరే తేషాం స్వసారో, గరుడధ్వజాత్ 1 - 9 ....(హరి. వి. ప - 103)*

దీనిని బట్టి, భాను, భీమరథ, రోహిత, దీప్తిమాన, తామ్రజాక్ష జలాంతక అనెడు ఆరుగురు కుమారులును, భాను, భీమాలిక, తామ్రపర్ణి, జలంధమ అను నల్గురు పుత్రికలును సత్య సంతానమని విదితమగును.

విష్ణు పురాణము, రుక్మిణీ సత్యల సంతానము గూర్చి ఇట్లు వర్ణించినది.

*"ప్రద్యుమ్నా ద్యా హరేః పుత్రా రుక్మిణ్యాంకథితాస్తవ ।*
*భాను భౌమేరి కాద్యాంశ్చ సత్యభామా వ్యజాయత॥ ......(వి. పు. 5 - 32 - 1)*

హరివంశమునకు వలె పది మందిని గాక, కేవలము "భాను భౌమేరి" కులను మాత్రమే పేర్కొని, మిగిలిన వారిని 'ఆదుల' ని అనుచు వారిని గూర్చి చెప్పకుండా, తప్పించుకొనినది. అంతేకాదు సంతాన సంఖ్యను కూడ నిర్దేశింపలేదు. హరివంశమున భానుడున్నను భౌమేరికుడు మాత్రము లేడు. బ్రహ్మ పురాణమును 'భాన్వాదు' లు సత్యాపుత్రులని చెప్పినదే కాని, అంతకన్న అధిక వివరము లీయలేదు.[3]

అన్నింటికన్నను సంస్కృతభాగవతము అష్ట మహిషుల సంతాన సంఖ్యను, వారి నామముల పట్టికను చక్కగా నిర్దేశించి చూపినది. అష్ట మహిషులు ప్రతి ఒక్కరికిని, పదుగురేసి సంతానమనుచు, సత్యభామ సంతానమును గూర్చి

*"భాను, స్సుభాను, స్స్వర్భానుః, ప్రభాను, ర్భాను మాంస్తథా,*
*చంద్ర భాను, ర్బృహ ద్భాను రతి భాను స్తథాష్టమః - 10*
*శ్రీ భానుః, ప్రతి భానుశ్చ, సత్యభామాత్మజా, దశ -11 ......(భాగ. 10 - 61)*

---

*1. భై. హరి - 5 - 77*
*2. పారి - 2 - 17*
*3. "భాన్వాదికాంశ్చవై పుత్రాన్సత్యభామా వ్యజాయత" - బ్రహ్మపురాణము - 205 - 1.*

అని వర్ణించినది. దీని వలన భాను, సుభాను, స్వర్భాను, ప్రభాను, భానుమాన్, చంద్రభాను, బృహద్భాను, అతిభాను, శ్రీభాను, ప్రతిభాను" అను పదిమంది సత్యభామ సంతానమని తెలియుచున్నది.

ఇక తెలుగున ఎఱ్ఱన హరి వంశమున, సత్యభామ సంతానమును గూర్చి ప్రత్యేకముగ పేర్కొనలేదు. రుక్మిణీదేవి సంతానమును వర్ణించిన తదుపరి "... తక్కిన దేవులయందును భానుండును, భానువిందుండు, సంగ్రామజిత్తు, దీప్తిమంతుండు, వృకుండు మొదలుగా బెక్కెండ్రు గొడుకులును మిత్రవతీ ప్రముఖులగు కన్నియలును జనియించిరి." (ఉ. భా - 3 - 211) అని మాత్రమే కలదు. ఎవరు ఎవరి బిడ్డలనుట స్పష్టము చేయబడ లేదు. మూల హరివంశముతో పోల్చిచూచిన భానుండు మాత్రము, సత్యభామా పుత్రుడని తెలియవచ్చు చున్నది. అనగా, ఎఱ్ఱన, మూలమునందలి పదిమంది సంతానములో, ఒక్కనిని మాత్రమే తన అనువాదమున ఆదరించెనని భావింపవలసి వచ్చుచున్నది.

'సూరన విష్ణు పురాణమున భాను కాదు'లనుచు సత్యాపుత్రులను పేర్కొనినది (8-146). ఇదియును మూలమునకు వలె ఆదులని చెప్పి, వారి పేర్లను చెప్పకుండ తప్పించుకొనినది. ఎఱ్ఱన హరివంశముకన్నను ఇందు, ఎవరు, ఎవరి సంతానమను విషయమున కొంత స్పష్టతయున్నను, ఆ సంతానమును గూర్చిన పూర్తి వివరము లిందును నీయబడలేదు. ఆధునిక కవియగు తాడేపల్లి సీతారామస్వామి పంతులు అనువదించిన విష్ణుపురాణము, మూలానుసారముగా 'భాను భౌమ ముఖ్యుల గనియెను సత్యావధూటి ఘనుల బలువురిన్' (5 - 5 - 4) అనియే చెప్పెను.

మడికి సింగన వ్రాసిన ద్విపద భాగవతమును సత్యాదులు 'పదియేసి' తనయుల బడసిరని అనుచు, వారి నందరిని పేర్కొనకుండక

*"భానుమంతాదుల బదురుకుమాళ్ళ*
*మానుగా సత్యభామకు బుట్టిరెలమి" ... (పు. 127)*

అని, భానుమంతుని సత్యాపుత్రుడనుచు అతని పేరును మాత్రమే ప్రత్యేకముగ చెప్పెను. సంస్కృతభాగవతము అష్టమహిషీసంతానము నంత వివరముగా వర్ణింపగా, "ఆంధ్ర భాగవతము", మూలమునకు వలె స్పష్టతను చూపక, ఇతర ఆంధ్రపురాణముల మార్గమునే అనుసరించినది. రుక్మిణి సంతానము యొక్క నామములను మాత్రము స్పష్టముగా పేర్కొనుచు, "అట్లు సత్యభామా జాంబవతీ నాగ్నజితీ, కాళిందీ, మాద్రీ, మిత్రవిందా, భద్రలకు వేఱువేఱం బదుగుతేసి భద్ర మూర్తులైన కుమారు లుదయించిరి." (భాగ-10 ఉ. భా. 275) అని, అనినదేకాని, సత్య సంతానమైన ఆ పదిమంది నామములను ప్రత్యేకముగ తెలుపలేదు.

మడికి సింగన అనువాదమైన పద్మపురాణమున సత్యాసంతాన ప్రస్తావనయే కానరాదు. కాని ఆధునిక కవి పిసుపాటి చిదంబర శాస్త్రి అనువదించిన పద్మపురాణమునందు, సత్య భామకు ఏడుగురు పుత్రులు, నొక పుత్రికయు కలరనుచు వారి నామముల పట్టిక నిట్లు వర్ణించినది. "సత్యభామకు భానుండు, భీమరథుడు, క్షుణుడు, రోహితుడు, దీప్తిమంతుండు, తామ్రబంధుండు, జలంధముండు, నను నేడుగురు పుత్రులును, నొక్క కన్యకయును జన్మించిరి" (సృష్టి ఖం. - 3-338). ఇందలి నామములు చాల వరకు సంస్కృత హరివంశమును పోలియున్నను, సంతానసంఖ్య యందు మాత్రము భేదము కనబడుచున్నది.

గోపీనాధము వేంకటకవి కృతమగు బ్రహ్మవైవర్తపురాణము (శ్రీ కృష్ణజన్మ ఖండము), అష్ట మహిషీ కల్యాణవర్ణ నాంతరము. "ఒక్కొక్క యువతికి, మక్కువతో దశపుత్రులు నొక పుత్రి, వొడమిరి" (7 - పు. 373) అని చెప్పినదే కాని, ఇదియును ఆ సంతానమ్ము యొక్క నామావళిని నీయలేదు. బ్రహ్మపురాణము, రుక్మిణీ సంతానమును పేర్కొనిన తరువాత

"సత్యభామయుఁ దనయుల గనె భాను ముఖ్యులను..." (4-96-135) అని మాత్రమే చెప్పినది. ఇదియును విష్ణుపురాణ, మూలబ్రహ్మపురాణముల మార్గమున 'భాను'ను మాత్రము ప్రత్యేకముగ పేర్కొని, ఇతరుల నామముల నీయకుండ ప్రముఖులని చెప్పి యూరకుండినది. వారి సంఖ్యను కూడ నిది సూచింపలేదు. సంఖ్యానిర్దేశమునందు, నామ నిర్దేశమందును పురాణములొక దానితొనొకటి విభేదించుచున్నను, సంస్కృతాంధ్ర భాగవతములును, ద్విపద భాగవతము, ఆంధ్ర బ్రహ్మవైవర్త పురాణమును పదిమంది పుత్రులని సంఖ్యా నిర్దేశమునందు ఐక్యతను ప్రకటించుటచే, సత్యభామకు పదిమంది సంతానమని గ్రహించుటయే యుచితముగా నుండును. "భాను" అను వానిని మాత్రము, సకలపురాణములును విడువక, సత్యభామాపుత్రునిగ పేర్కొనుట గమనింపదగినది.

సాంబుడు జాంబవతీ పుత్రుడని సకల పురాణేతిహాసములు నుద్ఘోషించుచుండగా, అతడు సత్యభామా పుత్రుడనియు, బృహతి అను ఆమెకుమారుడైన గదుని, జాంబవతీ పుత్రుడనియు అధునిక ప్రబంధమైన శ్రీ కృష్ణాతిమానుషతత్త్వము పేర్కొనుట వింతగా ఉన్నది.[1] సత్యభామా పుత్రుల ప్రస్తావన పురాణేతిహాసములం దరుదుగ కనిపించును. ఆంధ్రభారతమున సుభద్రాకల్యాణ సమయమున, రైవతకాద్రిపై జరుగు ఉత్సవమునకు "సారణ, సత్యకాక్రూర, విదూరద, సాంబ, సంకర్షణ, శంబరారి, భాను, సుషేణోగ్రసేన, శైనేయానిరుద్ధ, హార్దిక్య గదోద్ధవాది యాదవులు" భార్యా సమేతులై యేగిరని యున్నది. (ఆది - 8 - 176). ఇందలి "భాను", సత్యాపుత్రుడైన 'భాను' యే అయి యుండును. భారతమున ఇతడు తప్ప మరియొకడు కనిపింపడు. ఈ పట్టునందు తప్ప, మరి యెచటను అతడును గోచరించుట లేదు.

భైరవకవి హరివంశమున, పిండారక తీర్థమున వారిధి యందు జలక్రీడలాడుటకై శ్రీకృష్ణుడు యాదవ బలసమేతముగ నేగును. ఆ అనందోత్సవమున ప్రద్యుమ్నాది వృష్ణికుమారులతో పాటు "ఉదార వీర్యుండగు సాత్రాజితి సూనుండును", 'నటియించెను' (6-166) అని వర్ణితము. సాత్రాజితీసూనుడు ఉదార్యవీరుడనుట స్పష్టమైనను, అతడెవరనుట మాత్రము అస్పష్టముగ నున్నది. ఆంధ్ర భాగవతము సత్యభామ సంతాన నిర్దేశమున స్పష్టతను ప్రదర్శింపకపోయినను, ఆమె సంతానములో ప్రఖ్యాతులైన వారిని కొందరిని సూచించినది. ఆ పట్టికలోను, ఎవరి సంతాన మెవరనుటను పేర్కొనకపోయినను, మూల భాగవతము నందీయబడిన సంతాన క్రమమును బట్టి వారెవరి పుత్రులనుటను గుర్తింపవచ్చును. కృష్ణ సంతానములో రుక్మిణ్యాది పట్ట మహిషులకు నుద్భ[illegible]మైన నందనులలో "బాహుబలపరాక్రమ విజయ సంపద్విశేష మానితాత్ములు పదునెనమండ్రు కలర"నుచు

• "వారలు ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమత్, భాను, సాంబ మిత్ర, బృహద్భాను, మిత్రవింద,

1. *"గదుడుదయించె, జాంబవతి, గర్భమునందును సాంబ నామకుం డుదయమునొందె, సత్యకు, బయోరుహనాభు, పదారువేల స మ్మద, గజయాన లెల్లరు, గుమారుల గాంచిరి....."*
*దివిరంగాచార్యులు - శ్రీకృష్ణాతిమానుషతత్త్వము - 3 - 4 - 63*

వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రభాను, వరూధ, కవి, న్యగ్రోధులను నామంబులం బ్రసిద్ధులైరి" (భాగ 10 - ఉ. భా. - 1325) అని వర్ణించినది.

ఇందు "భాను, బృహద్భాను", మాత్రము సత్యాపుత్రులు. దీనిని బట్టి వీరివురును సత్యాసంతానములో వీరులనుట నిశ్చయమగుచున్నది

కాని రుక్మిణీ జాంబవతుల పుత్రులైన ప్రద్యుమ్న సాంబులతో పోల్చి చూచినపుడు వీరివురి ప్రస్తావన పురాణేతి హాసములందంతగ కనిపింపనే కనిపింపదని చెప్పవచ్చును.

ప్రద్యుమ్నసాంబు లిరువురనేక యుద్ధములలోను, స్వయంవరోత్సవములలోను పాల్గొని యున్నారు. ద్రౌపదీ స్వయంవరమునకు వీరివురు నేగిరి[1]. అర్జునునకు సుభద్రపై గల నెయ్యమును గూర్చి కృష్ణు డేకాంతమున దేవకీ వసుదేవులతో చర్చించుచు, అచ్చటనున్న వీరివురికిని నెరింగించును.[2] అభిమన్యుని కల్యాణమునకు తరలివచ్చిన వారిలో వీరివురు నున్నారు.[3] అనిరుద్ధుని విడిపించుటకై బాణాసురునితో వీరివురును పోరాడినారు.[4] కురుక్షేత్ర యుద్ధానంతరము ధర్మజుడు కావించిన అశ్వమేధ యాగమునకు వీరును నేగినారు.[5] ఇట్లు వీరివురును రాజకీయ సమస్యల పరిష్కారమునందును కుటుంబ విషయ చర్చలయందును, అత్యంత ప్రముఖపాత్ర వహించినట్లు గ్రహింపగలము. కాని పై ఘట్టములందు సత్యా పుత్రుల ఉనికి కూడ సూచింప బడలేదు. చివరకు యాదవవంశ నాశనమునకు దారి తీసిన మధుపానఘట్టమున, మధుపాన కాంక్షతో మధువును త్రాగిన వారిలో ప్రద్యుమ్నాదు లున్నారు[6]. కాని అందును సత్యా పుత్రుల ప్రస్తావన లేదు.

కృష్ణ సంతానములో, రుక్మిణీ సంతానమునకు చెందిన వాడే చివర వరకు నిల్చినాడు. "... మాధవునకు రుక్మిణీ దేవి యందు బిత్రసముండును, సమగ్ర భుజా విజృంభణుండునునై ప్రద్యుమ్నుండు జనియించె. అతనికి, రుక్మి కూతురగు శుభాంగి వలన ననిరుద్ధుండు దయించె. అతనికి మౌసలావశిష్టుండైన వజ్రుండు సంభవించె" (భాగ - 10 - ఉ. భా. - 1328) అనుటచే ప్రద్యుమ్న సంతతియె, చివరకు వృష్ణివంశమును ఉద్ధరించినట్లు తెలియుచున్నది.

సాంబుడు జాంబవతీ పుత్రుడయ్యు 'బలరాముని దత్తపుత్రుడై వరలినాడు[7]. సత్యభామా పుత్రులలో నెవరికిని నిట్టి వాత్సల్యము లభించినట్లు లేదు. ప్రద్యుమ్నుడు ప్రభావతిని, సాంబుడు లక్షణను వివాహమాడుట హరివంశమునందు వర్ణింపబడినది. ఇతర పురాణేతిహాసముల యందును వీరివురి వివాహ వర్ణన చేయబడినది. కాని వాని యందును సత్యభామాపుత్రుల విద్యా, వివాహాది విషయములను గూర్చి, చిన్న ప్రస్తావన కూడ కనిపింపదు. కాని పదునారవ శతాబ్దమునకు చెందిన తరిగొప్పుల మల్లన మాత్రము

---

*1. భార - ఆది - 7 - 171*

*2. పైది - అది - 8 - 190*

*3. పైది -విరాట - 5 - 375*

*4. భాగ - 10 - ఉ - భా - 392*

*5. భార - అశ్వ. - 3 - 161*

*6. పైది - మౌసల - 1 - 40.*

*7. హరి - ఉ - భా - 3 - 213*

సత్యభామాపుత్రుడైన చంద్రభాను చరిత్రను ప్రబంధ రూపమున చెప్పెను. పురాణేతిహాసములు సత్యాసంతానమును గూర్చి పేర్కొనినవేకాని, ఆ భాగ్యమును పొందుటకై లోనైన ఆమె మానసిక వ్యథను వర్ణింపలేదు. చంద్రభాను చరిత్రము, సత్యభామ మాతృహృదయమును ఆ చంద్రభానుడు పెరిగి పెద్దయై విద్యాబుద్ధులు గరచి, ధైర్య పరాక్రమ సాహసాదులను ప్రదర్శించుట, అతని వివాహము, మున్నగు విశేషములన్నియు వర్ణించినది.

## తల్లిగ :

చంద్రభాను చరిత్రను ఆధారముగ చేసికొనియే సత్యభామను మాతృమూర్తిగ కొంతవరకు దర్శింప వీలగుచున్నది. తనకన్నను ముందుగా పట్టపురాణి రుక్మిణి ముజ్జగంబులు నుతియించునట్లు, బంధులు గారవించునట్లు, ముద్దులొలుకు చక్కని బిడ్డను పొంది విఱ్ఱవీగుచుండగ, ఆమెను జూచి సత్యభామ,

*"..... కడు పొరఁగ ముద్దుల పట్టి గానఁగా*

*నోఁచని యింతి జన్మము గనుంగొన రిత్త",* ... అని బాధపడుచు "పలు మాఱును దాఁదను దూఱుకొంచు జింతావిల చిత్తయైనది (1-87). సంతాన భాగ్యము పొందని తనను తాను నిందించుకొనుచు దుఃఖించిన సత్యలో మాతృమూర్తి యగుటకై తపించు ఒక స్త్రీ హృదయమును చూడగలము. భర్త అనుగ్రహముచేతనే తాను సంతానవతి కాగలదు. కావున ఆ భాగ్య సిద్ధికై ఎదురుచూసినది. సరసురాలు కావున, తన ధామమునకు విచ్చేసిన శ్రీకృష్ణుడు, కేళీ గృహము నందలి తూగు మంచమున వసించునపుడు సమయమెఱిగి "కుల వధువువోలె" వీడ్యము చేతనుంచుకొని, "ఇచ్చకపు టొయారముల్వెలయ" "వేడ్కనొక్కొక మడుపొయ్య నిచ్చుచు" "మృదూక్తులతో"

*"అఖిల వైభవంబుల మించినట్టి నాకు*

*వాంఛితమొకండు లేదైన వలయుఁదెలుప*

*విన్నవింపగఁ దగినట్టి చిన్న దొక్క*

*మనవి గలదాలకింపుము మనుజనాథ"* .... *(చంద్ర. చ. 1 - 93)*

అని అర్థించుచు "... తెప్పల తుదల, న్నును సిగ్గు దొలంక" ... (పైది. 94) పతిని కనుగొనినది. చిన్న దొక్క మనవి కలదనినదే కాని అదియేమొ ఆమె నోరు విప్పి చెప్పలేదు. కృష్ణుడును ఆమె 'తలపెఱిగి' పుత్రుని ప్రసాదించెను.

"రుక్మిణి కొడుకును గన్న దన్న యీసున సత్యభామ కృష్ణుని దనయ ప్రాప్తికై ప్రార్థించుటయుఁ గృష్ణుం డాయమకుఁ గుమారు ననుగ్రహించుటయు" జరిగినదని కల్లూరి సాంబమూర్తిగారు తమ అభిప్రాయమును ప్రకటించినారు.[1] సవతికి కల్గిన నూతనప్రాభవమునకు సత్యలో కొంత ఈసు కల్గియుండ వచ్చును. అది స్త్రీ జన సహజమైనదే. కాని, ఆమె కేవలము ఈసుతోనే తనయప్రాప్తికై కృష్ణుని విన్నపము చేయలేదు. కడుపొరగ ముద్దుల బిడ్డనుపొందగా నోచని యింతి జన్మము వ్యర్థమనెడు అభిప్రాయముతోనే, ఒక మాతృమూర్తిగా తాను నిలువవలయునను తహతహతోనే, కృష్ణునితో "చిన్నదొక్క మనవి కలద"ని అర్థింపవలసివచ్చినది.

దీనిని బట్టి, చంద్రభాను సత్యభామకు ప్రథమ పుత్రుడని అవగతమగుచున్నది. హరివంశ, విష్ణుపురాణాదుల... ంటను 'భాను' అనునతడు సంతాన క్రమములో ప్రథమునిగ

---

*1. సాంబోపాఖ్యానము - పీఠిక - xiii*

పేర్కొనబడి యున్నాడు. సంస్కృత భాగవతము భాను, చంద్రభాను వేరేఁగు వ్యక్తులుగ పరిగణించినది. అందును 'భానుని' ప్రథమముగ పేర్కొనినది. కాని స ు కల్పనలో 'చంద్రభాను' సత్యభామకు ప్రథమ పుత్రుడైనాడని భావింప వలసి వచ్చు న్నది. నారదుని కలహభోజన ప్రియత్వము వలన చంద్రభాను ప్రద్యుమ్నునిమించిన సంగీత కళావిశారదు డగుటకు తుంబురుని కడ శిష్యరికము చేసి, మనోరథ సిద్ధిని పొందుటయు. అరణ్యమున తననెదిరించిన రాక్షసునిముందు వీర సాహసాదులను ప్రదర్శించి తని వలన అద్భుతరథమును అదృశ్యతయు కామరూపతయును, వరములుగా పొంది ంఎంకు కుండిన దేశ రాకుమారి కుముదినీకరము నందుకొనుటయు ఈ ప్రబంధమున వర్ణింపబడినది. ఇంతటి వీరుడును, సంగీతకళాపండితుడైన చంద్రభాను యొక్క చరిత్రమును పురాణేతిహాసము లేవియు స్మరింపకుండుట ఆశ్చర్యముగా నున్నది.

ప్రద్యుమ్నుని మించిన గాన విద్యావిదుడగుటకై, పురమును వెడలి పోవలయునని నిశ్చయించుకొనిన సమయమున

"... మన, మీ విధము పురంబుజేర నేగి హరికి, సత్యా వనితకు నెఱిఁగించిన, బోవఁగ నీరిదియ వెడలి పోఁదఱి".... (చంద్ర. చ - 3 - 6) అని సాత్యకీ తనయుడైన విజయసేనుని తొందరపెట్టును. తల్లిదండ్రులు పుత్రప్రేమచే తమను పురము వీడి పోనీయరని ఇతడు భయపడును. ఈ ఒక్క సందర్భమున తప్ప, మరియెచ్చటను ఈ తల్లీబిడ్డల ఆత్మీయతకు సంబంధించిన ప్రస్తావన కనిపింపదు.

దీపావళి నాటకమున, నరకాసుర వధానంతర మాతడే పూర్వజన్మమున తన పుత్రుడనితెలియగానే, సత్య 'కన్నతల్లినై కొడుకును, చంపుకొన్న గర్భశోకమునెట్లు భరింతును' (పు. 80) అని బాధపడుట కనిపించును. తల్లిగా నరకునికై తపించిన సత్య, సత్యభామగా, ఈ జన్మమున పొందిన బిడ్డల విషయమున ప్రత్యేకమైన శ్రద్ధ తీసికొనినట్లు గాని, వారిని గూర్చి పట్టించుకొనినట్లుగాని కనిపింపదు. ఆనాటి సంఘమున సత్యభామకు అత్తగా గొప్ప గౌరవమున్నట్లుగా 'చంద్రభాను' చరిత్రను బట్టి భావింప వచ్చును. చంద్రభానునకు కుముదినినిచ్చి, వివాహముచేసిన పిదప ఆమె తండ్రి, కూతును అత్తింటికి పంపుచు,

*"శ్రీ భర్త మామ యలస*
*త్యాభినుత సమాఖ్య యత్తయట తత్సేవా*
*వైభవ మెప్పుడుఁగలదఁట*
*నీభాగ్యం బేమి సెప్ప నీరజనయనా"* ... *(చంద్ర. చ - 5 - 118)*

అని అభినందించును. సత్యభామను సేవించుటయు ఒక భాగ్యముగ భావించి, అట్టి భాగ్యము తన తనయకు అబ్బుచున్నందులకు ఆ తండ్రి మురిసిపోయినాడు.

## సవతిగ :

సత్యభామ అనగానే 'అలిగిన అతివ' మన మనో నేత్రములముందు సాక్షాత్కరించును. ఆ అలుకకు మూలకారణములలో సపత్నీ మాత్సర్యమే ప్రధానమను నట్లు ప్రబంధాదులు నిరూపించుచున్నవి. పతి ఏకపత్నీ వ్రతస్థుడైనను, అతడొక పరకాంతతో సంభాషించినను, చివరకు ఆమె వైపు చూచినను, అతనిని భార్య అనుమానించుచు, మాత్సర్యమునకు లోనగుచుండును. ఇది స్త్రీజన సహజమైన గుణము. అట్టియెడ ఒకరు కాదు, ఇద్దరు కాదు, పదియారువేల యేడుగురు సవతులున్నపు డొక కాంత, అందును, మానమేమనుగడను మమకారముతో మసలు మానిని సపత్నీ మాత్సర్యమునకు లోనగుటలో వింతలేదు.

మాత్సర్యమనునది అరిషడ్వర్గములలో నొకటి కావచ్చును. కాని సామాన్య మానవులకు దీనిని పరిహరించుట అంత సులభసాధ్యము కాదు. మాత్సర్య మనునది స్త్రీ పురుష వివక్ష లేని సర్వజన సామాన్యమైన ఒక వ్యసనము. *"......అతుల మాన ధనాఢ్యుడైన భూపతి సహియింపనోపునె సపత్నుల వృద్ధియు నాత్మహానియున్" (భార. సభా. 2 - 98)* అని మానధనుడైన దుర్యోధనుడు కూడ, శత్రుప్రాభవ మత్సరగ్రస్తుడై బాధపడును.

స్త్రీలలో మాత్సర్య గుణము కొంత స్వాభావికముగానే యుండును. అట్టి యెడ ఎందరో సపత్నులను కలిగియుండు సత్యభామ సపత్నీ మాత్సర్యమునకు లోనై, యెడ యెడ దానిని ప్రదర్శించుట దోషము కాని అసహజము గాని కాదు. నారదునిచే లక్ష్మ్యంశగా నుతింపబడిన రుక్మిణి కూడ కులము, రూపము, న్మగని కూరిమియుం గలదాననని వాసి జెలంగి' 'సత్యభామతో పోటీపడుట రవరవలు పెంచుకొనుట పారిజాతాపహరణ ప్రబంధమున చూడగలము. (పారి - 1 - 42). ఈమెకే ఇంత మాత్సర్యమున్నప్పుడు, మానినీ మణియైన సత్యకు, సపత్నీమాత్సర్యముండుటలో వింతలేదు. పురాణకవులకంటెను, ప్రబంధకవులు, వారినిమించి యక్షగాన నాటకకర్తలును సత్యభామ సపత్నీమాత్సర్యమును పోటీపడి వర్ణించినారు.

## <u>పురాణేతిహాసములలో :</u>

'పురాణములలో సత్యభామ సపత్నీమాత్సర్యము ఆమె నోటిమాటలలోనే తొంగి చూచినది. సపత్నులయెదుట మాత్సర్యప్రదర్శనము, పోట్లాటకు దిగుట మున్నగు చేష్టారూపమున లేదు. సవతులపై ఆధిక్యము నెరపవలయు ననెడి ఆకాంక్ష ఈ యతివయం దధికమనుట విష్ణుపురాణము నిరూపించుచున్నది. నరకాసుర వధానంతరము పతితో కలసి అమర లోకమున కేగిన సత్య, పారిజాతమును చూడగానే దానిని సొంతము చేసికొన ఆరాటపడినది. శచీదేవిని మించవలె ననెడు భావముతో దానిని కోరుచున్నట్లుగా సూచించినను, అన్నిటికన్నను మిన్నగా సపత్నులందరిపై ఆధిక్యము నొందవలయునను అభిలాషయే ఆమెలో ప్రధానమై నిలిచియున్నది. .

*"ద్వారకాపురికి నీపారిజాతము గొని*
*యరిగి మదీయగృహాంగణమున*
*నుపవనంబులలోన నునిచిన నేను నీ*
*కారుణ్యమునఁజేసి కమలనాభ*
*యీతరు పుష్పంబులెలమితోఁగొనివచ్చి*
*చెలికత్తెలెత్తులు చేసి యొసఁగ*
*ముడిచి యొక్కొక వేళ ముదముతో నారుక్మి*
*ణీ మిత్రవిందాది భామినులకుఁ*
*బెట్టి పంపఁగ వారు నాపెంపు సూచి*
*సిగ్గు పడచుందు రట్లుగాఁజేసి తేని*
*యనఘ! నీ పాలనాకును జనవుగలదు*
*సవతు లెవ్వరు నాతోడ సవతు గారు" ....(సూ. వి. పు. 8 - 125)*

అని పతిని పారిజాతోత్పాటనమునకు ప్రేరేపించును ఈ మాటలను బట్టి సత్యభామ సవతులెవ్వరు తనతోడ సమానముకారు, అని నిరూపించు కొనుటకే ముఖ్యముగా పారిజాతము కోరుచున్నట్లు అనిపించును. మూలమున, "సత్యా మనుష్యకాంత" యనెడు తక్కువ భావముతో, శచీదేవి పారిజాతపుష్ప మొక్కటేనియు నీక, అవమానించిన కారణముగా, శచీ గర్వభంగమే ప్రధానముగా భావించి సత్య తన పతిని పారిజాతోత్పాటనమునకు ప్రేరేపించును. "భర్త బాహుబల దర్పితయైన శచి, తన యింటికి వెళ్లిన నన్ను, మర్యాదగా నాదరింపలేదు. స్త్రీనైన కారణముచేత నామనను కూడ, నధిక గంభీరము కాదు. కావున నేను నా భర్త గౌరవ ప్రకటనార్థమై ఈ యుద్ధమును కల్పించినాను. ఇతరుల సొత్తైన ఈ పారిజాతమును గ్రహించి పోవలసిన యవసరము నాకు లేదు," అని సత్య యుద్ధమున నోడి పరువెత్తు ఇంద్రునితో యుద్ధ కారణమును వివరించును.[1] కాని సూరన విష్ణు పురాణమున, దివ్య పారిజాతములను తాను ధరించుటయే గాక, రుక్మిణీ మిత్రవిందాది భామినులకు పెట్టి పంపవలయునని ఈమె కోరిక. అట్లు తనకు మాత్రమే దక్కిన అద్భుత పారిజాత సౌభాగ్యము వలన కల్గిన "పెంపు సూచి" సవతులు సిగ్గుపడి 'తామామెతో సవతుగాము' అనెడి విషయమును గ్రహింప వలయు నని సత్య ఉద్దేశము. సవతులపై ఆధిక్యము కొరకు మాత్రమే ఇందు పారిజాతోత్పాటనమును చేయించినది.

యథామూలకముగ సాగిన 'తాడేపల్లి సీతారామస్వామి విష్ణుపురాణము' నందును సత్య సవతులపై నెరపు ఆధిక్యము స్పష్టము. సవతులందరికన్నను, సత్యభామయే తన కెంతయు గూర్చు వనిత యని శ్రీకృష్ణుడు మున్ను అని యుండెను. దానిని గుర్తు చేయుచు.

*"జాంబవతి కంటె రుక్మిణీ చంచలాక్షి*
*కంటె నెక్కువ మక్కువ గలుగఁజేతు*
*నీవు నాకని నీవాడు నిచ్చకములు*
*నిక్కమేని నాయిష్టము నెఱపు మీశ"* .. *(తా. సీ. వి. పు. అం. 5 - అ. 4 - 126)*

అని పారిజాతోత్పాటనమునకు ప్రేరేపించినది.

"సవతులలో నధిక కాంతి సంపదఁబొదలన్" "పారిజాతము కోరెద" ననినది. (పైది. 127). ఇందు, సత్యకు శచీ దేవిపై ప్రతీకారము తీర్చుకొనుటయే పారిజాతోత్పాటన ప్రేరణ మునకు ప్రధాన కారణమైనను, సపత్నులపై ఆధిక్యమును చూపవలయుననెడి కోరికయు, ఆమెలో ప్రముఖముగనున్నది. బ్రహ్మపురాణమును ఈ విషయమునే నిర్ధారించుచున్నది.

*"తరుణులలోన జాంబవతి ధన్య యనందగు రుక్మిణీ సమా*
*ఖ్య రహిఁజెలంగు భీష్మనృపుకన్యయు నీవలె నెన్నఁగా మనో*
*హర సుఖ వృద్ధి గూర్చునది యారయ లేదు నిజంబు సత్యభా*
*మరోయను మాట సత్యరుచి మండితమే వనిజేర్చు దీనినిన్"*

*.....(బ్రహ్మ. పు. 4-94-71)*

అని ఆదేశించును. రుక్మిణీ యెడ అధికముగను, ఆ తరువాత జాంబవతి, మిత్రవిందలయెడ,

---

*1. పతి గర్వావ లేపేన బహుమాన పురస్సరమ్ ।*
*న దదర్శ గృహం యాతా ముపచారేణ మాం శచీ ॥ - 74*
*స్త్రీ త్వాద, గురుచిత్తాహం, స్వభర్తృ శ్లాఘ నాపరా ।*
*తతః కృతవతీ శక్ర భవతా సహ విగ్రహమ్ 11 - 75*
*తదలం పారిజాతేన పరస్వేన హృతేనమే 1 ....(సం. వి - పు - 5 - 30)*

సత్యకు మాత్సర్యమున్నట్లు తోచును. అట్లు పుష్పములులభించిన "కేశపాశమందు(గీలించి నా సపత్నుల సమూహమందు(జెల(గు దాన" (పైది. 74) అని ఆశించినది.

ఉత్తరహరివంశమునందు సత్య సపత్నీమాత్సర్యము కొంత స్పష్టముగానే బయట పడినది. నెత్తము లాడుదమని ప్రియముగా పతి పిలువ, అతనిని జూదరియని సుమాళియని, తనుకరియని, అవమానకరముగా పేర్కొనగా, అందులకు అలిగిన హరి, రోషముతో జాంబవతిని పిలువనంపగా,

*"కలిగె నొక జాంబవతి వె*
*న్నెలవడ(బడెదేల వలపు నీతలవేగెన్*
*బులియక వేసవతులు(గల*
*పొల(తుల కేపాటు వడక పోరాదు...."* ......(*ఉ. హరి. 3 - 115*)

అని సవతులపై ముఖ్యముగా జాంబవతిపై మాత్సర్యమును ప్రకటించినది. పురాణ సత్య సవతులతో నేరుగా పోట్లాడలేదు. కాని పతితో నున్నను, అమరలోక సుఖములను భవించుచున్నను సవతుల స్మరణమును మాత్రము మానలేదు. పతిని తనకధీనునిగచేసికొని స్వాధీనపతికయై వర్తిలు సత్య, సవతులపై ఆధిక్యము నెరపవలయునని ఇట్లు తహతహ లాడుట ఒక విధముగా అనవసరమే. కాని అది ఆమె ప్రవృత్తిలోనే ఒక భాగమై యున్నది. సత్య ఆధిక్యమును గుర్తించిన ఆమె సవతులెవ్వరును ఆమెను మించుటకెట్టి ప్రయత్నములు చేయకపోయినను, ఈమె మాత్రము తన ఆధిక్య ప్రదర్శనలను మానలేదు. పారిజాతాపహరణ వృత్తాంతమును ప్రధానముగా గల్గిన భైరవకవిహరివంశమునందు, సత్యభామ కొంత బాహాటముగానే తన సపత్నీమాత్సర్య, ప్రదర్శనము చేయును. కాని ఇందును అది పతిముందే జరుగును, కాని సపత్నుల ముందుకాదు. ప్రియసతి అయిన తన నుపేక్షించి సవతికి దివ్య పుష్పమునిచ్చుటచే ఆమె ఆధిక్యమునకు లోటు వాటిల్లినది.

*"అట్టి నారీమణియైన నేనందఱు తరుణులలో నొకదాననైతి"* నని (*భై. హరి.-5-63*) క్రుంగిపోయినది. సవతి పేరు చెప్పుటకు కూడ నిష్టపడక "ఇష్ట జనమునకు నన్విడనాడి", మానసమున శంకింపక పుష్పము నిచ్చితివని అధిక్షేపించినది. రుక్మిణి పేరు చెప్పుటకు కూడ నిచ్చగింపక 'అల్లనాతి', "ఆబిడ" అనియే పేర్కొనినది. ఈర్ష్యాకషాయితయై, మానహాని జరిగిన తరువాత లౌకిక జీవితము కొనసాగింప నిష్టములేక, తపమున కనుమతిని కూడ కోరినది. చివరకు పతి పారిజాతనగము తెచ్చి యిత్తునని వాగ్దానము చేయగానే,

*"ధీర ! సురద్రుమంబు గొని తేర(గ శక్యమయేని కోపముం*
*దీరును మన్మనోరథము తెట్టలు పెట్టిన యట్లు నూవె నే(*
*డారయ నంగనామణుల యందఱలోన( బ్రసిద్ధురాలనై*
*గౌరవమొందదం బ్రథమకల్పము నా కొనగూర్పు నేర్పునన్*...(*భై. హరి. 5-76*)

అని అనినది. పై మాటలను బట్టి చూచినను సత్యకు సవతులను, అందును ముఖ్యముగా అగ్రమహిషిని మించవలయునను పంతమే అధికముగ నున్నట్లు స్పష్టమగును.

నిజమునకు పురాణేతిహాస సత్యభామలోని సపత్నీమాత్సర్యము అంత తీవ్రమైనదిగాని, ప్రమాదకారిగాని కాదు. నరకుని చెరలోని పదారువేల నూర్వురు విబుధకన్యలను కృష్ణుడు చేపట్టి నప్పటికిని మాత్సర్యమును చూపలేదు. అంతేకాదు కల్పతరువు గురియు నవ కల్పోత్కరములు "నిజసపత్నీ కోటి కొస(గి" పతిని 'అలరించినది'[1]. భైరవకవి హరివంశము నందలి సత్య పుణ్యకవ్రతమును వీక్షించుటకై కృష్ణుని, పదారువేల వనితామణులను

---

1. *హరి - ఉ. భా - 4 - 271*

పేరంటమున్కై పిలిపించినది. అంతేకాదు "వారల కొక్కొక్క సన్నియోగంబు" చేసినది[1]. అనగా కానుక లిచ్చినది. కానుకలనగా శచీదేవి మున్ను శ్రీకృష్ణునకిచ్చిన వస్తువులని మూల హరివంశము చెప్పుచున్నది[2]. దివ్యవస్తువులలో నొక్కొక్క వస్తువును ఆ స్త్రీలందరికి నిచ్చుట వారిపై ఆధిక్యము ప్రకటించుట కొరకేయైనను, అందు కొంత ఉదార హృదయము కూడ తొంగిచూచున్నది.

## ప్రబంధములలో :

పురాణములలో సూచనా ప్రాయముగనున్న సత్య సపత్నీ మాత్సర్యము ప్రబంధాదులలో సర్వతోముఖముగా పరిపుష్టినందినది. పారిజాతాపహరణము నందు చిత్రితమైన సత్యభామ కులమును రూపము, న్మగని కూరిమియు, రుక్మిణీకన్నను తనకె యెక్కువ కలదని తలచి అగ్ర మహిషితోనే పోటీ పడినది. *(పారి. 1 - 42).* ఇతర సవతులు ఆమె దృష్టిలో లెక్కింపదగిన వారు కారు. నారదుడును ఆ విషయమును గ్రహించియే పారిజాత పుష్పము రుక్మిణికి దక్కునట్లు చేసి, సవతులిరువురి నడుమ మాత్సర్యమును పెంచినాడు. రుక్మిణి ముందు సత్యభామను పేరెత్తి విమర్శించుటయే గాక, పుష్ప ప్రదాన విషయము విన్న సత్య "స్రుక్కునని" కూడ వక్కాణించినాడు *(పైది. 1 - 66).*

భర్త వలన రుక్మిణికి దివ్య పుష్పము లభించుటచే నారదుని యీ మాటలు సత్యభామలో ఈర్ష్యాసూయలను, రోషా వేశములను కల్గించినవి. కాని బయటపడక పోయినను రుక్మిణిలోను సవతికి అవమానము కల్గినందులకు అంతర్లీనముగ కొంత ఆనందానుభవము కల్గియే యుండును. నారదుడు తనను గూర్చి విమర్శించుచు, తక్కువ చేయుచుండగా రుక్మిణి కూడ తననేదో అనియుండు ననియు సత్య విశ్వాసము. కావుననే దివ్య పుష్ప ప్రదాన వృత్తాంతమును చూచి, తనకు చెప్పిన చెలిని, "ఏమేమాడెను రుక్మిణీ సతియు" (1.83) అని తెలిసికొన తొందర పడినది. క్రోధావేశముతో నున్న ఆ ఈర్ష్యా కషాయిత, సవతి పేరైన నుచ్చరించుట కిష్టపడలేదు. అతులమహానుభావమని మతకరి వేలుపుందపసి, అవ్విరిని యచ్యుతున కిచ్చకం బొదవ నీయగా దానిని అతడు రుక్మిణి కిచ్చినాడనుచు, సవతి పేరు చెప్పుట కియ్యకొనక "ప్రియంబు గల్గునెడ కర్పణ చేసినఁ జేసెగాక!" (పైది. 1.84) అని తృణీకార భావముతో పలికినది. ఇట్లనుట సత్యను అహంకారిగ తలంపరాదు. ఇందు అసంగత మేమియు లేదు. "ఇది నారీజన సహజ గుణము" అని నాగపూడి కుప్పుస్వామయ్యగారు సత్యను సమర్థించినారు[3]. సత్య ఈర్ష్యా విలచిత్త యగుటచే, రుక్మిణి కామాసక్తి గల వనితగా, పతిని వశీకరించుకొను మాయగత్తెగా ఆ సమయమున అనిపించుట వలన కాబోలు, ఆమెను "కామిని (పైది. 89) "చపలాక్షి" (పైది. 90) అనియే పేర్కొనినది. అట్టి దివ్య పుష్పము తనకు లభించినను రుక్మిణి, దానిని తన కర్హత లేనిదిగ భావించి, సత్యకే దానిని అర్పించుట యుచితమని సత్య యుద్దేశమై యుండును. నరకాసుర వధా సమయమున తాను కావించిన ఉపకారము లోకమునకు, పతికి, ఆ భోజకన్యకును అందరికిని తెలియును. "ఆ భోజకన్య తానెఱుఁగదొకో" (1-91) అని రుక్మిణి పేరును ప్రత్యేకముగ పేర్కొనుచు

1. *భై. హరి - 5 - 235*
2. *సం. హరి. వి. ప - 76 - 20*
3. *పరిమళోల్లాస వ్యాఖ్య - పు. 51.*

ప్రశ్నించినది. సవతు లెవ్వరికిని లేని ప్రత్యేకత, సత్యకుండుట తెలిసియు, రుక్మిణి అట్లు పుష్పమును స్వీకరించుట సత్యకు ఉచితమనిపించలేదు. ఇచట భోజకన్యా ప్రస్తావన ఇందు కొరకే చేయబడినట్లున్నది. అంతేకాదు. రుక్మిణి క్షత్రియకన్యయయ్యు పతివెంట యుద్ధరంగమునకు పోలేదనియు, ఎట్టి సాహాయ్యము చేయలేదనియు ఎగతాళి కూడ నున్నది.

రుక్మిణికి పారిజాత పుష్పధారణము కారణముగ కలిగిన ప్రాభవము వలన, సవతులు, వన్నెయు వాసియు, తగవు, వైభము, చలము వివేకమును విడిచి, ఆమెను సేవింపనేగుట సత్యకు ఆశ్చర్యము కల్గించినది. సవతి తన నీవిధముగ మించుట సత్యకు సహింపలేని విషయము. ఇట్టివి వినుట కన్నను ప్రాణములు తొరంగుటయే మేలని తలంచినది. పతి తనతో ననుభవించిన సుఖభోగములన్నియు మరచి యీనాడిట్లు ప్రవర్తించుటకు ముఖ్య కారణము "రుక్మిణిమాయ" అనియే నమ్మినది. సాంత్వనపరుప యత్నించు పతి యెడల కోపము నణచుకొనలేక, పాదతాడనము చేసియు, సపత్నీ మాత్సర్యమును దాచుకొనలేక, సవతి పేరు నుచ్చరింప మనసు రాక ".... భవత్ప్రియాంగన న్వినుతి యొనర్పంగా వినిన వీనుల మా చవిగాని మాటల న్విన వలసెంగదా ......." (పైది. 126) అని యెకసక్కె మాడినది. తనకు జరిగిన అవమానమునకు తనతోడి సవతులు నవ్వుదురని, భయపడియే

*"నన్ను నాతోడి సవతులు నగకమున్న*
*పంతమలరంగ నిన్ను మెప్పింతుఁగాక"* (పారి. 1.131)

అనుచు, ప్రాణ త్యాగము చేయగలనని బెదిరించినది. మరణించవలెనని నిర్ణయించు కొనినది. కాని

*"ఉవిద యెవ్వతె నోచి యున్నదో యీ స్యమం*
*తకరత్నమింక నౌదల ధరింప*
*నీ రైవతక శైల చారుకూటవిటంక*
*కేలికిం కెవ్వతె పాలుపడునొ*
*యెవ్వతెకబ్బునో యీ వసంతారామ*
*కర్పూర కదళికాగార వసతి*
*లీల నీమణి సౌధజాలకంబుల నిన్ను*
*గూడి యెవ్వతె వార్ధి జూడఁగలదొ*
*యకట నేబెంపఁ బెరిగిన శుకమయూర*
*శారికా బృందమెవ్వతెఁ జేరునొక్కొ"* .......(పారి. 1-131)

అని తనకు ప్రియమైన వస్తువులు, ప్రియాతి ప్రియమైన అనుభూతులు, ఇక, ఏ సవతికి దక్కునో అని సవతులను తలచియే మరింత కలవర పడినది. సవతులందరితో తనను సమానముగ పతి చూచుట భరింపలేక, తన ప్రత్యేకత తెలియపరచునట్లు "నను నెవ్వతిగాఁ జూచితి" వని, గద్దించి అడిగినది. (పైది. 1- 132). సపత్నీ మాత్సర్య మనునది సవతులందరికి నున్నదే. రుక్మిణికి లభించిన నూతన ప్రాభవము కారణమున, ఇతర సవతులందరును "మచ్చరము మదిలోన దొఱంగి" రుక్మిణిని భజించినారు. సత్య నైజముగా మానినీలలామ యగుటచే అంత తొందరగా ఆమె మత్సరమును వీడలేక

పోయినది. లోకము భావించునట్లు సత్యభామ మూర్తీభవించిన అసూయ కాదు. సవతికి కల్గిన ప్రాభవమునకు మొదట ఈర్ష్య చెందినను, దోషమంతయు గోపాలునిదే యని గ్రహించిన దగుటచే తార్కిక శక్తితో ఆలోచించి, రుక్మిణిని నిందించవలసిన అవసరము లేదని గ్రహించినది.

పుణ్యకవ్రతోత్సవమునకై తన తొంటికోపము, గర్వము, మత్సరంబు మాని వినయము, ప్రమోదము నిండి తొలంకెడు నెమ్మనముతో, తొలినాడే సవతుల యిండ్ల కెల్ల క్రమంబున నేగి తద్వ్రతోత్సవమున కాహ్వానింప వలయునను నారదుని ఆదేశము ప్రకారము, సత్యయు అట్లే కావించినది. అంతేకాదు పంతముతో సాధించిన కల్పనగము యొక్క విరులను కనకపాత్రలములందుంచి, 'రుక్మిణీ ప్రభృతులౌ సవతుల్పదియాఱు వేలకును 'వాయనములుగ' 'వినయమున' నిచ్చినది. (పైది. 5-90). వినయమున ఇచ్చిన దనుటచే ఆమెలోని మాత్సర్యము పూర్తిగా తొలగినట్లు భావింపవచ్చును.

"ఇందిరా ప్రతినిధి" (పైది. 5.74) అని కొనియాడుబడు రుక్మిణిలోనే ఇంకను సవతి మాత్సర్యము నిగూఢమై నిలిచి యున్నది. సత్యకు పారిజాతము దక్కుటచే, ఆమె సౌభాగ్య గరిమ, ఈ అగ్రమహిషిలో అంతులేని అసూయను కల్గించియుండును. అరుదైన, అద్భుతమైన వ్రతోత్సవమునకు నెల్లరు పోవునపుడు తానును పోవలయును. లేనిచో అది సమజంసమనిపింపదు. అందుచేతనే "రా దగవౌనని" (పైది. 5-74) వచ్చినది. కాని మనసులోని మాత్సర్యమును దాచుకొనలేక పోయినది. నిర్మల దరహాసమును వెలార్చ లేకపోయినది. "కృతక వికాస మచ్చువడ" కృష్ణుని పట్టపు దేవి వచ్చినది. రాఁ దగవౌనని వచ్చుట, 'కృతక వికాసము' వెలార్చుట చూడ, రుక్మిణిలో, సత్యభామ కన్నను కొంత అసూయ అధికమేమోనని అనిపించును. సత్యభామ మర్మము తెలియని నిర్మలయగుటచే, అప్పటి కపుడేభావము కల్గిన, అది వెన్వెంటనే ఎదుటి వారి ముందు ప్రదర్శించును. కావుననే ఆమె లోకము దృష్టిలో 'ఈర్ష్యావిలచిత్త'గా ముద్ర పడిపోయినది.

ఆముక్తమాల్యదయందు సపత్నీ మాత్సర్యము కారణముగానే సత్య, పారిజాతమును దివి నుండి భువికి రప్పించుకొనినట్లు చెప్పబడినది. గోదాదేవి పూర్వ జన్మమున సత్యభామ యనెడు రహస్యము నెరింగించిన ఆమె చెలులు, "దివిజద్రు ప్రసవంబు గాంచిన సపత్నింజాచి, చూపోపకింతవు జిల్గుంబని యంత సేసి మది నీర్ష్యా క్రోధముల్పందండిప, విరింబోక ద్రుమంబు గైకొనఁ బతి న్మందన్న మ్రా నెల్లఁదే నవధిం బెట్టిన సత్య నీవ హహ కావా ? భామినీ .....' (5.74) అని అందురు.

విష్ణుమాయానాటక ప్రబంధము సత్యభామలోని సపత్నీమాత్సర్యమునే గాక, రుక్మిణీ దేవిలోని సంకుచిత స్వభావమును కూడ తెల్లము చేయును. పారిజాతము తనకే దక్కిన దనెడు కారణమున సత్యభామలో గర్వమతిశయించుటను గమనించిన హరి, ఒక నాటకమును కల్పించి, ఆమెకు సత్యమును బోధింప తలచినాఁడు. హరి మాయనెరుగని సత్య, తనభర్త, ప్రేమతో, సతతము తనతోనే ఉన్నాడనియు, దీని వలన రుక్మిణ్యాదులు సిగ్గుతో ఎట్లున్నారో అని అనుకొనుచు, వారి భావములను పరీక్షింపదలచి సవతులందరికిని వేర్వేరు పాత్రలలో విరులిచ్చి పంపుచు ప్రత్యేకముగ ఒక చెలిని పిలిచి

"ఈపూవులుఁ గొని రుక్మిణి
కేపారు కడంక తోడనిచ్చి తదీయ
వ్యాపారము తలఁపును గని
రా పొమ్ము ........." " .......(విష్ణు. మా. నా. ప్ర. 1-148)

అని 'రాజసమొప్ప' ఆనతిచ్చినది. కాని కృష్ణుని మాయ వలన రుక్మిణియు పారిజాతమును పొందియుండుటచే నామె మరింత గర్వించి, తన చెలిని పిలిచి, మాకును కృష్ణుడు పారిజాతమిచ్చినాడనుచు "ఇదిగో నా కల్పకతరు విరులివి, యే కడలేవనుచుఁ జెప్పి యేతెమ్ము" అని హెచ్చరించి పంపినది. సత్య తన సవతి మనో వ్యాపారములు మాత్ర మెరింగి రమ్మనినది. ఇది, యే సవతియైనను, చేయునట్టిదే. కాని రుక్మిణి, సత్య మనము నొచ్చునట్లు పలికి రమ్మనినది. అంతే కాదు. సత్య పంపిన పూలను తాను ధరింపక, ప్రణయ కోపముతో, హరికి ముడిచినది. అంతేకాదు తన పారిజాతమును, సత్య చెలికి, చూపించి, ఈ పువ్వులు నెత్తావి ఎక్కడ చూడలేవని కూడ చెప్పుమని పరిహాసముగ పలికినది. చెలి వలన అంతయు తెలిసికొనిన మానవతియైన సత్య, యిట్టి వక్రోక్తులను భరింపలేక పోవుటచే, పతి ముందు పరుషముగా పలుకవలసి వచ్చినది. సవతుల ముందు, తన ఆధిక్యము చెల్లక పోవుటకు వగచి, వారికి కల్గిన, ఆ భాగ్యమునకు నీర్ష్యతో పొగిలిపోయినది. సత్యకు మొదటి నుండియు, లభించిన ప్రాధాన్యము వలననే, ఈ మానినికీర్ష్యాభివృద్ధి కల్గినది. నిజమునకు సత్యకు లభించిన చనవులే, రుక్మిణికి లభించి యుండిన ఇంతకనన్నను విపరీతముగా రుక్మిణి ప్రవర్తించి యుండునని పై సంఘటన రుజువు చేయును. అంతయు కృష్ణునిమాయ అను సత్యమును గ్రహింపగానే, తొంటి కోప మాత్సర్యము లన్నియు మరచిపోయినదీ సాధ్వి.

'సత్యభామా సాంత్వనమున' సత్యభామ మనసును కలచివేసినది రుక్మిణి గాని, అష్ట మహిషులలోని ఇతర వనితలు కాని, కారు. నరకుని చెర నుండి హరి రక్షించి తెచ్చి, చేపట్టిన పదియారువేల కాంతలు. నరకునంతటి వానిని అలయించిన వీరవనితయు, ధీర చిత్తయునయ్యు ఇందరు సవతులతోడి కాపురము మాత్రము, ఆ మానినికి మరణ ప్రాయమే అనిపించినది. మొదట రాధ, ఆ తరువాత గొల్లకాంతలు, ఆ తరువాత అష్ట మహిషులు; వీరు చాలక, యీనాడు పదారువేపురు ; ఇందరితో నొక అబల యెట్లు గడుపుకొని రాగలదు.?

"మొదల నొక రాధ చాలును
పిదపన్ జతచెలులె చాలుఁ బ్రియుఁ నాసనునేఁ
గదిసి సుఖించఁగ సవతులు
పదియార్వేలైన నెట్లు బ్రతుకఁగ వచ్చున్" ..........(సత్యా. సాం. పు. 150)

అని క్రుంగి పోయినది. సపత్నీ మాత్సర్యముతో రగులు సత్య, పతి లాలింపులను లెక్కచేయలేదు. పతి తెచ్చిన కానుకలు తీసికొనుమని చెలులు హెచ్చరింపగా, వారిని మందలించినది. పాదములకు మ్రొక్కి పతి శిరమును కూడ, తాడనము చేసినది, కాని చివరకు పతి చేసిన సాంత్వన కార్యములకు శాంతించి, సపత్నీ మాత్సర్యమును వీడినది. ఇట్లు ప్రబంధములందు సత్యలో సపత్నీ మాత్సర్యమెంతగా ప్రదర్శితమైనను అది అంతలోనే అణగారి పోవునట్లుగా చిత్రింపబడినది.

కొందరు ఆధునిక ప్రబంధకవుల చిత్రణలో సత్యభామ ఎంత తీవ్ర సపత్నీ మాత్సర్య గ్రస్తయో, అంత సంస్కారవంతురాలు కూడ ! శ్రీకృష్ణాతి మానుషతత్త్వమునందు, సవతుల మించిన దాననని యు పతి తనకే వశుడను మోహాతిశయముతో, సత్య కొంత అహంకరించి వ్యవహరించినను, తన ప్రణయాధిక్య ప్రదర్శన విఫలమగుటచే, నిస్పృహ చెందును. చివరకు రుక్మిణి యుంచిన తులసీదళముచే, కృష్ణుని తూచు తులాభారము, సరితూగగానే, సవతిపై నుండు మాత్సర్యమంతటిని విడిచి, "కృతజ్ఞతా బుద్ధితో బిరబిర ముందునకు దరలి" "విదర్భ రాజసుతఁగౌఁగిటఁగూరిచి పాదయుగ్మమందెఱఁగి", "కన్నీటితో" పాదాభిషేకము చేయును. (3-1-266).

## భామాకలాపములో :

భామ అనగా సత్యభామ "కలాపమనగా నది వైకృత శబ్దమైనచో కలత, కలహము నను నర్థములు నిఘంటువులలోను (సూర్య), సోది వెళ్ల బోసికొనుట యను నర్థము వ్యవహారములోను గానవచ్చును[1]. కృష్ణునితో కలహమాడిన సత్య, అతడు తనను వీడిపోగా, విరహమునకు లోనై, తన చెలిముందు తన కలతను, తన సోదను వెళ్లబోసికొనును. తొందరపాటుతో తాను పతికి, చేసిన అపచారమును వివరించుటతో పాటు, పతి తనను నిర్దయగా విడిచి విరహమునకు లోనుచేయుటకు సవతులే, అందును ముఖ్యముగా రుక్మిణీయే కారణమని చెలికి చెప్పును. కావున భామా కలాపమొక విధముగా, సత్యభామ సపత్నీమాత్సర్యమును కూడ ప్రధానాంశముగ కలదని చెప్పవచ్చును. గ్రంథారంభమున తనను పరిచయము చేసికొను సందర్భమునందే,

*"భామనే పదియారు వేల, కోమలు లందరిలోన*
*రామరో గోపాల మూర్తికి, ప్రేమ పాత్రనైన సత్య ॥భామ॥* *(భామా - పు- 13)* అని అనుచు సవతుల ప్రస్తావనము తెచ్చి వారిపై తన ఆధిక్య నిరూపణ కావించు కొనబూను సత్యభామ స్వభావమెట్టిదో మనము బాగుగ గ్రహింపగలము. ఇందును సవతి యన్న, సత్య దృష్టిలో ముఖ్యముగా రుక్మిణియే-బంధు వర్గమును పరిచయము చేయునపుడు మాధవితో "సకియ రుక్మిణి నాకు సవతి కావలెనమ్మ" (పైది. పు. 14) అని రుక్మిణిని మాత్రమే సవతిగ పేర్కొనినది. రుక్మిణియు తన వలెనె కృష్ణుని పాణి గ్రహణము చేసికొనిన ధర్మపత్నియే. కాని సత్య దృష్టిలో,-అతడు ఆమెను చేరుట నీతి మాలిన పని.

*"నీతి యెంచక నల్ల నాతిని గూడితే*
*యే తీరున వేగింతునే ఓయమ్మ"* *...(పైది. పు. 16)* అని సపత్నీ మాత్సర్యముతో పొగిలి పోయినది. రుక్మిణి పరకాంత, తాను మాత్రమే 'స్వీయ' అనునట్లు బాధపడినది. పతి తనను కరుణావిదూరుడై విడనాడుటకు, పరుష భాషణము లాడుటకును కారణము, మాయలాడి రుక్మిణి అని అనుమానించినది. రుక్మిణి యొక్క దుష్ట ప్రవృత్తి నీసడించుచు, తా నమాయికురాలననుచు

*"పిన్న పెద్దలనంపి పిలిపించి చెప్పరే*
*కన్నెరో యిటువంటి కార్యము వలదని"* *.........(భామా - పు. 37)*

---

1. *యస్వీ. జోగారావు - ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - ద్వి. భా. పు. 32.*

అని అనుచు, పెద్దలే కాదు, పిన్నలు కూడ నిందింప తగినంత ద్రోహము రుక్మిణి తనకు చేసినదని కుతకుత లాడినది.

*"కేళికి రమ్మని కిటుకు పరచి మందు'*

*లాలించి పతికి దాంబూలములో బెట్టె" (ప్రైది)* అని కూడ ఊహ చేసినది. "ఇందతయు" ఆ మాయావి రుక్మిణీ మాయలం దగుల్కొని నాపతి నన్నెడ బాసి యుండెనే కాని వేరు గాదమ్మా" (ప్రైది. పు. 39) అని, నిశ్చయముగ రుక్మిణి మాయావితనమే తమ వియోగమునకు కారణమని నమ్మినది. నిజమునకు, సత్య భ్రమించినట్లు రుక్మిణి మాయావి కాదు. సత్య సౌందర్య గర్వముతో అనిన మాటలకు నొచ్చి, పతి ఆమెను వీడి సవతిని చేరినాడు. సత్యకును నీ విషయము తెలియును. ప్రేమాతిశయ పూర్ణచిత్తయు, ప్రకృతము విరహార్తి యుతయునగు, సత్యలోని, తీవ్ర సపత్నీ మాత్సర్యమే ఆమె నిట్లు పలికించినది.

సత్య పంపుచున్న, విరహ సందేశము నందించుటకు విభుడెచట నున్నాడని, చెలి మాధవి సత్యను అడుగగా "ఆ రుక్మిణీ కేళికా మందిరంబునందే ఉండునే" (ప్రైది. 41) అని దృఢముగా పలికినది. ఆమె ఊహించినట్లు కృష్ణుడచటనే యుండెను. పతికి, సందేశమంపుచు కూడ, అతని కఠిన మనస్కతకు, నిర్దయతకు కారణము చిత్తమున రుక్మిణీ సతిని నిలుపుటయేనని ఆరోపణను చేసినది. సవతి కూటమిలో నున్న భర్త స్థితిని తెలిసికొన కుతూహలము చూపినది. తానే అచ్చటికి పోదుమన్న రుక్మిణి నెక్కసంపు మాటలాడిన తాను తాళలేదు.

"చెలరేగి ఆమెతో జదరంగమాడుచుండ, జూచి యెటులనోర్తునే (పు. 36) అని కలత పొందినది. కాని వాస్తవమునకు ఈ భామాకలాపపు సత్యభామ దుష్టురాలు కాదు. రుక్మిణీ తనయుడైన "ఘన పంచశరుడు నాతనయుడమ్మ" (ప్రైది. పు. 14) అని చెప్పుకొనగలిగిన విశాల హృదయ. చెలిచే రాయబారమంపుచు

*"చొక్కపు చక్కెర బొమ్మను*
*చక్కని రాకేందు ముఖిని జలజదళాక్షిన్*
*మిక్కిలి మక్కువతో మా*
*యక్కను రుక్మిణిని జాల నడిగితి ననుమీ" (భామా. పు. 60)* అని యెంతో గౌరవముతో, ఆత్మీయతతో చెప్పి పంపినది. పతిపై గాఢానురాగముండుటచే, తనను వీడి అతడుండరాదను మమకారమున మాత్రమే, కొంత పరుషముగ సవతులను గూర్చి మాట్లాడును. కాని సాత్వికురాలిగా భావింపబడు రుక్మిణిలోనే అసహనము, మాత్సర్యము అధికముగ కనబడును. సత్య చెలి, రుక్మిణీ ప్రముఖ దేవేరులచే పరివేష్టితుడైన కృష్ణుని ముందు, తాను తెచ్చిన సందేశము నందీయగా, రుక్మిణి ఆదూతికను పరుషోక్తులాడి, కాంతుడు చూచుచుండగానే, కోపమున కనులెఱ్ఱగచేసి, 'నిక్కుచు, విఱ్ఱ వీగుచు', "చెంతనున్న చేడియలచే" "చెంపలు గొట్టి పొమ్మనినది. సత్యలో ఇంతటి దౌర్జన్య స్వభావము లేదు. చెలికి జరిగిన అవమానము తనకే జరిగినట్లు భావించిన సత్య, మానవతి కావున ప్రాణత్యాగము చేయదలచినది. కాని తన-మరణానంతరము, తన ప్రియ వస్తువులు, దివ్యభోగములు నెవ్వరికి చేరునో అని సవతులను తలచియే,

భయపడినది. తన మరణానంతరము కూడ తన కిష్టవస్తువులు సవతులను చేరుట సహింపలేదీమె. విరహాతిశయమును తాళలేక, మూర్ఛితురాలైన ప్రియసఖి సత్య నోదార్చుటకై, గోపాలుడు సంభ్రమముతో రాగా, పతి వచ్చినందుల కాప్రణయిని పొంగిపోవుచునే, మరు నిమిసమున సవతి గుర్తునకు రాగా, మాత్సర్యము పొంగి పొర్లగా **"ఎల్లెప్పుడు నెడబాయకుండునట్టి రుక్మిణీదేవి యొద్ద సెలవు పొందియే వచ్చినారా"? దొంగతనమున వచ్చినారా ? అమె వలననేమి మాట వచ్చునో వేగపొమ్మని చెప్పవే సఖి" (పైది. పు. 85)** అని సపత్నీ మాత్సర్యముతో ప్రియపతిని పంపించి వేయుటకు సిద్ధపడినది. 'అల్ల భామ రుక్మిణి' యను చున్న ప్రేమ నడచియు, పదియారు వేల మించుబోడులలోను గౌగలించుమని నీ చేత బ్రతిమాలించుకుందు ననియు అల్లదానిని నిన్ను బట్టి, నలుగురిలోను కాదనిపించి నీయభిమానము తీయించకున్న భామనే కాదనియు ప్రతిన చేసినది. చివరికి పతిని భగవంతునిగా గుర్తించి, సేవించినది. సత్యభామలోని ఈ సవతి మాత్సర్యము మాటలలో మాత్రమే నిలిచినది. కాని ఎవరికిని నెట్టి అపకారమును చేయలేదు. పారిజాతాపహరణము ప్రధాన వృత్తాంతముగా గల "మినర్వా ప్రెస్" వారి భామా కలాపమున సత్య, రుక్మిణిపై ప్రధానముగా మాత్సర్యము వహించినను, నితర సవతులను వీడలేదు. పతిని వశము చేసికొనుటకై మందును

**'ఆరాధ, రుక్మిణి, మిత్రవింద, జాంబవతి, సునంద, లక్ష్మణ, భద్ర, కాళింది కలయ బలికి పెట్టినారమ్మ" (పు. 60)** అని వారందరి పైనను నెపమును వేయును.

సిద్ధేంద్రయోగి విరచితముగానే చెప్పబడుచున్న "మంజువాణీ ప్రెస్" వారి భామాకలాపము పై భామాకలాపముల కన్నను భిన్నముగ, యక్షగానములకు దగ్గరగనున్నది. భామాకలాపము వలెనె యక్షగానములు కూడ జానపద మాధ్యమ కళా రూపములలో నొకటి. వీనియందు సపత్నీ మాత్సర్యమునకు లోనైన సత్య, సవతులతో నేరుగా పోయి, తానయ్యె పోట్లాడుటకు దిగి గయ్యాళితనమును ప్రదర్శించును. నిజమునకు సత్య, సవతులతో నేరుగా పోట్లాటకు దిగునంతటి అల్ప ప్రవృత్తి కలది కాదు. జానపదుల అభిరుచికి అనుగుణముగ, యక్షగానములు రచింపబడినవి. జానపదులకు ఏ కారణముచేతనో సత్యభామ యనిన కోపమున్నట్లున్నది. వారి చిత్రణలో సత్య గయ్యాళి. సత్య మాత్రమే కాదు, లోకమున సాత్వికురాలని ప్రసిద్ధి యొందిన రుక్మిణియు, దివ్య ప్రణయిని అనదగు రాధయును గయ్యాళిగంపలే. ఇతర సవతులును తక్కువ వారు కారు. కొంటె కృష్ణుని, కొంటె తనమునకు బదులు కాఠిన్యము, కాపట్యమే అతనిలో ప్రత్యక్షమగును. పాత్రలకు, యక్షగాన కవులు గ్రామ్యతను సంతరింప చేయుటచే నిట్టి మార్పు కలిగినది. ఈ యక్షగాన కవుల మార్గములోనే నడచిన నాటక, జానపద కర్తలును, సత్య నా విధముగానే చిత్రించుటలో వింతలేదు. సవతుల కయ్యము ఈ దేశి కవుల కొక తియ్యని కల్పన. ముఖ్యముగ రుక్మిణీ సత్యల నడుమ కలహమును సృజించి, వారివురిని ఒకరి కొకరు తీసిపోని గయ్యాళులుగా చేసి ఆనందించిరి. వీరిరువురిలో సత్యయే కయ్యమునకు కాలుదువ్వు గయ్యాళిగా చిత్రింపబడినను, ఆమెయే ముందుగా రాజీపడు సున్నిత మనస్కగా కూడ చిత్రించి, రుక్మిణి కన్నను సత్యభామయే మిన్నయేమోనని కొన్ని మారు లనిపించునట్లు చేసినారు.

## యక్షగానములలో :

యక్షగానములలో అతిపెద్ద దనదగునది పారిజాతాపహరణ యక్షగానము. ఇందును ఎల్లవేళల సపత్నీ మాత్సర్యముతో పొగులు సత్యభామయే కనిపించును. హరి రాక ఆలస్యము కాగా "శ్రీరుక్మిణికి వెఱచి హరి ప్రేమ దాఁచెనో" (2-108) అనియే అనుమానించినది. అంతేకాదు పతి చెంతకేగిన చెలి ఆలస్యమునకు, "అల వామలోచన పెట్టు మందుచే బలుకదొ, లేకయున్న నల భామిని గ్రక్కున రాకయుండునే" (పారి యక్ష - 2-పు - 108) అని చెలికి కూడ సవతి మందు పెట్టి యుండునని అనుమానించినది. కల యందైనను సవతిని మరువలేదీమె. పారిజాతము తనకిచ్చిన తరువాత తన భర్త, రుక్మిణి తోడ రతి కేళి సలిపినట్లుగా దుస్స్వప్నము కూడ గాంచి భీతిల్లినది. (పైది. 2-110). తనకు కల్గిన అపశకునములకులికి పలువిధము లైన చింతములకులోనై, చివరకు "ఆ రుక్మిణి మాయలకు యట లోనయెనో" (పైది 2-113) అను నిర్ణయమునకు వచ్చినది. పారిజాతమును రుక్మిణికి నిచ్చి నందులకు, ప్రబంధ సత్య ఆమెపై కోపమును పొందినను, తరువాత వివేకముతో తర్కించుకొని రుక్మిణిని నిందింప నవసరములేదని సమాధాన పడగా, ఈయక్షగానసత్య మాత్రము,

*"వనితరో రుక్మిణి వంచన చేసి*
*గొనకొని తానందుకొనెఁ గుసుమంబు" ......(పారి. యక్ష-2-156)*

అని నేరమును సవతిపైనే నెట్టినది. భామా కలాపములోని సత్య ఘనపంచశరుని నాకొడుకని పేర్కొనగా, "చక్కని ప్రద్యుమ్నుడు నా సవతి కొమరుడు" (పైది. 2-104) అని భేదమును చూపినది. తానెన్ని మారులుపిలిచినను వల్లభుడు, తనకడకు రాకపోవుటకు, రుక్మిణియే కారణమని భావించి, ఆమెతో తానే కయ్యమునకు దిగినది.

*"బాగుగా నడ్డమై వచ్చు మీ యన్న*
*నొగిఁదల గొరి గించి యుల్లాసముగను*
*నగుచును నగధరునటఁబెండ్లి యాడి*
*నట్టి సాహసి నీవు............................" ...... (పారి. యక్ష 2-పు. 209)*

అని కల్యాణ కాలమునాటి రుక్మిణి సాహసమును విమర్శించి, గేలి చేసినది. అంతేకాదు సవతులును, భర్తయు అందరు చూచుచుండగా జడతో కొట్టుదునని జగడమునకు కూడ దిగినది.

ఇందలి రుక్మిణియు తక్కువది కాదు. సత్య తనకు వలె "పతి కడు మనః పూర్వకముగా బెండ్లి యాడు పడతి" కాదనెడు చులకన భావమును, పతి కోరి చేపట్టిన వనిత తాననెడు అతిశయ భావమున్నది. తానుకూడ అందరు చూచుచుండగా సత్యను జడతో కొట్టగలననుచు కయ్యమును పెంచినది. కృష్ణుడు రుక్మిణి 'కోపగత్తె' అని భయపడి, ఆమెకు చనవు లిచ్చుటచేతనే, ఇంతగా ఆమె విజృంభించి, సత్యను, సవతులందరి ముందు పలుచన చేసినది. యక్షగానములందు, రుక్మిణి కన్నను సత్యభామయే కొంత సరళ స్వభావ. ఆమెతో సమానముగ వాదోపవాదములు చేసినను, చివరకు తానే ముందుగా "అతివ! మాకందరకు బెద్ద దానవు నీవు అక్కరుక్మిణి" అని, పొందుకై మాటను కలిపినది.

యక్షగానములందు, ఈ సవతులనడుమ రాధ ఆధిక్యము ఎక్కుడుగా కనిపించు చుండును. శ్రీకృష్ణుడును, సత్యకన్నను రాధనే అధికముగగా ఆదరించి ఆమె ముందే సత్యను చులకన చేయుటయు ఈ యక్షగానమున కలదు. రాధ విధ్యుక్తవిధిని కృష్ణుని భార్యకాక పోయినను సవతివలె, తనపై పెత్తనము చేయుట సత్యవంటి మానిసి సహింపలేని విషయము. రుక్మిణిని సమర్థించుచు, సత్యతో రాధ జగడమునకు రాగా,

*"అల్లునిఁజేపట్టినట్టి దుర్గుణివి*

*ఇల్లాలివలె నీవు నెదిరించఁదగునే"?* *...(పారి యక్ష-4. పు. 212)*

అని పరిహసించినది. అంతేకాదు. తన త్రోవకు రాధ రాకూడదని ఆమె అభిప్రాయము. అట్లువచ్చినచో తన చెలికత్తెలచే కట్టించి, కొట్టించి, అవమానించ గలనని రాధనుకూడ హెచ్చరించినది. ప్రణయమూర్తిగా లోకముచే నారాధింపబడు రాధలోని లాలిత్యము, సౌకుమార్యము, ఉదాత్తత, సౌమ్య ప్రవృత్తి యీ యక్షగాన రాధలో కనిపింపవు. నాకంటె సత్య ఎక్కువగున అని సత్యను గూర్చి, కృష్ణుని ముందు నేరమును ఆరోపించి, సత్యను తిట్టించినది. పారిజాతమును సత్య కిచ్చినందులకు కినుక చెంది రుక్మిణి 'దననిడుద జడ' చే, సత్యను "ఫెళ్ళు ఫెళ్ళున సూటిగా మీటినది. పారిజాతమును సత్యకిచ్చినను, పూవులు మాత్రము, రుక్మిణికే దక్కునట్లు కృష్ణుడు చేసిన మోసమును గ్రహింపలేక పోయినది సత్య! ప్రబంధసత్య తాను అగ్రమహిషికన్న నధికురాలని భావింపగా, ఈ యక్షగానసత్య సమానురాలననుకొని తృప్తి చెందినది. 'పెద్దైన వారము మనమిద్దఱము గాక వేఱెవరున్నారె' అని రుక్మిణి యనగా, "అయితే తెలిసికొంటినె మనమిద్దర మన్యోన్యమై యుందామె" అని రాజీపడినది.

తరిగొండ వెంగమాంబ రచించిన విష్ణుపారిజాతయక్షగాన మందు సత్య, సవతులచే తీవ్రమైన అవమానములకు గురియగును. ఇందును సవతుల కయ్యము, చివరకు సత్యా విజయమును వర్ణింపబడినది. సవతులంతగా అవమానించినను సత్య, తుదిని జరిగినదంతయు మనము నందుంచుకొనక సౌజన్యమూర్తియై వారి నందరిని సత్కరించినది. కృష్ణుడు పారిజాతమును తెచ్చి యిచ్చెదనని సాంత్వనపరచి రతికేళిని తేల్చి, సత్యనిదుర పోవువేళ వంచించి, యితర పత్నులను చేరును. విరహముతోనున్న సత్య చెలిని పంపి, మగనిని రప్పించుకొనియు, మానిని కావున జరిగిన మోసమును మరువలేక పోయినది. అవకాశము కొరకు ఎదురుచూచుచున్న హరి, తిరిగి యితర కాంతల చెంత చేరును. పశ్చాత్తాపము చెందిన సత్య, సందేశమంపియు, పతిరాకపోవుటచే, తానే అతని కడకేగి ప్రాధేయపడగా, ఆమె ప్రవర్తనను విమర్శించుచు, చివరకాతడు, సవతులను చూపుచు, వారు రానీయరని అడ్డుచూపగా, హరి తన సొంతమని, భావించు అమానిని, "నీకంటె వెరతును గాని, జడతునా కలనైన సవతులకేను" (పు. 61) అని వారియెడల తృణీకారభావము చూపినది. అంతేకాదు. "వనజోదరుని తోడుకొనిపోక పోదునా, సవతులారా" (పైది) అని పంతము లాడినది. కాని, అందు, సఫలత కనలేకపోయినది. కురవంజి వేషధారణియైన సరస్వతి ఉపదేశానుసారము, పారిజాతలబ్ధికై, కృష్ణ జపము చేయబూనియు "సవతి విద్వేషమున" శాంతి లేకపోవుటచే, జపమాచరింప లేకపోయినది. పతి రానని తిరస్కరించుటకు, "మందులమారి సవతులే" కారణమని సత్య విశ్వాసము. తానర్థించియు, భర్త తనకడకు రాకపోవుటచే, కోపమంతయు సవతులపై కేంద్రీకరింపగా, సవతు లందరిని జడతో కొట్టుదునని పోట్లాటకు సిద్ధమైనది. చివరకు కురవంజి యనినట్లు తపముచేయ సిద్ధమయ్యు, విరక్తిలోను సవతి మాత్సర్యమును సుంతయైన వీడలేదు. దేవ వృక్షము కొరకు తపము చేయ, ఆ వృక్షము వచ్చునో, మోక్షము వచ్చునో తెలియక, సందేహముతో సతమతమగుచు

*"తలచిన పారిజాతము వచ్చెనేని*

*సవతుల సాధించి సంతసించెదను" ....(పైది-పు-103)* అని ఆనందించినను, వైరాగ్య చింతనబూనియు సవతులపై ఆధిక్యము చేయబూనుట వీడలేదు. తన భోగ వస్తువులు, తన భర్త, సవతులకు లభించునేమో యనియే ఈర్ష్యాసూయలకు లోనైనది. జపము

చేయువారెవరును ధనధాన్యాదుల నీగతి మనమున చింతింతురా? యని, చెలి మందలించిన తరువాతనే, తీవ్రతపః చర్యకు పూనుకొన గల్గినది. పారిజాతము సత్య సొంతమగుట భరింపలేని సవతులు "సత్య భామను ద్రోసి', కృష్ణుని 'చుట్టుముట్టి', సత్యకా దివ్యనగము నిచ్చుట కామె హెచ్చేమని నిలదీయగా, వారి సాహసము నుండి, తనను విడిపింపుమని హరి అర్థింపగా, ఆ మానిని దురాగ్రహముతో, వారితో జగడమునకు దిగినది. తన సాటి సవతులతో సమానముగ రాధయు పోట్లాటకు రాగ,

*"నా సాటి సవతులు నన్నిట్లు దిట్టలే దోసీ, నీవెవతె వుట్టి పడెదవూ" (పైది. పు. 157)* అని ఆవేశపడి ఆమెతో పోట్లాటకు సిద్ధపడినది.

రాధను పోనాడినందులకు, కోపము చెందిన జాంబవతి మొదలైన సవతులు సత్య భామను "దొమ్మిచేసి' యవల మెడబట్టి, నెట్టి వేసినారు తమకును పారిజాతభూజంబు లొక్కొక్కరి కొక్కటి కావలయునని కృష్ణుని నిర్బంధించినారు. నిజమునకు, వారికి రాధపై ప్రత్యేకమైన ప్రేమలేదు. పతి, సత్యా ప్రియంకరుడగుట సహింపలేక, ఒక అవకాశమును కల్పించుకొని, రాధను సమర్థించుచున్నట్లుగా, మత్సరముతో సత్యపై దొమ్మిచేసినారు. సత్యభామ తెగువమీర, తపము చేసినదనియు, అంతేగాక హరి మనసు తెలిసికొనుట ముఖ్యమనియు, మత్సరము వీడుమని రుక్మిణీ హితోపదేశము చేసిన తదుపరి వారు ఈర్ష్యను వీడినారు. వారింతగా తనను అవమానించినను, పతి, తనను, సవతు లందరికిని పారిజాతకుసుమంబు లొసంగుమని అనగానే, సత్యభామ పంతమీడేరిన సంతసమున, తొల్లింటి మత్సరమును మరచి, "బల్వేడుక మీర, సురపారిజాత ప్రసూనముల్ దెచ్చి", హరినేగాక "అవిరళ భక్తితో, రుక్మిణిని జాంబవతిని బూజించి", "తక్కిన చేడెల కెల్ల వరుసగా పుష్పాది వస్తువులిచ్చె"ను. (పైది. పు. 157) అగ్రమహిషతో పాటు, అవమానించిన జాంబవతిని కూడ, సపత్నీ మాత్సర్యము వీడి పూజించిన సౌజన్యవతి సత్య.

ఆధునికకవి చెర్విరాల భాగయ్య కృతమగు శ్రీకృష్ణ పారిజాత యక్షగానమందు, సత్యభామ సవతులతో కయ్యమునకు దిగు గయ్యాళికాదు గాని, రుక్మిణికి పుష్పము నిచ్చినందులకు మాత్రము, అసూయచెంది, పతిపై కోపగించుకొని నిందించును. కాని, ఈ యక్షగాన సత్యా సపత్నీమాత్సర్యమెంత తీవ్రమైన దనిన, **"శృంగార ప్రియ వినునాయపేక్ష! వారిజాక్షి రుక్మిణికిచ్చిన యాపారిజాత విరిదెచ్చి యిమ్ము"** (శ్రీకృష్ణ - పారి. యక్ష. పు. 22) అని, అదే పుష్పము కావలయునని పట్టు పట్టును. కాని ఆ పుష్పమునకు బదులు, సురభూజమునే తెచ్చి యిత్తునని హరి ప్రతిన చేసిన తరువాతనే, సాంత్వనము పొందును.

## నాటకములలో :

నాటకములందు సత్యభామ సపత్నీ మాత్సర్యము మరింత తీవ్రస్థాయికి చేరుకొనినది. "చిలకమర్తి వారి పారిజాతాపహరణ నాటకము", తిమ్మన ప్రబంధమును పోలినదే యయ్యు, నచట నచట కొన్ని కల్పనలు కూడ కొనసాగినవి. రుక్మిణీ సత్యభామ లిరువురు తీవ్ర మాత్సర్య గ్రస్తలే. లోకపాలనా వ్యవహారమునందు మగ్నుడై, వేళతప్పి వచ్చిన పతిని చూచి, సత్యభామాసక్తుడై, ఆమె యింటి నుండి వచ్చుచున్నాడని రుక్మిణి శంకించును. సత్య చెలి, సత్య రమ్మనమనుచు పంపిన సందేశమును కృష్ణునకు వినిపింపగ 'దీనివెంట సత్యభామ యింటి కరుగున' అని భయపడును. నారదుడిచ్చిన దివ్యపారిజాతమును చూచి రుక్మిణి మనసున నాశించియు, సత్య చెలి యొక్క యుద్దేశమును గ్రహించి, 'రమణిక' యన్నట్లు పారిజాతమును జెల్లెలు సత్యభామ కనుపుట యుచితమని అనును. ఇది కృష్ణుని

ప్రేమను పరీక్షించుట కనిన మాటగాని, వాస్తవముగా కాదు. పారిజాతాపహరణ ప్రబంధములో వలెగాక, ఇందు కృష్ణుడే రుక్మిణిని నుతించుచు, పుష్పము నిచ్చును. తిమ్మన ప్రబంధమునకు వలెనె ఇందును సత్య ఈర్ష్యా కషాయితయై, ప్రవర్తించును. కాని ఇందు రుక్మిణి మీదనే గాకుండా మిత్రవింద, జాంబవతులపై కూడ కోపమున్నది. 'అగ్రమహిషినను గర్వముతో రుక్మిణి నన్నేమయిన దూలనాడెనా? తులవలగు నామె సఖులు నన్ను నిందించిరా? కాక మిత్రవింద జాంబవతిలోనగు సవతులు దూషించిరా? వీరలుగాక నన్ను నన్యులు దలపెట్టరు' అని నిశ్చయముగా పలికినది. (పైది. పు. 21). ప్రబంధములో వలె గాక, ఇందు చెలిచేయు రుక్మిణీసౌందర్య వర్ణనా శ్రవణమునెడ అసహనము చూపుచు "ఆ అసహ్యమగు వర్ణన యేల? సంగతి చెప్పక" అని ఈర్ష్యతో విసుగు కొనును. (పు. 2-22).

కృష్ణుడు సత్యభామను సమర్థించుచు నారదుని ముందు చెప్పబోవగా, రుక్మిణియు నీర్ష్య చెంది, సత్యభామ యెడ కృష్ణునకు పక్షపాతమున్నదని నేరమారోపించినది. ఇందును, శ్రీకృష్ణ పారిజాత యక్షగాన సత్యవలె 'రుక్మిణి దగ్గఱనున్న పారిజాత పుష్పము నాకిప్పింపుడు' అని సవతి దగ్గరనున్న పుష్పమే కావలయునని సత్య అనినది. (పైది. 34). పారిజాత వృక్షమే తెచ్చి యీగలనని చెలువుడనగా శచీదేవిని, మాత్రమేగాక "రుక్మిణి మొదలగు, నాసపత్నుల కన్న నెక్కుడు దాననగుదునని సంతోషించినది (పు. 35). ఇందలి రుక్మిణి, కృష్ణుని స్వర్గలోక గమన వృత్తాంతము విని తీవ్రమైన ఈర్ష్యకు లోనగును. సవతుల నడుమ నేర్పడిన వాక్కలహమున, సత్యాకృత పాద తాడనమును గూర్చి రుక్మిణి విమర్శింపగా, "ప్రాణేశ్వరునకు జరిగిన గౌరవము నీకు గూడ, జరగవలయునా యేమి" అని సత్య గయ్యాళితనమును చూపినది (పైది. 45). ఇంత గయ్యాళితనము చూపినను, అక్కయ్యా! ఆజ్ఞనిమ్ము. మేమింద్రలోకంబున కరిగి మరలి వచ్చెదము" అని ఆమె ఆశీర్వచనము అందుకొనినది. (పైది. 49).

"మల్లాది అచ్యుతరాముడు వ్రాసిన "సత్యామోద చంద్రోదయనాటకము"న సత్యభామ సవతిమాత్సర్యము, గయ్యాళి తనము కొంత అవధులను దాటినది. రుక్మిణి కృష్ణులతో కలసి జూదమాడుచు సత్య,

*"గెలువ కున్నను దాసిగాఁగలుగుదాన*
*గెలిచినట్లైన రుక్మిణి విడిచి నన్ను*
*సంతతానంద జలనిధిని నిరతంబు*
*నోలలాడఁగఁజేయు గోపాలకృష్ణ" ...(సత్యా చం. నాట - పు.14)*

అని పందెము చెప్పును. ఈ మాటలు రుక్మిణికి కోపమును కల్గించినవి. నాథుడు సమత లేక చనవులిచ్చుట చేతనే, ఈ గర్వపు పల్కులామె అనగల్గినదనియు, మాయలాండ్రకు ఆ పల్కులు సంతోషము కల్గించును గాని, సవతుల యొద్ద చెల్లదని అనును. రుక్మిణి తన కల్యాణ విషయమున చేసిన సాహసమును, తోబుట్టువునకు చేసిన ద్రోహమును సత్య పేర్కొనుచు, ఆ చరిత్రలు సమస్తము విచారించిన, సతీ ధర్మము తేటతెల్లమగు నని యెత్తి పొడుచుచు, కయ్యమును పెంచినది. అంతేకాదు "వినుమా యింకొకసారి యిట్లు పలుకన్ వేయింతుగా జెంపలన్" అని హెచ్చరించినది.

పారిజాత పుష్ప ప్రదానేతివృత్తాంతము విని ప్రబంధ, యక్షగానాదుల వలెగాక ఇందలి సత్య, ప్రాణ త్యాగము చేయ నిశ్చయించుకొని, తన తండ్రికి, పతికి, సవతి రుక్మిణికి కూడ చెలితో, సందేశమంపును.

*"చచ్చియైనను నిన్ను సాధింతుననుచు*
*నెంచి యుంటిని దయ్యమై పొంచినిన్ను*
*పతికి గాకుండ జేతు, నా ప్రతిన గనుము*
*కులుక నిత్తునె సుమముచే బలుకు లేల? ...(సత్యా. చం. నాట. పు. 36)*

అని కఠినముగా హెచ్చరికలు చేసినది. సత్యభామ నింతటి కఠిన హృదయగా, ఇంత గయ్యాళిగ చిత్రించిన మరియొక కవి లేడు. శ్రీకృష్ణుడు, దేవతావళి కర్తమగు ఆ పుష్ప ధూసరంబు మానవాళికెట్లు తగునని చెప్పుచు, ఆమె కోరికలోని తొందరపాటుకు మందలింపగా, అట్లు సాధింపకపోయిన తానింక జీవింప లేననుచు బెదిరించి, "అర్హమైనట్టి రుక్మిణి కందజేసి సౌఖ్యమందగ నామెతో జనుము చనుము" (పైది. పు. 52) అని అసూయను నిగ్రహించుకొనలేక పతిని 'తోయు'ను. ఇంత గయ్యాళితనము చూపినను, ఇందును ఈ గుణము స్వల్పకాలమె నిల్చినది. రుక్మిణి యెడల తాను గావించిన అపరాధమును తలచి "ఇంక నేనేమొగము పెట్టుకొని రుక్మిణిని గృష్ణునిఁ జూడగల"నని పశ్చాత్తాప పడినది. (పైది. 64).

## జానపద సాహిత్యములో :

జానపద సత్యకును సవతులందరిలోను రుక్మిణి యన్ననే మాత్సర్య మధికము. వల్లభుని కొరకు యెదురు చూచియు అతడాలస్యము చేయగా, కోపము చెంది, ఆ తరువాత అతడు వచ్చి లాలించినను, లెక్కచేయక. "మేము నీకేల? వలపుల రుక్మిణుండ" (సత్యభామ సరసము. పు. 172) అని మాత్సర్యమును ప్రకటించుకొనినది. సత్య, సవతుల యిండ్ల కెన్నడూ పోదు. ఆ విషయము రుక్మిణిని మిగుల బాధించినది.

రుక్మిణితో సత్యకు మాటలు కూడ లేవు. అంతటి మాత్సర్యము సత్యకు. తులాభార వ్రతమున పతిని నారదునకు దానమిచ్చి, ఆ తరువాత విడిపించుకొను మార్గము తెలియక తపించుచు చివరకు, రుక్మిణిని అర్థించిన కార్యసిద్ధి జరుగునని తెలియగా "వెలదులార యింతకాలమందు నుంచి మాటలేకయున్న రుక్మిణీ చెంతనెట్లు బోదునూ" (తులసీదళము పు. 195) అని బాధపడినది.

లోకమున రుక్మిణి సౌమ్యమైన దనెడు ప్రచారముండవచ్చును. కాని అది నిజము కాదనుచు సత్యభామయు,

*"ఎంత ధర్మావతి అనిలోకులూ యెన్నుదురూ*
*నాకు తెలుసును రుక్మిణి నైజము లప్పులుకులునూ"*
*.......(రుక్మిణీదేవి సీమంతము. పు. 158)*

అని చెలితో చెప్పినది. మందు పెట్టి పతిని వశపరచుకొనిన కుటిల రుక్మిణి యని, ఈ జానపద సత్యయును నమ్మును.

*"మత్తిల్ల శ్రీకృష్ణుడు మందులు లోపలి కిచ్చి*
*మత్తై, మా మీద, భ్రమలూ మరచెనె గోపాలుండూ" ....(పైది)*

అని గట్టిగా విశ్వసించినది. ఆ సవతిమాత్సర్యముతోనే, రుక్మిణీ సీమంతోత్సవమునకు మొదటి పిలుపు తనకే అందినను, సత్యభామ మాత్రము పోలేదు. వాస్తవముగా, జానపదుల దృష్టిలో సత్యభామ, యక్షగాన కవుల సత్యకు వలె అంత గయ్యాళి కాదు. ఆమెకు సవతి మాత్సర్యము కన్నను, ఈ కృష్ణుని కాపట్యము పైననే కోపమధికము. యక్షగాన రుక్మిణికివలె, ఈ జానపద రుక్మిణియు కొంత 'నోటి దురుసు' కలదియే. కృష్ణుడు సత్యకు పారిజాత మిచ్చినాడని అసూయతో కుమిలిపోవుచు 'దాని కాళ్ళను బట్టుచు కృష్ణుడు - దాని పెరటవేసె' (రుక్మిణీదేవి

ముచ్చట్లు - పు. 178) అని బాధపడినది. "జారుడికి తెచ్చిచ్చెనె మా తండ్రి - చోరుడికి తెచ్చిచ్చెనె" అని ముందు తండ్రిని నిందించినది. వెంటనే, కృష్ణుని వివాహమాడుట తన తప్పే కాని, తండ్రి చేసిన దోషము కాదని గ్రహించి, ఆత్మనింద చేసికొనును. రుక్మిణి తన వివాహవిషయమున పశ్చాత్తాపపడుటకాని, పతిని నిందించుటకాని, పురాణేతి హాసములం దెచటను కానము. తొందరపడి, నారదునకు పతిని దానమిచ్చి, తిరిగి అతనిని గ్రహింపలేక, బాధపడుచు, సత్యభామ, రుక్మిణీ సాహాయ్యము కోరి వచ్చి, మ్రొక్కి, ఆమె నర్థింపగా, ఈజానపద రుక్మిణి తన ఈర్ష్యాసూయలను దాచుకొనలేక పోయినది. సంపాదించినదంతయు, సత్య యింటనే దాచినాడని నేరము కూడ మోపుచు, పెండ్లినాడు కట్టిన పాలపూసలే గాని యితరములైన సొమ్ములేవియు తనకు లేవని వాపోవుచు,

*"యశోద తనయుడయ్యు దానమివ్వ నీకు బుద్ధి*
*యెవరు జెప్పినారతని తండ్రియుండగా*
*పట్టంపు దేవినయిన నేను యిచటనుండగాను*
*నీకు యింత సాహసంబె వేశ్య కాంతరో"* .......(తులసీదళము. పు.196)

అని గట్టిగా మందలించినది. అయినను నా దగ్గరున్న ముఖ్యమైన వస్తువు నిచ్చెదని, తులలో దానిని వేసి చూడుమని, తులసీ దళము నిచ్చుటకు సిద్ధమైనది. ఈ జానపద రుక్మిణిలో పతి భక్తి కన్నను నగలపై రక్తి, సాత్వికత కన్నను సపత్నీమాత్సర్యము, మాటలలో మెత్తదనము కన్నను, సవతిని 'వేశ్య' యని సంబోధించు నంతటి దురుసుతనము ఉన్నవి.జానపద సత్యభామ మాటలలో ఇంతటి దురుసుతనము లేదు.

విస్తృతమైన ఈ ప్రస్తుత పరిశీలనము వలన సత్యభామయొక్క సపత్నీమాత్సర్యము కొట్ట వచ్చినట్లుగ కవులను, పాఠకులను, ప్రేక్షకులను ఆకర్షించినట్లు తెలియుచున్నది.

## కోడలిగ :

మెట్టినింట అడుగుపెట్టిన ఆడుదానికి అత్తమామలే తల్లి దండ్రులు. భర్తతో కాపురమనిన, భర్తకు మాత్రమే సేవలు చేయుచు జీవించుట అని కాదు. అతని తల్లిదండ్రులను కూడ భయ భక్తులతో ఇంటి కోడలు సేవింపవలసి యున్నది. అట్లు భక్తి ప్రపత్తులతో మెలగు స్త్రీ, పుట్టినింటికిని మెట్టినింటికిని కీర్తిని తెచ్చును. అత్తమామల పాద సేవ చేయునది, తల్లిదండ్రుల యెడ భక్తి కలది, తపమే ధనముగ గలది సహధర్మచారిణి అని ఈ క్రింది శ్లోకము చెప్పుచున్నది.

*శ్వశ్రూశ్వశురయోః పాదాం స్తోషయంతీ గుణాన్వితా*
*మాతా పితృరతా నిత్యం యానారీ సా తపోధనా*

సత్యభామయు కోడలిగా అత్తమామలయెడ భక్తి గౌరవములు ప్రదర్శించుచు, తాను ఉత్తమ సహధర్మచారిణి యనుటను నిరూపించుకొనినట్లుగా చిత్రింపబడుట ఆంధ్ర సాహిత్యమున చూడగలము.

దేవకీ వసుదేవులు శ్రీకృష్ణుని తల్లిదండ్రులు. పారిజాతాపహరణ ప్రబంధమున,తనకు మానహాని జరిగినదని కుమిలి పోవుచున్న సమయమున సత్య,

*"...........ఆసాధ్వి సేవ, సేయఁ బోవంగ నాకింక సిగ్గు గాదె"?* (పారి. 1-130)

అని దేవకిని ఉద్దేశించి హరితో అనును. దీనిని బట్టి చూచిన, నిత్యము సత్య తన అత్తను సేవించుటకు పోవుచుండెడిదని గ్రహింపవచ్చును.

"మా మామ వసుదేవమాన్యుడమ్మ" (పు.14) అని భామాకలాప సత్యభామ మామగారిని గూర్చి భక్తి గౌరవములతో చెలి ముందు పేర్కొనును. "ధీరాత్ముడగు వసుదేవుండు మామ" (పు. 30) అని విష్ణుపారిజాత యక్షగానమున సత్య తన మామగారి శౌర్యమును గూర్చి ప్రశంసించును.

వామనావతారమునందు కృష్ణునకు అదితి తల్లి. కావున ఆమెయు సత్యభామకు అత్తయగుచున్నది. నరకాసుర వధానంతరము, పతితో కలిసి దివి కేగిన సత్యభామ అత్తను గాంచి "ప్రణామం బొనర్చినది.[1] దుష్ట నరకాసురుని వధియించుటయందు సత్యభామకును భాగమున్నది. ఆ కృతజ్ఞతాభావము వలననో, లేదా సత్యపై గల ప్రీతి చేతనో, అదితి తనముందున్న కోడలిని "వనితలకెల్ల నెక్కుడన వాలిన పేర్మివహించు వరానన" అని ప్రశంసించుచు, కృష్ణుడు మనుష్య మూర్తిని మహీతలంబుపై నుండెడు నంతకాలమును, సత్య "అనన్య విలాసమెలర్ప నిత్య యౌవనరుచి నొప్పుగాత!" అని వరమునిచ్చినది.[2]

తెలుగులో, సూరన విష్ణు పురాణమునందును అదితి, సత్యకు సార్వకాలంబు, ముదిమియు విరూపమును దొలంగి, సంతతానవద్య సౌభాగ్యమూర్తివై యుల్లసిల్లుమని వరమును ప్రసాదించినట్లు కలదు.[3]

*"కనియదితిసత్యభామను*
*దన కోడలిఁతల్లి! నీవుధర నాదు కృపన్*
*గనుదు స్థిరతర యౌవన*
*మును మాఱని దేహకాంతి మురహరు ప్రీతిన్" ......(బ్రహ్మ. పు - 4 -93 - 61)*
*"అనవద్యాంగీ! భాగ్యంబున వర్ధిల్లి సర్వ భోగములం గనఁగలవు" - 62*

అని స్థిరయౌవనముతో పాటు, మారని దేహకాంతి, భాగ్యాభివృద్ధి సర్వభోగ సౌఖ్యములు కూడ కోడలికి కల్గునని అదితి వరము ప్రసాదించినట్లు బ్రహ్మపురాణము వర్ణించినది. సంస్కృత బ్రహ్మపురాణమును ఇదే విధముగ చెప్పినది.[4]

శ్రీకృష్ణుని భార్యలలో ఇట్లు అత్తగారి మనసు నింతగా ఆకట్టుకొని, ఆమె నుండి అంతటి అపురూపమైన, అద్భుతమైన, దివ్య వరములను పొందగల్గిన ఏకైక వ్యక్తి సత్యభామ మాత్రమే.

## తోడికోడలిగ :

ఇంద్రుని భార్య శచీదేవి, సత్యభామకు వలెనె రుక్మిణికిని తోడి కోడలు. కాని రుక్మిణితో నామె యెట్టి స్నేహము నెరపినట్లు కనిపింపదు. కయ్యమైనను, వియ్యమైనను సత్య భామతోనే కొనసాగించినది. సత్యభామయు శచీదేవిని నెంతగా విమర్శించునో, అంతగా అభిమానించి గౌరవించును. సత్యభామ వీరవనిత యనియు, శ్రీకృష్ణుని ప్రియపత్ని యనియు శచి యెరుంగును. కృష్ణుడు కావించిన నరకాసురవధ యందు, అత్యంత సాహాయ్యకారియై సురలను, అసురుని బాధ నుండి తప్పించి, తమ కెనలేని యుపకారము చేసిన సత్యయెడల, ఆమె కభిమానమున్నది. అందుచేతనే నరకాసుర వధానంతరము తమకడకు వచ్చిన సత్యను స్నేహపురస్సరముగ "కౌగలించుకొని" నది (హరి. ఉ. భా - 4 - 203). "తగు మాటలఁజిత్తం బులు నిగురొత్తఁగఁ గలసి మెలసి చెన్నగు గోష్ఠి"ని (పైది. 204) సాగించినది. సత్యతో "నీహృదయేశుడ"ని కృష్ణుని పేర్కొనుచు (పైది. 205) ఆమె కానందమును కల్గించినది. అంతేకాదు. నీసౌభాగ్యం బనన్య దుర్లభ సంభావనోపభోగ్యంబు, నిన్ను జూచి ప్రియంబు నొందితి" నని (పైది. 206) వరమిచ్చుటకు కూడ సిద్ధపడినది. కాని మానవతియగు సత్య "నాకేమిటం గొఱంతలేదు. నీనెయ్యం బొక్కటియ కలిగిన జాలు" నని 'వినమ్రయై'పలికినది. (పైది).

---

1. *హరి. ఉ.భా - 4-208*
2. *పైది. - 4-211*
3. *సూ. వి. పు - 8-118*
4. *సం. బ్రహ్మ. పు - 203 - 23*

తోడికోడండ్ర నడుమ ఇంతటి స్నేహభావముండుటయు, మనము లోకమున చూచు చునేయున్నాము. కాని సత్య, తోడికోడలగు శచితో స్నేహమే గాక, స్పర్థతో పోటీ కూడ పడినది. తోడికోడండ్ర నడుమ ఇట్టి పోటీలును సర్వసహజమే! శచీ, సత్యభామ లిరువురును స్వాధీనపతికలు. ఇరువురును మానినీలలామలు. ఒకరిని మించి యొకరుండ వలయునను, భావమును వారి యందు నిగూఢముగా నున్నది. ఇదియును స్త్రీజన సహజమైనదే!

సూరన విష్ణుపురాణమునందు, నందన వనమునందలి దివ్యనగమును చూడగనే, సత్య, నిత్యమును దివ్యపరిమళములీను పారిజాత పుష్పములను ముడిచి, సఖులతో సుఖకేళి సలుపుచున్న తోడికోడలి సౌభాగ్యమునకు అసూయ పడినది. అంతటితో నూరుకొనలేదు.

*"అమర పతికంటె సకల భోగముల నీవ*
*యెక్కుడని కొనియాడుదురెల్లవారు*
*నట్టి నీపత్నినయ్యు నేనతని కాంతఁ*
*బోలలేనైతి నత్యంత భోగములను" ... (సూ. వి. పు. 8-124)*

అని పతిని పారిజాతోత్పాటనమునకు ప్రేరేపించినది. సవతులపై నాధిక్యము చూపవలయు ననుటయే కాదు, అమర కాంతయగు తోడికోడలను కూడ మించవలయునను కోరికయే పారిజాతాపహరణమునకు ఒక కారణమైనది.

వనపాలకులు ఇంద్రసతి గైకొనతగు దీని పువ్వులు, మనుజసతి ముడవ నర్హము కాదని అడ్డుపడగా "ఎక్కడి దేవేంద్రుడు, మఱి యెక్కడి పౌలోమి" అని గదమాయించుచు "వీరికీ భూజాతం బెక్కడిదీ లోకములో, నెక్కుడు వీరేలయైరి యెవ్వరికంటెన్" అని ప్రశ్నించి

*"తనమగఁడు బాహు విక్రమ,*
*ఘనుఁడఁయ్యేఁడు నేని గృష్ణు గయ్యములో మా*
*ర్కొని గెలిచి పారిజాతము,*
*గొని పోవుంగాక యేల గొణుఁగులు తనకున్ ....(పైది - 133)*

అని కయ్యమునకు దిగినది. సత్యభామ పలుకుల నట్లే వారు శచికి చెప్పగా, కోపముతో ఆమె తనపతికి చెప్పగా, ఇంద్రుడు యుద్ధమునకు బయలు దేరినాడు.

పారిజాతాపహరణ ప్రబంధము నందునిట్లే, తనదు ప్రాణేశుడైన మఘువు నిటబంపి, సత్యాభామా విధేయుని నుండి తిరిగి గ్రహించుమని తోడికోడలిపై 'సవాలు' చేసిన సత్యభామ కనిపించును.[1] తోడికోడండ్ర కారణముగా అన్నదమ్ములైన ఇంద్రోపేంద్రుల నడుమ, యుద్ధము జరిగినది.

పారిజాతలాభానంతరము, సత్యయు, శచీదేవిపై నున్న అసూయను విడచినట్లు కనిపించును.శచియు శ్రీకృష్ణుని మహానుభావత్వమును గ్రహించినదగుటచే, సత్యపై నున్న కోపమును మరచి యుండును. కాని ఆధునిక నాటకకర్తలు మాత్రము సత్యగావించిన పరిభవమును, శచి మరువ లేకపోయినదని భావించినారు. శ్రీ కృష్ణతులాభార నాటకమున శచీదేవి,

*"అమ్మెయి మిమ్ము గెల్చియనురాగము గైకొని నట్టి కృష్ణు మీ,*
*తమ్ముఁడుదేవదేవుఁడు స్వదార వశుండని సైతుఁగాక రో,*
*షమ్మతీ తోడికోడలగు సత్య యొనర్చిన యప్పరాభవం,*
*బెమ్మెయి సైచుఁదాన హృదయేశ్వర! ఇంత యెరుంగ నేరరే"? ...(శ్రీకృష్ణ-తు-నాట-పు.4)*

అని మండిపడినది. శచీదేవి మనశ్శాంతి కొరకును, సత్యకొక పరమసత్యము తెలియపరచుటకై నారదుడామెకు పుణ్యకవ్రత విధానమును బోధించినట్లుగా కూడ వారు కల్పించినారు.

1. పారి. 4 - 58

నిజమునకు పారిజాతాపహరణానంతరము, శచీ సత్యభామలు తమ పూర్వవైరము నంతటిని మరచి, యథాప్రకారముగా స్నేహభావము నెరపుచు బంధుత్వము కొనసాగించినారు. విజయవిలాసమున, సుభద్రా కల్యాణమునకు వచ్చిన శచీ దేవిని, రుక్మిణి పెద్దముత్తైదువ వలె, పతి నియోగించిన విధముగ, శచికి సత్కారములు చేయుచు, గంభీరముగా, ప్రవర్తించినది. శచియు రుక్మిణితో నావిధముగానే వ్యవహరించినది. కాని సత్యభామ శచిని చూడగనే "పారిజాతంబు కతనమున్ బరిచయంబు, చాలఁగల్గుట బ్రియముతో సత్యభామ" "మ్రొక్కె"నది (3-127). సత్య అట్లు తనకు మ్రొక్కగా ఇంద్రాణి "నెనరుతో" "చెల్లెల! లెస్సలా" అని ఆత్మీయతతో పలుకరించినది. ఇంతటి ఆత్మీయమైన పలుకరింపు పొందిన ఏకైక కృష్ణవనిత, సత్య మాత్రమే! శచిపై కోపముండిన, సత్యతానై పోయి మ్రొక్కదు. సత్య పైన కోపము, ద్వేషముండి యుండిన శచీదేవి, ఇంత ప్రేమగా పలుకరించి యుండలేదు. అంతేకాదు. పెరటి చెట్టుగా నాటిన పారిజాతము నిండుగా, పూలతో విలసిల్లుచున్నదా? యని యడుగుచు, సదా తన మనము దానిపైననే యున్నదనుచు శచి, "అది ప్రాపుఁబ్రోవుఁ బుట్టిల్లును జొచ్చినిల్లునయి, వృద్ధి యొసంగెడు నీకు నెంతయున్" (128) అని పారిజాతము సత్యకు ఆశ్రయమును, పోషణమునగుచు పుట్టినిల్లు, మెట్టినిల్లునై, ఆమెకు సకలసౌఖ్యమును వృద్ధిని కల్గింపవలయుననియు ఆశీర్వదించినది.

తోడి కోడంద్ర నడుమ సూటిపోటి మాటలును అనురాగ, ఆప్యాయతలును ప్రతి యింట సహజమే! శచీ దేవిని తోడికోడలుగ భావించి వ్యవహరించినది, అష్టమహిషులలో సత్యభామ మాత్రమే. శచీదేవియు, చనవుగ పోట్లాడినదియు సత్యభామ తోడనే! రుక్మిణీ దేవి లక్ష్మ్యంశయే యైనను, దివికి భువికి, సంబంధము నేర్పరచుచు, బంధుత్వమును కొనసాగించుచుండిన భామిని మాత్రము, సత్యభామయే!

## వదినెగ :

పెద్దలయెడ భక్తి గౌరవములతో వ్యవహరించిన సత్యభామ, తన కన్నను పిన్నవారితో వ్యవహరించునపుడు స్వాభావికమైన చిలిపిదనమును మరుగు పరచుకొనలేదు. పెద్దల ముందెంత గంభీరముగ వ్యవహరింపగలదో, చిన్నవారి ముందంత కొంటెతనమును చూపగలదు. ఆడుబిడ్డ సుభద్రను ఆటపట్టించు వదినె సత్యభామలో, చిలిపితనముతో పాటు, ఆత్మీయతయు పెనవేసికొని యున్నవి. చిలిపితనముతో ఆటపట్టించినను, తన బాధ్యతను విస్మరింపక, పెద్దరికముతో నడచు కొనుటయు సత్యభామ ప్రత్యేకత. విజయ విలాస ప్రబంధమున నిట్టి సత్యభామను చూడగలము.

అర్జునునిపై వలపుగొని, విరహముతో తపించు సుభద్రను చూచి, "పులకించె మే నేమి తలంచు కొంటివె,?" అని మిత్రవిందయు, "ఇన్నాళ్ళవలె మనసిచ్చి మాటాడవే యెందు దృష్టి?" అని కాళిందియు, 'చెలి పెండ్లి కత సెప్పి జెవియొగ్గి విన వేమికలదులే?'అని భద్రయు, "వలపు వాసన మించెఁ గలికి నీమొగమంచు" సుదంతయు, గేలిచేయు చుండగా, జాంబవతి నవ్వగా, లక్ష్మణ, సరసమాడగ, రుక్మిణి పెద్దరికముతో "ఏలగడుచేసెదరు ముద్దరాలి"నని చిన్నగా మందలించు చుండగా, చిలిపిదనాల చిన్నది, సత్యభామ మాత్రము నోటి మాటలతో నేమియు అనక, కొంటెదనాల గడుసుదనముతో "కన్గిలిపెను" (3-28). ఆ ఒక్క కన్ను గీటులో వేయి మాటల పరిహాసము దాగియున్నది.

మాయా సన్యాసి, 'అర్జునుడ'ను రహస్యమును కృష్ణుడు, రుక్మిణీ సత్యభామలకు మాత్రమే చెప్పి, మరియెవ్వరికిని చెప్పవలదని హెచ్చరించినాడు. సుభద్ర విరహమునకు కారకుడెవరో యని, యితర సవతులు "ఎవ్వని జూచిమేలు పడితే యరవిందదళాక్షి" అని

ఒకరు, "నీమనం బెవ్వడు సొచ్చె జెప్పఁగదవే" అని ఇంకొకరు, ఇట్లు పలు రకములుగా, చిలిపిగా మేలమాడుచుండగా, సత్య మాత్రము నవ్వుచు నర్మగర్భముగా

*"క్రాగి యున్నది మిగుల నంగంబుసూడఁ*
*గలవరించుచు నున్నది కలదొయేమొ*
*సోఁకుడల్ల సన్యాసికే సూపవలయు*
*భామను..... .... .... ..."* .......(విజ. వి. 3-35)

అని, ఆ వింత వ్యాధికి చికిత్సోపాయమును సూచించినది. గాలి సోకినపుడు జ్వర తీవ్రత, కలవరింతయు నుండును. యోగీశ్వరులు తమ మంత్ర బలముచే, దయ్యములను పారద్రోల గలరు. విరహలక్షణములును గాలిపోకుడు లక్షణములు నొకే విధముగ నున్నవి. సుభద్రా ప్రియుడగు అర్జును డిపుడు 'కల్లసన్యాసి'గ నున్నాడు. ఆ విషయము ఇతరులెవరికిని తెలియరాదని, పతి మున్నే తనను హెచ్చరించి యున్నాడు. అయినప్పటికిని ఆడ పడుచును ఆట పట్టించు సత్య, ఆ సత్యమితరుల కెరిగింపను లేక, దానిని దాచుకొనను లేక, పై విధముగ నర్మగర్భముగ పలికినది. గాలి సోకుడనిగా ఇచట ప్రేమ అను గాలిసోకుడు. అంగము మిగుల క్రాగి యుండుట, విరహము వలన. కావున ఇట్టి గాలిసోకుడు కల్గుటచే ఆమెను ఆ సన్యాసికి చూపుటయే తరుణోపాయము అని భావగర్భితముగా అనినది. అంతటితో నూరుకొనలేదు. ఈ మాటలనుచు నవ్వినది. విషయమెరుగని వారికి సైతము ఆమె నవ్వు నందేదో నిగూఢ రహస్యమున్నదను సందేహము కల్గించును. కాని యిట్లు మేలమాడుచు గడపిన, తీవ్ర విరహముచే తపించు సుభద్రకు, తగినశైత్యోపచారములు లేకపోవుటచే ప్రాణములే పోవచ్చును. యతివేషమున నున్నవాడు అర్జునుడనెడు రహస్యమును నెవ్వరికిని తెలుపవలదని కృష్ణుడు హెచ్చరించి యున్నాడు. పత్యాజ్ఞ ననుసరించి, ఇతరులకీ విషయము తెలుపకుండిన, తగు శైత్యోపచారములు లభ్యముకాక ఆ అమాయికురాలగు మఱదలు, ప్రాణములనే విడుచు ప్రమాదమున్నది. కావుననే సత్య,

*"ఈలీల నుండి మనమిటు*
*మేలములాడంగ నేమి మిడిమేలమొ'* ...(పైది 3-36) అని భయమును ప్రకటించుచు, అంతలోనే, "సుభద్రహితాళు"లకు, మాత్రము, ఎవరికిని తెలియకుండ, సమయము చూసి "ఇసుమంత" "యా రహస్యము దెలిపి" సమయజ్ఞతతో శైత్యో పచారములు చేయించి, సుభద్ర ప్రాణములను నిలబెట్టినది. ఇతర సపత్నీ కాంత లేరికిని అనిపించని, రుక్మిణికి కూడ తోచని ఈ ప్రాణాభయ మార్గము, ఈ చిలిపి సత్యకు మాత్రమే స్ఫురించినది.

యాదవరాణులు సుభద్రార్జునుల కల్యాణ వేడుకలలో నొకటిగా, వధూవరులకు విందు చేసిరి. వీరి వివాహ విషయ మితరులకు తెలియదు. కావున

*"ఇన్నాళ్ళోది యొనర్పఁగేళివనిలో నింపొందు నమ్మాధవీ*
*పున్నాగంబులఁబెండ్లి సేయవలెఁ బూఁబోండ్లార రారే యటం*
*చున్ నేర్పుల్ దగ నొండొరుం బిలిచికొంచున్ సత్యభామాదివి*
*ద్యున్నేత్రామణులప్పు డిర్వురకు విందుల్సేసిరందందులన్* .....(విజ.వి.3-77)

పున్నాగమనగా పొన్నచెట్టు. మాధవి అనగా మాధవీలత. ఇది పైకి వ్యక్తమగు భావము. పున్నాగమన పురుష గజమైన అర్జునుడు. మాధవుని సోదరి సుభద్ర మాధవి. ఇది అంతరార్థము. ఇంతటి చమత్కారముతో వివాహ వేడుకలలో ఆకాంతలు పాల్గొనిరట. నిజమున కీమాటలు సత్యభామయే యని యుండును. ఈ సన్నాహమున కామె నాయకత్వము వహించి యుండుటను, 'సత్యభామాది' అని కవి చేసిన ప్రయోగమును బట్టి యూహింప నగును.

సంస్కృత పురాణేతిహాసములందలి సత్యభామకు గాంభీర్యమున్నంతగా చిలిపితనములేదు. తెలుగు సత్యభామలో మాత్రమే ప్రగల్భతకు ప్రగల్భత, చిలిపితనమునకు చిలిపితనము నున్నది. పెండ్లి యగుచున్న ఆడపడుచును, నిట్లు కొంటె మాటలతో, సరసమాడు తెలుగింటి వదినెలు నేటికిని ప్రతియింట మనము చూడగలము. శ్రీకృష్ణుని అష్టమహిషులలో నిండు తెలుగుదనమున్న అతివ సత్యభామ.

వదినెగ, ఇంటి కోడలిగ, ముత్తైదువుగ సత్యభామ తన బాధ్యతలను నెరవేర్చినది. సుభద్రాకల్యాణ సమయమున అరుంధతి, శచి, రుక్మిణి, అప్సరోగణంబులతోడ, సత్యయు కలిసి "పురీంధ్రీ కార్యంబులు" నిర్వహించినట్లు భారతమున కలదు[1]

సత్య వదినెగా, మఱదలి కల్యాణకార్యములను బాధ్యతతో నిర్వహించుటయే కాదు, గురువువలె ఆమెకు విలువిద్యను కూడ నేర్పినది. నరకాసుర వధాసమయమున సత్య చూపిన సాహసమే, ప్రేరణమై, సుభద్ర తాను వలచిన వరుని వివాహమాడుటలో విజయము నందుటకు తోడ్పడినది. సుభద్ర అర్జునుని వరించి, అతనితో పారిపోవునపుడు, తమ్మెదిరించు వారితో అర్జునుడొంటరిగా పోరాడవలసి రాగా, తానును యుద్ధమున పాల్గొనగల ననుచు సుభద్ర,

*".... .... .... ..... .... ..... ....*
*ఏయె నేరిపె వింట నొక్కింత నాకు*
*నావదినె సత్యభామ మున్నరకయైన*
*నిలిచి మున్నరకాసురు గెలిచెఁగాదె"* ....(విజ.వి. - 3 - 143)

అని వదినెగారి గురుత్వమును అర్జునుని ముందు ప్రశంసించును.

ఆధునిక నాటకకర్తల పోషణలో సత్యభామ చిలిపితనము ఆత్మీయత మరింత మెరుగేరినవి. వావిలికొలను సుబ్బారావు గారి 'సుభద్రా విజయ నాటకమున', సత్యభామ, అమాయికురాలగు కన్నె సుభద్ర మనమున, అర్జునునిపై ప్రేమాంకురము మొలకెత్త కారణమైనది. పతికి బంధువులైన, పాండవులపై నీమెకు నెంతో అభిమాన గౌరవములున్నవి. సుభద్రకు అర్జునునిపై ఆరాధన, గౌరవములున్నను, అతడప్పటికే ద్రౌపదిని చేపట్టిన వివాహితుడు కావున, తనకాతడు దక్కక పోవచ్చుననెడు సంశయముతో, తన మనసును బహిర్గతము చేయలేక సతమతీ మగుచుండగా, సత్య, సుభద్ర తలంపెరిగి, సంకల్పము సత్యము ధృఢమైనచో బ్రహ్మచారిగ గాదు, సన్యాసిగ నుండి నైన నాకర్షించును" (పు.11) అని పరోక్షముగ ప్రోత్సహించినది. సుభద్ర జల్లిన పూలు, రథారోహుడైన ధర్మజునికి బదులు సారథియగు అర్జునునిపై పడగా "మఱదలా నేను రాజుగారిపై వేయుమనిన నీవు సారథిపై వైచితివా? ఎంత తెలివి గలదానవే' (పైది. పు. 12) అని గేలి చేసినది. రెండవ మారు వేసిన పూలు కూడ, మరల అర్జునునిపై పడగా "ఔరా! లక్ష్యశుద్ధి! సారథికి నీకు నేమో లంకె యున్నది, పో!" (పైది) అని పరిహాసమాడి కన్నెయెదలో వలపుమొలకను చిగురింప చేసినది. పాండవులలో ధర్మజ భీములను, సుభద్రకు 'బావగార్లని'యు, నకుల సహదేవులను "మఱుదు"లనియు (పైది) పరిచయము చేయుచు, అర్జునుని మాత్రము పరిచయము చేయక అర్థస్ఫూర్తితో విడిచినది. యతి వేషధారియై వచ్చిన అర్జునుని సపర్యలకు, కృష్ణా దేశానుసారము సుభద్రను, నియోగించిన తరువాత, రుక్మిణి "కార్యము ముగిసినది. వారి సెలవు తీసికొని పోవుదమ"నగా, సత్య "నిజమే మనమిచట నుండి, వారి యేకాంతము జెరిపినఁ గోపింతురు" అని, అర్థస్ఫురణతో పలుకుచు "ఈ చిన్నది మీ సేవకు యోగ్యురాలేకదా"

---

*1. భార. ఆది - 8 - 194*

(ప్రైది. పు. 59) అని అర్థ యుక్తముగ అడిగినది. నిరాశతో, భయముతో, తన వివాహ విషయమున కలరపడు, సుభద్రకు, పరోక్షముగా ప్రోత్సాహమిచ్చినది సత్యయే. దుర్యోధనునికై, సుభద్రను బలరాముడు, నిర్ణయించి యుండుట, సత్య కిష్టము లేదు. వివాహమునకు ముందు, సుభద్ర, యతి యొద్దకుపోయి అతని నుండి సెలవు తీసికొనివచ్చుట నీతి కాదును రేవతితో, యతికి మర్యాద జరుగనిచో బలరాముని, శపింపగలడని రేవతిని భయపెట్టినది. రేవతికి తెలియని విధముగా సుభద్రను అర్జునుని భవనమునకు రహస్యముగా చేర్చవలయును. "సుభద్ర నర్జున భవనంబునకు దోడుకొని పోవు వారెవ్వరు" (ప్రైది. పు. 83) అని రేవతి ముందే నోరు జారినప్పటికిని, రేవతి అర్జున నామము విని కంగారు పడుట చూచి, సత్య తెలివిగా "అర్జున భవనమనిన శ్వేత భవనమని కాదుకాబోలు" అని తిరిగి ప్రశ్నించి రేవతిని నిరుత్తరాలిని చేసినది. లజ్జావతియైన సుభద్ర చేతికి వస్త్రములిచ్చి, అవి యతి వేషధారియైన అర్జునుని చేతికిచ్చి, తనను స్వీకరింపు మనుచు ప్రార్థింపుమని వసుదేవుడనగా, సుభద్ర సిగ్గుతో నిలువగా, రుక్మిణి "వస్త్రంబులు గొన గేలు పట్టుకొని యైన వేడుకొనుము" అని చెప్పగా, సత్య మాత్రము, సమయస్ఫూర్తితో "వారు గదా సుభద్రకేలు గ్రహింపవలయును" (పు. 87) అని, అర్జునునకు కర్తవ్యమును సూచించినది. కన్నె ముగుదయైన సుభద్ర తానై వరుని కరమును పట్టుకొనలేదనెడు సత్యము, సత్యకు మాత్రమే స్ఫురించినది. అంతేకాదు. లజ్జా కలిత చిత్తయైన ఆడుబిడ్డను "మఱదలా! స్వాములవారి సేవల వలన నీ కోరిన విభుడు లభించె గదా" (ప్రైది. పు. 88) అని పరిహాసము లాడినది. సుభద్ర, రుక్మిణీ సత్యలకు నమస్కరింపగా, సత్య మాత్రమే "శీఘ్రమ మేవ సుపుత్రావాప్తిరస్తు" అని చిలిపితనముతో చిక్కని ఆత్మీయతను రంగరించి ఆశీర్వదించినది. ఇట్లు, సుభద్ర, అర్జునునిపై వలపుగొనుటకును, వివాహమాడ సాహసించుటకును సత్యభామయే అన్ని విధముల కారణమైన దనునట్లుగా ఈ నాటకము చిత్రించినది.

తన బావగారి కూతురైన శశిరేఖ పరిణయ విషయమునందును సత్యభామ కొంత సాహసమును చూపినట్లుగా 'శ్రీకృష్ణాతిమానుషత్త్వ ప్రబంధమున గోచరించును. శశిరేఖ ఇష్టపడిన అభిమన్యునితో, ఆమె వివాహము జరిపించుటకై సత్యభామ, కృష్ణాదుల కెంతో సహకరించినది. వారాడు నాటకమునకు సత్యభామ గృహమే ముఖ్య స్థలమైనది. అష్ట మహిషులలో భర్తృ విశ్వాసము నధికముగా చూరగొనిన దీచతురయే గావున శ్రీకృష్ణుని అజ్ఞచే ఘటోత్కచుడు, అభిమన్యుని రహస్యముగా "సత్యాదేవి భవనమునకు" చేరవేసినాడు. శౌరి యొక్క ఇతర పత్నులు, వరుసగ ఒక్కొక్క దినము, శశిరేఖను తమ వశమునందుంచుకొని, పెండ్లి కూతు విధమున అలంకరించగా పరేంగితజ్ఞరాలు, ప్రణయతత్త్వమెరిగిన సత్యభామ మాత్రము, శశిరేఖ మనసు గ్రహించి కామరూపుడైన ఘటోత్కచునికి శశిరేఖ వేషమువేసి శ్రీకృష్ణు నాదేశానుసారము, గూఢముగా నిజ శశిరేఖను "వెలికి" పంపి వేసినది. (3-4-81). ముకుందు నితర మహిళలా రహస్యమెరుగక, మాయా శశిరేఖను నిజ శశిరేఖయని భ్రమపడి భూషణములచే అలంకరించి పెండ్లి సోయగమును దీర్చినారు. ఇట్లు సత్యభామ పిన్నవారైన ప్రేమికులజంటను కలుపుటకు కొంత సాహసమును చూపి కృతకృత్యురాలైనట్లు ఇందు చిత్రితము.

## సోదరిగ :

సత్యభామ తనకు అన్న వరుసైన అర్జునునిపై చూపిన ఆత్మీయత, గౌరవము ప్రశంసనీయము. మాయాసన్యాసి విజయుడే యనురహస్యము, పతివలన తెలిసికొనిన రుక్మిణీసత్యలు, కృష్ణాదేశమున, రహస్యముగ అతనికి సేవలు చేయుటకై వెడలి

"అర్మిలిమ్రొక్కి" "నిన్ను గని యెన్నాళ్ళో కదాయంచు" అభిమానము ప్రదర్శించుచు "వచ్చితివా, యన్నా కిరిటీ" అని మనసార పలుకరించుచు "కూర్మి కలదా చెల్లెండ్రపై" అంచు, "ప్రియోక్తులాడి" బూజల్సేసిరి (విజవి-2.126). కూర్మి కలదా చెల్లెండ్రపై' అనుమాట యందెంత ప్రేమయున్నదో, సుభద్ర కొరకై యీనాడు వచ్చినావుగాని, మా మీద ప్రేమతో కాదు గదా, అనెడు 'నిష్ఠురముకూడ 'నున్నది. పై మాటలు పెద్దరికముతో, గంభీరముగ వ్యవహరించు రుక్మిణి యని యుండదు. నిష్ఠురములో ప్రేమను, అదలింపులో ఆత్మీయతను కలుపగల సత్యభామయే అట్లని యుండును.

## హితైషిగ :

వివాహమైన యువతికి భర్తయు, అతని తల్లిదండ్రులు ముఖ్యులైనను, వారు మాత్రమేగాక, వారికి చెందిన బంధు జనులును నీమెకు బంధువులగుటచే వారిని కూడ నీమె గౌరవింపవలసి యున్నది. వరుసైన బంధువుతోనే గాక, ఇతర బంధువులతో కూడ స్నేహ బాంధవ్యములను నెరపుట వలన ఇరువైపుల స్నేహాభివృద్ధి కలిగి, సత్సంబంధము లేర్పడి ఆయావ్యక్తుల కుటుంబముల నడుమ ఆత్మీయతాభావములు పెంపొందును.

కొందరు స్త్రీలు, భర్తృపక్షము వారి యెడల అకారణముగానో సకారణముగానో ఈర్ష్యాక్రోధములను పెంచుకొని, ఆత్మీయతను తుడిచి వేయుచు బాంధవ్యమును త్రుంచి వేయుచు, భర్తకును, మెట్టినింటి వారికిని తీవ్ర ఆవేదనను కల్గించుచు కుటుంబ కలహములకు కారణ మగుచుందురు. కాని ఉత్తమ కులకాంత యెప్పుడును తన పుట్టింటివారిని నెట్లు ప్రేమాదరములతో గౌరవించుచుండునో, మెట్టినింటి వారిని కూడ అదే విధముగ, కొన్ని మారులు అధికముగ కూడ మన్నించుచు కుటుంబ గౌరవమును కాపాడుచు, అందరి మన్ననలకును, ప్రశంసలకును పాత్రురాలగుచుండును. ఒక యింటి శాంతి, సంతోష గౌరవములు ఆ ఇంటి కోడలిపైనే అధికముగ ఆధారపడియుండును.

శ్రీకృష్ణుని పట్ట మహిషులందరును, బంధువులను గౌరవించుచు, ప్రేమాదరములను చూపినను, సత్యభామవలె చనువును, స్నేహమును ఆత్మీయతను, ఆర్ద్రతను అంత అధికముగ ప్రదర్శింప లేకపోయినారు. ఈ కారణముగానే కృష్ణుని బంధువులును, సత్యభామ యెడల చూపిన ఆత్మీయతను మరి యితర కాంతలయందు చూపలేకపోయినారు.

శ్రీకృష్ణుడును పాండవులును మేనత్త మేనమామ బిడ్డలు. అర్జునుడు శ్రీకృష్ణుని సోదరి యగు సుభద్రను వివాహమాడుటచే వారి నడుమ బాంధవ్యమును, ఆత్మీయతయు ఇంకను బలపడినది. శ్రీకృష్ణుని భార్యగా సత్యభామయు, శ్రీకృష్ణుని బంధువుల యెడల ఆత్మీయతతో మెలగుచు, వీరి బాంధవ్యమును మరింత పటిష్ఠమగునట్లు సహకరించినది.

పాండవుల పత్నియగు ద్రౌపదితో, సత్యభామకు గల ఆత్మీయత యెట్టిదో తెలిసి కొనుటకు, భారతారణ్య పర్వమునందలి, ద్రౌపదీ - సత్యభామా సంవాద ఘట్ట మొక తార్కాణము. ద్రౌపది, బంధువుగా కన్నను సత్యభామ దృష్టిలో ఆమె ఒక ఆత్మీయురాలైన స్నేహితురాలు. తిమ్మయ కృతమగు ద్విపద భారతము, 'విష్ణుని దేవి తనకు నెచ్చెలియైన ద్రౌపదిని జూచి' (ద్వి. భార - ఆరణ్య - 4 - పు. 69) అని ద్రౌపదిని సత్య నెచ్చెలిగానే పేర్కొనినది.

కృష్ణుడెంతగా తనకనురాగము చూపుచు వశవర్తియై యున్నను బహుకాంతా కాంతుడాతడు. కావున నేక్షణమునందైన నింకొక కాంతకు వశగతుడు కావచ్చునను భయము సత్యభామ కేవేళయందు నున్నది. తన భయము తీరుమార్గమెట్లు? ఒక్క భర్తనే తాను పూర్తిగా నధీనములో నుంచుకొనని వేళ, యేవురు భర్తలను తనకు వశగతులను చేసికొని,

నిశ్చింతగా, సంతోషముగా నుండు ద్రౌపదిని చూచిన, నీమెకు అద్భుతముగ ననిపించినది. ఆమె ఎల్లవేళల వారి నందరిని తన కనురక్తులగునట్లు చేసికొనిన విధమెరిగిన, తానును తన పతిని తన ఆధీనము నుంచుకొని నిశ్చింతగా నుండగలదు. ఇంతటి ఆంతరింగిక, విషయమును నెచ్చెలియైన వ్యక్తితో మాత్రమే చర్చింపగలదు. అందులకే, ఏకాంతమున యొక్క యెడ ప్రియసల్లాప సంసక్తలై యుండునపుడు, సమయజ్ఞతతో అయిదుగురు భర్తలను వశగతులను చేసికొనియుండు ద్రౌపదిని చూచి

*"వ్రతము పెంపొ మంత్రౌషధ వైభవంబొ*
*సరస సైపథ్య కర్మ కౌశలమొ చతుర*
*విభ్రమోల్లాస రేఖయొ వెలఁది నీ వి*
*శేష సౌభాగ్య హేతువు సెపుమ, నాకు"* ...(భార. ఆరణ్య. 5-291)

అని, ఆమె విశేషసౌభాగ్యమునకు కారణమును కుతూహలముతో అడిగినది. విషయము తెలిసిన తాను నీవిధముగానే కమలనాథుని వశగతుని చేయగలనని చనవుతో అనినది. (పైది. 292)

కృష్ణుని ప్రియ భామినియైన సత్య, పై విధముగా తన నడుగుట అనుచితముగా నని పించుటచే, ఇంచుక కినుక వొడమినను, దాని నడచుకొనుచు మృదుల హాసిని యగుచు ద్రౌపది

*"నను నిట్లు దుష్ట వనితా*
*జనమునటులుగాఁదలంపఁజనునే నీకున్?* ....(పైది. 294) అని ప్రశ్నించుచు,
*మనసొప్పదు పురుషోత్తము*
*వనితవుగాఁదగవు నీవు వనరుహనయనా"* ....(పైది) అని పరిహాసమునకు అనునట్లుగా సత్య వివేకహీనతను స్పష్టము చేసినది. చనవు చేతనే, సత్య అట్లడిగినది కాని ద్రౌపదిని తుచ్ఛస్త్రీగా తలంచునంతటి తులువ కాదీమె. ద్రౌపది మందలింపులకా మానిని రోషా వేశములను పొందలేదు. తన మాటలు తనకే తెలియకుండ ఆ సతిని బాధించినదని గ్రహించుటచే "లజ్జా కలిత చిత్తయగుచు" పశ్చాత్తాపముతో

*"ఏనెఱుఁగమినిట్లడిగితి*
*నా నేరమి సైపవలయు"* ...(పైది - 5-311) అని క్షమాపణ నడుగుటయే గాక "సన్మానితము భవచ్చరిత్ర మహిమ ధరిత్రిన్" (పైది) అని నిండు మనసుతో ఆమెను కొనియాడినది. ఈ మాటలు సత్యకు ద్రౌపదిపై నున్న గౌరవ భావమునే సూచించును గాని, న్యూనతా భావము నేమాత్రము కాదు. సంస్కృత భారతమున "ఓ పాంచాలీ! నా తప్పు తెలిసికొంటిని. క్షమింపుము. సఖుల సంభాషణములో పరిహాసముగ మాటలాడుటకు స్వాతంత్ర్యము స్వేచ్ఛ కలదు కదా" అని తానామె నొక ఆప్తమిత్రురాలిగా భావించియే పై విధముగా మాట్లాడితినని తెలుపును[1]. ద్విపద భారతమున

*"జననీ! నేనింత విచారింపనైతి*
*మాట యోరువు మమ్మ....."* ....(ఆరణ్య 4-పు. 70)

అని భక్తి భావముతో ద్రౌపదిని "జనని" అని సంబోధించి క్షమాపణము నడుగును. శ్రీకృష్ణుని భార్యలలో ద్రౌపది యెడల నింతటి స్నేహము నెరపిన వ్యక్తి సత్య తప్ప మరియొకరు లేరు.

---

*1. సం. భార. ఆరణ్య - 232 - 61*

ద్రౌపది "మంత్ర తంత్ర వివిధౌషధముల వలన పతులు వలతురని భావించుట బేలతన మనియు, దాని వలన మున్నుగల ప్రేమయు తొలగునేగాని యొకండును సిద్ధింప దనియు, పతి దానిని నెరింగినచో అట్టి స్త్రీతోడి పొందు సర్పముతోడి పొత్తుగ - చూచునని హెచ్చరించినది. పతి మనసు నాచుకొనెడి చతురోపాయములను బోధించుచు, సత్య కృష్ణుని కడ నెట్లు ప్రవర్తింప వలెనో కూడ వివరించినది.

*పతికి ననుంగులైన తగు బంధుల మిత్రుల భోజనాది స*
*త్కృతముల నాదరించుచు నకృత్రిమ భక్తి నియుక్తి సంతతో*
*త్థిత మతివై చరింపుము ".... .... .... ..."* .....(భార- అరణ్య 5-319)

అని కూడ ఉపదేశించినది. పురాణేతిహాసములను పరిశీలించిన యెడల, పాండవుల అరణ్య వాసమునకు ముందే పుణ్యకవ్రతము జరిగి యున్నదని చెప్పవచ్చును. పుణ్యక వ్రతమునకు వచ్చియున్న బంధు జనులందరిని సత్యభామ సత్కరించినదని భైరవ కవి హరివంశము వర్ణించినది.[1] పారిజాతాపహరణ ప్రబంధమున, పుణ్యకవ్రతమునకు "ద్రోవదియు" వచ్చినట్లు పేర్కొనబడినది.[2] కావున ద్రౌపది బంధుమిత్రులకు సత్య చేయు సత్కృతులనుచూచియే యుండి యుండునని భావింపవచ్చును. నిజమునకా యుప దేశములలో చాల వరకు సత్య భామ అప్పటికే ఆచరించియున్నది. అయినప్పటికిని సత్య "ఆ పరమ సౌభాగ్యమూలంబులయిన యుపాయములను" 'ప్రీత చిత్తయై వినుట' (భార - అరణ్య.5 - 322) ద్రౌపది యెడల ఆమెకు గల గౌరవ భావమునే సూచించును. నేడు కౌరవుల వలన, ద్రౌపది తీవ్ర అవమానమునకు గురియై అరణ్య వాస క్లేశము ననుభవించుచున్నది. తీవ్ర ప్రతికారేచ్ఛతో జ్వలించు ఆమానినికి, తగు సాంత్వన మీ పట్టున అవసరము. వివేకవతియైన సత్య యిది గ్రహించినదగుటచే "నీవంటి నల్లని కనులు కలదియు, సౌభాగ్యవతియు శుభలక్షణయు చాలకాలము కష్టమనుభవింపదు!"[3] అని సాముద్రిక లక్షణములను పరికించి ముందుగా శుభమును పలికినది. పరదేశము పొందిన నిన్నుచూచి, గర్వముతో బుద్ధిలేక నవ్విన కౌరవస్త్రీలు నిస్సహాయులై దుఃఖము పొందుట నీవు చూడగలవు,[4] అన్ని పరకాంతల దుర్గతిని యూహించి, పాండవ కాంతకు నూరడింపు కల్గించినది. అంతేకాదు ఏ శత్రువుల వలన దుఃఖము పొందితివో వారు యమ గృహమునకు ప్రయాణమైనారని తెలిసికొనుము"[5] అని పలికి ఉత్తేజరచుట సంస్కృత భారతమున చూడగలము. ఆంధ్ర భారతమునందును, నిట్టి ప్రియబాంధవియైన సత్యను కనగలము

*"నీవు ధర్మజ్ఞవు దేవ సన్నిభులు నీ, భర్తలు మహనీయ కీర్తిధనులు*
*ధైర్య తేజోబల శౌర్యసంపన్నులు, గావున వీరికి నేవిధమున*
*ధారుణీ రాజ్యంబు సేరెడుఁ దడయక, మీ కెగ్గు సేసిన లోకనింద్య*
*చరితుండు కౌరవ ధరణీశు వనితలు,దిక్కు లేకలమటు బొక్కుచుండఁ*
*గని ముదంబున బొందెదు వనిత నీవు ...."* ......(భార. ఆరణ్య 5 -323)

అని ధైర్యము చెప్పినది.

---

1. భై. హరి- 5 - 235
2. పారి - 5 - 72
3. సం. భార - ఆరణ్య - 234 - 5
4. పైది - 234 - 8
5. పైది - 234 - 9

"అశ్రుత పూర్వ మోయమ్మ నీ వ్రతము" అని ద్రౌపది శపథమును, ద్విపద భారత సత్య నుతించును.[1]

కవిత్రయ భారత సత్య, అంతటితో నాగలేదు. ఏ తల్లికైనను తనను స్తుతించుట కన్నను తన బిడ్డలను పొగడిననే ఆనందము పరవశము కల్గును. ప్రస్తుతము, ద్రౌపది స్వీయ సంతానముకు సుదూరమున నున్నది. అట్టి యెడ ఆమెకు బిడ్డలపై మమకారము మరింత యధికమగుట సహజము. ఆ సత్యమును ప్రకృతి రహస్యము నెరిగినది కావుననే, సత్య

"సుతుల నత్యంత నిర్మల మతుల శౌర్యయుతులఁ గాంచిన సద్గుణాన్వితవు" (భార. అరణ్య 5.323) అని, ఆమెను "వీరమాత" యనుచు పొగడి, వారు తప్పక ఆ తల్లి దుఃఖమును తమ పరాక్రమ ప్రదర్శనచే తీర్చగలరనునట్లుగా సూచించును. "వగపు, వలదు చిత్తంబులో నీకు, జలజనయన"! (పైది) అని యోదార్చు, సత్య సాంత్వనపు పలుకులకా తల్లి కనుల నీరు తిరిగియుండి యుండును. కావుననే సత్య 'జలము'ను గుర్తించుటను సూచించు విధముగా సాభిప్రాయముగా 'జలజనయన' అని సంబోధించినది. భర్తలైన పాండవులతో అరణ్య వాసము చేయుటకు, ద్రౌపది తాను మాత్రమే వచ్చినది. ఆమె సవతి సుభద్ర తన అన్న యింటికి చేరినది. ఆమెతోపాటు ప్రతివింధ్యాదులగు ద్రౌపది బిడ్డలును యదుపురముననే యున్నారు. కాని వారెచట నున్నారో ద్రౌపదికి తెలియదు. పరుల పొంత, తన సొంత బిడ్డలెట్లున్నారో యనెడు ఆందోళనము తల్లికుండుట నైజము. మానిని యగుటచే ద్రౌపది నోరుతెరచి అడుగలేక పోయినది. కాని సత్య కూడ ఒక మాతృమూర్తి యగుటచే, ద్రౌపది మనసు కనిపెట్టినది. వారు క్షేమముగా నున్నారనెడు వార్త ఆ తల్లి మనసును చల్లగా చేయును. అందును, వారు కృష్ణుని పంచనే ఉన్నారని తెలిసిన ద్రౌపదికి కొండంత దిగులు తీరును. అందుచేతనే, మొదట 'ప్రతి వింధ్యాదులయిన నీ పుత్రులేవురు నిప్పుడు వచ్చి యదుపురంబున నున్నవారు, వారికి నొక్కటం గొఱంత లేదు" (పైది. 324) అని ముందు వారి క్షేమవార్తను చెప్పి, వారి భద్రతకు లోటులేదని నమ్మ బలికినది. ఆ యింటి పెద్ద కోడలు రుక్మిణి. ఆమె తన బిడ్డల నెట్లు చూచుకొనుచున్నదో? అనెడు సందేహము ద్రౌపదికి కల్గును. ఆ తరువాత సవతి సుభద్ర విషయమును, ద్రౌపదికి మరింత భయాందోళనములను కల్గించి యుండును. ఇతరు లేరీతి మెలగుచున్నారో అనెడు కలవరమును మెదలి యుండును. పరేంగితజ్ఞురాలైన సత్య, ఆ విషయమును గమనించియే, ద్రౌపది అడుగక పోయినను "రుక్మిణియు సుభద్రయు దక్కిన వారలు నక్కుమారుల యెడం దమ కొడుకుల కంటె గారవంబు సేయుదురు, వారదెస నిశ్చింతవు గమ్ము" .....(పైది) అని ఆమె బిడ్డలను, రుక్మిణి సుభద్రలును తక్కిన వారును తమ బిడ్డలకన్న కడు గారవమున చూచు చున్నారని పలికి, కన్నకడుపును కుదుటపరచినది. తక్కిన వారనగా తన అత్తమామలు, బలరామాదులు. వారును ఆమె బిడ్డలను ప్రేమగ చూచుచున్నారని చెప్పి ఆమె ఆందోళనమును తగ్గించినది. 'సుభద్రకు అభిమన్యునిపై యెంత ప్రేమకలదో, నీ బిడ్డలందరిపై అంతే ప్రేమకలదు", అని సంస్కృత భారతమున చెప్పగా,[2] తెలుగు సత్య తమ కొడుకుల కంటె నెక్కుడు గారమున చూచుచున్నట్లుగా చెప్పి ద్రౌపదికి మరింత

---

1. *"కౌరవ మేధంబు కాంత నీ మగలు*
*వారక చేయ నవ్వైరి కామినులు*
*యశ్రుధారలఁగాని యవభృథమాడ*
*వశ్రుతపూర్వ మోయమ్మ నీవ్రతము" .....(ద్వి. భార. అరణ్య 4-పుట 70)*

2. *సం. భార - అరణ్య - 234 - 12*

"ఊరడింపు కల్గించినది. సత్య, ద్రౌపదికి ప్రదక్షిణముచేసి, సెలవు తీసికొనినట్లు మాత్రము సంస్కృత భారతము చెప్పగా,[1] ఆంధ్ర భారత సత్య మరింత ఆత్మీయతతో "యాజ్ఞసేనిం గౌగలించుకొని సగౌరవంబుగా వీడ్కొనియె"ను. (ఆరణ్య - 5-324). ద్రౌపదిని కౌగలించుకొనుటలో స్నేహాతిశయమును, సగౌరవముగా వీడ్కొనుటలో ఆమెపై సత్యకు గల గౌరవ భావమును సువ్యక్తములగును.

బంధువులముందు ఉత్సాహముతో స్నేహముగ ప్రేమతో ప్రవర్తించు సత్య, వారికి కష్టము కల్గిన వేళ తీవ్ర ఆవేదనకు గురియై కుమిలి పోవుటయు కలదు. యాదవక్షయ వార్తను వినిన సత్యభామ, దారుకునితో వచ్చిన పార్థుని చూచి, రుక్మిణ్యాదులకు వలెనె, "రోదన ధ్వనులెసగంగ", అతని కడకు వచ్చి 'వనట వెల్లిమునిగి యుల్లంబు వెగడునొంద' "పుడమి పైబడినది" (భార. మౌసల - 1-102).

ఇట్లు సత్యభామ తన బంధువుల సుఖ దుఃఖముల యందు పాలుపంచుకొనుచు, తానొక ప్రియ బాంధవి అనుటను నిరూపించుకొనినది. ఇట్లు ఆంధ్రసాహిత్యమున కవులు కృష్ణ కాంతలలో సత్యభామను బంధుప్రీతి, ఆత్మీయత ఆర్ద్రత అధికముగగల ఉత్తమ వనితగ చిత్రించి, ఆమెను సహృదయుల హృదయములకు మరింత సన్నిహితము చేసినారు.

## ఆతిథ్యము :

ఉత్తమ గృహిణి తనయింట అడుగిడు అతిథికి తగు మర్యాదలు చేయవలయునని శాస్త్రము నియమించినది. అంతేకాదు. 'అభ్యాగతః స్వయం విష్ణుః' అనుచు అతిథిని భగవంతునిగ భావింప వలయునని కూడ చెప్పుచున్నది. ఎంతటి దుర్మార్గుడైనను తన మనసును బాధించిన వాడైనను, ఇంటికి అతిథిగా ఆ వ్యక్తి వచ్చిన, జరిగినది మరచి అతనికి మర్యాద చేయుట ఉత్తమ గృహస్థుని లక్షణము. కాని సామాన్యుడైన వ్యక్తి అంత ఉదాత్తముగ ప్రవర్తించుట కొంత కష్టమే. కాని అహంకారి గాను, కోపన గాను భావింపబడు సత్యలో, ఇట్టి ఉదాత్త ప్రవృత్తిని మనము చూడగలము.

దివ్య పారిజాతమును సవతి రుక్మిణికి దక్కునట్లు చేసి, తన మాన ప్రాభవములకు హానిని కల్పించి, అంతులేని వ్యధకు గురిచేసిన నారదుడు, వెన్వెంటనే, అమాయికుని వలె తన యింటికి అతిథిగా రాగా, సత్య నారదుడు చేసిన అపచారమును మరచి, తన కోపమును విడిచి, నిర్మలచిత్తముతో "యథావిధి పూజచేసి" పాదయుగంబుకడిగి యతి మధుర పాయసాన్నంబు లొసంగి సపర్యలు చేయుట భైరవ కవి హరింశమున కాననగును.[2] అంతేకాదు "అతివినయ సంభ్రమములతో 'నమస్కరించినది కూడ.[3] సత్య వినయమునకు, అతిథి మర్యాదలకును, ఆకలహాశనుడు కూడ సంప్రీతచిత్తుడై, ఇదేవిధముగ ఎల్లెప్పుడును పతివ్రతాధ్యవు కమ్మనుచు గొప్పసౌభాగ్యయుతవై సారెకు బహుతపములు సలుపగల వనియు ఆశీర్వదించినాడు.

ధర్మణియగు స్త్రీ పతితో దేవతలకును, అతిథులకును, భృత్యులకును, భోజనమొసంగి మిగిలిన అన్నమును తినవలయునని ఈ క్రింది శ్లోకము వలన తెలియనగును.

*"అగ్ని కార్య పరానిత్యం సదాపుష్ప బలి ప్రదా।*
*దేవతాతిథి భృత్యానాం నిరూప్య పతినాసహ॥*
*శేషాన్నముప భుంజానా యథాన్యాయం, యథావిధి।*
*తుష్ట భృత్య జనానిత్యం నారీధర్మేణ యుజ్యతే॥*

---

1. సం. భార - ఆరణ్య - 234 - 17, 18
2. భై. హరి - 5 - 77
3. పైది.

సత్యభామ ఉత్తమ ధర్మిణి యగుటచే, 'అమ్మునీంద్రునాజ్ఞ' గొని, శేషమైన యన్నమును, హరి యారగింపగా "పిదప సత్య భామ పెనిమిటి యాజ్ఞచే, నరిగి భుక్త శేషమును భవించెను". (భై. హరి. 5.79). పారిజాతాపహరణ ప్రబంధమునందును ఇట్టి అతిథి మర్యాదుల నెరింగిన ధర్మిణిగానే, సత్య చిత్రింపబడినది. పారిజాత పుష్పమును సవతికి దక్కునట్లు చేయుటయేగాక, తన పరోక్షమున సవతిముందు తనను కించపరచుచు, పలు విధముల విమర్శించుచు తన మానినీత్వమునకు భంగము కల్గునట్లు మాట్లాడి, తనకు తీరని దుఃఖము కల్గించిన నారదుడు, కొద్ది సేపటికే, ఏమియు నెరుగనివాని వలె, తన యింటికి అతిథిగా రాగా, జరిగిన దంతయు విస్మరించి, ఆతిథేయ సత్కృతు లొనరించినదీ కులాంగన (పారి. 2-17).

అతిథియు పతియు భుజించిన తదుపరి "అంతిపురమున, నుచిత కృత్యములు దీర్చి కొని వచ్చి, "ఆ సంయమీంద్రు నడుగల"కు ఆదరమున మ్రొక్కినది (2.22). సత్యలోని క్షమాగుణమునకు ముగ్ధులై, "సామాన్యముగాఁదొయ్యలు లిట్లు చేయుట యరుదు" అని నాగపూడికుప్పు స్వామయ్యగారు సత్య సంస్కారమును ప్రశంసించినారు.[1]

చింతలపూడి యెల్లనార్యుని విష్ణు మాయానాటక ప్రబంధమున శ్రీకృష్ణుని మాయలకు లోనైన సత్య, రుక్మిణికి కూడ నాతడు పారిజాతవృక్ష మిచ్చినాడని భ్రమించి రోషకషాయిత యగును. కృష్ణ సఖుడగు గోవిందశర్మ, శ్రీకృష్ణుని మాయానాటకమును వివరింపరాగా, ఆ అతిథిని 'మన్నించి' "కనకాసనమున నుంచి గౌరవించినది". సత్య కోపతాపములు అతిథిముందెన్నడును ప్రదర్శింపదు. ఆమె చెప్పిన దంతయు విని, అతడు నవ్వగా, వానిని చూచి సత్య "కుమారా! దుగ్ధ సాగరంబున నమృతపూరంబునుం బోలె నీ నవ్వు మన్మనః ప్రాసాద హేతువై యొక్క విశేషంబు దోచె నభిప్రాయంబు చెప్పు" మని ఆత్మీయభావంబు తొణికిసలాడ అడిగినది. అతడు విషయమును వివరింపగానే 'అచ్చెరువొంది' "పుత్ర వాత్సల్యమున" అతిథిని 'ఆరాధించి' 'ఆజగజ్జనని దివ్యము మహిమాన్వితమైన పారిజాతమాలికను ఉదారబుద్ధితో అతనికి "ననుగ్రహించి"నది (1-207).

## సత్యభామా కృష్ణుల దాంపత్య జీవితము :

సత్యాకృష్ణుల దాంపత్య మపూర్వము. అగ్రమహిషియయ్యు రుక్మిణి, కృష్ణునితో కొనసాగించిన దాంపత్యమును గూర్చి వర్ణించుటలో కవులెవరునంత ఆసక్తిని చూపలేదు. కాని సత్యభామ దాంపత్య జీవితమును మాత్రమును ప్రత్యక్షముగా వర్ణింపకపోయినను, అయా సందర్భములందు ధ్వని ప్రధానముగా కవులు సూచించుచునే యున్నారు.

భార్యా భర్తలెట్లు జీవింపవలయునను విషయమున సత్యభామకు కొన్నినిర్దిష్టమైన అభిప్రాయములున్నట్లుగా పారిజాతాపహరణ ప్రబంధము వలన తెలియుచున్నది.

*"కలకాల మొక్కగతి బూ*
*సలలో దారంబుమాడ్కి పతి మదిలోన్*
*మెలఁగెడు పురుషుఁడు గలుగుట*
*దొలి జన్మమునోము ఫలము... "*     *....(పారి. 1-93)*

అని సత్య నమ్మకము. పూసలు చెదరకుండ దండగా నిలువవలయు ననిన దారము కావలయును. ఈ రెంటినడుమ విడదీయరాని బంధమున్నది. భార్యాభర్తల నడుమను అట్టి బంధమే కలదు. పతిని సన్మార్గమున నిలుపుటకు సతి అవసరమగుచున్నది.

---

*1. పారి. 'పరిమాళోల్లాస వ్యాఖ్య - పీఠిక - పు. 23*

దారమునందు పూసలు గ్రుచ్చబడినపుడు ధారణయోగ్య మగును. అట్లే భార్యా భర్తలును ఒకరి పైనొకరు ఆధారపడి జీవించిననే, ఇతరుల గౌరవమునకు పాత్రులగుదురు. పూసలలో నుండి దారమెట్లు సాగునో, అదే విధముగా, కలకాలము సతి మదిలో పతి మెలగిననే, సతి ప్రేమను పొందగలడు. ఆదాంపత్యము మనోరంజకము, ఆహ్లాదకరమునగును. అప్పుడే ఆమె పతివ్రతగా నిలుచుటకును ఆమె పాతివ్రత్యమును లోకము పొగడుటకు నవకాశము కలుగును. సతీపతుల నుత్తములుగాను ఉంచును. ఇట్లు భార్యాభర్తలుండునట్లు సంభవించుట పూర్వజన్మముల ఫలమని  భావించినది.

ఎఱ్ఱన హరివంశమునందు, సత్యాకృష్ణుల దాంపత్యమెట్టి కొరత లేని నిండైన దానిగ చిత్రింపబడినది. నరకాసుర వధయందు పాల్గొని, సత్యభామ  మహోపకారము చేసిన దనెడు కృతజ్ఞతతో శచీదేవి, వరమిత్తును కోరుకొనుమని అడుగగా, సత్యభామ "నాకేమిటం గొఱంత లేదు" (ఉ. భా. 4.206). అని నిండు ఆత్మ విశ్వాసముతో ధైర్యముగా సమాధానము చెప్పుకొన గలిగిన తృప్త దాంపత్యము వారిది. భైరవ కవి హరివంశములోని సత్యాకృష్ణుల దాంపత్య జీవితమునందు కృష్ణుడామె ముందు భక్తునివలె వర్తించిన ప్రణయ మూర్తిగ చిత్రింప బడినాడు. కింకరునివలె సేవలు చేయును. సత్య పతిని "రమ్ము రమ్ము"ని పిలిచి పనులు చెప్పును. (5-48).  ఇందు కృష్ణునకు న్యూనతా భావమేమియు లేదు. ఇది వారి అన్యోన్య దాంపత్యమునే చాటును. సత్య యేడ్చిన నిలువజాలడు. "సకియ (నా) చిత్తంబు జాలిపాలుఁజేసి, యేల యేడ్చెదవు." అని అర్థించును.  భార్యలెందరున్నను సత్యపైనే నిజమైన అనురాగ మతనికి. మదనుని సాక్షిగా సత్య తప్ప,  నితర  మదవతు లెవ్వరికిని 'మైత్రీ బహుమాన'ములు లేవు (పైది. 5-51).

భాగవతమునందు వీరు అలౌకిక ప్రణయమూర్తుల వలె చిత్రింపబడినారు. సత్య భామ పతిని విడిచి క్షణమైన నుండ లేదు. నరకాసుర వధార్థమేగు పతితో

"దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ ప్రావీణ్యంబులు చూడగోరుదు గదా" అని ఒక నెపమును చూపి "మన్నించి నన్, నీ వెంటం గొనిపొమ్ము నేఁడుకరుణన్" (10-ఉభా-151) అని పట్టు బట్టి వెంట నేగినది. ఉత్తమ కులకాంతయగుటచే పతిని అనుసరించుచునే ఉండును. అట్లే, ధర్మరాజు చేయబోవు రాజసూయాధ్వరమునకు, కృష్ణుని పట్టపు దేవులందరితోను కలిసి  "కాంచన శిబిరములెక్కి" (ద్వి. భాగ పు. 198) పోయినది.

పారిజాతాపహరణ ప్రబంధమున వీరిదాంపత్యము అద్వితీయమైనదిగ చిత్రితము. కృష్ణుడు, "ఒక్క నిమిషమైన సత్యదయ గన్గొనకుండిన నిల్వ నేరడు" (1.116). ఆమె పనిచిన పంపు సేయుటయే ప్రాభవమని తలంచి, మనమున, మాటల, క్రియల, మన్ననల వానిని నిర్వర్తించును. (పైది. 118). కలలోనైన నవ్వులకైన సత్యమాట జవదాటెడివాడు కాదు. ఏ పదార్థమైనను ఆమె యెదుటపెట్టక ముందె యెవ్వారి కొసగెడువాడు కాడు. చెలులు ఆమెతో ఏమైన చెప్పుదురోయని భయపడి వారికి లంచములిచ్చి మంచి చేసికొనెడివాడు సత్యయనిన అంత ప్రియముతోకూడిన భయముండెడిది. తోడి చేడియలు ఆమెతో వంతులకు రాగా సహింపలేక పోయెడివాడు (పైది. 1-94).  దక్షిణ నాయకుడేయయ్యు, అనుకూలుడైన నాయకుడు అనుకూలవతితో చేయు దాంపత్యము వలె అనిపింపచేసినాడు.  ఇంతగా అభిమానించి ఆరాధించిన పతి, తననుపేక్షించి, సవతికి చిన్న కానుక నిచ్చినను అది 'మేరదప్పుట'గా సత్యకు అనిపించును. పతిని దైవము, ప్రాణసదృశ బంధువు, ఏడుగడగా భావించు సతి యెడల, అట్లు పతి 'గడు మేరదప్పిన' 'కులకాంతలకు వేరుగతి' లేదు. (పైది. 94). కావున మరణించుటయే మంచిదని సత్య నమ్మకము.

పతితో సత్య పలుకుల 'తేనెలుట్టి పడబల్కును వాలుగన్నుల ననుసిగ్గు నూల్కొన పతిని కనుంగొని, మక్కువ బిగికౌగిట చేర్చును' (పారి-1-115). రైవతక శైల చారుకూట విటంక కేళులు, వసంతా రామ కర్పూర కదళికాగార వసతి, మణిసౌధ జాలకంబుల, వార్ధి చూచుట - సత్యాకృష్ణుల విలాస క్రీడలు (పారి. 1. 131). కృతకాద్రికందర కేళీ నిగూహన వేళ పరస్పరాన్వేషణములు, పోషిత మాధవీ పున్నాగ పరిణయోత్సవ కల్పితానేక సంభ్రమములు విధుశిలామయ వేదికా విశ్రమములు, ఫలక చిత్రిత నిజరూప భావనములు, ఇవి వీరి వినోద క్రీడలు. (వైది. 1.95).

*"అరమరలు లేని కూరిమి నన(గి పెన(గి*

*కొదలు దీరని కోర్కుల(గూడిమాడి*

*కపట మెఱు(గని మమతల గలసి మెలసి" ....(పారి. 1.94)* జీవించినారు. అని కైనను కృష్ణుడామెను బాసి చనలేడు. ఆమెను "ప్రాణంబు ప్రాణంబుగా మన్నించు'ను. ఎట్టి మనోరథంబుల న్నెయ్యంబుతో జేయును. 'చనవు' ల నీమె కిచ్చినట్లు నెవ్వరు గనలేరు. (వైది. 2-25). కాని రుక్మిణికి కావించిన పారిజాత పుష్ప ప్రదాన కారణముగ వీరి అనురాగమయ జీవితమున కొకింత విఘాత మేర్పడినది. ధనమిచ్చి పుచ్చుకున్నను మనమున నోర్వగ వచ్చును కాని, మగడితర కాంతలకు చనవిచ్చి పుచ్చుకొన్న మనరాదని నమ్మిన సత్య ప్రాణత్యాగమునకు కూడ సిద్ధపడినది. కాని వీరిది నిత్యమైన సత్యమైన ప్రేమ బంధురమైన అన్యోన్య దాంపత్యమగుటచే, వారి జీవితాకాశమున నేర్పడిన, ఆ కలతల మేఘమెక్కువ కాలము నిలువలేక అతిశీఘ్రము గానే తొలగిపోయినది. అలుక తీరి, క్షోభ తొలగిన సత్యభామ పూర్వముకన్నను పతిని మరింత భక్త్యనురాగములతో సేవించినది. కృష్ణుడును "సరసాలాపములన్వినోదకథలన్ సాత్రాజితీ దేవి బ్రేమ రసాంభోనిధి నోలలార్చి (పారి. 2-3) మరింత ప్రియంకరుడైనాడు. 'పతినీవై విహరింప(’గా (వైది. 2.24) అని నారదుడే ఆదంపతుల అలౌకిక ప్రణయ తత్త్వమును, అపూర్వ దాంపత్యమును ప్రశంసించినాడు. దేవనగమును భూనగరమున స్థాపించి, సత్యభామపై గల అనురాగాతి శయమును ప్రకటించుకొనినాడు కృష్ణుడు.

***"సతుల(ట ప్రాణనాథుల(ట సారెకు నైక్యములైన మోహసం***

***గతల(ట యేమి సెప్ప బలఘస్మరు( బోర జయించి కల్పక***

***క్షితిరుహము న్నిజేశ్వరికి(గృష్ణు(డు దాని(ట(దెచ్చె......." .....(పారి - 5-51)***

అనుచు పదియారు వేల సవతులును సత్యాకృష్ణుల అపూర్వ దాంపత్య సౌభాగ్యమును ప్రశంసింపకుండ నుండలేక పోయినారు. తానును పతియును, మనమున నఱగొఱలులేక, అనితర సులభైక సుఖములందుటకు సత్య, దేవ వనితైకాచరణ సాధ్యమగు పుణ్యక వ్రతమును చేయదలపగా, కృష్ణుడును, ఆవ్రతభాగముగ, తాను నారదునకు దానమగుటకు కూడ అంగీకరించి, సపత్నీకాంతలకే గాక, అచటనున్న వారందరికిని ఆశ్చర్యమును కల్గించినాడు. సత్యాకృష్ణులలో, ఒకరనిన మాట నింకొకరు, ఎట్టి అభ్యంతరము చూపక మన్నింతురు. వారి భావములు, చేష్టలు ఏమియు భిన్నముగ నుండవు. ఇద్దరి భావములును, కార్యములును ఒకటే. ఇదియే వీరి అభేదతత్త్వము. సత్య భర్తృ ప్రేమను పొందుటకు, పుణ్యక వ్రతమనుష్ఠించి, తన స్వాభావికమైన ఈర్ష్యాసూయలను, గర్వాదులను ఆభరణములపై ఆశను, చివరకు అంత పట్టుదలతో సాధించి, దివి నుండి భువికి రప్పించుకొనిన పారిజాతమును సహితము త్యజించినది. ఈ సందర్భమును పురస్కరించుకొని "పవిత్ర దంపతుల ప్రేమ తత్త్వమెట్టిదో, భర్తృప్రేమ బొందుటకు భార్య యెట్టి త్యాగము చేయునో సత్య పాత్ర ద్వార లోకమునకు చాటినాడు". అని విన్నకోట మాధవరావుగారు తిమ్మన

సత్యా పాత్ర చిత్రీకరణమును ప్రశంసించినారు.[1]

"వీరి ప్రణయము ఉత్తమాను రాగమున కాదర్శ ప్రాయము. సాంసారిక జీవితమునకు సుందరమగు వ్యాఖ్య" అను సముద్రాల నాగయ్యగారి మాట లెంతయు సత్యము.[2]

సత్యా కృష్ణుల ప్రణయమునందలి ఔన్నత్యమును, అపూర్వతను పూర్తిగ నర్థముచేసి కొనిన లింగన మఖికామేశ్వర కవి, తన సత్యభామా సాంత్వనమున, వీరి ప్రణయ బంధురమైన దాంపత్యమును, మరింత అద్భుతముగ చిత్రించినాడు. కృష్ణుడు నరకాసుర వధ కేగుచున్నప్పుడు, ఎనమండ్రు కాంతలలో నెవరికిని కలుగని విరహము సత్యభామకు మాత్రమే కలిగినది. ఎంత పట్టు బట్టినను, తనను వెంటనిడుకొనిపోక, పతి, తాను మాత్రము రణభూమి కేగగా ఆ మరునిముసమే, ఈమె పలు విధములైన చిత్త భ్రమలకు లోనైనది. (పు. 73, 74). ఆ బహు కాంతా కాంతునకును అందరి కాంతలలో నీకాంతమాత్రమే రణభూమి యందు కూడ, గుర్తునకు వచ్చినది. 'తా నెంతకృశించెనో మగువ యెంత తపించెనో యేమి యెంచెనో?'అని తనవలెనె, ఆమెయు విరహతప్త అయి యుండునని భావించి బాధపడుటయు, వారి దాంపత్య మపురూపమనుటనే నిరూపించును.

అతడామెను తలచుకొని తపించుట చూచిన అతని చెలికాండ్రు "వనితల నిట్లా, తలంచుకొని సమరముఖమున, (బలవించిన వారు గలరే? " అని, వారి అపూర్వ ప్రణయమును చూచి ఆశ్చర్యపడిరి. తనువులు వేరైనను, మనసు లేకమని, వారి దాంపత్య రహస్యమును కృష్ణుడు ప్రకటించినాడు. నెచ్చలికాడైన కలవింకుడు పరకాంతల నొల్లని వానివలె నిట్లు నిల్లాలిపై బాళిమించనేల? అని పరిహాసము చేయగా, కోపమున "చెలివలపును నా వలపున్, తెలియక నీవిటుల వదరితేనేమగు"? (పైది. పు. 102) అని మందలించుచు, కృష్ణుడు

"ఏవనజదళాక్షులా సమద వారణయానకు సాటి వత్తురే"? (పైది) అని ఆమె అపురూపతను ప్రశంసించినాడు.

సత్యాకృష్ణులు పూవు తావి వంటివారు. కృష్ణుని చెలికాండ్రు వారి బంధము చంద్రిక చంద్రుడు వలె విడదీయరాని బంధమని సత్యాకృష్ణుల ప్రేమైక దాంపత్యమును మిగుల ప్రశంసించినారు. శ్రీకృష్ణుడును వారి మాటలు నిజమనునట్లు, సత్యను రణ భూమికి రప్పించుకొనిన తరువాతనే, ద్విగుణీకృతోత్సాహముతో యుద్ధము చేయగల్గినాడు. "వీరిద్దరి ప్రేమసత్యమును గ్రహించిన వాడుకనుకనేదక్షిణాంధ్రకవి యగు కామేశ్వరకవితన సత్యభామా సాంత్వనములో వారివిరహ వేదనను జక్కగా వర్ణించెను. అది చదువుటకు వినుటకు వెగటుగా నున్నను, పచ్చిశృంగారమున్నను ప్రేమ తత్త్వమును గుర్తించిన వాడా కవియే యనవలెను"[3] అను అంకయ్యగారి మాటలలో సత్యమున్నది.

భర్త నేవేళ అంటి పెట్టుకొనుచు, కష్టములోను సుఖములోను తోడగుచు, తన మనోహరునకు మనోహారిణియైన సత్యభామవంటి మరియొక మగువ సాహిత్యము నందెచటను కానరాదు.

*"చెలువుని బాసి యెట్లు సరసీజముఖుల్ భువినోర్చియుందురో*
*తెలియదుగాని నేను సుదతీ నిముసంబెడబాసి ప్రాణముల్*
*నిలుపగజాల.................."*[4]

---

1. *'కావ్యరీతులు - ప్రబంధ వాఙ్మయ పరిణామము - పు.- 119*
2. *సాహితీ సుధా లహరి - పు. 154*
3. *సాహిత్య చంద్రిక - పు. 29*
4. *కాకరపర్తి తిరుపతి పాత్ర కవి - సత్యభామా కృష్ణ సంవాదము - 3 - 4 (ఆధునిక ప్రబంధము)*

అని చెలితో అనెడు సత్య పలుకులు, వారి ప్రణయాతిశయమును వారి అపూర్వ దాంపత్యమును స్పష్టము చేయును.

భామా కలాపమునందును సత్యభామ,కృష్ణుడు సవతి కడకేగి తనను తృణీక రించినందుల కామె కోపగించుకొనినను, తమ దాంపత్యము మాత్రము విడదీయరానిదని భావించినది. విరహతప్తయగు తనపై, మన్మథుడు చెలరేగి పుష్ప శరములు కురియించగా

*"ధరా తలంబునందు గూర్మి*
*దంపతుల్ నెపంబుచే*
*బరాముఖంబుతోడ నుండ*
*బంచవన్నె చిల్క పైనె*
*క్కి రామలన్ బురింగొనంగ*
*గింక దుండు వచ్చె......" ......(భామా. పు. 72)*

అని మన్మథుని దూషించినది. ఏదో కారణముచే, పరాఙ్ముఖులైనను, తాము కూరిమి దంపతులనియు, తమనిట్లు బాధింప పరుడొకడు పూనుకొనుట అనుచితమనియు, సత్యభామ భావము. కవులాయా సందర్భములందు సత్యను కోపనగా చిత్రించినను, సాహిత్యము సందంతటను, ఇట్లు వారి దాంపత్యము అపురూపమైనదనియే వారు మెచ్చినారు.

రాధా మాధవులను ప్రణయైక జీవులుగ చిత్రింతురు. కాని నిజమునకు సత్యభామయే ఆ స్థానమున పేర్కొనబడవలసి యున్నది. రాధలో మాధవుని యెడ ఆరాధన, దాస్య భావములే అధికము. సత్యభామలో ఆరాధనేగాక నిండు ప్రేమ, సఖ్య భావము కూడ నున్నవి. మేలుగీళ్ళకు లోనయి విహరించి పతి మదికెక్కినది. హృదినలరించి, సుస్థిర స్థానము నలంకరించినది. రాధ ప్రేమించినదే కాని సత్యభామ వలె నిండు దాంపత్య జీవితమును కొనసాగించినట్లు కనిపింపదు. సత్య కృష్ణునితో మాట్లాడినను పోట్లాడినను ప్రేమ కొరకే చేసినది. ప్రేమతోనే చేసినది. సత్యభామను పూర్తిగ నర్మము చేసికొన గలిగినవాడు కృష్ణుడొకడే. కావుననే అతడును ఆమె కిష్టమైనట్లే ప్రవర్తించి, లోకమున సత్యావిధేయుడను పేరును సంపాదించుకొనినాడు. అట్లనుటలో సత్యకుకాని, అట్లనిపించుకొనుటలో కృష్ణునకు కాని న్యూనత అనిపింపలేదు. భార్యా భర్తలలో ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అను భేద భావము లేని అద్వితీయమైన ప్రణయైక దాంపత్యము వారిది.

## పతిభక్తి :

పతినే వ్రతముగా కలది పతివ్రత. పతినే సర్వముగా భావించుచు ఆతని ఆజ్ఞానుసారమే ఏ కార్యమైనను చేయుచు, అతనికై జీవించి, అతనికై మరణించునది పతివ్రత యగును. ప్రగల్భగా అగుపించు సత్యభామలో నిండైన పతిభక్తి యున్నదనిన కొంతవింతగ అనిపింప వచ్చును. కాని ఆమెకు గల పతిభక్తి అనంతము, అసమానము. మానహాని జరిగిన సందర్భములందు మాత్రము, చనవుతోడి కోపమును చూపినను, స్వాభావికముగ పతిభక్తిని చిత్తము నిండ నింపుకొని, నిండు ప్రేమతో పతిని ఆరాధించిన ప్రణయ తపస్విని సత్యభామ.

పురాణేతి హాసముల యందలి సత్యభామలో రాజసముకన్నను, సాత్త్వికతయే అధికము. పతిని "అభయ ప్రదాత', "రక్షకుడు" అని నమ్మినది. (భై. హరి. ఉ. భా. 5 - 67). ఎంత కోపమునకు లోనైనను పతి యెడల వాక్పారుష్యమును ప్రకటింపదు. భైరవకవి హరివంశమున, సవతికి వల్లభుడు దివ్య పుష్పము నిచ్చుటచే సత్యభామ, అతనికి తనపై పరిపూర్ణమైన

ప్రేమ కలదను తన నమ్మకము వమ్మైనదనితలచి బ్రదుకును రోసియు, పతిని విడచి జీవించుట కష్టమని భావించి

*"నేఁడు నిర్వాసితినేని హా! సద్భక్త*
*మందార యేగతిఁజెందఁగలనొ"* ...(భై. హరి - 5-67)

అని భయపడినది. 'భక్త్యాస్పద హృదయ' యగుటచే నెంతగా ఈర్ష్యాసూయలకు, క్రోధావేశములకు వశమయ్యు, పతిని "భక్త రక్ష" (పైది. 57), మానద (పైది. పు. 61), నీరజనాభ (పైది. 64) 'నాధా' (పైఇ.66) అనియే సంబోధించినది. ఈర్ష్యాకషాయిత యయ్యు' మృదూక్తులతో తన దుఃఖ కారణమును పతికి వివరించినది. మానహాని కల్గుటచే, జీవితముపై మమకారము తొలగగా, విరక్తితో తపము చేయదలచియు

*"అతివ లెల్లను దమ పతి యాజ్ఞ వలన*
*వ్రత తపంబులు సలుపఁగా వలయు నెపుడుఁ*
*బతుల నేఁడ బాసి సేయ నిష్ఫలము సూవె......"* ......(భై. హరి. 5-56)

అనెడు విషయమును గ్రహించి,
ఏ పతి వలన అవమానము పొందినదో, ఆ పతినే తపమునకై అనుజ్ఞను కోరి అర్థించినది. పారిజాత వృక్షమును తెచ్చి యిత్తునని పతి వాగ్దానము చేయగానే, అంతకుముందు పొందిన కోపతాపాదులను వెంటనే విడిచివేసినది. పత్యాజ్ఞ ననుసరించియే సత్య యేదియైనను చేయును. నారదుడు భుజింపగా, ఆశేషాన్నమును హరిభుజింప, "పెనిమిటి యాజ్ఞచే నరిగి'భుక్త శేషము ననుభవించినది (పైది. 79). అట్లే భోజనానంతరము, ప్రియుని చెంగట నిలిచి, "శౌరియనుమతంబున సత్య మునికి మ్రొక్కినది" (పైది. 80). పిండారక తీర్థంబున, వారిధి యందు జలక్రీడలాడుతరి, నారదుడు తమను చూచి పరిహసింపగా చిలిపితనము చిందులు వేయు సత్యభామ, అతనిని తిరిగి గేలిచేయ దలచినను, పత్యాజ్ఞ కొరకై వేచియున్నది కాబోలు! "హరిమనోభావంబు లెఱిఁగి సాత్రాజితి ఆ తరువాతనే, నీటిలో నారదమునిని ముంచినది (పైది. 6. 177). ఇట్లు ఏ పని చేసినను పత్యాదేశానుసారమే సత్య చేయుట ఈ భైరవకవి హరివంశమునందు కాననగును.

అందుచేతనే నారదుడును సత్య పాతివ్రత్యమును గమనించి

*"ఏ రీతి నిప్పుడైతివొ, యారీతిన్ భువిఁబ్రతివ్రతాఢ్యవు గమ్మీ* (5-77) అని ఆశీర్వదించినాడు.

భర్తపై గల ప్రణయాతిశయము కారణముగానే శమంతకమును పొందెడు అర్హతను గూడ పోగొట్టుకొనినట్లు, విష్ణు పురాణము వలన తెలియుచున్నది. సచ్చరితుడు, బ్రహ్మ చర్యవ్రతస్థుడగు వ్యక్తియే మహా మహిమాన్వితమగు శమంతకమును ధరింప నర్హుడు. సత్రాజిత్తును చంపి, శతధన్వుడు ఆమణిని, అక్రూరుని వద్ద దాచియుంచెను. ఆమణి యునికిని గమనించిన కృష్ణుడు అక్రూరునితో, దానిని తిరిగి తనకు ఇమ్మనునపుడు, సత్య తన తండ్రి ధనమగుటచే, ఆమణి తనకు చేరగలదని ఆశించినది. కాని కృష్ణుడు, సత్యకు తనపై గల ప్రణయాధిక్యము నెరిగినవాడు. ప్రేమాతిశయ కారణముగ అద్దానిని సత్య ధరింప, నర్హత లేదను విషయమును గ్రహించి

*"నామీది కూర్మి యెన్నఁడుఁబాయదటుగాన*
*సత్యభామకుఁబూన్ప శక్తి లేదు"* ..... (సూ. వి. పు. 6-344) అని ఆమణిని తిరిగి అక్రూరునికే తిరిగి ఇచ్చి వేయును. పారిజాతపహరణ సమయమున వనపాలకులతో వాగ్యుద్ధమునకు సత్య కడుంగుటయు, పతిని పరోక్షముగా యుద్ధమునకు ప్రేరేపించుటయు

సత్యను పతి యెడల భయము గౌరవము లేనిదిగ తోపింప చేయవచ్చును. కాని వనపాలకులతో "నామగడు సకల లోక గ్రామణి"..... (పైది. 8-132) అని అనుచు వారికి తన భర్త లోకేశ్వరుడనుటను తెలియ చెప్పినది. సత్య, కృష్ణుని పతిగా భావించుటయే కాదు, దైవముగ కూడ గుర్తించిన దనుటకు పై మాటలే తార్కాణములు.

విష్ణు పురాణమున తనంతట తాను కల్పించుకొని వనపాలకుల నెచ్చరించుటయు భాగవతమున పత్యాదేశమునకు ముందే, నరకునితో తలపడుటయు చూచిన, సత్య తొందరపాటు స్వభావముగల వ్యక్తి అని అనిపింపకపోదు. కాని పై రెండు సందర్భముల యందును తనకు మాత్రమే గాక, దైవముగ గొల్చు తనపతి మానమునకును హాని కలుగుచున్నదనెడు బాధతో, భయముతోనే ఆ వీరవనిత యైన మానిని కల్పించుకొనవలసి వచ్చినది. పై సంఘటనలు సత్యభామకు పతిపై గల నిర్లక్ష్యముకన్నను, ప్రేమాతిశయమును భక్తి తీవ్రతనే నిరూపించుచున్నవి.

సత్యభామను అతి ప్రగల్భగా చిత్రించిన ప్రబంధ కవులును, ఆమెకు పతిపై గల ప్రేమానురాగములను, భక్తి భావమును వర్ణించుటను, మరువలేదు. తిమ్మన చిత్రణలో సత్యభామ ఎంత తీవ్ర ప్రగల్భయో, అంతటి పతివ్రత కూడ!

*"పతి ప్రాణ సదృశ బంధువు*

*పతి దైవం బేడుగడయుఁబతి సతులకు" ... (పారి. 1. 96)* అని నమ్మిన సాధ్వి పారిజాతపహరణ సత్యభామ. సత్య ఆలోచనలుగాని, మాటలుగాని నిరంతరము పతిని గూర్చియే యైయుండును. శృంగార వనమున చెలితో సరస గోష్ఠి యందున్నను, మరియే యితర విషయములను గూర్చి చర్చింపక, శౌరి గుణముల్వాక్రుచ్చి వర్ణించుట (పైది. 1-71) ఆమె ప్రేమాతిశయమునే చాటును. మానిని కావున తన మానినీత్వమునకు భంగము కల్గునట్లు, ప్రాణమైన మగడు దివ్య పుష్పమును సవతి కిచ్చుటయు, పరుడొకడు తనను నిందించుచుండగా, వారింపక, పతి అద్దానిని వినుటయు తీవ్ర బాధను కల్గించుటచే కోపముతో, పరుషోక్తులు, వక్రోక్తులాడి చివరకు, ఆగ్రహమును నిగ్రహించుకొనలేక, పాదతాడనము కూడ చేసినది. ఇప్పట్టున సత్యను పతి భక్తిలేని గయ్యాళిగా గాని తీవ్ర అహంకారిగా గాని భ్రమ పడరాదు.

పతి, పారిజాత వృక్షము తెచ్చి యిత్తుననగానే, అతడు కావించిన ప్రణయాపరాధ మంతయు మరచి, తిరిగి యథావిధిగ భర్తకు సేవలు చేయకడంగినదీ కులకాంత. సమయ కృత్యము ఛేయదలచు "నలిననాభుని చిత్తంబు దెలిసి", 'ఉడిగంపు పద్మముఖులను' మజ్జనాది కార్యములకు నియోగించినది (పారి. 2-4).

కె.వి.ఆర్. నరసింహముగారు సత్యను గూర్చి "పతివ్రతలలో అగ్రగణ్య. ప్రేమ స్వరూపిణి. కాని యీ ప్రేమ సాపేక్షము. అందువలననే యీర్ష్యసూయలకు దావలమైనది"[1] అని ఆమెను మహా పతివ్రతగా నిరూపించుచు, ఆమెలోని ఈర్ష్యాది బలహీనతలకు కారణమును వివరించినారు.

పారిజాతాపహరణ సమయమున, అడ్డుపడు నందనవన పాలకులతో పారిజాతము కృష్ణునకు దక్కుటయే న్యాయమని వాదించుచు, మీశచీదేవి, వీరపత్నియైనచో తన ప్రాణేశుడైన ఇంద్రునిటకు పంపి 'సత్యభామా విధేయుని వలన' మరలంగ గొనుటెపో వాసితనము' (4-58) అని హెచ్చరించును. ఈ ఘట్టమున, తనకు భర్తయును, సాక్షాత్తు భగవంతుడు నైన కృష్ణుని, తనకు విధేయునిగా ప్రకటించు సత్య, పతి భక్తి ఏమాత్రములేని

*1. ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు - పు. 44*

ఒక 'గయ్యాళిగా' కనిపింపవచ్చును. కాని అదే సత్య, పై సందర్భమునందే, వన పాలకులతో

*"తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ*
*డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక"* *(పారి. 4. 59)*

అని అనుచు, తన పతి భగవంతుడను విషయమును తాను గుర్తించితిననుటయే కాదు, వారినికూడ గ్రహింపుమనియు హెచ్చరించినది. భగవంతునిగా అతనిని గుర్తించియు, తృణీకారభావము చూపునంతటి దుష్ట వనిత కాదు సత్య. పతి తనకు ప్రియంకరుడగుటచే కొంత చనవును చూపినదే కాని, ఆమె పాతివ్రత్య ధర్మాచరణమున నెట్టి లోపమును చూపలేదు.

"సత్య యొనర్చిన ప్రసంగ మీమె వీరపతివ్రత యనుటకును, గరువతనము మిక్కుటముగ గలదియనుటకును బ్రబల నిదర్శనము"[1] అని దూసి రామ మూర్తిగారు పై ఘట్టమునందు సత్యభామ 'పతివ్రత'గా నిరూపితమైనదని దృఢముగా విశ్వసించు చున్నారు.

పారిజాతాపహరణము చేయువేళ, ఇంద్రాదులతో తలపడునపుడు, కృష్ణుడు చతురాయుధములు క్రేవల నిలువగ దివ్య విభూతి ప్రదర్శనచేయును.

"పనిలోపని, సత్యకు తనదివ్యత్వమును స్ఫురింప చేసినచో నికముందిట్టి కథలు జరుగకుండును గదా! యని స్వామియాశ" అని ధారా రామనాథ శాస్త్రిగారు అభిప్రాయ పడినారు.[2] కాని ఇది సరికాదని పించుచున్నది. మున్ను, జలధిని పుట్టిన ఇందిరను గ్రహించిన విష్ణువే, ఈ కృష్ణుడని, సత్య నందన వనపాలకులకు ప్రకటించినది. అట్టి యెడ, సత్యకు కృష్ణుడీ విధముగ తన మహత్తును తెలియచేయవలసిన అవసరమేలేదు.

పుణ్యకవ్రతమును పతిప్రేమను పొందుటకే చేసినది. అదియు, పతియొక్క అజ్ఞతోనే చేసినది. వ్రతములు చేయుటకు భార్య, భర్త అనుమతిని పొందవలయునని శాస్త్రము చెప్పుచున్నది. ఏస్త్రీయైనను భర్తయనుమతి పొందకుండ వ్రతము చేసిన, అవి దేవతా ప్రీతికరములుగాక, రాక్షసులకు చెందునని పరాశరస్మృతిలో నున్నది. "మార్కండేయ పురాణము"ను, సతులకు పతి అజ్ఞ చేతనే వ్రత ఫలము దక్కునని చెప్పుచున్నది.[3] సత్యభామ ఉత్తమ కులకాంతకావున, ప్రతిఫలము తనకు దక్కవలయును కావుననే ధవునియనుజ్ఞతో పుణ్యక వ్రతారంభమొనర్చినది. 'భైరవ కవి హరివంశము' నందునట్లే పుణ్యకవ్రత దాన సమయమున, "తదనుజ్ఞ వడసి", "నారదుని కొఱకు జలంబుచే ధారవోసినది" (5-229).

వ్రత నియమానుసారముగా నారదునకు తన భర్తను దానము చేసినదే కాని అట్లు చేయునపుడు పతివ్రత కావున సత్య చాల ఆందోళనమునకు గురియైనట్లు, పారిజాతాపహరణ ప్రబంధమున కనబడును. దానము చేయబడుటకు కృష్ణుని 'నియ్యకొలుపు'మని సురముని, సత్యను హెచ్చరింపగానే, పతిప్రేమ ఇక తనకే దక్క బోవుచున్నది కదా, యనెడు "సమ్మదం" బున్నను. "ప్రాణమైన మగనిని" దానము చేయవలసి వచ్చినది కదాయనెడు, "లజ్జయు" పెనగొనగా దానమునకు అంగీకరింప చేయక తప్పదగుటచే, "మోమువాంచి, మధుకైటభ మర్దన చిత్తగించితే మునిపతి మాట" (పైది. 5. 77) అని మాత్రమే అని, మిగిలినది అనలేక సందేహించినది. ఆమె మనసును గ్రహించినవాడగుటచే శ్రీకృష్ణుడును "నీకు నేల యనుమానం బాగ మోక్తంబుగాన, విచారింపక ధారవోయు"మని ప్రోత్సహించినాడు.

---

*1. పారిజాతాపహరణము - సురభి వ్యాఖ్య - భూమిక - పు. 19*

*2. ఆంధ్ర వాఙ్మయము - శ్రీకృష్ణ కథ- పు. 192*

*3. యానారీ ఖల్వ నాజ్ఞాతా భర్త్రాపిత్రా సుతే నవా, నిష్ఫలంతు భవేత్తస్యా, యత్కరోతి వ్రతాదికం-మార్కేండేయ పురాణము*

"స్వ స్వత్వ నివృత్తి పూర్వక పరస్వత్వాపాదనమె దానమనంబడును"[1] 'ఇది నేను నీ కొరకు నిచ్చుచున్నాను, ఇది నాది కాదు", అను అర్థముగల 'తుభ్య మహంసంప్రదదే నమమ' అను మంత్రమును దాన కాలమున చెప్పవలయును. వస్తువుపై పూర్తి హక్కులను వదులుకొనవలయును. కాని సత్య భర్తను విడిచి యుండలేదు. శాశ్వతముగ నాతనిని నేరికి నీయలేదు. కావుననే 'వివేకముతో నమమ అనుటకు బదులు "తుభ్యమహం సంప్రదదే నమోనమ" (పారి. 5. 82) అని మంత్రమును కొంత భిన్నముగ మార్చి, పతిని తిరిగి దక్కించుకొనినది. నీమనోహరుని చేకొనుమని సురముని అనగానే "అపరిమిత ప్రమోద భరితాననయై"నది. అంతేకాదు. పతిని తిరిగి పొందుటకై వెంటనే "నిష్క్రయంబుగా, నారదునికి, తనకు ప్రీతి పాత్రములగు భూషణ వితానములన్నియు" నర్పించినది. (5-88). ఆ అపరిమితానందమును, ఆభరణముల నన్నిటిని వెంటనే ఇచ్చుటచే సత్యభామ పతిని వీడి క్షణముకూడ ఉండలేని అనురాగాతిశయమునే సూచించును. పతిప్రేమను సంపాదించుకొనుటకై సర్వమును త్యాగము చేయ సిద్ధపడినది. నిజమునకు పుణ్యకవ్రతము సత్య ప్రణయాధిక్యమునకు ఉన్నతమైన చిహ్నము. ఆమె పాతివ్రత్యమునకు పరమోదాహరణము.

విష్ణు మాయానాటక ప్రబంధమునందు, సవతి రుక్మిణికిని, తనకు వలెనె పారిజాత వృక్షము దక్కిన దనెడు నీర్ష్యచే, రోష కషాయితయై పతిని పలువక్రోక్తులచే, నిందించి,సవతి పంపిన పారిజాత విరులన్నియు అతనిపై దిగపాఱంబోయించి, పతి చేయు లాలనను కూడ లెక్కచేయక, లోనికింజని గగన కవాటార్గళంబు బిగియించి చెంగల్వపాన్పున మేను వైచి పొరలినది. కాని యెంత కోపమున నున్నను పతివ్రత గావున,'మర్నాడు భర్తతో చేరుటకు "తహతహంబడినది", హరి స్నేహితుడగు గోవిందశర్మ వలన విష్ణుమాయానాటక రహస్యమెరింగిన వెంటనే "అచ్చెరువునంది పరిణమించినది" (పైది. 1-207). అనగా ఆనందించినది.

*"ఆ సాధ్వి చిత్తగించుటఁ*
*జేసి పవిత్రములు నతి వితచిత్రంబులునై*
*భాసిల్లె విష్ణుమాయో*
*ల్లాస చరిత్రములు వినుమిలాతలనాథా ..." .....(విష్ణు. మా. నాట. ప్ర. 2-4)*

అని గోవిందశర్మ ధర్మరాజుతో అనుట సత్య పరమ పతివ్రత అనుటనే నిర్ధరించును.

భామాకలాపములోని సత్యభామలో నెంత మానినీత్వము రాజసమున్నదో దానికి మించిన పతిభక్తియు నున్నది. సౌందర్య గర్వముచే పతికన్నను తానే చక్కని దానని సత్యమును పలికి, అతనికి కోపమును కల్గించినది. కాని అతడు తనను విడిచిపోగానే తన తప్పును గ్రహించి.

*"తాపమార్పుకోనైతి దయగ మాటాడనైతి*
*చెప్పినట్లు సేవజేసి చరణముల నొత్త నైతి" ...(భామా. పు. 10)* అని పశ్చాత్తాపము చెందినది. అత్త, మామ, బావగారు, తోడికోడలు, సవతి, మరది, ఆడుబిడ్డ - ఇందరు బంధువులున్నను, ఆమెకు తృప్తిలేదు.

*"ఇందరున్నార లున్నందుకేమి ఫలము*
*కలిమి బలిమియు సకల భాగ్యంబులున్న*
*ప్రాణనాథుని పొందెడ బాసి యున్న*
*యింతులకు నెంత గల్గిన నేమి ఫలము" ....(పైది. పు.15)*

---

*1. నాగపూడి కుప్పుస్వామయ్య - పారిజాతాపహరణము - పరిమళోల్లాసవ్యాఖ్య - 322*

అని బాధపడిన పతివ్రత, సత్య శ్రీకృష్ణ ప్రణయారాధకురాలు, సౌందర్యారాధకురాలీమె. కృష్ణుని మోహన రూపము, సరసత, సద్గుణములు సత్యను కట్టివైచినవి.

"నానాథు డెంత చక్కనివాడే" అని పొంగిపోవుచు, కృష్ణుని అందెల చప్పుడు వినిపించనిచో, అతనితో ముచ్చటలాడనిచో, అతనిని చూడనిచో వేణునాదము విననిచో, నాణెముగ నాతనిని పొందనిచో మనసు నిలువదా ప్రణయసుందరికి! పారిజాతాపహరణ సత్యలో బింకము, అహమునున్నవి. ఈ భామాకలాపపు సత్యలో దైన్యముపాలే అధికము. "ప్రాయము వ్యర్థమమ్మ పతిబాసి, తొరంగిన నాటి నుండి" (పైది. పు. 44) అని కూడ తలచినది. పతిని రప్పించుకొనుటకై చివరకు, తనకు మిగుల ప్రియమైనవి, మంగళ ప్రదములైనవి యగు ఏడువారముల నగలను కూడ చెలికిచ్చి వేసినది. నాథునకు సందేశ మంపుచు, తన విరహగాథనంతను 'వినయము'గా తెలుపుమని చెలిని హెచ్చరించినది. (పైది. పు. 76). వల్లభుడు రాననినాడని చెలియెరింగింపగానే

*"మగడు యింతులపై దయమాలియున్న*
*ప్రాణముల్ దాచ నేల నీ ప్రాయమేల?" ...(పైది. పు. 83)*

అని తీవ్రమైన విరక్తికిలోనై ప్రాణత్యాగము చేయబూనినది. ఆ క్షణమునందు సహితము "చెన్నకృష్ణున కర్పణముసేతు మేను" అని పతికే శరీరమునర్పింప తీర్మానించుకొనినది. బ్రతికియున్నను, మరణించుచున్నను, పతిని వీడి యుండలేదీమె. పతి రానందులకు కోపమును విరక్తియు కలిగినను, మరల పతికే మేను నర్పింతునను సత్యభామ పతివ్రతోత్తమ కాక వేరేమి యగును?

చివరకు ఆ భామా సాంత్వనమునకై, వల్లభుడురాగా అతనిని చూడగానే, కోపముతో వక్రోక్తులు పల్కినను, ఆ మాటలన్నియును వ్యాజనిందామయములే. చివరకు తననాథుని జగన్నాథునిగా గుర్తించి బంగారు పూవుల, చెంగల్వ పూవుల పూజించిన వనితాలలామ సత్యభామ. బందా కనకలింగేశ్వరరావుగా రనినట్లు 'రుక్మిణీ ఒక భక్తురాలు మాత్రమే. సత్యభామ ప్రేమ స్వరూపిణి'[1] కాని భక్తికి తొలిమెట్టయిన ఆ ప్రేమలో స్వార్థముండుట వలన అది కొంత మలిన మైనది. కృష్ణుడు ఆప్రేమలోని మాలిన్యమును తొలగించి, సత్యభామను ఇందు దివ్య స్వరూపిణిగ రూపొందించినాడు.

భామాకలాపములో వలెనె,'పారిజాతాపహరణ యక్షగానమందలి సత్యభామయు శ్రీకృష్ణ సౌందర్యారాధకురాలు. అతని దివ్య సౌందర్యమువంటి సౌందర్యము ఈముల్లోకము లందెచటను లేదని ఈమె విశ్వాసము (పారి. యక్ష - 2 - 124).

ఈయక్షగాన సత్య ఒక విలక్షణమైన ప్రణయిని. పతి దూరమగుటచే, తన యెదకు మరుని విరితూపుల వలన బాధకలుగునని భీతిల్లలేదు. కాని "నామదిలో నిరంతరం బెలమివసించు నాప్రియున కెక్కడ తాకునొయంచు మిక్కిలిన్ అలసితి గాని యీమారున కల్కిన దానను గాను".... (పైది. 127) అని తన భీతికి కారణమును ప్రకటించినది. ఇంతటి అపురూపమైన ప్రేమను మరెచటను కానలేము. ఇంతటి పరిపూర్ణమైన ప్రణయ ముండుటచేతనే, నాథుడురానని విదిలించుకొనుచున్నను మానాభిమానములను విడిచి పలుమారతని కడకేగి "రా రమ్మ"ని అర్థించినది. అతనిచే తీవ్రముగా, సవతుల ముందు, ముఖ్యముగా అతని ప్రియురాలగు రాధ ముందు అవమానింపబడియును "ధ్యాన ధారణ సమాధులనుండి యోగీశ్వరుని చందంబున డెందంబున హరిని దలంపుచుండి", (పైది. 4-226) అతని అనుగ్రహముచేతనే, కోరిన దివ్య నగమును పొందినది.

"పట్టుగా తరిగొండపతి పాదయుగమె పట్టి వీడని సత్యభామ నా పేరు" (పు.30) అనెడు పతిభక్తి పరాయణురాలిగా 'విష్ణు పారిజాత యక్షగానము' నందు సత్యభామ పరిచయము చేయబడును.

---

*1. భామాకలాపము - ఆం. ప్ర. సంగీత నాటక అకాడమి - ఉపోద్ఘాతము ..పు. 1*

మున్ను తరిగొండ హరినగు నన్ను గూర్చి
చిరతపము జేసినట్టి విశేషముునను
కోటి కారుమెరుంగులు గూడి యున్న
చందమున వెల్గు చుండురా సత్యభామ" ...(విష్ణు. పారి. యక్ష. పు. 8)

అను కృష్ణుని మాటలను బట్టి, కృష్ణుని పొందుకై సత్య మున్ను తపము చేసినదని తెలియుచున్నది. విరహముతో, కోపముతోనున్న సత్య,

"మెట్టెలు జిగడలు మెడలోన నతడు
కట్టిన బొట్టు ముక్కర మాత్రముంచి"

అన్ని సొమ్ములు దీసి యావల వేసినది (పైది. పు. 35). ఎంత ఈర్ష్యా క్రోధములకు లోనైనను, పతి భక్తిని వీడలేనిది యీ యక్షగాన సత్య. నాటక కర్తల చిత్రణయందు సత్యభామ కోపముతో పతిని పాదతాడనము చేసినను, ఆ తరువాత, తాను కావించిన తప్పిదమునకు తీవ్ర పశ్చాత్తాపమునకు లోనగునట్లు చిత్రితము- చిలకమర్తివారి పారిజాతాపహరణమునందు "అయ్యో! నేనెంత యదృష్టవిహీనురాలను! ప్రాణేశ్వరుని వామ పాదంబున దన్నితినని యపనింద గల్గును గాబోలును" (పు. 34) అని భయపడును. అంతేకాదు "ఇంత దనుక మాయత్త దేవకీదేవి నన్నందఱు కోడండ్రలో బెద్ద జేసి యత్యంత గౌరవంబున జూచు. ఇప్పుడు పతి యెడ నవినయంబు జూప యామె మొగమెట్లు చూతును? భర్త యెడ నొనర్పరాని దోస మొనరించిన యీ మేనిపై నభిమానము విడచెదను" అని ప్రాణత్యాగమునకు కూడ సిద్ధపడును.

హరికథలయందును సత్య. పతిని వీడియుండలేని పతివ్రతామతల్లిగానే చిత్రింపబడినది. నాథుడు తనకు వశుడైయుండుటకు తులాభారవ్రతము చేయుటకు సిద్ధపడును. కాని భర్తృదానము చేయవలసి వచ్చునని నారదుడనగానే

"ఔరా! నారదా ఏమినీయాగడము? భర్తను దానము చేయుమనెదవా?" (శ్రీకృష్ణ తులాభారము - పు. 19) అని కంగారుపడును. నారదుడు ధైర్యము చెప్పిన పిదపనే, ఆ వ్రతాచరణమునకు సమ్మతించును.

జానపదుల దృష్టిలో సత్యభామ అహంకారి యైనను వారి చిత్రణలోను ఆమె పతివ్రతా ధర్మముల నాచరించిన సాధ్విగానే కన్పట్టును. నిండు పతిభక్తి గల ఈ జానపద సత్యభామ, ఎంత కోపమున్నను పతిని తన్నదు. అంతేకాదు. తనకాళ్ళను పతి పట్టుట అనెడు మాటను కూడ వినలేదు. విరహోత్కంఠితయైన సత్య కడకు, కృష్ణుడాలస్యముగా రాగా, కోపముతో, ఆమె తలుపు గడియ పెట్టును. ఆమె ననునయించుటకై పలు విధముల బ్రతిమాలియు, ఫలితము లేకపోగా, చివరకు కృష్ణుడు. "పద్మాక్షి నీ కాళ్ళు పట్టెదా నేను" (సత్య. సరసము- పు. 171) అని అనగానే, "ఆమాట విని సత్యభామతా - వేగపాన్పు దిగ్గునాదిగి తీసెను ఘడియా" (పైది). గడియ తీసినదేకాని కొంటెకృష్ణుని పనులయెడ, ఆమెకినుక తీరలేదు. అతని నేరము లెన్నుచు వాదోపవాదములకు దిగినది. కాని పతివ్రత కావున, అతడు కోపము చెందగ, "పీతాంబరు చెంగు పిగుల దాబట్టి" నిలిపి సేవలు చేసినది. సత్రాజిత్తు తన నంపునపుడు "ఆడపడుచుల బుద్ధిగా తనతో" "మిమ్ము శిక్షింపుమని, విన్నపములాయె" నని పతిముందు కొంటె తనము కనబరచినది. కాని, "పట్టి శిక్షింపు," మని అచ్యుతుడు పలికి, "కొట్టుమని బంగారపు కోల, చేతి కీయగా "బంగారము కోల తాను పారవేసుకొని - అక్కడ అయింతి అట్టిట్టి నిలచి"నది. అంతేకాదు, "యెక్కువలు తక్కువలు ఏమి ఆడితినో" అనియు బాధపడినది. (పు-175). "పట్టుకొని విభునికి - పాదాలు వొత్తి" సేవలు కూడ

చేసినదీ జానపద సత్యభామ. పతిని దానమీయవలయునని నారదుడు చెప్పగా "పతిని దానమిచ్చినట్టి వనిత బ్రతుకు దారి జెప్పు"మని కోరినది. (తులసీదళము. పు. 195). అతని యెత్తు ధనమిచ్చి తిరిగి పుచ్చుకొన వచ్చుననియు, అట్టిది ధర్మ శాస్త్రమందు ఒప్పి యున్నదని, అతడు నమ్మ బలికిన తరువాతనే వ్రతాచరణమున కంగీకరించినది ఈ సాధ్వి.

సత్యభామ వ్రతములు చేసినను, నోములు నోచినను, కొన్ని మూఢవిశ్వాసముల పట్ల నమ్మకమును చూపినను అవి అన్నియు భర్తృ క్షేమము నాశించియే, పాటించినది.

## వ్రతములు :

స్త్రీలు భర్తృ సౌభాగ్యము కొరకు గాని, ధన ధాన్యముల కొరకుగాని వ్రతములు చేయుట, నోములు నోచుట మనము చూచుచుందుము. ముఖ్యముగా భర్తృ క్షేమమునకై వనితలు వ్రతాదులను చేయుచుందురు. ఈ వ్రతములయందును, నోములయందును మనకు విశ్వాసమున్నను లేకపోయినను, వ్రతాదులను చేయు స్త్రీల నమ్మకము వెనుక గల భర్తృ ప్రేమ, భక్తి మెచ్చదగినవి.

సత్యభామలో ఇతర పురాణవనితల వలె గాక, స్వతంత్ర భావములు గల నాగరిక వనితా ప్రవృత్తియే మనకు కనిపించుచుండును. కాని సునిశితముగ పరిశీలించిన, సత్య స్వాభావికముగ, సాధారణ గృహిణికి వలెనె, వ్రతములు, నోములు నిర్వహించు సనాతన సంప్రదాయిని అనుట గ్రహింపగలము. ఇట్టి సనాతన వర్తిని యగు సత్యభామ, పురాణేతి హాసములందేగాక, ప్రబంధ, యక్షగానాదులందు సహితము కనిపించును.

శ్రీకృష్ణుని మగనిగానే గాక, దైవముగ కూడ కొలిచిన మహాభక్తురాలు సత్యభామ. ప్రతి జన్మమునను నాతనినే భర్తగా పొందుటకును, కల్పవృక్షమును వీడకుండుట అనెడు సౌభాగ్యాతిశయము కొరకును, నారదోక్త విధిని తులాపురుష దానము చేసినట్లుగ, పద్మపురాణము చెప్పుచున్నది.

*సీ॥ "సంయమీశ్వర! జన్మ జన్మంబునకు నాకు*
*నిట్టి కల్పద్రుమంబు నిట్టి పతియు*
*బ్రాప్తింపఁ గలుగు నుపాయ మేదేనియు,*
*నానతిమ్ము... ... ... ... "* ...(చిదం-. పద్మ. పు. 4 - ఉ. ఖం - 316)

అని నారదుని ప్రార్థించినది. నారదుడు, ఉపదేశించిన విధముగానే తులాపురుషదానము చేసినది. అంతేకాదు "వల్లభ! నాకున్ వినిపింపుము విశదంబుగ వినఁ గార్తికమాస మహిమ వేడ్కఁజనించెన్" (పైది. 330) అని అడిగి కార్తీకమాస మాహాత్మ్యమును గూర్చి కూడ, వివరముగ తెలిసికొనినది. వ్రతములు, నోములు చేసెడి అలవాటు సత్యభామకు, జన్మ జన్మములనుండి యున్నట్లుగా పై పురాణము వలన తెలియుచున్నది. సత్య కృతయుగమున గుణవతియను బ్రాహ్మణ యువతిగా జన్మించినపుడు. శ్రీ మహావిష్ణువును భర్తగా పడయుటకై కార్తీక మాసమున ఆమె యొనర్చిన దీప దానము వలన నేడు ఇట్టి స్థిరలక్ష్మికల్గుటయు, పతి రూపమున విష్ణువును మనసులో ధ్యానించుటచే ఈ జన్మమున నామె కృష్ణునకు భార్యగా జన్మించుటయు జరిగినదని కృష్ణుడు సత్యభామకు వివరించును.

భైరవ కవి హరివంశము వలనను, తిమ్మన పారిజాతాపహరణము వలనను, సత్యభామ పుణ్యక వ్రతమును చేసినట్లు తెలియుచున్నది. పతివ్రతలగు ఉత్తమ సతులకు పుణ్య

ఫలము కలుగుటచే నిది పుణ్యక వ్రతమనబడునని ఈ క్రింది హరివంశ శ్లోకము వివరించును.

*"కర్మణా మనసా వాచా పతిం నాతి చరంతి యాః*
*తాసాం పుణ్య ఫలం సౌమ్యే పుణ్య కైః సముదాహృతమ్" ....(హరి. హరి. ప. 78-17)*

*"ధన కనక వస్తు సమితియు*
*దనయ సమృద్ధియును గల్గి తానుంబతియున్*
*మనమున నఱగొఱ లెఱుఁగక*
*యనితర సులభైక సుఖము లందుదు రనుచున్ ..(పారి. 5-62)*

నారదుడనుటచే, ధనకనకవస్తు సమృద్ధియు, తనయ సమృద్ధి, సుఖమయమైన అనుకూల దాంపత్యము కొరకును సత్యభామ పుణ్యకవ్రతము చేసినట్లు గ పారిజాతాపహరణ ప్రబంధమును బట్టి, గ్రహింప వచ్చును.

పై అన్ని విషయములకన్నను ఆత్మవిభుని దృష్టి యేసవతి కాంతపై పడునో యని కలవరపడు సత్యకు "తానుం బతియును మనమున నఱగొఱ లెఱుగక అనితర సుల భైక సుఖములందుట" యనెడు విషయమే మిక్కిలిగ నాకర్షించియుండును. పారిజాత పుష్పమును సపత్నికి ప్రాణేశుడిచ్చుటచే స్వాధీనపతికనని నమ్ముకొను సత్యభామ మనమున, కొంత ఖేదము కల్గినది. అట్టిది మరియొక మారు జరుగరాదు. పతి ప్రేమనంతయు తానే పొందవలయును. ఈ వ్రతము వలననే ఇట్టిది సాధ్యము కాగలదు. అందులకై

*"............తొంటి తన కోపము గర్వము మత్సరంబు మా*
*ని వినయంబు బ్రమోదమును నిండ తొలంకెడు నెమ్మనంబున*
*న్పవతుల యిండ్ల కెల్లఁదొలునాఁడు క్రమంబున నేగి తద్వ్రతో*
*త్సవమున కామతించి యతిసంభ్రమలీలలఁ దోడితే దగున్" ....(పారి 5-57)* అను

కఠిననయమునకు కూడ అంగీకరించినది,

ప్రతి దినము పదివేవురు పేరంటాండ్ర కర్చనలొనర్చి, సారఘనసార సుగంధములు, విచిత్ర నూతనపటరత్న భూషణవితానము లిచ్చి, చైత్ర శుద్ధనవమి యాదిగా నెల వ్రతంబొనరించి[1] ఆ మీదట వ్రతోద్యాసనవేళకు ఆత్మేశు న్సురానోకహాన్వీతునిగా దానముచేసి[2] అత్మ భూషణవితానములను నిష్క్రయుగా సురమునికిచ్చి[3] తిరిగి పతిని గైకొనినది[4].

శ్రీకృష్ణుడు రైవతక పర్వతమున "రుక్మిణీ సహితుండై పుణ్యకవ్రతంబు చేసెనని" (5.13) భైరవకవి హరివంశమున పేర్కొనబడినది. కాని నిజమునకు కృష్ణ భార్యలలో పుణ్యకవ్రతము చేసిన మొదటి వ్యక్తి సత్యభామయే. మూల హరివంశమునందు "ఉప వాసావసానం హి, రుక్మిణ్యాః ప్రతిపూజయన్" (హరి. వి. ప. 65. 5) అని ఉపవాసావసాన వ్రతోద్యాస పూజావిధి చేసినట్లు చెప్పబడినదే కాని, పుణ్యకవ్రతమనిలేదు. ఉపవాసావసాన ఉద్యాపన జరుగువేళ నారదుడు పారిజాతముతో వచ్చినట్లు అందు వర్ణింపబడినది. అంతేకాదు. నారదుడు అదితి, పార్వతి, లక్ష్మి, సరస్వతి, శచీదేవులు, అంతకు పూర్వము పుణ్యక వ్రతమును చేసి యుండిరని చెప్పునేగాని, వారిలో రుక్మిణి పేరును పేర్కొనలేదు.

---

*1. పారి - 5.58*
*2. పైది - 5 -61*
*3. పైది - 5 -88*
*4. పైది - 5 - 89*

మీదు మిక్కిలి సత్యభామ పుణ్యక వ్రతము చేసిన తదుపరి, రుక్మిణి నారదుని వలన పుణ్యక విధులను తెలుపుమనుచు, "జ్ఞాన శ్రేష్ఠ! నాకు పుణ్యకవ్రతము యొక్క పూర్ణ స్వరూపము దయతో చెప్పు" మని అర్థింపగా, నారదుడా విధిని, వివరించును[1]. ఆ తరువాతనే, రుక్మిణియు నితర కాంతలును వ్రత విధానముల నెరింగి, వ్రతమును చేయుట జరిగినది.[2]

పారిజాతాపహరణ ప్రబంధము నందును "అయ్యరుంధతియును గౌరియు న్శచి యుఁ దత్పరబుద్ధినొనర్చు వేళఁజూచితి మును" (5-55) అని నారదుడనును. దీనివలన, దేవకాంతలైన అదితి, గౌరి, శచి మున్నగువారు మాత్రమే పూర్వము చేసియుండిరని తెలియుచున్నది. దీనిని బట్టి చూచిన, కృష్ణకాంతలలో పుణ్యక వ్రతము చేసిన మొదటి వనిత సత్యభామయే యగుచున్నది.

యక్షగానములందు సత్య, కృష్ణుడు తన నేవేళ బాయకుండుటకై తులాభార వ్రతము చేయబూనగా[3] జానపద సత్య "ముందు జన్మలోన కృష్ణుడు మగడుఔటకూ" ఆ వ్రతము చేయదలచినది. (తులసీ. ద- పు. 192).

వ్రతములేకాదు, సత్యకు నోములపై కూడ అంతులేని విశ్వాసమున్నట్లు తెలియు చున్నది. పూసలలో దారమువలె, సతి మదిలోన మెలగెడు పతి దొరకుట తొలి జన్మముల నోముల ఫలమని భావించు సత్యభామ తిమ్మన ప్రబంధమున చూడగలము.[4]

"ఇంతగా నోచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మోయి నున్నదాననో" [5] అని బాధపడును. దీని నాధారముగ చూచిన, పుణ్యక వ్రతమునకు ముందే నోములు నోచినట్లు తలంప వచ్చును.

*'వినవయ్యా కృష్ణ! నావిన్నపంబొకటి*
*తనర దానాలు నీదయను జేసితిని*
*యాదాన ఫలములు నందితిజాల "* ....*(సతీ. - పతి - దా - యక్ష. పు. 9)*

అని, పురుషదాన వ్రతమునకై అనుమతి కోరు "సతీపతి దాన విలాస యక్షగాన సత్య పలుకులను బట్టి, అంతకుమున్నే సత్యభామ పెక్కు దానములు కూడ చేసియున్నదని అవగత మగును.

ఇట్లు సత్య ఏ వ్రతము చేసినను, నోమునోచినను, అది పతియైన కృష్ణుని ప్రేమ పొందుట కొరకే. ఇందు కించిత్తు స్వార్థమున్నను తాను ప్రేమించిన వ్యక్తి, తనకు శాశ్వతముగా దక్కవలయునని కోరుకొనుట మానవ సహజము. సత్యభామలో ఆ భావము కొంత ఎక్కువగా బహిర్గతమైనది. భక్తి ప్రేమాతిశయములతోనే తులాపురుషదానమును, పుణ్యక వ్రతమును చేసినది. కాని, నాటక, జానపద కవుల దృష్టిలో మాత్రము మోహాంధీకృత, ప్రణయ గర్వితయగు సత్య, పతిని వశము చేసికొనుట కొరకే స్వార్థాతిశయముతో, అహంకారముతో ఆవేశముతో తులాభార వ్రతమునకు కడంగినట్లు చిత్రించినారు. దేశి కవులు ఈ తులాపురుషదాన మాధారముగానే కృష్ణతులాభార, తులసీదళ మాహాత్మ్య కథలను సృజించి సత్యాగర్వ భంగము చేసి మనమున సాంత్వనమును పొందినారు.

---

1. *సం. హరి. హరి. ప - 77 - 80*
2. *సం. హరి. వి. ప. - 81-39*
3. *శాహజి - సతీపతి దాన విలాసము - పు. 7*
4. *పారి - 1 - 93*
5. *పైది. 1 - 90*

## సంప్రదాయ విశ్వాసములు :

కొందరకు కొన్ని గాఢమైన నమ్మకములుండును. ఏ కారణముననూ వానిని మీరి నడువరు. 'ఒక వ్యక్తిపై అంతులేని అనురాగమున్నప్పుడు, వారికి గల నమ్మకములపై గల విశ్వాసము మరింత బలపడుచుండును. సత్యలో నాగరికతా ప్రవృత్తి కొట్టవచ్చినట్లు కనిపించు చుండినను మనసు మాత్రము సనాతనాచారముల పట్ల, మూఢ విశ్వాసముల పైపు మొగ్గుచూపించినట్లు సాహిత్యమున చిత్రింపబడినది.

నోములను వ్రతములను చేయుటయందేకాదు, ఆభరణములను ధరించుటయందు కూడ సత్య కొన్నినియమములను పాటించుచుండినట్లుగ 'భామాకలాపము' చూపును. పతి క్షేమమునకై ఏడువారములును, ఆయా గ్రహాధిపత్యముగల ఏడువిధములైన నగలను ధరించుచుండెడిది. "ఆదివారపు సొమ్ములకు సూర్యుం డధిపతియైనందున, నాడు ఆయాభరణములం దాల్చి ప్రియునకు హితమును గలిగించుచుండెడిది (భామా. పు. 45). ఇట్లు వరుసగ ఏడు వారముల సొమ్ములు ధరించుండెడిది. ఆమె మనోనాథుడైన హరిని తీసికొని రావలెనన్న, ఆమె నగలన్నియును తన కీయవలయునను చెలికి, అన్ని ఇచ్చుటకు సిద్ధపడినది కాని, ముంగెరను మాత్రము నిచ్చుటకు నంగీకరింపలేదు. "స్త్రీలకు సమస్తాభరణములున్నను ముంగెర లేనిచో నాయాభరణములన్నియు వృథా యగునే దాని నొరుల కీయరాదే" (పైది. పు. 51) అని వాపోయినది. పతికన్నను నగలు ముఖ్యము కాదని, చివరికద్దానిని కూడ నిచ్చి వేసినది. కాని యక్షగాన సత్య మాత్రము అట్లు ఇచ్చుటకు సిద్ధపడలేదు.

*"రమణిరో నీకు నారు వారాల సొమ్ము*
*లెలమితో, నిత్తునింక నీరెండు దక్క*
*పెక్కు భృగు వాసరపు సొమ్ము ముక్కరయును*
*బొలఁతి, యీరెండు ముత్తైదు పోణిమి సుమి"* ...(పారి. యక్ష - 3 - 163)

అని పలికి, చెలిని అంగీకరింప చేసినది.

పతి పేరును చెప్పుట సంప్రదాయము కాదని తలంచునంతటి సనాతనాచార పరాయణురాలు దేశి సాహితి సత్యభామ. 'భామా కలాపము' నందు, చెలి మాధవి, సత్యతో తనమగని పేరు చెప్పుమని యడుగగా, ఆమె

*'దయితు నామంబు దెలుపంగ దగదుగాన*
*గురుతులం గొన్ని దెల్పెద నెరుగుమమ్మ"* ...(భామా . పు. 14)

అని శంఖు చక్రాదులను ధరించినవానిగా అతని రూపవర్ణన చేసినదే కాని, పేరును చెప్ప సిగ్గుపడినది.

"చిన్న నాటి నుండి వాని పేరు చెప్పు వాడుకలే"దామెకు. కాని చెలి బలవంతము వలన,

*కాకు వట్టు సుడిని జొక్కముగ నిల్పి*
*వరపవర్గము క్రింద ణ వర్ణమెలిమి*
*వ్రాసి తుది స్వామి పదము చేర్పంగ నాదు*
*ప్రాణనాథుని నామమేర్పడునె చెలియా"* .....(పైది. పు. 20)

అని పరోక్షముగా కృష్ణనామమును చెప్పినది. అదియు చెలి గ్రహింపలేదని భావించి, చివరకు "మనలోని చిన్ని కృష్ణుడె" అని సిగ్గుపడుచు ఆమెకు చెప్పక తప్పలేదు. యక్షగాన సత్య పతి పేరు చెప్పగలిగినను, అతడు తనకు 'మగడ'గునని చెప్ప సిగ్గుపడినది.

"ఏమైన జెప్ప వచ్చునమ్మా, మగడానెమాట యెంతైన జెప్పరాదమ్మ (విష్ణు. పారి. యక్ష. పు. 33) అని చాల సిగ్గుపడినది. సత్యభామకు శకునములపై ప్రగాఢమైన నమ్మకమున్నదనిపించును. శృంగార వనములో, చెలితో శౌరిగుణములు వర్ణించుచుండు సమయమున, "దక్షిణాంసచూచుక నయన ప్రకంపములు" కలుగగా, అవి మంచివిగావని తలచి "ప్రాణ నాథుఁడొండొక చపలాక్షి గూడి, నను నొల్లని చెయ్దము లేమి సేసెనో" (పారి. 1-73) అని భయాందోళనములకు లోనైనట్లు పారిజాతాపహరణ ప్రబంధమున చిత్రింపబడినది.

భామాకలాపమునందు, సత్యభామ, చెలిని కృష్ణుని కడ కంపుచు శుభ శకునము లేవియో, దుశ్శకునములేవియో వివరించును. అంతేకాదు గరుడుడు నింగి తిరిగెననియు, ఇద్దరైదువ తరుణుల పొడగంటిననియు, శుకపిక పైడిగంటలు కలయ పల్కెననియు, ఉత్తరాన బల్లి పల్కిన దనియు, పడమట పాలదీర్చెననియు, ముత్తయిదువు లిద్దరు హత్తుకొని యెదుట వచ్చిరనియు, భూసురులిద్దరు పూర్ణకుంభముతో నెదురైరనియు, ఇవి శుభ శకునములనుచు "వనజాక్షి నావిభుడైన వాడు వచ్చుగాబోలు, సఖీ మంచి శకునము లగుచున్నవి. వేగపోయిరమ్ము" (పు. 63) అని చెలిని తొందర పెట్టును. పతిని, సర్వస్వముగా భావించు ఈ భామాకలాపపు సత్యభామ పతిక్షేమమునకు తనశకునమే మంచిదని కూడ నమ్మినది.

*"అరుగు దిగిన సమయంబును కనుగొని*
*యెడ మూడడుగులు యెదురు నడతునోయమ్మా" ...(పైది. పు. 30)* అని అనినది.
దృష్టి దోషములపై కూడ అపార విశ్వాసమున్నదీ భామా కలాపపు సత్యకు.
"ఎడ దృష్టితాకునోయని సొగసుకన్నులవాని జూడ వెరతు" అని చెప్పుకొనినది. ప్రబంధాదులలో కన్నను, జానపద మనోరంజకమగు దేశిసాహితియందే ఎక్కువగ సత్యభామ ఇట్టి మూఢ విశ్వాసములుకల భామగ చిత్రితమగుటలో వింతలేదు.

సత్యభామ ప్రణయ రూపమున కృష్ణుని భగవంతునిగ సేవించిన ఒక భక్తురాలు. భక్తి యనునది భగవంతునకును తాదాశ్రితునకు మధ్య వెలసిన అత్యంత సున్నితమైన బంధము. "భక్తి మహోత్తమ ప్రేమ స్వరూపము" (1-2) అని నారదీయ భక్తి సూత్రములు చెప్పుచున్నవి. భక్తి భూమికలను పలువురు మహామహులు పలు విధములుగ పేర్కొనినారు. శ్రద్ధాసంగము, భజనక్రియ, అనర్థ నివృత్తి, నిష్ఠారుచి, ఆసక్తి, భావము - అనునని భక్తి భూమికలని భక్తి రసామృతసింధువు నందున్నది.[1] ఆసక్తిని బట్టి భక్తి పదునొకండు విధములుగా నారద భక్తి సూత్రములు విభాగముచేసినది.[2] అందు కాంతాసక్తి ఒకటి.

కాంతాసక్తి అనగా భగవంతుని భర్తగా భావించుట. సత్యభామ కాంతాసక్తి అనెడు 'ఆసక్తి మార్గము'న కృష్ణుని ఏవేళ విడువక అతనిపై నుండి మనసు మరల్పక, శృంగార జీవితముననుభవించినది.

"జీవికి గల సర్వభావములలోను రతిభావ మత్యుత్కటమైనది. సాధ్య సిద్ధికై దానిలో కలిగెడునంత వాంఛా తీవ్రత ప్రాణి కోటికి మరి దేనియందును కలుగదు. తానారాధించెడి వ్యక్తిలో సంపూర్ణ సంయోగము శృంగారభావములోనే సంభవింపగలదు."[3] సత్య పతిని

---

1. *ప్రసాద రాయకులపతి - ఆంధ్ర భాగవత విమర్శ - పు. 345*
2. *"గుణ మాహాత్మ్యాసక్తి, రూపాసక్తి, పూజాసక్తి, స్మరణాసక్తి దాస్యాసక్తి, సఖ్యాసక్తి, వాత్సల్యాసక్తి, కాంతాసక్తి, ఆత్మనివేదనాసక్తి, తన్మయతాసక్తి, పరమ విరహాసక్తి, రూపా ఏకధా అపి ఏకాదశధా భవతి" - నారద భక్తి సూత్రములు - 5-82.*
3. *ప్రసాద రాయకులపతి - ఆంధ్ర భాగవత విమర్శ - పు. 373*

దైవము, ప్రాణ సదృశ బంధువు, ఏడుగడ అని తలచినది. పతిని కేవలము సాత్త్వికురాలైన ఒక భక్తురాలివలెగాక, శృంగార జీవితానుభవము ద్వార భగవంతునిలో తాదాత్మ్యమును పొందిన భక్తురాలు సత్యభామ. రాజసగుణాధిక్యముచే సత్యలో ఈర్ష్య, క్రోధాది గుణముల అతిశయము కనబడినను, ప్రతి గ్రంథాంతమున శ్రీకృష్ణుడామెకు ఏదో ఒక రూపమున సాత్వికతను కూడ ప్రసాదించినట్లు గ్రహించుచున్నాము. ఈకారణములచే సత్యభామ ఇతర పతివ్రత లెవరికిని తీసిపోని, మహోన్నతమైన పతివ్రతాలలామగ, శ్రీకృష్ణ భక్తురాలిగ, నిర్ధరింపవచ్చును.

## ఆత్మార్పణము :

పతివ్రత పతి జీవించియున్నంత వరకే కాదు, పతి మరణానంతరమును పతినే దైవముగా భావించుచు, లౌకిక విషయ సుఖములను విస్మరించుచు, ప్రాణనాథునే స్మరించుచు, అతనినే అనుసరించును. పతి శారీరకముగ దూరమైనను, శాస్త్రములు విధించిన మార్గమున నడచుకొనుచు, మానసికముగ, అతనికి చేరువలోనే ఉండుట ధర్మపత్ని లక్షణము.

*"కామంతు క్షపయే ద్దేహం పుష్ప, మూలఫలైశ్శుభైః*
*నతు నామాపి గృహ్ణీ యాత్ పత్యౌ ప్రేతే పరస్యతు" ...(మను. 5-157)*

భర్త చనిపోయిన వెనుక పతివ్రత యగు స్త్రీ పరిశుద్ధములగు కందమూల ఫలములతో దేహమును కృశింప చేయుచుండ వలయును గాని, పరపురుషుని నామమైన నుచ్చరింప రాదని పై మనుస్మృతి శ్లోకము పతివ్రతా ధర్మమును చెప్పుచున్నది. భారతము నందలి సత్యభామ, శ్రీకృష్ణ నిర్యాణానంతరము పై విధముగ నడచుకొనినట్లు చిత్రింపబడినది.

'రుక్మిణియు జాంబవతియు లోనగు పద్మముఖులు, కొందఱు', 'అనుమరణమున'కు కోరగా (భార. మౌసల. 1-204) అనగా సహగమనమును కోరగా

"సత్యభామ లోనగు వనితాజను లధిక నియతి వనములకు దపం బొనరింపఁ బూని కొందఱు చనిరి ... .... .... ... (పైది. 205) సంస్కృత భారతమును, రుక్మిణ్యాదులు అగ్ని ప్రవేశము చేయగా, మరికొందరు వనితలతో చేరి, సత్యభామ తపోవనమున కేగి కందమూల ఫలాదులను భుజించుచు తపము చేసినదని వర్ణించినది. ఆ తపము కూడ పతియైన హరిని గూర్చియే.[1]

భారతకాలము నాటికి సహగమనము తప్పని సరికాదు. పాండురాజుతో మాద్రి సహగమనము చేయగా, కుంతి జీవించినది.[2] శంతనుని మరణానంతరము కూడ సత్యవతి మనుగడ కొనసాగించినది.[3] విచిత్రవీర్యుని మరణమునకు పిదపకూడ, అంబిక, అంబాలికలు జీవించి, సంతానవతులుకూడ అయినారు.[4] కావున ఆనాటి నియమానుసారము, సత్యభామ సహగమనము చేసి తీరవలసిన నిర్బంధ మేర్పడలేదు. పైగా శాస్త్రము కూడ భర్తృ మరణానంతరమును, భార్య తపము చేయుచు జీవింపవచ్చునని చెప్పినది. పై వారివలె సత్యయు పతి మరణానంతరము, జీవించియున్నను వారికిని నీమెకును నడుమ గొప్ప భేదమున్నది. వారందరును తమ తమ భర్తల నిర్యాణానంతరము లౌకిక భోగముల ననుభవించుచు జీవించినారు. కాని సత్య లౌకిక జగత్తునకు దూరముగ తపోవనమున కేగి, పతినే దైవముగా ధ్యానించుచు జీవిత శేషమును తపమునందే గడపి, అవతార సమాప్తిని కావించు కొనినది.

---

*1. సం. భార. మౌసల - 7 - 24, 25*
*2. భార - ఆది - 5 - 146*
*3. పైది - ఆది - 4 - 193*
*4. పైది - ఆది 4 - 256, 257*

భారత సత్య, పతి మరణానంతరము తపోవనమున కేగినట్లు వర్ణింపబడగా విష్ణు, బ్రహ్మ, పద్మ, భాగవత పురాణములయందు గోచరించు సత్యభామ, కృష్ణ నిర్యాణానంతరము సహగమనము చేసినట్లు చిత్రితమైనది. పతి శుశ్రూషయం దనురక్తయగు పతివ్రత పతితో సహగమనము పొంది, పతి నుద్ధరించు ననియు, ఇహపరములం దామెకు పాపముండ దనియు గారుడ పురాణము చెప్పుచున్నది.[1]

*"... ... ... పతుల యంతిమ సమయంబు*
*నందుఁజింతఁదక్కి యనుమరణము*
*చేసి రేని సుగతి సిద్ధించు ........"* ...(*భార. అను 5-301*)

అని భారతమున శివుడు పార్వతికి పతివ్రతా ధర్మములను బోధించును. సత్యభామ కృష్ణుని ధర్మపత్ని. ఏవేళ యందైనను, ఎచ్చటికైనను పతిని అనుసరించి వచ్చును. అది సరసమైనను, సమరమైనను, సత్యభామ అతనికి తోడుగ ఉండ వలసినదే. చివరికి భర్తృ మరణానంతరము కూడ సహగమనముచే మగనినే అనుసరించి సుగతిని చేరుకొనిన సహధర్మచారిణిగ పురాణా దులయందు చిత్రింపబడినది.

సంస్కృత విష్ణు పురాణమునందు[2]ను, బ్రహ్మపురాణమునందును[3], పద్మపురాణము నందును[4] భాగవతమునందును,[5] సత్యభామ పతి నిర్యాణానంతరము సహగమనము చేసినట్లుగానే వర్ణింపబడినది. సంస్కృతాంధ్ర హరివంశములును, ఆంధ్ర భాగవతమును కృష్ణ నిర్యాణానంతరము, అష్ట మహిషులేమి చేసిరనుటను గూర్చి తడవనే లేదు. కాని ఆంధ్ర పద్మపురాణము మూలానుసారముగ, 'అమ్మహాత్ము భార్యలగు రుక్మిణియు, సత్య భామయుఁగాళిందియు మిత్రవిందయు, నాగ్న జితియు, జాంబవతియు, సులక్షణయు, సుశీలయు ననువార లెనమండ్రు మహాజ్వలనంబు ప్రవేశించి, నిజ భర్తృశరీరంబుఁ గౌఁగి లించుకొని విగత జీవులై దివ్య విమానారూఢులై సంకర్షణ స్థానంబునకుంజని సుఖంబుండిరి' (సిం. పద్మ. పు. ఉ. ఖం. 10-295) అని వర్ణించుచు, సత్యభామ సహగమనము చేసినట్లుగ పేర్కొనినది. అదే విధముగ "రుక్మిణీ సత్యభామాది భార్య లెనమండ్రును గృష్ణుని తోడ సహగమనంబు చేసిరి" ...(8-270) అని విష్ణుపురాణమును, "రుక్మిణీ ప్రభృతి నారులు నెనమండ్రపు డాహరి దేహంబు నాశ్రయించి హుతవహుజొచ్చిరి" (4-103-388) అని బ్రహ్మ పురాణమును, సత్యభామ సహగమనము చేసినట్లుగానే వర్ణించినవి.

---

1. *గారుడ పురాణము - 51 - 24*
2. *సం. వి. పు. 5-38-2*
3. *సం. బ్రహ్మ. పు. అ . 212-2*
4. *సం. పద్మ. పు. ఉ-ఖం 20 క్రియా యోగ సారకాండ-252 అ-57-9*
5. *సం. భాగ . 11-31-20*

# ఐదవ ప్రకరణము

## సత్యభామ - స్వభావాను శీలనము

మానవుడు సృజనశీలి, మానసిక వ్యాపారము విపరీతముగ నుండువాడు. కావున అతని స్వభావము మార్పులకు లోనగుట సహజము. అతనిపై ఆనువంశిక లక్షణముల, పరిసరముల ప్రభావము కూడ పడుచుండును. అనుకూల ప్రతికూల పరిస్థితుల కారణమున కూడ మానవుని స్వభావమపుడపుడు మార్పులకు గురియగు చుండును. కాని ఎట్టి పరిస్థితులెదురైనను, ఎంత ప్రలోభములు తారసపడినను ప్రతి మానవునిలోను, కొన్ని మౌలికగుణము లెప్పుడును మారక స్థిరముగ నిల్చును. వానినే స్వాభావిక గుణములుగ నిర్ణయింపవచ్చును. దుర్వాసుని కోపమును, నారదుని కలహశీలతయు ఎప్పుడును వారిని వీడని గుణములు. ఇవి వారి మౌలిక గుణములు. అదే విధముగ ఆంధ్రసాహిత్యమునందలి కవులు చేసిన సత్యభామ పాత్ర చిత్రణముల నాధారముగ చూసిన, సత్యభామకు కూడ కొన్ని మౌలిక గుణము లున్నట్లుగ తెలియుచున్నది. ప్రణయ సౌందర్య, ఆభిజాత్య ధనవిషయములందామెకు గర్వమున్నట్లు విదితమగును. సత్యభామలో ప్రధానముగ మానినీత్వము, రాజసము వీరము, వాక్ప్రాగల్భ్యము అమాయికత్వ మనునవి స్వాభావిక గుణములుగ పరిశీలనము వలన తేటపడుచున్నది. సత్యభామలోని ఈ విశిష్ట గుణములే, బహుకాంతాకాంతునికి, ఆమెను ప్రియభామినిగా చేసినవి. ఈ ప్రకరణమున సత్యభామ యందలి విశిష్టస్వాభావిక లక్షణములను, ఉదాత్త గుణములను ఆంధ్రసాహితీవేత్తలు ప్రతిపాదించిన తీరుతెన్నులను సమీక్షించుట జరిగినది.

### ప్రణయ గర్వము :

సత్యభామ ప్రణయ, ధన, సౌందర్య, ఆభిజాత్య గర్వితగ లోకమున ప్రసిద్ధి పొందినది. సాహిత్యలోకమున పెక్కురు కవులామె నావిధముగనే చిత్రించినారు.

స్త్రీకి సౌందర్యము, సంపద, ఉన్నతకులము, మగనికూరిమి మొదలగు గుణములలో నేయొకటి యున్నను ఆమె గర్వించుట సహజము. అట్టి యెడల ఈ విశిష్టగుణములన్నియు నొకే స్త్రీ యందు కేంద్రీకృతమైనచో ఇక ఆ స్త్రీ అహంకారముతో చెలరేగి వర్తించిన, అందెట్టి వింతయును లేదు. మగువలకు ముఖ్యముగ మగని కూరిమియే వాంఛనీయ మగుటవలన, అది కల్గియున్న వనిత మరింత గర్వముతో వ్యవహరించును.

పురుషుడు సంపన్నుడై శక్తిమంతుడై తన ప్రాభవమునకు ప్రతీకగ పలు కాంతలను భార్యలుగ చేపట్టినపుడు, ఆ పురుషుని వశీకరించుకొనుటయే భార్యకు ముఖ్య ధ్యేయమగును. కాని, భర్తృవాల్లభ్యము పొందుట స్త్రీలందరికి సాధ్యముకాదు. ఏ స్త్రీ, భర్తృ వాల్లభ్యము నెల్ల కాలము పొందియుండునో అట్టి కాంత సౌభాగ్యవతిగ గుర్తింపబడును. సత్యభామ అట్టి సౌభాగ్యవతిగ ఆంధ్ర సాహిత్యమునందు చిత్రింపబడినది.

పురాణేతిహాసములలో సత్యను కుల, సౌందర్య గర్వితగ పట్టి చూపు సంఘటన లంతగ కానరాకపోయినను భర్తృవాల్లభ్య గర్వితగ సూచించు సన్నివేశములు మాత్రము పెక్కుచోట్ల చూడగలము. శ్రీకృష్ణుడు, తన పదియారువేల యెనమండ్రు కాంతలలో నందరికన్నను సత్యభామ యెడలనే, అధికమైన అనురాగమును చూపును. అందువలననే సత్యభామలో ప్రణయ గర్వము తొంగిచూచును. సంస్కృత హరివంశము సత్యను "రూపయౌవన సంపన్నా స్వసౌభాగ్యేన గర్వితా" (హరి. వి. ప. 65-50) అని సత్యను, సౌభాగ్య గర్వితగ వర్ణించినది. నేమాని భైరవకవి హరివంశమున, కృష్ణునితో

"నీ విష్ణుఁడవని మదిలో
దేవీసముదయము నెపుడు దీఁలకింపక సం
భావిత మహిమ సమగ్రము
ణావాస శిరంబు తోడ నలరితిఁగాదే" .....(భై : హరి - 5-62)

అను, సత్య మాటలు ఆమె ప్రణయ గర్వీత అనుటనే సూచించును. విష్ణు పురాణమున, సత్యభామ పారిజాత ద్రుమము కావలయునని కోరుచు, పారిజాతము లభించిన, దాని పుష్పములను తాను ధరించుచు, ఒక్కొక్కమారు రుక్మిణీ మిత్రవిందాది భామినులకు తానంపగా, వారు సిగ్గుపడుదురనియు, ఇట్లు తన ఆధిక్యమును నిరూపించుకొనుటకు హరి పారిజాతోత్పాటనము చేయవలయు ననుచు,

"అట్లుగా జేసితేని, అనఘ! నీపాల నాకును జనవు గలదు" (సూ వి. పు. 8-125) అని ఆదేశించునట్లు పలుకును. తాడేపల్లి సీతారామస్వామిగా రనువదించిన విష్ణుపురాణము నందును, జాంబవతి, రుక్మిణి మున్నగు వారికంటె, ఎక్కువ మక్కువ కలుగజేతువని నీవను ఇచ్చకములు నిజమైనచో నా యిష్టము నెరుపుమని అని భర్తృవాల్లభ్యముతో నాదేశించినది.[1] బ్రహ్మపురాణమునందు నిట్టి భర్తృ వాల్లభ్యమును ప్రదర్శించు ప్రణయ గర్వితగానే చిత్రితము. కృష్ణుడు తనపై అధికమగు కూర్మికలదని చెప్పియున్నాడనియు, దానిని సత్య విశ్వసించి యుండుటచే, అద్దానిని నిరూపింపుమని అడిగినది. ఆమె మాటలలో అర్థింపు కన్నను ఆదేశమే యుండుటవలన, మగని కూరిమి తనకే కలదనెడు గర్వము ధ్వనితమగు చున్నది. కృష్ణుడును ఆమె ఆదేశానుసారము ప్రవర్తించుటచే, సత్య గర్వము స్థిరపడినది.

పారిజాతాపహరణ ప్రబంధమునందు

"కులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచునీ
వలనల రుక్మిణీరమణి వాసిఁజెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నా
వలఁబచరింపగా రవరవల్వొడమె న్మది వారికెంతయున్" ....(పారి-1-42)

అని రుక్మిణీ సత్యల, నడుమ నేర్పడిన ఈర్ష్యాసూయలకు కారణము వివరింపబడినది. మగని కూరిమి కలధానని రుక్మిణి వాసి చెలంగినను నిజమునకు సత్యభామకే అది ఉన్నది. కవి తిమ్మనయే "వారి లోపల" "మహనీయ సౌభాగ్యవతియునైన సత్య" (పైది 1-70) అని సత్య సవతులందరిలో గొప్ప సౌభాగ్యవతి అని వర్ణించినాడు. సౌభాగ్యమనగా "గొప్ప భర్తృ వాల్లభ్యము" కలది.[2] వాల్లభ్యమనునది మగని కూరిమి అధికముగా గల స్త్రీకి మాత్రమే దక్కునట్టిది.

"ఇన్ని దినంబులు స్సవతులందరఅలో నల సత్యభామ క
న్సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యనవిందు" .....(పైది 1-65)

అని నారదుడనును. అంతేకాదు "పతి యెంతయు నాకనురక్తుఁడంచు దా నిక్కుచు విఱ్ఱవీగుచు సత్యకాంతలను గణింపదని కూడ విమర్శించినాడు. (పైది 1-66). దీనినిబట్టి సత్యభామకు ప్రణయ గర్వమున్నదనుట స్పష్టము. సత్య దానిని తన మాటలలోను చేతలలోను ప్రదర్శించినది కూడ. పారిజాతమును తన నాథుడు సవతి కిచ్చినాడని తెలిసి, అతడు మున్ను చూపిన ప్రణయము నంతయు స్మరించుచు,

---

1. 'తా. సీ. వి. పు. - 5 - 4 - 126
2. దూసి రామమూర్తి - పారిజాతాపహరణము - సురభి వ్యాఖ్య - పు. 56

*"ఇన్ని దినంబులున్సవతులందరలోఁ గడుగారవంబునం,*
*గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁగప్పుకొనంగ నుండె"* ......(*పైది 1-88*)
నని చెలితో అనినది. అంతేకాదు కలలోనైన నవ్వులకైన తన మాట జవదాటడనియు, ఏ పదార్థంబు తన యెదుట పెట్టక మున్న, యెవ్వారి కొసగడనియు, చెలులు తనతో నేమి చెప్పుదురోయని లంచంబులిచ్చుననియు, తోడిచేడియలు తనతో వంతునకు రాగా, సయిరింప జాలడనియు కూడ అనినది. ఈ మాటలును సత్యకు గల ప్రణయ గర్వమునే సూచించును. ఈ మాటలు ఆమె గర్వముతో చెప్పిన అతిశయోక్తులు కావు. రుక్మిణి యింట నుండువేళ, అపురూపమైన దివ్య పారిజాతము లభించిన తరి, హరికి ఎదుటనున్న పట్ట మహిషికి ఆ పుష్పమును వెంటనే ఈయక, ఎచటనో యుండు సాత్రాజికి 'ప్రేమంబంపిన' బాగుండునని తలంచినాడు. (పారి 1-54) అట్లు పంపుట వలన అగ్రమహిషిని చులకన చేసిన జాడదోచునని సంశయించి, ఆమె యింట తానుండుట వలన ఆమెకే దానినిచ్చుట ఉచితమని తలచి, మునినాథుడు కనుసైగచే, ప్రోత్సహింపగ, దానిని ఆమెకు ఇచ్చినాడు. ఇదే, సత్య యింట ఆ దివ్య పుష్పము లభించియుండిన ఎట్టి ఆలోచనలకు అవకాశమీయక వెంటనే ప్రియసతి సత్యకే యిచ్చి యుండెడివాడు. కావున సత్యభామ పతికూరిమి విషయమున గర్వించుట, సమంజసమేయగును. ఖండితయై ఆమె, పరుషోక్తులాడినను, మ్రొక్కిన తన శిరమును ఆమె వామపాదముచే తొలగ ద్రోసినను కృష్ణుడు కుపితుడు కాలేదు. మీదు మిక్కిలి ఉద్దీపిత మన్మథ రాజ్య ప్రాపితుడై ఆమెకు తాను దాసుడనని ప్రకటించు కొనినాడు. నారదుడును కృష్ణుని అసమాన ప్రణయమును గమనించియే పతి నీవై విహరించు చున్నావనియు, అని కైనంబతి నిన్ను బాసి చనడనియు, ప్రాణంబు ప్రాణంబుగా మన్నించుననియు, నీ మనోరథంబులను నెయ్యంబుతో చేయుననియు ప్రశంసించినాడు. పారిజాతోత్పాటన సమయమున అడ్డుపడిన వన పాలకులను హెచ్చరించుచు వారిముందు తన పతియు జగత్పతియునైన కృష్ణుని, 'సత్యభామా విధేయుని'గ ప్రకటించినది. (పైది 4-58). ఈ మాటలు, అహంకార పూరితములైనవిగ మన కనిపింపవచ్చును. కాని కృష్ణుడు, సత్యభామ ఆజ్ఞాబద్ధుడై పారిజాతోత్పాటనము చేయుటయు, పుణ్యకవ్రత సమయమున, సత అభీష్టానుసారము దానమీయబడుట కీయకొనుటయు చూడ అతడు సత్యభామ విధేయుడనుట స్పష్టము. కావున సత్యభామ పతి కూరిమి విషయమున గర్వించుటలో అనౌచిత్యము కాని అసంగతముకాని ఏ మాత్రము లేదు.

విష్ణుమాయా నాటక ప్రబంధమున సత్యభామ "పర మహితాత్ముఁడై విభుఁడు పాయ గర్వము గల (1-150) ప్రణయ గర్వితగా చిత్రింపబడినది.

*"నాతోఁగూడి విభుండు సంతత మునున్నాఁడిట్లు ప్రేమోల్లస*
*చ్చేతో మోద మెలర్ప దీనికి మదిన్ సిగ్గెన నెట్లున్నవా*
*రో తర్కింపగ రుక్మిణీ ముఖవరారోహల్ తదుద్యోగముల్*
*చూతామందు దరస్మితాంశుకలనాను స్మేర వక్త్రాబ్జయై"* ..(విష్ణు. మా. నాట. ప్ర-1-14
సత్య, తన చెలులతో అపురూపమైన దివ్య పారిజాత సుమములను సవతుల కిచ్చి రమ్మ ముఖ్యముగ, రుక్మిణి "వ్యాపారము తలఁపును గని, రా పొమ్మ"ని ఒక చెలిని రాజ మొప్ప అనతిచ్చి పంపినది. ఎవరికిని లభింపని పారిజాతమును పతి, తనకు మాత్రమ నిచ్చుటచే సత్యకు గర్వమతిశయించినది. కృష్ణుడు, మాయచే రుక్మిణ్యాది కాంతలకు మాయ వృక్షముల నిచ్చి కొంతనాటక మాడినను, సత్యకు మాత్రమే నిజమైన కల్పనగ మి యున్నాడు. కావున సత్యభామ ప్రణయ గర్వము నందనౌచిత్య మేమాత్రమును లేదు.

చంద్రభాను చరిత్రయందు "అశేష భామినీ, వలయుమునెల్ల నీవు నెఱవంచనసేయ నన్ను నెంచియే" (4-39) అని స్వాధీనుడై వర్తించు శౌరిని ఆత్మవిశ్వాసముతో నడు సత్య ప్రణయగర్వితయే అగును.

భామాకలాపమునందు, ప్రారంభములోనే

"భామనే పదియారువేల కోమలులందరిలోన

*రామరో గోపాలమూర్తికి, ప్రేమ పాత్రమైన సత్యా //భామనే// .....(పుట. 13)*

అని ఇట్లు ప్రణయ గర్వముతో తనను తాను పరిచయము చేసికొను సత్య సాక్షాత్కరించును.

"... ఏనాడైన

*వేగమే తావచ్చి చెలదీ రమ్మని బిలిచి అలమి కౌగిట చేర్చునే*

*ప్రాణేశుడు అలమి కౌగిట చేర్చునే*

*తీరైన కస్తూరితిలకము నుదుటిపై కొన గోరున దిద్దునే ...(భామా. పు. 25, 26)*

అని విప్రలబ్ధయై, తన ప్రియకాంతుడు తనకు చేయుచుండిన సేవలను చెలిముందు గర్వముతో స్మరించు చుండినది. శ్రీకృష్ణుడును మొదట, సత్యను విరహమునకు గురిచేసినను, చివరకా ఖండితా సాంత్వనమునకై అరుగుదెంచి, ఆమెను అనుగ్రహించినాడు. కావున ఇందును ఆమె ప్రణయ గర్వము అసంబద్ధమైనది కాదనుట స్పష్టము.

'సతీపతిదాన విలాస యక్షగానమున,' నారదుడు, పురుషదానము గురించి వివరించుచు, "ఇందులకు పురుషుడు స్త్రీకి లోకువైయుండిన నీదానము కొనసాగున"ని అనగా, సత్య "నేనేది చెప్పిన నది వినును. కృష్ణుడు ఇప్పుడు తనకే లోకువై యున్నాడు" (పు.7) అని నిర్లక్ష్యముగా అనుటయు, కృష్ణుని దానమిచ్చినందులకు తనను మందలించు సవతులతో, కృష్ణుడు తనకు మాత్రమే సొంత మనునటులు 'శ్రీకృష్ణుడు తన సొమ్ము గాదటె' (పుట. 12) అని పోట్లాడుటయు సత్యను ప్రణయ గర్వితగానే నిరూపించును.

శ్రీకృష్ణతులాభారనాటకమున సత్య ప్రముఖముగ ప్రణయ గర్వితగనే చిత్రీకరింపబడినది. శ్రీకృష్ణుడు "అందరి కంటె నెక్కుడుగా బ్రేమింతు ననుటకీ పారిజాత వృక్షము సాక్ష్యము గాదా?" (పుట-17) అనియు మరి యింక ననేకములు తన నిస్తుల ప్రేమను సూచించునట్టివి గలవనియు అనుచు, 'ఎన్నిసారులీ విషయము గూర్చి నుడువ వలయు' నని అనగానే, సత్యభామ "ఇట్టి వార్తలెన్ని పర్యాయములు విన్నను నింతులకు వెగటగునా"? (పైది) అని ప్రణయ గర్వముతో సమాధాన మిచ్చినది. రుక్మిణి పుట్టిన దినపు విందునకై ఆహ్వానింపబడిన పతిని, సత్య నిరోధించగ, జాంబవతి కోపమొంది, కృష్ణునకు తమ పూజా పునస్కారముల కన్నను సత్యభామ తన్నులే వేయి మడంగులు కామ్యంబులు, సహ్యంబులని అతనిని విమర్శింప, సత్య

*"తాను వలవని సతి మహాదరము కంటెఁ*

*దాను వలచిన సతి కాలితన్నె మేలు*

*తాను వలవని సతి, ఘనస్తవము కంటె*

*తాను వలచిన సతి వ్రల్లదమ్మె ప్రియము" ...(శ్రీకృష్ణ తు. నాట. పు. 25)*

అని, పతి అందరి కాంతలకన్నను తనపైనే ఎక్కుడగు కూరిమి కలవాడని ధ్వనించునట్లు గర్వముతో, సమాధాన మిచ్చినది. సత్యలోని ప్రణయ గర్వమును గుర్తించిన నారదుడు, సత్యాదేవి ప్రాణేశ్వరు సంపూర్ణానురాగంబు తన యెడల గలదని చీటికి మాటికి దన సపత్నులతో దగవు లాడుచుండునని తలచి, సత్యకు ప్రణయ గర్వభంగము కల్గించి, గుణపాఠము నేర్పవలయునని, నిర్ణయించుకొనును. పానుగంటి వారి రాధా కృష్ణ నాటకమునను "అనురాగబంధమున బాహుబంధమున, నాజ్ఞా బంధమున నాథుని గట్టివైచితిని. రుక్మిణికి నేర్పు తక్కువ." (పుట 19) అని ప్రణయ గర్వముతో విఱ్ఱవీగు సత్య కనిపించును. కాని చివరకు భక్తురాలగు రాధ వలన, కృష్ణుడు ప్రణయముకన్నను భక్తికే వశమగునను సత్యమును గ్రహించును.

నాటకాదులలో సత్య ప్రణయ గర్వము కొంత శ్రుతిమించియున్నను, పురాణ ప్రబంధాదులలో మాత్రము సముచితముగానేయున్నది. సత్యకు గల నిండైన ఆత్మవిశ్వాసమే ఆమెనట్లు పలికించినది, ప్రవర్తిల్లునట్లు చేసినది. శ్రీ కృష్ణుడు ప్రేమతో ఆమె పనిచిన పనులను చేయుచు, అణగిమణగి నడచుకొనుచుండుట వలననే ఆమె కట్టి ఆత్మవిశ్వాసము బలపడి, చూచువారికి, అది గర్వాతిశయమువలె గోచరించినది.

## సౌందర్య గర్వము :

సత్యభామ తన సౌందర్య విషయమున అమిత గర్వము కలదిగ లోకము భావించును. కొందరు కవులు నట్లే చిత్రించి యున్నారు. భైరవకవి హరివంశమున "సలలితరూప యౌవన విశాల సముచ్ఛ్రయ మత్తచిత్త" గ (5-31) సత్య వర్ణింప బడినది. రూప విషయమున సత్యకు గర్వమున్నట్లుగనే ఈ పై వర్ణన సూచించుచున్నది. ఇది తప్ప, సత్య సౌందర్య గర్వితయనుట తదితర పురాణేతిహాసములం దెచటను స్పష్టముగ సూచింపబడలేదు. కాని తిమ్మన ప్రబంధమునందు ఆ విషయము స్పష్టముగ చెప్పబడినది. కులమును రూపమున్నగని కూరిమియుం గలదాననంచు" (1-42) రుక్మిణీ సత్యభామ లిరువురు నెవరికి వారు గర్వించుచు మదిని ఈర్ష్యలు పెంచుకొనిరట. రుక్మిణి రూప విషయమున గర్వించినను, నిజమునకు రుక్మిణిని మించిన సౌందర్యవతి సత్యభామ యనుట పలుచోట్ల రుజువగు చున్నది. "వారిలోపల సౌందర్యవతియు నైన సత్య" (పైది 1-70) అని సత్యా పాత్ర పరిచయము చేయుచు కవి, సత్యను సవతులందరిలోను 'సుందరి' యనుటను స్పష్టము చేసినాడు. రుక్మిణీ కృష్ణుల ముందు సత్యభామను విమర్శించుచు నారదుడు,

*"చక్కని దాననంచు నెలజవ్వనినంచు జగంబులోనఁ బే*
*రెక్కినదాననంచు బతియెంతయు నాకనురక్తుఁడంచు దా*
*నిక్కుచు విఱ్ఱవీగుచు గణింపదు కాంతల సత్య...."* ..... *(పారి-1-66)*

అని అనినాడు. అతని మాటలనుబట్టి సత్య, ఎలజవ్వనము, సౌందర్యముల కారణముగ సవతి కాంతలను లెక్కచేయుట లేదనియు కూడ తెలియుచున్నది. ఇట్లు సత్య సౌందర్య గర్వితగ ఇందు సూచింపబడినదేకాని సత్య తనంత తానై సౌందర్య గర్వముతో సంభాషించిన లేక, ప్రవర్తించిన ఘట్టములిందు కనిపింపవు.

విష్ణుమాయా నాటక ప్రబంధమున సత్య "శోభనయౌవన గర్వము" కలదిగ (1-150) చిత్రింపబడినది

సత్య నిత్య యౌవనవతి యగునట్లు అదితివలన వరము పొందినదని హరివంశ విష్ణు పురాణాదుల వలన స్పష్టము. స్త్రీలు యౌవనావస్థయందు, రూపవంతులై పురుషులయొక్క వల్లభత్వమును పొందుచున్నారు. యువతులకు తారుణ్యమే మూలము. దాని ఆధారముచే, భోగములు, కోరికలు మనోనుకూలముగ అనుభవింతురు.

పురాణేతిహాస ప్రబంధములలో సత్య తన సౌందర్య గర్వమును బాహాటముగ ప్రదర్శించుట గాని, ఆ గర్వకారణముగ ఇక్కట్లకు లోనైనట్లుగా గాని లేదు. కాని భామాకలాపపు సత్యభామ, తన సౌందర్య గర్వ ప్రదర్శనముచే పతికి కొంత కాలము దూరమై విరహముచే తపింప వలసివచ్చినట్లుగ చిత్రింపబడినది. ఒకానొకనాడు ఏకాంతమున పడకటింట హంసతూలికా తల్పమునందు సత్య, పవళించియుండగా, స్వామివారు గృహంబునకు వచ్చి, నిదురలేపి, తొడపై గూర్చుండ బెట్టుకొని, ఆమెచే సమస్తాభరణంబులు ధరింపచేసి తానుకూడ ధరించుకొని, యొక నిలువుటద్దము ఎదుట నిలబడి ప్రతిబింబములు చూపి "సత్యభామా! నీవే చక్కనిదానవా, నేనే చక్కనివాడనా?" అని అడుగగా, సత్యభామ, "నేనే చక్కనిదాన"

నని (పుట-21) అనినది. అంతట స్వామివారికి ఆమెపై మిక్కిలి కోపము వచ్చి లేచి, ఆమె సవతి చెంతకు పోయెను. అంతట సత్య, విరహముచే తపింప నారంభించినది. కాని సత్య కృష్ణున కిచ్చిన సమాధానములో నసత్యమేమియు లేదు. "మేము స్త్రీలము గనుక ఆడబుద్ధి, యపర బుద్ధి గనుకను అబలల మగుటచేత, దెలియక నేనే చక్కనిదాననని యంటినే సఖీ!" అని పశ్చాత్తాపపడినది. "అపరబుద్ధి యేమి? సరియైన సమాధానమే యొసంగితివి" అని అనుచు చెలి, కృష్ణుని కన్నను సత్య 'సుందరరూప' యనుటను సమర్థించినది. సత్యలో కలిగిన పశ్చాత్తాప మామెసంస్కారమును, నిర్మలచిత్తమును ద్యోతకము చేయును.

నాటకములందును సత్య, సౌందర్య గర్వితగ చిత్రింపబడుట కనిపించును. "మీర జాలగలడా నాయానతి వ్రత విధాన మహిమన్ సత్యాపతి"[1] అనెడు కృష్ణ తులా భారములోని సత్యభామ, ప్రణయ గర్వితయే. తన, అనురాగ, బాహు, ఆజ్ఞా బంధములతో పాటు సౌందర్యముచేతను భర్తను తాను కట్టి వేసికొనగల్గితిననియు, రుక్మిణికి అట్టి చాతుర్యము లేదనియు "రూపమున మాత్రమంత విశేష మేమున్నది" (రాధాకృష్ణ-పుట-19), అని పరిహాసముగ అనుటయు, రాధ సౌందర్యవతియనుటను అంగీకరింపలేక "గొల్లదానికి సౌందర్యమా?" (పైది. పుట 20) అని ఎగతాళిగ అనుటయు, సత్యను సౌందర్యగర్వితగానే స్థాపించును.

కాని పురాణేతిహాసము లందంతగా కనిపింపని సౌందర్య గర్వము, తరువాతి కవుల వర్ణనలలో, ఆదరణను పొంది, సత్యభామను సౌందర్య గర్వితగ ముద్ర వేయించినది. కాని స్వాభిమానము వలనను, అహంకారము వలనను తాను సౌందర్యవతినను భావము, మలినమగుటచే చివరకు, కృష్ణుడు దానిని తొలగించి, ఆమెను సాత్త్వికగుణ ప్రధానగ మార్చుట పలుతావుల గోచరించును.

## ఆభిజాత్య గర్వము :

సత్యభామకు ఆభిజాత్య గర్వమున్నట్లు పురాణేతిహాసము లేవియు తడవక పోయినను, ప్రబంధాదు లీగుణము సత్య యందున్నటుల సూచించినవి. పారిజాతాపహరణ ప్రబంధము రుక్మిణీ సత్యల నడుమ రవరవల్వాడముటకు 'రూపము, మగనికూరిమియేగాక 'కులము' కూడకారణమైనట్లు చెప్పినది. రుక్మిణికి వలెనె సత్యయు, కులమును రూపమును మగని కూరిమియుం గల దాననంచు అతిశయముతో పచరించినది. సత్య వృష్ణివంశజ. కృష్ణుడును వృష్ణివంశజుడే. వీరందరికిని యదువే మూలపురుషుడు. పతియగు కృష్ణుడు గోకులమునందు పెరుగుటచే అతడు గొల్లవాడను ఒక చులకన భావము ఆమె, లోలోన, ఎచటనో ఒకమూల యొదిగి యున్నట్లనిపించును. అది అన్నివేళల ప్రకటీకృతము కాక పోయినను, పతి యేనాడైన తన యెడ ప్రణయాపరాధము కావించి, మనసు నొప్పించిన వేళ, మనసునందు దాగియున్న 'తాను క్షత్రియకాంతను, ఉత్తమ కులజ' నను ఆభిజాత్య గర్వము పొంగిపొర్లి వచ్చుచుండును.

చెలివలన, పారిజాతపుష్ప ప్రదానేతివృత్తాంతము వినగానే సత్య, పరపురుషుడైన కలహాశనుడు, రుక్మిణి యింటికై వచ్చి, తనను గూర్చి తక్కువచేసి మాట్లాడుచుండగా, కృష్ణుడద్దానిని చెవి యొగ్గి వినుట అన్నిటికన్నను పెద్ద ద్రోహముగ భావించి,

*"ఏమేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా*
*యామాట ల్చెవియొగ్గి తావినియెనా యాగోపికావల్లభుం, డు" .....(పారి. 1-83)*

అని మండిపడినది. ఇచట కృష్ణుని హరియనిగాని శౌరియని గాని పతి యని గాని అనక గోపికా వల్లభుండనినది. గోపికావల్లభు డనుటచే కృష్ణుడు ముగ్ధలైన గొల్ల యిల్లాండ్రవల్లభుడు,

---

*1. ముత్తరాజు సుబ్బారావుగారి శ్రీకృష్ణ తులాభార నాటకమున స్థానం నరసింహారావుగారు వ్రాసి, చేర్పిన గేయమిది.*

కావున అతనికి క్షత్రియ కామినీపతుల కుండదగిన ఉదాత్త గుణంబు లుండనేరవని సత్యభామ ఉద్దేశము. పుష్పమునిచ్చుటలో ముని తప్పు లేదనియు, రుక్మిణిని దూషించుటలో అర్థము లేదనియు, సమర్థించుకొనగలిగిన సత్య, కృష్ణుని మాత్రము క్షమింపలేక, "ధూర్తగోపాలుఁడు సేసిన చెయిద మేమి చెప్పుదు" నని కృష్ణుని ధూర్తత్వమును నిందించినది. ఇచటయు, ప్రాణవల్లభుని గోపాలుడనుచు కులపరముగానే పేర్కొని, అతడు తనవలె ఉన్నత వంశజుడు కాకపోవుటచేతనే అనాగరికముగ ప్రవర్తించినాడనియు, పసుల కాపరికి నుత్తమ గుణములుండ నేరవనియు ధ్వనించునట్లు, పేర్కొనినది.

సత్య పురాణాంగనయే కావచ్చును. కాని ఆమెలో నాగరిక ప్రవృత్తి మిన్నగనున్నది. ఖండితయై కోపగృహమున కేగిన సత్య మూలమున ఎఱ్ఱని చందనమును నుదుటిపై పూసికొనినట్లుండగా[1] తిమ్మన ప్రబంధమున "కస్తూరిపట్టు పెట్టి"నది (పైది 1-99). కస్తురిపట్టుపెట్టుట సత్య భోగాభిలాషను ఉదాత్తాభిరుచిని తెలియపరచును. ఈర్ష్యా క్రోధాతిశయములతో, పతి కట్టెదుట ఏడ్చునపుడును, గిరికవలె బావురమని యేడువక, "పంకజశ్రీ సఖమైన మోముపయిఁ జేల చెరంగిడి "కాకలీ ధ్వనితో" నేడ్చినది. ఈ నాగరికత, ఆమెకు ఆభిజాత్యము వలననే సంక్రమించియుండును. గిరిక కొండరేని కూతురగుట వలన, నాగరికత యెరుగక ఎల్గెత్తి యేడ్చినది[2] .. ఇట్లు సత్య మాటలలో చేతలలో చివరకు ఏడుపులో కూడ నాగరికతను ప్రదర్శించు చుండును. కాని ఇట్టి నాగరిక ప్రవృత్తితో నడచుకొను సత్యకు కృష్ణుని ప్రవర్తనలో నాగరికత యేమాత్రము కనిపింపలేదు. అతడు గొల్లవాడు, పసుల కాపరియు, గొల్లకాంతలకు వల్లభుడగుటయే యిందులకు కారణమని యామె విశ్వాసము. అందుచేతనే, తనను సాంత్వనపరచు పతిని చూచి "ఎరుంగనే పసులకాపరి భావజ మర్మకర్మముల్" (పైది 1-125) అని అతని అరసికత నీసడించుకొనినది. "వల్లవీకింకర" (పైది 1-126) అని సంబోధించి, అతని గ్రామ్యతను ఎగతాళి చేసినది. ఆధునిక ప్రబంధమైన "సాత్రాజితీ పరిణయము" నందు విరహతప్తయైన సత్యతో, ఆమె ప్రియుడైన కృష్ణునికి తన మనసు నెరింగించుచు ప్రియంబుమీర లేఖ నొకదానిని వ్రాసి పంపుమని ఆమె చెలులు పదేశింప, "అభిజాత్య ధన్యలగు కన్యల కిట్లొనరింపజెల్లునే" (4-112) అని ఆభిజాత్య గర్వముతో ప్రశ్నించును.

భామాకలాపమునందును ఖండితయైన సత్యను కృష్ణుడు సాంత్వన పరచుటకై రాగా, సపత్నీమాత్సర్యముతో అతనిపై నేరములు మోపగా, కృష్ణుడు గత విషయములను స్మరించుచు

*"సావధానంబుగా సత్యరోవినుము*
*యెవరినేమన్నావో యెరుగవా? నీవు*
*గొల్లవాడనటంచు కులములేదంచు*
*నెల్లలోకము విన నీవాడినావు" .....(భామా-పు 85)*

అని సత్య ఆభిజాత్య గర్వమును విమర్శించును. కాని, సత్య అందుల కేమాత్రము భయపడక

*"ఎల్లజనులు నిను గొల్లని పిలువగ*
*నేమనమందువో తెలియదు నాసామి" (పైది)*

---

*1. 'బధ్వా లలాటే హిమచంద్ర శుక్లం, దుకూలపట్టం ప్రియరోషచిహ్నమ్ పర్యంతదేశం సరసేన దేవీ, విలివ్య సా లోహిత చందనేన" ..(హరి. వి. ప. 65 -53)*

*2. వసు చరిత్ర - 4-52*

అని నెరజాణతనముతో తనను సమర్థించుకొన చూచును. ఇందును సత్య పతివ్రత యేయయ్యు, ఇప్పట్టున కోపన యగుటచే నిట్లనినది. కాని, చివరకు పతిని భగవంతునిగ గుర్తించి అర్చించినది. ధనవంతుడు, సుక్షత్రియుడు, సద్వంశీయుడునగు సత్రాజిత్తునకు కూతురనను గర్వము ఆమెలో నిండుగనున్నట్లును చిత్రింపబడుట చూడగలము. అక్కనామాత్యుని బాలకృష్ణవిలాస యక్షగానమునందు "సిరుల వెలయు సత్రాజిత్తు పుత్రినే" ....(పుట. 121) అని గర్వముతో తనను చెలిముందు పరిచయము చేసికొనును.

నాటకాదులయందు నీమె ఆభిజాత్యగర్వమును వర్ణించుటను కవులు విడువలేదు "దీపావళి నాటకము"న సత్య, తన శౌర్య ధనమును చూపి పతిని రక్షించుకొను సౌభాగ్య సావకాశముచే, శాశ్వతముగ నాతనిని 'సత్యావిధేయునిగ' చేసికొనవలెనని తొందరపాటును చూపింపగ, కృష్ణుడది గమనించి "మనసుండిన మార్గమే లేకపోవునా?" అని దూరదృష్టితో పలుక, ఆ మానవతి "అసత్య మార్గము లాశించ దీసత్యభామ. సాత్రాజితి కాభిజాత్యమే శౌర్య ధనము" (పు. 55) అని గర్వముతో సమాధానమిచ్చును. "నీ అభిజాత్యమే నాకు ఆశ్రయము" అని ఆ మానిని ఆభిజాత్య గర్వమును ప్రశంసించును. నారదుని వలన నరకుడు మానినులను మానహీనులుగ చేయుచున్నాడని విని, ఆ మానిని కోపముపొంది "సుక్షత్రియ వంశ జాతయైన తాను, "మానినుల నవమానపరచిన అమ్లాన హృదయుని మరణము కనులార చూచి తీరవలసినదే" (పైది 60) అని బయలుదేరును.

"రాధాకృష్ణ నాటకమున" ప్రణయ గర్వాంధ, సౌందర్యకుల గర్విత, నవ వధువగు సత్యకు, రాధ గొల్లదనెడు చులకన భావమున్నది. రాధ, చక్కనిదని చెలి పేర్కొనగానే, సత్య "గొల్లదానికి సౌందర్యము, కోమటివానికి దాతృత్వమునా?" (పుట. 20) అని ఆభిజాత్యగర్వముతో ఎగతాళి చేయును. కృష్ణుడు రాధకు వశుడని చెలి వలన తెలిసికొనినంతనే "హా! ఎంతగతి పట్టెను? నావంటి మహారాజ పుత్రికను, నావంటి యసమాన విలాసవతి నీబానిస సవతియని పిలువవలసి వచ్చెనా? కాలమహిమ!" (పైది పుట 24) అని తన ఆభిజాత్యమునకు హాని కల్గినదని కుమిలి పోయినది.

జానపదుల పాటలయందును సత్య ఆభిజాత్య గర్వితగ చిత్రింపబడినది. వాసకసజ్జికయైన సత్య కడకు, కృష్ణుడాలస్యముగ రాగా,పరకాంతా సంభోగ చిహ్నములతో వచ్చిన పతిని చూచి ఖండితయైన సత్య

*"సత్రాజిత్తునకును లోకప్రఖ్యాతి -లోకప్రఖ్యాతయున రాజకూతుర్నీ*
*గుణము యెరుగనివాని తెచ్చుకుంటిని - పసులకాపరివైన మమకారమేమొ*
*గొల్లబోయెడ వగుచుయున్నవాడావు - అదియాలపోయాను అది గొల్లబుద్ధి"*
*..(సత్యభామ సరసము - పుట. 174)*

అని తన ఆభిజాత్యౌన్నత్యమును, కృష్ణుని గొల్లజాతి యెడ ఈసడింపును ప్రకటించినది.

ఇట్లు అభిజాత్య గర్వమును ప్రదర్శించినను అది ఇతరుల కెట్టి ప్రమాదమును కల్గింపలేదు. మాన హాని కల్గినప్పుడిట్లు ప్రవర్తించినను తన పతిని భగవంతునిగ గుర్తింపగానే, ఇతరుల ఔన్నత్యమును గ్రహింపగనే ఆ గర్వమును తొలగించుకొని సాత్విక చిత్తముతో ప్రవర్తించుటయు నంతట చూడగలము.

## ధన గర్వము :

సత్యభామ ధన గర్వితగ పురాణేతిహాసములందు కనిపింపదు. కాని లోకమునందు మాత్రమీమె ధన గర్వితయైనట్లు ప్రచారమున్నది. పురాణేతిహాసము లామెను భాగ్యవంతురాలిగ మాత్రమే చిత్రించినవి. ఆంధ్ర భాగవత వర్ణనను బట్టి పుట్టింట సత్య

'మంగళాచారణంబైన' గృహంబున పెరిగిననదిగ భావింపవచ్చును. దినమున కెనిమిది బారువుల బంగారము నీను శమంతకమున కధికారిణియైన సత్రాజిత్తను భాగ్యశాలికి, తనయయై వరలినది.

మెట్టినింటయు సత్య భాగ్యవంతురాలిగానే మనినది. యాదవ ప్రభువైన కృష్ణుని భార్యయగుటచే సత్య ఐశ్వర్యమునకు కొదవేమున్నది? ద్వారకలోని సత్యా గృహము "విచిత్ర సోపానములు గల భోగాలయమగు సౌధమని' మూల హరివంశము వర్ణించినది[1]. తెలుగున పారిజాతాపహరణ ప్రబంధమున సత్య "కాంచన సౌధ వీధి" యందు (1-104) వసించు చుండినట్లు వర్ణితము. ఆమె గృహమున కనక పంజరములోని శారికలకు చదువు చెప్పుటతోను, కరతాళగతుల మందిర మయూరముల నాడించుటతోను, వీణావాద్య వాదనముతో, కలికిరాయంచ బోదియలను నెలయించి నడిపించుటతోను (పైది 1-106) కలకలలాడు చుండును. విష్ణు మాయానాటక ప్రబంధమున సత్యవాసము "చంద్రపాద నిర్మల కలధౌత సౌధమణి" (1-139) అని ప్రశంసింపబడినది.

జానపద సాహిత్యమున "పాలూనెయ్యి స్తంభాలామేడ" (రుక్మిణీదేవి సీమంతము - పుట 164) అని వర్ణింపబడినది. ఎవరేవిధముగ వర్ణించినను సత్య గొప్ప ఐశ్వర్యవంతు రాలనుటనే ఈ వర్ణనలు నిరూపించును.

సత్యభామ ధన గర్వితగ యక్షగానాదులందు మాత్రము చిత్రింపబడినది. పురాణేతి హాసములందీ విషయము సూచన మాత్రముగ కూడ లేదు. శమంతకము కారణముగ సత్య గర్వించినట్లు లోకమున ప్రసిద్ధమై యున్నది. పారిజాతాపహరణ ప్రబంధమున, మానవతియైన సత్య, పారిజాత విషయకముగ తనకు జరిగిన అవమానమును భరింపలేక ప్రాణ త్యాగము చేయదలచియు, "ఉవిద యెవ్వతె నోచియున్నదో యీ శమంతక రత్నమింక నొ౽దల ధరింప" అని, తనకడనున్న శమంతకమే సవతికి దక్కునో అని తలచి భయపడినట్లు మాత్రమే వర్ణింపబడినది. శమంతకమును గూర్చి "శమంతకమను పేరు గల మణి, దీనిని గృష్ణుడు జాంబవంతుని యొద్దనుండి తెచ్చి సత్యభామ కిచ్చెనని భాగవతము నుడువుచున్నద"ని కుప్పుస్వామయ్యగారు వ్యాఖ్యానించినారు![2] కాని భాగవతమున కృష్ణుడామణిని తెచ్చి సత్రాజిత్తున కీయగ, అతడు తన తనయతో కూడ మణిని కృష్ణున కర్పింప, కృష్ణుడు మణిని వలదని, సత్యను మాత్రమే స్వీకరించినట్లు సంస్కృత,[3] తెలుగు, భాగవతములు[4] రెండును చెప్పుచున్నవి. శతధన్వుడు సత్రాజిత్తును చంపి అపహరించిన మణిని,అక్రూరుని యొద్ద దాచియుంచ, కృష్ణుడు శతధన్వుని వధించి, ఆ తరువాత, అక్రూరుని వలన నుండి మణిని గ్రహించియు తిరిగి దానిని అతనికే ఇచ్చి వేసినటులు సంస్కృత[5] తెలుగు భాగవతము[6]లు నుడువుచున్నవి. కావున పై కుప్పుస్వామయ్యగారి అభిప్రాయము సరికాదనుట నిర్ధరింపబడుచున్నది. సంస్కృత తెలుగు హరివంశ[7] విష్ణు పురాణము[8]లలోను మణిని తిరిగి కృష్ణుడు అక్రూరుని కిచ్చినట్లే వర్ణింపబడినవి. సంస్కృత పద్మ పురాణమునందు

1. 'హరి - వి - ప - 98 - 43
2. పారిజాతాపహరణము - పరిమళోల్లాస వ్యాఖ్య - పుట. 73
3. సం. భాగ - 10 - 56 - 44
4. భాగ - 10 - ఉ. భా. 82
5. సం. భాగ - 10 - 57 - 41
6. భాగ - 10 - ఉ. భా. 101
7. సం. హరి. వి. ప - 39 - 39; హరి - పూ. భా. 3 - 244
8. సం. వి. పు - 4 - 13 - 158, 159; సూ. వి. పు - 6 - 345

మాత్రము సత్రాజిత్తు మణిని సత్యభామ కిచ్చినట్లు కలదు.[1] దీనినాధారముగ చేసికొని కాబోలు ఆ తరువాత కవులు తమ తమ గ్రంథములందు శమంతకము సత్యభామకు స్త్రీధనముగ లభించినట్లు వర్ణించినారు.

"వినిర్మల కాంచనరత్నభారముల్, పొచ్చెము లేక యెన్మిది ప్రభావముగాఁగురియునని (పూ. భా. 3-175) హరివంశమును, ప్రతిదినంబును నెనిమది బారువుల సువర్ణం బొసంగుచుండు" నని (10-ఉ.భా-51) భాగవతమును, "ఎనిమిది బారువులర్థము దినదినమును గురియుచుండె"నని (6-249) సూరన విష్ణు పురాణమును చెప్పుచున్నవి.

"నాలుగు వ్రీహి లొకగుంజ. అయిదు గుంజలొక పణము. ఎనిమిది పణములొక ధరణ. ఎనిమిది ధరణలొక కర్షము. నాలుగు కర్షములొక పలము. నూరు పలము లొక తులము. ఇరువది తులములొక భారము"[2] అని ప్రాచీన భారత మానము. ఈ లెక్క ననుసరించి, ప్రతిదినము ఎనిమిది బారువుల బంగారము శమంతకమణి యిచ్చుచుండెనని తెలియుచున్నది. అంతేగాని, సామాన్యముగ నెనిమిది మణుగులు కాదు. సత్రాజిత్తు ఐశ్వర్యమును, దానితోపాటు ఇంతటి సంపద లీను శమంతకమణిని పొందిన సత్యభామ నిజముగ అసామాన్య ఐశ్వర్య సంపన్న యనుటలో సందేహము లేదు. ఇట్టి యీమె ఐశ్వర్య కారణముగ గర్వించినను అందు అనౌచిత్యముగాని అసహజత్వముగాని లేదు. పారిజాతాపహరణ ప్రబంధమున, ఆ మణి ఎవరికి దక్కునో యని భయపడినట్లు మాత్రమే వర్ణింపబడినది. కాని, ఐశ్వర్య గర్వితగ సూచింపబడలేదు. ప్రాచీన ప్రబంధములందీ విషయము ప్రస్తావింపబడకపోయినను, తులాభార వృత్తాంతమును తమ గ్రంథములందు చేర్చుకొనిన ఆధునిక కవుల ప్రబంధములందు, ఈమె ధన గర్వితగ చిత్రింపబడుట జరిగినది. భర్తను దానము చేయు విషయమునందు క్రిందు మీదు లేర్పడవచ్చునని, హెచ్చరింపగ సత్య, "ఎరిగి శమంతకమ్మున గడించిన నాపితృ భాగ్యరాశి నా పరమున నుంట" "ఈ వ్రతమును దొరకొని యుంటినని ధన గర్వముతో సమాధానమిచ్చినట్లు "శ్రీకృష్ణాతిమానుష తత్త్వము"న వర్ణితము. (3-1-233).

యక్షగానాదులందు సత్య, ధన గర్వముతో పతి మాటలను కూడ పరిగణింపక నడచుకొనినట్లుగ చిత్రితము. "పారిజాతాపహరణ యక్షగానము" నందు, పారిజాతము సవతికి దక్కిన కారణమున ఈర్ష్యాసూయలకు లోనై సత్య, కృష్ణుని అర్థించియు అతడు తన కడకు రాకపోవుటచే, క్రోధాసూయలను దాచుకొనలేక

*"నన్ను బెండ్లాడినది మొదలిన్ని భోగ*
*భాగ్యముల గల్గుటెంచక పరువులేక*
*మరచి యలరుక్మిణీ మణి మాయఁదగిలి*
*రాకను బరాకుచేసెగా రమణులార ......(పారి - యక్ష - 2-121)*

---

1. *సం - పద్మ. పు. ఉ. ఖ. ఉత్త - 249 - 36*

2. *చతుర్భిర్వ్రీహి భిర్గుం జం*
*గుంజాన్ పంచపణం పణాన్*
*అష్టౌధరణ మష్టౌచ, కర్షంతాం*
*శ్చతురఃపలం తులా పలశతం*
*ప్రాహుర్భారస్స్యా ద్వింశతి స్తులా" - ఇతి - భాగ - శ్రీధరీయవ్యాఖ్య - పు. 425*

అని చెలుల ముందు, అనును. తన వలననే అతనికి భోగ్య భాగ్యములు పెరిగినవనియు, అట్టి తనయెడ కృతజ్ఞతలేక, తన విశిష్టతను గుర్తింపక, రుక్మిణిని చేరినాడనియు ఐశ్వర్య గర్వితయై నిందించినది.

శాహజి రచించిన 'సతీపతిదాన విలాస యక్షగానము' న సత్య నారదునకు తన పురుషుని దానమిచ్చినందులకు, సవతులు కోపగించుకొని, అతనిని విముక్తుని చేయుటకై తమతమ కడనున్న ధనరాసులను వారును, బలరాముడు నిచ్చియు, కృతకృత్యులు కాకపోవుటచే కృష్ణకాంతలు, అసహనముతో తమ సొమ్మంతయు పోయెననియు, సత్యవలననె మోసము వచ్చెననియు నిందలు వేయగా, సత్య మాత్రము జరిగిన దానికి ఏ మాత్రము చలింపక "వినవయ్యా బావ! వీరలీరీతి బలుక కారణమేమి? నాకు మాతండ్రి యిచ్చిన రత్నాలు ధనము చాలనున్నవి. అదంతయు దెచ్చివేసి నేనే విడిపించుచున్నానయ్యా" అని ధన గర్వముతో అనును. కాని తన ద్రవ్యమంతయు పరమాత్ముని, తూచుటకు సరిగాదనెడు సత్యమును చివరకు గ్రహించును.

ముత్తరాజు సుబ్బారావుగారు వ్రాసిన కృష్ణ తులాభార నాటకమునందును, తులాభార వ్రత విధానము నుపదేశించిన నారదుడు, "నీ యొద్ద కృష్ణు నెత్తు ధనముగాని యితర పదార్థములుగాని, లేనప్పుడే నీవు భర్తృ దానమన్న వెనుదీయ వలయును" అని చెప్పగా, సత్య "మునీంద్రా భర్తృ దానమన్న నింతమాత్రమే యగునా? ....ధనములకు నాకేమి కొరత? శ్రీకృష్ణు డెందరెందరు రాజులనో జయించి, నాకు దెచ్చి యిచ్చిన ధనంబులు లేవా? దినమునకు రెండు బారువుల బంగార మొసంగుచుండు నా తండ్రి యిచ్చిన శమంతకమణి నాదండలేదా?" (పుట 32, 33) అని ధన గర్వముతో అనును. అంత ధనముండవచ్చును కాని, వానితో కృష్ణుని తులతూచ వచ్చునో లేదో సుంత యోజించి వ్రతమునకు కడంగుమని హెచ్చరింపగా, అందలి అంతరార్థము గ్రహింపలేని సత్య "నా దగ్గర నుండు ధనముతో నొక్క కృష్ణుని కాదు. కోటి కృష్ణుల దూచవచ్చును. అంత స్వల్ప ధనము నొరుల కిచ్చిన నాకు జిన్నదనమగును గాన, నా సర్వస్వమును నొసంగెద" (పైది పుట. 33) నని గర్వాతిశయమును ప్రకటించును. భగవానుడగు కృష్ణుడు "నన్ను దూపగల ధనము నీకడ నున్నదిగదా!" అని నర్మ గర్భముగ హెచ్చరింపగా, సత్య "నాథా! నారద మహర్షివలె మీరును నాకడనుండు ధన ధాన్యాది సంభార పరిమాణమెరుంగక నట్లాడెదరేల? మీరావంతయు సంశయింపకుడు" (పైది పుట-45) అని ఐశ్వర్య గర్వితయై అవివేకముగ ప్రవర్తించి రుక్మిణి వలన గుణపాఠము నేర్చుకొనును. ఐశ్వర్యమున్న వ్యక్తి గర్వించును. ఇది సర్వ సహజము. మహదైశ్వర్య సంపన్నయగు సత్య గర్వింపకుండునా? కావున, సత్యయు తప్పకుండ ఐశ్వర్య గర్వితయై యుండవచ్చునని యక్షగానాది కవులు భావించి యుండ వచ్చును. పురాణేతిహాస ప్రాచీన ప్రబంధాదులలో కనిపింపని ఈ ఐశ్వర్య గర్వము దేశి ప్రక్రియకు సంబంధించిన యక్షగానాదులలో మాత్రమే యుండుటను బట్టి గ్రామ్య జనాకర్షముగ రచించు ఆ కవులు, అట్టి ప్రజలను రంజింపచేయు నుద్దేశముతో వారి అభీష్టానుసారముగ సత్యను ధన గర్వితగ చిత్రించిరి. అంతేకాదు తులాభారము తూయింపచేసి ఆ ధన గర్విత, గర్వమును అణచివేసి వారి మనములందు శాంతిని పొందినారని భావింపవచ్చును.

# మానినీత్వము

## పురాణేతిహాసములలో :

సత్యభామ మానినీత్వము మూర్తీభవించిన మగువ. సత్య "కోపన" అను అభిప్రాయము లోకమున నున్నది. కాని స్వాభావికముగ ఆమె మానిని. మానము కలది మానిని. మానము అనగా ఆత్మాభిమానము ఆత్మగౌరవము, పౌరుషము, రోషము, స్త్రీలకు నసూయచే బురుషుని యెడ గలిగిన కోపము" అని అర్థములు నిఘంటువుల (సూర్య. ని) యందున్నది. మానమనగా "చిత్తౌన్నత్యము" అని పరిమళోల్లాసవ్యాఖ్య.[1] సత్యభామను మానిని అనియే కవులందరును వ్యవహరించియున్నారు. "మానిని" అను పదము, స్త్రీ సామాన్యవాచిగ ప్రసిద్ధ వ్యవహారమున్నను, సత్యయెడల మాత్రము, కవులు ఆత్మాభిమానము లేక స్వగౌరవము గల స్త్రీ" అనెడు ప్రత్యేకార్థముననే ప్రయోగించి యున్నారు. సాహిత్యమునందు సత్యాపాత్ర చిత్రణమును తదనుగుణముగనే జరిగినది. మానినులకు కోపమధికముగ నుండును. తన ఆత్మాభిమానమునకు విఘాతము కల్గినపుడు, సత్య యేమాత్రము సహింపక తీవ్ర కోపావేశములకు లోనగుచుండును. కావున దానిని చూచి, సత్యభామ కోవన యను అభిప్రాయము లోకమున స్థిరపడి యుండి యుండవచ్చును.

సంస్కృతాంధ్రకవులందరును సత్యభామను అభిమానవతిగనే పరిచయము చేసి తదనుగుణముగా ఆ పాత్రను పోషించుట జరిగినది. సంస్కృత హరివంశమునందు కవి సత్యభామను, "అభిమానవతి"గ ప్రత్యేకముగ పేర్కొనుట గమనింపదగినది.[2] ఆభిజాత్యము, సౌందర్యము, సౌభాగ్యము ఈ మూడును ముప్పిరులై పెనవేసికొని, సత్యను తీవ్రమానినిగ రూపొందించినవి.

నేమాని భైరవ కవి హరివంశమునందు సత్య ".... అజ్జలరుహనేత్రు ప్రాణమనజాలి నిరంతర మానయుక్తయై వెలసినట్టి'దని (5-31) వర్ణింపబడినది. తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధము, ఈ మానినీలలామకు స్థిరమైన శాశ్వతమైన గౌరవము నేర్పరచినది. ఇందుకు కవి,

*"వారిలోపల సౌందర్యవతియు మాన*
*వతియు మహనీయ సౌభాగ్యవతియునైన*
*సత్య.... "* *(పారి 1-70)* అని సత్యా పాత్ర పరిచయము చేయుచు, కృష్ణుని అష్టమహిషులలో సత్య ప్రత్యేకతను స్పష్టము చేసినాడు.'మానవతి' అనగా 'మానిని' అని అర్థము నిఘంటువునందు (సూర్య) కలదు. "అభిమానము కలది" అను అర్థమునే సురభి వ్యాఖ్య యందును చెప్పబడినది[3]. దీనినిబట్టి శ్రీకృష్ణుని అష్టమహిషులలో సత్యభామ "అభిమానవతి" అనుట స్పష్టమగుచున్నది. సత్యభామను శ్రీకృష్ణ కాంతలలో నుండియే కాదు, పురాణేతిహాస ప్రబంధాది కావ్యనాయికల నుండియు వేరుచేసి, ఒక విశిష్టమైన విలక్షణమైన స్థానమున నామెను నిలిపినది ఈమానినీత్వమే. ఇతర కాంతలును, ఆయా సందర్భములందు తమ మానినీత్వమును ప్రకటించినను వారిది సత్యమానినీత్వమునకు వలె, తీవ్రమైనదియు పతికి సరసమైనదియు కాదు.

పారిజాతాపహరణ ప్రబంధమునందు సత్యభామయే మానినుల లక్షణము నిట్లు నిర్వచించినది.

---

*1. నాగపూడి కుప్పుస్వామయ్య - పారిజాతాపహరణము - పరిమళోల్లాసవ్యాఖ్య పుట. 50*
*2. సం. హరి - వి. ప - 65 - 50*
*3. దూసి రామమూర్తి - పారిజాతాపహరణము - సురభి వ్యాఖ్య - పుట. 56.*

*"మానంబె తొడవు సతులకు*
*మానమె ప్రాణాధికంబు మానమఖిల స*
*మ్మానములకు మూలంబగు*
*మానరహితమయిన బ్రతుకు మానినికేల?"* ....*(1-129)*

మానమీమెకు జీవన సూత్రమైనట్లు కనిపించును. మానము, ప్రాణములకన్న మిన్నగ భావింపబడినది. మానహానికి భంగము జరిగిన, జీవించుట వ్యర్థమని నమ్మినట్టి దామె. తన సౌందర్య, సౌభాగ్య, ఆభిజాత్య విషయములలో, ముఖ్యముగ సౌభాగ్య విషయములో వ్యాఘాతము కల్గిన భరింపలేదు సత్య. ఆంధ్ర భాగవత, విష్ణు, పద్మ, బ్రహ్మ పురాణాదులలో సత్య మానిని యనుటను కవులు స్పష్టముగ పేర్కొనకపోయినను, ఆమెను "మానినీ లలామ" గానే చిత్రించినారు. సత్యభామ ఆత్మాభిమాన తీవ్రత నెరింగిన కృష్ణుడా మానిని యొక్క మానినీత్వమున కేవిధముగను భంగము రాకుండునట్లు నడుచుకొనుట ఆంధ్రసాహిత్యము నందంతట చూడగలము. మానినీత్వమునకు భంగము వాటిల్లినప్పుడు సత్య ఏవిధముగ తీవ్ర కోపావేశాదులకు లోనగుచుండునో, అట్టి సందర్భములందు ఆ మానిని మానినీత్వమును కాపాడుటకై కృష్ణుడేవిధముగ ప్రవర్తించుచుండెనో, తెలుగు సాహిత్యమునందలి వివిధ సాహిత్య ప్రక్రియల నాధారముగ స్వీకరించి, ఇచట అనుశీలన చేయబడుచున్నది. మొదట పురాణేతిహాసములందు సత్యభామ మానినీత్వము పోషింపబడిన విధము నరయుదము. మూలమునందు కన్నను, తెలుగుకవులు సత్యా మానినీత్వమునకు మరింత మెరుగులు దిద్దినారు.

మానినుల హృదయము కుసుమకోమల సుధామయపేశలముగ నుండును. వారికి తమపై కొన్ని ప్రగాఢ విశ్వాసములుండును. వానికి భిన్నముగ వారు ప్రవర్తింపరు. ఎదుటివారిని తామెంతగ అభిమానింతురో, వారును తమనట్లే అభిమానింప వలయునని కోరుకుందురు. ఎదుటివారు అట్లు అభిమానించుచున్నట్లు వర్తించుచు, నడుమ వంచించిన మానిను లేమాత్రము భరింపలేరు. ఈ విషయమునందేకాదు. ప్రతి విషయమునందును వారి మనసు, ఎట్టి అవమానమును భరింపలేనంత సున్నితముగ నుండును. వారిని ప్రేమించువ్యక్తులు వారితో మాట్లాడునపుడును, వారిముందు ప్రవర్తించునపుడును తగు జాగరుకతతో వ్యవహరింపవలసియుండును. లేనిచో మానినులు అత్యంత వ్యధామగ్నులగుట సంభవించును. శ్రీకృష్ణుడు సత్యభామ సున్నిత హృదయమును మానినీత్వ తీవ్రతయు బాగుగ తెలిసినవాడు. సత్యయెడల అతడు మిగుల జాగరూకతతో వ్యవహరించుట, హరివంశాదులయందు కనబడును.

ఎఱ్ఱన హరివంశమున, కృష్ణుడు సత్యకు తనంతట తానుగ విల్లు నిచ్చి నరకునితో యుద్ధమున కామెకు ప్రోత్సహించినాడు. వీరావేశముతో ఆమె విజృంభించి, శత్రువును ఆందోళన పరచుచుండినది. అట్లే విడిచిన, నరకదైత్యుని ఆ వీరవనిత నిర్జించియుండునో ఏమో? కాని తాను విష్ణువు గావున తానే నరకవధ కావించుట అవతార ప్రయోజనమగును. కాని ఆమె చేతినుండి అకస్మాత్తుగ విల్లును గ్రహించిన, ఆమానవతీలలామ నొచ్చుకొనును. కావున విల్లును గైకొనుటకు ముందు సత్యను పలువిధముల సమ్మానించి, కానుకనిచ్చి" ప్రసాదన దృష్టిలోచన పారణచేసి, ఇట్లు హృదయేశ్వరిని సంభావించి యద్దేవుండద్దేవి చేతివిల్లు గైకొనినాడు (హరి-ఉ.భా. 4-172). ఇదే విధముగ ఉత్తరహరివంశమునందును చెలువచెక్కుల నెలకొన్న చెమటతుడిచి నుదిటి కుంతములొత్తి, హారములు సరిచేసి, పయ్యెదకొంగు పైబొందుపరిచి (ఉ. హరి 1-170), ఇట్లు పలువిధ సత్కారములచే ఆహ్లాదపరచిన తరువాతనే, హరియక్కామిని చేతివిల్లు గొని యుద్ధమునకు విజృభించినాడు. భాగవతము నందును

సమ్మానరూపంబులును మోహన దీపంబులును, దూరీకృతచిత్త విక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయు బెద్దరికంబుచేసి ఆమెచేతిలోని విల్లును మరల నందుకొనియెను (10- ఉ.భా. 188). పై ఉపచర్యలును సమ్మానములును కృష్ణుని సత్యాప్రియత్వమును చాటునట్టివే యయ్యెను, మానిని యెడ అతడు గైకొను జాగరూకతను కూడ సూచించుచున్నవి.

మానిని, తాను కోరిన దానిని పొందకపోయిన, క్రుంగిపోవును. శ్రీకృష్ణుడును ఆ విషయము తెలిసిన వాడు కావున ఆ సత్యామానిని కోరినదెట్టిదైనను, శ్రమించియైనను సాధించి, సంతోషపెట్టుట పురాణేతిహాసములందు కనిపించును. హరివంశమునందు, పారిజాతమును చూచిన సత్య అది తనకు కావలయునని వేడగా, ఇంద్రాదులను జయించి సాధించును (పైది-ఉభా. 4-177, 223, 224). భాగవతమున "సత్య కోరిన, నందనవనము సొచ్చి" (10-ఉ. భా. - 214) అడ్డుపడిన ఇంద్రాదులను నిర్జించి, కల్పవృక్షమును సాధించును.

సత్యభామ స్వాభావికముగ మానిని అగుటచే, స్వల్ప అవమానమును కూడ భరింపలేదు. శ్రీకృష్ణుని ప్రేమాతిశయము ఆమె మానినీత్వాభివృద్ధికి మరింత దోహదమైనది. తన నవమానపరచిన వారు అదివ్యులైనను, దివ్యులైనను ఆమెకు లెక్క లేదు. తగిన ప్రతీకారము చేయనిది ఆమె శాంతింపదు. సింగన పద్మ పురాణమున, సత్య తన మానినీత్వ ప్రదర్శనచే తన నవమానపరచిన శచీదేవికి తగిన గర్వభంగము కల్గించుట చూడగలము. నరకాసుర వధానంతరము సత్య, శచీమందిరమున కేగినపుడు అమరేంద్రభృత్యు డొకడు పారిజాత కుసుమంబులు ప్రేమతోడ తెచ్చి శచికి సమర్పణము చేయ భ్రాంతితో సత్యభామ చూచుచునుండగ ఆ పూలను తన కొప్పున తురుముకొనుటయేగాక, "నీకు గావర్షమీ పువ్వు లమరభోగ భాగ్యము" అని అవమానకరముగ పలికి, సత్యభామ మానినీత్వమునకు భంగము కల్పించినది. ఆ మాటలతో తనయంతటి మానినీమణిని, శచి అవమానించుటచే 'సిగ్గును', దానివలన కలుషము కలుగగ 'మనసు మండి'నది. అచటి నుండి లేచి ఆత్మేశు దగ్గర కేగి జరిగినదంతయు "ఎగ్గుగ" ఎరింగించినది (10-113). తనకు జరిగిన అవమానము, అది లోకేశుడైన పతికి జరిగిన అవమానమే! మూలమునందు "**యదుశ్రేష్ఠా!** ఈ శచీదేవికి పారిజాతపుష్పము వలన గర్వమధికముగ నున్నది. ఆ పువ్వుల నాకీయకయే ధరించినది" అని చెప్పగానే, ఆమె మాటలలోని భావమును గ్రహించి హరి పారిజాతోత్పాటనకు పూనుకొనును.[1] కాని తెలుగు పద్మపురాణమునందు సత్య శచీదేవి తనకు కావించిన అపరాధమును వివరించి

'ఇప్పుడీ భూరుహమును ద్వారవతికిఁ బూని తెచ్చితేని, నా కోరికలు ఫలించుఁగృష్ణ' (10-112) అని మానినీత్వాతిశయముతో, పతిని పారిజాతాపహరణమునకు ప్రత్యక్షముగానే ప్రేరేపించును ఆమానిని మాటలను మన్నించి శ్రీకృష్ణుడును పారిజాతోత్పాటనము చేసి, తనను నిరోధింప వచ్చిన ఇంద్రునితో...

*"ఎడవక సత్యభామ నవమానము నీసతిచేత నొందిన*
*న్నడిగిన నీవధూటికిఁ బ్రియంబుగ నీతరు విచ్చినాఁడ" .....(సిం. పద్మ.పు-10-124)*

అని, సత్య ఆత్మాభిమానము కాపాడుట కొరకే తానాకార్యము చేయవలసి వచ్చినదని కూడ తెల్పినాడు. అంతేకాదు "ఇప్పుడమిన యుండనిమ్ము మఱిపొల్పుగ నే ధరఁబాసిపోవునప్పుడ

---

*1. ఏషా శచీ యదుశ్రేష్ఠ / పారిజాతేన గర్వితా*
*అదత్వా మమ గోవింద బబంధ స్వస్య మూర్ధని - 91*
*సత్యయా భాషితం శ్రుత్వా వాసుదేవో మహాబలః*
*ఉత్పాట్య పారిజాతం,తు నివేశ్య గరుడోపరి - 92 పద్మ పు. ఉ.ఖం. ఉత్త. 249*

చనుదెంచి నీవు గొని పొమ్ము సురేశ్వర! యిమ్మహీజమున్'' (పైది) అని మానవ కాంతకు పుష్పమిచ్చుటకే శంకించిన శచీదేవికి గర్వభంగము కలుగునట్లుగా, పారిజాత ద్రుమమునే సత్యకు సొంతము చేసి ఆమానినికి ప్రీతిని కల్గించినాడు.

సంస్కృత విష్ణు పురాణమునందు[1]వలె వెన్నెలకంటి సూరన అనువదించిన విష్ణు పురాణమున, శచి వలన సత్యకు అవమానము జరిగి నట్లు చెప్పబడక పోయినను పారిజాతము నాశించిన సత్య మనోరథమున కడ్డుపడిన వనపాలకులు, ఆ వృక్షము శతమఖు సతిదనియు ఆమె మాత్రమే గైకొనదగు పువ్వులు మనుజసతులు ముడవ నర్హమా అని ప్రశ్నించుచు దానిని విడిచి పొమ్మని హెచ్చరింపగా, ఆ మానిని అది భరింపరాని అవ మానముగ భావించి వనజనయనుం డొండేమియు ననక, నగుచు నూరకుండగా "... సత్యభామ భావము, మనమున బెనగొనగ గఱకు మాటలతో"

*"ఎక్కడి దేవేంద్రుడు మఱి*
*యెక్కడి పౌలోమి? వీరికీభూజాతం*
*బెక్కడి దీలోకమున*
*నెక్కుడు వీరేలయైరి యెవ్వరికంటెన్" ....(సూ. వి. పు. 8-130)*

అని కోపముతో మండిపడినది. శచీదేవి ఇంద్రుని భార్యయే కావచ్చును. కాని తన కన్న నామె యేవిధముగ నధికురాలనెడి దీమె ప్రశ్న. ఆ తరువు చేతనే తనకట్టి పెంపు కల్గినదని శచీదేవి భావించినచో, "జలధిఁ బుట్టిన యీ పారిజాతవృక్ష, మఖిల లోకమ్ములకు సమము". (పైది 131) అని యనుచు, తమకు కూడ అందులో సగభాగమున్నదని సూచించినది. భాగము కాదు. నిజమునకది తమకే సొంతము కావలయును. ఇంద్రునికన్న, వీరుడైన తనపతి పరాక్రమాతిశయకారణముగా కూడ, తనకే అది దక్కుట న్యాయమని వాదించినది. అది లోకమెరిగిన సత్యమని కూడ సూచించినది.

*"నా మగడు సకల లోక*
*గ్రామణి దేవేంద్రుఁడాదిగా గల దివిజ*
*స్తోమములు గొలువనుండుట*
*యేమీ పౌలోమి యెరుఁగదే మఱచెనొకో" .......(పైది. 132)*

అని నిజ భర్తృ శౌర్యమును, ఆధిక్యమును గుర్తుచేసినది. నరకాసురుని వధించి అమరపతికి తన పతి చేసిన సాహాయ్యమును శచీదేవి అప్పుడే మరచుట సత్యకు ఆశ్చర్య మనిపించినది. "మఱచెనొకో" అని వ్యంగ్యోక్తులతో ఎత్తి పొడిచినది. తన భర్త యొక్క శౌర్యముపై సత్యకు అపారమైన విశ్వాసమున్నది. తన మగడు బాహు విక్రమ ఘనుడైనచో, "కృష్ణుఁగయ్యములో మార్కొని గెలిచి పారిజాతము గొనిపోవుంగాక యేల గొణుగులు తనకున్" (పైది. 133) అని పంతములాడినది. నిజమునకు ఇందు శచీదేవి నోరెత్తలేదు. ఆమెకై వనరక్షకులు పలికినారు. వారి పలుకులు మానవతియగు సత్యకు, శచీదేవి గొణుగులు గానే అనిపించినవి. కృష్ణుని మనోభిప్రాయమేమియో అడుగకనే, కృష్ణుని కయ్యములో మార్కొని గెలిచి, పారిజాతము గొనిపోవచ్చునని వారితో అనుచు, పరోక్షముగ కృష్ణుని యుద్ధమునకు సన్నద్ధుని చేసినది. యుద్ధము చేసి సత్య అభిమానమును కాపాడ వలసిన బాధ్యత ఇప్పుడు, కృష్ణునిపై పడినది. సత్యా వశవర్తియైన అతడు ఇంద్రాదులతో యుద్ధము చేసి సత్య మాటలను సత్యము చేసి నాడు. చివరకు శచీదేవి కూడ, భర్తృ భిక్షకై కృష్ణుని యాచింపవలసివచ్చినది. (పైది. 140).

1. సం-వి. పు. 5.30 - 29, 74,75

మూలానుసారముగ అనువదింపబడిన తాడేపల్లి సీతారామస్వామిగారి విష్ణుపురాణమున, సత్య

*"భర్తృసమ్మాన నావలేపమున నాకు*
*స బహుమానంబుగా నుపచారము శచి*
*సేయ నొల్లమి స్త్రీ నౌటఁజిత్తమెరియ*
*బతినిఁబురి కొల్పి నీతోడఁ బగ జనించె"* .....(5-4-158)

అని తనకు జరిగిన అవమాన కారణముగానే యుద్ధమును కల్పింపవలసివచ్చినదని వివరించుచు "పరధనము పారిజాతము హరియింపనేల మాకు...?" (పైది. 159) అని ఆ మానవతీలలామ సురద్రుమమును అభిమానముతో తిరిగి యిచ్చుటకు సిద్ధమగును.

బ్రహ్మపురాణమునందు, శచిత ననుంబ్రీతి వరల గనక "ఎవతుకనో కనినట్లులు", సువిహిత పద్ధతిని మాని, చుల్కన జూచుటచే, కోపముకల్గి, పారిజాతోత్పాటనకు పూనుకొనినట్లు సత్య ఇంద్రునికి వివరించును. (4-94-108). తనవంటి మానిని ఎవతుకో' వంటిది కాదు. కావుననే సత్య కంతటి కోపము కల్గి, కాంతుని కదనమునకు కదలించినది. బ్రహ్మవైవర్తపురాణము (శ్రీ కృష్ణ ఖండము) సత్యాభిమాన ప్రతిష్ఠాపన కొరకే పారిజాతాపహరణము చేయబడిన దనియు, పారిజాతాపహరణము పుణ్యక వ్రతాచరణములవలన సత్యాభిమానము వృద్ధి చేయబడినదనియు వర్ణించినది.[1] ఇంతవరకు ఇతరులవలన సత్యకు మానహాని జరుగగా, కృష్ణుడా మానవతి మానమును కాపాడుటకై యుద్ధముచేసి, సత్యను 'మానవతీ లలామ' అని నిరూపించుటను చూచియున్నాము.

ప్రియపతిని ప్రాణాధికముగ ప్రేమించిన సత్య, తనకన్నను ప్రియసతి లేదనెడు, పతి వాక్కులను నమ్మి మానినీత్వాతిశయముతో చరించుచుండ, పతివలన ఆమె చిత్తౌన్నత్యమున కొకింత అటంకము కల్గినను ఏమాత్రము భరింపలేక చివరకు జీవితమును రోయుట, నేమాని భైరవకవి తెనిగించిన 'హరివంశము ఉత్తరభాగము' నందును, పిసుపాటి చిదంబరశాస్త్రి అనువదించిన 'పద్మపురాణము' నందును, కాననగును. నారదుడు పారిజాతమును తెచ్చి కృష్ణున కీయగా రుక్మిణీ సహితుడైయున్న కృష్ణుడు, 'మునిగాంచి' రుక్మిణికి నా సుమరాజము 'మెచ్చి యిచ్చె'ను. కలహప్రియుడైన నారదుడు దివ్యపుష్ప ప్రశంసతో పాటు రుక్మిణీ సౌభాగ్య ప్రశంసయు చేయగా, ఇతర మహిషులదూతిక లావిషయమంతను తమ రాజ్ఞుల కెరిగించినారు. అది విని

*"అర్థ పుత్రవంతురాలు దానందఱి*
*కన్న మిన్న పెద్ద యన్నువనుచు*
*రుక్మిణీ వధూటి రూఢ సౌభాగ్యంబు*
*నొప్పిరపుడు సవతు లొక్కసరణి"* ....(భై. హరి. 5 - 30)

సపత్నీమాత్సర్య రహితులై ప్రశంసింపగా "నిరంతర మాన యుక్తమై" 'వెలసిన' 'సత్య' మాత్రము, రోషకలిత చేతనాధూత యగుచు దందహ్యమాన జ్వలనవర్ధితానల శిఖా ప్రభావ సాదృశ్యంబు గాంచి క్రోధాన్వితయైనది. హరి, ఆమె మానవతి యని యెరింగిన వాడు కావుననే, 'అతిభీతుడై మెల్ల మెల్లన' గోపసదనంబున కడుగిడినాడు. (పైది 5-34). పలు విధములా మానినీ సాంత్వనమునకై ప్రార్థింపగా తన మానినీత్వ సిద్ధి కాతడే కారణమనునట్లు చెప్పుచు 'నీ విష్టుడవని తలఁచి దేవీ సముదయములో వారిని లెక్కింపక, సంభావిత మహిమ సమాక్రమణావాస శిరంబుతోడ నలరితి గాదే" (పైది. 5-62)

---

*1. బ్రహ్మ. వై - పు. 7 - పు. 376*

అని తన మానినీత్వాభ్యుదయమును సౌభాగ్యాతి శయమును తలచుకొని, ఈనాడు సవతికి జరిగిన పుష్ప ప్రదాన కారణముగ

*సీ॥ "అట్టి నారీమణినైన నే నందరు*
*తరుణులలో నొక దాననైతి*
*ననుచు మద్దూతిక లక్కడక్కడ విని*
*చెప్పిరి నిశ్చయస్థితి దనర్ప* ....(*ఖై-హరి. 5 - 63*)

అని తనకిపుడెట్టి ప్రత్యేకత లేక, ఇతర సపత్నులతో సమాన స్థానము కల్గినది కదాయని, ఆమానిని క్రుంగిపోయినది. మూలమున తనను సపత్నులతో కూడ సమానముగ చూడలేదని సత్య బాధపడగా[1], ఈ అనువాద హరివంశమునందు సవతులతో సమానముగ చూచితివని కుమిలిపోవు మానవతీలలామగ సత్యభామ చిత్రింపబడినది. ఇంత అవమానము జరిగిన తరువాత, భోగయుతమైన సాంసారికజీవితము గడుపుట అర్థరహితమని అనిపించగా "కంజాక్ష! నీకనుగ్రహము గల్గిన యేని" "పరమ తపశ్చర్య వడయంగా నగు" "వరము వేగనీయవలయు"నని (5-56) అర్థించినది. సత్య అభిమానాతిశయము నెరింగిన వాడగుటచే కృష్ణుడును, నారదుడు రుక్మిణియెదుట నిచ్చుటచే, దానినామె కీయ వలసివచ్చినదని, తన అపరాధమునకు కారణమును వివరించుచు "కుసుమ వర్ణములెన్నియు నే విధంబునం గోరిన దెచ్చియిత్తు" ననియు, "అనకూల మదెట్టులో తెల్పు" మనియు "లేక తద్భూరుహము న్సురేంద్ర వనభూములనుండి పెకిల్చి తెచ్చి, నీ కోరిన యంత కాల మొనగూర్చెద జూడుము నీ గృహంబునన్" అనియు, సత్యముందు ప్రతిజ్ఞ చేసి సత్యామానినిని ప్రసన్నము' చేసినాడు (పైది. 5.74)

మానమును ప్రాణములకన్న మిన్నగ భావించిన దగుటచే సత్యయు, "సుర ద్రుమంబు గొని తేరగ శక్యమయేని కోపముం దీరును "అని అనుచునే" "అంగనామణు లందఱిలోన బ్రసిద్ధురాలనై గౌరవ మొందం బ్రథమ కల్పము నాకొనగూర్పు నేర్పునన్" (పైది. 5. 76) అని, తన మానినీత్వ ప్రతిష్ఠ కాతడు పూనుకొన వలయుననియు హెచ్చరించి, చివరకు తన పంతమిడేరునట్లు చేసికొనినది.

మడికి సింగన పద్మపురాణమునందు, సవతికి, హరి పారిజాతపుష్ప ప్రదానము చేయుటచే సత్య ఈర్ష్యావిల చిత్తయగు ఘట్టము లేదు, కాని అధునికకవి పిసుపాటి చిదంబరశాస్త్రి అనువదించిన పద్మపురాణమునం దిదియున్నది. సత్యభామను మానినీ లలామగా చిత్రించు ఈ ఘట్టము, మూలమునందు చతుర్థసంపుటము ఉత్తరఖండము, పూర్వార్థమున, వ్రత మాహాత్యముల నుగ్గడించు 88వ అధ్యాయమున నున్నది. నారదుడొకనాడు ద్వారక కరుదెంచి కృష్ణునకు నాదరమున పారిజాతప్రసూనముల నిచ్చి, దివి కరుగగా, కృష్ణుడును సత్యను మరచి, తక్కిన నిజ వధూటుల కొసగగా, సత్యవగచుచు, కోపముతో కోపాగారమున ప్రవేశించినట్లిందున్నది.[2] కాని అనువాద పద్మపురాణమునందు "అంతట మరచి సత్యను, గృష్ణుడా పుష్పములు తక్కు నిజ వధూటుల కొంసంగగా నది విని, సత్రాజిదాత్మజ యవనత వదనయై లోలోన వగచుచుండెను" (చి-పద్మ. పు - సం. 4 ఉ. ఖం 308). ఇందు ఈమెకు కల్గినది సపత్నీమాత్సర్యము కాదు. కృష్ణుడు సవతుల ముందు తన నుపేక్షించుటచే, అతని ప్రియాంగన ననుకొనెడు తన స్వాభిమానమునకు దీని వలన భంగము కలిగినది కదా యని, కుమిలినది. కృష్ణుడును ఆమె చింతకు కారణ మేమియని అడుగ, ఈ సత్య మూలమునందలి సత్యవలె గంభీరముగ నుండలేక, అవమాన

---

1. *సం. హరి - వి. ప. 67 - 24*
2. *సం. పద్మ. ఉ. ఖం. పూర్వా - 88 - 1 - 4*

భారము వలన నిగ్రహమును కోల్పోయి ఏడ్చినది. కృష్ణుడును ఆమె హృదయంబు గ్రహించి "స్థాపనము చేసెద జూడుము నీ నికేతనాభ్యంతరమందు నీ సవతులందరకున్ దలవంపు లేర్పడన్", వింతగ గల్పవృక్షమున్" (పైది - 310) అని, ఆ మానినిని సాంత్వన పరచెను. మూలమునందువలె ఇందు, శ్రీ కృష్ణుడు పారిజాతమునకై ఇంద్రుని యాచింపక, పారిజాతోత్పాటనము చేసి తనకు గల సత్యాప్రీతిని మరింత ప్రకాశమానము చేసి, ఆ మానిని మానినీత్వమును మరింత అధికమగునట్లు చేసెను.

ఇట్లు ఎఱ్ఱన హరివంశము, పోతన భాగవతములందలి పారిజాతోత్పాటనము సత్యభామా మానవివర్ధనమునకును, సూరన విష్ణుపురాణము, భైరవ కవి హరివంశములందలి పారిజాతాపహరణము, సత్యభామాధిక్య నిరూపణతో కూడిన మానినీత్వాభివృద్ధికిని, పద్మ బ్రహ్మపురాణములలోని పారిజాతాపహరణము, శచీగర్వభంగము చేసిన సత్య మానినీత్వ నిరూపణమునకు తోడ్పడినవి. మొత్తమున పారిజాతాపహరణ వృత్తాంతము సత్యభామా మానినీత్వ సుస్థిర ప్రతిష్ఠాపనకే దోహదమైనది.

సత్యభామ మానినీత్వ మింతవరకు పారిజాతాపహరణమునకే కారణమైనది. కాని భారతమునందు ఆమె మానినీత్వము యాదవ ప్రముఖులైన కృతవర్మాదుల మరణమునకు పరోక్షకారణమైనది. మునుల శాపకారణముగ యాదవకులమున పుట్టిన ముసలము వలన, యాదవుల ప్రవృత్తిలో నొక వికృతి కల్గినది. మద్యపానోన్మత్తులైన సాత్యకీ కృతవర్మలు పరస్పర దూషణములు చేసికొనుచుండిరి. కృతవర్మ అనుజుడైన శతధన్వుడు మణికొరకై అనుచితముగ, సత్రాజిత్తును వధించెను కదా! అని సాత్యకి, జరిగిన వృత్తాంతము నొకమారు స్మరించుచు "వారిదెస గీడు గానుపింపగా మానవతి యగుటచే సత్యకు కోపమతిశయించగా "వనితాస్వభావోద్గతాశ్రుపూర యగుచు హరి యగ్రతలమున కరుదెంచగా"[1] సత్యాప్రియు డగుటచే "హరి కతిరోషము జనియించెను". "అద్దేవునకును దేవికినింప్రియమొనరించెదనని తలంచి యుద్వృత్తుండై"[2] సాత్యకి, కృతవర్మను సంహరించి సత్యామానినికి సాంత్వనము కల్గించెను. యాదవవంశ నాశనమును గూర్చి వినిన అర్జునుడు, వసుదేవునితో, సాత్యకీకృత వర్మల కారణముగ సంగరము పుట్టినను యాదవుల క్షయమునకు మునుల శాపమే ముఖ్య కారణమని అనును.[3] గాంధారిశాపమును[4] మునులశాపమును[5] యాదవవంశ నాశనమునకు కారణములైనను, సాత్యకీ కృతవర్మల కలహము వారి వంశ క్షయమునకు మొదటి కారణముగ నిల్చినది.

వారి కలహమునకు సత్యభామ మానినీత్వమే, పరోక్షముగ ముఖ్యకారణ మగుచున్నది. సత్య నోరు విడిచి ఏమియు చెప్పక పోయినను, ఆమె కోపమును, కన్నీరును చూచి హరి ఉగ్రుడగుటయు, ఆదేవునకు దేవికిని ప్రియ మొనరింపవలయునని తలచి సాత్యకి, కృత వర్మతో తలపడుటయు జరిగినది. కావున సత్యభామ మానినీత్వము యాదవవంశ నాశనమునకు పరోక్షముగ మార్గము నేర్పరచినదని భావింప వచ్చును.

తెలుగు సాహిత్యములో సత్యాపాత్రమునకు ప్రత్యేకత నాపాదించి ఆమెను విలక్షణమైన వ్యక్తిగ చిత్రించిన కవులు తిమ్మన, సిద్ధేంద్రులు, వీరి సృష్టిలో, ముఖ్యముగ తిమ్మన చిత్రణలో సత్యభామ మానినీత్వపు ప్రతీకగ తీర్చిదిద్దబడినది.

---

1. భార. మౌస - 1 - 45
2. భార - మౌస - 1 - 46
3. భార. మౌస - 1-111
4. భార - స్త్రీ. పర్వ - 2-161
5. భార- మౌసల - 1 - 9

## పారిజాతాపహరణములో సత్యభామ మానినీత్వ చిత్రణము :

తిమ్మన రచించిన పారిజాతాపహరణ ప్రబంధమునకు సంస్కృత హరివంశము మూలము. తిమ్మన తన ప్రబంధమున, అష్టమహిషులందరిలోను "సౌందర్యవతియు, మానవతియు, మహనీయ సౌభాగ్యవతియునైన సత్య" అని సత్యను పరిచయము చేసినాడు. ఈ ప్రబంధము మొత్తము, సత్యలోని పై మూడు విశిష్ట గుణములపై, ముఖ్యముగ 'మానవతి' అనెడు గుణముపై నాధారము చేసికొని నడచినది. సత్య మానవతి యని కవి సూచించుటయే గాక, ఇతరులచేతను సత్య ప్రవర్తనచేతను, నిరూపించి, సత్యను తిరుగులేని మానినీ శిరోమణిగ ఇందు స్థాపించినాడు. అష్టమహిషులందరును "సమతాభిమానవతులే" అయినను "హరి యిట్లు సతులనందఱు, సరిగా జూచియును "భోజజనపాలసుతం దరుణీమణి సాత్రాజితి", నిరువుర మన్నించి మిగుల "చనవు" "లిచ్చు" చుండెను. ఈ చనవులు కారణముగ తరుణీమణియు, సౌభాగ్యవతియు, స్వాభావికముగ మానవతియునైన సత్య మానినీత్వము, మరింత అధికమగుటకు దోహదమయినది. కులము, రూపము, మగని కూరిమి యను మూడు విషయములందును, తానే అగ్రమహిషి కన్న అధికురాలననెడు విశ్వాసము సత్యకున్నది. ఇతర కాంతలేరికిని పట్టమహిషితో పోటీపడు ధైర్యము లేదు. రుక్మిణి కుల, రూప, భర్తృ ప్రణయ విషయములలో తానధికురాలనని గర్వించినను అందు నిజము లేదు. "సవతులందఱలో నల సత్యభామ కన్నన్నలఁ డ్రిమ్మరున్ హరివశంవదుడై యనవిందు..." (పైది 1-65) అని దేవమునియే యనియున్నాడు. పదియారువేల యెనమండ్రుకు భర్తయైన వాడు తనకు వశంవదుడైన, ఏకాంత గర్వింపదు? కావుననే భర్త కూరిమికలదానను గరువతనము, ఆమెలో నంతకంతకు పెరిగియుండును. చక్కదనమును ఎలజవ్వనమును కలదాననియు, జగత్తులో పేరెక్కిన దానననియు, పతి తనకెంతయు ననురక్తుడనుచు, సత్య, గర్వముతో సవతు లెవ్వరిని లెక్క చేయదని దివ్యముని పలికినాడు.[1] స్త్రీకి గర్వింపదగు చక్కదనము ఎలజవ్వనము, పతి కూరిమి అను విశేషగుణములో, నేయొక్క గుణమున్నంత మాత్రముననను స్త్రీ గర్విత యగుచుండగా, ఈ మూడు విశిష్ట గుణములు ఒకే స్త్రీయందు మూర్తీభవించిన, ఇక ఆ కాంత గర్వాతిశయముతో నడచుకొనుట సర్వ సహజము కదా! ఇవియే స్వాభావికముగ మానినియగు సత్యభామ మానినీత్వాతిశయమునకు దోహదము చేసినవి. అన్నిటికన్నను మిన్నగా, 'పతి అనురక్తి' అను సౌభాగ్య విశేషము సత్యను, ఇతర కాంతలను లెక్క చేయకుండునట్లు చేసినది.

మూలమగు సంస్కృత హరివంశమునందు సత్య, 'అభిమానవతి' [2] అని పేర్కొన బడినను, తిమ్మన ఆ అభిమానవతి అభిమానమునకు తన ప్రబంధమున ఏనాటికి మాయని మెరుగులను పెట్టినాడు. సంస్కృత హరివంశమున కృష్ణుడు, కలహాశనుడిచ్చిన పారిజాత పుష్పమును భోజరాజకన్య రుక్మిణి సమీపమునందుండుట చేతనే ఇచ్చెనని యున్నది[3]. భైరవకవి హరివంశమునందు 'హరిమునిఁగాంచి'[4] అనగా అతని సంజ్ఞచే, రుక్మిణికి సుమరాజము నిచ్చినట్లుగ నున్నది. కాని పారిజాతాపహరణ ప్రబంధము నందు హరి, 'ముని నాథు కనుసన్న'తో భోజనందనకా పుష్పరాజము నిచ్చినట్లున్నను[5], అట్లామె కిచ్చుటకు ముందు అతడు గొప్ప తర్జన భర్జనలకు లోనైనట్లు వర్ణింపబడినది. "ఇది భోజాత్మ కిచ్చినం

1. *పారి. 1 - 66*
2. *సం. హరి. వి. ప - 65 - 50*
3. *సం. హరి. విష్ణు. ప - 65, 15*
4. *భై. హరి - 5 - 17*
5. *పారి-1-55*

గినుకతో నేమంచు నూహించునో మది సాత్రాజితి" అని సత్య కినుక అనగా, మానినీత్వ భంగము వలన కలుగు కినుకను తలచి భయపడినాడు. అంతేకాదు. "దానికిపుడు ప్రేమం బంపినన్ దీని నెల్లిదముం జేసినజాడ దోచునొకో" (పైది - 1 - 54) అనియు, ఆందోళన పడినాడు. సత్యకైన ప్రేమతో పంపవలయు ననిపించినది. దివ్యపుష్పము లభించిన వేళలో పట్టపురాణి తనముందున్న సమయమున, తర్కమున కవకాశమేలేని పట్టునందును, అతని తలపునకు మొదట వచ్చినది, ఆ వలపులరాణి సత్యభామయే. శ్రీకృష్ణుని ఆలోచనలే కాదు, పనులును ఏ సమయమునందును సత్యపైనే కేంద్రీకృతములు. ఇట్టివే సత్యభామ మానినీత్వమును మరింతగా పెంచినవి. 'నారదునకు సత్యభామ కించుక యహంభావ శాంతి యొదవించుటయే ముఖ్యోద్దేశ" మనుచు, "ఇది కృష్ణునికిని హృదయ కుహరాంతరముల నొక్కింతనమ్మతవే యైయుండనోపు" అనియు, నాగపూడి కుప్పుస్వామయ్యగారు అభిప్రాయపడినారు.[1] అదే అభిప్రాయమును సమర్థించు రీతిలో సముద్రాల నాగయ్యగారు" "సత్యా గర్వభంగము కావించుటకై శ్రీకృష్ణుడు సమీపవర్తినియను నెపముతో రుక్మిణీదేవికి దాని నిచ్చెను" అని అనినారు.[2] వీరు భావించినట్లుగా, అదే కృష్ణుని ఉద్దేశమై యుండిన యెడల, అతడంతటి తర్జన భర్జనలకు లోనై యుండెడివాడు, కాదు. రుక్మిణీ యింటనుండువేళ, అది లభించినది కావున ఇతరులకంపుట ఉచితము కాదనెడు సంఘ నీతికి తలంచి మాత్రమే, చివరకు రుక్మిణి కిచ్చినాడు

దివ్యకుసుమ ధారణ కతమున రుక్మిణికి అపూర్వ సౌందర్య తేజము లొనగూడినవి. నారదుడది గమనించి, పారిజాత కుసుమములు నరులకు ధరింప సాధ్యము కాదనియు, పౌలోమి, పార్వతి, పద్మ, పద్మజురాణి, వీరు మాత్రమే, అనుదినము శిరమున దాల్తురనియు, ఈ పుష్ప మీ నాడీమె కిచ్చుటచే, ఆమెయే, హరి బహిః ప్రాణమనుట యెరుగంగ వచ్చెననియు, అనుచు, *"వెలఁదులు పదియాఱువేవురలో నెన్న*

*సరిలేదు సౌభాగ్య గరిమనీకు" .....(పారి- 1-58)*

అని రుక్మిణీ సౌభాగ్యమును ప్రశంసించినాడు. ఇచట అతడు రుక్మిణిని పొగడదలచిన పొగడవచ్చును. కాని ఇతర సపత్నులతో పోల్చి ఆమె సౌభాగ్య గరిమను నుతించుటలో గల అంతరార్థమేమి? ప్రారంభములోనే కవి, నారదుని "అరివేరంపుఁదపసి' (పైది. 1-44) అని పరిచయము చేసినాడు. 'రుక్మిణీ కృష్ణు లిరువురు' "లక్ష్మీ విష్ణువులగుటచే" 'ద్వారకకు' సారెకు గొల్వగ వత్తునని" చెప్పుకొనినను అతని ఈనాటి రాకయందు కలహ ప్రియత్వమే ప్రధానముగనున్నది. మహతితో, చేతియందు జలకమండలువు, కర్ణ శుష్కలికయందు ప్రణవ మంత్రా వృత్తి పావన స్ఫటికాక్షవలయంబు, భుజాగ్రమున కక్షపాల, అకాలచంద్రిక లీను దేహ కాంతి, మోక్షద్రు పల్లవ శంకకల్గించు జడలు - ఇట్లు పవిత్ర భావమును కల్గించు రూపముతోనున్న నారదుడు, "సమరనృత్యోచిత చమరవాలంబును" కూడ ధరించి (పైది 1-44) వచ్చుట చూడ, అతడు కలహ బుద్ధితోనే సంసిద్ధుడై వచ్చినాడనుట సువిదితము.

రుక్మిణీ సత్యభామలలో పుష్పము నేరికీయవలయునని సందిగ్ధములో పడిన కృష్ణునితో రుక్మిణి కిమ్మనుచు 'కనుసన్న' చేయుటతో అతని కలహసంభ్రమ పరత, ప్రారంభమైనది. ఆ దివ్యపుష్ప మాహాత్మ్యమును గొప్పగా వర్ణించుచు, ఇంతటితో నాగక "హరిబహిః ప్రాణంబ వగుట నేఁడెఱుఁగంగ, వచ్చె నీకిపుడిది యిచ్చెగాన" అనియు సర్వగుణ భవ్యమగు ఆ పుష్పము ధరించుటచే "ఇప్పడతులలో గనుంగొను మపార మహా మహిమాను భావముల్"

---

1. *పారిజాతా పహరణము - పరిమళోల్లాస వ్యాఖ్య - పీఠిక - పు. 18*
2. *సాహితీ సుధాలహరి - పుట. 157.*

అనియు, సవతులందఱిలో గొప్పతనము పొందగలవని రుక్మిణితో అనినాడు. ఇతర సపత్నుల చెలులు, అచట యుండుట గమనించియే, వారు రుక్మిణికి లభించిన అనూన సౌభాగ్య విశేషములను తమ తమ దేవేరులకు చెప్పవలయుననియే, కలహాశనుడు "ఇప్పడతులలో" అని నొక్కి చెప్పినాడు. నిజమునకు నారదుని ముఖ్యాశయము సవతులందరి నడుమ కయ్యము కాదు. మానినీమణియైన సత్య మానినీత్వమునకు భంగము కల్గించుటయే! ఇతర కాంతలు పట్టమహిషికి కల్గిన నూతన సౌభాగ్య సంపదకు, నంతగా క్రుంగరని, నారదునికి తెలియును. అదే విధముగ తమ తమ దాసీల వలన పారిజాత ప్రదాన విషయము విని వారును

*"అందఱిలోనఁబెద్ద మహిమాన్విత రుక్మిణిగానఁ బూవు గో*
*విందుఁడు దానికిచ్చెఁదగవే యని లక్షణయోర్చె సైఁచెఁగా*
*ళింది, శమించె భద్ర, యవులెమ్మని యూఱడిలె న్సుదంత, లోఁ*
*గుందుట మానె జాంబవతి, కోపమడంచెను మిత్రవిందయున్"* ....(పారి.1-69)

కాని వీరివలె సత్యామానిని అట్లు సాంత్వనము పొందలేదని నారదునకు తెలియును. పుష్ప ప్రాశస్త్యమును వర్ణించుచు, ఆ పుష్పము ఆ దంపతులు రహస్య క్రీడ వర్తించువేళ ఉల్లాసము కల్పించు దీపాంకురముగను ఆసమయమున పుట్టు ధారాళఘర్మ జలమును తొలగించు విసనకఱ్ఱగాను, రంజిల్లునని, బ్రహ్మచారియైన దివ్యముని పలుకకూడని ఏకాంత శృంగార క్రీడలను గూర్చి కూడ పలికినాడు. పుష్ప మాహాత్మ్యము కారణముగ, రుక్మిణికి కలుగు సుఖమును గూర్చి వినినచో, మగని కూరిమి తనకే కలదనుకొను సత్యభామ, తప్పక కలవరపడును. కావుననే ఇంతగా అద్దానిని గూర్చి వర్ణించినాడు.

కృష్ణుడు సత్యా వశంవదుడై తిరుగు కారణమున, సత్యభామ యనిన ఇతర సపత్నుల కొక విధమైన భయమున్నది. వల్లభుడు 'సవతులందరిలో' 'కడుగారవంబున' 'కన్నుల గప్పుకొనంగ నుండుట'' వలన, వారును సత్యను 'తలలెత్తి చూడగా' కూడ సాహసించెడివారు కారు. కాని యీ పుష్పము ధరించుటవలన, సవతులు రుక్మిణి పాదయుగ్మముల నాశ్రయింతురు. ధవుడును, ఇంతవఱకు సత్య పలుకులను జవదాటకుండెను. కాని, ఇక మీదట ఆమె 'పలుకులాదరించు' ను. సవతులు తనను కొలుచుట, పతి ప్రేమతో తన పలుకాదరించుట - ఇవియే ఒక స్త్రీకి లభించెడు "అవిరళ భోగభాగ్య మహిమ"లు. అట్టి మహిమ ఈ దివ్య పుష్పకారణమున రుక్మిణికి లభించునని నారదుడనినాడు. 'అలరుంబోఁడు లలోపల' 'పోడుము లగ్గలమగును'' అని కూడ రుక్మిణిని ఆశీర్వదించినాడు. పై పలుకు లన్నియు సత్యభామను మనసునందుద్దేశించి అనినవే. ఆమె మానినీత్వమునకు భంగమును కల్పించి, ఆమె క్రుంగునట్లు చేయవలయు ననియే నారదుని భావము. అందుచేతనే.

*"ఇన్ని దినంబులు న్సవతులందఱిలో నలసత్యభామ క*
*న్నన్నలఁద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యనవిందుఁగాని యో*
*కన్నియ! నీయెడం గలుగు గౌరవ మెయ్యెడఁజూచి కాన, లే*
*కున్న ననర్ఘ్య దివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చెనే?"* .....(పారి. 1-65)

అని ప్రత్యేకముగ సత్య పేరును పేర్కొని, ఆమెను తక్కువచేసి మాట్లాడినాడు. భైరవకవి హరివంశమున, నారదుడు పుష్పప్రాశస్త్యమును, రుక్మిణీ సౌభాగ్య ప్రశంసయు మాత్రమే చేయునుకాని, సత్యభామ పేరెత్తి విమర్శించుట చేయడు. కాని మూలహరివంశమున 'సాత్రాజితి తానే సౌందర్యవతి, అందరికన్న సౌభాగ్యశాలి, సుభగ అని అనుకొనును. నేడు ఎవరిది గొప్ప సౌభాగ్యమో తెలిసికొనగలద'ని సత్యభామను పేర్కొని విమర్శించును.[1] సత్యభామను

---

1. *హరి. వి. ప. 65-39*

కించపరచుటతోపాటు 'సాంబమాతయగు జాంబవతి, గాంధారి మొదలగు సపత్నులు నిదివిన్న నిస్పృహచెంది సౌభాగ్య విషయమై తమకున్న కాంక్షను విడుతురు"[1] అని జాంబ వత్యాదులను కూడ విమర్శించును.

ఇట్లు మూలమున సత్యభామవలెనె జాంబవత్యాదులును మానినులట్లు, సూచింప బడినది. కాని తిమ్మన చిత్రణలో సత్యభామయే మానవతీరత్నము. స్వాధీనపతికననెడు గర్వముతోనుండు, సత్యలోని మానినీత్వమే దివ్యమునిని ఎక్కువగ కలహసంభ్రమపరతకు లోనగునట్లు ప్రేరేపించినది.

రుక్మిణికి జరిగిన పారిజాత కుసుమ ప్రదాన విషయము తెలిసిన, తన మానినీత్వమునకు భంగము కల్గినదని ఆమె స్రుక్కిపోవును. నారదుని వాంఛిత మదియే! అట్లు జరుగుటకు చెంతనున్న చెలులా వార్తను నెరింగించుట అవసరము. కావుననే "స్రుక్కక యున్నే నీ మహిమ సూచిన బోటులు విన్నవించినన్" అని ఆ చెలులను, పోయి చెప్పుమని పరోక్షముగా హెచ్చరించినాడు. పై నారదుని మాటలను పురస్కరించుకొని, పి.యశోదారెడ్డిగారు "త్రికాల వేది సత్యభావ విదుడైన దేవసంయమి యట్లు పల్కినాడే కాని యిందు ముళ్ళమాటలు కాని కలహ ప్రియత్వము కాని, కానరాదు" అని భావించినారు.[2] సత్య మానినీత్వమును స్పష్టముచేయు నారదుని పై మాటలన్నియు, యథార్థములే అయినను, పుష్ప ప్రశంస, రుక్మిణీ సౌభాగ్య ప్రశంసతో నిలువక, సత్యను ప్రత్యేకముగ పేర్కొని విమర్శించుటలో నారదుని కలహ ప్రియత్వము సుస్పష్టముగానే కనిపించుచున్నది.

ఇక సత్యభామయు తన ప్రవర్తనచేతను, తాను మానవతి యనుటను నిరూపించు కొనినది. శౌరి కడకు పోయిన చెలి రాలేదని ఆమె ఆందోళన పడుచుండగా ఆమెకు కొన్ని అపశకునములు పొడమినవి. అప్పుడామెకు కల్గిన ప్రాణాంతకమైన సందేహము 'ప్రాణనాథుఁడొండొక చపలాక్షిఁగూడి నను నొల్లని చెయ్దము లేమి సేసెనో?" (1-73) అనియే! తనకు మాత్రమే గాక మరెందరకో, అతడు భర్త. అతడు వారెవ్వరితోనైనను కలసి యుండుటలో తప్పులేదు. కాని ఆమె దృష్టిలో మాత్రము, సవతులు తనవంటివారు గాక 'ఒండొక చపలాక్షులు'గ, అనిపించిరి. అనగా వారెవ్వరు తనతో సాటికారు. వారిని తాను సవతులుగ నేమాత్రము నంగీకరింపలేదు. అంతటి తీవ్రమైనది సత్య మానినీత్వము! మానవతులు మగనికూరిమి వేరొక స్త్రీకి దక్కుట భరింపలేరు. "పారిజాత సుమ వృత్తాంతము నెరుంగని సత్య, కేవల దక్షిణ నేత్ర స్పందనము మూలమున, మరి యొక యనిష్టము నూహింపక మగని కూరిమి మరియొక మగువపైకి బోయెనని యనుమానించుట కతన, నామెకు గల మానవతీత్వమును మగనికూర్మి మిక్కిలి గలదను గరువతనమును, మిగుల బ్రకాశితములయ్యె" నని దూసి రామమూర్తి గారును అనినారు.[3] సత్య చెలియును మానినియే. పారిజాతసుమ ప్రదానేతి వృత్తాంతమును చూచి వచ్చిన చెలి, అది తనకే జరిగిన అవ మానముగ భావించుటచే కోపముతో కనులెరుపెక్కగ, 'చయ్యన వచ్చి' 'అమ్మా యేమని చెప్పుదు" నని, ఆందోళన మనస్కురాలైయున్న ఆ మానిని హృదయమును మరింత కలచి వేయుచు జరిగిన వృత్తాంతమునకు కొంత కల్పనను జోడించి, ఆ మానిని మన మెరియంగ పలికినది. అవ్విరి కారణముగ రుక్మిణి "సానబట్టిన మకరాంకు శస్త్రమనగ" "తేజరిల్లె" నని (పైది. 78) రుక్మిణి సొగసును వర్ణించి, సౌందర్యరాశియగు ఆ శృంగార

---

1. *హరి. వి. ప. 65-40*
2. *పారిజాతాపహరణ పర్యాలోచనము - పు. 151*
3. *పారిజాతాపహరణము, - సురభి వ్యాఖ్య - భూమిక - పు. 17*

దేవతను మరింత భయపెట్టినది. రుక్మిణిని "తోడికామినీ, లోకము అసూయ విడిచి సేవించుచుండగ "ముల్లోకము దాన యేలుగతి" 'గద్దియమీదనెక్కి" "అస్తోకనిజ ప్రభావములు సూపుచుండె" నని వర్ణించి, నూతన ప్రాభవముచే ఆమె నిన్ను మాత్రమే కాదు, ముల్లోకములను కూడ జయించిన మహామహిమాన్విత అయినది, 'ఇక ఇతర సవతికాంతల వలె నీవును ఆమెను సేవింపక తప్పదు' అని, సవతి కాంతలను గణింపక, ఆత్మాతిశయముతో విఱ్ఱవీగుచు తిరుగు సత్యను పరోక్షముగ హెచ్చరించినది. ప్రియ వాల్లభ్యమున నాయంతటి వారు లేరని అహంకారముతో విఱ్ఱవీగుచు పోటీకి వచ్చు సత్యభామ గర్వమిక చెల్లదని నారదుడు, ఏ మాత్రము భయము, సంకోచములేక నీపతి ముందు, సవతి రుక్మిణిముందు, 'మానినియగు" నీ యొక్క చెలియైన నాముందును అనినాడని ఆరోపణము చేసినది. నీవు మానిని యయినచో ఈ అవమానము నెట్లు సహింపగలవు? ఇక దీనికి తగిన ప్రతిచర్య చేయుట అవసరము. కావున వెంటనే ప్రతీకారము తీర్చుకొనుము అని ప్రోత్సాహించు విధమున 'మానినీ' అని సంబోధించినది. ఇంతటితో ఆగలేదు. నారదుని పనులు మాయలుగ, రుక్మిణి చేతలు నటనలుగ, కృష్ణుని చెయ్యులు మోసములుగ వర్ణించి, 'దగ్గరుండి చూచిన నాకే ఇంత కోపము కల్గినది. ఇక నీవే చూచి యుండినచో, ఎంత మండి పడెదవో" అని ఆ మానినిలో కోపోద్రేకము నధికము చేసినది.

తనకు స్వాధీనుడని అనుకొను పతి, తననుపేక్షించుట, పరుడొకడు తనను నిందించుచుండ అద్దానిని పతి వారింపకుండుట, సవతిముందు తనకు అవమానము జరుగుట - అను ఈ మూడు విషయములు సత్యను మిగుల బాధించినవి. మానినులు సవతుల ముందు అవమానము జరుగుట సహింపలేరు. చెలి మాటలు వినగానే సత్య

*"..............వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయివోయ భ*
*గ్గన దరికొన్న భీషణహుతాశన కీలయనంగ లేచి హె*
చ్చిన కనుదోయి కెంపు దనచెక్కులఁగుంకుమ పత్త్రభంగ సం
*జనిత నవీన కాంతి వెదచల్లఁగ గద్గదఖిన్న కంఠియై" నది ....(పారి- 1-82)*

మూలమున సత్య 'అధిక ఇంధనముచే ప్రజ్వరిల్లు అగ్ని జ్వాలవలె మండిపడినట్లుండె' నని మాత్రమే వర్ణింపబడినది.[1]

కాని తిమ్మన, సత్యభామలో ఆ క్షణములో పొంగివచ్చుచున్న క్రోధావేశములను మహనీయ మానినీత్వాతిశయమును చక్కగా వర్ణించినాడు. "తిమ్మన ఈ సందర్భములో సృష్టి చేసి రంగానికెక్కించిన సత్యా పాత్ర మాంధ్ర ఇంగ్లీషు హిందీ ఇత్యాది భాషల ఒత్తిడిలో నలిగి నశించిపోక నిలచి ఉన్నంత వరకు ఆంధ్రునిలో ఆంధ్రత్వమున్నంతవరకు యువతులలో సత్యాత్వము మిగిలి ఉన్నంతవరకు భరతశాస్త్రోత్కృష్ట సంప్రదాయాను సారముగా కన్నులకు మిరిమిట్లు, గొలువుతూ నర్తించును" అని చిలుకూరి నారాయణరావుగారు ప్రశంసించినారు.[2]

ప్రియుడు వేరొక చపలాక్షిని కూడి తనకిష్టము లేని పనులేమి చేసెనోయని, తనకు కల్గిన అపశకునములను బట్టి సందేహించుచున్న వేళ, తన అనుమానము నిజమనునట్లు చెలి, పారిజాత సుమప్రదాన విషయ మెరింగింపగానే ఉరగాంగనవంటి మానినియగు సత్యకు, ప్రియుడు తన యెడల చేసిన అనిష్ట కార్యము, తాడనము వలె అయినది. ఆడుపామునకు సాహసమెక్కువ. దెబ్బ తినిన పాము, ప్రతీకారము చేయక మానదు. దండతాడిత

1. *సం. హరి. వి. ప. 65-51*
2. *'పారిజాతాపహరణము' - భారతి - 1941 జూలై - పు. 6*

సర్వాంగనవంటి సత్య తనకు జరిగిన అవమానమునకు ప్రతీకారము తీర్చుకొనగలదని కవి వ్యంగ్యముగా సూచించినాడు. ప్రియుడు తనకేమి అపకారము చేయుచుండెనో అని ఆందోళనముతో, అగ్నిహోత్రము వలె మండిపడుచున్న సత్యకు చెలి చెప్పిన ఉదంతము ఆజ్యము వంటిదయ్యెను. నేయి పోయగా మంట మరింత ఎఱ్ఱగా, పెద్దగా మండును. కోపాతిశయముతో మండి పడుచున్న సత్య, మంట యెదుటి వస్తువును మండించునట్లు, పతిని తన కోపాగ్నిచే విరహమునకు లోను చేసి తపింపచేయ గలదనెడు ధ్వని యున్నది. ప్రేటువడ్డ ఉరగాంగన బుసలు కొట్టి లేచును. నేయి పోయగా, అగ్ని జ్వాల భయంకరముగ ఒక్కమారుగా భగ్గుమనుచు విజృంభించును. సత్యయు మానభంగము కల్గుటచే కోపాతిశయముతో అంత తీవ్రముగా లేచినది. నారదుని మాయలు, రుక్మిణి నటనలు వినగానే, కోపముతో కను లెఱ్ఱబడినవి. ఎంతగా ఎఱ్ఱబడినవనగా, అవమానభారముచే తన చూపుల నామె క్రిందకు ప్రసరింపచేయగా కనులలోని ఎఱ్ఱదనము చెక్కులపై పడగా, అచట మకరికా పత్త్ర రచన చేసినట్లుగా అనిపించినది. చెలి చేసిన వర్ణన వినగానే తన పతి దూరమగునేమో యనెడు భయము! ఈ రెంటి కారణముగ డగ్గుత్తికచే కంఠము క్షీణింపగా "గద్గదఖిన్న కంఠియై"నది.

నారదు డచటికై వచ్చి, అనగా రుక్మిణీ గృహమునకై వచ్చి తనను గూర్చి తక్కువచేసి మాట్లాడుట నమ్మలేని వింతగా అనిపించినది. కావుననే "ఏమేమీ కలహాశనుం డచటకై యేతెంచి యిట్లాడెనా?" అని ఏమేమీ అనెడు ద్విరుక్తి ప్రయోగముతో, తన సంభ్రమాశ్చర్యములను ప్రకటించినది. 'కలహాశనుడు' కావున అతడట్లు పల్కిన పల్కియుండవచ్చును. కాని తన ప్రాణేశుడు ఆ మాటలు చెవి యొగ్గి వినుట తనకు నమ్మలేని విషయము, భరింపరాని అవమానము! "ఆమాటల్చెవి యొగ్గి తా వినియెనా యాగోపికా వల్లభుండు" అని ఆశ్చర్యపడుచు అడిగినది. అనాగరిక వనితలగు గోపికలకు వల్లభు డగుటచేతనే తన భార్యను గూర్చి పరుడొకడు నిందా వాక్యములు పలుకుచుండగ వారింపక,ఆదర భావముతో వినినాడనెడి కోపముతో పతిని "గోపికావల్లభు" డని పేర్కొనినది. సవతి కావున రుక్మిణియు అసూయతో తనను గూర్చి యేదైనను అనియుండును. "... ఏమే మాడెను రుక్మిణీసతియు" అని కుతూహలముతో ప్రశ్నించినది. చెలి సమాధాన మీయకపోవుటచే జంకు వలన, చెప్పలేక దాచుచున్నదని సందేహించి, "నీ మోమాటలుమాని నీరజముఖీ నిక్కం బెఱింగింపవే" (1-83) అని బ్రతిమాలుకొనినది.

*'అతులమహానుభావమని యవ్విరిఁదానొక పెద్దసేసి య.*
*చ్యుతునకు నిచ్చుకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చెగాక" ... (పారి-84)*

అని నిర్లక్ష్యముగ అనినది. సత్య దృష్టిలో ఆ పుష్పము కేవల మొక సాధారణపుష్పమే. కాని, దివ్యమైనది కాదు. కావుననే "అవ్విరి" అని నిరాదరణతో పేర్కొనినది. అట్టి పుష్పమును నారదుడు "తానొక పెద్దసేసి," ముఖస్తుతివలన ప్రేమ కల్గునట్లు కానుగగా ఇచ్చెనని అలక్ష్య భావముతో అనినది. అతని మాటలు ఇచ్చకపు మాటలేగాని, అందు నిజాయితీ లేదని ఆమె నమ్మకము. ఏ భావముతో నిచ్చినను తనకిపుడు లెక్కలేదు. కావుననే "ఇచ్చిననిచ్చె గాక" అని నిర్లక్ష్యముగ తీసివేసినది. సవతి పేరు ఉచ్చరించుటకు కూడ ఇష్టపడకపోవుటచే 'తానతడు ప్రియంబు గల్గునెడ కర్పణ చేసిన జేసెగాక' అని, 'ప్రియంబు కల్గునెడ' అని, స్త్రీ సహజమైన ఈర్ష్యతో అనినది. కాని ఆ "మతకరి వేలుపుందపసి, మమ్ము దలంపగనేల యచ్చటన్" అని మండిపడినది. నారదుడు కృష్ణునకు పుష్పము నిచ్చుట, అతడద్దానిని రుక్మిణికిచ్చుట, నారదుడు తనను గూర్చి తలచుట, అను మూడు పనులలో సత్యకు 'అచట'

అనగా, సవతి యింట తనను తలచుటయే తీవ్రమైన అవమానముగ భరింపరాని బాధగా అనిపించినది. "నన్నను"టకు 'మమ్మ'ని చెప్పియుండుటచే స్వాభిమానాతిశయంబు సూచితంబు"[1]

నారదుడు "పలుతెఱఁగు ముళ్ళమాటల, గలహమె కల్యాణమని జగంబుల వెంట మెలగెడు మౌని కావున, అట్టివానికి కలహపు మాటలు సహజము. కాని తనకు వల్లభుడై యుండిన కృష్ణుడతనిని వారింపక పోవుట, అమ్మానవతికి మిగుల బాధను కల్గించినది. అందులకే "ముని యేమిసేయు?" (పైది. 1.86) అని నారదుని చర్యను క్షమింప గలిగినది. రుక్మిణికి, పతి పుష్పమిచ్చుటచే స్వీకరించినది, కావున ఆమెను నిందించుటలో అర్థము లేదని భావించి" రుక్మిణీ గొన కారణమేమి?" అని సమాధానపడినది. కాని ప్రాణమైన మగడు మాత్రము తనను మరచి, సవతికి పుష్పమునిచ్చుట, పరుడు తనను నిందించుచుండగా వినుట యనునని మాత్రము భరింపరాని కోపావేశములను కల్గించినవి. అందుచేతనే "మన మెరియదె ప్రాణమైన మగఁడిట్లయినన్" అని మండిపడినది. తానాతనిని ప్రాణముగ భావించినను అతడు మాత్రము తన ప్రేమను గమనింపలేని అనాగరికుడైన పసుల కాపరి.పైగా మోసము చేయుట పుట్టుకనుండి నేర్చిన ధూర్తుడు. కావుననే "ధూర్తగోపాలుడు సేసిన చెయిద మేమి చెప్పుదు"? (పైది) అని కుమిలినది.

పతిని ఏడుగడగ, ప్రాణసదృశబంధువుగ, సర్వస్వముగ, తాను భావింపగా, అతడా కుసుమమును సవతికిచ్చి "కడుమేరతప్పినాడు" (పైది. 96). అదియే అతడు కావించిన మహాపరాధము. గోపాలుని కాపట్యము పురుషులపై ఆమెకుగల నమ్మకమునే మార్చి వేసినది. వారు "శరదంబుద చలచిత్తు" లను సిద్ధాంతమునకు వచ్చినది (పైది. 1.87). తమ జాడల పరికింపక, స్త్రీల తగులమ్ములు మాత్రము నమ్మరాదని, వారందరు. కాని నిజమునకు వారినే నమ్మరాదనుచు, తనకు జరిగిన మోసము వలన లోకములోని పురుష ప్రపంచము పైనే సత్య ధ్వజమెత్తినది.

కృష్ణునకు రుక్మిణీ కాంతపైనే నిజమైన గౌరవము, కృపయు, ప్రియము కలదని సందేహించినది. కాని "దానేమియుఁ గానసీక" ఇన్ని దినంబులు మొగమాటమునకై తనయెడ నాటకములాడి, మోసముతో తేల్చినాడు. కృష్ణుడు మోసముచే మురాసురుని చంపినవాడు. ఆ అలవాటుచేతనే తనను మోసగించినాడు. కావుననే "మెచ్చవలదా మురదానవభేది కృత్యముల్" (పైది. 89) అని వ్యంగ్యముగా ఎత్తిపొడిచినది. తాను "మేలుగీళ్ళకు" పూనుకొని వ్యవహరించును. నరకాసుర వధాసమయమున పతికి తానెంతగానో సాయపడినది. నరకాసుర దమనుడను పేరు తన వలననే ఆతనికి వచ్చినది. లోకమున కీ విషయము తెలియును. కాని అతడద్దానిని పారిజాతపుష్పము లభించిన వేళ మరచుట సత్యామానినికి గొప్ప ఆశ్చర్యమనిపించినది. "ఆ నరకాసుర దమనుఁడు, దానెఱుఁగడో" (పైది. 1.91) అని గద్దించినట్లు చెలిని అడిగినది. కలలోనైన నవ్వులకైనను ఆమె మాట జవదాటడు. ఏ పదార్థంబు ఆమె యెదుట పెట్టక ముందు ఎవ్వారి కొసగడు. ఇది ఆచారముగ వచ్చుచున్నది. అట్టి దీనాడు ఆ ఆచారమునకు విరుద్ధముగ దివ్యపుష్పమును తనకీయక "చపలాక్షి" యగు సవతికిచ్చినాడు. చెలులు తనతో ఏమి చెప్పుదురో యని భయపడి లంచంబు లిచ్చువాడు. ఈనాడెట్టి సంకోచమును, భయమును లేక తన చెలిముందే సవతికి కుసుమ ప్రదానము చేసినాడు. తోడి చేడియలు తనతో వంతులకు రాగా, సహింపజాలడు (1-94). ఈనాడు తానే సతికి పుష్పమునిచ్చి ఆమెను అధికముచేసి, తనను కించపరచినాడు. మగని

*1. నాగపూడి కుప్పుస్వామయ్య - పారిజాతాపహరణము - పరిమళోల్లాసవ్యాఖ్య - పు. 51*

కూరిమి కలదానను గరువతన మీనాడు భంగపడుటచే తీవ్రకోపావేశములకు లోనైనది. పతి చేసిన మోసమువలన పతిని ప్రాణవల్లభుడనుటకు నిష్టపడలేదు. అతనిని "శౌరి అనియు సవతిని చపలాక్షి" యనియు పేర్కొనినది. ఒక సాధారణమైన కుసుమమును, నారదుడు శౌరికీయగా ఆ విరిని అతడు సవతికిచ్చినాడు. ఇట్టి విషయములు చెవి సోకిన వెంటనే, మానవతియగు స్త్రీకి ప్రాణములు పోవలయునని సత్య ఉద్దేశము. ఇంతటి అవమానము జరిగిన తరువాత, దేహమున ప్రాణములు దాల్చియున్నను మానసికముగ మాత్రము మరణించినది. "ఇట్టి అవమానము కలుగునట్లుగా, నోములు నోచితిని. నా నోముల ఫలమింతే? ఇంకను ఎట్టివి కనుంగొనుటకు జీవించియున్నానోకదా!" అని అంతులేని మానినీత్వమును ప్రదర్శించినది[1]. సవతిముందు అవమానము జరిగిన తరువాత జీవించుట అనవసరమని భావించిన దీలలామ. ఈ అవమానము వలన రుక్మిణి ముందేకాదు, సవతు లందరి ముందును తాను చులకన చేయబడినది.

*"ఇన్నిదినంబులు న్సవతులిందఱలోఁగడు గౌరవంబునం*
*గన్నియ నన్ను వల్లభుఁడు కన్నుల గప్పుగొనంగనుండి యా*
*వన్నెయు వాసియుండఱిఁగి వారుననుం దలలెత్తి చూడఁగా*
*నన్నలఁ జాయలం బలుకసైఁతునె ప్రాణము లెంత తీపొకో"* ....(పారి-1-88)

అని తపించిపోయినది. కృష్ణుడు తనను కంటికి రెప్పవలె చూచుకొనుట చేతనే తనకు 'వన్నెయు వాసియు' కల్గినవి. ఆకారణమున సవతులు తనను తలలు పైకెత్తిచూడలేక పోయెడివారు. అట్టిది ఈనాడు తనకు కల్గిన అవమానము తెలిసినచో వారు జాడలతోను, పరోక్షమున ఇష్టము వచ్చినట్లును, తనను నిందింతురు. ఇంతటి 'వన్నెవాసి' కల్గిన తాను ఆ అవమానమును సహించి ఎట్లు జీవింపగలదు? నిజమున కిట్టిది జరుగగానే, వెంటనే ప్రాణములు వీడవలయును. కాని ప్రాణములపై తీపి ఎక్కువగుటచే పోకున్నదని విసుగుకొనినది. సత్యభామా మానినీత్వాతిశయ నిరూపణమున కీ పద్యమొక చక్కని ఉదాహరణము. సత్య తాను మానవతి యగుటయే కాదు, ఇతరులునట్లే అభిమాన ధనులై యుండవలయునని తలంచును. మానహానికై తాను ప్రాణములను కూడ తృణీకరించు మానవతియై యుండగా, సవతులు "... వాసియు వన్నెయుం దగవు వైభవముం జలము న్వివేకమున్‌బోన్", రుక్మిణిని భజించుటకు పోవుట సత్యకు "వెఱఁగయ్యె"ను. (పైది. 1-92). రుక్మిణి ఆ కుసుమంబు దాల్చిన మహిమ వలన, సవతులందురు అసూయ విడిచి ఆమెను సేవించుచున్నారని చెలి, సత్యతో చెప్పియున్నది. నారదుడును ఆ పుష్పమునకట్టి మహిమ కలదని మున్నె నుడివియున్నాడు. నిజమున కట్టి మహిమయే యున్నచో, సత్యభామయు మచ్చరము తొలగి రుక్మిణిని సేవింప నేగి యుండవలయును కదా! సత్యలో ఈర్ష్యాసూయలను రేకెత్తించుట కొరకే నారదుడు ఆ పుష్ప మహిమనట్లు అతిశయింప చేసియుండును. సవతులు రుక్మిణికి లభించిన నూతన సౌభాగ్య శ్రవణముచే, అగ్రమహిషి యనెడు గౌరవముతో సేవింపనేగి యుందురు. వ్యక్తిలోని వన్నె వాసి, ఔచిత్యము, వైభవము, పట్టుదల, వివేకము - వీనికెపుడు భంగము రాకూడదని సత్య తలంచును. దీనిలో, దేనికి భంగము కల్గినను మానహాని జరిగినట్లే. రుక్మిణి యింట తానుండుటచేతనే కృష్ణుడా పుష్పమును ఆమెకిచ్చినాడు. కేవలమా చిన్న కారణమునకై, పై ఉదాత్తగుణము లన్నింటిని విడిచిపెట్టి సవతులు, రుక్మిణి కడకేగుట సత్య కత్యంతాశ్చర్యమును కల్గించినది. అతివలు తమకు జరిగిన భంగపాటును, అందును ప్రియుని వలన కల్గిన భంగపాటును ఆత్మీయులైన,

1. పారి - 1 - 90

చెలులకు చెప్పుకొనుట సహజము. సత్యభామయు తన మనోవేదనంతయు ప్రియసఖికి వెళ్ళబోసికొనినది. కాని మూలము నందిట్టిది లేకపోయినను తిమ్మన మాత్రము, సత్యభామ తన చెలితో, తనమదిలోని కలతను నివేదించు కొనుటను చిత్రించి, భామాకలాపపు సత్యాకలాపమునకు మార్గమును చూపినాడు. సత్య మానినీత్వాభివృద్ధికి ఆమె చెలియు దోహదమైనది.

తాను కులకాంత. పతి తన యెడ మేర దప్పినాడు కావున కులకాంతయగు తనకు 'వేఱుగతి' లేదని తలచినది.

*"ధనమిచ్చి పుచ్చుకొన్నను*
*మనమున నోర్వంగవచ్చు మగడింతులకున్*
*జనవిచ్చి పుచ్చుకొన్నను*
*మనవచ్చునె యింక నేటిమాటలు సెపుమా"* ....*(పారి- 1-97)*

అని, ఒక నిర్ణయమునకు వచ్చినదీ మానినీ లలామ. తన జీవితములో ధనము కన్నను పతి చనవులనే ప్రధానమని తలంచినది ఈమె. రుక్మిణి సవతియే కావచ్చును. కాని సత్య దృష్టిలో కృష్ణుడు తనకు మాత్రమే పతి. అట్లనుకొనునట్లు అతడును వ్యవహరించినాడు. ఈనాడు పతి వేరొక కాంతకు చనవిచ్చి పుచ్చుకొనినాడు. కావున జీవించుట అనవసరమను నిర్ణయమునకు వచ్చి మిక్కిలి దుఃఖించుచు 'జనితామర్షమున" "హరిచందన కోటరమునకు నాగతరుణియు బోలె" ఆలతాంగి కోపసదనంబునకు" చనినది. (పైది. 1-98). కోప గృహమున కడుగిడిన వారిలో సాహిత్యమున సత్యభామకు ముందు కైక మాత్రమే కనిపించును.[1] హరిచందన కోటరమున కేగిన, నాగమునకు అది ప్రీతిదాయక మగును. ఉద్ధతియు అధికమగును. అదే విధముగ దుఃఖాతిశయము కలుగగా, తీవ్ర ఉద్ధతిగల నాగతరుణివంటి సత్య, సంప్రీతి కల్గించునదియు, పరితాపాద్యావేగమును కల్గించునదియు నగు కోపాగారమున ప్రవేశించినది.

"మాసిన చీరగట్టుకొని," నిరస్తభూషయై వాసెనకట్టుగట్టి నిడువాలిక గస్తురి పట్టు వెట్టి, ఆ "చీకటింటి కడకంకటిపై జలదాంత చంద్రరేఖా సదృశాంగియై" "గాఢ మనోజ విషాద వేదన"తో "మౌనముతోడ పొరలినది (పైది 1-99). మగనిపై నలుకబూనిన మానిని యొనర్చు కృత్యములే ఈయవి! పదునాల్గవ శతాబ్దమునకు చెందిన శ్రీమదుమాపతి రచించిన సంస్కృత "పారి జాతాపహరణ నాటకమను ఏకాంకికయందు, "కృష్ణుడు పారిజాతమును రుక్మిణి కిచ్చుటను చూచుచున్న సత్య, మొదట హర్షము ప్రకటించియు, సఖియైన సుముఖి మాటల వలన ఈర్ష్యను పొంది కోపగృహమును బ్రవేశించినట్లుగా తెలియుచున్నది.[2] కాని మానవతియైన సత్య .మొదట సంతోషించునట్లు చెప్పుట ఆ పాత్ర కుచితముగ లేదు. తిమ్మన చిత్రణలో సత్యామానినీత్వము పోషింపబడినంత సముచితముగ, మరియే పూర్వకవి చిత్రణలోను కనిపింపదు.

సత్య ఆత్మాభిమానము నెరిగిన నారదుడు "స్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు విన్నవించినన్" (పైది 1-66) అని అనినాడు. నారదుని ఊహ నిజమనునట్లుగా సత్యభామయు 'మౌనముతో, గాఢ మనోజ విషాద వేదనతో, పొగిలినది'. పతి దూరమైనాడు కదా అనెడు తాపముచే, ఈ మానినికి మనోజ బాధయు, సవతికి అధీనమైనాడు కదా అనెడు ఈర్ష్యయు కల్గినవి.

---

*1. రామాయణము - అయోధ్యాకాండము - సర్గ 10- 5, 6, 8*
*2. పి. యశోదారెడ్డి - పారిజాతాపహరణ పర్యాలోచనము - పు. 78.*

శ్రీకృష్ణునకు సత్య ఆత్మాభిమానాతిశయ మెట్టిదో బాగుగా తెలియును. కుసుమ ప్రదాన విషయమును వీక్షించిన 'సాత్రాజితిబోటి' నా వలన దానేమేమి కల్పించెనో" అని భయపడి మునిచెంత ప్రద్యుమ్నుని నిలిపి, భయాందోళనములతో 'చనుదెంచె'ను. కోప గృహమున సత్యయున్న విషయమును గ్రహించి, అచటికేగి తాలవృంతము తీసి సత్యవెనుకన నుండి నెమ్మదిగా వీచినాడు. దివ్యవాసన లెచటి నుండి వచ్చుచున్నవోయని విస్మయముచెంది 'ముసుంగు ద్రోచి' చూచినది. అతనిని చూడగానే కన్నుల నీరు తిరుగగా మరల ముసుగిడినది (పైది. 1-111).

'ఆ మంచము మీద నామెకు కొంచెము నిద్రపట్టింది...కృష్ణుని నంటి అతనితో వచ్చిన పారిజాత పరిమళము నిద్రపోతూ ఉన్న సత్యకు క్రొత్తగా సువాసనగా గోచరించినది" అని తాపీ ధర్మారావు గారు పై ఘట్టమును వ్యాఖ్యానించినారు.[1] సత్య, ఆ సమయమున మదన బాధయు సపత్నీమాత్సర్యమును, వీనినన్నింటికి మించిన మానినీత్వభంగముచే కోపోద్వేగమును కల్గియుండినది. "వెడవెడ కన్నుమూయు గనువిచ్చును" (పైది. 1.101). అంతేకాని నిద్రపోలేదు. "వగలఁగుందుచుండె" ననియు (పైది. 1.102) కవియే వర్ణించి యున్నాడు. క్రోధావేశములతో నున్నవారు నిద్రపోలేరు. సత్యవంటి మానినికి ఇంత తీవ్రముగ మానినీత్వ భంగము జరిగియుండగా, ఎట్లు నిద్రింపగలదు? "కనులు మూసి" 'ముసుంగిడినది'. అంతే! అది నిద్రకాదు. కోపనచేష్టలలో నిదియు ఒకటి.

'సత్య, అతని ప్రాణముల కంటె మిన్నగా ప్రియమైనది. ఆదరణీయమైనది. కాని స్వాభావికముగ మానిని. ఇది తెలిసియే కృష్ణుడు మెలమెల్లగా కోపగృహమున అడుగిడెనని' మూల హరివంశము సత్యను మానినిగ చెప్పినది.[2] కాని సంభృతతాల వృంతుడైన పతిని చూచిన సత్య 'గద్గదకంఠముతో" నీ శరీరముపై అట్టి సుగంధ ముండుట సహజముగనున్నది" అనియు,[3] తన చేతులతో ముఖమును దాచుకొని భ్రుకుటి ముడిచి తీక్షణముగా "చాల గొప్ప పనిచేసినావు" అనియు[4] విమర్శించి నట్లునున్నది. తీవ్రమైన కోపమున నున్న మానిని ప్రణయాపరాధము కావించిన ప్రియుడు, చెంత చేరినపుడు మాట్లాడదు. బ్రతిమాలుకొనిన తరువాతనే మాట్లాడును. మానినుల స్వభావము నెరిగిన తిమ్మన చేతిలో ఈ మానవతీ లలామ అట్లే వర్తించినది.

"మానవతి యిట్లు మానని మానక్రోధములచే గుమారిలి చింతాధీనగతి నుండ"గా ధూర్త గోపాలునికి సహితము మనసు ద్రవింపగ, ప్రేమతో ఆమెను, పలు విధములుగ బ్రతిమాలుకొనుటకు పూనుకొనినాడు. ఆ మానవతి "చిత్తమున బాటిలు కోపభరంబు" దీర్ప నేవిధముగను వీలుగాకపోవుటచే, ఆమె పాదములకు శిరముంచి 'మ్రొక్కినాడు'. పాదములకు మ్రొక్కిన పతియెడల ప్రసన్నయై క్షమాభిక్ష నీయలేదు. ఆ మానవతి, తన నవమానపరచిన వారికి తగిన శిక్ష విధించినగాని మానినుల కోపము చల్లారదు. పేరలుక చెందియున్న దగుటచే సత్యయు, జలజాతాసన వాసవాది సురలచే పూజింపబడునట్టిదని గాని, పవిత్రమైనదని గాని, సుకుమారము సుందరమైనదనిగాని, ఆలోచింపక ఆ జగన్నాథుని శిరమును, 'వామపాదముచే' తొలఁగంద్రోచిన' ది (పైది. 1-121). సత్య తీవ్రమానిని యనియు, తానిందులకు ఆగ్రహించి వెడలిపోయిన "మానరహితమమైన బ్రదుకు నీడ్వలేక విషము

1. తాపీ ధర్మారావు - పారిజాతాపహరణ పీఠిక - ఆంధ్రసాహిత్య అకాడమీ ప్రచురణ-పుట. 17
2. సం. హరి. వి. ప. - 66-3
3. సం. హరి. వి. ప - 66 - 21
4. పైది 66-23

తినియో, ఉరిపోసికొనియో మరణించునను భయము కృష్ణునకు కల్గియుండవచ్చును. కావుననే సత్య చర్యకు కోపము పొందలేదు సరికదా, మరింత శృంగార భావోద్దీపితుడై, తనను "భవదీయదాసుడ"నని ప్రకటించుకొనుచు, నెయ్యపు, గిన్కచే ఆమె తాచినయది మన్ననగా భావించుచున్నాననుచు, తన తనుపులకాగ్ర కంటక కవితానమామె సుకుమారమైన పదపల్లవంబు తాకియున్న, నొచ్చి యుండునని భయమును ప్రకటించుచు "అల్కమానవు గదా యికనైన నరాళకుంతాలా"? (పైది 1-123) అని ప్రార్థించినాడు. ఇట్లాతడు అర్థించుచున్నను ఆ మానవతి ఆర్ద్రచిత్తకాలేదు. ఈ అర్థింపు ఆతని "నయగారపుంబ్రియము, మొగ మిచ్చుమాటలు"గానే సత్యకు తోచుటచే, ఆవేశము కల్గి,

*".... ..... ..... ..... ..... ......*
*నిను నమ్మియుండిన ఫలంబిదె తోడనకల్గె నాకు నీ*
*యానసుమీ ననుం జెనకి యాఱడి వెట్టిన, నవ్వువారలం*
*గాన వెఱుంగునే పసులకాపరి భావజ మర్మకర్మముల్" ......(పారి-1-125)*

అని అతని ధూర్తత్వమును నిందించుచు, అతని అరసికతను నీసడించుకొనినది. నవ్వువారలు అనగా 'రుక్మిణి' అని సత్య ఉద్దేశము. తనకు మానహాని జరిగిన, ఆమెకు ఆనందమని ఈమె బాధ. తర్వాత మూలమున, కృష్ణుడు సత్యను బ్రతిమాలుకొనుచు ఆమె కోపమునకు కారణమును వివరింపుమని తనపై ఒట్టు పెట్టుకొని అడుగును.[1] కాని ఈ ప్రబంధ సత్య, నన్ను ఉద్దేశించి పరిహసించిన నీ మీద ఒట్టు అని మగనిపైనే ఒట్టు పెట్టుకొనినది.

*"ఇంకిటు నిన్నునమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం*
*బొంకము గాని యీవలని బొంకులు, మాచవి గావు రుక్మిణీ*
*పంకజపత్త్రనేత్రకును బ్రాణప్రదంబులు గాని, వల్లవీ*
*కింకర! చాలుఁజాలు నుడికింపకు నింపకు లేని కూరుముల్" .....(పైది 1-126)*

అని సపత్నీమాత్సర్యముతో పతిని నిందించినది. "మాచవిగావు" అని "స్వకీయ మానాతిశయము"ను ప్రకటించుకొనినది. భర్తకదా! అని అతనిని తాను అమాయికముగ నమ్మి నందులకు తన గుట్టు అనగా మానమును, తేజమును కోల్పడిపోయితినని, ఇట్లు ఆరోపించినది.

*"గట్టివచేతఁలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ*
*బుట్టిన వెందులేని పలుఁబోకల మాయలు నీకు వెన్నతోఁ*
*బెట్టిన వౌలెరింగియును, బేలతనంబున నిన్ను నమ్మి నా*
*గుట్టును దేజము న్నిగులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్" .....(పైది 1-127)*

సత్యభామ స్వామిని వ్యాజనిందాత్మకముగ స్తుతించుచునిట్లన్నదని ధారా రామనాధశాస్త్రిగారు విశ్వసించుచున్నారు.[2] మానవతియైన సత్య ఇచ్చట, శ్రీకృష్ణుని కేవలము మానవునిగ, పతిగ, మాత్రమే భావించి, తదనుగుణముగ వర్తించినది. ఆమె కిచట కనిపించినది పతికావించిన తీవ్ర ప్రణయాపరాధమే కాని, వేరేదియు కాదు. ఆముక్త మాల్యదయందు మానినియగు గోదాదేవియు శ్రీకృష్ణుని పూర్వావతారములను స్మరించుచు, అతనిని నిందించును.[3] ఆ నింద వాస్తవమునకు నిందారూపమున నున్న స్తుతి. ఆమెది

1. *సం. హరి. వి. ప. 67-3*
2. *ఆంధ్రవాఙ్మయము శ్రీకృష్ణకథ - పు -198*
3. *ఆముక్తమాల్యద - 5 - (40-54)*

మధుర భక్తి. కాని సత్యకు జరిగినది తీవ్రమానహాని యగుటచే, ఇచట యీమె మాటలలో వ్యాజనింద కవకాశమే లేదు.

తాను వినిన వృత్తాంతము నిజమని నిరూపించునట్లు పతి అటకు పారిజాత వాసనలతో వచ్చుట తనను పరిహసించుటకే కదా! అని పొగిలిపోయినది. కృష్ణుడామెకు మిగుల చనవు లిచ్చుటచే, అత్తయగు దేవకీదేవి, "తనదు కోడండ్రలోన బెద్దయుగ" ఆమెను మన్నించుచుండెడిది. అత్తగారికి కూడ తెలియునట్లు, ఈ విధముగ అవమానము జరిగిన తరువాత తానామెను ఇక ఎట్లు చూడగలదు? "ఆ సాధ్వీసేవ సేయ బోవంగ నాకింక సిగ్గుగాదె" అని క్రుంగిపోయినది. మానమె ప్రాణాధికము, మానమె అఖిల సమ్మానములకు మూలమగునని భావించు మానినియగు తాను, అట్టి అవమానము తరువాత జీవించుట అర్థరహితము. కావున "మానరహితమైన బ్రదుకు మానినికేలా?" (పైది. 1-129) అని మరణింపవలయుననెడు నిర్ణయమునకు వచ్చినది. కాని తాను మరణించినచో తనకు చెందిన పతిగాని, తన వస్తువులుగాని మరి యొకరికి దక్కుట ఈమె కిష్టము లేదు. అన్నిటికన్నను ముఖ్యముగా తన పతి, వారికి శాశ్వతమగునేమో యనెడు భయము! కాని అందులకై తాను జీవించిన, మానినీత్వ భంగము జరిగిన తనను చూచి, సవతులు నవ్వేదురు. అది మానవతి యగు తానేమాత్రము భరింపలేదు. వారు నవ్వుటకు ముందే మరణింపవలయును. కావుననే

*"నన్ను నాతోడి సవతులు నగక మున్న*
*పంతమలరంగ, నిన్ను మెప్పింతుఁగాక!" .....(పైది. 131)*

అని శపథము చేసినది. పంతమాడినట్లు నెరవేర్చుకొను మానిని తాను. అంతే కాని మానమును మరచిన ఇతర కృష్ణపత్నుల వంటి సాధారణ వనితకాదు. అందులకే "నను నెవ్వతిగా జూచితి"వని గద్దించినది. (పైది-132). ఈ ఒక్కమాట చాలును, సత్యభామ 'మానినీత్వాతి శయమును' నిరూపించుటకు!

మూలమునందు, సత్య ప్రముఖముగ భక్తురాలైన ఒక ప్రణయతపస్విని. ఆమె ఆరోపణములందు గర్వముకన్నను, దైన్యము, భక్తి అధికము.

*"ఋజుస్వభావాం భక్తాం, చ, సర్వథా పురుషోత్తమ !*
*అవజానాసి జానన్ మాం, కైతవీం, వృత్తి మాస్థితః ॥ ...(హరి. వి. ప. 66-51)*

'పురుషోత్తమ నా స్వభావము సరళమైనది నీయెడల సర్వదా భక్తితో కూడినది. ఇది తెలిసియు నీవు కాపట్యముచే అవహేళన చేయుచున్నావు' అని సరళముగానే పలికినది.[1] కోపమునందు సహితము ప్రభూ! అని పిలువగల్గిన భక్తి, సహనములు కలది. నేమాని భైరవకవి అనువాద హరివంశమునందును, సత్య "మృదు భావంబులును, భక్త్యాస్పద హృదయము"ను కలది.

కాని ప్రబంధ సత్య మాత్రము, అపరాధియైన పతిని ధూర్తునిగ (పారి. 1-86) "పసులకాపరి" గ (పైది. 1-125), "వల్లవీకింకరుని" గ (పైది. 1-126), సవతి యగు రుక్మిణిని "చపలాక్షిగ", (1-90) "కామిని"గ (1-89), దివ్య మునియగు నారదుని, "మతకరివేలుపుందపసి"గ (పైది 1-84), "కలహాశనుని"గ (1-83) తెగడినది. "కోపముతో నున్న మానినులు ఎదుటివారెవరైనను లెక్క చేయరు. ఇది మానినుల సహజ లక్షణము.

ద్రౌపదియు సత్యవంటి మానినీలలామయే. కీచకునిచే అవమానితయైన ద్రౌపది యు పతుల రక్షణ లభింపక పోవుటచే, విరటుని సభకు అభయమును కోరి పరువెత్తి వచ్చి,

---

*1. సం. హరి - వి. ప - 66-47*

మొరపెట్టినది. కంకుభట్టు వేషమున నున్న ధర్మజుడు కులసతియైన ఆమె, ఇట్లు విచ్చలవిడి నాట్యము సలుపు విధమున ప్రవర్తించుట గరువతనము కాదనుచు హెచ్చరింపగా, ధర్మజుని పలుకుల కులికి "మత్పతి శైలూషుండ కాడు, కితవుండునుం గావున జూదరి యాలికి గరువతనం బెక్కడిది?" (భార. విరాట. 2-153) అని, పతిని ఆటకాడు జూదరి అని పేర్కొని తెగనాడినది. తన కవమానము కల్గించినవాడు భర్తయైనను మరదియైనను, మామగారే అయినను ఈమె క్షమింపలేదు. మామగారిని 'మహాపురుషుడని' ఒకచోట (పైది. ఉద్యో. 3-112) పరిహాసముగ పేర్కొనినది కూడ! మానినుల స్వభామట్లుండుట సహజము.

మూలహరివంశమున సత్య మానినీత్వమునకు భంగము కలుగగా, జీవితముపై విరక్తితో, "పురుషోత్తమ! నీ దయకు పాత్రురాలైనచో తపము చేయుటకు ఆజ్ఞయిమ్ము" అని అభ్యర్థించును.[1] ఇంతటి అవమానము జరిగిన తరువాత సత్యవంటి మానవతి తపము చేసియైనను జీవించుట సాధ్యముకాదు. స్త్రీ స్వభావమును పరిపూర్ణముగ నర్థము చేసికొనిన తిమ్మన, సత్యభామచే "మానరహితమైన బ్రదుకు మానినికేలా?" అని అనిపించి, ఆ మానినీ పాత్రమునకు సహజత్వమును సంతరింపచేసినాడు.

ఇంతవరకు సత్య మానవతి కావున, అంతర్బాష్పయగుచునే మాట్లాడినది. కాని ఎంతయైనను స్త్రీ. కల్గినదా తీవ్రావమానము! కావున ".... గద్గదికచే, మఱి మాటలాడ లేక "ఈర్ష్యచే దుఃఖమధికము కాగా 'ప్రాణవిభుని కట్టెదుట' ఏడ్చినది. (పైది 1-133). ఈ ఏడుపులో దైన్యము కన్నను అభిమానము, గరువతనమే అధికము. ప్రియుడు చేసిన అపరాధమును విన్నప్పుడెంత దుఃఖము కల్గినను సతి అంతగా ఏడ్వదు. కాని ఆ ప్రియుడే చెంత చేరి, సాంత్వన పరచుటకు పూనుకొనగా ఏడుపు ఎక్కువగుట సహజమనుటకు, ఈ క్రింది 'గాథా సప్తశతీసార" పద్యమొకటి ఉదాహరణముగ నున్నది.

*"వన్నెకాని తప్పువిన్న యంతనకల్గు*
*వంత నొగలునపుడు నింతులేడ్వ*
*రతడు కంటబడి నయమ్మున దమ్మార*
*డింప జొచ్చునప్పు డేడ్చునంత"* ...(3-83)

ఎంత మానినియైనను సత్యయు స్త్రీయగుటచే, పతి ఉపలాలనములచే ఉద్వేగమును దుఃఖమును నాపుకొనలేక యేడ్చినది.

"ననునెవ్వతెగాఁ జూచితి వని కృష్ణునితోఁబల్కుట యందును కృష్ణుని శిరమును వామపాదమున దొలఁగ ద్రోయుట యందును ఆమె మానినీత్వము గోచరించును". అని దివాకర్ల వేంకటావధానిగారు వక్కాణించినారు[2]. శ్రీకృష్ణుడు కోపభరంబు నిల్పగా నేరక నెవ్వగంబొగులు సత్యను నిండు కౌగిటం జేరిచి బుజ్జగించి నునుచెక్కుల జారు కన్నీరు తుడిచి, "నెయ్యము తియ్యము తోప"

*"... .... .... .... .. ఇంతవంత నీ*
*కేల, లతాంతమాత్రమున కేఁగలుగ న్వేను నీకు దేవతా*
*కేలివనంబు సొచ్చి యనికి న్బలసూదనుఁడెత్తి వచ్చినన్*
*దీలుపడంగఁదోలి, యిటఁదెచ్చెద, నిచ్చెదఁబారిజాతమున్" ...(పారి. 1-135)*

అని కూడ వాగ్దానము చేసినాడు.

---

1. *సం. హరి. వి. ప - 66 - 53*
2. *కావ్యలహరి - పుట. 107*

మూలమున "నీవు పారిజాత పుష్పములే కోరినచో ఇచ్చెదను. ఇంత అననేల? స్వర్గమునుండి పారిజాతమునే తెచ్చి నీ కెంతకాలము ఇష్టమో అంతవరకు నీ యింట స్థాపించెదను" అని అనును.[1] మానినియైన సత్య కోపము, పుష్పములచే తీరదు. కావున తిమ్మన, పుష్పములను తెచ్చెదనను మాటను విడిచి, కృష్ణునిచే పారిజాత వృక్షమునే తెచ్చి యిచ్చెదనని అనిపించి, సత్యమానినీత్వమును చక్కగా కాపాడినాడు. కృష్ణుడట్లు దయ తలచి వాగ్దానముచేసి సాంత్వనపరచినాడు. లేనిలో ఆమానిని నిజముగా ప్రాణత్యాగము చేసెడిదేమో!

పారిజాతమును తెచ్చి నీ కేలివనములో "పెరటిచెట్టుగ నాటింతు" ననియు, "పెంపుగను" మనియు (పారి. 1-136) కూడ అనినాడు. పుష్పమునకు బదులు వృక్షమే దక్కబోవుచున్నది. అదియు తన పెరటిచెట్టు కాబోవుచున్నది. దీనివలన కృష్ణుడు తనవాడని సవతి లోకము గుర్తించబోవుచున్నది. ఆమె కోరుకొనెడు వైభవమదియే కదా! అది గమనించియే ఆమాట హరి యనినాడు. ఆ మాటలు విని సత్య మేఘగర్జనకు పుష్పించిన నీపలతిక వలె కన్పట్టెను. (పైది. 1-137). కాశీభొట్ల సత్యనారాయణగారనినట్లు "ఇందలి సత్యభామ పైపై చూపులకు ఈర్ష్యాకషాయితగా కన్పించును కాని, సూక్ష్మముగ ఆలోచించిన విశేషించిన ప్రేమికగ, ఆత్మాభిమానము కల మగువగ కన్పడు"[2] నను మాటలలో నిజమున్నది.

సత్య మనసులో నేదియు నుంచుకొనదు. అనదలచుకొనినది, ఎవరినైనను ముఖము మీదే అనును. సత్యభామ కోపము తృణాగ్ని వంటిది. అంతలో పుట్టి ఇంతలో ఆరిపోవును. ఇంతవరకు మరణింతునని పంతమాడినది. కాని కృష్ణుడు పుష్పమునకు బదులు చెట్టునే తెచ్చి యీగలనని ప్రతిన చేయగానే అంతయు మరచి మురిసిపోయినది. కావలయుననిన, కృష్ణుడు అట్టి పుష్పములనే తెప్పింపవచ్చును. కాని ప్రేమాతిశయముతో చెట్టునే తేగలననినాడు. "పిల్లవాడు కాణీ యిమ్మని యేడువగా రూపాయి చేతిలో పెట్టినట్లున్న"దని విశ్వనాథవారు చమత్కరించినారు.[3]

సత్య మానహానికై, తాను నాటిన కలహబీజ మెంతవరకు ఫలించినదో చూడ వలయునని ఉత్సుకతతో వచ్చిన నారదునకు, ఆమె భర్తృవాల్లభ్యమును చూడగానే నిరుత్సాహము కల్గినది. ఆమె మానినీత్వము మరింత బలపడినట్లు కనిపించినది. చివరకు 'పతి నీవై విహరించుదాన" వని ఆమెను, ఆమె 'అతుల ప్రాభవవైభవోన్నతులను నుతించుచు "నీ కితర స్త్రీజన బుద్ధి దీవనలు నేనేమిచ్చెద న్మానినీ" (పైది. 2-24) అని సాటిలేని సత్యా మానినీత్వమునకు అప్రతిభుడైనాడు.

బంధువై వచ్చిన కృష్ణుడు, దొంగవలె, పారిజాతోత్పాటనమునకు పూనుకొన, నందనోద్యాన పాలకులు, కల్పవృక్షమును, వంచనతో అపహరించుట తగునా? అనుచు అడ్డగింపగా, సత్య సాక్షాత్తు విష్ణువు యొక్క అపరావతారమైన తన పతిని, కేవలము సామాన్య వనపాలకులు వంచకుడని నిందించుట సహింపలేక, "ఏమే వచియింప బూను హృదయేశ్వరుని' మాట్లాడవలదని కరసంజ్ఞను వారించి తానే ముందునకు వచ్చి "వినుడు! సురేశ్వర వనపాలకులు" అని వారిని నిర్లక్ష్యముగ పిలిచి, ఆ ద్రుమము సముద్రమునుండి పుట్టినదగుటచే, వార్ధిని పొడమిన ఇందిరను స్వీకరించినవాడే, దీనిని కూడ చేకొనుననియు,

---

1. *సం. హరి. వి. ప - 67 - 31, 32*
2. *ఆంధ్ర కవుల ఔచిత్య విచార చర్చ - పు. 167*
3. *పారిజాతాపహరణ పీఠిక - 'ఎమెస్కో' ప్రచురణ - పు. 20.*

ఇది ఇంద్రాణికిగాని, ఇంద్రునకు గాని సొంతమైన సొమ్ము కాదనియు, ఈ వదాన్యనగమును, "నాదు విభునిచే నొడియించుకొని యేగుచున్నా"ననియు అనుచు, శచిదేవి వీరపత్నియైనచో "తనదు ప్రాణేశుడైన మఘవు నిట బంపి సత్యభామా విధేయు వలన మరలంగ గొనుటె పో వాసితనము" అని తీవ్రముగ హెచ్చరించినది. అవకాశ మిచ్చియుండిన, సాత్వికుడైన కృష్ణుడేదైనను సర్ది చెప్పి యుండవచ్చునేమో! వారిని తగురీతి యొప్పించి యుండెడివాడేమో! కాని అది సత్యకు సమ్మతముకాదు. వనపాలకుల మాటలు తన పతిని అవమానపరచినవి. పతి పారిజాతమును తనకై అపహరించినాడు. పతి తానై విహరించునట్టిది తాను! ఆ మాటలు తననే అవమానించినట్లైనది. కావుననే 'కరసంజ్ఞ' చే, పతిని ఆపి తానే వారికి సమాధానమిచ్చినది.

మూలమున ఇంద్రోపేంద్రుల యుద్ధమున ఒకరు ఓడుట, ఒకరు గెలుచుట లేదు. లోకములందు భయోత్పాతము సృజించుచున్నట్లున్న వీరి యుద్ధమును అదితి నిలుపవలసి వచ్చినది.[1] కాని ఇందు, సత్య 'తావీరపత్నియేని, మీ శచీదేవి' తన ప్రాణేశుడైన ఇంద్రునిటకుబంపి, సత్యభామా విధేయు వలన గొనుటె, వీరత్వమని ఆత్మవిశ్వాసముతో గర్వముతో పంతమాడినది. కృష్ణుడు తనకు విధేయుడని ఆమె విశ్వాసము. కృష్ణుడును ఆమె నమ్మకమునకు తగినట్లు నడచుకొని, యుద్ధమున ఇంద్రుని జయించి పారిజాతమును గ్రహించి, సత్య మానినీత్వమును కాపాడినాడు.

పారిజాతాపహరణ సత్యభామ కోపన కాదు. ఆమె మానిని "ఆమెను కోపన అనుటకంటె, మానిని అనుటయే న్యాయము" అను చెన్నాప్రగడ తిరుపతిరావుగారి మాటలు[2] పూర్తిగా సత్యములు. స్వాభావికముగ మానినియగు సత్యభామ మానినీత్వాభివృద్ధికి ఆమె చెలులును, శ్రీకృష్ణుడును దోహదముచేసి, సత్యను మానినీ శిరోమణిగ మలచినారు.

## పుణ్యకవ్రతాచరణము - సత్యభామా మానవివర్ధనము

సంస్కృత హరివంశమున సత్యభామ గాక, కృష్ణుడే, పుణ్యకవ్రతమును చేయించుటకు ఉత్సాహము చూపును. స్వర్గమునందలి పారిజాత వృక్షమును కోరుచు కృష్ణుడు నారదునితో

"మునీంద్రా! నేను సత్యభామకు, పుణ్యకవ్రత దానమునకై పారిజాతము నిత్తునని ప్రతిజ్ఞ చేసియుంటిని, అందుచే వృక్షమును స్వర్గమునుండి తెచ్చెదను." అని అనును.[3] అప్పటికి, సత్యభామ పుణ్యకవ్రతమును గురించి చింతింపనే లేదు. ఆ వ్రతమును చేయించు ఉద్దేశ్యము కృష్ణునకే మొదట కల్గినది. కాని పారిజాతాపహరణమునందు, పారిజాత వృక్ష ప్రతిష్ఠాపనానంతరము,నారదుడేగుదెంచి, సత్యతో

"అతులిత తావకీన మహిమాతిశయోచితమైన పుణ్యకవ్రత మొనరింపగా వలయు" ..... (పారి.5-55) అని వ్రతాచరణమునకై ప్రేరేపించును. దీనిని బట్టి కలహాశనుడైన నారదుడొక విశిష్ట ప్రయోజనము నుద్దేశించియే, ఈ వ్రతమున కామెను పురికొల్పినట్లు అనిపించును. "సత్య గర్వమును తగ్గింపవలెను. కృష్ణుని పరాధీనత నామెకు తెలియ జేయ వలయును. దాని కోసమే పుణ్యకవ్రత ప్రస్తావన" అని, చిలుకూరి నారాయణరావుగారు[4]ను, "ఇట్టి మానవతిని గర్వము గలదానిని పుణ్యకవ్రతాచరణము మూలమున కవి నిపుణముగ

---

1. సం. హరి. వి. ప - 75 - (24-27)
2. పంచకన్యలు - పు. 22
3. సం. హరి. వి. ప. 68 - 35
4. చిలుకూరి నారాయణరావు - 'పారిజాతాపహరణము' - భారతి - జులై 1941- పుట.6

గర్వాదులం దొలంగం ద్రోచి, అతుల భక్తియుతగా మార్చి మన కండ్ల యెదుట నిలబెట్టెను" అని దూసి రామమూర్తిగారును[1] అనినారు.

"అత్తమామలకును నాత్మభర్తకు నమస్కృతిసేసి తదీయ సమ్మతితో" తొంటి తనకోపమును, గర్వమును, మత్సరమును విడిచి, వినయము, సంతోషమును తొలకెడు నిండు మనస్సుతో, తొలినాడే సవతుల యిండ్లకేగి, వారిని ఆహ్వానించి వెంట బెట్టుకుని రావలయునని నారదుడు పుణ్యకవ్రతాచరణ విధానమును సత్యకు వివరించును.[2] మూలము నందు కన్నీరు కార్చుట, రోషము, కలహము, తత్కాల ఉపవాసదీక్షకు భ్రష్టము కల్గించునని నారదుడనగా[3] ఈ ప్రబంధమున 'గర్వము' అను మాట నధికముగ చేర్చుటచే, సత్యా గర్వభంగము నారదుని ఉద్దేశమేమోనని అనిపించుట కవకాశమున్నది.

"సత్యభామ గర్వాతిశయము గలది. అందుమూలమున నిక్కుచు విఱ్ఱ వీగుచు కాంతలను గణింపకుండెను. ఆ గర్వము నణచవలయును. అది నారదుని యభిలాష" అనియు, "ఇంతవఱకు సత్యభామ కృష్ణునియందు ప్రణయము కలది. దాని మహిమ యెరుగదు. అందుమూలమున శ్రీకృష్ణుని మహిమనామె కెరుక పరచవలయును" అనియు, "అహంకారమే సత్యభామను వామ పాదమున, జలజాతాసన వాసవాది సురపూజా భాజనంబయిన శ్రీకృష్ణుని శిరమును తొలగం ద్రోయచేసినది. అది నిర్మూలనము కావలయును. ఆ కారణముచేత అత్తమామలకు, నాత్మ భర్తకు, నమస్కార మనుదినము చేయువలయునని నియమించెను" అనియు[4] శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారనినారు.

కాని పరిశీలించి చూడగా సత్యభామా గర్వభంగమునకై ఈ వ్రత ముద్దేశింపబడినట్లు తోచుటలేదు. ఈ వ్రతమువలన ధనకనకవస్తు సమితియు, తనయ సమృద్ధియును కలిగి సతీపతుల మనస్సులలో అఱగొఱలులేక, అనితర సులభైక సుఖము లందుదురని అనుచు నారదుడు పుణ్యకవ్రతఫలమును నిర్దేశించినాడు.[5] మహనీయ సౌభాగ్యమును కోరు సత్యకు, ఇందు"తానుంబతియున్ మనమున నఱగొఱ లెఱుఁగక యనితర సులభైక సుఖములందుదు" రను మాట ముఖ్యముగా ఆకర్షించి యుండును. అందుచేతనే 'అవనతమతియై, గోరికలిగురొత్త గ' 'ధవునియనుజ్ఞ'తో వ్రతారంభమునకు కడంగినది. (పైది 5-63).

వ్రతకాలమునందు అత్తమామలకును, పతికిని అనుదినము నమస్కరింపవలయు ననుట వ్రత నియమము. సత్య, అత్త దేవకిని నిత్యము కొలుచుచుండెనని ప్రథమాశ్వాసము నందలి "అసాధ్వి సేవసేయబోవంగ నాకింక సిగ్గుగాదె" అను మాటను బట్టి తెలియుచున్నది. ఇందు నారదుడుద్దేశించిన గర్వభంగమేమియు లేదు. పేరలుక వలన, పతిశిరమును వామపాదముతో తాడనము చేసినదే కాని, సత్య నిజమునకు పతివ్రత. పతియే 'ప్రాణసదృశ బంధువు, దైవము ఏడుగడ' అని నమ్మినట్టిది. (1-96). కావున పతికి పాద నమస్కారము చేయుట నీమెకు గర్వభంగము కానేరదు.

మగని కూరిమి కలదాననని విఱ్ఱవీగుచు నుండు సత్య, వ్రత నియమానుసారము తొంటి తన కోపము, గర్వము మత్సరంబు మాని వినయమున సవతులను నామతింప వలయును. ఆమతించుటకాదు, వెంట నిడుకొని రావలయును. "ఇది ఒక విధముగా

---

*1. పారి-సురభి వ్యాఖ్య. పు. 19*

*2. పారి. 5-57*

*3. "హరి-వి.ప. 78-25*

*4 శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి - విజయనగరాంధ్రకవులు - పుట. 233, 234*

*5. పారి - 5 - 62*

సత్యభామకు పూర్తియగు శృంగభంగము"[1] అని శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారనినారు. సత్య మానినియేకాని, దుష్టురాలు కాదు. అంతకు ముందే ఎన్నో నోములు నోచియున్నది. వ్రత నియమమగుటచే తనలోని మాత్సర్యాదులను విడిచి, సవతుల నాహ్వానించి యుండును. పైగా ఆ వ్రతము చేసిన, మగడు మరింత స్వాధీనుడగును. కావున తన ఆత్మాతిశయము మరింత పెరుగు నవకాశమున్నది. ఇచట సత్యకు, పై లక్ష్యము నెరవేరుటయే ముఖ్యము. కావున దీనివలనను సత్యా గర్వభంగమైనట్లు తలంపరాదు.

"ఆత్మేశు న్సురానోకహాన్వితుంగా" సకలలక్షణ సంపన్నుడైన ద్విజునకు' ధారవోయ వలయునను వ్రత నియమమును నారదుడు ముందే చెప్పియున్నాడు. "ఇంక మమకారమున్నది. అది వ్రతమునందు భర్తను దానము చేయుటవలన వదలగలదు" అని శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు భావించినారు.[2]

"అదితియు పుణ్య సౌభాగ్యముల అభివృద్ధి కొరకై, వృక్షముతో కశ్యపుని బంధించి, నాకు దానముగ నిచ్చెను. కశ్యపుని కంఠముతో పూలదండను చుట్టి నా చేతిలో దానరూపమున నిచ్చెను. అట్లు చేయుటవలన పుణ్య ప్రాప్తి వృద్ధి పొందును" అని మూలమున నారదుడే సత్యా కృష్ణులకు పుణ్యకవ్రత విధిని గూర్చి చెప్పును.[3] ఇట్లే ఇంద్రాణియు, రోహిణియు, బుద్ధియు, తమ తమ భర్తలను తనకు దానము చేసిరనియు అనును.[4] "అరుంధతియును, గౌరియున్మచియు దత్పర బుద్ధి నొనర్చి"రని ఈ ప్రబంధమున నారదుడు చెప్పెను (పారి. 5-55). తనకన్నను ముందే దివ్యవనిత లెందరో పుణ్యకవ్రతముచేసి, ఫలమును పొందిరనియు, వ్రత విధానమిట్టి దనియు, తెలిసియే, సత్య వ్రతమునకు పూనుకొనినది. ఆ పతివ్రతలును తమ తమ భర్తలను దానముచేసి నిష్క్రయగ కోరిన ధనమిచ్చి,తిరిగి వారిని పొందిరి. సత్యయు అట్లే చేసినది. (పైది 5-88). ఇక, ఇందు గర్వభంగమున కవకాశమెక్కడిది? దానము స్వీకరించి "కపట నటనాపరుడైన కంసవైరిఁ బరమ ముని నవ్వులాటకు పనులు గొని" భగవంతుని పరాధీనతను సత్యతోపాటు, అచటవారి కందరికిని, లోకమునకు, తెలియచేసినాడనుటలో సందేహములేదు. "ఇంతవరకు సత్యభామ కృష్ణునియందు ప్రణయము కలది. వాని మహిమ నెరుగదు. అందు మూలమున శ్రీకృష్ణుని మహిమ నామె కెరుకపరచవలయు" నని నారదుడు పుణ్యక వ్రతాచరణోద్బోధన చేసినట్లుగ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు భావించినారు.[5] పారిజాతాపహరణ సమయమున సత్యా నందనవన పాలకులతో

*"తోడి యిందిరను గౌస్తుభము నెవ్వఁ*
*డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుగాక" ...(పారి-4-59)*

అని, కృష్ణుడు విష్ణువు అపరావతారమనియే వారితో నొక్కి వక్కాణించియున్నది. ఇంద్రాది దేవతలతోడి యుద్ధమున అతని మహిమలను గమనించియున్నది. కావున సత్యకు కృష్ణుని మహిమ తెలియదనుటలో సత్యము లేదు. మానవతీలలామ కావున పతి యిచ్చిన చనవుతో, పేరలుక యందున్నప్పుడు కోపముతో నడచుకొనునుకాని, సత్య అతని మహిమను గ్రహింపలేనట్టిదికాదు.

---

1. *విజయనగరాంధ్ర కవులు - పు. 234*
2. *పైది-పు. 234*
3. *సం. హరి - వి. ప. 67 - 67*
4. *పైది-67-68, 69*
5. *విజయ నగరాంధ్రకవులు - పుట. 233*

సత్య దానము చేయుచున్నప్పుడు సవతులు నిస్సహాయులై సిగ్గుతో ముఖములు వంచిరి. పతి తనవాడను నమ్మకముతోనే దానమిచ్చినది. వ్రతానంతరము నారదుడును "పడతి నీ మనోహరుని జేకొను మిచ్చెద" నని (పైది 5-88) పలికి ఆ మానిని మానినీత్వమును మరింత సుస్థిరము చేసినాడు.

కల్పప్రసూనములు, సవతులు పదియారువేలకు వాయనములుగ, వినయంబున నిచ్చినది. "రుక్మిణీ ప్రభృతులనుటచేత రుక్మిణియందలి యీసు కూడ నశించినదని కవి భావము" -- అని కొందరందరు.[1] కల్పకవిరుల నిచ్చుటచే గర్వము పూర్తిగా తొలగిన దనుటలో ఔచిత్యము లేదు. "ఆగమ విధానము దప్పకయుండ" "రుక్మిణీ ప్రభృతులౌ సవతుల్పది యారువేలకున్" కల్పనగము క్రొవ్విరుల్కనక పాత్రములం దగనించి" "వాయనములు"గ నిచ్చినది' (పారి. 5-90). ఇది వ్రత నియమము కావున అట్లు ఇచ్చినది. అట్లిచ్చుటలో నిజమునకు సవతులపై ఆధిక్య భావమేయున్నది. పారిజాతమును పతిచే తెప్పించు కొనగలిగితిననియు, పతి తనవాడనియు, పంతమునెరవేర్చుకొన గలిగితిననియు లోకమునకు నిరూపించుకొనినది. అంతేకాని, సత్యకు పారిజాతముపై మమకారము లేదు. వ్రత నియమానుసారము వృక్షమునే, సవతుల కీయవలసి వచ్చినను సత్య ఇచ్చియుండును. నారదుని మాటలలో సత్యకు గర్వ భంగము చేయదలచియున్నట్లున్నను, ఆమెకు గర్వభంగము అనగా మానహాని జరుగనే లేదు. పారిజాతాపహరణ వృత్తాంతము వినిన ఇంద్రుడు "సత్య గర్వ భారంబు దివ్య నగంబు న్వెడిపించి వత్తునని"ని (4-61) పోరునకు వచ్చును. కాని ఆ యుద్ధమున, ఇంద్రుడు ఓడగా, అతనిలోని అహము తొలగి, కృష్ణుని భగవంతునిగ గుర్తించుట జరిగినది (5-40). పతి మహావీరుడని గర్వించు సత్య మానినీత్వము మరింత పెరుగ నవకాశమిచ్చినది. పుణ్యకవ్రతాచరణము ఆమెలో సాత్త్వికతను కల్గించిన మాట నిజమే. కాని అది ఏ విధముగాను మానహాని కల్గింపలేదు. కొంతవరకు ప్రాభవహాని రుక్మిణికే జరిగినది. అందులకే కృతకమైన సంతోషము స్పష్టమగునట్లు (5-74) పుణ్యకవ్రతమును చూడ వచ్చినది. పారిజాత పుష్ప ప్రదానముచే గాని, అపహరణ ముచే గాని, పుణ్యకవ్రతాచరణముచే గాని సత్యభామకు మానహాని జరుగలేదు. మీదు మిక్కిలి ఆమె మాన వివర్ధనమునకే అవి తోడ్పడినవి.

## మానిని సత్యభామ - ఇతర ప్రబంధ నాయికలు :

ప్రబంధములలో కూడ సత్యభామ మానినీత్వముతో సాటిగా, పోటీగా వచ్చు మరియొక వనిత కనిపింపదు. మనుచరిత్రలోని వరూథిని, తనపై ఇష్టము చూపని, ప్రవరునిపై కామభావము చూపి. అతడు వారించినను, మానాభిమానములను విడిచి వెంటబడినది. ఇంద్రియలోలుపతచే ఆమె యెడ విముఖుడైన విప్రుని, అలింగనము చేయబోయి, పరాభవమునొందినది (మను. చ. 2-68). కాని సత్యభామ, తన పతి దివ్యపుష్పమును, సవతి కిచ్చినందులకే మానహాని జరిగెనని, కుమిలిపోయి దీనికన్నను ప్రాణహాని మిన్నయని తలచినట్టిది. ప్రబంధనాయికలు విరహమునకులోనై, చంద్రాద్యుపాలంభనములు చేయుట కలదు. విరహమునకు లోనైన వరూథిని, గిరిక, ప్రభావత్యాదులు చంద్రమన్మథాది ఉపాలంభనకు పూనుకొనినారు. ప్రబంధనాయికయైనను సత్య, "మనోజు బాధ" లకు లోనైనదే (1-10) కాని, చంద్రాది ఉపాలంభనములు చేయలేదు. ఇదియే సత్యలోని రాజసము! మానవతులైన ప్రబంధనాయికలలో సత్యభామ తరువాత పేర్కొనతగిన ప్రబంధనాయిక

1. *విజయనగరాంధ్రకవులు - పు - 239*

గోదాదేవి. సత్య, అపరావతారమైన ఈమెయు, ముక్తసరిగ చంద్రుని ఉపాలభించినదే కాని, పైవారివలె తిట్టిపోయలేదు. సత్యభామయు ప్రణయాపరాధము కావించిన తన పతినే పలువిధముల విమర్శించినది, నిందించినది. ఇతర ప్రబంధనాయికలు అవివాహితలు, కావున ప్రియుని నిందింపలేదని తలపవచ్చును. కాని గోదాదేవియు అవివాహితయే. ఆమెయు, విరహతప్తయై, శ్రీరంగేశుని రామావతారమును స్మరించుచు, స్వామి నిర్దయతను విమర్శించినది.[1] ఏ జన్మయందైనను వలచిన వాని దోషములను, నిర్భయముగ విమర్శించు ధైర్య సాహసములు సత్యకు మాత్రమే యున్నవి. సవతికి పుష్పమిచ్చినాడని, సత్యభామ అది అవమానముగా భావించి, కుమిలిపోగా, శ్రీరంగేశుడు తనకు దర్శనమీయకుండుట తనకు అవమానముగా గోదాదేవి క్రుంగినది.[2] తన పతి తనను నిర్లక్ష్యపరచుటకు 'రుక్మిణిమాయ' కారణమని సత్య సందేహింపగ,[3] తన దైవము తన నుపేక్షించుటకు రాధ కారణమని యూహించిన గోదాదేవి "గోపికావళిన్ చొక్క(గజేసి తద్రుచిర భోగము నీవ గైకొనందగునా?" అని రాధపై ఈర్ష్యపడినది.[4] వన్నెయు వాసియుం, తగవు వైభము చలము వివేకమును విడిచి రుక్మిణిని భజించుటకు సవతులు పోవుట, సత్యకు, ఎంతో ఆశ్చర్యము కల్గింపగ[5], కృష్ణుడొక గోపికను తనియించుచుండ, అభిమానము వీడి అతనికై వెళ్ళి గోపికలేల యమున వెంట బరువెత్తి రోయుచు, బోవుదురో?" అని, వారి కభిమానముండవలదా? అని గోదాదేవి ఏవగించుకొనినది.[6] సత్యభామవలె గోదాదేవి చిత్తమును, సుకుమారము సుందరము. ఇతర ప్రబంధ నాయికల వలె వీరిది దైహికతాపము కాదు. అది హృదయ తాపము. వీరి కోపము తృణాగ్ని వంటిది. మానరహితమైన బ్రతుకు కన్నను మరణమే మేలని పంతములాడి, ఏడ్చిన సత్య, భర్తయనునయింపగా, ఆ తీయని పలుకులకలరి, సర్వము మరచి మేఘ గర్జనవిన్న నీపలతికవోలె పులకించిపోయినది. గోదాదేవియు తన తండ్రి తనను కానుకగా శ్రీరంగేశునకు సమర్పింప సిద్ధముకాగా, తన పూర్వపు కోపోద్వేగము, శోకము నశింప వివాహమున కాయత్తమైనది.[7] మానవరూపములో నుండి, మానవ రూపమున నున్న దైవము నధీనము చేసికొనినది సత్య. గోదాదేవి మానవరూపములో నుండియు, దైవమైన శ్రీరంగేశుని భక్తితో కట్టివేసికొనినది.

ప్రవరుడు తననంగీకరింపకపోవుటచే విరహవేదనతో వరూథినియు,[8] వసురాజుపై విరహముచే గిరికయు[9], ఆత్మహత్యా ప్రయత్నముకు పూనుకొనిరి. కాని చెలుల ప్రయత్నముచే నివారింపబడిరి. ఇంద్రియలోలుపతచే, దేవవేశ్య యగువరూథిని కామముతో ప్రవర్తించి, భంగపడి, దేవకాంతలకు మరణము లేదనుటను కూడ మరచి ఆత్మహత్యకు పూనుకొనినది. వసురాజు వలపు తెలిసియు, తొందఱపాటుతో అవివేకముగ గిరికయు అట్టి ప్రయత్నమునకు కడంగినది. వరూథినిలో మానాభిమాన వివేకములు కాని, గిరికలో రాజసముకాని కనిపింపవు.

---

1. ఆముక్తమాల్యద - 5.52
2. ఆముక్తమాల్యద - 5.40
3. పారిజాతాపహరణము - 1-95
4. ఆముక్తమాల్యద - 5-68
5. పారిజాతాపహరణము 1-92
6. ఆముక్తమాల్యద - 5-69
7. అముక్తమాల్యద - 6-125
8. మనుచరిత్ర - 3-31
9. వసుచరిత్ర - 3 - 118, 119

పూర్వజన్మలో తాను సత్యయని తెలియగానే గోదాదేవి "అట్టి మురారి కప్పుడనుగ్గై మరి యీ కలివేళ గ్రమ్మఱంబుట్టి వియోగవేదనలఁ బొక్కెడు నీతనువేల? "అని చింతించి ఇతరులకిచ్చి తన తండ్రి వివాహము నిశ్చయము చేయుటకు ముందే, ప్రాణ త్యాగము చేయదలచి, ఇతర ప్రబంధ నాయికలవలె, పూల నెత్తావి గ్రోలుట వెన్నెల దూకుట మున్నగు ప్రబంధ సామాన్య మార్గములందు గాక "యోగశక్తి" చే ఈతనువును విసర్జింతునని నిశ్చయించుకొనినది.[1] ఒక జన్మలో శ్రీకృష్ణ పత్నియని గ్రహించిన పిదప వేరొకనికి భార్య యగుట, యే మానిని సహింపగలదు? మానహీనమైన బ్రదుకు కన్నను, మరణమే మేలని తలచు సత్యభామ అపరావతారము కావున, ఈమెయు మరణింపదలచినది. సత్యభామ మానినీత్వము సత్యభామగా ఉన్నపుడే కాదు, ఎన్ని జన్మలెత్తినను అది ఆమెను వీడదు, మారదు.

ప్రబంధ నాయికలలో పారిజాతాపహరణ సత్యభామ పోలికలతో అవతరించిన నాయిక, ముద్దుపళని "రాధికా సాంత్వనము" లోని 'రాధ'. ఈమె ముమ్మూర్తుల సత్యభామ అడుగుజాడలలో నడవదలచినది. ఆమె స్వభావమును, తన సొంతము చేసికొనదలచినది. కాని, సత్యలోని రాజసము, నిర్మలచిత్తము, ఈమెలో కానరావు. సత్యామానినివలె మానినీత్వ ప్రదర్శన చేసినది కాని, అందులోని అందము, ఔచిత్యము ఈమెలో కొరవడినవి. సత్యవలె ప్రియుడగు కృష్ణుని ఉపాలంభించియు[2], "మానము పోయిన వెనుకన్ బ్రాణంబుతో నుండవలెనె పద్మాక్ష" అని మానినీత్వమును ప్రకటించినది[3]. కాని కృష్ణుని కన్నను వయసున పెద్దది, వరుసకు మేనత్త యగు ఈమె, తనంతట తాను, నూతన వధువైన ఇళను అలంకరించి, కృష్ణుని కడకంపి, ఆ తరువాత ఖండితనాయిక వలె ఉపాలంభన, పాద తాడనాదులు చేయుట, అనుచితముగ ఉన్నది. మానినియైన వనిత తనంతట తాను మరియొక వనితను ప్రియుని చెంతకు అలంకరించి పంపగలదా? అట్లు పంపిన తరువాత తీవ్ర మానినీత్వ ప్రదర్శన చేయుట సమంజసముగ లేదు!

పారిజాతాపహరణ సత్యభామ అభిమానాతిశయము మాటలలో, చేతలలోనే కాదు, చివరకు ఆమె ఏడుపులో కూడ కనిపించును. సత్యభామ తన ఏడుపుచేత కూడ, ఇతర ప్రబంధ నాయికల నుండి వేరుపడి, అందును ఒక ప్రత్యేకతను చూపు కొనినది. సత్య మాటలేకాదు, ఆమె ఏడుపు కూడ, ఆంధ్ర సాహిత్యమున్నంతవరకు తెలుగు సాహిత్య ప్రియుల చెవులకు ముద్దుముద్దుగా వినిపించుచునే యుండును. పతి, దివ్య పుష్పమును సవతి కిచ్చినాడను ఈర్ష్యచే, బాధపడి, లలితాంగియైన సత్య, పతి యెదుట పద్మము వంటి తన ముఖముపై చేల చెరంగిడి లేమామిడి చిగురుటాకులను తినుటచే మధురస్వనయుక్తమైన ఆడుకోయిల యొక్క అవ్యక్త మధురమైన స్వరము వంటి స్వరముతో నేడ్చెనని తిమ్మన ఇట్లు వర్ణించినాడు.

*"ఈసున బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే*
*గాసిలియేడ్చెఁబ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ*
*శ్రీసఖమైన మోము పయిఁజేల చెఱంగిడి బాలపల్లవ,*
*గ్రాసకషాయ కంఠ కలకంఠవధూ కలకాకలీధ్వనిన్" ...(పారి. 1-133)*

ఏడ్పులోని మాధుర్యమును చవిచూపిన మొదటి కవి శ్రీనాథుడు. కాశీఖండములో

---

1. *ఆము - 5 - 80*
2. *రాధికా సాం - 4 - 69 - 76*
3. *పైది - 4 - 90*

కళావత్యుపాఖ్యానమున సుశీల అను శివభక్తురాలు, తన కొరకై రాక్షసునితో పోరాడి, మరణించిన విద్యాధరుని యొక్క ప్రేమకు చలించిపోయి, ప్రణయావేగముతో దుఃఖమును పట్టజాలక

*"కొసరి వసంతకాలమున గోయిల క్రోల్చిన భంగి నేడ్చె న*
*బ్బిసరుహనేత్ర కొండచఱిఁబెద్ద యెలుంగున వెక్కివెక్కి.... "* ....(కాశీ. 5.167)

అని, ఆమె వసంతకాలపు కోకిల స్వరముతో నేడ్చెనని వర్ణించినాడు. శ్రీనాథుని కావ్యము లోని విలాప మాధుర్యమును చవిచూసిన పెద్దనాది ప్రబంధకవులును, తమ తమ ప్రబంధ నాయికలచే మధురముగ నేడ్పించినారు.

దేవవేశ్యయైన వరూధిని,తన యెడల విముఖుడైన ప్రవరాఖ్యునిపై రతి సంరంభము మీర, అతనిపై పడగా, అతడోరమోమిడి, భుజములను తాకి, పొమ్మని త్రోయగా

*"పాటున కింతులోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ ని*
*చ్చోట భవన్నఖాంకురము సోఁకె, ఁగనుంగొనుమంచుఁజూపి య*
*ప్పాటలగంధి వేదననెపంబిడి యేడ్చెఁగలస్వనంబుతో...* ....(మను - చ - 2-70)

వసుచరిత్రలో వసురాజుయొక్క వియోగమును భరిపంలేని, నాయిక యగు గిరిక,

*రాజశ్రీ సఖమైనమోమునఁబటాగ్రంబొత్తి యెల్గెత్తియా*
*రాజీవానన యేడ్చెఁగిన్నరవధూ రాజత్కరాంభోజ కాం*
*భోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగాన్"* ....(వసు - 4 - 52)

శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్య ప్రబంధమున, శివభక్తురాలైన ఒక దాసి, మాయాజంగము వేషముననున్న శివునికి, అతిథి మర్యాదచేయుటలో మునిగి, ఆలస్యముగా ఆమె సభకు వచ్చును. అది చూసి కోపించినరాజు, ఆమెకు శిరోముండనమును శిక్షగా విధింపగా, ఆమె

*"........ ........................................................ వడిన్*

*వెడలు దృగంబుపూరములు వెల్లగొనం బలవించె దైవమున్*
*దడవుచుఁ బంచమధ్వనుల తానములీను పికాంగనాగతిన్"* .....(కాళ-1-50)

"పాండురంగ మాహాత్మ్యము" నందు నిగమశర్మ అక్క, ప్రబంధనాయిక కాకపోయినను, అంతటి స్థానమునే పొందినది. ఆమె దుష్టుడైన తమ్ముని సత్క్రమ మార్గములో పెట్టి, సజ్జనునిగా తీర్చిదిద్దియు, ఒకనాటి రాత్రి, అతడు ఇంటిలోని వారి నగలన్నియు అపహరించుకొనిపోగా ఆమె 'క్రొత్తగా చేయించుకొన్న ముక్కరకై' 'దుర్వారయై "అడలినది". (పాండు - 3 - 50). ఆముక్తమాల్యదయందు గోదాదేవి, పూర్వజన్మ విషయము జ్ఞాపకమునకు రాగా, శ్రీకృష్ణునితో తాను సలిపిన క్రీడాదులను స్మరించుచు, విరహముచే

*"వాలికకన్నులం బొడము వారి, సకజ్జలమాశ్రిత శ్రవో*
*గోళకమై తదంతికపుఁ గుంతలవల్లికిఁ దల్లిఁదోడుగా"* '.....(ఆము - 5 - 76) ఏడ్చెను.

రాధికా సాంత్వనమ్మందు, రాధ, ఇళపై అసూయతో "ఎలుగెత్తి కలస్వనమొప్ప వెక్కుచున్" ఏడ్చెను. (రాధికా-4-99).

ఇందరు కాంతలు ఇన్ని విధములుగా ఏడ్చినను, సత్యభామ ఏడ్పులోని మాధుర్యము కాని, ఔచిత్యముకాని మరి యొకరిలో కనిపింపదు. "వరూథిని బేల, ఆమె విలపించుటలో నర్థమున్నది" అని పుట్టపర్తి నారాయణచార్యులుగారు సమర్థించినారు.[1] కాని ఆమె చర్యలు ముగ్ధ వలెగాక ప్రౌఢవలె ఉన్నవి. 'కలస్వనమని ఆమె మధురస్వరమును

1. *ప్రబంధనాయికలు . పు -- 18*

మనము మెచ్చినను, ఆమె ఏడుపులో మాత్రము ఔచిత్యమున్నదని అంగీకరింపలేము. నిజమునకు, ప్రవరుడు భుజములను తాకినాడే కాని, ఆమె మరి వేరు అంగములను తాకలేదు. కావున వరూధినిచేసిన ఆరోపణ అబద్ధమే అగుచున్నది. పైగా, ఆ వేదన ఒక 'నెపమ'ని కవి చెప్పనే చెప్పినాడు. కావుననే ప్రవరాఖ్యునికి ఆ ఏడుపు వినియు, మనసు కరుగలేదు. అందుచేతనే అతడు ఆమెను విడిచిపోయినాడు.

'కిన్నెర ప్రస్తావనచే, కాంభోజీరాగ ప్రస్తావనచే వసుచరిత్రయందలి గిరిక స్వరము మధురము దైన్యయుతమనుటను కవి స్పష్టము చేసినాడు. తనపై వసురాజునకు వలపు కలదనియు, తమ వివాహమున కాటంకముండదనియు తెలిసియు, గిరిక ఏడ్చుటలో ఔచిత్యము లేదు. ఎల్గెత్తి ఏడ్చుటలో, గిరిపుత్రికలో లాలిత్యము, సౌకుమార్యము నాగరికత కొరవడినట్లుగా మనము భావింపక తప్పదు. కాళహస్తీశ్వర మాహాత్మ్యమునందలి దాసి ఏడ్పు సంఘటనము కరుణరసభరితమైనది. అచట అవ్యక్త మధుర స్వర ప్రస్తావనచే, కరుణ రసావిర్భూతికి కొంత ఆటంకమే కల్గను.

నిగమశర్మోపాఖ్యానము నందలి అక్క, 'తానంతగా శ్రమించి తీర్చిదిద్దిన తమ్ముడిట్లు పతనము చెందినాడే అని కాని, ఇంటిలోని పవిత్రమైనవియు, ముఖ్యమైనవియునగు నగలు పోయినవే అనికాని, కాక, ఒక చిన్న ముక్కరకై, అదియును 'దుర్వారయై' విలపించుట అనుచితమనిపించుచున్నది. ఇందు రామకృష్ణుని కొంటెతనము తొంగిచూచినను, అక్క పాత్రలోని ఉదాత్తతను గాంభీర్యమును, ఈ విలాపము దిగజార్చినది. ఒక్క గోదాదేవి విలాపములో మాత్రము, మాధుర్యము వినిపింపక పోయినను, ఔచిత్యము కనిపించుచున్నది. రాధికాసాంత్వనములోని రాధ, నూతన వధువు ఇళకు తానే సుద్దులు చెప్పి, పడకటింటికి పంపి, ఆ తరువాత విరహమునకు లోనై ఏడ్చినది. వయసున పెద్దదయ్యు, కృష్ణునకు మేనత్తయయ్యు, మానినీత్వము లేక, తనంతట తానే ఒకతెను ప్రియునికిచ్చి వివాహము చేసి, ఆ తరువాత ఇట్లు విలపించుటలో ఔచిత్యము గోచరింపదు. కలస్వనముతో 'ఏడ్చి' 'వరూధినిని', 'ఎలుగెత్తి' ఏడ్చుటలో గిరికను, "పైటకొంగు వదనాబ్జము పైనిడు"టలో సత్యను తలపింపచేసినను, 'వెక్కుచు' ఏడ్చుటలో ఔచిత్యమును, నాగరికతను మరచినది.

"చంద్రభాను చరిత్ర" యందు నాయికయగు కుముదిని, చంద్రభాముని చూచి మోహితురాలై, విరహము తాళలేక

*"... మది నెవ్వగతో (గురరీ పరంపరా*
*కలిత నవీన దీనతర కాకలి కాకల నిస్స్వనంబునన్" 'ఏడ్చెను' ..(చంద్ర-చ-4-99)*

ఆస్వరము కొంత విలక్షణముగానున్నను, నాయకుని ఒకమారు కనినంతనే అతనిపై ఇంతగా విరహమునకు లోనై యేడ్చుటలో ఔచిత్యము కనిపింపదు.

సత్యభామను వరూధినీ గిరికలతో విలాప వర్ణనయందు పోల్చి చూచుట ప్రసిద్ధము. వరూధినీ, గిరికలలో కామమున్నంతగా వివేకము, సిగ్గు, నాగరికతలు లేవు. సత్యభామ, తనకు స్వాధీనుడని భావించు తన మగడు తననుపేక్షించి, సవతికి పారిజాత మిచ్చినాడనుటచే ఈర్ష్య, పతి చేసిన మోసమునకు క్రోధము కలుగగా, మానహాని జరిగినందులకు దుఃఖమతిశయింపగా, నిగ్రహించుకొనలేక ఏడ్చినది. లతాంగి కావున ఈమె ఏడుపు కూడ లలితముగ నున్నది. అదియును 'బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠవధూ కల కాకలీ ధ్వనితో ఏడ్చినది.

ముఖమున చేల చెరంగిడుటలో, ఏడుపు వలన వికారముగ నగుపించు ముఖమును దాచుట, స్వరము బిగ్గరగా వినిపింపకుండ చేయుట అనెడు, నాగరికతయున్నది. సత్య

ఏడుపు ముద్దు ముద్దుగా వినిపించును, గిరిక చేల చెరంగుచే ముఖము కప్పుకొనినను 'ఎల్లెత్తి' ఏడ్చి అనాగరిక ప్రవృత్తిని కనపరచినది. బహుశః, దీనిని చూసియే కాబోలు "అల్లసాని పెద్దన అటునిటు నేడ్చెను. ముక్కు తిమ్మన ముద్దు ముద్దుగా నేడ్చెను. భట్టుమూర్తి బావురమని యేడ్చెను" అని తెనాలి రామలింగడనినట్లుగా ఒక అభిప్రాయమున్నది.

సత్యభామ ఏడుపు ఆత్మాభిమానమునకు సంబంధించినది. అందు ఔచిత్యము నిండుగా ఉన్నది. ఏడుపులో మాధుర్యము, లాలిత్యము, నాగరికతయు నున్నవి. అందుచేతనే కృష్ణుడు ఆ మానిని ఏడ్పులోని మాధుర్యమునకు, అందులోని ఔచిత్యమునకు చలించిపోయి, పువ్వునకు బదులు చెట్టునే తెచ్చి యిచ్చెదనని ప్రతిజ్ఞ చేసినాడు.

## సత్యభామాకృత వామపాద తాడనము నందలి ఔచిత్యము

సత్యభామ అనగానే వామపాదముతో పతి శిరమును తాడనము చేసిన ప్రణయ కుపితయైన ఖండిత మన కనుల ముందర గోచరించును. ఇట్టి సత్యభామను సృజించి అందించినవాడు పారిజాతాపహరణ ప్రబంధ కర్త, తిమ్మన.

పారిజాత పుష్పమును తనకీయక పతి, సవతి రుక్మిణికిచ్చి తనను తక్కువ చేసినాడనుచు సత్యభామ ఈర్ష్యాక్రోధములకు లోనుకాగా, శ్రీకృష్ణుడు పలువిధములుగ బ్రతిమాలియు ప్రయోజనము లేకపోయినది. "పాటల గంధి చిత్తమున బాటిలు కోపభరంబుదీర్చ", "ఆ జగన్నాటక సూత్రధారి" 'మృదు పల్లవ కోమల తత్పదద్వయీ పాటల కాంతి మౌళిమణి పంక్తికి వన్నియవెట్టు" నట్లు "అర్మిలి, మ్రొక్కినాడు". (పారి. 1-120). పేరలుక నున్న ఆ లతాంగి "జలజాతాసన వాసవాది సుర పూజాభాజనంబై తనర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరము"ను "వామపాదంబునం దొలఁగం ద్రోచినది." (పైది. 121). ఆ 'కుహనాగోపాలుడు' కోపమును పొందక, "ఉద్దీపిత మన్మథ రాజ్య ప్రాపితుడై" నాడు (పైది. 122). అంతేకాదు 'నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్క బూని, తాచినయది నాకు మన్ననయ' (పైది. 123), అని 'కూర్మి బయలుపడంగ' పలికినాడు (పైది. 122).

శ్రీకృష్ణుడు తాను రుక్మిణి యొద్దనుండగ, నారదుడు వచ్చి ఆ కుసుమము నొసగెననియు, తాను దయ మీర రుక్మిణి కిచ్చితిననియు, కావున తన తప్పు క్షమింపవలయునని సత్యను అడిగినట్లుగ మాత్రమే, మూలమునందున్నది.[1] ఇట్లు మూలహరి వంశమునందు కాని, వాని అనువాదములందుకాని, లేని శ్రీకృష్ణపాద ప్రణిపాతమును, కోపనయగు సత్యా వామపాద తాడనమును తిమ్మన పారిజాతాపహరణమునందు మాత్రమే కానవచ్చుచున్నది. ఆంధ్ర సాహిత్యమున మానినియైన సత్యభామా పాత్రమున కొక అపూర్వమైన విలక్షణత నాపాదించిన ఘట్టమిది.

"ఎంత మానినియైనను సత్యభామ భగవానుడైన పతి శిరమును, తాడనము చేయుటలో నౌచిత్యమున్నదా? యనెడు సంశయ మొదవుట సహజము.

కృష్ణుడు, భార్య పాదములకు మ్రొక్కినట్లు వర్ణించుట రసభంగమనియు, కృష్ణ పాత్రకది గౌరవహానియనియు, సత్య వామ పాదమున పతి శిరమును తొలగ ద్రోచుట ఆమె అహంకారముగ కనిపించుచున్నదనియు పెక్కురు భావించుచున్నారు. మూలమునం దెచటను కానరాని ఇట్టి సన్నివేశమును తిమ్మన తన ప్రబంధమున కల్పించుటకు కారణమేమి? అనెడు సందేహము కల్గుటయు సహజమే.

రాయల జీవితములో జరిగిననొక సంఘటన నాధారముగ చేసికొని అతడు కావించిన అపరాధమును, ధ్వనిపూరితముగ తెలియచెప్పి, అతనిలో పరివర్తన కలిగించుటకై ఇమ్మహాకవి

1. సం. హరి. వి. ప - 67 - 29, 30

యిట్టి కల్పన చేసినట్లుగ పలువురు ఊహించుచున్నారు. శయనాగారమున రాజు రాక ముందు రాణి, శయ్యపై అతడు పాదములుంచు చోట శిరమునుంచి పండుకొనుటయు, పిమ్మట రాజు వచ్చి పరుండునపు డామెను మేల్కొల్పుటయు, అప్పుడామె రాజును గౌరవించి, రాజున కభిముఖముగ పరుండుటయు, నాటి ఆచారము. ఆ ఆచారము ప్రకారము, రాణి తిరుమలదేవి నిద్రించుచుండగా, ఆలస్యముగా వచ్చిన రాయ లామెను లేపకుండ పరుండగా, నిద్రలోనున్న రాణి బంగారపుటందెల పాదము పొరపాటున రాయలశిరమునకు తగులగా, దానిని బుద్ధిపూర్వకముగా చేసిన అపరాధముగా భావించి, అతడు క్రోధము వహించి, ఆమెతో సహశయ్యా, సంభాషణాదుల నుజ్జగించెననియు, అంతట ఆ విషయమును అరణపు కవియగు నంది తిమ్మనకు, దాసీజనము వలన తెలిసి, పారిజాతాపహరణ ప్రబంధ రచనకు పూనుకొని పై ఘట్టమును కల్పించి, నిండు సభలో రాయలకు వినిపించెననియు, రాయలు దానియందలి ధ్వనిని గ్రహించి, సంతసించి, రాణిని తిరిగి ఆదరించెననియు ఒక కథ ప్రచారములో నున్నట్లుగా చాగంటి శేషయ్యగా రనుచున్నారు.[1] ఈ కథ సత్యమే అయి యుండునని దూసి రామమూర్తిగారును విశ్వసించుచున్నారు.[2] దీనినే పలువురు సమర్థించినారు కూడ.

*"జననమందెను వసుదేవ మనుజవిభుని*
*కృష్ణుఁడను పేర నరసేంద్రు కృష్ణదేవ*
*రాయఁడను పేర నాది నారాయణుండు.* ....*(పారి. 1.19)*

అని కృష్ణునకును కృష్ణదేవరాయలకును, కవి ముందే అభేదత్వము కల్పించుటయు, పై ఊహకది ఉపస్కారకముగ నున్నది. అంతేకాదు. ప్రథమాశ్వాసాంతమున కాననగు

*"ప్రతివర్ష వసంతోత్సవ*
*కుతుకాగత సుకవినికర గుంభిత కావ్య*
*స్మృతి రోమాంచ విశంకిత,*
*చతురాంతః పురవధూ ప్రసాదన రసికా"* .....*(పారి - 1 - 139)*

అనెడు పద్యము, సరస హృదయుడైన రాయలు, కవి కల్పించిన పై ఘట్టమునందలి ధ్వనిని అర్థము చేసికొని, రాణిని నెప్పటి యట్ల సమాదరించెనని తెలియచేయుచున్నదని కొందరు తలంచుచున్నారు.[3] ద్వితీయాశ్వాసాంతమున "తిరుమలదేవీ వల్లభ! కరుణామయ హృదయ!"(పారి. 2-105) అనుటచేతను రాయలు అపరాధము గావించినది తిరుమలదేవి యెడలనే అనియు, ఆమెపైనే అతడు తదనంతరము కరుణ చూపెనని ధ్వనితమగుచున్న దనియు తలంచుచున్నారు.

పి. యశోదారెడ్డిగారు మాత్రము, రాయల జీవితము నందలి ఒక సంఘటనయే పాదతాడన ఘట్ట కల్పనకు కారణమని అంగీకరించుచున్నను, రాణి తిరుమలదేవి పాద ప్రహారము పొరపాటున గావించినది కాదనియు, "ప్రభువుల సమాశ్వాస బహుమానములతో గోపము ద్విగుణీకృతము కాగా, నా కోపన తన కాలి యందియలు ఘల్లుమనునట్లుగా నేదేని

---

1. *చాగంటి శేషయ్య - ఆంధ్రకవి తరంగిణి - సంపు. 7-పు. 253*
2. *దూసి రామమూర్తి - సురభి వ్యాఖ్య - భూమిక - పు. 9*
3. *దూసి రామమూర్తి - సురభి వ్యాఖ్య - పు. 103*
   *"కృష్ణదేవరాయలు కోపము విడనాడి తన యెడం బ్రణయాపరాధము గావించిన తిరుమలదేవిని దేర్చుటను గూడ నిందు గవి సూచించెననదగును".*

యపచారమును రాయల యెడఁ గావించి యుండవచ్చు"నని అనుచు, రాణి ఉద్దేశ పూర్వకముగానే రాయలను పాద తాడనము చేసి యుండవచ్చునని దృఢముగా నమ్ముచున్నారు.[1]

సాధారణముగ నితర ప్రబంధము లందువలె, నిందలి అవతారికయందు కృతిపతి, కృత కర్తను నాహ్వానించి, యేదైన ప్రబంధమును రచింపుమని కర్పూర తాంబూల ప్రదాన పూర్వకముగా నడిగినట్లు లేకపోవుటయు, కృత్యాదిని కవి అభ్యుదయ పరంపరాభివృద్ధిగా కృతికర్త కంకితము చేసినట్లు చెప్పక పోవుటయు, తన వంశాను క్రమణికను తెలుపు పద్యములను కృత్యావతారికయందు గాక గ్రంథాంతము నందుండుటయు, సుకవిస్తుతి, కుకవి నింద, ప్రబంధ సామాన్యమైన పురాదివర్ణనలు, మొదలైనవి కథారంభమునందును, చంద్రమారుతోపలంభనాది వర్ణనలు కథాగతి యందును, లేకపోవుట చూడగా ప్రబంధము నొక ముఖ్య ప్రయోజనార్థమై తొందరతో రచించినట్లు కనిపించుచున్నదని కొందరు విశ్వసించుచున్నారు. అంతేకాదు. ప్రథమాశ్వాసముతో కథా ప్రయోజనము నెరవేరుట చేతనే ఆ తరువాతి ఆశ్వాసములలో కథలో బిగువు సడలుటయు, పై వాదమునే బలపరచుచున్న దనియు కొందరి యభిప్రాయము.

నిజమునకు పై వాదనలేవియు సమంజసము కావనియే చెప్పవచ్చును.

పారిజాతాపహరణమున, ద్వితీయాశ్వాసాంతమునను పంచమాశ్వాసాదిని, తిరుమలదేవి పేర్కొనబడినట్లుగానే తృతీయాశ్వాసాదిని "చిన్నమదేవీ జీవితనాయక". (పైది - 4 - 1) అని, 'చిన్నమదేవి' ప్రస్తావనమును చేయబడినది. మనుచరిత్రయందు చిన్నమదేవి ముందుగను, ఆ తరువాత తిరుమలదేవియు పేర్కొనబడిరి. (1-33) కావున పై కల్పనకు తిరుమలదేవియే కారణమనుట పొసగదు.

*"తిరుమలదేవీ చరణో*
*దర లాక్షాకల్పకల్పిత స్థలకమల*
*స్ఫురదిందీవర బంధుర*
*హరిహయమణి మలయకూట హర్మ్యవిహారీ* ...*(మను. చ. 3-143)*

అనెడు మనుచరిత్రయందలి పద్యము, రాయలకు తిరుమలదేవిపై గల అనురాగాతి శయమును, వారి అనుకూల దాంపత్యమును చాటును. అట్టి ఆమెపై రాయలు కినుక వహించె ననుటయు నమ్మదగినది కాదు.

మహారసికుడైన రాయలు అంత చిన్న పొరపాటునకు, భార్యకు నంతటి శిక్ష నిచ్చెననుట నమ్మరానిది. అంతేకాదు. అంతఃపురము నందు ఏకాంతమున జరిగిననిట్టి ఆంతరంగిక విషయములు, బట్ట బయలగు ననుటయు విశ్వసింప తగినదిగ లేదు. పైగా, ఇట్లు ఒక కవి తమ ఏకాంత కార్యకలాపములను ధ్వనింపజేయునట్లుగ వ్రాసి, నిండు సభయందు వినిపించినచో ఎంత రసికుడైనను, అభిమానవంతుడైనవాడు సహింపలేడు.

ప్రబంధ సామాన్యమైన లక్షణములుగ చెప్పబడునవి, చాలవరకు, ఆది ప్రబంధమన బడు మను చరిత్ర నాధారముగ చేసికొని నిర్ణయింపబడినవే. కాని, దాన శాసనాధారములను పురస్కరించుకొనియు శ్రీకృష్ణదేవరాయల దండయాత్రను, విజయములను బేర్కొనుచున్న చారిత్రకుల వ్రాతల నాధారముగా గొనియు, రాయల విజయ పరంపరలను వర్ణించిన గ్రంథాధారములను స్వీకరించియు, పారిజాతాపహరణ, మను చరిత్రలందు గానవచ్చు శైలీ విధానములను బురస్కరించుకొనియు చూచిన, పారిజాతా పహరణము, మను

*1. పి. యశోదారెడ్డి - పారిజాతాపహరణ పర్యాలోచనము. (పుట. 107)*

చరిత్రకన్నను పూర్వమని కొందరు నిర్ధరించినారు[1] ఇది సముచితమైనదిగానే అనిపించు చున్నది. కావున ప్రబంధ లక్షణములుగా పేర్కొనబడిన పురాది వర్ణనములు పారిజాతా పహరణము నందు కనిపింపకపోవుటలో, నెట్టి ఆశ్చర్యమును లేదు. కవి, కృతిపతిగా రాయలను తానే యెన్నుకొని కావ్యము నంకితము చేసినాడు. కావున కృతిపతి, తాంబూలాదులచే నర్చించి కృతి యొసంగుమని వేడినట్లు చెప్పుటకు అవకాశమును లేదు. కృత్యావతారికయందు తన వంశానుక్రమణిక పేరుతో కవులు తమ గుణాతిశయములను, పాండిత్య ప్రకర్షను, తాతముత్తాతల దాతృత్వాది గుణములను వర్ణించి ఆత్మశ్లాఘనము చేసికొందురు. ఆత్మస్తుతి విముఖుడైనతిమ్మన, అట్టి ప్రశంసలు చేసికొనుట కిచ్చగింపక, తన వంశాదులను గూర్చిన వర్ణనమును, కృత్యాదిని చేసియుండకపోవచ్చును. కుకవుల నింద యనెడు నెపమున నితరుల నిందించుట సంస్కారము కాదని కవి విడిచియుండును. రాయలును తన ఆముక్తమాల్యదయందు, కావ్యాదిని సుకవిస్తుతి, కుకవి నింద చేయలేదు. ప్రథమాశ్వాసమును, పారిజాతాపహరణమునకు భూమికగా చేసికొని, భువికి పారిజాతము వచ్చుటకు గల కారణమును తిమ్మన వివరించెను. స్త్రీ మనోభావములను క్షుణ్ణముగ చదివినవాడు, ఆలంకారిక శాస్త్రము నౌపోసన పట్టినవాడు కావున, ఆశ్వాసమునందు తన చతురతనంతయు వేలార్చి, మిగిలిన నాలుగాశ్వాసము లందు పారిజాతము తేబడిన విధానమును, కావ్య నియమానుసారముగ వర్ణనలను జోడించుచు వర్ణించెను. చివరి ఆశ్వాసమున పారిజాతము యొక్క విశిష్టతను పుణ్యకవ్రతము ద్వారా సూచించెను. ఏకవియు అన్ని ఆశ్వాసము లందును, ఒకే బిగిని చూపలేడు. మనుచరిత్రలో రెండవ ఆశ్వాసమునందున్న పటుత్వము, మిగిలినచోట కనిపింపదు. కావున పారిజాతాపహరణములో ప్రథమాశ్వాసము పటుత్వముతో నుండుటకు ఒక విశేష ప్రయోజనమున్నట్లు ఆపాదించుట సమంజసముగా లేదు.

తిమ్మన ప్రబంధములోని ప్రతివర్ష కుతుకాగత అనెడు పద్యము, రాయల సాహితీ ప్రీతిని, రసికతను ధ్వనింపచేయుచున్నదేకాని, దానికిని తిరుమలదేవి ప్రసాదనమునకు నెట్టిసంబంధమును లేదు. "జనశ్రుతిగా వచ్చుచున్న తిరుమలదేవి కథ అబద్ధమ"ని శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారి నమ్మకము.[2] ప్రసాదన రసికత్వము అనుకూల నాయకుని లక్షణము. అట్టివాడు అలుగుట జరుగదు. రాయలును కృష్ణునకు వలె బహు భార్యాయుతు డగుటచే పై కింవదంతి పుట్టుట కవకాశము కల్గినది. వీని నన్నిటిని బట్టి చూచిన "రాయలు - తిరుమలదేవి కథ", సత్య వామపాద కృత తాడన ఘట్ట కల్పనకు కారణమనుట సత్యము కాదని స్పష్టమగుచున్నది.

పై ఘట్టమును తిమ్మన ఆలంకారిక మార్గము ననుసరించియే చేసెను.

సత్యభామ శ్రీకృష్ణుని ముద్దుల భార్య. తాను స్వాధీనపతికనను గొప్ప నమ్మకము గల వ్యక్తి యామె. అట్టి యెడ పతి తన నుపేక్షించి దివ్య కుసుమమును సవతి రుక్మిణి కిచ్చినాడు. అంతేకాదు. ఆమెముందు, నారదుడు తనను విమర్శింపగా, పతి అతనిని వారింపకుండ "చెవులొగ్గి" వినినాడు. మానినియైన సత్య కిది క్షమింపరాని అపరాధముగ కనిపించినది. తాను వినిన కుసుమ ప్రదాన విషయము, నిజమని నిరూపించునట్లు, కృష్ణుడు దివ్యపుష్ప వాసనా భరితుడై తన ముందు నిలువగా, ఆమె కోపము ద్విగుణీకృతమైనది. ఆమెకప్పుడు కల్గినది మానము.

---

*1. పి. యశోదారెడ్డి - పారిజాతాపహరణ పర్యాలోచనము - పు. 104*

*2. శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి - విజయనగరాంధ్ర కవులు - పు - 262*

"ప్రియాపరాధా వగమాత్సంజాతో, మాన ఇష్యతే" అను లక్షణానుసారము మాన మనగ ప్రియు డపరాధము చేయుటచే నాయికకు గల్గు కోపరూప చిత్తక్షోభమని తెలియనగును. మానము ప్రణయమానమనియు, ఈర్ష్యామానమనియు రెండు రకములు. కారణము లేకయే నాయికానాయకుల ప్రేమ కల్పిత కపటనిద్రా కుటిలవ్యాపారములచే కలుగు కోపము ప్రణయమానము. అది సులభముగా శమించును. ప్రియుడు అన్యకాంతాసంగమాదులచే కలుగునది ఈర్ష్యామానము.

*"ఈర్ష్యామానస్తుయః కోపః ప్రియేజ్ఞాతాన్య సంగమే*
*అభాషణ ముపాలంభో భర్త్సనం తాడనంతథా*
*వైముఖ్యమశ్రు చామర్ష ఇత్యా ద్యను భావ్యతే"* అని ఈర్ష్యామాన లక్షణము.

ఆలంకారిక లక్షణము వలన మానము కలిగెడి స్థాయిని బట్టి, లఘు మానము, మధ్యమానము, గురుమానమని మూడు విధములని తెలియును. పతి కావించు అన్య స్త్రీ దర్శనాదుల వలన సతికి కలుగునది లఘుమానము. పొరపాటున వేరొకతె పేరున తనను పిలుచుట వలన కలుగు మానము మధ్యమానము, అన్య స్త్రీ సంగమము వలన కలుగునది గురుమానము. వేరు విషయములందు కుతూహలము పుట్టించుటచే తీర్పశక్య మగునది లఘుమానము. వాగ్దానాదులచే తీర్పశక్య మగునది మధ్యమానము. పాదములకు ప్రణమిల్లుట, భూషణాదుల నిచ్చుట మున్నగు ఉపాయములచే నుపశమింపబడునది గురుమానము.[1]

అనగా గురుమానము పోగొట్టుటకై ప్రియురాలి పాదమునకు ప్రియుడు మ్రొక్కుటకు ఆలంకారిక సమ్మతియున్నది. ఇచట కృష్ణుడు కావించిన ప్రణయాపరాధము వలన ప్రణయ సుందరి సత్యకు కలిగినది ఈర్ష్యామానము. అందున ఆ అపరాధము తీవ్రమైనది కావున అది గురుమానము కూడ. గురుమానము పొందిన ప్రణయిని పాదములకు మ్రొక్కుటయే కోపోపశమనమును కల్గించునని కామ శాస్త్రము కూడ అంగీకరించుచున్నది.[2] కావున కాముని తండ్రి యగు కృష్ణుడు సత్యభామా గురుమానోపశమనార్థమై ఆమె పాదములకు శిరముంచి మ్రొక్కినాడు.

ఇట్లు గురుమానము నుపశమింప చేయుటకై, సతి పాదములకు ప్రియుడు మ్రొక్కుట ప్రాచీన సాహిత్యమునందును పలుచోట్ల కాననగును. ఆది కావ్యమైన రామాయణము నందు దశరథుడు, కుపితయైన కైక పాదములకు మ్రొక్కెను.[3] అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుడు శకుంతల పాదములకును,[4] మాళవికాగ్నిమిత్రమున అగ్నిమిత్రుడు ఇరావతి పాదములకును[5], రత్నావళి నాటకమున వత్సరాజు వాసవదత్త పాదములకును మ్రొక్కుట చూడగలము.[6] జయదేవుని గీత గోవిందము నందును ఖండితయైన రాధను సాంత్వన

---

1. రసమంజరి - 1 - పు - 39
2. "వర్ధమాన ప్రణయాహి, నాయికా సపత్నీనామగ్రహణం తదాశ్రయ మాలాపం వా గోత్రస్ఖలితంవా, నమర్షయేత్, నాయకవ్యలీకంచ, తత్ర సుభృ శః కలహః రుదిత మాయాసః శిరోరుహాణా మనక్షోదనం ప్రహణవ, మాసనాచ్ఛయ నాధ్వా, మహ్యాం పతనం మాల్యభూషణావ మోక్షో భూమౌశయ్యాచ, తత్రయుక్తరూపేణ సామ్నా. పాదపతనేన వా ప్రసన్నమనాస్త్రా మనునయ న్నుపక్రమ్యశయన మారోహయేత్" --వాత్స్యాయన కామ సూత్రము -
3. రామాయణము - అయోధ్యాకాండ -- సర్గ 12 - 114; సర్గ - 13 -19.
4. శాకుంతలము - అం. 7.
5. మాళవికాగ్నిమిత్రము - అం. 3 - శ్లో. 22.
6. రత్నావళి - 4-14.

..రచుటకై శ్రీకృష్ణుడు 'నీచరణపల్లవమును నా శిరసునకు అలంకారమగునట్లు చేయుము. ఇప్పుడు మన్మథ తాపమనెడు అగ్ని మహా ఘోరముగా మండిపడుచున్నాడు. కావున అట్టి మన్మథ తాపాగ్ని వలన కల్గిన వికారములను నీచరణపల్లవ ముపశమింప చేయును గాక!" అని అర్థించును.[1]

సాధారణముగా పతి తన పాదములపై పడగానే రసికురాలగు ప్రణయిని ప్రసాదనముఖి యగుచుండును.

*"పాదపతనవేళఁ బాండీల కొండ్లలో*
*జిక్కుకొన్న ప్రియుని చికురములను*
*వెలఁది మెల్ల మెల్ల విడిపించుటయె యల్క*
*కరఁగిపోయె ననుచు నెఱుకపఱిచె"*

*(శాలివాహన గాథా సప్తశతీసారము -- 149 అణంగుడు - 2-88)*

అనెడు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి అనువాద గాథాసప్తశతీసార పద్యము దీనికి తార్కాణముగ నున్నది. కావుననే ప్రణయాపరాధము చేసిన శ్రీకృష్ణుడును, గురుమానముతో పొగులు ప్రణయిని పాదములకు మ్రొక్కుటలో నెట్టి అనౌచిత్యమును లేదు.

కొన్నిమారులు ప్రియుడు కావించు పాదపతనమును కూడ అతికోపనలు లెక్కచేయక పోవచ్చును.

గురుమానముతో నున్న సత్యభామ పాదములకు శ్రీకృష్ణుడు నమస్కరింపగా 'ఆ లతాంగి' జలజాతాసనాది దేవతలకు పూజాభాజనంబై తనర్చునదియును 'పవిత్రము, మహా మహిమాన్వితమును' 'సుకుమారము, శృంగారశోభితమైన కృష్ణుని శిరమును' "వామ పాదమున దొలఁగం ద్రోచెను". బ్రహ్మాది దేవతలచే నర్చింప బడెడు శిరముతో, పతి తనకు మ్రొక్కగా, ఎట్టి జంకు గొంకు లేక, పాదముచే, అందును వామపాదముచే తాచుట అనుచితమనియే పలువురు భావించినారు.

సత్యభామ యెంత మానిని యైనను ఆమె పతివ్రతయు పతి మహానుభావత్వము నెరింగిన దగుటచే, అట్టి అనుచిత కార్యము చేసియుండదని కొందరు భావించి "తొలఁగం ద్రోచెన్" అనుటకు వేర్వేరు అర్థములను కల్పించి, సత్యను అనౌచిత్య దోషము నుండి రక్షింపదలచినారు.

"తొలఁగం ద్రోచెన్ -- అనగా ఇక్కడ కొందరు పంచమీ విభక్త్యర్థమును గ్రహించి, పతివ్రత గావున పతి శిరమును వామపాదము "వలననుండి" తొలగునట్లు ద్రోచెను, అనగా ఆయన శిరము తన పాదములకు తగలకుండ తొలగించుకొనెను, అని అర్థము చెప్పుకొని సత్యభామ పాత్రను, అనౌచిత్య దోషము నుండి కాపాడ యత్నించిరి. ఇది ఏ మాత్రము సమర్థనీయముగా లేదు. పాదము తగుల రాదనెడు భయము, భక్తియున్నచో, పాదమును వెనుకకు లాగుకొని యుండును. కాని'తొలఁగంద్రోయవలసిన' అవసరము లేదు.

ఇక రెండవది. సత్యభామ కృష్ణుని శిరమును తొలగద్రోచినదే కాని తన్నలేదనుట. "ఇక్కడ పాఠకులు తొందరపడి 'తొలఁగన్‌ద్రోచె' అన్న మాటలకు 'తన్నె'ను అన్న అర్థం చెప్పకూడదు. తన్నెనని చెప్పడమే కవి ఉద్దేశమయితే 'తొలగన్‌తాచె' ననో తొలగన్ తన్నెననో! చెప్పేవాడే కదా! సత్య అక్కడ చేసిన పని ఏమిటంటే, తన దగ్గరకు, తన్ను తాకడానికి వస్తున్న, కృష్ణు ి తలను, తనకు దూరంగ ఉండేలాగున తోసింది. ఇంతకు ముందు నేను

1. *గీతగోవిందము - సర్గ - 10 - చతురచతుర్భుజము - అష్టపది - 19-7*

మనవి చేసినట్లు, ఆ కృష్ణుని సామీప్యం సహించలేక, ఆ ఎడమకాలు అప్రయత్నంగానే తోసింది" అని తాపీ ధర్మారావుగారు అనినారు.[1]

కాని ఇదియు సమంజస మనిపించుటలేదు. పాదములకు తగులుచున్న శిరమును, కోపముతో నున్న సతి తొలగ ద్రోచినది. అనగా తాచినది. ఇప్పుడు కృష్ణుడు తనను తాకుట ఆ కోపన కిష్టము లేదు. కావున తాచినది. ఇది అప్రయత్నముగా జరిగిన కార్యము కాదు. ఇష్టము లేని సమయమున, నిట్లు మ్రొక్కిన శిరమును ద్రోచుట, తాచుటయే యగును. పరిమళోల్లాస వ్యాఖ్యాతయైన కుప్పు స్వామయ్యగారును 'తొలఁగంద్రోచెన్' అనుదానికి 'తన్నెను' అనియే అర్థమిచ్చినారు.[2] దూసి రామమూర్తిగారును దానిని 'తాపు'గానే అంగీకరించినారు.[3] "ఆమె భగవంతుని తలను కాలితో తన్నిన దనియే అందరు నర్థము చెప్పుదురు. నాకు చిన్నప్పటి నుండి యీ పద్యము నందీ యర్థమే భాసించుచున్నది. అదియే న్యాయము" అని విశ్వనాథ సత్యనారాయణగారును భావించినారు.[4] శ్రీకృష్ణుడును "నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్క బూని తాచినది నాకు మన్ననయ" (పారి. 1-123) అని సత్య తాడనము చేసినదని అనినాడు. కాని, శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు "సత్యభామ శిరము తొలఁగం ద్రోచినది కాని, తన్నలేదు. తాచిన యది యనుట ఛలోక్తి" అని కృష్ణుడనిన మాటలను చిలిపి తనపు చమత్కారముగా కొట్టివేసినారు.[5] కాని ఇదియును సరికాదు. నీవు 'తాచినది నాకు మన్ననయ' అను కృష్ణుని మాటలు కొంటెతనపు ఛలోక్తిగా మనము భావించినను కృష్ణుని మాటలకు ముందు, కవియే, "కోపన పదహతి గుహనా గోపాలుడు గాంచి" (పైది. 122) అని వర్ణించుచు, సత్యభామ చేసినది తాడనమే గాని, తొలగ ద్రోచుట కాదనెడు విషయమును స్పష్టము చేసినాడు.

శ్రీకృష్ణుడు భగవంతుడే కావచ్చును. అతడు ప్రణయాపరాధము చేసిన వ్యక్తి. అతడనినట్లుగా సత్యభామాదాసుడు. దాసుడు తప్పు చేసినప్పుడు, యజమాని శిక్షించునేమో యని భయపడుచుండును. ఇతడును ఎంతో ఆందోళనముతో సత్యా గృహమునకు వేంచేసి[6], భయపడుచు, ఆమె చెంతకు వచ్చినాడు.[7] తప్పుచేసిన దాసుడు యజమానికి మ్రొక్కినాడు. దాసుడు చేసిన తప్పు తీవ్రమైనది. కావున ఇచట ఆ గృహ యజమానిని దాసుని క్షమింపలేక, వామపాదమున తాచినది. ఇది యొక శృంగార సామ్రాజ్యము. కవియే "నాథుల్నేరముల్సేయ బేరలుకం జెందినయట్టి కాంతలుచిత వ్యాపారము ల్నేర్తురే?" (పారి. 1-121) అని అర్థాంతరన్యాసముతో సత్య చర్యను సమర్థించెను. సత్యభామ చేసిన పని ఉచితము కాదని ధ్వనింప చేయుచునే, నాథుడు గొప్ప అపరాధము చేసినచో, పేరలుక చెందిన కాంతలు ఇట్లు చేయుటలో అసహజత్వము లేదనుచు "అట్లయగు" అనుచు, సత్యభామను సమర్థించినాడు. ఆమె తాచి యుండక పోయినచో, కవి ఈ అర్థాంతరన్యాసమును ప్రయోగించి యుండవలసిన అవసరమే లేదు.

---

*1. తాపీ ధర్మారావు - పారిజాతాపహరణము - పీఠిక -- ఆం. ప్ర. సాహిత్య అకెడమీ ప్రచురణ.*

*2. నాగపూడి కుప్పు స్వామయ్య - పారిజాతాపహరణము - పరిమళోల్లాస వ్యాఖ్య పు-66 "లతాంగికావుననే యామె తాఁపు శ్రీకృష్ణునకు నొప్పిని కలుగజేయలేదు."*

*3. దూసి రామమూర్తి - పారిజాతాపహరణము - సురభి వ్యాఖ్య - పు. 90*

*4. విశ్వనాథ సత్యనారాయణ - సాహిత్య సురభి - పు.151.*

*5. శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి -- విజయనగరాంధ్రవులు - పు. 261.*

*6. పారి. 1-104.*

*7. పైది 1-108*

లత్తుకతో కూడినదియు నవపల్లవము వలె కోమలమైనదియు, నూపురములచే అలంకరింపబడినది యైన మదలాలసయగు ప్రియురాలి పాదముచే, ప్రణయాపరాధము కావించిన ఏ ప్రియుడు తాడనము పొందునో, అట్టివానిని మన్మథుడనుగ్రహించునని ఈక్రింది శ్లోకము చెప్పుచున్నది.

*"సాలక్త కేన నవపల్లవ కోమలేన*
*పాదేన నూపురవతా మదలాలసేన*
*యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్*
*సోంగీకృతో భగవతా మకరధ్వజేన"* ..... *(అమరకము-101)*

వాత్స్యాయన మహర్షి కామసూత్రమునకు జయమంగళుడు వ్యాఖ్యానము చేయుచు క్రోధవశముచే నాయిక ప్రియుని శిరస్తాడనము చేయుటలో దోషము లేదనియు వక్కాణించినాడు.

*"క్రోధవశాత్తస్యశిరసి పాదతాడనమపి నదోషాయ, సౌభాగ్య చిహ్నం తదితి నాగరికవృద్ధాః"*
ఇట్లు నాయికా పాద తాడనమునకు ఆలంకారిక సమ్మతి యున్నది. పైగా కవి ఇచట సత్యను 'ప్రగల్భా - అధీర'గా చిత్రించినాడు. "సత్తర్జ్య నిష్ఠురం రోషాదధీరా తాడయే ద్దృఢం" - అని రసార్ణవసుధాకరము, "ప్రియుని తాడనము చేయుట" ప్రగల్భా - అధీర లక్షణము అని చెప్పుచున్నది.

పాదతాడనమున కాలంకారిక సమ్మతియేకాక, ప్రాచీనకవుల సమ్మతియు కలదు. మాళవికాగ్ని మిత్రమున, అగ్ని మిత్రుడు "పాదములపై పడిన కరమపరాధియైన ప్రియుని ప్రణయిని, అధీరతను అతనిని తన్నుట కర్హురాలు," అని విదూషకునితో అనును[1]. అట్లు ప్రణయిని పాద తాడనము చేయుట ఉచితమే అని, కాళిదాసు నాయకునిచే అనిపించినాడు. అంతేకాదు. అపరాధము చేసిన నిన్ను కూడ, ఆమె (నాయిక) ఇట్లు తన్నునని విదూషకుడనగా, అగ్ని మిత్రుడు, కార్యసిద్ధి సూచకమైన బ్రాహ్మణ వచనమును శిరసావహించుచున్నాననియు నర్మ గర్భముగా పలుకుచు, నాయిక యొక్క పాదతాడనము పొందుటకై ఉత్సాహము చూపును.[2]

ప్రణయాపరాధము తీవ్రమైనచో, ప్రియులకు వారిచ్చు శిక్షలు కూడ తీవ్రముగ నుండును. ఒక ప్రణయిని తన పదములపై వ్రాలిన ప్రియుని క్షమింపలేదు సరికదా!, మీదు మిక్కిలి తన కాలి బొటనవ్రేలితో వాని పెన్నెరులను గట్టిగా నీడ్చి శిక్షించుటలో గొప్ప ఆనందమును పొందుట గాథాసప్తశతీ సారమునందు కాననగును.[3] శృంగారనాయిక లిట్టి చిత్రమైన శిక్షలు వేయుటయు ప్రియులవ్వానిని క్రూరముగ భావింపక, ఆనందముతో ననుభవించుటయు సాహిత్యమున కనిపించును.

సత్య 'వామపాదమున' తాచుటలో, న్యూనత తోచునని భయపడిన కొందరు "వామ పాదమనగా అందమైన పాదమని"[4] అర్థము చెప్పుకొని, ఎడమ పాదము వలన కలుగు న్యూనత యొక్క తీవ్రతను కొంత తగ్గింప చూచినారు. కాని అట్టి సమర్థన కవసరము లేదు.

---

1. *మాళవికాగ్నిమిత్రము - అం. 3 -- శ్లో - 12.*
2. పైది
3. *"మఱపురాదు నాకు మాటాడకుండఁబా, దాల చెంత వాఁడు వాలియుండఁ*
*గాలి బొటనవ్రేలగట్టిగా వానిపె, న్నెఱులఁ జుట్టి యీడ్చు పరమ సుఖము"*
*గాథాసప్తశతీసారము-భమరుడు - పు. 21*
4. *బి.వి. కుటుంబరాయశర్మ - తిమ్మన కవితా వైభవము - పు. 32.*

కోపముతో నున్నవారు సాధారణముగ ఒక వైపునకు తిరిగి పండుకొందురు. సత్య, తన కుడిచేతి వైపునకు జరిగియుండును. ఆమె "మాన క్రోధములచే కుములుచు చింతా ధీన గతి నుండుటను గమనింపగానే, అతనిలో ప్రేమ పొంగి పొర్లగా, బ్రతిమాలుకొనుట వలన లాభము లేదని గ్రహించి, ఆమె పాదములకు శిరముంచి మ్రొక్కినాడు. కుడిచేతి వైపు ఆమె తిరిగియుండుట వలన, సహజముగ ఆమె కుడి పాదము మీద ఎడమ పాదము పెట్టియుండును. కృష్ణుడు తన పాదములపై శిరము నుంచి మ్రొక్కగా ఆమె, పైన ఉన్న వామపాదముతో తన్నుట జరిగియుండును. కోపాతిశయమున నుండుటచే, తాను తాచినది కుడి పాదముతోనా? వామపాదముతోనా? అని తర్కించుకొను స్థితిలో ఆమె లేదు. పాద తాడనము పొందిన శ్రీకృష్ణుడు మరింత శృంగారావేశపూరితుడై

*నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్క బూని తాఁ*
*చినయది నాకు మన్ననయ, చెల్వగు నీపదపల్లవంబు మ*
*త్తను పులకాగ్ర కంటకవితానము దాఁకిన, నొచ్చునంచు నే*
*ననియెద నల్కమానవుగదా యికనైన నరాళకుంతలా     ....(పారి - 1 - 123)*

అని బ్రతిమాలుకొనును.

నాయికా పాద తాడనము పొందియు, కోపావేశ పూరితుడు గాక, ఇట్లు నాయకుడు పలుకుటయు, నాయకోత్కర్షకే. దీనికి నిదర్శనముగా "దాసే కృతాగసి భవత్యుచితః ప్రభూణాం పాద ప్రహార ఇతి సుందరి నాస్మిదూయే, ఉద్యత్కఠోర పులకాంకుర కంట కాగ్రైర్య ద్భిద్యతే మృదుపదం నను సా వ్యథామే"[1] -- అనెడు సాహిత్య దర్పణము నందలి శ్లోక మొకటి యున్నది. దాసుడు తప్పు చేసిన ప్రభువులు పాదతాడనము చేయుట ఉచితమే, కావున నేను బాధపడుటలేదని దీని అర్థము.

పై 'నను భవదీయ దాసు' ననెడు పద్యము ఈ శ్లోకమున కించుమించు భాషాంతరీ కరణమే. ఈ పద్యము కూడ ఆలంకారిక లక్ష్య లక్షణాన్వితమే. ప్రియుడు తన ప్రణయినికి ప్రేమాతిశయముతో దాసుడనని చెప్పుకొనుట సహజము. మాళవి కాగ్ని మిత్రము నందును, ఈర్ష్యాసూయలకు లోనైన మాళవిక, పెడముఖము పెట్టగా, నామెను ప్రసన్నము చేసికొనుటకు అగ్నిమిత్రుడును 'నీదు పాదదాసుడనని' ప్రకటించుకొనును.[2]

ఇట్లు తిమ్మన, పై ఘట్టమున, చాల వరకు ఆలంకారిక మార్గముననే నడచు కొనెను. ఇచట తిమ్మన, ప్రణయ సామ్రాజ్యము నేలు భార్యాభర్తలనే మనకు చూపింపదలచినాడు. ఇట్లు పాద తాడనము పొందియు శ్రీకృష్ణుడట్లు బ్రతిమాలుకొనుట సిగ్గులేని తనమని పుట్టపర్తి నారాయణాచార్యులుగారి భావము.[3] ఇది సిగ్గు లేని తనము కాదు, రసికత. వృద్ధుడగు దశరథమహారాజే తన భార్య పాదములకు నమస్కరించినాడు. లీలామానుష విగ్రహుడును, రసిక శిఖామణియునగు కృష్ణుడు, అంతఃపురమున నేకాంతమున తన ప్రియసతి కోపమునుపశమింపచేయుటకై ప్రణమిల్లుటగాని తీవ్ర కోపనయైన ప్రణయినిచే అతడు పాదతాడనము పొందుట గాని, అనుచితము కాదు. రసవంతమే అగును.

---

*1. సాహిత్య దర్పణము - పరి - 10.32వ, కారికకు ఉదాహరణము.*

*2. మాళవికాగ్ని మిత్రము - 4 - శ్లో. 10.*

*3. పుట్టపర్తి నారాయణాచార్యులు - ప్రబంధ నాయికలు. పు. 41.*
*"ఆమె రెండుపాదములు గట్టిగ బట్టుకొని అమ్మగారు! తమరు చాల నలసినారు వీడు తమదాసుడు గదా! తన్నినను ఫరవాలేదు" అని యేమేమో యన్నాడట. నిజముగా కృష్ణుడు సిగ్గులేనివాడు".*

"సత్య ఒకసారి తన్ని యూరకున్నట్లు లేదు. రెండవసారి తన్నుటకై కాలెత్తి యుండును లేదా తన్నుట యవ్యాహతముగా సాగుచునైన యుండవలెను. లేనిచో నామె పద పల్లవముల కాతని తనుపులకాగ్ర కంటక వితానము గ్రుచ్చుకొనుటనునది యసంభవము" అని బి.రామరాజుగారు భావించుచున్నారు.[1] కాని ఇది సరికాదు. "తొలగంద్రోచె" అని చెప్పి, అది ఒక మారు మాత్రమే జరిగినట్లు కవి సూచించినాడు. రెండవసారి కాలెత్తి తన్నవలసిన అవసర మామెకు లేదు. సత్య గయ్యాళి అనెడి భావము కొందరు విమర్శకులలో నుండుటవలన, అట్లనిపించి యుండవచ్చును. ఆమె పాదము శిరమునకు తగలగానే కృష్ణునకు మన్మథోద్రేకము కలుగుటవలన, అతని శరీరమున పులక లంకురించినవి. అనగా రోమాంచాతిశయ మేర్పడినది. అనురక్తిని ప్రకటించు సాత్త్విక చిహ్నమది. సత్య కోపము ప్రణయ కోపమని గుర్తించుట వలన, కృష్ణునకును ప్రణయోద్రేకము కల్గుట సహజము. నా తలకు బదులు పొరపాటున, నా శరీరమునకు నీపద పల్లవములు తాకి యున్నచో కంటకములు బోలు పులకాగ్రములు గ్రుచ్చుకొని నీకు బాధ కల్గించి యుండును కదా! కోపమున దానిని కూడ గమనింపకున్నావే? అని ప్రేమతో అనునయించినాడు. "తాకినన్' అనగా 'తాకియున్నచో' అని అర్థము. అదృష్టవశమున పల్లవము బోలు నీ పదములకు తాకలేదు. తాకి యుండిన ప్రమాదము సంభవించియుండును కదా! అని ఆందోళన పడినాడు.

"ఆమె యెంతగ దన్నినదో మన మెఱుగము. ఆ యావేశములో నామె సామాన్యముగ బోనిచ్చి యుండునా?" అని పుట్టపర్తి నారాయణాచార్యులు గారు సందేహించుచున్నారు.[2] ఆమె ఎంత తీవ్రముగా తన్నినను ఆమె లతాంగి, తాడనమా! పద పల్లపములతో చేసినది. అదియు నెయ్యపుఁగిన్కచే చేసిన తాడనము. కావున అందు తీవ్రత యుండదు. అందు ప్రేమయే అంతర్లీనముగా నున్నది. ఆమె పాద తాడనము వలన అతనికి ప్రేమాతిశయముచే రోమాంచాతిశయ మేర్పడినది. ఆమె శృంగార రసాధి దేవత. ఆయన శృంగార రసదేవుని కన్నతండ్రి. ఆ చర్యలోని రసికతను అర్థము చేసికొని అనుభవింపగల రసికులే వారిరువురును. ఇది వారి శృంగార క్రీడలలో నొకటి కావచ్చును. శృంగార క్రీడలలో కాంతలు మర్యాదలు పాటింపరనుటకు 'రతి చక్రే ప్రవృత్తేతునాస్తి శాస్త్రం నచక్రమః' అనెడు ప్రాక్తన సహృదయోక్తి కూడ కలదు.

హరివంశమునందు గాని, విష్ణుపురాణాదులందు గాని, కానరాని శ్రీకృష్ణ పాదప్రణిపాతము, 12వ ॥శ॥ నకు చెందిన మైథిలేయుడగు ఉమాపతి ఉపాధ్యాయుడు రచించిన పారిజాతాపహరణ ఏకాంకిక నాటకములో నున్నది. "హాథిక్। సందేహే పతితా తదుపసర్పామి ప్రియేమే" (ఇత్యుప సర్పతి సఖీం సంజ్ఞయా నివార్య విజ్ఞాపయిత్వా చరణతలం పరిమృశతి) అని అనుటచే ప్రణయ కుపితయగు సత్య పాదములకు, కృష్ణుడు మ్రొక్కినట్లు తెలియును.

తిమ్మన ఒకవేళ పై ఘట్టమును కూడ నాధారముగ తీసికొని తన ప్రబంధమున కృష్ణునిచే సత్య పాదములకు మ్రొక్కించి యుండును. రసాభివృద్ధికై సత్యామానినీత్వ ప్రతిష్ఠాపనకై ఆలంకారిక మార్గమున, కామశాస్త్రోచితముగ, ప్రాచీన కవి సమ్మతముగ, సత్యచే వామపాద తాడనమును చేయించినాడు.

తిమ్మన పై వామపాదతాడన ఘట్టమున ప్రణయ సామ్రాజ్యము నేలు భార్యాభర్తలనే మనకు చూపించినాడు. శ్రీకృష్ణుడు లోకమునకు భగవానుడే కావచ్చును. ఆ విషయము సత్యకును తెలియును. కాని, ఇప్పుడాతడు ప్రణయాపరాధము చేయుటచే, సాధారణ

---

1. బి. రామరాజు - అష్టదిగ్గజములు - పు. 57.
2. పుట్టపర్తి నారాయణాచార్యులు - ప్రబంధ నాయికలు - పు. 41

ప్రియునికి వలె ప్రేయసి ముందు భయపడినాడు. అతడు జగన్నాటక సూత్రధారియే యైనను ఆమె పాదములకు ప్రేమతో మ్రొక్కినాడు. ఆయన కిచట కావలసినది గౌరవము కాదు. ప్రేమ! సత్యయు, ఇప్పట్టున ఒక మహా ప్రణయిని వలెనె ప్రవర్తించి పాదతాడనము చేసినది. కావున అందు అనౌచిత్యమెచట నున్నది? ఔచిత్య మనునది సందర్భమును బట్టి యుండును. ఇది ఇరువురు శృంగారరసైక జీవుల నడుమ నడచిన శృంగారరసాత్మకమైన సన్నివేశము. ఇది కేవల రసికజనానుభవైకవేద్యము. ఇట్టిది శృంగార సీమలో సహజము. పాద తాడనమును కల్పించిన కవి అద్దానిని సమర్థించినాడు. ఆలంకారికు లంగీకరించినారు. భువన విజయము నందలి కవులును రసజ్ఞహృదయులై ఆమోదించియుందురు. రాయలును అద్దానిని మెచ్చియుండును. పాద తాడనము చేసిన ప్రియ, ఆ తరువాతనైనను దానిని దోషముగ భావింపలేదు. పాదతాడనమును పొందిన ప్రియుడును, అద్దానికి కుపితుడు కాకపోగా, ఉద్దీపిత మన్మథరాజ్య ప్రాపితుడైనాడు. వారికందరికి తోచని అనౌచిత్యము మనకు మాత్రము తోచుటలో ఔచిత్యమేమి యున్నది?

పాదతాడన ఘట్టము విశ్వనాథ సత్యనారాయణగారు భావించినట్లు "ఇది లోకమునందు శృంగార రసమునకు లక్ష్యభూతమైనది"[1]. సత్యాకృత వామ పాదతాడనము తిమ్మన తరువాత వచ్చిన పలువురు కవులును, శృంగారనాయికయైన ఆ మానినీ పాత్రకు ఉచితమైనదేయని భావించి, తమ తమ కావ్యాదుల యందును సత్యచే పాదతాడనము చేయించినారు. సాంత్వన కావ్యములలో తొలి కావ్యమును, దక్షిణాంధ్రయుగమునకు చెందనదైన "సత్యభామా సాంత్వనము" నందు, సత్య, తన పతి, పదియారువేల సవతుల గూడినాడని తెలిసి, ఈర్ష్యామానములకు లోనైనది. పతి, సాంత్వన వాక్యములకు కూడ శాంతింపక పోవుటచే, ఆమె 'పదయుగమునకు 'మోము జేర్చి' "వలపుల బాగు మీఱ, సాగిలగా" సత్య తన "యందియలు ఘల్లుమనగ" "హరి జాఱుసికం దెప్పున" "మనసు కినుక దీఱఁగ" దన్నెను (పు. 161). దీనినిబట్టి చూచిన పారిజాతాపహరణ సత్య వలె గాక, ఈమె పతిని తీవ్రముగ తన్నినదనియే తెలియుచున్నది. అట్లు తన్నినను ఇతడు కుపితుడు కాలేదు. మీదు మిక్కిలి 'అల్లనల్లన' ఆమె 'బొటనవ్రేలును, మెల్లన హరి పంటనంట మెఱముచు నొక్కెను'. ఇట్లు వేమారు నొక్కగా కోపము మరచి సత్య "కలకల నవ్వినది". దీనినిబట్టి ఆనాటి సంఘమున, సాహిత్యమున, నాయకుడు నాయిక పాదములకు మ్రొక్కుటగాని, నాయిక పాద తాడనము చేయుటగాని అనౌచిత్యముగా భావింపక, దానినొక సాంత్వన హేలగా, శృంగార లీలగా భావించి రనుట స్పష్టము.

ప్రణయ కుపితయైన నాయికా పాద తాడనమునం దౌచిత్యమున్నదని భావించిన ఆనాటి కవులు, తమ తమ ప్రబంధ నాయికల చేతకూడ, తాడనము చేయించినారు. దక్షిణాంధ్ర యుగమునకు చెందినదే యైన ముద్దుపళని రచించిన రాధికా సాంత్వనమున, రాధ, కృష్ణుని నూతన వధువైన "ఇళపై" గల మాత్సర్యముతో, కుములుచున్న తనకు సాంత్వనము చేయదలచి, ప్రియుడైన కృష్ణుడు తన పాదములపై వ్రాలగా 'మంజీరము ఘల్లన,' 'పరమాత్మని శిరము'ను 'వామపాదము'చే 'ద్రోఁచెను' (పైది 4-92). కృష్ణుడును 'నా జన్మ మిపుడు సఫలంబాయెనే, నీ చిన్ని పదము నొచ్చెనో, నా చికుర భరంబుఁదాఁకి' అని లాలించును.

సపత్నీ మాత్సర్యమునకు లోనైన భామాకలాపపు సత్యభామయు "క్షమించి, నను బ్రోవన్ రావె, కేల్మోడ్చు పోన్ తగవుల్ దాసుని తప్పు చెల్లును గదా దండంబుతో సుందరీ" అనుచు పతి మ్రొక్కగా, "ధూర్తుడా" అని తన్నును (భామాకలాపము - మినర్వా ప్రెస్ - పు. 77).

1. కావ్య పరిమళము - పు. 70

పారిజాతాపహరణ యక్షగానము నందును, రుక్మిణికి తాను చేసిన పారిజాత పుష్ప ప్రదాన కారణముగా ఖండితయైన సత్య క్రోధమును, మాటలచే తీర్ప శక్యము గాక, "విరాళిచే జగన్నాటక సూత్రధారి లలనామణికిం బ్రణమిల్ల"గా, అంతట, ఆమె కృష్ణుని మస్తకంబునన్ వామపాదంబుంగొని' 'దన్నినది' (4-241).

నాటక కర్తలును, సత్యభామచే పాదతాడనము చేయించినారు. చిలకమర్తి వారి "పారిజాతాపహరణ నాటకము" నందలి ఖండితయైన సత్య, ప్రబంధ సత్యకు వలెనె పతి శిరమును వామపాదముతో 'తొలగం ద్రోసినది'. దానిని దోషముగా భావింపని కృష్ణుడును

*"వెలఁదు లెనమంద్రు వైవాహవిధులయందు*
*పొసగ ముత్యాల తలఁబ్రాలు వోయునపుడు*
*వేల్పుటువిదలు సేసలు వెట్టునపుడు,*
*కలికి! యింత యానందంబు కలుగదయ్యె"* .....(పారి. నాట, పు. 33)

అని మోహాతిశయముతో పలుకును. రాధాకృష్ణ నాటకమున నూతన వధువై యుండియు సత్యభామ, రాధమీద గల ఈర్ష్యాతిరేకముచే, పతి తనకు ప్రణమిల్లుచున్నను లెక్కచేయక "రోషముతో దలఁదన్నును". (పుట. 64).

సత్యా పాద తాడనమునకు ప్రత్యేక కారణమున్నట్లుగా ఒక కథ ఉన్నది. ఒక బ్రాహ్మణ వితంతువు శ్రీరాముని భర్తగా కోరుచు, అతని పాదముల కేకాంతముగ నమస్కరింపగా, ఏక పత్నీవ్రతస్తుడగుటచే నీ యవతారమున నన్నంటకుమని అతడు కాలు విదిలింపగా, అది ఆమె ఫాలమును తాకినదనియు, ఆ చిన్నది దానిని అవమానముగా భావించి "ఈ యవతారమున దిరస్కరించితివి గాన, గృష్ణావతారమున దిరుగ పాద ప్రహరణ మొనరింతుననియు, నిన్ను నావలలో వైచికొనియెదననియు" ప్రతిజ్ఞ చేసి, తపోమహిమచే బ్రాణపరిత్యాగ మొనరించి యీ ద్వాపరంబున సత్యభామగ జనియించెనని నారదుడు గర్గునితో చెప్పినట్లు శ్రీ మల్లాది అచ్యుత రాముడు వ్రాసిన "సత్యామోద చంద్రోదయమను నాటకమున నున్నది (పుట. 101). కాని ఇది ఆధునికులైన వారెవరో కల్పించినది. దీనికి ప్రాచీన పురాణేతిహాసములం దాధారములు లేవు.

తిమ్మన, శృంగార రససీమయగు సత్యభామ మానినీత్వాతిశయ నిరూపణకై, ఆలంకారిక సమ్మతముగ, వామపాదకృతతాడన కల్పనను చేసెను. ఆ పాత్రకది యెంతయు నుచితముగ నుండుటచే ఆ తరువాతి కవులును సత్యభామచే తమ తమ కృతులయందు పాదతాడనము చేయించి సత్యభామ మానినీత్వమును కాపాడినారు.

## ఇతర ప్రబంధములలో సత్యభామ మానినీత్వ చిత్రణము :

పారిజాతాపహరణ ప్రబంధమునందే గాక ఇతర ప్రబంధములందును సత్యభామ మానినీలలామగ చిత్రింపబడి యున్నది.

చంద్రభాను చరిత్రయందును, సత్యభామ పట్టమహిషియగు రుక్మిణితో సమానమైన చనవులను పతి నుండి పొందుట వలన' "సవతులందఱు లోఁగి యిచ్చక మొనర్చు చుండి" రని వర్ణింపబడినది (1-85). ఈ కారణముచే సత్యభామ మానినీత్వము మరింత పెరిగినది. అగ్రమహిషి సంతానవతి కాగా, తానును మాతృమూర్తి కానిచో, జన్మ వ్యర్థమని భావించి, తదనుగ్రహమునకై పతిని కోరదలచినది. ఏకాంతముననున్న పతికి, ఆకుమడుపు లందించుచు తనకు గల వైభవాతిశయమును వర్ణించుచు, అఖిల వైభవములతో నతిశయించు తనకెట్టి కోరిక లేదనుచు. ఒక చిన్న విన్నపము మాత్రము కలదనుచు, "తెప్పతుదల నున్నసిగ్గు దొలంక", పతిని 'కనుంగొని'నది (1.94). మనవి కలదని అనినదే

కాని అది యేమో నోరు తెరచి చెప్పనేలేదు. పతినైనను తాను అర్థింపలేదు. అట్టిది ఆమె ఆత్మాభిమానము. ఆమె అడుగక పోయినను సత్య ఆత్మాభిమానము నెరిగిన వాడగుటచే "వనిత తలఁపెరిగి చూడ్కుల, ననుపమ వాంఛితములొదువ హరి కరుణించెను". కృష్ణుడిట్లు అడుగకయె ఆమె కోరికలు తీర్చుచుండుటచే ఇతరులు మచ్చరించు నంతగా, ఆమె మానినీత్వము వృద్ధిపొందినది.

విష్ణుమాయా నాటకమునందు సత్యభామ "మానవతీతిలకంబు"గ చిత్రింపబడినది. (1-198). పారిజాతాపహరణానంతరమున కీవలికథగా చెప్పబడిన ఈ ప్రబంధమునందు, సత్య శోభన యౌవన గర్వము, మనోహర నవరూపగర్వము ననంగవికారవిహార గర్వము, పర మహితాత్ముడైన విభుడు పాయని గర్వముతోపాటు 'సురతరులాభగర్వము' కూడ కల్గినది. (పైది 1.150). ఈకారణముగ సత్యభామలో ఆత్మాతిశయ మధికమైనది. "ఆరయ సత్యభామ హృదయంబెటులుండునొ చూడవలయు"ననుచు తన మాయా విస్తారము చేసి శౌరి రుక్మిణ్యాది వనితల కేళీవనములలో నొక్కొక్క పారిజాతమును సమత్వమేర్పడునట్లు నిల్పెను.

అంతేకాదు. పారిజాత ప్రసూన సౌభాగ్యలీలచే అష్టమహిషుల యిండ్ల, సహస్ర సంఖ్యలైన గోపాంగనల యిండ్ల నందరకు నన్నిరూపంబులై కేలితో నలరినాడు. ఆ కాంతలకు వలెనె, సత్యయు కృష్ణుని మాయను గుర్తింపలేక పోయినది. తన సౌభాగ్య గరిమ ప్రదర్శన చేయదలచి సత్య, "ప్రసూన దాన వ్యాజంబున రుక్మిణ్యాదులకు దనమహారాజసంబును బ్రాణేశ్వరుతోడం గూడి యనుభవించు మదన సామ్రాజ్యవైభవంబును హృదయ శల్యంబై యుండవలెనని", రుక్మిణ్యాది సవతులకు ప్రసూనములను దివ్యమణి పాత్రికల యందుంచి వారికిచ్చిరమ్మని చెలులకిచ్చి పంపినది. పారిజాతాపహరణములో వలెనె ఇందును సత్య చెలులు సత్య మానినీత్వాతి శయమునకు దోహదము చేయుట కలదు. సత్య పంపిన పారి జాతముల నీయ వచ్చిన చెలిని, రుక్మిణి యొక్క ద్వారపాలిక, ఇది యెవ్వరు పంపిరని యడ్డగించి అడుగగా, "పువ్వులెవ్వరు పంపి రెవ్వ రెవ్వరిదానవని నన్ను నిరాకరించి పలికెదు, పారిజాత ప్రసూన సౌరభసౌభాగ్యంబు దేవేంద్రుని నందన వనంబు చూఱపెట్టించి తెచ్చిన వీరపత్నీ తిలకంబగు సత్యభామకుందక్క దక్కిన యా నగరి మగువలకుం గలుగ నేర్చునే" (పైది 1-154) అని గర్వముతో అడిగినది. రుక్మిణికిని పారిజాతమున్నదని తెలిసికొనిన వెంటనే, ఆచెలి ఆశ్చర్యపడినను అలవు, బలము చూపి నరకాసురుని గెల్చిన వీరసంపదచే, బలరిపువీడు చొచ్చి, భువనంబులు మెచ్చగ, "సత్యభామ సొంపలవడఁ దెచ్చి" "ఆత్మనిలయంబున నిలిపిన పారిజాతము" ఆమెదనియు, రుక్మిణిది కేవలము "పెరటి చెట్టనియు," అట్టిది మీ పెరటిచెట్టునకు "సరిరాక పోయెనే" అని ఎకసక్కెమాడినది. (పైది 1.180). అంతేకాదు "కానీవే, యావెలఁది బారిఁబడినపుడీ విధములు చూపకున్న, యిపుడేమిటికిన్" (1-181) అని మురాంతకుని పరోక్షముగా హెచ్చరించినది. ఈ చెలి పలుకులు హెచ్చరికలు సత్యమానినీత్వమునే పట్టిచూపును.

ఇఁక సత్య ప్రవర్తనయు మానినీత్వపు తీవ్రతనే స్పష్టము చేయును. వింత పువ్వులతోడ వచ్చిన చెలిని, అవి యెచటినుండి వచ్చినవని అడిగితెలిసికొనినది. సవతుల కడకేగిన చెలులందరు అటులే నూతన పుష్పయుతములైన మణిపాత్రికలతో రాగా, అది చూచి అసూయచే సత్యకు కోప మధికమైనది. తన "నొక పెద్దచేసి" భువనంబు లెరుగగ పారిజాతము నయ్యనిమిష నాథుని గెల్చి తనయింట నయమారగ నిల్పి, ఇపుడు ఆనాటి మేలు నెవరు కృపాతి విశేషము మరచి, పెద్ద దేవికి ఇచ్చుటచే ఆమెకంత కోపము వచ్చినది (1-200).

*"సత్యభామ పారిజాతపుష్పము లంపె*
*నంప, సాటి కొరులు నంపువారె?"* .....*(విష్ణు. మా. నాట. పు. 1-202)*

అని కోపముతో ప్రశ్నించినది. సత్యభామ మానవతీతిలక మనుటకు ఈ పద్యమొక బలమైన నిదర్శనము. పారిజాత వృక్షము సత్యకే ఉండవలయును. ఆవిరులను తానే ఇతరుల కంపవలయును. అట్లు తానే ఇతరులపై ఆధిక్యము నెరపవలయును. ఇతరుల నామెకట్టి విరులు పంపిన, దీనికి మించిన మానహాని ఏమున్నది? ఏపారిజాత వృక్ష లాభమువలన తన మానవర్ధనము జరిగినదో, దానివలనే మానహాని జరుగుచుండగా ఇక ఆ వృక్షము తన యింటనుండుటలో గల ప్రత్యేకత యేమున్నది? కావుననే

*"ఇంక కడమ మాటలేల? యీతరువు నీ*
*యిష్టసతికి లంచ మిచ్చుకొమ్ము"* ...*(పైది)*

అని సపత్నీమాత్సర్యముతో, ఎట్టిశంకయు లేక ఆ మానిని అవ్విరులను కృష్ణునిపై "పాఱంబోయించి", కేళీ మందిరమునకు బోయివగచినది. మరునాడు కృష్ణుని చెలికాడైన గోవిందశర్మ వలన, ఇదంతయు హరి యింద్రజాలమని గ్రహించి ప్రసాదనచిత్తయైనది.

సత్యకు కావలసినది పారిజాతము కాదు. లోకములెరుగ, దేవేంద్రు గెల్చి సురతరువును తనకు కానుకగ నిచ్చి, తన యెడల ప్రత్యేకానురాగము చూపిన భర్త, నిరంతర ప్రేమ. ఆ ప్రేమను ఏకాంతయెడల, ఏ విధముగా అతడు ప్రకటించినను ఈ మానిని భరింపలేదు. కృష్ణునకును ఆ విషయము తెలియును. కావుననే ఆమె హృదయ ధైర్య సామగ్రి చూడ సమకట్టి తన మాయానాటకముచే ఆమెను పరీక్షింప బూనినాడు. ఈ ప్రబంధమునందలి ప్రథమాశ్వాసములోని ఈ కథ, సత్యా గర్వభంగమునకై ఉద్దేశింపబడినట్లు లోకమున భావింపబడినను, ఇది వాస్తవమునకు సత్యామానినీత్వ పరీక్షకే ఉద్దేశింపబడినది. రుక్మిణ్యాదులకు మాయాపారిజాతములు లభింపగా, సత్యభామకు మాత్రము సత్యమైన పారిజాతమే దక్కినది. ఈ విధముగ కూడ కృష్ణుడు సత్యామానినీత్వమును కాపాడినాడు.

సత్యభామా సాంత్వనమునందు, సత్య "మానవతీమణి" (పు. 10). కృష్ణుడు, నరకుని చెరలోని పదియారువేల వనితలను చేపట్టి కందర్ప సామ్రాజ్య మేలింపుచుండెనని వినగానే, రుక్మిణ్యాదులు అసూయకు లోనైనను, అంతలోనే ఊరటను పొందగలిగినారు. కాని సత్య మాత్రము సహింపలేక పోయినది. నరకుని చెరలోనుండి తెచ్చిన కన్యలు తనవలె సుందరులు కారు. ఈమె దృష్టిలో "మిణుకు చెలువలు." మేను దాచక యుద్ధమున పెనగిన ఆమె పౌరుషమును, లోకము మెచ్చినది. అట్టి దానిని ఈనాడు

*వగ దప్పి, నలంగిన నా*
*దగ దప్పులఁదీర్చి నన్ను దనియించక యా*
*మగువల హరి సేరెఁగదా, తగవే?"* ....*(సత్య సాం. పు. 149)*

అని ఆమె క్రుంగినది.

సవతులబాధ తనకొకతెకే కల్గినట్లు విపరీతముగా కుమిలినది. వారిని గ్రహించుట అనగా పతి తననొల్లని యట్లే యని భావించినది.

సత్యది హద్దులు మీరిన పట్టుదల అని తెలిసియు, సత్యా ప్రియుడగు కృష్ణుడామెను లాలింప దరికి రాగా, తానాత్మాభిమానము కలదానను, కావున తనువును త్యజింప గలనని బెదిరించినది. కృష్ణుని ప్రేరణచే చెలులు, మగవాడు తుమ్మెదవంటి వాడనియు మత్సరము వహించుట ఆమెకు తగదనియు, దయకలవాడు కావున, ఆమెయున్న పట్టునకాతడు రాగా, పతిని ఉపేక్షించుట ఉచితము కాదనియు, అన్నివిధముల అతనిని నాదరింపు మనియు

హితబోధ చేయ బూనగా, అట్లు చేయుట, ఆ మానిని కనిష్టముగా అనిపించుటచే "కసరి యురగాంగనబోలెఁ దల యెత్తి బిట్టుగా నూర్చి" వారిని 'ఉబికిచూచి' వారెంచక మాటలాడుచున్నారని అదలించుచు, వారిట్టి బోధకు కారణము "వంచకుడు మీ కొసంగెడు, లంచంబులు" అని, ఈసడించు కొనినది. అతడు తెచ్చిన సొమ్ములు తన కనవసరమనినది. ఆత్మహత్య చేసికొనిన, ఆమెకే నష్టమనియు, అతని కింకను చెలులు కలరనియు చెలికత్తెలు జడిపించగా, దక్షిణాంధ్ర యుగమునాటి సత్య కావున, ప్రగల్భత్వమేపారగ, "కాంతలచేత వీడుగద యిట్లాడించె" ననెడు కోపముతో, శౌరి "జడగొట్టె"ను (పైది పు. 158). మ్రొక్కుటకై పాదములపై పడిన పతిని 'తన్నెను' (పైది పు. 161).కాని చివరకు పతి కావించిన సాంత్వన శృంగార క్రియకు 'కలకల నవ్వి' పతిని 'తనియించి' నది. (పు. 161). పారిజాతాపహరణ ప్రబంధ సత్యకు వలెనె, మానినీత్వమును ప్రకటించినను అందలి గాంభీర్యమీ సత్యయం దంతగా కనిపింపదు.

చెంగల్వ కాళ కవి రచించిన రాజగోపాల విలాసము నందు సత్య, స్వాధీనపతికగ చిత్రింపబడినది. ఇందు, కలహాంతరితయైన రుక్మిణి, పతికి తాను కలలో కూడ ఎదురాడననియు, అతడెవరితో తిరిగి వచ్చినను తానెన్నడు వారించుట లేదనియు, తన సహనము గూర్చి చెలితో చెప్పుకొనును. (1-199). అందే, జాంబవతియు "ఎంత నేరము చేసి యేనియు నా చెంత నిలచినఁ గోపంబు నిలుపనేర" (పైది 3-14) అని, అతడు కావించిన ప్రణయాపరాధ మెట్టిదైనను తాను సహింతుననియు అనును. కాని సత్యకు వలె వీరు మానినీత్వము కలవారిగ కనుపింపరు. సత్య యెరుగునట్లు శ్రీకృష్ణుడు ప్రణయా పరాధము చేయుట కాని, అది తెలిసిన సత్య సహించుట కాని ఏ ప్రబంధమునందును కానరాదు. ప్రబంధ కవులు సత్య మానినీత్వ చిత్రణమున కడు జాగరూకత వహించి యుండిరి. సత్య పతి నుండి శృంగారానుభవమును మనమున కోరుచుండియు అది తన నోటితో చెప్పలేక, వారి గత శృంగారమును స్మరించుచుండగా సత్య మనసును గ్రహించిన కృష్ణుడు, నీ మనుసులోనిది దాచుట యెందులకు అని అడుగుచు "ఏలీలన్ విహరింప నీవు మదిలో నేలాగు చింతింతువో యాలీలన్ సమకూర్చువాఁడ" (4-38) అని అనుచు, ఆమెను తనియించును. ఇట్లు సత్య మనోభావములనెరిగి కృష్ణుడు ప్రవర్తించుటచే, ఆమె మానినీత్వ మతిశయించుచుండినది.

ఆధునిక ప్రబంధములందును, సత్య మానినిగ చిత్రింపబడినది. శ్రీకృష్ణాతిమానుష తత్త్వ ప్రబంధమునందు, పారిజాతమును కృష్ణుడు గాక, నారదుడే రుక్మిణి కిచ్చును. కావున, సత్య కృష్ణునిపై అలుగుట అనుచితమగును. కాని, మానిని కావున ఆమె దైత్య ధ్వంసకుడే పరాభవము యాథార్థంబుగా జేసినట్లు ఆందోళనము పొందినది. అంతే కాదు. "మార్గావలోకనము కూడ చేసి" "శ్రీపత్యర్థాంగి యెవారో? తేల్తునని" 'కోపాగారమున్ జొచ్చినది.' కృష్ణుడామె కోపమునకు హేతువడుగుచు.....

*"..................అమానుష మేని బిరానఁగూర్చి నీ*
*మానవతీత్వ సంపదను మానితమౌగతి నేనొనర్పనే?"* .......*(శ్రీకృష్ణా- 3-1-170)*

అని సత్యామానినీత్వమును కాపాడదలచితినని పలుకును. 'ఇదొక్కమేలునకు వచ్చిన కోపముగా భగవానుడు తలంచినట్లుగానే సత్య మానినీత్వము కృష్ణునిచే పారిజాతాపహరణము చేయించి, ఇంద్ర గర్వభంగము కల్గించి, అతనిచే కృష్ణునిని భవంతునిగ గుర్తించునట్లు చేయగల్గినది. ఈ ఆధునిక ప్రబంధమునందలి సత్య, కృష్ణుని తన్నదు. అదేవిధముగ శ్రీనారునార్య రచించిన 'అచ్చతెలుగు నిర్వచన పారిజాతాపహరణ ప్రబంధము' నందలి సత్యయు, మానినీత్వమును ప్రదర్శించినను, పతి శిరమును తన్నదు.

సత్యా కృష్ణుల పరిణయమునకు ముందే వారినడుమ ప్రణయము కొనసాగినట్లుగ కల్పించిన ప్రబంధములలో అడవి సాంబశివరాయ కృతమగు "సాత్రాజితీపరిణయ" మొకటి. సత్యా కృష్ణుల వివాహమే ప్రధానముగా గల ఈ ప్రబంధమునందు, కన్యగ నున్నప్పుడును సత్య మానినిగ వర్తిల్లినట్లు చిత్రింపబడినది. కృష్ణునిపై విరహముతో తపించు సత్యతో ఆమెచెలులు, ప్రియంబు మీర లేఖ వ్రాసి అతనికి పంపుమని బోధింపగా "చెలువల కెందు వల్లభుల చిత్తమెఱుగక మున్న, తారయై తలఁపు తెఱంగుఁదెల్పు టుచితంబే" (4-113) అని అభిమానముతో ప్రశ్నించుచు "ఆఁటైన పడంతి బేలయై, చులకనగాదె" అని మానినీత్వమును కనబరచుచు, "మీరలిది సూడక యాడెదరు" అని మందలించుచు, తాను మన్మథతాపమునకు గురియగుటకే సిద్ధపడినది. ప్రద్యుమ్నుని గూర్చి వినగానే శుచిముఖిచే రాయబార మంపిన ప్రభావతిలో కానరాని, మానినీత్వ మీమెలో నున్నది. గిరికలో గాంభీర్యమే లేదు. చివరకు చెలులు, రాజహంసచే నలదమయంతులు మనసులు తెలిసిరనియు, రుక్మిణియు హరికి తనకోరిక తెల్పినదనియు కావున, 'సందేహింపక' వాచిక మంపుమని' వారు ప్రోత్సహింపగా, అనువుగ నన్వార్థయుక్తమై, ఒకలేఖ 'తగ వ్రాసినదే' (4-118) కాని, తనమనసు నంతను విప్పి చెప్పలేదా మానిని.

వీని నన్నింటి నాధారముగ చేసి చూచినచో ప్రబంధ సత్యభామ, స్వాభావికముగ మానిని యనియు, వివాహానంతరము పతి అనురాగాతిశయము వలన, చెలుల స్నేహాతిశయము వలనను, ఆమె మానినీత్వము మరింతగ వర్ధిల్లె ననియు తెలియుచున్నది.

## భామా కలాపములో :

భామా కలాపమునందలి సత్యభామ, పదియారువేల కోమలందరిలో గోపాల మూర్తికి ప్రేమపాత్రమైన దాననని యును "అట్టహాసముతో, సురల నట్టె గెలచి పారిజాతమునాదు పెరట నాటించుకొన్న దాననని యు, పతికి ప్రాణసఖిననియు చెప్పుకొను ప్రణయగర్వముకలది. పతికన్నను తానే సుందరరూప యనెడు సౌందర్యగర్వముతో అతనిని నొప్పింపగ, అతడు సవతిని చేరినాడని తెలిసి, విరహముతో తపించును. తాను బాధకులోనైనను, నలుగురి ముందు ఆ విషయము వ్యక్తమగుట సహింపలేక పోయినది. సత్యభామకు తాను సత్యమైన భామను, అనగా సత్యమైన స్త్రీత్వమున్న దానను నమ్మకమున్నది. తననొక ప్రత్యేక వ్యక్తిగ భావించుకొనును. నోములు నోచి కృష్ణుని పతిగా పొంది, స్వాధీనుని చేసికొని సవతులకు బెదురు కల్గించు చుండినది. కాని యీనాడు అతడు సవతులను చేరినాడు. ఈ కారణముచే ఇకతాను సవతులకు లొంగి యుండ వలసి వచ్చునేమో?

*"బెదిరించుకొని యేటి మదవతులకు నేనొదిగి*
*యుండనాయె దైవమా" ....(భామా-పు.25)*

అని ఆ మానిని భయపడినది. తనవంటి మానినికి వైభవాన్విత కిట్టి అవస్థ కలుగుట భరింపరానిది. "దైవమా! నిరంతరాంతఃపుర దాస దాసీజన పరిజన పరిసేవితనగు నాకీ యలజడి నేల కల్పించితివి?" (పైది పు. 24) అని కుమిలిపోయినది. తనవంటి మానిని సవతి యింటికిక పోలేదు కావున రుక్మిణి యింటనుండు పతిని తోడ్కొని రమ్మని చెలిని అర్థించినది.

"ఆరుక్మిణీమణి నన్ను వెక్కసంపు మాటలాడితేను, ఎక్కడ నేతాళుకొందునే" అని ఆ ఆలోచనకే భయపడినది. (పు. 36). సవతుల ముందు తనకే కాదు, తనచెలులును ప్రాభవమును కోల్పోరాదు. రుక్మిణి యింటనున్న కృష్ణుని కడకు, రాయబారమేగు చెలి,

తాను జీర్ణవస్త్రములతో అలంకార శూన్యముగా నచటి కేగిన అచటివారు నవ్వుదురనుచు 'అదిగాక నేను సత్యభామా దూతికనని చెప్పిన మీ సవతులందరు హేళనము, సేయరా?' అని సందేహమును ప్రకటింపగానే, ఆ మానిని "సఖీ నాకు తెలిసినది! నాకు దుకూలాంబరము లెన్నియో గలవు. నీకు వలయు చీరెల ధరించి పోయిరమ్ము. ఇంక నీకేమి యాభరణములు కావలెనో గైకొమ్ము" (పైది పు. 46) అని తనకు మానహాని జరుగకుండుటకై తన వస్తువులనన్నింటి త్యాగము చేయదలచినది.

యక్షగానపు పోకడలతోనున్న శృంగారనాయిక కావున పతికి సందేశ మంపినదే కాని, ఈ 'భామాకలాప సత్యభామ' మాత్రము, మానాభిమానము లెన్నడును మరచిపోదు. విడిచిపెట్టదు. రుక్మిణి తన నవమానించి పంపినదనియు, కృష్ణుడు రానని అనినాడనియు చెలి చెప్పగానే, ఆమెలోని మానినీత్వ ముప్పెన వలె పొంగుకురాగా,

*"రానంటాడటే? మంచిది మంచిది రాకుంటే?*
*మంచిది రానే వద్దనవె*
*రామరో తా బ్రతిమాలితె రమ్మనే వా*
*రెవరున్నారు?"          .....(భామా- పు. 80)*

అని బింకము చూపినది. పారిజాతాపహరణ ప్రబంధ సత్యవలెనె "మానరహితమైన బ్రదుకు మానినికేల" అనుచు

*"మగడు యింతులపై దయ మాలి యున్న*
*ప్రాణముల్ దాచనేల నీప్రాయ మేల?"       ....(పైది పు. 83)*

అని ప్రాణత్యాగము చేయబూనియు, చివరకు అందు కృతకృత్యురాలు గాక పోవుట వలన మూర్ఛపోయినది. పతిపై పరిపూర్ణ అనురాగమున్నను సత్య అతడు కావించిన ప్రణయాపరాధమును మరువలేక పోయినది. విరహాతిశయముచే మూర్ఛితురాలయ్యు, పతి వచ్చినాడని విని, ఒక క్షణము సంతసము పొందినను, అతడు సవతి కడ నుండి వచ్చినాడను కోపముతో "ఎల్లప్పుడు నెడ బాయకుండునట్టి రుక్మిణీదేవి యొద్ద సెలవుపొందియే వచ్చినారా? దొంగతనముగ వచ్చినారా? ఆమెవలన నేమి మాట వచ్చునో? వేగపొమ్మని చెప్పవే! సఖీ" (పైది పు. 85) అని అతనితో మాట్లాడుటకు కూడ ఇష్ట పడక, చెలిని చెప్పుమని, హెచ్చరించినది. అంతేకాదు, తనను స్వీకరింపుమని అర్థించుపతితో రుక్మిణి యనుచున్న ప్రేమనణచి. అతనిని రప్పింప గలననియు, పదియారువేల మించు బోడులలోను తననే కౌగిలించుకోమని బ్రతిమాలించుకొనునట్లు చేయ గలననియు అతనిని, రుక్మిణిని పట్టి, నలుగురిలో అభిమానము తీయింతుననియు, అట్లు కాని యెడల తన పేరు 'భామ' కాదనియు (పు. 86) పంతమాడినది. పతియొక్కయు, సవతి యొక్కయు మానములు తీయించిన గాని ఆ భామ కోపమణగదు. అట్టిది ఆ భామ పంతము. కాని అతడు భగవానుడని గుర్తింపగానే, అతనిని పూజించినది. "సిద్ధేంద్రుడు ఆమెలో అహంకారాన్ని తొలగించి దివ్య స్వరూపిణిగా చిత్రించుకొన్నాడు" అని బందా కనక లింగేశ్వరరావుగారనినారు.[1] సత్యభామ యొక్క అవధులు మీరిన మానినీత్వము లోకమున అహంకారముగ భావింపబడుచున్నది.

---

*1. భామాకలాపము. ఆం. ప్ర. సం. సా. అకెడమో -- ఉపోద్ఘాతము - పు. 1*

## యక్షగానములలో :

సత్యభామలోని మానినీత్వము, రాజసము, ప్రబంధ కవులకు, నచ్చినట్లుగ, యక్షగాన కర్తలకు నచ్చలేదు. ఆ గుణములు వీరికి అహంకారముగా అనిపించుటచే కాబోలు వీరి చిత్రణలో సత్యభామ దురభిమానవతిగా, ఈర్ష్యావిలచిత్తగ, సవతులతో కయ్యమునకు దిగు గయ్యాళిగ రూపొందినది.

17వ శతాబ్దమునకు చెందిన అక్కనామాత్యుని "బాలకృష్ణ లీలా విలాస యక్షగానము నందు ఇట్టి సత్యభామయే ప్రత్యక్షమగును. శ్రీకృష్ణుడు జగముల కర్త అని సత్యకు తెలియును. ఆతడనిన ప్రేమ, భక్తి యున్నవి. కాని వానిని మించిన స్వార్థమున్నది. ఇందలి సత్య ప్రబంధ సత్యవలె మానవతి కాదు. మానము కన్నను పంతమునకే ముఖ్యత్వ మిచ్చినది. ఈర్ష్యాసూయలే ఈమె యందు రూపు దాల్చినవి. శ్రీకృష్ణుని 'నామనోహరుడు నావాడు' అని తలంచినను, శ్రీకృష్ణుడు మాత్రము, సత్య కన్నను రుక్మిణినినే ఎక్కువగా గౌరవించుట ఈ యక్షగానము నందు కాననగును.

అరవిందనేత్రుడు రుక్మిణి కడ యున్నాడను వృత్తాంత మొక చెలి తెల్పగా, అన్నియు విని సత్య, విరహమును సహింపలేక అతనిని తోడి తెమ్మని చెలుల నర్థించినది. చెలి, కృష్ణుని తిరస్కారమునకు సిగ్గుపడి, తాను పోలేనని అనగా, అతనిని తెచ్చిన, నేవళము నిత్తునని కూడ ఆశ చూపినది. కాని చివరకు తానే, రుక్మిణితో గూడియున్న గోపాలుని కడకు పోయి అష్టమహిషులలో "ఘనతగా చేబట్టి" గౌరవించియు ఇపుడిట్లు విడనాడ కారణమేమని నిలదీయుచు అతని సాన్నిధ్యమును, సంభోగమునాశించుచు,

*"చిత్తావధానమునఁ జిత్తజుకేళి*
*హత్తి తాపము దీర్పు మరవిందనయన! (బాలకృష్ణ లీ. వి. యక్ష - పు. 124)*

అని అర్థించినది. కాని కృష్ణుడు, సవతితో కలసియున్న తన కడకు వచ్చి, మానవతి యని ప్రసిద్ధమైన సత్య ఇట్లురమ్మని బలవంతము చేయుట సిగ్గులేని తనముగా, జగడమాడు గయ్యాళితనముగా తోచగా,

*"మానవతి! నీవు సిగ్గు మాలిన దానవై వచ్చి*
*పూని జగడ మాడేవు నీ బుద్ధి నా మనసు రాదు" .....(పైది పు. 125)*

అని మందలించుచు, రానని అనుచు, పొమ్మని అదలించెను. ఇంత అవమానము జరిగిన తదుపరియు, సత్య తన పంతము వీడదు. పతి ఎల్ల జగము కర్త అని తెలిసియు పతిని విటరాయడని నిందించినది. విరహతాప మోర్వలేక పోవుటచే, మానవతియనుటను గూడ మరచి "తనరిన భోజకన్య వంటిదాన గానటర"..... (పైది 127) అని అడుగుచు, తనను ఏలుకొమ్మనినది. సమర్థత యున్న పతిని కట్టి పడవేసికొనవలయునని బుద్ధులు చెప్పు రుక్మిణిని 'నంగనాచి' యని నిందించినది. పతి ఆమెచే తనను తిట్టించుట మాత్రము, సత్యకు ఉచిత మనిపించలేదు. కాని అంతలోనే ప్రేమమీర, కనులెత్తి చూడమనుచు, "ఇన్నాళ్ళ వలెనె గారవించరా, నీకు మ్రొక్కేరా" అని అర్థించినది. కాని కృష్ణున కామె మాటలు చేతలు 'గయ్యాళితనముగ' తోచినవి.

*"మానవతిరో! దురభిమానము బెంచుక వచ్చి*
*ఈనిన పులి వోలె నీ వెంత చేసేవే యీవేళ ....(పైది పు. 134)*

అని పొమ్మనుచు అవమానించినాడు. "గోపాల చూడామణిన్ రమ్మంచు న్నిపుడెంత నేఁ బిలిచినన్, రాడయ్యనే నెచ్చెలీ" (పు. 135) అని సత్య, చెలితో మొరపెట్టుకొనినది. చివరకు విరహార్తి భరింపలేక మూర్ఛితురాలైనది. చెలివలన, ఆ విషయమును తెలిసికొని, కృష్ణుడు వచ్చి శైత్యోపచారములు చేసి సరస సల్లాపములాడగా, కోపముతో అతడు గావించిన

నేరములన్నిటిని నెమరువేసినది. ప్రబంధ కృష్ణుని వలె ఈ యక్షగాన కృష్ణుడు సత్యకు భయపడడు. మీదు మిక్కిలి, బుద్ధి లేని దానవు, జగడ మాడిన ఎవరును ఓర్వరని మందలించును.

పాదతాడనమందుకొనియు, భవదీయ దాసుడనని ప్రకటించుకొనిన శృంగార పురుషుడు కాడీ యక్షగాన కృష్ణుడు. తాను భగవంతుడను విషయమును గ్రహింపలేని సత్య అజ్ఞతకు కోపగించుకొనినాడు. కాని ఇందలి సత్య, కయ్యము లాడినను, తీవ్ర కోపనకాదు. పతి హితోపదేశమును గ్రహించి, కోపమును మరచి, "భావము దెలిసిన దానను గాను" అని దోషము నంగీకరించినది (పు. 14). 'అదను తెలిసి వచ్చిన ఆదరించ కుందునా' అనియు రుక్మిణి ఇంటికి రావచ్చునా అనియు, ఇట్లు తానెచటికి పోయిన, అచటికి వచ్చిన లోకులు నవ్వుదురనియు, అట్లు వచ్చుట మర్యాద కాదనియు కృష్ణుడామెకు బుద్ధులు చెప్పగా, సత్య, అతని మాటలు నెల్ల భక్తితో విని, కృష్ణుని మహిమను లీలల నర్థము చేసికొని పలు విధముల పతిని స్తుతించి, అతని అనుగ్రహమును పొందినది. భర్త రాననుచున్నను, సత్యవంటి మానిని పదే పదే పోయి ప్రార్థింపలేదు. సవతి చేతను, భర్త చేతను బుద్ధులు చెప్పించుకొని తదనుగుణముగ నడచుట మానినికి అసాధ్యము కాని, యక్షగాన సత్య మాత్రము మానినీత్వ లక్షణమునకు విరుద్ధముగానే చిత్రితమైనది.

"పారిజాతాపహరణ, విష్ణు పారిజాతాది" యక్షగానములందలి సత్యభామా పాత్ర చిత్రణకు ప్రధానముగ పారిజాతాపహరణ ప్రబంధమందలి సత్యయు, భామాకలాపము నందలి సత్యయు ఆదర్శములుగా గైకొనబడినను, ఆ సత్యభామలలోనున్న రాజసము కాని నాగరికత కాని ఈ యక్షగానములందలి సత్యలో కానరావు. ఈ యక్షగాన సత్యకును, మానము కన్నను పంతమిాడేరుటయే ముఖ్యము. ప్రబంధ సత్య మాటలలోని మాధుర్యము గాని, చేతలలోని శృంగారముగాని అలకలోని అందముగాని, ఈ యక్షగాన సత్యయందు కన్పింపవు. ఈమె మాటలలో మోటుదనము, పనులలో పారుష్యము, అలకలో కొంత అవివేక మధికము. కృష్ణుడును ప్రబంధ కృష్ణునివలె సత్యభామావిధేయుడు కాడు. రుక్మిణికి భయపడి ఆమెకు ప్రియము చేయుటకే పాటుపడును. ఖండితయై కృష్ణుని గడగడలాడించిన కలికి సత్యభామకు బదులు, పతి ప్రేమకై ప్రాణాధికమైన ఆత్మాభిమానము ను సహితము విస్మరించి, పదే పదే పతిని ప్రాధేయపడు నిర్లజ్జయైనసత్య వీని యందగపడును.

గడుసరివలె కనిపించినను, మానహీనమైన బ్రదుకు మానినికేల? యని ప్రాణ త్యాగమునకై నిశ్చయించుకొనినది ప్రబంధ సత్య. చెలి యుద్బోధనచే ఒక పదకము వేసి, ఆ పథమున నడచి కార్యము సాధించుకొనినది, పారిజాతాపహరణ, విష్ణు పారిజాత యక్షగాన సత్య. వాయి తెరచి అడుగకయే వరుని వలన, వరము పొందగల భాగ్యవతి ప్రబంధ సత్య. వలసిన వరమునకై, విదిలించు కొనుచున్నను వరుని వీడక ప్రాధేయపడు వనిత, ఈ యక్షగాన సత్య.

మనకు లభ్యమగు యక్షగానములో నతి పెద్దది మాతృభూత కవి విరచితమైన "పారిజాతాపహరణ యక్షగానము" రుక్మిణికి పారిజాత మిచ్చినాడని వినగానే, ప్రబంధ సత్యకు వలెనె, ఈ యక్షగాన సత్యయు కోపముతో మానీత్వము ప్రదర్శింప బూనుకొనినది. కాని విరహమోర్చుకొనలేక రారాకృష్ణ, అని, తనవెంట రమ్మని అర్థించినది. ప్రబంధసత్య తానితర మహిషుల కన్నను మాత్రమే కాదు, పట్టపు రాణికన్న నధికురాలని భావింపగా, యక్షగాన సత్య "ఎక్కువ రుక్మిణొక్కరితె యేనొకతింతియె కాని యెన్నుచో, దక్కినవారు చిల్లరలు" ......(పు. 2-117) అని, తనను రుక్మిణితో సమానురాలిగా చెప్పుకొనినది. సిగ్గులేని దానవని అతడీసడించుకొనుచున్నను మానము విడిచి, సత్య మరల మరల "రారాకృష్ణా"

అని బ్రతిమాలినది. అంత కృష్ణుడదృశ్యుడు కాగా మరల తీవ్ర విరహమునకు లోనైనది. ప్రబంధ సత్యకు పతిసేవలు చేయ, ఈ యక్షగాన సత్య, పతికి సేవలు చేసియు, వంచింపబడినది.

చెలులకు లంచమిచ్చి, పతిని రప్పించుకొన చూచినది. పతి, రుక్మిణి మాయలకు చిక్కి యున్నాడనియు, కల్పవృక్షము తెచ్చి యిచ్చునని ఎఱుకత వేషమున నున్న శారద ఎఱుక చెప్పినను, చెలి పలుకుల వలన కృష్ణుడు సవతి యింటనున్నాడని తెలిసికొనియు, ఏ అతివ యింటనున్నాడో తెలుపుమని అవివేకముతో అర్థించును.

*"పెరటి చెట్టు మందులకుఁగొఱకాదన్నట్లు నా పట్ల*
*మరియాదలేకయే మరుని శరములకు గుఱి చేసెనే" ...(పారి యక్ష 3-పు-143)*

అని, తనను అనాయాస లభ్యమగు పెరటి చెట్టునకు పోల్చి కొనుట, మానినిగా సుప్రసిద్ధమైన సత్యా పాత్రమున కుచితముగా లేదు. కృష్ణుని కడకు రాయబారమునకు పోయి, వచ్చిన చెలి, సత్య అనిన తనకే మాత్రము లెక్కలేదని అతడు అనినాడని తెలుపగా, ఆ కఠోరవాక్యములకు నిశ్చేష్టితయై, సత్య మూర్ఛ పోయినది. పతి సవతితో సయ్యాటలాడినను తనకు బాధలేదు కాని, తనను గూర్చి ఆమె ముందు గేలి సేయుట మాత్రము భరింపలేక పోయినది.

కాని ఈ మానినీత్వమునకు స్థిరతలేదు. వెనువెంటనే చెలులకు లంచమాశ చూపి, పతి కడకు రాయబారమంపినది. భామా కలాపమునందు సత్యయొక్క చెలి, రాయబారమున కేగగ, రుక్మిణి పరుష వాక్కులాడినట్లు కలదు గాని, కృష్ణుడేమియు ననడు. కాని ఇందు, కృష్ణుడు, రుక్మిణీ రాధలకన్న, సత్య చక్కదనములో తక్కువయని, ఆమె మాయలాడి యనియు పరిహసించును. సత్యా పాత్రమున కింతటి క్రించుదనము ఈ యక్షగానములందు మాత్రమే కాననగును. చెలివలన అతిశయముగా వర్ణింపబడు పారిజాత పుష్పప్రదానేతి వృత్తాంత వర్ణనము రెండవమారు వినుచున్నను, మరల, సత్య, "విరహతాపంబుచే మిగల నొగిలి యేమియు దోచక మూర్ఛ చెందును" (3 - పు. 168). ఇది వినుట మొదటి మారు కాదు కదా! అట్టియెడ ధీరత గోల్పడి, మూర్ఛితురాలు కావలసిన హేతువేమి? అవసరమేమి? శైత్యోపచారములకు కోలుకొనిన తరువాత, ప్రబంధనాయిక వలె, భామా కలాపములో వలె, ఆత్మాహత్యా ప్రయత్నమునకై కడంగినది. చివరకు, విరహంబు సైరింప జాలక తానే లజ్జను విడిచి, సాహసించి మరల కృష్ణమూర్తి చెంగటికి వచ్చి, కృష్ణుని రమ్మనుచు స్వాతిశయభావముతో పిలిచియు, కృష్ణుడు బదులీయక పోవుటచే, చెలి మాధవి ఉపదేశానుసారము సత్య 'నమస్కరించి పిలువగా', కృష్ణుడాశీర్వదించెనేకాని, ఆమె వెంట రాలేదు. కోపముతో, కృష్ణుని అవతార మహిమలను వక్రమార్గముల విమర్శించినది. అతడు రానని అనుచు, పొమ్మని ఆమెను హెచ్చరింపగా,

*"ఇట్టి నీగుట్టు మఱియు నీయింటివరుస*
*నెల్లవారలు దెలియ నంగళ్ళఁబెట్టి*
*బైటవేయక మున్నె నా ప్రక్కఁజేరి*
*నేఁడు నన్నేలి సిగ్గు కాపాడుకొమ్మ"* ...(పారి - యక్ష - 4. పు. 202)

అని గయ్యాళివలె బెదిరించుచు, ఏలుకొమ్మని ఆదేశించినది. ప్రబంధ, భామాకలాపముల లోని భామలు మానినీత్వపు ప్రతీకలు. ఈ యక్షగాన సత్య రుక్మిణితోను, రాధతోను వాదులాటకు దిగి, చివరకు రాధ కారణముగా కృష్ణునితో తిట్లు పడినది. ఇంత అవమానము జరిగిన పిదపయు సత్య, 'స్వామి నీవు సర్వజ్ఞుడవు గాదా, ఊరడించి నాతో జల్లని మాటలాడరాదా'

(4 పు. 217) అని అర్థించుచు "... నన్నిపుడు, చౌకచేసితివి సవతి బోధన విని, నీకిది చెల్లునా, గోపాలకృష్ణ"! (4-218) అని నిందించి కోపావేశముతో నిజగృహంబునకు వచ్చి విరహముచే తపించినది. ప్రబంధ కృష్ణుడు సతి యెడల గల ప్రేమ వలన భయము, తత్తరపాటు పొందగా ఈ యక్షగాన కృష్ణుడు, సత్యపై ప్రేమకన్నను దయతోనే, ఆమె విరహము తీర్చుటకై అరుదెంచినాడు. ప్రబంధ సత్య కోపము సత్యమైనది. కాని యక్షగాన సత్య కోపాగార కవాట ప్రాంతమున బొంచి యుండి, తనను అర్థించు కృష్ణునికి, వక్రోక్తుల నిష్ఠురోక్తుల సమాధానమిచ్చును, ఆ మానిని కోపము మితి మీరినదనియు, మాటలచే తీరదనియు, "విరాళిచే జగన్నాటక సూత్రధారి లలనామణికి బ్రణమిల్లగా" "కృష్ణుని మస్తకంబునన్" "వామపాదముంగొని దన్నినది" (పైది 4-పు. 241). ప్రబంధ సత్య పాదతాడనములో గల ఔచిత్యము, శృంగార మిందు కనిపింపవు. ఈ యక్షగాన సత్యకు ప్రబంధ సత్యకు వలె భర్తృ వాల్లభ్యమంతగా లేదు.

*"నెలకొక్కసారైన నీవిందురాకున్న*

*బ్రాణముల్ నిలుచునా పరమపురుష" (4- పు- 248)* అని ప్రాధేయపడినది. ఇంత భక్తి భావమున్న సత్య, పతిని కాల దన్నుట యెందులకో? అని అనిపించును. ప్రబంధ సత్య, నోరు తెరచి యడుగుటకు ముందే అమ్మానిని మనసెరిగి పారిజాత వృక్షమునే తెచ్చి యిచ్చెదనని హరి ప్రతిన చేయును. కాని యక్షగాన సత్య

*"ఇటువంటిప్రేమ నీకిపుడు గల్గినను*
*తటుకున బారిజాతప్రసూనంబు*
*గ్రక్కున గొనిదెచ్చి కరుణతో నిచ్చి*
*మక్కువ నన్నేలు మదనగోపాల"* ...*(పైది-4-261)* అని అడుగవలసి వచ్చినది.
పారిజాతమును సాధించి తెచ్చి, ఆమె యింట నాటగానే

*"నేను నోచిననోము నేఁడుగా ఫలియించెఁ*
*బూని సవతులలోఁబూజ్యతందఁగలిగె"* .....*(పైది. 4-277)*
అని అమాయికముగ ఆనందించినది. పారిజాతమును తనకిచ్చి, పువ్వులన్నియు రుక్మిణి యింట నివ్వటిల్ల చేసిన కృష్ణుని వంచనను గుర్తింపలేకపోయినది.

ఈ యక్షగాన ఇతివృత్తమునే పోలి యున్న తరిగొండ వెంగమాంబ రచించిన "విష్ణు పారిజాత యక్షగానము" నందును సత్యభామ తీవ్రమానిని కాదు. పారిజాతమును రుక్మిణికి నిచ్చినందులకు సత్య అలుక వహించినది. ఈ యక్షగాన సత్యకును పారిజాతమును పొందుటయే ముఖ్యము. తాను బెదిరించిన, తన భర్త బెదురునని ఈమె నమ్మకము. కాని కృష్ణుడు, ప్రబంధ కృష్ణునివలె బెదిరిపోలేదు. సందేశ మందుకొనిన హరి, ఎన్ని మారులు సందేశమంపినను, అవమానించును. పంతము సాధించుటకై తపము చేయసంకల్పించును. పరమ యోగినివలె, బహువిరాగినివలె తపము చేయుచున్నను 'శృంగార వైరాగ్య రసంబులు రెండును' ఆమె ముఖ పద్మము నందు దీపించుట వింత గొల్పును (పైది. 110). తపమునకు మెచ్చిన హరి, సతిని రతికి ప్రార్థింపగా, పూర్వ పరాభవమును విస్మరింపని ఆ మానిని,

*"సురమహీజంబు కన్నులజూచి నిన్ను*

*పొందు దండాక పొందను పోర కృష్ణ" ....(విష్ణు పారి - యక్ష - పు. 114)* అని విదిలించుకొనగా, కృష్ణుడును ఆ మానిని మనసు నెరిగిన వాడగుటచే

*"పూని గ్రక్కున దేవ భూజంబు నిచ్చి*
*గాని ప్రాపింపను గంగామృతంబు"* ....(*పైది. పు. 114*)

అని తీర్మానించుకొని, నందనోద్యానవన ప్రవేశమున కొక హేతువును కల్పించుకొనుటకై, నరకాసుర వధకై పూనుకొనినాడు. నరకుని జయించిన తరువాత ఇంద్రునితో యుద్ధమునకు బూనుకొని,పారిజాతమును సాధించి సత్య కోరిక తీర్చినాడు. ప్రబంధ సత్యలో కనిపించు గాంభీర్యము గాని, తీవ్రమానినీత్వము గాని ఈమెలో కనిపింపవు. ఈ సత్యను చూచిన అభిమానముకన్నను సానుభూతియే కలుగును.

ఆధునిక కవి చెర్విరాల భాగయ్య వ్రాసిన "శ్రీకృష్ణ పారిజాత యక్షగానము" కూడ పారిజాతాపహరణ వృత్తాంతమునే, చాలవరకు తిమ్మన ప్రబంధ మార్గము ననుసరించి వర్ణించినది. కాని లోక ప్రసిద్ధమైన ధీర చిత్తము, వీరము ఈ యక్షగాన సత్యయందు లోపించుట ఒక వింత.

సత్యకు చెలి ఉపదేశాజ్యము పోసి, ఆ మానిని కోపాగ్నిని మరింత ప్రజ్వరిల్ల చేయుట యక్షగానము లందంతట మరింత అధికముగా కాననగును. ఈ యక్షగానమందలి చెలి, భయపడకుమనియు, ఎప్పటికి నిట్లు చేయకుండు నట్లొప్పింపు మనియు, 'వాటము కనిపెట్టి' హాటకాంబరుని ఆడించుమనియు, కైకకు మంథరవలె సూటిగానే దివ్యోపదేశము చేసినది. (పు. 18).

సహజముగా మానినియైన సత్యభామకు, మానినీత్వ ప్రదర్శననెట్లు చేయవలయునో ఇంకొకరు నేర్పవలసిన అవసరము లేదు. యక్షగానము లిందిట్లు చెలి పాత్రల కనవసరమైన ప్రాధాన్యమును కల్పించి ఆ మానినీ లాలమ, సహజ స్వభావమునకు కొంత వైవిధ్యము నాపాదించుట ఉచితముగ లేదు. పారిజాతాపహరణ ప్రబంధము నందును, యక్ష గానమందును, ఖండితా సాంత్వనమునకై ఆ కోపన పాదములకు మ్రొక్కగా, శిరమును పాదతాడనము చేయును, కాని ఈ యక్షగానమున, పతి ఆమె ప్రక్కలో గూర్చొండి, 'స్పర్శించినంత' లో, "సత్రాజిత్తి కోపంబున నాతనిని తన్నినది" (పు. 19). ఇది మానినీత్వముగ గాక, గయ్యాళి తనముగ అనిపించును.

ప్రబంధ సత్య, యేనాడును తన తండ్రిని నిందింపలేదు. కాని ఈ యక్షగాన సత్య "మంచి చెడ్డలానూ! దిలకించకుండగానూ! మంచి యెంచక నాతండ్రియు నన్నిచ్చెను. నీకూనూ" (శ్రీకృష్ణ-పారి-యక్ష-పు-19) అని తండ్రి అపరాధము చేసినాడని ఆరోపణము చేయుటయే గాక, పతిని, చివరకు బ్రహ్మను కూడ నిందించును. అతడెన్ని విధముల చెప్పినను కరుగని సత్య, చివర కాతడు "నా జనని సాక్షి దెచ్చి యిత్తు' నని శపథము చేసిన తరువాతనే, అతనిని నమ్మినది. గడుసు వలె కన్పించు ప్రబంధ సత్య, పతి ముందు పసిపాపవలె ధీరత గోల్పోయి యేడ్చినది.అమాయికముగా కన్పించు ఈ యక్షగాన సత్య, పతి యెన్ని మారులు మ్రొక్కినను పంతము వీడక, స్థిరముగా నిల్చి, "వారిజాక్షి రుక్మిణి కిచ్చిన, యా పారిజాత విరిదెచ్చి యిమ్ము" (పైది పు. 22) అని సూటిగానే కోరినది. సవతి కిచ్చిన పుష్పమే కావలయునని పంతము పట్టు ఈ యక్షగాన సత్య సంకుచిత స్వభావము మాత్రము అంత మెచ్చతగినదిగా లేదు.

పారిజాత వృక్షమునే తెచ్చి యిచ్చెదనని యొప్పించగానే 'ఇది యాది మరువకుమి' (పైది. పు. 22) అని మరియొక మారు హెచ్చరించినది. పారిజాతమును పెరటి చెట్టుగా చేతునని వాగ్దానము చేయగా "ఇప్పుడుకదా నా మనస్సు సంతసించినది" (పు. 23) అని ముదమందినది. సత్య పట్టుదల లోక విదితము. జరిగిన విషయమును కృష్ణుని వలన

వినిన గరుత్మంతుడు కూడ "చిన్నమ్మ పట్టును చెప్పనలవి గాదు" (పైది పు. 25) అని అనును. కృష్ణుడును "పక్షి రాజా! తాపట్టు బట్టి నన్ను బాధింప జొచ్చె" నని (పు. 24) కొంత విసుగును చూపును. ప్రబంధ సత్య మనోరథ సిద్ధికై హరి సంతోషాతిశయముతో పూనుకొనగా, యక్షగాన సత్యకై హరి తప్పని సరియై పోవలసి వచ్చినది. ఆ సత్యకున్న రాజసము, వశీకరణ శక్తి ఈ యక్షగాన సత్యలో కొరవడినవి. పారిజాతాపహరణ సమయమున, దిక్పాలకులు యుద్ధమునకు వచ్చుట చూచి బెదిరిపోయి "అక్కటకట! మనకిదేమి యాపద ఘటియించె నేడు! యెక్కడి యీపారిజాత మేలగోరి యుంటినొకొ" (పైది పు. 39) అని బేలయై పదరినది. పతి దైవమను మాట కూడ గుర్తులే దామెకు. ఈ యక్షగాన సత్యలోను, మనము సమగ్ర మానినీత్వమును దర్శింపలేము. గ్రామ్య జనాకర్షముగ నీ యక్షగానములు వ్రాయబడి యుండుటవలననే ఇట్టిది సంభవించినట్లుగ తలంపవలయును.

## నాటక, హరికథలలో :

బసవరాజు సీతాపతిరావుగారి సాత్రాజితీ పరిణయమును, బలిజేపల్లి వారి సాత్రాజితీయమును సత్యా కృష్ణుల ప్రణయ, పరిణయ వృత్తాంతములను ప్రధానాంశముగ కలవి. కృష్ణునినే పతిగా వలచిన సత్యభామతో, సత్యను కోరు శతధన్వుడు, కృష్ణుడు గోపాలకుడని పరిహసించుచు

*"అభిమానరాశివై యవతరించిన నీవు*
*గోపాలసుతు నెట్లు గొలువఁగలవు?" (సాత్రాజితీ పరిణయము - పు. 18)* అని సత్య అభిమాన గుణమును గుర్తు చేయును. కాని కృష్ణుడు భగవంతునిగ గుర్తించిన సత్య, తన నిశ్చయము మారదని అతనికి దృఢముగా చెప్పును. "వలచి కృష్ణుండు తనకేలు పట్టకున్న, బ్రతుక" నని (పైది. 47) ప్రతిన చేసి పంతమును సాధించుకొనును.

"సాత్రాజితీయ నాటకము" నందు వలచిన ప్రియుడు నెల గడువిచ్చియు శమంతకముతో, తిరిగి రాకపోవుట వలన, ఆందోళనము చెందిన సత్య, చెలి ఆలోచనానుసారమతనికి ఒక ప్రణయ సందేశమంపినది. కాని,

*"వలపు గలిగిన నతఁడె రావలయుఁగాక*
*పిలువఁబంచినఁ జులకన సలుపఁడొక్కొ" ...(సాత్రా-నాట-పు. 66)* అని ఆ తరువాత అభిమాన పడినది. శతధన్వుని మిత్రుడైన శంబరాసురుడు, దుర్గాదేవి విగ్రహము చాటునుండి, దుర్గాదేవికి వలె, సత్య శతధన్వుని, చేపట్టక తప్పదని హెచ్చరింపగా, అవి, దేవి పలుకులని భ్రమపడి, పూలతీగెలతో ఆత్మహత్యకు కూడ ప్రయత్నించినది. (పైది. పు. 69). వలచిన వానిని తప్ప మరియొకని చేపట్టలేని అభిమాన మామెది.

దీపావళి నాటకమున సత్య మానినీత్వ ప్రకటన మద్వితీయముగ చిత్రింప బడినది. గొప్ప సౌందర్య వతినని, ఐశ్వర్యవంతురాలనని విశ్వసించు సత్య, కృష్ణుడు గోప కాంతలతో కూడి వచ్చినాడని యెరిగినంతట, మానహాని జరిగినదని తలచి ,

*"అందము లేనిదానన? వయస్యలతో సరితూగలేన? ఆ*
*నంద విలాస విభ్రమ ఘనమ్ములు లేవనియా? మరెందు కీ*
*చందమును క్షణక్షణము చంపక చంపెద వొక్కమారె నీ*
*డెంద మనంత తృప్తి ప్రకటింప ననున్ వధియింప రాదొకో" ..(దీపా-నాట-పు-51)*

అని కుమిలినది. చంపుమని అడుగుటలో దైన్యముగాక ఆత్మాభిమానమే మెండుగా నున్నది. శ్రీకృష్ణుడు ఆమె మానవతి యనెడు విషయమును గ్రహించిన వాడగుటచే, సాంత్వనము కల్గించుచు "సాత్రాజితి అభిమానవతి యని నాకు తెలియదా? హాస్యమునకైన నీ ఆజ్ఞను

మీరగలనా?" అని ఆమె మానినీత్వమును మరింత పెంచును. నరకుడు మానినుల మానమునకు భంగము కల్గించినాడని వినిన సత్య 'అవమానము కన్న మరణమే మేలు' (పు. 60) అని అనును. తనవలెనె అందరును మానమును ప్రాణము కన్న నధికముగ భావింపవలయునని సత్య తలంచును. యుద్ధము చేయు నరకుడు, సత్యను చూచి, "మగువకు మాంగల్యము కన్నను, మిన్నలేదు. నన్నర్థించి యాచింపుము, నీ పతికి ప్రాణ భిక్ష పెట్టెదను" అని అనగా, ఆమె సహింపలేక "తుచ్ఛుడా! నీకై నీవే రక్షణ లేని వ్యర్థుడవు, నీవా! నా పతికి ప్రాణ భిక్ష బెట్టుట? నా పతి సమస్తాఖిలాండ బ్రహ్మాండాధిపతి. ఇక, నీ దురహంకృతికి దుర్గతే సద్గతి" - అని ఆవేశముతో సమాధాన మిచ్చినది. (పు. 73). నరకు డద్దానిని అహంకారమని ఎగతాళి చేసినను, ఆ మాటలు సత్య మానినీత్వమునే తెలుపును.

కొన్ని నాటకములందు, యక్షగానములకు వలెనె సత్య అభిమానము దురభిమానముగ మానినీత్వము హద్దులు దాటి ఇతరులను తీవ్రముగ నొప్పించునట్టిదగను, చిత్రింపబడినది. పానుగంటివారి రాధాకృష్ణ నాటకము నందును, ముత్తరాజు సుబ్బారావుగారి శ్రీకృష్ణ తులాభార నాటకమునను ఇట్టి సత్య కనిపించును.

చిలకమర్తివారి 'పారిజాతాపహరణము' నందు సత్య 'అభిమానధామ'గ వర్ణింపబడినది. (పైది. 21). సత్య మహా గర్వితయనియు, రుక్మిణికివలె సౌజన్యము, గురుపూజ, పతి భక్తి, బంధు ప్రేమ, దైవ భక్తి, కృతజ్ఞత, యౌదార్యము, మొదలగు సద్గుణములు ఇతర సపత్నులకు ముఖ్యముగ సత్యకు, వేయేండ్లు తలక్రిందులుగ దపమొనర్చిన నలవడదను, నారదుని విమర్శనను వినిన సత్య, "మానము కంటె బ్రాణ మెక్కుడుది కాకున్నను. నీ ప్రాణములు పోవుట లేద"ని పరితపించుచు (పైది. పు. 23) మాధవీ లతతో ప్రాణములు తీసికొనదలచును. చెలులు వారింపగా "ప్రాణనాథుని వలన పరిభవము నొందిన కాంత, పరిజనమునకును బరిహాస పాత్రమైయుండుఁగదా"? (పు.26) అనియు బాధపడును. సాంత్వనపరచు పతితో "నన్నా కలహాశనుండు నిందించుటకు మీరు తిట్టించుటకు నామె యాకర్ణించుటకు నేను మీదాసి యనుకొంటిరా? రుక్మిణికి సేవకురాలనుకొంటిరా? నాథుని పరిచారిక ననుకొంటిరా? ఏలిన నేలవలె, లేనిచో నూరకుండవలె" (పు. 31) అని మండిపడును. ప్రాణనాథుని లాలింపులను కూడ లెక్కచేయక "దైవానుగ్రహమున నీ యాదవవంశ సంభూతులగు రాజులకు రాజ్య ప్రాప్తి, శాపముల వలన లేకపోయెను గాని, కర్మము చాలక సామ్రాజ్యమున్నచో నీ నారీమండల సంబంధముచే వ్యవహార మొనర్చుట కయినఁదీటిక లేకపోవును. రాజ్య ప్రాప్తి లేకుండుటయె మీకు మేలయ్యెను" (పైది. పు. 32) అని ఎగతాళి చేయును. దాసుని తప్పు దండంబుతో చెల్లునని అతడామె పాదములకు నమస్కరింపగా, "ధూర్తా! అతి వినయము చాలును" 'అని వామపాదముతో 'తొలఁగ ద్రోచు'ను (పు. 33). కాని చివరకు తాను చేసిన అకార్యమునకు పశ్చాత్తాపపడి ప్రాణ త్యాగమునకు కూడ సంసిద్ధు రాలగును (పు. 34). పారిజాతము నపహరించిన, ఇంద్రుడు బంధింపగలడని సత్యను శౌరి పరిహాసముగా ఆట పట్టించుచుండ "మీ పరిహాస వచనముల నడచి నాకు దలఁచిన మహాపరిభవ సముద్రము నుండి దాటించి రుక్మిణితో సమానగఁ జేయుడు" (పు. 71) అని అర్థించును. ఈ అర్థింపునందును సత్య అభిమానాతిశయమే నిగూఢమై యున్నది.

పారిజాతాపహరణ వృత్తాంతమే ప్రధానముగ గల మల్లాది అచ్యుత రాముడు రచించిన "సత్యామోద చంద్రోదయ నాటకము", సత్యను స్వార్థపరురాలిగ, మాయావిగ, గయ్యాళిగ చిత్రించినది. కృష్ణుడు పారిజాతాపహరణము చేయుట తనకు సాధ్యము కాదని అనగా, అతనిని సత్య "తోయును" (పు. 52). తానే శచిని అడిగి పారిజాతమును తేవలయునని

సత్య స్వర్గమునకేగును. కుసుమంబు ధరించు పాటి యధికారము లేదను శచి మాటలకు అవమానితయై "పారిజాతము లేకున్న విచారము లేదు గాని, దీనికి పరాభవ మొనరించిన నా దుఃఖమడుగంటును". అని ప్రతీకారమునకు పూనుకొనినది (పు. 62). అంతేకాదు. పతిని, ముందు పాదతాడనముచేసి, తదుపరి ఆందోళన పడినది. కాని ఈ అభిమానము శాశ్వతముగ నిలువ లేదు. పారిజాతమును సాధించి తీరవలయునను పట్టుదలతో, మాయా ముని వేషమును ధరించి, కృష్ణుని మభ్యపెట్టి, పారిజాతము నాతడు సాధించునట్లు వాగ్దానము చేయించుకొనినది. ఈ నాటకము నందలి సత్య, మొదట అభిమానధనురాలి వలె కనిపించినను, శచిని పారిజాతమునకై తనంతట తాను యాచించు మానరహితగ గోచరించుచున్నది. సత్యవంటి మానినీలలామ ఇతరులను, అదియు ఒక కాంతను, అభీష్ట వస్తు సిద్ధికై యాచింపలేదు. పాదతాడనము చేయుట, పతిని తోయుట మున్నగు ఘట్టములలో సత్య, మానినిగా గాక, గయ్యాళిగాను, మాయా సన్యాసి వేషము ధరించుటలో పంతమును సాధించుకొనుటకై వేషములు వేయు మాయవిగాను కనిపించును. రాజసప్రవృత్తి కలదిగ, కవులచే చిత్రింపబడిన సత్య, ఏనాడును ఇట్టి ధూర్త కృత్యములకు తలపడదు.

"కృష్ణ తులాభార హరికథ" యందు, పతి రుక్మిణి పుట్టినదినపు విందున కేగినందులకు

*"సవతులను జూచి స్వాంతమందు మెచ్చి*
*సాటి సవతులలోన చిన్న బుచ్చె నకటా"* ...(పు. 16)

అని అభిమానవతియై బాధపడునట్లు చిత్రింపబడినది.

## జానపద సాహిత్యములో :

జానపద సాహిత్యమునందును సత్యభామ మానినిగానే చిత్రింపబడినది. ఆమె సవతులిండ్ల కెన్నడును పోదు.

*"సత్యభామ యుండునుగాని ఎన్నడూ తమయిండ్లుకు రాదు*
*చూడనైతే చిన్నది -- ఆ భామ పంతమే అటువంటిది...." (రుక్మిణీదేవి ముచ్చట్లు - పు.176)*

అని రుక్మిణి, సత్య అభిమాన గుణమును తలంచి కొంతనొచ్చుకొనును.

నారదుడిచ్చిన పారిజాత కుసుమమును శౌరి, రుక్మిణికి కానుక చేసినాడని తెలిసి, "నాకంటెక్కువ అని తలచెన రుక్మిణినిపుడు" (పారుజాత పల్లవి పు. 20) అని అభిమానాతిశయముతో కుమిలినది. పతి లాలింపులకు చలింపదు. కోప కారణము వివరింపదు. పారిజాత వృక్షమును తెచ్చి, నీ పూలవనములో నాటింతునని, పతి శపథము చేసిన తరువాతనే 'గ్రక్కునాలేచి', సంతసము చూపినది. సత్య పతి కొరకు ఎదురు చూచుచుండగా, అతడు అన్యకాంతా సంభోగ చిహ్నములో నచటికి రాగా, కోపము పొడమినది. అతని మాయ మాటలు నమ్మని సత్య, సవతుల కారణముగానే తనకింత కష్టము కల్గుచున్నదని

*".... ఎంత బలువాయెనో నాతండ్రి కపుడు*
*చిన్ననాడే విషము పోసి చంపడాయె, అంతకన్నా నూతపడ వెయ్యడాయె*
*యిందరూ సవతుల మీద తన్ను వెదకి తెచ్చి, నన్ను నీ మెడనుగట్టి హర్ష పడెను"*
*........(సత్యభామ సరసము - పు. 173)*

అని జీవితమును రోసినది. పారిజాతము తెచ్చి నీ పెరట వేసితినను పతితో, "పారుజాతము నాకు పనికి వచ్చిందా? అయిన పువ్వులు మీ సతికడకు వుంచి" అని అభిమానాతి శయముతో, అతని మోసమును విమర్శించినది. కాని చివరకు పతి బంగారు కోల నిచ్చి

కొట్టుమని అనగానే, పతివ్రత కావున, ఈ మానిని కోపమును మరచి, "ఎక్కువ తక్కువలు ఏమి ఆడితినో" అని పతి 'పాదములొత్తి' సేవలు చేసినది (పైది. పు. 175).

జానపద సత్య కోపము తీవ్రమైనది కాదు. అక్రూరుని ఇంటి విందున కని చెప్పి రుక్మిణీదేవి సీమంతమునకు కృష్ణుడేగి మొనగించినాడని కోపము చెందినది. ఆ ఉత్సవమునకు సత్య రానందులకు బాధపడిన రుక్మిణి, ఆమెను, సాంత్వన పరుపమని, కృష్ణుని చేతికి 'పచ్చల పతక' మిచ్చును. కాని కృష్ణుడు

*"పాషాణము ఆసత్యభామామణి కోపమూ"*

*భామకు అలకలు దీర్చా అది నా తరమూ గాదు" (రుక్మిణీ దేవి సీమంతము పు. 164)*

అని భయపడును. పతి బొంకించి వెళ్ళినందులకు ముందు సత్య కోపము ప్రదర్శించినను, అతడిచ్చిన పచ్చల పతకమును చూడగానే అంతయు మరచును.

ప్రబంధ యక్షగాన సత్య కన్నను, జానపద సత్య చిత్తము మిగుల ఆర్ద్రమైనది, సున్నితమైనది. పతి చేయు చిన్న లాలింపునకును అతడిచ్చు కనువిందైన కానుకకును ఆమె మనసు తొందరగా కరిగిపోవును, పట్టుదల సడలిపోవును.

## రాజసము :

సత్యభామలో మానినీత్వము అంతగా శోభించుటకు ఆమెలోని రాజసమొక కారణము. రాజసమనగా గర్వముతో కూడిన ఒక విధమైన ఠీవి. రాజసము స్వాభావికమై యున్నప్పుడే అది రాణింపగలదు. ఎదుటివారిని తన ముందు వినయమూర్తులుగ చేయింప గలిగినట్టిదీ రాజసము. కొందరు వ్యక్తులు ఉన్నత కులజులైనను, ఉన్నతి స్థితియందున్నను, ధన సంపన్నులైనను, ఎదుటి వారి గౌరవమును పొందలేరు. అందులకు కారణము వారిలో గాంభీర్యము కొరవడుటయే. రాజసము వలన వ్యక్తికి, ఒక విధమైన గాంభీర్యము సంక్రమించును. దానివలన ఎదుటివారు తనను గౌరవించునట్లుగా, తన ఆజ్ఞాబద్ధులగునట్లుగా చేసికొనగలుగును. రాజసము కల వ్యక్తి ఇతరుల నాజ్ఞాపించునట్లు నడచుకొనునే కాని, అర్థింపలేడు.

శ్రీకృష్ణుని కాంతలలో నెవరి యందు నంతగా గోచరింపనిది, సత్యభామలో మాత్రము కొట్టవచ్చినట్లుగా కనిపించునది ఈ రాజసమే. సత్య మాటలలో, నడకలో, చేతలలో అన్నిట రాజసమే రాజ్యము చేయును. సత్యలోని రాజసమే, ఆమెను ఇతర కాంతల నుండి వేరుచేసి, వారినందరిని మించిన వనితగా, విశిష్ట వ్యక్తిగా నిరూపించినది. అంతేకాదు. కృష్ణుని సత్యాపతిగా, సత్యభామా విధేయునిగా లోకము గుర్తించునట్లును చేసినది.

వెన్నెలకంటి సూరన విష్ణు పురాణమున, సత్యభామ నందనవనములోని పారిజాతమును చూచినపుడు, దానిని ద్వారకకు కొనిపోయి, గృహాంగణములోని ఉపవనములో నుంచిన, 'నీ కారుణ్యమునంజేసి', ఆ పుష్పములు రుక్మిణ్యాది కాంతలకు పంపి వారి ముందు నా ఆధిక్య ప్రదర్శన కావించి, వారిని సిగ్గిల చేయుదునని కృష్ణునితో అనును (8-125). ఇచట నీ కారుణ్యమని అనినను ఆ మాటలలో అర్థింపులేదు. ఆజ్ఞ ఉన్నది. ఒక ఠీవిని ప్రదర్శించుచు అనిన మాటలు అవి. అదియే రాజసము. కృష్ణుడును వెంటనే ఆజ్ఞాబద్ధడగుటను కవి "అనవుడున్" (పైది. 126) అనెడు మాటచే సూచించినాడు.

"పారిజాతాపహరణ ప్రబంధము"న ఖండిత యగు సత్యభామ, పతిని నిందించు నపుడు, కోపావేశము నందు సహితము, రాజసమును వీడక 'మాచవిగాని మాటలన్వినవల సెంగదా' (1-128) అనియు, "మమ్ము దలంపగనేల"? (పైది 1-84) అనియు, ఆత్మాతిశయముతో తనకు తాను బహు వచన ప్రయోగము చేసికొనినది. ఆ ఖండిత

కోపావేశముచే జగన్నాయకుని పాదతాడనము చేసినది. పశ్చాత్తాప పడలేదు. నిందించినది. కాని అతనిని అనునయింపలేదు. క్షమాపణమునైన నడుగలేదు. ఇదియే మరియొక వనితయై యుండిన, తన ప్రవర్తన కెంతయో పశ్చాత్తాపమును ప్రకటించి యుండెడిది. ఈ సందర్భ మునందే విశ్వనాథవారు 'ఆ సత్యభామ తీవి, యభిమానము, ఆమె గర్వము విలక్షణమైనవి.' అని వర్ణించినారు.[1] అట్టి ఆ మానిని యొక్క రాజసమునకు ఆకర్షితుడైనవాడై శ్రీకృష్ణుడు, పారిజాత పుష్పమునకు బదులు చెట్టునే తెచ్చి యీగలనని ప్రతిన చేసినాడు. "సత్య అభిమానము రాజసముతో కూడుకొనినది" అని శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారును పేర్కొనినారు.[2]

పరిచారికలచే పనులు గొనుటయందును, సత్య రాజసము వెలార్చును. సాంత్వనా నంతరము మధ్యాహ్న సమయ కృత్యంబులప్పుడు చేయదలచిన పతి మనసెరిగి 'సత్య, "కనుసన్న"చే "ఉడిగంపు పద్మముఖుల"ను తత్కార్యములకై సిద్ధపరచినది (పారి.2-4).

విష్ణు మాయా నాటకమున, సురతరు లాభమునకును నిరతము విభుడు తనను పాయని సౌభాగ్యమునకును గర్వించిన సత్యామానిని, తన సౌభాగ్యమును చూచి రుక్మిణ్యాదుల మనోభావము లెట్లున్నవో, చూడదలచి పారిజాతవిరులను మణి పాత్రికల యందుంచి వారికినంపి, రుక్మిణి కడకు పంపు చెలితో మాత్రము ప్రత్యేకముగ

ఈ పువ్వులు గొని రుక్మిణికిచ్చి, ఆమె వ్యాపారములను, తలఁపును గని రా పొమ్మని 'రాజసమొప్పగ' "ఆనతిచ్చిన"ది (1-148). ఆ చెలియు "ప్రసూన దాన వ్యాజంబున రుక్మిణ్యా దులకు 'దన మహారాజసంబును' బ్రాణేశ్వరుతోడంగూడి యనుభవించు మదన సామ్రాజ్య వైభవంబును, హృదయ శల్యంబై యుండవలయునని కాదె నను బోంట్లం బంపుట (పైది. 1-151) అని, సత్య రాజస గర్వమును గ్రహించినది. అంతేకాదు, కృష్ణుడు రుక్మిణితో కలసియుండుటను చూచిన, సత్య చెలి, అది కృష్ణ మాయ అనుటను గ్రహింపలేక, సత్యతో

*సీ॥ "......... నీకంటె మిగుల*

*తే॥ రాజసంబున రతిరాజ రాజ్యకళయు*
*గలిగి విభునితోనున్న యాచెలువ చెలువు*
*మన్మథుని గూడి రతియున్న మహిమ దోచె*
*మగువ! యేమని నమ్మేది మాయకాని"* ...(విష్ణు. మా. నాట. ప్ర - 1-193)

అని ఆశ్చర్యపడుచు చెప్పినది. సత్యకున్న రాజసము అసమానమైనది. రుక్మిణి అంతకు మించిన రాజసముతో నుండుట చెలికి నమ్మలేని విషయమనిపించినది. అది అంతయు కృష్ణుని మోసముగ ఆ తరువాత, గుర్తించి, అతనిని తెగడినది.

తరిగొప్పుల మల్లన రచించిన 'చంద్రభాను చరిత్ర' యందు, సత్య మానినీత్వ రాజసములు అసాధారణ మనునట్లు చిత్రింపబడినది. ఇందును, శ్రీకృష్ణుని పట్టపుదేవు లెనమండ్రు వెలదులలో 'మెఱుఁగు దీవెలవంటి' 'రుక్మిణీ సత్యలకు' "మిక్కిలి చనవిచ్చి" సంతరించుటచే సవతులందరును అణకువతో ఇచ్చక మొనర్చుచుండిరి (1-84). పట్ట మహిషితో సమానముగ సత్యభామయు సవతుల నుండి గౌరమందుకొనుట వలన, ఆమె మానినీత్వము మరింత పెరిగి యుండును. అట్టి గౌరవము నందుకొనుటకు ఆమెలోని సౌందర్యాదులతో పాటు రాజసము నొక కారణమై యుండును. పట్టమహిషి సంతానవతి కాగా, తానును సంతానవతి కాగోరి, సత్య, పతిని అభ్యర్థింపదలచినది. కాని

1. *కావ్య పరిమళము -- పు. 73*
2. *విజయనగరాంధ్ర కవులు -- పు. 267*

"పిన పిన యపరంజి బిరుదుల యడపంబు
గట్టి బాండ్యు క్షమాకాంత తనయ
కళగల పచ్చకంకణముల కాళాంజి,
దాల్పఁగోసల మహీధవ కుమారి
చకచక మించువజంపుటీ నెలకుంచె
వీవఁ గర్ణాట భూవిభు తనూజ
తళతళ వెలుఁగు రేవెలుఁగు ఆనునుగిండి,
పూన మాళవధరాజానిపుత్రి
యఖిల వైభవముల మించి నట్టి నాకు
వాంఛిత మొకండు లేదైన వలయు ఁదెలుప" .....(చంద్ర-చ-1-93)

అని "తెప్పతుదల" నును సిగ్గు 'దొలంక' పతిని 'కనుంగొని' నదేకాని, అది యేమియో చెప్పలేదు. తనకు కావలసినది సంతానభిక్ష. . మానిని కావున, నోరు తెరచి అడుగలేక పోయినది. కాని ఇచట తన వైభవ వర్ణన కవసరమేమున్నది? ఇందరు రాజకాంతలు తనను గొల్చు చుందురనియు, తన కంతటి రాజసమున్నదనియు పతికి సూచించుటయే కదా! ఈ రాజసము, ఆమె మానినీత్వమునకు మరింత మెరుగుపెట్టినది. కావుననే ఆమె నోరు తెరచి యడుగక పోయినను, పతి ఆమె కోరికను సిద్ధింప చేసినాడు.

'సత్యభామా సాంత్వనము' నందు, సత్య తన పతిని శృంగార క్రీడకు నాహ్వానించిన విధము నందును రాజసమును కనబరచినది. వసంతోత్సవము ముగిసిన పిదప కృష్ణుడు "సత్యభామ సరసత నవరస యని హెచ్చరించిన లీలఁజేలాగియ్యి" (పు. 63) ఆమెతో నడచినాడు. అంతఃపురమున 'నెఱమోహపు రాజసపుం దరితీపు తోడ, హరి చెంత వసించి' రతికళా ప్రావీణ్యముచే పతిని 'తనియించి' నది (పు. 85). నరకాసుర వధార్థమేగు పతితో, తాను నేగవలయునని ఆశించినను, అట్లనుటకు ఆత్మాభిమానము అడ్డురాగా "నీవు నరకాసుర విజయంబు సేయుట, యీదేవీ సమాజంబునకు నే దెలుపఁ దగినది కావున భూమివారు చూడ స్వామివారి తోడనే నన్నుం దోకొని విజయంబు సేయ వలయునని యెచ్చరించిన"ది (పు. 69). సత్య మాటలలో హెచ్చరికయే యున్నది కాని, అర్థింపు లేదు. వల్లభుని "కను సైగల వలపించు" నంతటి (పు. 96) రాజసమామెది. కృష్ణుడు నరకుని చెరలోని పదియారువేల వనితలను చేపట్టి వారితో భోగించుచున్నాడను విషయము వినిన రుక్మిణికి 'కొఱ కొఱ' మించెను. లక్షణ యెంతయేని 'ఘూర్ణిల్లిన'ది. 'చురుక్కు' మనినది భద్ర. జాంబవతి 'కుందిన'ది. కళిందజ చాల 'కంది' నది. 'వేసరు కొనినది' మిత్రవింద సుదంత 'నగినది'. కాని, సత్య మాత్రము "తా సరసు రాలగుటన్ మది కిన్క మాటుచు" పెద్దరికముతో వారల నూరడించి, "యదు వల్లభుని వినుతించి, ముందుగా ఎవరికిని తన మనసు తెలియనీక, కయ్యపు సుద్దులు సారెకు నుగ్గడించి" తన యింటికి వచ్చినది. ఇతర కాంతలసూయ చెందగా, వారిని పెద్దరికముతో నూరడించి తన కోపమును ఈర్ష్యను గుప్తపరచుకొని తన కడకు పతి రాగా, అపుడు అతని ముందు ప్రదర్శించినది. ఇదియే సత్యలోని విలక్షణత. వారివలె ప్రవర్తించిన, తన ప్రత్యేకత లేదు. పైగా పతిపై కోపింపగల హక్కు, తనకు మాత్రమే ఉన్నది. ఇట్టిది సత్యలోని రాజసము.

'రాజ గోపాలవిలాస' ప్రబంధమున, సత్యభామ కొలువు చేసిన విధములో ఆ రాజసమెంతగా ప్రకాశించినదో చూడుడు.

*"బటువు గుబ్బల మీఁది పయ్యంటలరజార*
*రమణులు మణి చామరములు వీవ*
*తారహారంబుల్ పేరముల్ వారంగ*
*వనితలు వలిపె పావడలు వైవ*
*చెక్కుల గమ్మడాల్ చిందులు ద్రొక్కంగ*
*పంకజాక్షులు బరాబరులు సేయ*
*పాణిపద్మప్రభల్ పల్లటీల్ గొన చెంత*
*హరిణనేత్రలు కొనియాడుచుండ*
*రాజసంబున పూర్ణిమారాజవదన*
*సత్య గొలువుండ నపుడు నాసత్యమూర్తి*
*వినయ మీరీతి మూర్తీభవించె ననఁగ*
*వెన్నుఁడరుదెంచె దూతికవెంట నెలఁమి* ....*(రాజ. గో. వి. - 4-27)*

ఆమెలోని రాజసమే శ్రీకృష్ణుడంతటి వీరుని, "వినయము ఇట్లు మూర్తీభవించినదా" యనునంతటి విధేయునిగ చేసినది. పతిని రతికేళికి గొంపోవుటలోను, ఆమె రాజసమును వీడలేదు.

*"చూచి యెదురుగ వచ్చి యాశోభనాంగి*
*రమణు కైదండ గైకొని రాజసమున*
*మెల్లమెల్లన కెంపు రామేడ పొంత*
*వింతయైనట్టి వేదిక చెంత కరిగి"* ......*(పైది. 4-30)*

"నవకంబగు పువ్వు బాన్పు"న కూర్చుండ చేసినది. కృష్ణుడును "భవదాయత్తచిత్తంబు నేవేళల్ గాచుక సేవసేయుటకునై వేమారు నేఁగోరుదన్" (రాజ గో.వి 4.38) అని, సేవలు చేయుటకు ఉత్సుకతను చూపును. కృష్ణుని, "సత్యావిధేయుడు, దాసుడ"నునట్లు చేసినదియు ఆమెలోని రాజసమే! ఆ రాజసము తెచ్చిపెట్టుకొన్నదికాదు. సహజముగ ఆమెలో జీర్ణించుకొనినది.

భామాకలాపములో "భామనే సత్యభామనే, ఒయ్యారి సత్యభామనే' (పు. 13) అని ప్రవేశించు నపుడును, మగని పేరు చెప్పుమని అడుగు మాధవితో

*"ఇంతటి మగవారిలో యీతోటి యాడువారిలో సత్యభామా*
*మగని పేరు చెప్పినదన్న సిగ్గుగాదటే ఓయమ్మా"* ......*(భామా-పు. 18)* అని

సమాధానమిచ్చుటలోను, సత్యభామలోని రాజసము తొంగి చూచును.

యక్షగానాదులు జానపదుల మనోరంజకముగ వ్రాయబడుటచే అందలి సత్యలో రాజసము ఇంతగా కనిపింపదు. కాని అంత మాత్రమున రాజసము పూర్తిగ లేకుండ పోలేదు. సతీపతి దానవిలాస యక్షగానములో, నారదునితో, 'దానమునకు' "సుముహూర్త మాలోచించుకొని రమ్మ" నినపుడును (పు.9), "దానము తీసికొనుటకు బ్రాహ్మణులను బిలుచుకొని రారా" అని (పైది. 10) కటికవానిని అజ్ఞాపించు నపుడును, "ఊరక దానం తీసుకొనరోయి" (పైది.11) అని నారదుని హెచ్చరించు నపుడును సత్య రాజసమును ప్రకటించును.

అట్లే 'తులసీదళమ'ను పాటయందును "పతిని దానమిచ్చు" వ్రతమును చేయదలచి,

*"వ్రతము సేయదలచినా నొక్క రీతిని*
*నానాథు కృష్ణమూర్తి యెచ్చటనున్న గాని మీరు*
*యిచట దెచ్చి నిల్పరమ్మ వేడ్కమీరగా"* ....*(పు. 193)*

అని చెలులను ఆదేశించుటలోను "రాజసమును' ప్రదర్శించినది.

ఇట్లు ఆంధ్ర సాహిత్యమునందు సత్యా పాత్ర చిత్రణము చేసిన కవులందరును, సత్య రాజసము కలదిగానే వర్ణించుటచే రాజస మీమెకు స్వాభావికమైనదని నిశ్చయముగ చెప్పవచ్చును.

## వీరము :

సత్యభామ అనగానే వీరత్వము మూర్తీభవించిన వనిత మన కనుల ముందు సాక్షాత్కరించును. సత్యభామ పాత్ర సృజనమునకు సంస్కృత కవులే ఆద్యులైనను, వీరవనితగ సత్యభామ జననమునకు మాత్రము తెలుగుకవులే బాధ్యులు. శ్రీకృష్ణ పత్నులలో సత్యభామ తప్ప మరియొక కాంత వీరవనితగ నిరూపితము కాలేదు.

సంస్కృత హరివంశము[1], విష్ణుపురాణ[2], భాగవత[3], పద్మపురాణములు[4], కృష్ణుడు నరకాసుర వధార్థమేగుచు సత్యభామను వెంట తోడ్కొని పోయెనని మాత్రమే చెప్పినవి. గిరి శస్త్ర, సలిల, దహన, పవన దుర్గమంబైనదియు, మురాసురుని పాశములచే పరివృతం బైనదియునగు ప్రాగ్జ్యోతిష పురమునకు, అందును భీకర రణరంగమునకు, కృష్ణుని వెంటపోయిన సత్య, అచట నేమి చేసినదో మాత్రము వారు పేర్కొనలేదు. భూదేవి యంశలో జన్మించిన సత్యభామ యనుమతితోనే, నరకుడు వధింపబడవలయును కావున, ఆమెను కృష్ణుడు తోడ్కొనిపోయెనని పై సంస్కృత పురాణేతిహాసముల వ్యాఖ్యాతలు సమర్థించినారు.[5] అయినప్పటికిని ఆమె యుద్ధ పాండిత్య ప్రకర్ష చూపనపుడు, అట్లామెను భీకర సమరాంగణమునకు వెంట బెట్టుకొని పోవుట, తెలుగు కవులకు అర్థరహిత మనిపించినది, కాబోలు! కావుననే తెలుగు కవుల చిత్రణలో, సత్యభామ వీరపత్నిగా మాత్రమే గాక, వీరావేశముతో శాత్రవ నిర్మూలనమునకు పూనుకొను ధీరచిత్తగ, సాహసోపేతగ, యుద్ధకళా చతురగ మహావీరవనితగ రూపు దాల్చినది.

ఎఱ్ఱన పోషణలో, సత్యభామ యుద్ధమున విజృంభించి నరకుని అదలించి, బెదిరించినది. నాచనసోముని చేతిలో పెరిగిన సత్య నరకదైత్యుని స్వాభిమానముతో నెదిరించి వీరావేశముతో, శత్రువును నిర్జించి, "మొక్కలంపు గెలుపు" గైకొనినది. పోతన పెంపకమున ఈ వీర శృంగార రసాధి దేవత, పతి ముందు ముద్దు ముద్దుగ గారాములు పోయి, పంతము నెగ్గించుకొను నైపుణ్యమును కూడ నేర్చుకొని, శృంగార వీరముల ప్రగల్భతతో ప్రజ్వరిల్లినది. తెలుగువారికి వీరవనితగానే సత్యభామ మొదట చేరువైనది. ఆ తరువాత వచ్చిన ప్రబంధ, యక్షగాన, నాటకాది కవులును ఈ వీరవనిత యుద్ధ సాహసములకు మెచ్చి, తమ తమ రచనలయందామెను బహువిధముల నాదరించినారు.

పురాణేతిహాసములందు చిత్రితమైన సత్యభామను పరిశీలించిన, ఆమె స్వాభావికముగ వీరగుణము కలదిగ తోచును. చిన్నతనముననే యుద్ధవిద్యలన్నింటిని నేర్చి యుండును. కావున తన యుద్ధ పాండితిని ప్రదర్శింప దలచి ఆమె 'సమరంబె' కోరుచుండినది. సత్య తన సమర పాండిత్యము నంతకు మున్నెన్నడును ప్రదర్శించినట్లు లేదు. కృష్ణుడును దానిని చూడదలచి యుండును. ఆమెలోని సమరోత్సాహమును గ్రహించియే, కృష్ణుడు నరకాసుర వధార్థమేగుచు ఆమెను వెంట నిడుకొనిపోయియుండును.

---

*1. సం. హరి. వి. ప - 63 - 39*

*2. సం. వి. పు -- 5.28.14*

*3. సం. భాగ -- 10-59-3*

*4. సం. పద్మ. పు -- ఉ. ఖం - ఉత్త - 249 - 51*

*5. చూడు -- 'దివ్యాంశ సంభూత' అను శీర్షిక*

"సత్యభామను రావించి తత్సహితుండై" యేగెనని ఎఱ్ఱన హరివంశమును (ఉ. భాగ - 4 - 125), "సత్యభామతో నా విహగేంద్రు నెక్కి" పోయెనని ఉత్తర హరివంశమును (1-138) వర్ణించుచుండగ, 'భాగవతము' నందలి సత్యభామ మాత్రము "దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ ప్రావీణ్యంబులు చూడగోరుదు గదా...." (10-ఉ-భా 59-151) అని, ఒక నెపమును చూపి, అతనిని సమ్మతింపచేసి, యుద్ధమునకు బయలుదేరినట్లు వర్ణించినది. కాని మడికి సింగన 'పద్మపురాణము' నందలి సత్యభామ మాత్రము పతి అనుజ్ఞకై ఎదురు చూడలేదు.

*"కని దివ్యాంబర ధరుఁడై*
*యనుపమముగ సత్యభామ యతికుతుకముతో*
*దనతోడఁగదలఁ గృష్ణుఁడు*
*వినతాసుతు నెక్కి వెడలె వినువీధి దెసన్"* ....(సిం. పద్మ. పు - 10 - 86)

అని, పతి వెంట సత్య తనంతట తానే బయలుదేరినట్లు సూచించినది. హరివంశ, ఉత్తర హరివంశ, భాగవతాదులలోని సత్యవలె, ఈ పద్మపురాణ సత్య, యుద్ధము చేయక పోయినను, కుతూహలముతో కదన రంగమునకు కదలి వచ్చిన ఆమె ఈ ప్రయత్నమే, ఆమెలోని వీరావేశమును సూచించుచున్నది.

అదేవిధముగ, 'వెన్నెలకంటి సూరన విష్ణుపురాణము' "శత్రు భంజన వినిశ్చయ బుద్ధి మనంబు లోపలన దలకొన సత్యభామయు దాను దశాధిపునెక్కె" ననియు (8-88), బ్రహ్మపురాణము "తన కీర్తిని బెంచెడు సత్యభామతో" హరి విహగేంద్రు మూపున నెక్కెననియు (4-93-14), చెప్పినవే కాని, సత్యభామ యుద్ధము చేసినట్లు వర్ణింపలేదు. అట్లు చెప్పబడక పోయినను, సత్య రణరంగమునకు తోడ్కొని పోవుటలో, ఆమె స్వాధీన భర్తృకత, నరకాసుర వధకై ఆమె అనుమతి బడయుట మున్నగు ఈ కారణములేగాక, సత్యభామ వీరోత్సాహము కూడ ఒక కారణమై యుండవచ్చును. పై ఘట్టమునందలి ఎఱ్ఱన, నాచన సోమన, పోతనల సత్యా పాత్ర చిత్రీకరణము ఈ అభిప్రాయమునే కల్గించుచున్నది. సత్యభామలో సహజముగ నున్న వీరావేశము నివురు గప్పిన నిప్పువలె నరకాసుర వధా ఘట్టము వరకు ప్రకాశమానము కాలేదు. వీరాగ్రేసురుడైన పతి సాన్నిధ్యమున సాన్నిహిత్యమున, అది బయటపడి, జ్వలించినది.

.మొదట ఎఱ్ఱన చిత్రీకరణలోని సత్యభామ సమరోత్సాహమును దర్శింతము. కృష్ణుడు నరకునితో యుద్ధము చేయుచు అలసిపోయినాడు. సత్యభామ "సమంచితోత్సాహ సాహస విభాసిని" (హరి-ఉ-భా-4-161) యనుట గ్రహించిన వాడగుటచేతను, ఆమెను తోడ్కొని వచ్చినందులకు తగిన ప్రయోజనముండవలయునని భావించిన వాడగుటచేతను, ఆమె మనోభావములను గమనించుచు "మగువనెమ్మొగంబున జూడ్కి నిలిపి" "ఏను పరి పీడితుం డనై డస్సితి నొక్కింత నీవు కయ్యంపు మోపు మోవు"మని, ఆమె చేతికి శార్ఙ్గంబిచ్చి యంప పొదువు లనువుగా నమర్చి యిచ్చినాడు. సత్యయు వానిని అందుకొనగానే, అతని ఊహ తప్పని విధముగ అక్షణమే

*"వీరంబాఁడుఁ దనంబు నొందెననఁగా విక్రాంతి శాలిత్వల*
*క్ష్మీరేఖం బచరించె నాఁగ ధృతి యక్షీణాకృతిం జెందెనా"* .....(హరి. ఉభా.4-162)

అనునట్లు ప్రత్యర్థితో "ఉక్కున" 'మహారణక్రియకు" కడంగినది.

ఆమె విజృంభించిన విధము పరికించిన సత్యభామలో యుద్ధోత్సాహమెంతగా నిక్షిప్తమై యుండినదో, సమయ మాసన్నము కాగానే అది ఎంతగా ప్రజ్వరిల్లినదో మనము సులభముగ గ్రహింపగలము.

'ఉత్తర హరివంశ' సత్యభామకు, సమరోత్సాహముతోపాటు, ఆవేశము కూడ నధికమే. భర్త, తన నాదేశించుటకు ముందే, పతికి నపకారము చేయుచున్న శత్రువు యొక్క శిక్షకు, పూనుకొనినది. మురాసురుని వధానంతరము నిశుంభాసురుఁడు విజృంభించి, కృష్ణునిపై శరముల నేయుచు బాధింపగా, అంతకు మున్నే మురాసురుని గదాహతికి చాల నొచ్చియున్న కృష్ణుని నిస్సహాయస్థితిని చూడగానే, సత్యలోని "వీరవనిత' ఊరకుండ నుండలేక పోయినది. "ఆ దైత్యుడు" "రుధిర ధారలు రణాంగమున గ్రక్కునట్లు, 'అత్యంత రయంబున' "ఘన గదం గడు బెట్టుగ వైచి" శత్రువును శిక్షించినది. (ఉ.హరి. 1-141). నరకునితో యుద్ధము చేయుచుండిన కృష్ణుడు నడుమ, మూర్ఛితుడై, సత్య సేవలకు తిరిగి తేరుకొనినాడు. ఆమెలోని వీరావేశమును మున్నే గమనించి యున్నాడు కదా! అందుచేత, తాను మూర్ఛ నుండి తేరుకొనగానే, సత్యను చూచి

"చంద్రవదన! శార్ఙ్గమిందనీవు సమరంబె కోరుదు, నవసరంబువచ్చె" అనుచునీయగా, ఇంత కాలమునకు తన కోరిక నెరవేరు చున్నందులకు సత్య 'పొంగి' పోయినది.

*"....అచ్చెలువ యింపును దెంపును లోనమానమున్*
*మచ్చరముంబెనంగ మురమర్దనుపై నరకాసురేంద్రుపై*
*నచ్చపుఁజాయలం గువల యచ్ఛదగుచ్ఛ విషచ్ఛటావలిన్*
*మెచ్చని వానిఁగేల్కొలిపె మేలపు ఁజూపుల వాఁడితూపులన్" ....(ఉ. హరి-1-156)*

సత్యకు, తన ప్రక్కనున్న మనోహరుని చూడగానే ఇంపు కలిగినది. ఎదుటనున్న శత్రువును చూడగానే, జయించి తీరవలయుననెడు తెంపు కల్గినది. మానము మచ్చరము పెనగొనగ మురమర్ధనునిపై మేలపు జూపులను, నరకాసురునిపై విషతుల్యములైన బాణ పరంపరను కురియించి, మరింతగ, శత్రువును యుద్ధమునకు ప్రేరేపించినది. ఈ ఘట్టమున సాహిత్య రసపోషణ సంవిధానచక్రవర్తి యగు నాచన సోమన సత్యా సౌందర్యమును ధ్వనింప చేయుచునే, సత్య శృంగార వీరములను వర్ణించి, పోతనాది కవులకు మార్గదర్శకుడైనాడు.

హరివంశ సత్యవలెగాక, 'భాగవత సత్య' ఉద్వేగ భరితమైన తీవ్ర వీరావేశములు కలది. ఆమెలో సమరోత్సాహము ఉరకలు వేయుచుండినది. యుద్ధారంభమునకు ముందు, నరకుడు 'ఖగేంద్రస్కంధ పీఠంబుపై లలనారత్నముఁ గూడి సంగర కథాలాపంబులు" చేయుచుండిన కృష్ణుని చూచినాడు. ఇతర వనితలకు వలె, తదితర, విషయములందు గాక, సత్యకు యుద్ధ కథాలాపము లందే ఆసక్తి ఎక్కువ. రాక్షసులను కృష్ణు డుద్దీపించి చెండాడుటను చూచుట కొరకు మాత్రమే, తాను వచ్చుచున్నానని చెప్పి వెంట వచ్చినది. కాని నిజమునకు ఆ సౌజన్యవతి' "జన్యంబున దనుజుల దౌర్జన్యము లుడపంగ గోరి" (పైది. 171) వచ్చినది. కృష్ణునితో "కలహంబునకు నరకాసురుడు ప్రయత్నించుట చూడగానే, నిగూఢమైయున్న ఆమెలోని వీరత్వము, విజృంభింపగా, పతి యుద్దేశమేమో కూడ, తెలిసి కొనకుండ 'సంభ్రమమున' (పైది. 169)

*"వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ*
*శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీచీజాలముల్ పర్వఁగాఁ*
*బాణిం బయ్యెదఁ జక్కగాఁ దుఱిమి శుంభద్వీర సంరంభయై"*

*.....(భాగ. 10. ఉ. భా- 59-170)*

సత్య "తన ప్రాణేశాగ్ర భాగంబున" 'లేచి నిల్చినది. ఆమె యుద్ధావేశమునకు విస్మితుడైన హరి, దనుజులను తాను గెలువ గలననియు, నీవెందులకు లేచితి వనియు ప్రశ్నించుచు, ముందు ఆమె ప్రయత్నమును నివారింప బూనినాడు. కాని ఆమె విరమించు ప్రయత్నము

చేయలేదు. సత్య పట్టుదల నెరింగిన వాడగుటచే, చివరకాతడే "మానవేనిన్, లే మా విల్లందుకొనుము లీలంగేలన్" అనివిల్లు నిచ్చి ఉత్సాహపరచినాడు. ఆ విల్లందు కొనగానే సత్యభామ మహాప్రతాపమున, వీరలోక దుర్లోకయై ప్రకాశించినది.

అల్లాడు నరసింహకవి కృత 'నారదీయ పురాణము'నను, కృష్ణ నరకాసురు లిరువురు బోరుచుండగ సత్యభామ "యిప్పుడె నరకాసురుని ఖండించెద మదీయ యుద్ధ చాతుర్యంబు చూడు"మని పల్కి వీరశృంగార రసనిధియై కుచంబులపై జారు పయ్యెద కొంగు పదిలంబుగా సవరించి, కీలుగంటు బిగువుగా ముడిచి, కరంబున శరచాపవల్లి మెఱయ యుద్ధ సన్నాహంబుతో "తానయై" వీరావేశముతో యుద్ధమునకు పూనుకొనినట్లు చిత్రితము (1-309).

వీనినిబట్టి చూచిన పురాణేతిహాసములలో చిత్రితమైన సత్యభామయొక్క సమరోత్సాహ మెంతటిదో మన కవగతమగుచున్నది. యుద్ధ ప్రయత్నమే కాదు, యుద్ధమును కూడ ఆమె సమధిక తీవ్రావేశములతో చేయగలదనుట, ఈ క్రింది వర్ణనలు నిరూపింప గలవు.

'హరివంశము' నందు, సత్య భీకర రణరంగమును చూచి కలత పొందని ధీరచిత్తగా, అస్త్ర విద్యయందారితేరిన దిట్టగా, యుద్ధతంత్రముల నెరిగిన చతురగ కనిపించును. ఆమె యుద్ధ తీవ్రతను సహింపలేక ఆ దానవుడు,

*"తనపని మాని యింక వనితం బురికొల్పి రణంబొనర్పఁబం*
*చి నను జయింప నోపునె యిసీ యిది యేటిది......"* .....*(హరి - 4-164)*

అని అనుచు "అపహాస విస్మయ మద ప్రకటాననుడై"నాడు. తామసగుణ ప్రధానుడగు ఆ దానవుడు, కృష్ణుడు ఒక స్త్రీని యుద్ధమునకు పురికొల్పి నందులకు మదముతో అపహాసము ప్రకటించినను, సత్య పరాక్రమాతిశయము చూచి "విస్మయము" నకు కూడ లోనగుటను కవి, పై వర్ణన యందు సూచించినాడు. అరివీరునకు కూడ ఆశ్చర్యము గొలుపునంతటి వీరమును సత్య ప్రదర్శించినది.

నరకుడు బాణములను వేయగా ధీర గంభీర చిత్త గావున, సత్య ఇంచుకయు లెక్కసేయక 'యలుకతో అతని విల్లుం గేతువుఁ ద్రుంచి, రథ్యంబుల నుర్విం గూల్చి' "సూతున్ వెసం ద్రెళ్లం" జేసినది. ఆ రాక్షసుడు దీనతతో వేరొకవిల్లు తీసికొనగానే దేవీరత్నము' 'ఆ క్షణమే ఉగ్రోద్ధతిన్' "అవ్విల్లు న్నుగ్గుగ జేసె"ను. నరకునంతటి వీరునికే దీనత్వము కల్గించిన మహాయుద్ధ చతుర సత్య. అతడు మూడవ విల్లెత్తిన, దానిని కూడ భగ్నముచేసినది. అలుకతో వాడు నొక గదను కృష్ణునిపై వేయగా, సత్య చతురతతో దాని నడుమన, తిలప్రమాణ శకలంబులు గావించినది. నరకు డేసిన బాణములనే కాదు. "శక్తి పరిఘ" మున్నగు ఆయుధములను కూడ పొడిసేసి, వాడి బాణముల నతని "వెఱచఱువ నేసిన"ది (పైది. 168). నరకాసురునికి ఇట్లు భయము కల్గునట్లు వేయుట దిక్పాలకులకు సహితము సాధ్యము కాకపోయినది. ఇట్టి యీమె చతురతను చూచియే "ఖేచరులిఁ ప్రశంసించిరి" (4-168). పీతాంబరుడును ప్రీతుండై, 'మనంబున బ్రియంబులై సొంపారు ప్రేమంబున' సతికి ఉపచర్యలు చేసి, రుక్మిణి యంతటిది తొల్లి కోరియు పొందలేనట్టిదియు, కృష్ణునకు కౌస్తుభాభరణంబు కంటెను ప్రియమైనదియు, అఖిలలోకములందు వెలపెట్టరానిదియు, తన కాంతి నెల్లనాడు జగతి నాలోక చంద్రికగా చేయునదియు, శయన రతి కళా విహరణ సమయమున ప్రియంబుతో, సత్య తానర్థించియు పొందలేకపోయినదియు, అగు

నేవళంబొకదానిని సత్య మెడలోనిడి సన్మానించెను. అరుదైన కంఠహారముతో పాటు, అపురూపమైన భగవానుని ప్రసాదన దృష్టియు అందు కొనగల్గిన భాగ్యశాలి సత్య.

ఉత్తర హరివంశము నందలి సత్యయు, ఇదే ఘట్టమున, అసాధారణ ధనుష్పాండిత్యము ప్రదర్శించినట్లుగ చిత్రింపబడినది. ఆమె స్వాభావికముగ సుకుమారి యైనను, దుర్జనుని దౌర్జన్యము నడచువేళ, నిగూఢమై యున్న ఆమెలోని వీరావేశము, పెల్లు బుకినది. తంత్రీవినోదముల తడవు సైపని వ్రేళ్ళతో 'గొనయంబు తెగలపై గోరి కొనినది'. 'అద్దంబు పిడి పట్టుకొన' నలయు ఆమె పాణితలము, వింటి కొప్పు గట్టిగా బిగియించినది. చెలికత్తెను గట్టిగా పిలువలేని యెలుంగు, సింహనాదమున చెదరక నిల్చినది. ప్రమద నర్తన కేళి పరిఢవింపని పదం బైదు ఠాణంబుల నలఁత బడలేదు. అందమైన చిత్రమును చూచుటకు నలసిపోవు విలోచనంబులు, వికృతదైత్య లక్ష్య మీక్షించినది. (ఉ.హరి-1-161). ఊచన కఱ్ఱను కూడ వంపలేనిది, బాణజాలముచే మింట, మంటల పూయించి రాక్షసునిలోని గర్వమును తొలగించి, అచ్చరలు మెచ్చునట్లు, విపుల వీరావేశమును ప్రదర్శించినది.

ఇదే సందర్భమున, పోతన భాగవతమున, సహజముగ బిడియము గల లజ్జావతి, భీరువు, సుకుమారియైన సత్య, అనువజ్ఞుడైన మహాయుద్ధ వీరునికి వలె, ఆలీఢాది మానములతో రిపుల మానమడపుటకై చూపిన యుద్ధచాతురి ఆశ్చర్యమును కల్గించును.

సత్య యొక్క స్వాభావికమైన అమాయికతను పేర్కొనుచు, ఈనాటి ఆమె అద్భుత రణరంగ ధనుష్పాండిత్య ప్రదర్శనకు, ధీరచిత్తమునకు కవి మరింత విస్మయమును ప్రకటించినాడు. వీణె చక్కగ పట్ట వెర వెరుంగని సత్య, ఈనాడు విల్లును పట్టినది. మ్రాకున తీగెను కూర్పంగ లేనిది, నారిని ధనుష్కోటికి కూర్చినది ముత్యములను వరుసగా గ్రువ్వజాలనిది, నిపుణతతో శరములను, సంధించినది. చిలుకకు పద్యములు చెప్పనేరని సుకుమారి, అస్త్రమంత్రములు పఠించినది. పెక్కు పలుకుమనిన పలుకలేని అబల సింహగర్జనము కూడ చేసి (181) చూచువారిని ఆశ్చర్యాంబుధిని ముంచినది. సత్య ఆత్మ బలము, కార్యదీక్ష అంత దృఢమైనవి. తీవ్ర యుద్ధ సమయమునందు కూడ, తన సహజ సుందర విలాసములను ప్రదర్శింపగల్గిన వీరసుందరి సత్యభామ.

*"గనయంబున్ గొనయంబు నెన్నడుముతోఁగర్ణావతంసంబుతో,*
*జనుదోయింగనుదోయి సాయకముతో సంధాన హస్తంబుతో, జెనకం జేయుచు"*
*(ఉ. హరి. 1-157),*

నాచని సోముని సత్య "లక్ష్య శుద్ధితో యుద్ధము చేయుచుండగా, పోతన సత్య

*"సౌవర్ణ కంకణ ఝుణఝుణ నినదంబు*
*శింజినీ రవముతోఁ జెలిమి సేయఁ,*
*దాటంగ మణిగణ ధగధగ దీప్తులు*
*గండ మండల రుచుల్ గప్పికొనఁగ,*
*ధవళతరాపాంగ ధళధళ రోచులు*
*బాణజాల ప్రభాపటలి నణఁప*
*శరపాత ఘుమ ఘుమ శబ్దంబు పరిపంథి*
*సైనిక కలకలస్వనము లుడుప"* .....*(భాగ-10-ఉ.భా-177)* యుద్ధము

చేసినది. హరివంశ సత్య కన్నను పురాణసత్యలోని వీరరసమూర్తి ప్రస్ఫుటమై ప్రజ్వరిల్లినది. 'వీరం బాడుదనంబు నొందె' ననినట్లున్నదని ఎఱ్ఱన చెప్పగా,

"వీర శృంగార భయ రౌద్ర విస్మయములు గలసి భామిని యయ్యేనోకాక" అనునట్లుగ బాణమును సంధించుట' విడుచుట ఏయుట అన్నది తెలియరాకుండ యుద్ధము చేసెనని ....(10-177) పోతన, ఆమెను నానారసమూర్తిగ ఉత్ప్రేక్షించి విలక్షణమైన సత్య యుద్ధవీరమును మరి మరి ప్రశంసించినాడు.

భాగవతాదులందు రుక్మిణీ కృష్ణుల శృంగారము కొంతయైనను వర్ణితమైనది. కాని సత్యాకృష్ణుల శృంగారము పురాణేతిహాసములందు ప్రత్యేకముగ వర్ణింపబడలేదు. వీరరస ప్రధానమైన ఘట్టములందు ధ్వని ప్రధానముగ వర్ణింపబడిన శృంగారమే వీరిది. అట్లయినప్పటికిని వీరిది పరిపూర్ణము, ఉదాత్తమైన అకలంక ప్రణయ మనుట ఆ వర్ణనలు స్పష్టము చేయును. సత్యభామ వీర శృంగార నాయిక. శ్రీకృష్ణుడు వీర శృంగార రసైక మూర్తి. ఆమె నరకాసురునితో యుద్ధము చేయు వేళ ఆమెకు ప్రక్కన నున్నవాడు ఆమె ప్రియ వల్లభుడు. ఎదుటనున్నవాడు, దుష్టజనుడైన నరకాసురుడు. కావున యుద్ధము చేయునపుడు ఎదుటనున్న అరిని కోపముతో, ప్రక్కనున్న హరిని ప్రేమతోను చూచినది. యుద్ధమామెకు భీకరము, ప్రయాసకరము కాదు. అరిపై శరాసారమును, హరిపై దరహాసామృతపూరమును కురియించుచు, యుద్ధము చేసినది. తీవ్ర యుద్ధ సమయ మునందు కూడ తన ప్రియుని మరువలేదు. సత్యభామలో ఆ భావ సంధిని సంవిధాన చక్రవర్తి సోమన యిట్లు సంధానించినాడు.

*"అరిఁజూచున్ హరిఁజూచుఁచూచుకము లందందంద మందారకే*
*సరమాలా మకరంద బిందు సలిల స్యందంబు లందంబులై*
*తొరుగం బయ్యెదకొంగొ కింత దొలఁగం దోడ్తో శరాసారమున్*
*దరహాసామృత పూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్ .....(ఉ. హరి. 1-162)*

ప్రియతముడైన హరిని చూచుటచేత కల్గిన శృంగార విభ్రమము వలననే మందార కేసర మాలా మకరంద బిందు సలిల స్యందంబులు కల్గుట, పైట తొలగుట అనునవి ఏర్పడినవి. యుద్ధ రంగమునను అమృతము వంటి మందహాసమును వరునిపై పరుప గలిగి నంతటి నిబ్బరమున్నది సత్యకు! ఈ పద్యమునందు సత్యలోని వీరరస స్ఫుటీకరణము కన్నను శృంగారరస ప్రకటీకరణమ్మే అధికము. దీనికన్నను, ఇదే ఘట్టమును చిత్రించు పోతన భాగవత పద్యములో, ఏక సమయములో పరుని వరుని చూచినపు డామెలో కల్గిన భావసంధి వర్ణన, అనన్య సాధ్యమై యొప్పినది.

*"పరుఁజూచున్ వరుఁజూచు నొంప నలరింపన్ రోష రాగోదయా*
*విరత భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్*
*జరగన్ గన్నుల గెంపు సొంపు బరఁగన్ జండాస్త్రసందోహమున్*
*సరసాలోక సమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్"..(భాగ-10-ఉ.భా. 178)*

పరుడైన నరకుని చూచు సమయమున, అతని నొంచుటకై రోషముతో భ్రుకుటి ముడిచినది. వీరావేశముచే కన్నులకెంపు పెరిగినది. చండాస్త్ర సందోహము నాతనిపై హేలాగతి నెరపినది. వరుని చూచినపుడు అలరించుటకై, రాగోదయముచే, మందహాసముతో, శృంగారము తోపగా, కన్నులలో సొంపు పరగగా సరసాలోక సమూహమును 'హేలాగతి' అనగా విలాసముగ ప్రసరించినది. 'కేళీగతి' అని సోమనయు, 'హేలాగతి' అని పోతనయు పేర్కొనుచు, సత్యకు యుద్ధమనిన అనాయాసకరమైన క్రీడవంటిదని మనకు స్ఫురింపచేసినారు. నరకాసుర వధార్థమేగు పతితో, తానును వత్తునని సత్య పట్టు పట్టగా కృష్ణుడు యుద్ధరంగము భీకరమైనదని వర్ణించుచు "కన్య! నీవేడ రణరంగ గమన మేడ" అని భయ పెట్టినాడు.

కాని సత్యకు యుద్ధమనిన భీతి లేదు, సరికదా! మీదు మిక్కిలి యుద్ధమును ఒక క్రీడగ భావించి విలాసముగ సునాయాసముగ, అరిని భీతిల్లచేసినది.

ఇక, సత్యభామ అరివీరుని నలయించిన విధము అద్భుతమైనది. ఉత్తర హరి వంశము నందలి సత్య అలసట యెరుగని సబలగ, ధనుష్పాండిత్యముచే సర్వ శస్త్రాస్త్ర భేదన చతురగ చిత్రింపబడినది. నరకుడు ఆమె నడుముపై ఆరును, పార్శ్వముపై ఏడు బాణములు వేసి బాధించగ, సత్య తన చిరునవ్వును కోల్పోలేదు. శత్రువు తనను బాధించుటచే, కోపము కలుగగా, ముఖము "కెంపెక్కి" నది. కెంపెక్కిన మోము లేనగవు టీరికలం దళు కొత్తగా శత్రువు యొక్క గొడుగు కామయు విల్లును, పడగను, వెంటనే ముక్కలు చేసి గుఱ్ఱములను దునిమి వైచి, నరకుని విరథుని చేసినది. ఈ శౌర్య ప్రదర్శన మంతయు నలవోకగానే చేసినది. అందుచేతనే, ఆమె ముఖమునందు లేనగవు టీరికలు! అది శత్రువు యెడ ఆమెకు గల నిర్లక్ష్యమునే సూచించును.

"...అతడు వేరొక విల్లును అందుకొనగా నఱకెను. వేరె విల్లెత్తిన విఱుగనేసె"ను అంతేకాదు. నరకుడు గద విసరి వైవగ, తునిమెను. ఆరాక్షసుడు శక్తి వైచిన, దానిని తుమురు సేసెను. అతడు తుదిని పరిఘము వేయగా దానిని విరిచెను. ఇట్లామె నరకుని వాడి బాణములచే నొంచగా "దేవతులున్ సంయుములు నుతించిరి" (పైది. 167). అంతటితో ఆ వామాక్షి ఆగలేదు. 'తత్సూతుని', 'తలనేల గూలునట్లు' 'నొకబాణముతో' 'నుద్ధతి' నేసెను. సత్య యొక్క ఇట్టి అద్భుతమైన అరుదైన భీకర సంగ్రామ కేళీధురీణతను చూచియే కృష్ణుడు సంతోషాతిశయముతో 'లాలిత కంఠాభరణముతో పాటు లీలా పరీరంభము' నిచ్చెను. ఆపదక మిమ్మని, మున్ను రుక్మిణి యేచుచుండినను కృష్ణుడు ఈయ లేదు. అట్లు దాచిన సొమ్ము, నేడు 'మది గోరని సత్యభామ'కు వీరశుల్కముగ లభించినది (ఉ.హరి. 168). అంతేకాదు. "సత్యభామ చేసిన సంగరంబునకు సంతోషించి" హరి, ఆ చెలువ చెక్కుల నెలకొన్న చెమట తుడిచి, నుదుటిపై నున్న కుంతములొత్తి, హారము సరిదిద్ది, పయ్యెద కొంగు పొందు పరచి, ఇట్లు ప్రియసతికి అరుదైన సేవలు కూడ చేసినాడు (1-169). మహావీరుడైన కృష్ణుడు కూడ, మురాసురునితో పోరునపుడు కొంత శ్రమకు లోనైనాడు. నరకునితో పోరుచు, ఒకమారు మూర్ఛితుడైనాడు. కాని ఈ వీరకాంత మాత్రము ఎట్టి అలసటను ప్రదర్శింపలేదు. ఈమె కృష్ణుని మించిన వీరవనిత యనిన అందు అతిశయోక్తి ఏమాత్ర ముండదు. కావుననే, కృష్ణునకును ఆమెపై అంతటి ఇష్టమును, పక్షపాతమును! అందుచేతనే సంస్కృత కవుల సత్యకన్నను, తెలుగు కవుల సత్య, భర్తను అంతగ అదలించ గలిగిన చనవును సంపాదించు కొనగలిగినది.

భాగవత సత్యభామ శత్రువును అలయించిన విధమును, ధనుష్పాండిత్య ప్రదర్శనయు విలక్షణము, విశిష్టముగ నుండును. రాక్షసులనెడి దావాగ్నిని ముంపగల్గు అకాల ప్రావృట్కాలమును, శరవర్షముచే సృజింప కలిగిన త్రిలోక శక్తి స్వరూపిణి యీ భాగవత సత్య.

*"జ్యావల్లీ ధ్వని గర్జనంబుగ సురల్ సారంగ యూథంబుగా*
*నావిల్లింద్ర శరాసనంబుగ సరోజాక్షుండు మేఘంబుగాఁ*
*దావిద్యుల్లత భంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ*
*బ్రావృట్కాలము సేసె బాణచయమంభశ్శీకర శ్రేణిగాన్" ....(భాగ-10-ఉ. భా. 182)*

అని, కవి పోతన సత్య ప్రదర్శనను మెచ్చినాడు. మెరుపుల వంటి ఆ భయంకరమైన బాణములకు నిలువలేక, "ఘోర దానవానీకంబుల్, పెంపరి, సన్నాహంబుల, సొంపరి", నరకుని వెనుక జొచ్చినవి, చివరకు విచ్చినవి. సత్య చూపిన అసహాయ శూరతకు ముగ్ధుడైన

హరి "గురు విజయము గైకొమ్మా" అని వీర నారీరత్నమును ప్రశంసించుచు "మెచ్చితి నిచ్చెద గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్" అని ఆ కళావతిని సమ్మాన పూర్వకములగు మాటలతో పెద్దరికముచేసి, ఆమె చేతినుండి విల్లు నందుకొనెను. నరకుడంతటి వీరుడు కూడ "మగువ మగవారి ముందర, మగతనములు సూప రణము మానుట నీకున్, మగతనము గాదు" (పైది. 189) అని కృష్ణుని పరిహసించినను, పరోక్షముగా అతడు సత్య శౌర్యాతిశయమునే ప్రశంసించుటయు మనము గ్రహింపగలము. ఈ సత్యభామయే లేకపోయిన, శ్రీకృష్ణుడు నరకుని యుద్ధము నందు గెలువ గలిగి యుండునా? అను సందేహమునకు తావునిచ్చు విధముగ, ఎఱ్ఱన, సోమన, పోతనలు వీరవనిత యగు సత్యా పాత్రను చిత్రీకరించినారు. యుద్ధరంగమున వరుని మాత్రమే గాక, పరుని ప్రశంసలను కూడ పొందిన అసాధారణ ప్రజ్ఞాశాలి, యుద్ధపండితురాలు సత్యభామ.

సత్యభామ వంటి వీరాంగన కృష్ణకాంతలలోనే కాదు, పురాణవనితలలోను, మరియొకతె కానరాదు. పురాణకాలమున పతితో యుద్ధరంగమునకు కదలివచ్చిన వనిత కైక ఒకతె యున్నది. కాని ఆమెయు ప్రతివీరుడైన శంబరాసురునితో పోరాడినట్లు లేదు. యుద్ధమున గాయపడిన పతికి ప్రాణరక్షణము చేసినందులకు, అతని నుండి వరములను పొందినది. కైకకు మంధర దుర్బోధ చేయు సమయమున, పూర్వము శంబరాసుర వధార్థమై దశరథునితో ఆమె యుద్ధము కేగిన విషయమును గుర్తు చేయుచు, 'యుద్ధమున మూర్ఛితుడును, హతసారథియునైన దశరథుని, రథముపై నిడుకొని యుద్ధ భూమి నుండి దూరముగ తోలుకొని పోయియు, తరుముకొని వచ్చు రాక్షసుల బారినుండి తప్పించి వేరొక రహస్య ప్రదేశమునకు రథమును నడుపుకొని పోయియు, ఇట్లు రెండు మారులు అతని ప్రాణాపాయము నుండి తప్పించుటచే రెండు వరములను పొందితివి' అని అనును![1] ఇందును, కైక పతికి రథ సారథ్యము చేసి అతని ప్రాణములను రక్షించినదే కాని, సత్యకు వలె అరివీరునితో సమానముగ నిలిచి, శత్రువీరులు కలంగునట్లు కదన చతురతను కనబరుపలేదు.

భారతము నందు ద్రౌపది, శత్రువుపై వీరావేశము చూపు ఘట్ట మొకటి యున్నది. ద్వైతవనము నందు పాండవులు అరణ్యవాసము చేయు సమయమున, ఒంటరిగా నున్న ద్రౌపదిని చూచి సైంధవుడు, మోహావేశపరుడై, ఆమెను బలాత్కారము చేయబూని 'సతి పయ్యెద కొంగు పట్టుకొనగా, ద్రౌపది కోపముతో నుదిల్చికొని వాని 'ద్రేయగా' వాడు తీవ్ర వాయు వేగమునకు సమూలముగ పెకిలింపబడిన వృక్షము వలె భూమి తలంబున కూలిపడును[2]. కాని ఇది ద్రౌపది మానరక్షణకై చూపిన వీరావేశమే కాని, సత్యవలె, శత్రు దౌర్జన్యము నిర్మూలింప యుద్ధరంగమున కనబరచు యుద్ధవీరము కాదు.

కొంతవరకు సత్యవలె, శత్రువుల నెదిరించి నిలువ గలిగిన వనిత, భారతము నందలి సుభద్ర. అర్జునుడు, సుభద్రాపహరణము చేసి, పారిపోవు సమయమున బలభద్రుని సైన్యము తన నెదుర్కొనగా, అతడు వారితో యుద్ధము చేయుచుండగా, వీరవనితయైన సుభద్ర 'రథము గడపి'[3], తన వరుని యుద్ధ విజయమునకు తోడ్పడినది. కాని ఈమెయు ఆయుధమును చేబూని శత్రువుల నెదిరింప లేదు.

జైమినీ భారతము నందలి ప్రమీల, యుద్ధ చాతురి చూపి వీరాంగన యనిపించు కొనినది. కాని ఆమె చూపిన సాహసము[4] ప్రియవరుని విలుచుటకే కాని లోక కంటకుడైన

*1. రామాయణము - అయోధ్యాకాండ - స - 9. శ్లో - (11 - 17)*
*2. భార - అరణ్య - 6 - 190*
*3. భార - ఆది - 8 - 202*
*4. జైమినీ భారతము. 5-121*

దానవుని గెలుచుటకు కాదు, ఇట్లేవిధముగ చూచినను, సత్యభామ వంటి అసమాన యుద్ధ కళాచతుర, ధనుష్పాండిత్య విశారదయైన వీరాంగన పురాణేతిహాసము లందెచటను కనిపింపదు. సత్య ప్రదర్శించిన మహోన్నతమైన పరాక్రమము వంటి పరాక్రమము కాని, కావించిన మహోదాత్తమైన ఉపకారము వంటి ఉపకారము కాని, మరియొక పురాణ వనిత చేయలేదు. ఈ మహోపకార కారణము గానే, కృష్ణుడా సౌందర్యఖనికి మరింత దాసానుదాసుడై వర్తించినాడు. కృష్ణుడే ఆ విల్లును తిరిగి స్వీకరింపకుండిన సత్యభామయే నరకుని జయించి యుండెడిదేమో!

ఈ పురాణేతిహాస సత్యభామను ఆదర్శముగ గొని ఆ తరువాతి కవులును ఆమెను అసమాన తేజోవిరాజయైన వీరనారీమణిగ చిత్రించినారు. నరకుని తోడి యుద్ధ ఘట్టమున "సత్యభామా సాంత్వన" ప్రబంధ సత్య, భాగవత సత్యను తలపింప చేయును. ఈ ప్రబంధ సత్యయు, నరకుడు కృష్ణుని వీక్షింపుచు, దైత్య సేనం బురిగొల్పఁగా పతి ఆదేశించుటకు ముందే యుద్ధ సంరంభము సందడింప, "పైట సారించి", 'లేచి' ప్రియాగ్రమ్మున నిల్చినది (పు-139). భాగవత కృష్ణునకు వలెనె ఇందును కృష్ణుడు ఆమె పూనిక కడ్డువాట్లు వేయబూనుచుండగానే, తన నాయకుని చేతిధనువును తాను జేకొనినది. భాగవత సత్య ఎంత వీరోత్సాహముతో ముందడుగు వేసినను, పతి విల్లందీయగా అందుకొని, యుద్ధము చేసినది. కాని ఈ ప్రబంధ సత్యలో, ప్రగల్భత్వ మేపారినది, కావున పతి చేతి ధనువును తానే చేకొని, యుద్ధమునకు కడంగినది. శత్రు సేనలను చెల్లాచెదురు చేసి, "భల్లా బడె సాయిబనుచు" పతి వలన నుతు లందుకొనినది.

పోతన సత్య, శరపాత వర్షముచే అకాల ప్రావృట్కాలమును సృజింపగా, ఈ ప్రబంధ సత్య శరవర్ష ప్రయోగ వేళ, తానే 'వర్షాలక్ష్మి'గా భాసించినది (పు. 142). పోతన చేసిన సత్య వీర వర్ణనమునకు, కామేశ్వరకవి సౌందర్యమును కూడ జతచేసి మెరుగులు పెట్టినాడు.

ఇందలి సత్య వీరము, పతికి మోదము శృంగారము కల్గింపగా, అరికి ఖేదమును కల్గించి, అద్భుతమని కూడ అనిపింప చేసినది.

సత్యభామ పూర్వజన్మమున భూదేవి యగుటచే, నరకుడు తన పుత్రుడని, గ్రహింపగానే "తగ దల్లిఁగావున", ఆమె అసురకులేంద్రునపుడు "తాఁ బెంచ నెంచిన"ది (పు-143). ఆ వగ యెరింగి కృష్ణుడు 'చెలియా నీవెంతయు బడలితివిగదా, విను నేఁబోరు చేసెదం జలమేలే' అనుచు

*"కినుకఁదగ వీరపత్నివి గనుక నీకు*
*నని యొనర్పుట యుచితంబె యైననేమి*
*యేను నీదాసుడను గాన, యిపుడు లలన!*
*కలన నాచేత గెలిపించఁ దలచవలయు"* ....(సత్య. సాం - పు. 143)

అని నవ్వి, నవ్వించి వెంటనే విల్లును ఆమెనుండి గైగొనినాడు. ఈ ప్రబంధమునందు తప్ప మరియే గ్రంథమునందును, సత్య చేతి నుండి, కృష్ణుడు తిరిగి విల్లంబులు గైకొనుటకు, తగిన కారణమును చెప్పబడ లేదు.

ఇతర ప్రబంధములందు, సత్యభామ యొక్క యుద్ధవీరము ప్రత్యక్షముగ వర్ణింప బడకపోయినను, అది సూచింపబడుట మాత్రము జరిగినది. పారిజాతాపహరణ ప్రబంధమున, పారిజాత విషయకముగ క్రోధావిలచిత్తయైన సత్య

*"పూనుకొని మేలుగీళ్ళకు*
*లోనయి విహరించువారి లోకమెరుగదో*
*యా నరకాసుర దమనుఁడు*
*దానెరుఁగడొ భోజకన్య తానెఱుఁగదొకో"* ...... (పారి. 1-91)

అని చెలి ముందు వాపోవును. ఇచట నరకాసుర వధా సమయమున, తాను కృష్ణునకు సాహాయ్యము చేసిన విషయమును సత్య సూచించుచున్నది. ఆ సమయమున తాను కావించిన మహోపకారమును గూర్చి లోకమునకు తెలియుననియు, భోజకన్య యయ్యు రుక్మిణి చూపలేని సాహసమును వీరమును తాను చూపి నరకాసుర వధకు తోడ్పడ గలిగితినను గర్వము కూడ ఇందున్నది.

నరకుని ముందు నిలిచి అప్రతిమాన వీరము చూపి యుద్ధ విజయమునకు కారణమైన సత్యభామ, అడపడచు సుభద్రకు గొప్ప ఆదర్శమూర్తిగ నిలిచినట్లు "విజయ విలాస ప్రబంధము" చిత్రించినది. కృష్ణుడు రథ సారథ్యము వహించు విధమును, సుభద్రకు నేర్పగా, సత్య ఒకింత విలువిద్య నేర్పి, వీరవనితగ తీర్చినది. సుభద్రాపహరణము చేయు అర్జునుని, బలరాముని సైన్య మెదిరింపగా, నవ వధువు సుభద్ర, ఒంటరిగా పోరాడుచున్న వరుడైన అర్జునునితో తన విలు విద్యా గురువు, సత్యభామ యని చెప్పుటతో నూరకుండక, మున్ను కృష్ణునకు యుద్ధరంగమున కష్టస్థితి యెదురు కాగా, ఆమె జంకక నిలబడి, వీరుడైన నరకాసురుని గెల్చినది కదా! అని ప్రశంసించుచు,[1] అంతటి అసహాయ శూరురాలి, విలు విద్యా పండితురాలి, శిష్యురాలను తాను కావున తనసమర్థతను గూర్చి అర్జునుడు సందేహపడ నవసరము లేదని ధ్వనింపచేసినది.

*"........ నా యందు గలట్టి*
*యందచందంబులు నతిపౌరుషంబు*
*నెరుగదా రుక్మిణి! యెఱుఁగఁడా హరియు*
*ఎఱుఁగరా భువనమం దెల్లవారలును"* .........*(పారి. యక్ష-3-157)*

అను "పారిజాతాపహరణ యక్షగాన" సత్య మాటలు, ఆమె 'పౌరుషము గల వనిత' యనుట జగద్విఖ్యాతమైన విషయమని స్పష్టము చేయును. నరకాసుర వధాసమయమున ప్రదర్శించిన ఆనాటి 'అతిపౌరుషము'ను గూర్చియే, ఆమె ఇచట ప్రస్తావించుచున్నట్లుగ భావింప వలయును.

భాగవత సత్యవలె, "విష్ణుపారిజాత యక్షగాన" సత్యయు, కృష్ణుడు నరకాసురునితో పోరు చందంబు చూడవత్తునని పట్టు బట్టును. హరి వారించియు, ఫలితము లేకపోవుటచే, సత్య పరాక్రమముపై గల విశ్వాసముతో

*"వామాక్షి! నీవిట్లు వచ్చెదననిన*
*భామ యీచతురంగ బలము లేమిటికి*
*నెరజాణ వైనట్టి నీవును, నేను*
*గరుడవాహనమెక్కి గదలితిమేని*
*సకల శాత్రవులను సాధింప గలము"* .....*(విష్ణు పారి. యక్ష - పు - 117)*

అని ఉత్సాహపరచి, వెంటగొనిపోవును. కాని ఆమె యుద్ధమునందు పాల్గొనినట్లు మాత్రము ఇందు వర్ణింపబడలేదు.

సత్యభామ వీరమింత ప్రసిద్ధమైయుండగ, ఇందులకు విరుద్ధముగ ఆధునిక కవి చెర్వీరాల భాగయ్య కృత "శ్రీకృష్ణ పారిజాత యక్షగానము"నందు మాత్రము, పారిజాతాపహరణ సమయమున తమనెదుర్కొను దేవ సైన్యము చూచి "పెక్కురు గలరదుగో

1. *విజయ విలాసము - 3 - 143*

చూడు వారూ! తా మొక్కరు యెటు జయము నొందెదరూ! అక్కటకటా మనకిదేమి యాపద ఘటించె నేడు! యెక్కడి యీ పారిజాత మేలగోరియుంటి' నని భీరువై పలుకును. (పు. 39). కృష్ణుడు తాను బ్రహ్మాండ నాయకుడనని నమ్మబలికిన తరువాతనే ధైర్యము తెచ్చుకొనును. ఇట్టి భీతచిత్త, సమర విముఖయైన సత్యభామా పాత్రము ఆంధ్ర సాహిత్యము నందెచటను చూడము.

నాటకములందును సత్యభామ వీరవనితగా ప్రదర్శింపబడినది. 'నరకాసురవధ' నాటకమున, సత్య తాను యుద్ధ సమయమున అరదంబు కడపగలననియు, "వలయునేని వాలుఁ గైకొని పోరెద" ననియు (పు. 56) చెప్పి, నరకాసుర వధార్థమేగు పతి వెంట వచ్చును. దీపావళి నాటకమున, కృష్ణుడు నరకాసుర వధార్థమేగుచు, తన వెంట వత్తునను సత్యను రావలదనుచున్నను, "ఆ నరకాసురుని నాశనమునకు, యుద్ధమునకు నేనే ప్రధాన స్థానము వహింపవలయును" (పు. 61) అని సమరోత్సాహముతో బయలుదేరును. కృష్ణుడును 'శౌర్యధుని' అని ఆ వీరవనితను ప్రశంసించును. సత్య వీర చతురతకు నరకుడంతటి శూరుడు కూడ విభ్రాంతుడై 'భళిర! సాత్రాజితీ భవత్పౌరుషమ్ము సంస్తవోజ్జ్వల మౌను' (పు. 76) అని మెచ్చుకొనును. అంతేకాదు. సత్య యేసిన బాణాఘాతమునకు నొచ్చి "ఇది శరమా? లేక సంహారమా? బాణమా? లేక ప్రాణాపహరణమా? వజ్ర సన్నిభమైన నా వక్షమునకు ఈ వాల్గంటియే వజ్రాయుధమైనదా?" (పైది. 77) అని ఆందోళనము చెందును.

హరికథలయందు సహితము ఈ వీరాంగన వీర సాహసములు కొనియాడ బడినవి. 'శమంతకమణి,'[1] అను నామాంతరము గల 'సత్యభామా కల్యాణమను' హరికథయందు, కల్యాణమునకు ముందే శత్రువు నెదుట శౌర్య సాహసములు ప్రదర్శించిన వీర నారీమణిగ చిత్రింపబడినది. ఎంత వారించినను, కామోద్రేకముతో శతధన్వుడు, దుష్ట చేష్టకు పూనుకొనగా "కనుపర్చెద నాదగు శస్త్రపుంగళన్ మగంటిమి యున్నచో నిలువుమా, యిక నీపస గాన నయ్యెడున్" (పు. 29) అని కత్తిని తీసి ఝుళిపింపగానే అతడు పారిపోవును. కొప్పరపు గోపాలకృష్ణమూర్తి రచించిన శ్రీకృష్ణ భాగవతమునందు సత్యభామ యుద్ధ చాతుర్యమునకు ఆశ్చర్యపోయిన నరకుడు.

*"భుజ బలంబింత యొప్పె*
*పురుషునిగా జేయకుండ*
*నజుఁడిటు చెలువగ చేసెను*
*నతని నేమనఁగ వలయు"* ....*(శ్రీకృష్ణ భాగ - హరికథ-పు. 170)*

అని బ్రహ్మసృష్టినే, ఈ వీరవనిత కారణముగ విమర్శించును.

ఇట్లు తెలుగు కవులందరును సత్యభామను, కదనరంగము నందు కలత నొందని ధీరగా, అరిని అదలించి బెదరించి అలయించిన శూరగా, అప్రతిమాన యుద్ధ వీరగా చిత్రించి ఈమెను, సాహిత్య లోకములోని స్త్రీ పాత్రల నడుమ విలక్షణమైన విశిష్ట గుణసంపన్నగా రూపొందించినారు.

## వాక్ప్రగల్భత - కార్యసాధనా చతురత

సామదాన భేద దండోపాయములచే కార్యసాధనకు విజ్ఞులు పూనుకొందురు. సామోపాయ మనగా నెమ్మదిగ మాట్లాడి తమ ప్రయత్నమునందు కృతకృత్యులగుట.

1. పరిమి సుబ్రహ్మణ్యశాస్త్రి భాగవతార్ - శమంతకమణి.

చతురులగువారు తమ వాక్చమత్కార ప్రదర్శనచే ఎదుటివారిని, వశులు చేసికొని కార్యసాధనా దక్షులగుదురు. సాధారణముగ ఈ విద్యను, గృహిణులు తమతమ మనోభీష్ట సిద్ధి కొరకు తమ భర్తల ముందు ప్రదర్శించుచుండుట లోకమున చూచుచుందుము. సత్యభామను లోకాతీతమైన వ్యక్తిగ గాక, ఒక సామాన్య లౌకిక స్త్రీగ చిత్రించిన తెలుగు కవులును, ఆమె సమయజ్ఞతతో కొన్నిమారులు సున్నితముగ తన వాక్చమత్కారమును చూపి అర్థించియు, కొన్నిమారులు, ఆత్మవిశ్వాసముతో వాక్ప్రగల్భతను చూపి అదలించియు, తన మనోరథ సిద్ధిని పొందు, అఘట ఘటనా సమర్థురాలిగ, అసమాన కార్యసాధనా దక్షురాలిగ నిరూపించినారు.

తెలుగు కవులలో ముఖ్యముగ పోతన పెంపకమున, సత్యభామ పతిముందు వగలు, ఒలకపోయుచు, ముద్దు ముద్దు మాటలతో, తన పంతము నెగ్గించుకొను శక్తియుక్తులు అలవరచుకొనినది. నరకాసుర వధార్థమై భార్యతో కృష్ణుడు గరుఢవాహనారూఢుడై, ప్రాగ్జ్యోతిషపురమున కరిగెనని మాత్రము మూలమునందుండగ,[1] పోతన, కృష్ణుని వెంట తానుకూడ యుద్ధమునకు వత్తుననిసత్యభామ అడుగునట్లును, మొదటందుల కాతడంగీకరింపక పోయినను, చివరకామె పట్టుదలకు లొంగి, వెంటబెట్టుకొని పోయినట్లును కల్పించెను. ఈ ఘట్టమున సత్య కనబరచిన విదగ్ధత అసమానము.

*"దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడనీ*
*ప్రావీణ్యంబులు చూడఁ గోరుదుఁగదా" ...(భాగ. 10 - ఉ - భా - 59 -151)*

అని తన కాతని యుద్ధము చూడవలయు ననెడు కోరిక మాత్రమే యున్నదనుచు, .... ప్రాణేశా! మన్నించి నన్ నీవెంటంగాని పొమ్ము" నేఁడు కరుణన్" అని బ్రతిమాలు కొనినది. 'ప్రాణేశ' అనెడి ఆమె పిలుపులో తీయని ప్రేమ యున్నది. 'నీ వెంటగొని పొమ్మ' ను అభ్యర్థనలో దైన్యమున్నది. ఆమె మాటలలో ఒక చిన్న పిల్ల,పెద్దవాని ముందు ముద్దుముద్దుగా కోరికను నెరవేర్చు కొనుటకై చేసెడు ప్రయత్నమున్నది. 'లోక ప్రసిద్ధమైన నీ వీరమును గూర్చి ఇతరులు చెప్పగా వింటిని, భార్యయై యుండియు నేను చూడలేదు, కావున చూచుట కీనాడు నాకవకాశ మిమ్మ' అను, గడుసుదనము ధ్వనించుచున్నది. అతనిని చూడక, అతని తీయని వాక్సుధ గ్రోలక, వాని సరసములననుభవింపక, ఒక్క క్షణము కూడ ఉండలేక పోవుటయే ఈ అభ్యర్థనము వెనుకనున్న రహస్యము. అంతేకాదు వీరవనితయగు తానును యుద్ధ రంగమును చూడవలయును. సత్య అందులకై తన శక్తి యుక్తులన్నింటిని ప్రదర్శింప దలచినది. ఎంతటి వాడైనను, పొగడ్తలకు లొంగకుండునా? ఆ కారణముగానే మరికొంత చతురతను ప్రదర్శించుచు, "నేజూచి యేతెంచి నీ దేవీ సంఘము కెల్ల జెప్పుదు, భవద్దీప్త ప్రతాపోన్నతుల్" అని అతని పరాక్రమమును గూర్చి సపత్నులకు ప్రకటించు బాధ్యతయు తనపైనే వేసికొనినది. ఎంతటి వాడైనను, భార్యముందు తన పరాక్రమ ప్రదర్శనను చెప్పుకొని పొంగిపోవును. యాగ భాగములను పొందు మనుచు, అందులకైతన పరాక్రమ ప్రదర్శన చేసి వలపును నిరూపించు కొనుమనియు నరకుని ప్రేరేపించుచు, ఊర్వశి "తేజముసూ వలపు దెలుపుఁ దెఱవల కెందున్"[2] అని అనును. వీరుడైన నరకుడును, తన తేజమును చూపి ఆమెపై గల వలపును నిరూపించుకొనదలచి, ఊర్వశిని అనుభవింప వలయునను కోరికను కూడ మరచి, అచటి నుండి కార్యసాధనకై పోవును. కృష్ణుడు భగవానుడే యైనను, అతడును ఒకమగవాడు. తన పౌరుషమును తన

1. సం. భాగ - 10 - 59 - 2, 3
2. ఉ. హరి - 1 - 78

మగనాలు గ్రహించిన, అది అతనికి సంతోషాతిశయమునే కల్గించును. తన పరాక్రమమును ఈ ఒక సతియే కాదు, భార్య లందరును గ్రహించుట బహు భార్యాయుతుడైన పతికి మరింత అహమును పెంచును. మగవారి ఇట్టి మనస్తత్త్వము నెరింగినదగుటచే సత్య, భవద్దీప్త ప్రతాపోన్నతుల్ నీ దేవీ సంఘమునకు చెప్పెదనని అనినది. కృష్ణుడును, సత్య తనను విడిచి యుండ లేదనెడు సత్యము తెలిసినవాడే. కాని భీకర సమరరంగమునకు అబలనెట్లు కొంపోవ గలడు? అందుచేతనే భీకర రణరంగము, వినోద విలాస క్రీడారంగమైన ఉద్యానవనము కాదని నిరూపించుచు, పట్టుదలతో వెంట వత్తునను ప్రౌఢాంగన యగు సత్య ఆ సమయమున అతనికి చిన్నపిల్ల వలె అనిపించుటచే 'కన్యా' అని పిలుచుచు "నీవేడ రణరంగ గమనమేడ?" అని నిరుత్సాహపరుప యత్నించినాడు. కాని ఆమె ఆతురత, అనురాగ మెరిగిన వాడగుట చేతను, తానును ఆమెను విడిచి యుండలేడు కనుకను, 'వత్తు వేగమ' అని ఓదార్చుచు, "నిలువుము, వలదు వలదు" అని ఆమె ప్రయత్నమును అడ్డగింప దలచినాడు. కాని పట్టిన పట్టు విడుచు స్వభావము కలది కాదీమె. సరసురాలు కావున ప్రియునకు, "బ్రియంబు జనియింప" దగ్గరకు చేరినది. కృష్ణుని బాహువులు తనకు రక్షనిచ్చు కోటవంటిదనియు, దానవులు గాని దైత్యులుగాని, అతని రక్షణలోనున్న తననేమియు చేయలేరనుచు, పతికి భయమును తొలగించునట్లు "దానవులైన నేమి మఱి దైత్య సమూహములైన నేమి నీమానిత బాహుదుర్గముల మాటున నుండఁగ నేమిశంక"? (పైది. 155) అని పలికి, పతి పరాక్రమాతిశయమునెడ తనకు గల, దృఢ విశ్వాసమును ప్రకటించి అతని అహమును మరింత పెంచి, సంతోషింప చేసినది. అందులకే, అతడును ఆమెను బహుమాన పురస్సర దృష్టితో చూచెను. సత్యయు సమయజ్ఞతతో, 'తోయజముల' వంటి చేతులను 'ముకుళించి' "మొక్కినది. సత్య యంతటి మానిని తనకు నమస్కరించి ప్రేమ మీర అర్థించినది! కృష్ణుడును ఆమె ప్రేమకును వినయ చతురతులకును ముగ్ధుడై మరుమాట లేక, కరకమలములతో గ్రుచ్చియెత్తి, గరుడునిపై కూర్చుండచేసి, గరుడారూఢుడై యేగి సత్య అభీష్టమును నెరవేర్చినాడు.

'సత్యభామా సాంత్వన ప్రబంధము' నందు, ఇదే ఘట్టమున, సత్యభామ పురాణ సత్యవలె తన వాక్చమత్కారమును మాత్రమే గాక, ప్రబంధ సత్య యగుట వలన కొంత ప్రగల్భతను కూడ సంతరించుకొనిన దగుటచే, నెరజాణ తనమును కూడ జత కలిపినది. పతి భీకర రణరంగమునకు రావలదని హెచ్చరించుచుండగా శృంగార మొలకబోయుచు అతని మూపున మోమిడి, కులుకుచు,

> *"సాధారణ నరునికి నా*
> *యోధనముల్ రిపులు ననెడు యోజనతగుఁగా*
> *కీ ధాత్రి నీ మహత్త్వమ*
> *సాధారణమగుట నిట్టి శంకలు గలవే" .... (సత్య. సాం - పు. 71)*

అని అతని అతిమానుష తత్త్వమును గుర్తు చేయుచు, పూర్వము శివుడు గంగాపార్వతులను తన చెంత నిలుపుకొనియే, విజయము సాధించెనని, హేతుబద్ధముగ వాదించుచు, 'పెరబారులు నుగ్గొనరించరాదొ దానవులన నెంత, రాక్షస జనంబులు దైత్యులు నెంత శ్రీపతీ' (పైది) అని తానే వీరమును ప్రదర్శింపగలనని కూడ సూచించినది. సవతుల నెంచి భయపడు పతితో, ప్రబంధ సత్య యగుటచే ప్రగల్భతతో "తప్పక దోకాని పోవఁగా వలెన్, బవరము చూడ, నా సతుల పాదములాన మరల రాకుమీ" అని సవతులపైనే, ఒట్టును పెట్టి మరల అతని చెక్కునొక్కి ముద్దిడినది (పు.71). ప్రబంధ మగుటచే నిందు విప్రలంభ

శృంగార రస పోషణకై కృష్ణుడు సత్యను వెంట నిడుకొని పోయినట్లు వర్ణింపక పోయినను, రణరంగమున కేగిన తదుపరి, తననట్లు ప్రార్థించిన, సత్యను తలంచుకుని విరహ మోర్వలేక ప్రద్యుమ్నుని పంపి ఆమె నచకటికి రప్పించుకొనును.

సత్యభామ వాక్ప్రగల్భాతిశయమును, కార్యసాధనా దక్షతను చూపు ఘట్టమొకటి ఉత్తర హరివంశమునందు కనిపించును. పట్టపురాణితో సమాన మనియు, కొన్నిమారులు ఆమెకన్న నధికురాలననియు భావించెడు మానవతీలలామను, రుక్మిణీతో పోల్చి చూచుట సమంజసమే యగును. కృష్ణుడు ఆమె కిచ్చినట్లు చనవుల నేరికి నీయలేదు. అందువలనే కొన్ని మారులు పతిని అదలింపగలిగిన వాల్లభ్యము కూడ నీమెకే కల్గినది. సోమన చిత్రణలో సత్య భర్తృవాల్లభ్య కారణమున ఆమె వాక్ప్రగల్భత అతిశయించినది. అది పట్టపురాణి ముందును, ఆమెపైన కూడ చూపకల్గినది. నెత్తములాడ రమ్మనుచు ప్రేమతో కృష్ణుడు పిలువగ సత్య వాదులాని తోడ, వాట్లీని తోడ, బూతుతోడ, తిండిపోతుతోడ, నటమటీనితోడ, నడయరితోడ, నెత్తమాడరాదని హెచ్చరించుచు (ఉ. హరి. 3-112), అతడట్టి వాడని అన్యాపదేశముగా సూచించినది. అంతేకాదు, పతిని "జూదరివి, సుమాళివి, నెఱవాదివి, తసుకరివి" అని ధైర్యముగ పేర్కొనుచు. "గెలువ వచ్చునటే దామోదర నిను మాకు" (3-113) అని ఎత్తి పొడిచినది. ఇష్టము లేకపోయిన, దానిని సున్నితముగ సత్య సూచించి యుండవచ్చును. పౌండ్రుక వాసుదేవుని త్రుంచి, కాలయవనుని ద్వీపాంతరవాసుని చేసివచ్చి, విజయోత్సవముగ, శ్రమాపనయముగ, నెత్తములాడ వచ్చిన పతిని ఇన్ని మాటలతో నొప్పించినది. సత్య పలుకుల కులికి హరి, జాంబవతిని పిలువనంప, సత్య వాసుదేవుని చూచి అసూయతో, జాంబవతిని కూడ నిందించుచు అంతటితో నూరకుండక,

*"చిత్తం బూరక కలచెఁదు*
*నెత్తము నాతోడ నాడనేరుపు గలదే*
*పొత్తు గలసి నీవును నీ*
*తత్త బళలు రండు గెలిచెదం బరువడితోన్"* .... *(ఉ. హరి.3-116)*

అని ఆత్మవిశ్వాసముతో 'సవాలు' చేసినది. సవతు లీమె దృష్టిలో తత్తబళలు అనగా 'పరివార'మైరి. అంతేకాదు. ఆత్మాభిమాన మతిశయింపగా అతనితో పందెము కాసినది. తానోడిన, ఒకటికి పదారురెట్లు చెల్లించునట! అట్లుగాక, మోసగింపబడిన 'పాసిక బొమ్మగట్టు' నట. అనగా అవమానింపగలదట.

ఆమె దృష్టిలో కృష్ణుడు అక్ష విద్యానిపుణుడు కాడు. తానో అక్షకళానిపుణ, అను విశ్వాసమామెకున్నది. కావున అట్టివాడు, ముందుగా, అధికురాలైన తనతో కాదు, అక్షవిద్యయందు సాధారణ పాండిత్యమున్న రుక్మిణితో నాడి గెలిచిన చాలునని తలంచినది. "తొలి తొలి రుక్మిణీ రమణితో నెఱవాదివి నెత్తమాడుమా గెలిచెద వేని మేలు, సరికిం దగనాడెద నూడు వట్టు నీ కొలఁది యెరుంగమే" (పైది - 118) అని పరిహసించినది. ఈ మాటకు కృష్ణుడు "కోపము కన్నుల గ్రోలి నవ్వి", ఆమెతో నెత్తము లాడ తొడగనే గాని, కోపముతో నోరెత్తి ఒక మాట కూడ అనలేకపోయినాడు. సత్య ఆదేశించినట్లు, రుక్మిణితో నెత్తమాడ నారంభించి, ఆమె అనినట్లు అడయరినని' నిరూపించుకొనినాడు. ఇదే ఘట్టమున రుక్మిణి చతురముగ నాడినను, కపటనాటక సూత్రధారుడు, తనను ఓడించినపుడు, ఆమె ఆవేశపడలేదు. నోరెత్తలేదు. కృష్ణుని మిగుల నాకర్షించినది రుక్మిణిలోని గాంభీర్యము, నిగ్రహము, వినయము, భక్తి కన్నను, సత్యలోని చిలిపితనము, నిర్భయత్వము, ఆత్మీయతతో కూడిన అదలింపును చెలిమితోడి చనవును! రుక్మిణి ఆట చాలించిన వెంటనే, కృష్ణుడు ఆ

కాంత ముందు, తనను సత్యభామ పలురకముల నిందించి యుండుటను కూడ మరచి 'సత్యభామ కరము, గరమునఁగీలించి'ఆడరమ్మని పిలిచినాడు. అచట కాంతలెందరున్నను సత్యపై గల ప్రేమ భావమును మాత్ర మాయన దాచలేదు.

సత్యాకృష్ణులు జూదమాడుచుండగా ఆపద్ధర్మముగ, మధ్యవర్తిత్వము వహించుచుండిన రుక్మిణి "బొంకు బొంక", శౌరిని పలుమారులు 'ఆ సత్యభామ గెలిచెను' (3-128). "ఆమె జూదము నందైన బొంకునటుల నాకు దోపదు ఇది కవి బొంకిన బొంకు గాని రుక్మిణి బొంకిన బొంకు కాదు"[1] అని జి. నాగయ్య గారు రుక్మిణిని అసత్యదోషము నుండి కాపాడ దలచిరి. కాని మానవ కాంతగా జన్మించుటచే మానవ సహజమైన మనోవికారములు నీమెకున్నవనుటకు, పై సంఘటన మొక నిదర్శనము. కపట నాటక సూత్రధారి, తనను కపటముచే నోడించుట వలన, రుక్మిణి, సత్యా పక్షపాతియై బొంకి సత్యను గెలిపించి, కృష్ణుని ఆట కట్టించినది.

పుత్రలాభమునకై శ్రీకృష్ణుని వరము కోరునపుడు రుక్మిణి

*"కాచికొని కొడుకు నడిగెనఁ*
*టే చనవున నాలుమగఁ డటే వర మిచ్చెం*
*జూచెదమను సవతులచే*
*నీచులుక దనంబు చేరనీకుము కృష్ణా"* ....*(ఉ. హరి - 2-78)*

అని అర్థించును. సవతుల ముందు చులుక దనము భరింపలేనని, అందుచే పరువును కాపాడుమని, మానినియై అర్థించినది. కాని, సత్య వలె సవతుల ముందు బయటపడదు. జాంబవతిని పిలువనంపిన వేళ, సత్య ఆవేశపడినది. కాని, రుక్మిణి మౌనము వహించినది. సత్య మనసులో ఏ భావమున్నను దాచుకొనలేదు. అపర సీతగ, లక్ష్మిగ భావింపబడు రుక్మిణి యందే మానవ సహజమైన మనోవికారము లుండినపుడు, సత్యభామ యందు కోపావేశాది మనోవికారములుండుటలో నాశ్చర్యము లేదు. నిజమున కీమెలోని, ఈ స్త్రీ సహజమైన స్వభావమే కొంటె కృష్ణుని మరింత సమ్మోహన పరచినది.

పారిజాతాపహరణ ఘట్టమునందు సత్య ప్రదర్శించిన వాక్ప్రగల్భత జగత్ప్రసిద్ధము. ఎఱ్ఱన హరి వంశమునందు దివ్యవృక్షమును తన సొమ్ముగ చేయ చిత్తవిభుని 'మెత్తన' వేడి, కార్యము సాధించుకొనినట్లు వర్ణింపబడగా, విష్ణుపురాణమున కొంత వాక్చమత్కార ప్రదర్శన చేసి, పతిని అంగీకరింప చేసినట్లుగ వర్ణితము. "ద్వారకా పురికి నీపారిజాతముఁగొని, యరిగి, మదీయ గృహాంగణమున, నుపవనంబులలోన నునుచు"... మని (8-125) ఆదేశించినది.

మూలానుసారముగ అనువదింపబడిన 'తాడేపల్లి సీతారామస్వామి విష్ణు పురాణమున", జాంబవతి కంటె, రుక్మిణీ చంచలాక్షి కంటె నెక్కువ గూర్చు పతినని అతడనిన మాటలు, ఇచ్చకములు కావనునట్లుగ నిరూపింప వలయుననియు, నవ పారిజాత సుమములను కేశపాశములందు ధరించి, సవతులలో నధిక కాంతి సంపదలతో అతిశయింప దలచి "నవనీత చోర, గోరెద" (పైది. 5-4-127) అని పారిజాతోత్పాటనకై ప్రేరేపించినది. చోరత్వము చేసి యైనను కృష్ణుడు తనకు దానినిచ్చి తన ఆధిక్యము నిలబెట్ట వలయు నననునట్లు అతనిని 'నవనీతచోర' అని సంబోధించినది. అతడు నట్లే 'చోరుడై' దాని నపహరించినాడు.

సత్య వాక్ప్రగల్భాతిశయము పతిముందు మాత్రమే కాదు, పరుల ముందును నాగదు. సూరన విష్ణుపురాణమున పారిజాతాపహరణ సమయము నందు, అడ్డుపడిన వనపాలకుల

---

*1. ఉత్తర హరివంశ విమర్శనము - పు. 51*

తోను, తలపడిన అమరాధిపతి ముందును ఆమె గరువ తనముతో వాక్ప్రగల్భతను ప్రదర్శించి వాగ్యుద్ధమునకు కడంగినది. అది శచీదేవి వృక్షమనియు, మనుజసతులు ఆవిరులు ముడువ నర్హులు కారనియు విడిచిపొమ్మని వనపాలకు లడ్డగింపగా, ఏవనజనయనుఁడొండేమియు ననక నగుచు నూరకుండగా సత్యభామ, కఱకు మాటలతో, పారిజాతమునకు వారెవ్వరు, హక్కుదారులు కారనుచు, కోపావేశముతో మండిపడినది. జలధిని పుట్టిన పారిజాత మెవ్వరికి సొంతము కాదని ఈమె అభిప్రాయము. పరాక్రమాతిశయముచే ఇంద్రుని మించిన వాడు తన భర్త. ఆ విషయమును శచీదేవి మరచుట ఈమె కెంతయు కోపమును తెప్పింపగా

*"తన మగఁడు బాహు విక్రమ,*
*ఘనుఁ డయ్యేడు నేని గృష్ణుఁగయ్యములో మా*
*ర్కొని గెలిచి పారిజాతము*
*గొని పోవుం గాక యేల గొణుఁగులు తనకున్"* *(సూ. వి. పు. 8.133)*

అని పంతము లాడినది. ఈ మాటలు సత్యములే కాని నిర్భయముగ, తానను కొన్నది ప్రకటించునపుడు అందు కొంత ప్రగల్భత తోచును.

ఇదే ఘట్టమున బ్రహ్మపురాణమున, "మర్త్యనారినై పరగెడు నేను గల్పతరువర్యము భూమికి గొంచుబోయెదన్ ద్వరపడి నిల్వరింపు" మని యుద్ధ ప్రకటన చేసినది. (బ్రహ్మ4-94-90). తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధమునందు నిదే విధముగ, వార్ధి పొడమిన దివ్య భూరుహమును ఇందిరను చేకొనిన హరికే సొంతమగును కాని, ఇతరుల కది కాదని, అనుచు "తెక తేర యిది యేమి యొకరి సొమ్మే" (పారి. 4.58) అని ఎగతాళి చేయుచు, శచీదేవి వీరపత్ని యైనచో తన ప్రాణేశుని ఇటకుపంపి సత్యభామావిధేయుని నుండి తిరిగి పొందుటే వీరత్వమని (పారి. 4-59) హెచ్చరించుచు, ఆ ఆవేశమున, తనపతిని సత్యభామా విధేయునిగ కూడ ప్రకటించుకొనినది. ఈ మాటలలో ప్రగల్భత ఉన్నదనుటకన్నను, సత్య, సత్యమునే మొగమాటము లేక చెప్పినదని చెప్పవలయును. ఇందిరను కౌస్తుభమును చేపట్టిన విష్ణువునకే కల్పనగము సొంతము కావలయును కదా! కృష్ణుడును సత్యభామకు అన్ని సందర్భములందును విధేయుడై ప్రవర్తించుట వలన సత్యభామా విధేయుడని ప్రకటించు కొనినది.

శ్రీనారు నార్య రచించిన అచ్చతెనుగు పారిజాతపహరణమున మరింత ధైర్యముతో "కావలసినచో! మీ దొరతో వాదాడగలము" (క్రైకోలు 103) అని ఇంద్రునితో తానే వాదాడ గలనని, పతి పక్షమున తానే, ఆ పారిజాతము, తమకు, సొంతమనుటను హేతుబద్ధముగ వాదించుచు "...సత్యయే యెదిరించి పలికెనంచు" చెప్పుమని (పైది. 110) అని కూడ హెచ్చరించును.

ఎఱ్ఱన హరి వంశమునందును, వెన్నెల కంటి సూరన విష్ణుపురాణమునను పారిజాతా పహరణ ప్రబంధమునను ఓడిన ఇంద్రుని చూచి సత్య ఎగతాళి చేయదు. కాని సీతారామస్వామి అనువదించిన విష్ణు పురాణమునను, బ్రహ్మపురాణమునను, సత్య మానినీత్వాతిశయముతో అతని మ[illegible]నును, ప్రగల్భతను ప్రకటించినట్లు చిత్రింపబడినవి. మూలానుసారముగ తాడేపల్లి సీతారామస్వామి అనువదించిన విష్ణుపురాణమున సత్య భయముతో పారిపోవ ప్రయత్నించు ఇంద్రుని చూచి, పరిహసించుటయే కాక, దేవకాంతనను గర్వముతో, శచి గర్వించినదను కోపముతో, వ్యంగ్యోక్తులతో

*"పారిజాత స్రగాభోగ ప్రణయిని శచి*
*ముదమున నెదుర్కొనఁగ, నామె మునుపటట్ల*
*నీవు మన్నింపవేని నీదేవరాజ్య*
*మేల యామెకును నవజ్ఞ పొలునొక్కొ"* *....(తా. సీ. వి. పు. 5-4-156)*

అని మేలమాడినది. అతడు సిగ్గుపడుట గమనించిన సత్య, 'అలమునను మిగుల నలయంగ నేల, నీవపజయమున సిగ్గునందనేల?" అని అడుగుచు ఇంతటితో తన ప్రతీకారము చల్లారుట వలన "పారిజాత పాదపము గొనిపొమ్ము, దేవతల మానసముల వెతలు దీఱ" (పైది - 157) అని పెద్దమనసుతో ఇచ్చుచున్నట్లు గెలుచుకొన్న పారిజాతమును తిరిగి ఇచ్చుటకు సిద్ధపడినది. మానిని యగు తనను, శచి అవమానించుట వలన "పగ జనింప", పారిజాతోత్పాటనమునకు పతిని ప్రేరేపించినది కాని, పర ధనము నాశించి కాదని తెలియచెప్పినది. (పైది. 158)

బ్రహ్మపురాణమున సత్య పారిజాతమును చూపి, "దీని గైకొని చనుము, నీ దేవతలు, గతవ్యధులుగాఁగ బొల్తు" రని (4-94-107) వాక్ప్రగల్భతను చూపుచుండ, "సత్య వాక్ప్రగల్భతకు మానినీత్వాతిశయమునకు కలత చెందిన ఇంద్రుడు "చండీ! భేదాతి విస్తరోక్తులిఁక జాలింపుము" అని అర్థించును.

'భామా కలాప' ములోని భామ, సవతి కడ నుండి వచ్చిన పతిని చూచి, పదియారువేల మించు బోడులలోను తనను, అతనిచే కౌగిలించుకోమని బ్రతిమాలించు కొనునట్లు చేయుదుననియు, అతని అభిమానమును నలుగురిలో తీయింతుననియు, జడతో కొట్టుదుననియు, బెదిరించును. ఆకోపన సాంత్వనమును కోరిన కృష్ణుడు, కర్పూరగంధితో కలియుటలేదని నిప్పులైన పట్టెదనని ఒట్టు పెట్టగా "కారుచిచ్చు ముట్టి కబళించు వానికి నిప్పులనగ నెంతరా" (పు. 86) అని ప్రశ్నించినది. అవిరిబోణిని కలియుటలేదని నల్లగోవును పట్టెదనని అతడనగా "ఏ వేళ గోవుల గాచేటి వానికి, గోవులనగ నెంతరా" అనియు, ఆ వనజాక్షితో కలియుటలేదని, పాములైన బట్టెదనని హరి ప్రతిన చేయగా, "పాము మీద దీవి బవళించువానికి బాములనగ నెంతరా?" (పు. 87) అనియు, అతడు 'దేవర గుడి సొచ్చెదనని' ప్రతిన చేయగా "దేవ రహస్యము తెలిసిన వానికి దేవరనగ నెంతరా" అనియు పలికి, "కొమ్మ చన్ను గుడిచి, కొమ్మ గ్రుద్దిన వాని నమ్మవచ్చునటరా" (పు. 87) అని ప్రశ్నించి నిరుత్తరుని చేసినది. అహంకారముతో సమాధానము లిచ్చుచున్నట్లు కనిపించునే కాని, ఆమె మాటలలో నిచట పతి మహానుభావుడనుటనే ధ్వనింప చేయుచున్నది.

జానపద సాహిత్యములోని "తలుపు దగ్గర పాట"యు నిట్టిదే. శాహజి రచించిన సతీపతి దాన విలాస యక్ష గానము నందు సత్యకు, "పురుష దానమునకై" పతి అనుమతిని కోరవలసి వచ్చినది. "చెప్పెద, నది నీవు సేసెద ననుచు నభయమిచ్చితేని" (పు.9) అని ముందర కాళ్ళకు బంధము వేసి అనుజ్ఞ పొందిన తరువాతనే, "ఇప్పుడు నా కోర్కె నీవు చెల్లించకపోతే, ఎవరు చెల్లింతురయ్యా నాసామి, తపములు దానములు సేయఁగ నీవంటి ధవునిఁబొందితినయ్యా సామి" అని అతనిని పొగడి ఉబ్బింప చేసి, ఆ తరువాతనే విషయమును చెప్పి, అనుజ్ఞను సులభముగా పొందినది. ఈమె వాక్ప్రగల్భాతిశయము కారణముగానే, సవతులతో పోట్లాట పుట్టుటయు జరిగినది. పతి ముందు ఆమె వాక్ప్రగల్భత ప్రదర్శించుటకు ముఖ్యముగ, అతడిచ్చిన చనవులు కారణములగుచున్నవి. చిత్తౌన్నత్యము, నిర్మలమైన మనము, మొగమాటము లేని ఆమె మనఃప్రవృత్తి, సూటిగ నడచుకొనెడు ఆమె పద్ధతి, ఇవి అన్నియు సత్యభామను వాక్ప్రగల్భగ రూపొందించినవి.

## అమాయికత్వము :

సత్యభామ గర్వితగ, తన పంతము తీర్చుకొనుటకై ఎవరినైనను తన మాటలచే బాధించు అహంకార చిత్తగ, లోకము భావించును. కాని సునిశితముగ పరిశీలించిన సత్యభామ అమాయికురాలనుట స్పష్టము కాగలదు. సత్యభామలోని మానినీత్వము, ఆత్మవిశ్వాసము

ఎదుటివారికి గర్వముగ, అహంకారముగ అనిపించును. ఆమెలోని నిర్భయ ప్రవృత్తి అకలంక చిత్తము కారణముగ, తనకుతోచిన భావమేదైనను, ఎట్టిదైనను మనమున దాచుకొనకుండ, ఎదుటివారి ముందు అనివేయును. మనసున ఒకటి, బయట ఒకటిగ సత్య చెప్పలేదు. చాటుమాటు గుణమీమెలో లేదు. అంతేకాదు, తననెవరైన నుతించిన అందలి, సత్యాసత్యముల నరయలేదు. దానిని విశ్వసించి వేయును. ఇదంతయు ఆమె అమాయి కతయే. సత్యభామ, తన అమాయికత్వము వలన కొన్ని మారులు మందలింపులకు కూడ లోనైన ఘట్టములున్నవి.

శ్రీకృష్ణుడు బహుకాంతా కాంతుడు. సత్య అతనినే సర్వముగ భావించు చుండును. కాని అతడే క్షణమున ఏకాంతవైపు సమాకృష్టుడగునో, అనెడు భయమామె కేవేళ నున్నది. ఒక భర్తనే తాను వశవర్తుని చేసికొనుటకు ఎంతో కష్టపడుచుండగా, ఏపురు భర్తలను వశవర్తలను చేసికొని యుండు ద్రౌపదిని చూచిన సత్యకు అద్భుతముగ తోచినది. కావుననే, నీ విశేష సౌభాగ్యమునకు కారణము, వ్రతములా, మంత్రౌషధములా, సరస నైపథ్య కర్మ కౌశలమా? అని అడుగుచు

> "ఏనును నీవలన నిజము
> *గానిది యెంతయు నెఱింగి కమలదళాక్షుం*
> *బూని వశగతునిఁజేసియ*
> *నూన స్నేహానుభావయుక్తిఁ దలిర్తున్"* ......*(భార-ఆరణ్య - 5 - 292)*

అని తన ఉద్దేశమును కూడ దాచక వివరించినది. కాని సత్య మాటలు అవివేకమైనవిగ ద్రౌపదికి తోచుట వలన కినుక ఇంచుక పొడమినను, అది అడచుకొని, "నను నిట్లు దుష్ట వనితా, జనము నటులుగాఁ దలంపఁజనునే నీకున్" అని మందలింపుగా ప్రశ్నించినది. "పురుషోత్తమ వనితవుగాఁ దగవ"ని, సత్య అవివేకతను మేలమాడు విధమున ఎత్తి పొడిచినది.

నిజమున కిందు సత్య చూపిన దుష్టస్వభావమేదియు లేదు. అవధులు మీరిన కృష్ణ ప్రేమ ఆమెచేత అట్లడిగించినది. ఆమెయే కాదు, ఆ పరిస్థితి యందున్న ఏ వనితయైనను ఆ విధముగానే అడిగియుండును. తనకు నెచ్చెలివంటిదని ద్రౌపదిని భావించుట చేతనే అట్లు అడుగ గల్గినది. మంత్రతంత్రౌషధముల వలన పతులు వలతురనుట బేలతనమనియు, దాని వలన పూర్వమున్న బ్రేమయు నశించుననియు హెచ్చరించుచు, తాను పాండవుల యెడ నాచరించెడి గృహిణీ ధర్మములను బోధించి, నీవు చెప్పు, మందులు మాకులు నింద్రజాలములు నాకు తెలియవని కొంత మందలింపుగా చెప్పగా, సత్య తన తొందరపాటునకు పశ్చాత్తాపము చెంది, "ఏనెఱుఁగమి నిట్లడిగితి, నా నేరమి సై పవలయు" (భార. ఆరణ్య - 5.311) అని క్షమాపణనడిగినది. సత్యలోని నిష్కల్మష చిత్తమే, మనసులో తోచినది అడుగునట్లు చేసినది. అట్లడుగుట వలన తనను 'అవివేకిగా' భావింతురను సందేహము కూడ ఆమె మనసునకు రాలేదు. తన మాటలు మానిని యగు ద్రౌపదిని బాధించి యుండునని గ్రహించి,"నగవుగ గొనుమీ మానిని, నా పలుకులు" అని అర్థించినది. ఈ మాటలు సత్యలోని సంస్కారమును, విధేయతను, సూచించును. ద్రౌపదియు సత్యభామ అమాయికురాలనెడు విషయము గుర్తించి యుండును. కావుననే 'మందస్మితానన యగుచు' 'పరమ సౌభాగ్యమూలంబయిన యుపాయంబులను' బోధించినది. సత్యభామయు "ప్రీతచిత్తయై" దానిని వినినది. ద్విపద భారతమున, "జనని! నేనింత విచారింపనైతి మాట యోరువుమమ్మ" అని క్షమాపణ అడుగుటయే గాక "...మగని నీయట్ల, నేటి నుండి భజించు నేరుపు గంటి" (ద్వి. భార - ఆరణ్య. 4 పు. 70) అని ప్రబోధము పొందిన విద్యార్థినివలె,

భక్తితో ప్రమాణము కూడ చేయును. సత్యభామలోనే కల్మషముండి యుండిన యెడల ద్రౌపదిని అంతటి ప్రశ్నవేసి యుండలేదు. నిండు మనసుతో క్షమాపణయు కోరి యుండలేదు.

సత్యభామ మనమున కల్మషము లేకపోవుట వలన, తానేవిధముగ, ఉన్నది ఉన్నట్లు చెప్పునో, అదేవిధముగ ఎదుటివారు కూడ ఉందురని భావించును. ఎవరేది చెప్పినను నమ్మును. ఈమెను మోసగించుట సులభము. అందుచేతనే కృష్ణుడు తన కాపట్యములను కాని, నారదుడు తన మాయా నాటకములను కాని సత్యభామ యెడలనే ప్రదర్శించినారు. ప్రబంధ సత్య ప్రగల్భగా చిత్రింపబడినను, ఆమెయందును అమాయికత నిండుగనున్నది. పారిజాతాపహరణ ప్రబంధమున నారదుడు, పారిజాత పుష్ప ప్రదాన వేళ, రుక్మిణి ముందు, సత్యభామ పేరు పేర్కొని విమర్శించి, సత్యలో సపత్నీమాత్సర్యమును రగుల్కొల్పి, సత్యకు మానహాని కల్గింపబూనినాడు. కృష్ణుడును 'కనులలో కప్పుకొనఁగ యుండి' తనను కాపాడుచున్నాడని సత్య భావించుచుండ, సత్యను వీడి రుక్మిణికి పుష్పమునిచ్చి, సత్యకు మానహాని కల్గించినాడు. అందుచేతనే సత్య పేరలుక చెంది, మ్రొక్కిన అతని శిరమును తొలగద్రోచి, నిందించి, చివరకు, ప్రాణ త్యాగమునకు కూడ సమకట్టియు, చివరకు హరి, పారిజాత ద్రుమమునే తెచ్చి యిత్తునని మాట యన్నంత మాత్రమున అంత కోపమును మరచి, ఆనందముతో పులకించి పోయినది. నిష్కల్మష చిత్తులే ఇట్లు తొందరగా కోపమునకు లోనైనను, వెంటనే దానిని మరువగలరు. సత్య మనసు పసిపాప చిత్తము వలె అకలంకమైనది. "గడుసరి ఆడుది మగని తన్ని మొరపెట్టినదని సామెత, ఇక్కడ సత్తెమ్మ మగనిని తన్ని మొరపెట్టినది. ఎంత గడుసరియనిపించును. కాని నిజమున కిదంతయు నామె అమాయికతే! ఆమెది కేవలము పసిపాపల మనస్తత్త్వము"[1] అని చన్నాప్రగడ తిరుపతిరావు గారును, సత్యభామ అమాయికురాలనియే సమర్థించినారు!

సత్యలో కోపాతాపములు శాశ్వతముగా, నిలువవు, తనకు మానహాని కల్గించిన నారదుని కలహాశనుడని మతకరి వేలుపుందపసి యని, కోపమున తెగనాడినది. కాని పతి పారిజాతము తెచ్చియిత్తుననగానే, పతి పైననే కాదు. ఆమె కందరిపైనను కోపము తొలగినది. తన నట్లు విమర్శించి బాధించిన నారదుడు, తన యింటికి అతిథిగారాగా, ఆతిథేయ కృత్యములచే అలరింపచేసినది. పొగడ్తలకు లొంగుట అమాయికుల గుణము. ఎవరేది చెప్పిన అది నమ్ము గుణముండుటయే ఇందులకు కారణము "కృష్ణ భూజంబు నీ పెట్టు చెట్టుఁజేసి సవతులన కాదు, త్రిభువనేశ్వరి యనంగ, బొలఁచు పౌలోమి గెలిచితి వలఘు మహిమ" (హరి. 5.54) అని నారదుడు పొగడగా, సంతోషముతో పొంగిపోయి, అతడుద్బోధింపగా, పుణ్యక వ్రతానుచరణమునకు కడంగినది. 'తొంటి తన కోపము, గర్వము, మత్సరంబు మాని, వినయంబున బ్రమోదంబు నిండి తొలకెడు నెమ్మోముతో సవతుల యిండ్లకు తొలినాడే యేగి, ఉత్సవమున కామతించవలయునని' అతడుపదేశింపగా, ఎట్టి సందేహమును ప్రకటింపక, మున్యాదేశము ప్రకారము చేయ, సంసిద్ధమైనది. "ఆమె వట్టి అమాయకురాలు. నీ యంతటివారు లే రనినంతలో, డెందము కొండంతయై యార్ద్రత జెందును" అని సత్యను గూర్చి వి. అంకయ్య గారనినమాట లెంతయు సత్యములు.[2]

సత్యను మోసగించుట సులభము. కనుకనే కృష్ణుడును, తన మాయానాటకమును సత్య యెడనే ప్రదర్శింప దలచినాడు. గర్వితమతియై చెలగుచున్న, సత్య హృదయం

1. *పంచకన్యలు - పు. 39.*
2. *సాహిత్యచంద్రిక పు. 45*

బెటులుండునొ, చూడవలయు"నని పారిజాత ద్రుమములను ప్రతి వనిత యింట నిలిపి తన నాటకమును ప్రారంభించినాడు. కృష్ణుని మాయను గ్రహింపలేని సత్య, అతడు పారిజాతమును దివి నుండి తెచ్చి యిచ్చుట చేతను, తనను వీడక నేవేళ తనతోడనే యుండుట చేతను, మరింత గర్వముతో ప్రవర్తించినది. కాని అతని నాటకము కారణముగ, నీ అమాయికురాలు గొప్ప మనోవేదనకు గురియైనది. చివరకు శ్రీకృష్ణుని లీలలను తెలిసికొనిన తరువాత, దుఃఖక్రోధములను మరచి, ఆసాధ్వి 'ప్రసాదనచిత్త' యైనది (పైది 1-207).

శ్రీకృష్ణ తులాభార వృత్తాంతము సత్యభామ అమాయికతకు ఒక నిదర్శనము. ప్రణయ గర్వముచే తులాభార వ్రతము చేయుటకు సంసిద్ధురాలైనట్లు కవులు చిత్రించినను, నారదుని నాటకమును గుర్తింపలేని ఆమె అమాయికతయే, ఇందు ప్రముఖముగ కనిపించును. శ్రీకృష్ణాతిమానుషతత్త్వ ప్రబంధమున, సత్యభామ, తన వస్తువులకు, ఇతర వస్తువులకు కూడ తూచుటకు సాధ్యముకాని పతిని గమనించియు, అతడింకను లౌకిక వస్తువులకు తూగువాడే యని తలచి, రుక్మిణి కడకేగి "రమ్మా! కపట తులాభారమ్మాలోకించి మాకు త్రాసము మాన్పన్, సొమ్ములవి యున్న గొంకక, తెమ్మా" (3-1-253) అని అర్థించును. ఈ మాటలలో గర్వము కాని, కాపట్యము కాని లేదు. "ఇందు సొమ్ములవి యున్న గొంకక తెమ్మా అను పలుకులలోని అమాయికత పాఠకులకు సుస్పష్టమే" అని జి. విద్యాసాగర్ గారు, పై పలుకులు సత్యభామ అమాయికతనే సూచించినవని భావించినారు.[1] "శ్రీకృష్ణాతిమానుషతత్త్వము" నందే, సత్య అమాయికతను నిరూపించు ఘట్టము మఱొకటి యున్నది. సత్యలోని అమాయికత ఎంత తీవ్రమైన దనిన, తనను ఎవరైనను నుతించిన, దానిని నమ్మి తనకు ప్రాణాధికమైన పతిని కూడ ఇతరులకు త్యాగము చేయగలదు. కృష్ణుని పతిగా వలచిన నరకుని చెరలోని కాంతలు, కృష్ణుని భావమరసి, వారు సత్య అంగీకారము పొందుటకై "భామామణి! నీ ఋణ మీఁగ లేము ధర్మువు గణంగి విశదీకరించి కడతేర్చు నెడన్" అని ప్రణమిల్లి ప్రాధేయపడగా కరుణామతియై" ఈ భూపాలాత్మజలన్ గృపార్ద్రమతివై ప్రోవం గదే ప్రేమమై" (పైది. 113) అని ప్రార్థించి, వారిని నాతడు భార్యలుగ గ్రహించునట్లు అంగీకరింప చేయును.

పారిజాతాపహరణ యక్షగానమున గడుసుదనముతో గయ్యాళితనముతో వ్యవహరించి నట్లు కనబడు సత్య, నిజమున కెంతయో అమాయికురాలు. శ్రీకృష్ణుని మోస మెరుంగ లేని ముగ్ధ. పారిజాతమును పతి తెచ్చి యిచ్చినాడని సంతసించినదే కాని "పువ్వుల నెల్ల రుక్మిణి యింట నివ్వటిల్ల చేసినాడను విషయము గ్రహింపలేనట్టిది. "నేను నోచిన నోము, నేడుగా ఫలియించె, బూనిన సవతులలోనఁ బూజ్యత నందగలిగె" అని ఆనందించినది. అంతేకాదు. "ఒక సుమమును నిచ్చినంత టువిద గర్వించితివి, చక్కనైన పారిజాత వృక్షము తనకు సదయుడు తెచ్చిచ్చెనె" (పైది. 5-పు-288) అని రుక్మిణి ముందు గర్వించినది. సత్యకు జరిగిన మోసమును తెలిసిన రుక్మిణి, "ఇచ్చితే నేమాయెనే, యందు వల్ల నేమిఫలము గంటివె?" అని నర్మగర్భముగా అనినదే కాని నిజమును సూటిగా చెప్పలేదు. సవతితో పోట్లాడినను చివరకు "మన మిద్దర మన్యోన్యమై యుందమె" అని తానే రాజీకి వచ్చినది. సత్య చెలు లనినట్లు తెల్లని వెల్ల పాలని మదినెంచు అమాయికురాలు ఆమె.

సత్యభామ గర్వితమతిగా లోకము విశ్వసించినను, ఆమె సవతులు సత్యను అమాయికురాలుగ గుర్తించుట, "శ్రీకృష్ణ తులాభారము" అను నాటకమున చూడగలము. సత్యభామ తొందరపడి భర్తృ దానము చేసినందులకు, సపత్నులు ముందు కోపగించు

1. శ్రీకృష్ణాతిమానుషతత్త్వము - భూమిక - పు. 5 (తృతీయ ఖండము)

కొందురు, కాని ఆ దుస్థితికి కారణము నారదుడని తెలిసికొని జాంబవతి, "నారద మునీంద్రా! ఈయమాయకురాలిని వంచించి మా నాథుని పట్టితివా?" (పు. 64) అని ప్రశ్నించును.

జానపద సత్యభామ అమాయికత్వము మూర్తీభవించినది. పారిజాతవృక్షమునకై పంతగించి, పతిచే తెప్పించుకొని పెరటి చెట్టు చేసి కొనినదే కాని, పూవులన్నియు రుక్మిణి కడకే పోవుచుండగ, నేమియు ననలేకపోయినది. "వేశ్య కాంతవు గనుక నీవు పువులన్ని ముట్టరాదు అంటరాదు" (పారుజాత తరుపల్లవి - పు. 24) అని, పతి తనను వేశ్యయని తూలనాడుచున్నను, పువ్వులను ముట్టరాదని కట్టడి చేసినను, పూచిన పువ్వులన్ని రుక్మిణికడకు జేరినను వట్టి మ్రాను మాత్రమే ఆమెకు మిగిలినను, 'ఇట్టి రవ్వలేల?' అని నారదుడు పరిహసించినను, సత్య తనకు జరిగిన వంచనకు నేమియు ననలేక పోయినది. పారిజాత విషయకముగ, జానపదులకు సత్యపై నెంతేని కోపమున్నట్లున్నది. ఈమె అమాయికతను అలుసుగ తీసికొని కృష్ణుడు, పలుమరు ఆమెను వంచించినాడు. రుక్మిణీ సీమంతోత్సవమునకు రమ్మని రుక్మిణి చెలు లాతనిని చాటునఉండి సైగచేసి పిలువగా, "భక్తుడగు అక్రూరుడు విందునకు రమ్మని పిలుచుచున్నాడు. పోవలయు"నని అసత్య మాడగా, అది నమ్మిన సత్య "వేగిపోయిరా కృష్ణా! వేగపోయి రమ్మ"నినది. (రుక్మిణీ దేవి సీమంతము- పు. 152). అతడు తనను మోసగించిన వైనము చెలులవలన నెరింగి, కోపగించుకొనినను, మగని సాంత్వనపు పలుకులకు, కానుకలకు మురిసి, అంతటిని మరచినది. (పు. 166). కాని సత్య అతనిని నమ్మి నిద్రించుచుండగా, రుక్మిణి నవమాసములు నిండెనని, ఆమె చెలులు వచ్చి, లేపి, చెప్పగా, ఆమెతో చెప్పక ఆనందముతో కృష్ణుడు మరల రుక్మిణి గృహమున కరిగెను• జానపద సత్యలో తీవ్ర గర్వముగాని స్వార్థముగాని లేదు. ఆమె అమాయికత్వమును చూచిన, నెంతటి వారికైనను వంచింప బుద్ధి కలుగునేమో! "నారదుడొక్క వూహ చేసి" సత్యచే పతిని దానము చేయించినాడు. (తులసీదళము - పు. 192). ఇది యేమి వ్రతమని కృష్ణుడు విడ్డూరపడగా, నారదుండు వచ్చి, పతిని దాన మిచ్చినట్టి వనితలకును జెప్పరాని పదవి దొరుకు ననుచు దెల్పగా, ఈ వ్రతము చేసితిననుచు "ఇంతకన్న నెక్కువైన పూజ నేను జేయలేదు, నింద సేయ వద్దు నాకు నీవు వైరివా" (పైది 193) అని అమాయికముగా నడిగినది. ఇచట సత్య అడుగకనే నారదుడు తనంతట తాను వ్రతముపదేశించి, సత్యను ఇక్కట్లుకు లోను చేయును. పతి ధనమునకు తూగక పోవుటచే, అతనిని విముక్తుని చేయ రుక్మిణి కడకేగి, తన అపరాధమును వివరించుచు,

*"కొండ పొడవు కనకరాశి గొప్ప ముత్యసరము లెల్ల*
*నిండుగాను వేసినాను తూగడాయెను*
*నాకు వల్లకాకపోయి సిగ్గు చేత మోమువంచి*
*మిమ్ముచేరి మ్రొక్కినాను చిన్నదానను"* ....*(తులసీదళము - 195)*

అని అర్థించిన అకలంక చిత్త సత్య. పై ఉదాహరణములన్నియు సత్యభామ మానిని యగుటచే, మానహాని కల్గినపుడు మాత్రము, పలుకులలో, పనులలో పారుష్యమును ప్రదర్శించు చుండునే కాని, వాస్తవమునకు ఈమె నిర్మల చిత్తము గల అమాయికు రాలనుటను నిరూపించుచున్నవి.

## గర్వభంగములు :

సత్యభామ మానినీత్వమును, అతిశయమును పలువురు ఆధునిక కవులకును, జానపదులకును తీవ్రమైన అహంకారముగా అనిపించినది కాబోలు. సత్యభామ ప్రణయ, సౌందర్య, ధన, ఆభిజాత్య విషయములందు గర్వించుచు జగన్నాథుడైన శ్రీకృష్ణుని దైవముగ

గుర్తింపక అహంకారముతో నడుచుకొనుచున్న దనియు, రుక్మిణీ దేవి భక్తిని గాని సాత్త్వికతను గాని గ్రహింపక, భక్తికన్నను రక్తియే మిన్న యని భావించుచు, అగ్రమహిషిని గాని, ఇతర సపత్నులను గాని లెక్కచేయక, విఱ్ఱవీగుచున్నదనియు, కావున ఇట్టి అహంకార చిత్తకు గర్వభంగము అత్యావశ్యకమని తలచి, వారు "తులాభారము" నెపముననను, "హనుమంతుని భక్తిపరీక్ష" అను పేరుననను, రుక్మిణీ చేతను, శ్రీకృష్ణ ప్రేయసిగా పేర్వడసిన రాధ చేతను, సత్యకు గర్వభంగములు చేయించినారు. పురాణేతిహాస ప్రబంధములు, పారిజాతము సత్యభామకే సొంతమై దక్కినట్లు వర్ణించినను, ఆ రాజస గుణప్రధానకు, గర్వితకు, అట్టి సౌభాగ్యము లభ్యమగుట హర్షింపలేని జానపదులు, పారిజాత పుష్పములను రుక్మిణీ పరముచేసి, సత్యభామకు మరియొక విధమైన శృంగభంగమును చేసినారు. ఈ గర్వ భంగముల కన్నింటికిని మూల సూత్రధారుడు, జగన్నాటక సూత్రధారుడే అను సూచన చేయబడినది. ఆంధ్రసాహిత్యమున ఆమెకు గర్వభంగము జరిగిన విధమిచట చూతము.

పారిజాతాపహరణ ప్రబంధము నందలియు, నేమాని భైరవికవి హరివంశము నందలియు పుణ్యకవ్రతఘట్టము, శ్రీకృష్ణుని భక్తైక వశునిగ నిరూపించుటతో పాటు, సత్యభామ స్వాధీన భర్తృకతను మరింత ప్రతిష్ఠముచేసినది. అంతేకాని ఆమెకు గర్వభంగము జరుగలేదు. గర్వభంగము జరుగుట కుద్దేశింపబడినట్లును అనిపింపదు. భైరవ కవి హరివంశముననను, తిమ్మన ప్రబంధముననను, దానమిచ్చిన పతిని తిరిగి పొందుటకు, ద్విజు డేయే యర్థములు వేడిన దానిని నిష్క్రయగ చెల్లించిన చాలును. కాని ఆధునిక రచయితలు, పుణ్యక వ్రతానంతరము పతిని తుల యందుంచి అతని బరువునకు తగు ధనమిచ్చి తిరిగి గ్రహింపలేక, రుక్మిణిని ఆశ్రయించి, ఆమె కృపచే తిరిగి పొందిన తులాభార వృత్తాంతమును కూడ చేర్చిరి. "తులాభార వృత్తాంతము" సాహిత్యమునకు క్రొత్త కాదు.

## తులాభార వృత్తాంతము :-

జన్మజన్మలకు నాకు నిట్టి కల్పద్రుమమును, పతియు, ప్రాప్తింపగల్గు నుపాయము చెప్పుమని నారదుని యడుగగా, తులాపురుషదానము నతడు బోధించెననియు, సత్య కల్పతరువును, కృష్ణుని, తులయందుంచి దానితో సరితూగు ధనమిచ్చి పతిని గ్రహించెనని సంస్కృత పద్మ పురాణము నందు కలదు.[1] కాని, మడికి సింగన పద్మ పురాణము నందీ కథ కానరాదు. కాని ఆధునిక కవియగు పిసుపాటి చిదంబరశాస్త్రి అనువదించిన పద్మ పురాణము నందు మూలమునకు వలెనె "కల్పతరు కృష్ణులకు (దూగు కాంచనంబు ఆయమ నారదముని కొసంగి" నదని కలదు (ఉ. ఖం. 4-316). కాని ఆ తులాభారముచే సత్యకు గర్వభంగ మేదియు జరుగలేదు. మీదు మిక్కిలి ఆమె మానినీత్వాతిశయాభివృద్ధికిని. స్వాధీన భర్తృకతా పతిష్ఠతకునే తోడ్పడినది.

రుక్మిణి తులసీ దళముతో, కృష్ణుని తూచుటకాధారమైన పురావృత్తాంతము మాత్రము పురాణము లందెచట నున్నదో కాని, "తులసీదళ మాహాత్మ్య" మను పూర్వకవి విరచితమైన యేకాశ్వాస ప్రబంధమొకటి యున్నట్లు తెలియవచ్చు చున్నది.[2]

---

1. పద్మ పు. ఉ. ఖం. పూర్వ - 88 - 15, 16, 17
2. "ఇందులకు మూలకథ యెచ్చట నున్నదో తెలిసికొనుట కొంచెము కష్టమే యైనను మొత్తము మీద నిది పురాణ ప్రసిద్ధమను మాట నిక్కువము. ఇందులకు దులసీ మహాత్మ్యమను పేరు గల పూర్వకవి విరచితమైన యేకాశ్వాస ప్రబంధ మొకటి నిదర్శనము' కేతవరపు రామకృష్ణ శాస్త్రి - శ్రీకృష్ణతులాభారము - హరికథ - తొలిపలుకు - పు. 2

"సతీపతి దాన విలాస"మను యక్షగాన మందును, పై తులాభార వృత్తాంతమున్నను, అది కొంత భేదముతో కొనసాగును. పద్మ పురాణమునందును వలెనె, ఇందును, సత్య నారదుని "మీకు సకలమును దెలిసియుండునే, నన్నెల్లప్పుడు విష్ణు వెడఁ బాయక యుండుట కుపాయము దెలుపవయ్యా" (పు. 7) అని అడుగును. నారదుడును "ఏ దానము జేసిన నా దాన ఫలము లభించును. అది యేలాగంటే యిప్పుడు పురుష దానము జేసిన నీ పురుషుఁడైన శ్రీకృష్ణుడు నిన్నెడబాయకుండును. ఇదే యుత్తమ దానము" అని వ్రత విధానము చెప్పగా, "కృష్ణుఁడు ఇప్పుడు తనకే లోకువై యున్నాఁడు. నేడు నాయింటికి వచ్చే వరుస, ఆయన రాగానే యీ కార్య మాయనకు దెల్పి యీ దానము సేయుచున్నాను. మీరు సుముహూర్తము విచారించుకొని యుండరయ్యా" అని గర్వముతో ఆదేశించినట్లు అనును. దాన విధానమును చెప్పును కాని, నారదుడు తిరిగి ఆమె పతిని ఎట్లు పొందవలయునో, ఆ విధము నపుడు చెప్పడు. సత్యభామయు, కృష్ణునితో నారదుని గూర్చి ప్రస్తావించుచు "ఏ దానము చేసిన నా దానఫలము లభించునని చెప్పెను. అందుకు నేను మిమ్ము నెల్లప్పు డెడ (బాయ కుండ వలెనని యడిగిన, నాయన పురుష దానము సేయమనె, నిందుకు దేవరవారి యప్పనయయితే నట్లనే సేసెదనయ్యా" (పైది. పు. 10) అని వ్రతోద్దేశమును వివరించి, అనుజ్ఞ కోరును. కృష్ణుడును "నా మనసులో మునుపుగానే దోచెను. నీతోఁజెప్పిన నే మందువో యని వెరచి యుంటిని, ఈ కార్యము నీవే నాతోఁ జెప్పియుంటివి. నాకుఁజాలా సంతోషమాయెను. అటులనే జేసికొనవే భామామణి" అని ప్రోత్సహించును. వెంటనే బ్రాహ్మణులను పిలిచి కృష్ణుని దానముగా కొనుమని అర్థించును. వారు తా మాతనిని భరింపలేమని తిరస్కరింపగా, నారదుని పిల్చి "మీ రేమి చెప్పిన నది వినును. ఊరకే దానం తీసుకొనరోయి" (పైది పు. 11) అని దానము చేయును. విషయము తెలిసిన అష్టమహిషులు, కోపముతో సత్యను 'రక్కసి' వని నిందింపగా, సత్య, "కలహ కంటకులారా! యీ కంటు మాట లేలానే, నా చెలువుని నేను దానము సేసితి బోవె" ...(సతీ.ప.వి.దా.యక్ష - పు.12) అని అతడు తనకే సొంత మనునట్లు, వాదించినది. అతడొకరి సొమ్ముకాదని వారనగా, వారి, దవడ పగుల గొట్టదునని గయ్యాళితనము చూపును. కృష్ణదాన విషయము తెలిసికొనిన బలరాముడు, కృష్ణునిని తిరిగి పొందుటకై తన యొక్క బొక్కసములోని ధనమును తూచి యిచ్చినను, తులతూగదు. కోపము పొందిన సవతులు ఈ పాపజాతి సత్య వలన, మోసము వచ్చినదనియు, తమ సొమ్మంతయు పోయెనని నిష్ఠురములు పలుకగా, సత్య, "వీరలీ రీతిఁ బలుకఁ గారణమేమి? నాకు మా తండ్రి యిచ్చిన రత్నాలు ధనము చాలానున్నవి. అదంతయు దెచ్చివేసి నేనే విడిపించున్నానయ్యా" (పైది పుట. 15) అని ధనగర్వముతో పలికి, తన యింటనున్న ధనమంతయు తులయందు వేసియు, చివరకు నిరాశ పొందును. యశోదయు, ప్రజలును తమ తమ ధనమును, ధనేతరములను వేసియు, ప్రయోజనము కానకపోవుటచే, వారు కోపముతో సత్యను నిందింతురు. చివరకి వారందరు, రుక్మిణీదేవిని ప్రార్థింపగా, ఆమె అచటవారి ధనమంతయు తొలగించి, తాను దెచ్చిన తులసీదళమును, భక్తితో తట్టలో పెట్టగానే ఆ తట్ట క్రిందగా తూగినది. వారు రుక్మిణిని,

*"సత్య ధారవోసి నాసామిని విడిపింప*

*నిత్య యౌవనవతి నీవే చతురవమ్మ"......(సతీ. ప. దా. వి. యక్ష - పు. 20)* అని నుతింతురు. రుక్మిణి భక్తిని, తులసీదళ మాహాత్మ్యమునే ఈ యక్షగాన కథ సూచించును. కాని, సత్య చివరకు తన దోష మెరిగి పశ్చాత్తాప్తురాలైనట్లు అందు చిత్రింపబడలేదు. తులసీదళముతో తూచు పై కథను గ్రహించి కాబోలు, ఆధునికులు కొందరు తమ కల్పనలను

జోడించి సత్యా గర్వభంగమును చేయబూనిరి. సత్య కన్న గుణమున మిన్న, సాత్వికురాలు, శ్రీకృష్ణ భక్తురాలు అని భావింపబడు రుక్మిణీ చేతనే, ప్రణయ, యాప, ధన, అభిజాత్య గర్వీత, భక్తి మహిమ తెలియని ముగ్ధాత్మ అయిన సత్యకు గుణపాఠము చెప్పింపదలచిరి.

ఆధునిక ప్రబంధమైన "శ్రీకృష్ణాతిమానుషతత్త్వము"న సత్యభామ, ప్రేమగర్వీత 'పతి భక్తిఁ దనకు మించిన సతి' లేదని, "శ్రీపతి" తన సొమ్మని అతిగర్వితమతియై విహరింపగా (3-2-214), "సాత్రాజితికిన్" "ఒక పాఠము గఱపి చక్కం జేయవలయు" నని నారదుడు సత్యవతీ గృహమునకు వచ్చి కలహ సంభ్రమపరతతో, బహుసతీయుతుడైన కృష్ణుడామెను, ఎడబాయని 'కిటుకు' ఆలోచింపుమని తనంత తాను అతడు సత్యకు, సూచించును. ఇందలి సత్యభామ శ్రీపతి మాయను గాని, నారదుని యుద్దేశమును గాని అరయని "ముగ్ధాత్మ" అగుటచే, అతని ఆలోచనలను పసికట్టలేక, "వచింపు మణిమంత్ర విధుల్" అని కలహాశనునే అడిగినది.

భారతము నందలి ద్రౌపది వలెనె నారదుడును, యౌషధ తంత్రములు వరదుని బద్ధునిగ సల్పుటకు వ్యర్థములని అనుచు, తులాభార వ్రతమును చేయుమని ప్రోత్సహించెను. కృష్ణుని అనుజ్ఞను ఆమె కోరగా, సదా ఒకే విధముగా జరుగదనియు క్రింద మీదు లగుననియు కర్మము మరొక్కదారి లాగిన, నీవె చెడుదువనియు మూర్ఖము చేయకుమనియు, హెచ్చరించినను, పితృదత్తమైన దివ్యశమంతకము తన యెడ గల దనెడు ధైర్యముతో, కృష్ణశక్తి యెరుగని అజ్ఞానముతో

*"ఎఱిఁగి శమంతకమ్మున గడించిన నా పితృభాగ్యరాశినా*
*పరమున నుంట నీ తనువు భారమునేన యెఱింగి యుండుటన్*
*దొరకాని యుంటి నీ వ్రతము.... ................(3-1-233)* అని అతిశయభావముతో పలికినది. సత్యభామ నిష్కల్మష చిత్తయే గాని, పతి కూరిమి తనకే గలదను స్వాభిమానముచే గర్వము కొంత చోటు చేసికొనినది. అది గమనించియే, "అకలుషి చిత్తయైన కమలాక్షికి గర్వము డింపఁబూని" హరియును వ్రతమాచరించుటకు నానతి నిచ్చెను. దానమిచ్చిన తరువాత సత్య ముకుందుని ఒక్క తుల యందుంచి, మఱొక్కట భూషల నిల్వఁదోపుఁగా దక్కెడ యందు వైచినప్పటికిని, అది తూగదు. అంతట తన దగ్గరున్న రత్నా భరణములు, సవతుల నగలు భూక్షిప్తమై యుంచిన తనతండ్రి ఇచ్చిన బంగారము తెచ్చివేసినను, తూగలేదు. ఆ లీలా మానుషధారి "....బల్మోసము గల్గె, నన్ను ముని పొట్టను, బెట్టితి వింక వీనికిన్, దాసుండ నీ విపచ్చరధి దాఁటఁగఁ జేయు మనీషిఁ గానవే....." అని హెచ్చరింపగ సత్యభామ విలాపముతో రుక్మిణీదేవిని తప్ప మిగిలిన సవతులను దేవరనుద్ధరింపగ పిలిపించెను ఆమెలోని అహంకారము కొంత శాంతించినను, పట్టపురాణి రుక్మిణిని మాత్రము, తన కన్న మిన్నగా అంగీకరింపలేని అభిజాత్య మామెకున్నది. ఆ భావమును తొలగిననే, సత్యభామలోని కృష్ణప్రేమ అలౌకికమై భాసింపగలుదు. శ్రీ విష్ణు విభూతులలో ఒకటైన నీళాదేవి అపరావతారమైన నీల, సత్య యొక్క తొందరపాటును గ్రహించి రుక్మిణిని ఆశ్రయింపు మనగానే రుక్మిణి యింటికి పోయినది. తన తొందరపాటుకు పశ్చాత్తాప పడుచు "అక్కా యీ యార్తి నెటుల నడఁగించెదవో" ...(పైది. 251) అని అర్థించినది.

గర్వము తొలగుటచే నోటి నిండుగా 'అక్కా' అని పిలిచినది. కాని ఇంకను, శ్రీకృష్ణుని భగవంతునిగా పూర్తిగా గ్రహింప లేకపోయినది. సొమ్ములకు పతి తూగుననియె ఇంకను ఆమె విశ్వాసము. రుక్మిణి తులలోని 'అర్థరాసుల'ను దింపించి ఎదుటనున్న తులసి వృక్షము యొక్క దళమును గోసి భక్తితో తక్కెడ సిబ్బిలో పెట్టి, భక్తితో భగవానుని ప్రార్థింపగా, తుల

సరితూగినది. తులాభారము సరితూగగానే కృతజ్ఞతాబుద్ధితో, సత్య రుక్మిణిని గౌగిటఁ చేరిచి, ఆమె పాదములను కన్నీటితో అభిషేకము చేసినది. తన అవివేకము నిందించుకొనుచు తాను సపత్నీ మాత్సరముతో నడుచుకున్నందులకు పశ్చాత్తాపపడుచు, ఆమెకు సేవలు చేసి తరింతునని ప్రబోధజ్ఞానయై పలికినది. ఈ ప్రబంధము నందలి తులాభార వృత్తాంతము సత్యలోని రజోగుణ నిర్మూలనమునకే ఘటింపబడినను, రుక్మిణి యొక్క భక్తి మాహాత్మ్యము నుగ్గడించుచు శ్రీకృష్ణ మాహాత్మ్య ప్రబోధమునకు ప్రాధాన్య మిచ్చుచున్నది.

శ్రీ ముత్తరాజు సుబ్బారావుగారి శ్రీకృష్ణ తులాభారనాటకము, సత్యా గర్వభంగమునే ప్రధానముగా కలది. ఈ నాటకము నందలి సత్యభామ సేవలందుటే కాని సేవించు టెఱుగని, సీమంతినుల చేత సేవలందుకొనునది. పారిజాతాపహరణము గావించి, ఇంద్రసతి శచీదేవి కమిత పరాభవము గావించినది. తన పరాభవమునకు ప్రాయశ్చిత్తముగ, సత్యాగర్వ భంగమును, తన పారిజాతము మరల తనకు చేరుటయు జరుగవలయునని చెప్పి, శచీదేవి నారదుని సహాయము నర్థించినది. పారిజాత విషయకమైన కలహమును తాను సత్యా గర్వభంగమునకై ఉద్దేశింపగా, దానికి బదులు సరస సౌభ్రాత్ర విస్ఫురితాత్ములైన ఇంద్రోపేంద్రులకు వైరము కల్గుటయు, ఇంద్రాణి తన ప్రియమైన పారిజాతము కోల్పడుటయు, అపర రమాదేవి అవతారమగు రుక్మిణికి పదుగురిలో తలవంపులు కల్గుటచే నారదునికందువలన సాటివారిలో మొగమాటము కల్గినది. అందుచే నారదుడు ప్రణయ గర్వితయగు సత్యకు గర్వభంగము చేయింతునని వాగ్దానము చేసెను. బృహస్పతి 'తథాస్తు' అనియు, 'నారదా! ఈ కార్యంబు జక్కపెట్టి, మా యాజన్మాంత కృతజ్ఞత కాస్పదంబ వగుము' (పైది పు. 13) అని ఇంద్రుడును, సత్యా గర్వభంగము జరిగింపుమని ప్రోత్సహించిరి. సత్యలోని ప్రేమ వాంఛనీయమే యయ్యు, అది స్వార్థలాభ కాంక్షియు దేహ సంబంధి, ఐహిక సుఖార్థి యగుటచే దానిని నిస్స్వార్థమైన భక్తిగా మార్పదలచి కృష్ణుడును, నారదుని నాటకమునకు సహకరించినాడు.

ఇట్లిందరకు బాధ కల్గించిన సత్యా గర్వము నణప, అర్హురాలు రుక్మిణియే అని భావించి, శ్రీకృష్ణ నారదులిరువురును, ఆమె చేతనే సత్యకు గర్వభంగము చేయించినారు. 'పుట్టిన దినపు విందునకు పతిని రమ్మని రుక్మిణి అర్థింపగా, అన్నిటికి ఆమెతో పోటీ పడుచు తన ఆధిక్య భావము చాటుకొనెడు సత్య, మున్నెన్నడు కని విని ఎరుగని 'మెట్టిన దిన మనుచు' ఒక దానిని కల్పించుకొని, దానికి పతి వచ్చి తీరవలయునని ఆజ్ఞాపించినది. (పైది పు. 20) ఆమె పలుకులను సమర్థించు చెలుల కారణమున, ఆ గర్వము మరింత అతిశయించినది. ఆ గర్వమామెను గయ్యాళిగ చేసినది.

సత్య గర్వాతిశయము కారణముగా, జాంబవతి మిత్రవిందలు రుక్మిణి పక్షమున చేరి, రుక్మిణీదేవి ప్రార్థన నంగీకరించుట సమంజసమని వాదించినను, ఆమె ఒప్పుకొనదు. 'ఇదేటి బేలతనము! నీ ప్రేమచే నీ సపర్యలచే నాథుని యనుగ్రహము సంపాదించి నీ మనోరథంబుల నెరవేర్చు కొనవలయు గాని, పరుల ప్రార్థనలచే ఁబతిని స్వాధీను జేసికొన దలంచు వారందురా!'అని తన స్వాధీన భర్తృకతను ప్రకటించుకొనుచు, భర్తృ ప్రణయమును మాత్రము, ఎవరును పంచుకొన రనుచు, 'ఇంక నీ మాటలు, మాని, వెడలిపొమ్ము' (పైది పు. 22) అని రుక్మిణితో కఠినముగా పలికినది. అంతేకాదు. అనుదినము నీ వనుభవించు సౌఖ్యమే, యొకపూట అయినను అనుభవించిన నీకు లోపమా? అని రుక్మిణి యడుగగా "బేలా! ప్రాణేశ్వరు ప్రణయ మెంతయైనా వెక్కస మగునా?" (పు. 22) అని, పతిప్రేమ ఏ మాత్రము తనకు తనియ దనుచు, వారలకు మరింత గుండె మంటను రగుల్కొల్పినది. వారిని

నిష్ఠురములాడి అవమానించుటతో తృప్తి పడక, తన పతి వారిని మందలింపలేదని కోపగించుకొనుచు "మీరీ తూష్ణీభావము వదలకున్న నే నిందుండను" అని బెదిరించినది. అంతేకాదు పతి తన యింటికే వచ్చి తీరవలయునని బలవంతముగా లాగికొనపోవుచుండగా, అది సహింపని జాంబవతి, మున్ను సత్యగావించిన పాదతాడన వృత్తాంతమును ప్రస్తావించి, ఆ అనాగరిక చర్యను అపకర్షగా భావింపని శ్రీకృష్ణుని విమర్శించు చుండగా, సత్య "జాంబవతీ! రసికవర్యుల చర్యలు భల్లూక పుత్రికకెఱుక పడునా?" (పు. 24) అని ఆభిజాత్య గర్వముతో అనును. నారద ప్రవేశము వలనను, అతని జోక్యము వలనను, అచట ఉండలేక అసూయతో నిర్గమించుచు, చెలి నళినిని మాత్రము గూఢచారిణిగ నిల్పి యేగినది. కృష్ణునిపై ఎంత ప్రేమ ఉన్నను, ఆత్మీయతతో 'చెల్లెలా' అని పిలుచు రుక్మిణిని 'అక్కా' అని గౌరవింపలేని అవినయము, 'బ్రాహ్మణోత్తమా' అని రుక్మిణి విదూషకుని గౌరవింప, 'ధూర్త బ్రాహ్మణుడా' అని మందలించు అహంకారము, సవతుల యెడ కయ్యమే గాని, నెయ్యము చూపలేని గర్వాతిశయము ఈ సత్యభామలో నున్నవి. ఈ గర్వాతిశయము తొలగిననే ఆమెకు భగవంతుని గుర్తింపగలదు. అందుచేతనే కృష్ణుడు ఆమెకు జ్ఞానోపదేశము చేయ పూనుకొనెను. అతని ప్రేమనంతయు తానే గుత్త గొనవలయును. దానికై మార్గము నన్వేషించినది. నారదు డొకపరి యచటికి రాగా "నాపై దయయుంచి యేదైన నొక వ్రతమునో, మంత్రమునో, తంత్రమునో సెలవిచ్చి శ్రీకృష్ణు సత్యభామైక విధేయుగా నొనర్చి పుణ్యము కట్టుకొనుడు. ఇదియ మీరు నొకొనర్పవలసిన యుపకారము" అని నారదుని అర్థించి, అతని వలన పుణ్యక వ్రతవిధిని తెలిసికొని, భర్తృ దానమునకును సంసిద్ధమైనది. భర్తృ దానమునకు ముందు కొంత విముఖత చూపినను, ధనముతో గాని ధనేతరముతో గాని భర్తను తిరిగి గ్రహింపవచ్చునని తెలిసికొనిన తరువాత, ధనగర్వీత గావున "ధనములకు నాకేమి కొఱత?" అని నిర్లక్ష్యముగా సమాధానమిచ్చినది కృష్ణుని తూచుట కా ధనము సరిపోవునా అని యోజింపుమని నారదుడు హెచ్చరింప, కృష్ణుని కేవలము మానవమాత్రుడైన శృంగారపురుషునిగా భావించు సత్య అందలి పరమార్థమును గ్రహింపలేక "మునీంద్రా! నేనీ వ్రతమును జయప్రదముగా నొనర్చిన రుక్మిణ్యాదుల గతి దుర్గతి యగుననియా ఇట్లు నన్ను భయపెట్ట జొచ్చెదరు? నా దగ్గఱ నుండు ధనముతో నొక్క కృష్ణుని కాదు. కోటికృష్ణుల దూచవచ్చు." అని అజ్ఞానముతో సమాధానమిచ్చినది. పారిజాతమును కూడ దానమీయవలెనని నారదుడు అనగా, "శ్రీకృష్ణుడు నా పాలిటి పారిజాత మగుచుండ నాకా తుచ్ఛ పారిజాత వృక్షంబేల? (పు.31) అనియు అనుట సత్య ప్రణయ గర్వాధిక్యమునే చాటును. ఆ గర్వమామెలో యుక్తాయుక్త విచక్షణ జ్ఞానమును నశింపచేసినది.

సత్య కోపమును ప్రకటించి పతిని చలింపచేసి వ్రతమున కనుజ్ఞ పొందుటకై యత్నింపగా, అతడామెతో మున్ముందు దానివలన మోసము వచ్చునని హెచ్చరించు చున్నను "నాథా నారద, మహర్షివలె మీరును నాకడ నుండు ధన ధాన్యాది సంభార పరిమాణమె ఱుంగన ట్లాడెదరేల? ఇందులకు మీరవంతయు సంశయింపకుడు" (పైది పు. 45) అని ధన గర్వముతో నిర్లక్ష్యముగా అనుచు, తన వ్రతమున కడ్డు పడుదురని 'బ్రాహ్మణ్యమును తప్ప, ఏ బంధువర్గమును బిలువలేదు. తన నగలెన్ని యుంచినను త్రాసు తూగకపోవుటకు త్రాసునందు దోష ముండియుండు ననియు, శమంతకము వలన లభించిన ధనమును, సమస్త ధనమును వేయుట వలన తూగ గలదని, అజ్ఞానవశయై భ్రమపడినది. అండపిండ బ్రహ్మాండ మంతయు తన పొట్టలో దాచుకున్న కృష్ణుని, తుల తూచుట అసాధ్యమని నారదుడనగా, "మునీంద్రా! నన్నపుడు వ్రత మొనర్ప బురికొల్పి, యిప్పుడీ మాటాడ బాడియా!

అప్పుడే యితడింత బరువుండునని చెప్పరాదా?" (పైది పు. 56) అని అమాయికముగా అడిగినది. తన కత్యంత ప్రియమైన శమంతకమణి నిత్తునని, పతిని తిరిగి యిచ్చి వేయుమని నారదుని బ్రతిమాలు కొనినది. తులతూచియే యీవలెనని నారదుడు పట్టుబట్టగా, దిక్కుతోచక "నాథా నన్ను మీరు రక్షింప వలయును, తప్పు మన్నింప వలయు' 'నని (పు. 57) శ్రీకృష్ణుని శరణము వేడినది.

కృష్ణుడు భగవంతుడను సత్య మిప్పటికి గ్రహించినను, ఆ ప్రేమ గర్వితకు, భగవంతుడు ప్రేమ కన్నను భక్తికే వశుడగు నిజమును గ్రహింపవలసి యుండుటచే, నారదుడు శ్రీకృష్ణుని అమ్ము నెపమున ప్రతి వీధిని త్రిప్పుచుండెను. తన పతిని దానమిచ్చు అధికార మామె కెక్కడిదని జాంబవతీ మిత్రవిందలు గదమాయింపగా, ప్రేమాంధయై తాను గావించిన దోషమునకు పశ్చాత్తాపము ప్రకటించుచు, పతిభిక్ష పెట్టుమని అర్థించినది. కాని ఆమెలో సవతుల కన్న మిన్న యనెడు అహము మాత్రము పూర్తిగా పోలేదు. పుణ్యక వ్రతేచ్ఛారతిని చేసిన అజ్ఞానపు కార్యమును రుక్మిణికి తెల్పి ఆమెను తీసికొని వచ్చిన, అభీష్ట మొనగూడునని నారదుడనగా, తన బ్రదుకు నవ్వులపాలు చేసినాడనుచు "సవతిన్వేడగ బంచెదో" అని అహముతో, పొగిలినది. తనకు బదులు సపత్నులను పోయి అడుగు మనినది.

రుక్మిణి యొక్క శాంత క్షమా స్వభావములను జాంబవతి వివరింపగా, "ఇంకను నాకీ గర్వ మెందులకు రండు" అని (పైది పు. 70) అని విగత గర్వయై, ఆమె యింటికేగి ఆమెను అర్థించినది. హరి సమారాధనకు ప్రధానమైన ఒక్క తులసీదళముతో తూచి రుక్మిణి పతిని దాస్యవిముక్తుని చేయగా "అక్కా! నీ యుపదేశ ప్రకార మింక హరి పూజనముం బోలె దులసీ పూజనమును నిత్యమొనర్చెదను" (పైది. 75) అని ఆమె ఉపదేశమును గౌరవించినది. ఈ నాటకమున సత్యభామలోని కృష్ణప్రేమ క్రమముగా కృష్ణభక్తిగా మారును. ప్రేమకారణముగా అతిశయించిన గర్వము చివరకు వినయముగా మారును.

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు రచించిన "శ్రీకృష్ణ తులాభారమ"ను నామాంతరము గల "తులసీదళ మహాత్మ్యమ" నెడు హరికథయు పై నాటకేతి వృత్తాంతమునే కలదయ్యు, ఇందు కృష్ణుడు సాత్త్విక రాజస తామస భక్తుల విభేదమును, తన భక్తవత్సలతను, నారద సత్యభామల ద్వారా లోకమునకు ప్రకటించుటకై ఈ నాటకమునాడును.

*తే॥ సతత మెడఁబాయకను నీదు సరసనుండి*
*దివ్యసుఖ మందగా లేని దేహమేల*
*నాథ! నా ప్రాణనాథ! అనాథనాథ*
*నన్ను విడనాడ వలదయ్య నల్లనయ్య!" ...(శ్రీకృష్ణ. తులా. హరి. పు. 9)*

అని సత్య, 'భక్తి'తో కృష్ణుని ఆరాధించినను. ఆమెలో సాత్త్వికగుణము కన్నను "రాజస గుణము రాజసము చేయుట వలన ప్రణయాంధత్వమే" ప్రబలినది. పతి తన యింటికి రాక, సవతి రుక్మిణి యింట నున్నాడని తెలిసి "ఎంతటి యవమానము కలిగె? "నాకు?" అని పొగులుటయు" "ప్రాణనాథుడు నాయందఁ బాయకుండ, నెల్ల వేళల నివసింప నేదియైన, యుక్తి తోఁచిన తెల్పుమా" (పైది పు. 17) అని, నారదుని అడుగుటయు, సవతిని కూడి వచ్చినాడను రోషముతో, సవతి మాత్సర్యముతో, భగవానుడైన పతిని "మోసగాడా"! అని సంబోధించుచు, అతని నేరము లెన్నుటయు, తన శరీరమున కధికారులగు దేవకీ వసుదేవులకైనను ఆమె చేయబోవు 'దానవిషయము' చెప్పవలయునని కృష్ణుడు హెచ్చరించినను, "నాథా! మిమ్ము వీడి, నేనొక్క క్షణకాల ముండగలనా? దానమిచ్చిన యనంతరము మీ యెత్తు ధనమును తూచి యిచ్చి మరల గైకొందును. ఇంత మాత్రపు

స్వల్పపుంబనికి పెద్దల కేల తెలియ జెప్పవలయును? మీ రాజ్ఞ యిచ్చిన చాలు" నని (పైది పు. 21) ధనగర్వముతో తొందర పాటుతో పలుకుటయు సత్యభామ, మాయా మలిన సత్వ ప్రకృతినే చాటును. భక్తితో నిండిన తులసీదళమునకు కృష్ణుడు తూగుట చూచి, భగవంతుడు భక్తికే గాని తదితరములకు వశుడు కాదని గ్రహించిన సత్య, రుక్మిణీ కృష్ణుల పాదములపై పడి "పురాణ దంపతులారా! అజ్ఞాననైన నా దోసమును మన్నింపుడు" (పైది పు. 43) అని వేడుకొనుటలో ఆమెలోని గర్వాంధత తొలగినది. నిజమునకు నారదుడును, లోకమును భావించినట్లు 'సత్యభామ గర్వీత కాని ఈర్ష్యాపరవశ మోహాంధ కాని కాదు. "నారదా! నీవు తొలుత నుండియు సత్యభామ, గర్వపూరిత యనియు నీర్ష్యా పరవశ యనియు మోహాంధ యనియు భ్రమపడుచుంటివి, గాని నిజమును విచారించిన సత్యభామ విద్యానవద్య చతుషష్టికళా సమన్వీత. నిరుపమాన క్షాత్రతేజో విభాసిత. సర్వకాలము లం దెడతెగని నిష్కల్మష ప్రేమతో, నను ధ్యానించును" (పైది పు. 45) అని కృష్ణుడు సత్యభామ వైశిష్ట్యమును వెల్లడి చేసి, ఆమెపై నితరులకు గల దురభిప్రాయమును తొలగించినాడు. సత్యారుక్మిణు లిరువురును భక్తురాండ్రే యైనను, వారనుసరించిన మార్గములు వేరు. ఎవరే విధముగా సేవించినను, భగవంతుడు వారినను గ్రహించుండును. భక్తి గాక నితర మేదియు తనను తృప్తి చేయజాలదను సంగతి లోక ప్రసిద్ధము చేయవలయు ననియే, కృష్ణుడీ నాటకమును నడిపినాడు.[1] ఒకమారు సత్య పరమ భక్తురాలైన రాధను చూచి "రాధ వలె పరమ భక్తురాలు కావలయునన్న మార్గమేమి? భక్తి యొక్క ప్రభావమెట్టిది?" అని అడిగియుండుటచే, ఆమె సంశయములను తీర్చుటకును, కానవచ్చుచుండెడి యైశ్వర్యములు క్షణభంగరములను విషయ మామె కనుభవమున తెలియజేయుటకు, నీ నాటకమున కంగీకరించినాడు.[2] ఈ హరికథను బట్టి చూచిన, సత్యలోని ధన, ప్రేమ గర్వాదులు వైష్ణవ మాయామోహ జనితమే కాని సహజములు కావని యనిపించును. "ఇందు సత్యభామ జరిపిన కార్యమంతయు కృష్ణ సంకల్ప జనితమే కాని వేరు కాదు" అని కవియే అనినాడు.[3]

రుక్మిణి, సత్యభామతో తులసీ మాహాత్మ్యము నుగ్గడించుట, నారదుడు తులాభారా నంతరము తులసీదళ ప్రభావము నుతించుట చూడ, నీ హరికథ 'తులసీదళ మాహాత్మ్య' ప్రతిపాదనమె యొకే ముఖ్యాంశముగా కలదిగా తోచును. "పతిని దానమివ్వ బుద్ధి సత్యభామ కెటుల గలిగె" అనెడు త్యాగరాజస్వామికృత 'నారద గురుస్వామి' యను 'కృతి' చరణములోని వాక్యమును చూచిన, భక్తిగానమున సహితము చోటు చేసికొనిన ఈ తులాభార వృత్తాంత మెంతటి ప్రాచుర్యమును వహించినదో గ్రహింపవచ్చును.

జానపదుల చేత కూడ, సత్యభామ తులాభార వ్రతము వలన పరిభవము నొందినది. ఇందు 'తులసీదళ' మను గేయము నందు నారదుడు 'ఊహ' చేసి, సత్యభామకు గర్వభంగము చేయించును. నిజమునకు ఇందలి సత్య ప్రబంధ యక్షగానాదులలో కనిపించు విధముగ, అంత తీవ్ర గర్వ సమన్వీత కాదు. "ముందు జన్మలోన కృష్ణుడు మగడు ఔటకూ" వ్రత ముపదేశింపుమని నారదుని అర్థించినది. పతిని దానము చేసియు, అతని యెత్తు ధనమిచ్చి తిరిగి పొందుటకు ధర్మశాస్త్రము అంగీకరించునని నారదుడు చెప్పుట వలననే, వ్రత దానమున కామె అంగీకరించినది. కాని ఇంతటి పతివ్రత యైనను, జానపదులకు రుక్మిణి నచ్చినంతగా సత్యభామ నచ్చలేదు. 'ఇంతకాలమందు నుంచి మాటలేక, యున్న రుక్మిణీ

1. శ్రీకృష్ణ తులాభారము (హరికథ) - పు. 48
2. పైది - 46
3. కేతవరపు రామకృష్ణశాస్త్రి శ్రీకృష్ణతులా (హరికథ) - తొలిపలుకులు - పు. 3

చెంత నెట్లు బోదునూ' (తులసీ-195) అని సత్య బాధపడినను దానమిచ్చిన పతిని తిరిగి పొందుటకు మార్గాంతరము లేకపోవుటచే, సవతి యింటికి వచ్చి ఆమె జరిగిన దంతయు వివరించినది. జరిగిన పరాభవము చాలదని తలచిన జానపదులు,

*"యశోద తనయుడయ్యు దానమివ్వ నీకు బుద్ధి*
*యెవరు జెప్పినారతని తండ్రియుండగా*
*పట్టంపుదేవి నయిన నేను యిచట నుండగాను*
*నీకు యింత సాహసంబె వేశ్యకాంతరో"* .....(తులసీ - పు. 196)

అని రుక్మిణిచే "చివాట్లు" వేయించినారు. గర్వభంగము జరిగిన తరువాత, సత్యభామ మనసులోని కలవరమును నితర కవుల కన్న జానపదులు చక్కగా గుర్తించినారు. రుక్మిణీదేవి తులసీదళముతో భర్తను తూయించి, అచట నుండి కృష్ణునితో తన మందిరమునకు పోవగా,

*"సత్యభామ కనులయందు నీరు గుప్పుచూ*
*చెలుల జూచి మందిరంబు జేరి యొండె సిగ్గుచేత*
*జనులజూడ మనసు రాక భీతి జెందియూ* ......(పైది. పు. 197)

వీరి వలె సత్యభామను నింత తీవ్రముగ నొప్పించిన కవులును లేరు.

## రాధచే గర్వభంగము :

సత్యభామకు రుక్మిణి చేతనే కాక రాధ చేత కూడ కవులు గర్వభంగము చేయించిరి. రాధ అనగానే శ్రీకృష్ణుని, శృంగార సముద్రమున తేలి యాడించిన ఒక మధురమూర్తి కనులకు కట్టును. అసాధారణమైన అమర ప్రేమికులుగా భారతీయుల గుండెలో తిష్ఠవేసినవారు రాధాకృష్ణులు. అష్టమహిషుల కన్నను, స్వాధీన పతికయు, శృంగారరససీమ యునగు సత్యభామ కన్నను, శ్రీకృష్ణుని మనసును చూరగొన్న వనితగ, భక్తజన లోకమున విఖ్యాతి గడించినది. రాధ.

రుక్మిణిలో దాస్యభక్తి అధికము. సత్యభామలో భక్తి లేకపోలేదు. కాని అది రాజసికమైన భక్తి రాధది సాత్వికమైన భక్తిగ, పెక్కురు కవులు వర్ణించినారు. వీరి దృష్టిలో, రక్తియే పతిని అధీనుని చేసి కొనుటకు సాధనమని నమ్మి కృష్ణుని వలపును గెలుచుకొని, సత్యభామ గర్వించినది. భక్తితో ఆరాధించి కృష్ణుని మనసును వశపరచుకొని, లోకుల పూజ లందుకొనినది రాధ. మహిమాన్వితుడైన శ్రీకృష్ణుని ప్రణయ సామ్రాజ్యమును అహముతో నేలు సత్యభామ, సాత్త్వీక భక్తి నెరింగి సాత్విక గుణ సంపన్నగా మారుట అవసరమని తలచిన ఆధునిక కవులు, రాధ చేతను సత్యభామకు పాఠములు నేర్పించినారు. సత్యాగర్వభంగ మనదగు పానుగంటి లక్ష్మీనరసింహము గారి "రాధాకృష్ణ నాటకము"న, సత్య, స్త్రీరూప దుర్వాస మహర్షి, త్రికరణశుద్ధిగ కృష్ణునకు తననర్పించుకొని అతనినే దైవముగ ఆరాధించుచు, తనను దాసిగ భావించుకొను, బృందావన వాసియు గోపికయు నైన రాధ పేరు, విన్నంత, నేమాత్రము సహింప లేనట్టి అసహనమును బహుకాంతా కాంతుడైన కృష్ణుని "నా నాధుడని" తలంచు స్వార్థమును ఉన్నది.

ఇక రాధ యన్ననో కృష్ణుడనిన, దాస్యభావముతో ఆరాధించును. కృష్ణుని తన చూపులచే కాని, చేతలచే కాని, నొప్పించు టెరుగదు. అతనిని ఇతరులు నొప్పించినను భరింప లేదు.

నూతన వధువైనను, సత్యభామకు అన్ని విధముల అతిశయభావ మెక్కువ. అగ్రమహిషి రుక్మిణికి విశేష రూప సంపద లేదనియు, నేర్పు తక్కువనియు, పరిచారికలను సైతము ఆజ్ఞాబద్ధులుగ చేయ సమర్థురాలు కాదనియు ఈమె విశ్వాసము. రాధా సంబంధము కూడ,

తానప్పటికి ఆ యింటి కోడలు కాకపోవుటచేతనే ఏర్పడినదనియు, అప్పటికి తానుండి యున్నచో, అట్టిది జరుగ నిచ్చెడిది కాదనియు, భావించినది. తాను వచ్చిన తరువాత, కృష్ణుడు బృందావనమునకు వెడలక పోవుట తన సమర్థత గానే భావించి మురిసినది. తనను మించిన సౌందర్యవతి మరి యెందుండదని ఆమె బలమైన విశ్వాసము. రాధ చక్కనిదని చెలి చెప్పగానే అసూయతో గొల్లదానికి సౌందర్య మెక్కడిదని, తీసిపారవేసినది. తాను త్రిలోకసుందరి కనుకనే పెనిమిటిని వశము చేసికొన గల్గితినని ఆమె నమ్మకము. తనవంటి మహారాజ పుత్రిక, యసమాన విలాసవతి, ఈ బానిసను, సవతి యని పిలువ వలసి వచ్చెను కదా అని ఆభిజాత్య గర్వముతోను, సౌందర్య గర్వముతోను బాధపడినది.

ఎంత, పతిప్రేమ యున్నను, ఆమెకు అది ఆనందానుభూతి కన్నను పతిపై అనుక్షణము అనుమానమునే పెంచినవి. శ్రీకృష్ణనారదుల సంభాషణము రాధను గూర్చి యేమైఁయుండునని అనుమానించినది. వారి నవ్వులలోని అంతరార్థమును చెప్పలేదని హరి చెలికాడైన శారదుని చెవిపట్టి, శిక్షించి ధూర్తత్వమును చూపినది. అంతేకాదు. కృష్ణునకు తెలియదని భావించి, ప్రచ్ఛన్నముగా బృందావనమున కతనిని యనుసరించి వచ్చినది. కాని ఈమెలోని కోపమునకు అసూయకును కారణమామెలోని ప్రేమాతిశయమే అని కృష్ణుడు గ్రహించెను.

శ్రీకృష్ణుడు, రాధ కోరినట్లుగా బాలకృష్ణరూపములో దర్శనమిచ్చి

*'చెలువ! వాల్గన్నులను గటాక్షించుమిపుడు*
*వీఁడఖిల జగన్మోహన బాల లీల*
*గలుగు రాధాధినాథుఁ డో కాక ముదిరి*
*మోటయిన సత్యభామా వధూటీ పతియొ"* ...*(రాధాకృష్ణ. పు - 63)*

అని 'ముదిరి మోటయిన' అను విశేషణము తన కన్వయించుకొని చెప్పగా, చాటునుండి వినుచున్న ఆవేశపరురాలైన సత్య, ఆ విశేషణము తనకని భావించి "నేను ముదిసిన దాననా? నేను మోటగుదాననా? నీకది నవనవలాడు పడుచు కూచి యయ్యెనా?" (పు. 63) అని గయ్యాళితనమునకు దిగినది. కోపోపశమనమునకై, కృష్ణుడామె పాదములకు మ్రొక్కగా, "రోషముతో తల దన్ని" నది (పు. 64). 'అక్కా' అని అనుచు రాధ ఆత్మీయత చూపగా "ఎవతె నీకక్క? నీకంటె నేను పెద్దదాననా? నా నాథునితో చేరి, నీవు కూడ నేను ముదుసలి నని యాక్షేపించు చుంటివా?" (పు. 64) అని గద్దించినది. సత్య పతిని, పాదతాడనము చేయుటను చూచి, సహింపలేని రాధ, "అతని బాధను చూడలేను, నన్నును తన్ను" మనుచు ప్రణమిల్లగా "ఆహా! రాధ శాంతచిత్త. నేనెంత దిట్టిన నంత సౌమ్యరూపయగు చున్నది. అమిత సౌందర్యవతినను గర్వము, నేనే కాంతుని మిక్కిలిగ బ్రేమింతునను గర్వము నీమెను జూడగ నశించు చుండుటయే గాక, యీమె నా చిత్తము నేమొ ఆకర్షించు కొనునట్లున్నది" అని జ్ఞానోదయముతో పరివర్తన చెందుచున్నను, వెన్వెంటనే మానవతినను దురభిమాన ముప్పతిల్లగా, "నేను దీనితో దైన్యమున మాట్లాడుదునా?" (పైది - 66) అని యథాస్థితికి వచ్చినది. శ్రీకృష్ణుడొక్కడే పురుషుడని నమ్మిన రాధ, "సృష్టిలోని జీవితతతి యంతయు స్త్రీ తతియే. అందఱ కొక్కడే పురుషుడు" అని మధుర భక్తి సంప్రదాయమును సత్యకు బోధింపబోగా, సత్య "సర్వ సంసారచ్ఛేదకమైన యీ దిక్కుమాలిన వేదాంతము నా కొంపదీయుటకు నీకెక్కడ యబ్బినది" అని తిరస్కారముగా పలికి, "రాధా! నా నాథుని వంక జూచెదవేమి? అతని నాగుమని కనుసన్న చేయుచుంటివా? యమునలో బడి చచ్చిన యెడల, బీడయే వదలునని మురియు చుంటివా? నేను జచ్చియైన నిన్ను సాధింతును"

(పు. 67) అని గయ్యాళితనమును చూపినది. ఎంత గర్వితయైనను ఇందలి సత్య, నిజమునకు దుష్టురాలు కాదు. "ఒడలెఱుగని కోపమున నే జేసిన యపచారమును మీరు క్షమింపవలెను" (పు. 68) అని పతిని క్షమాభిక్ష వేడినది. పతి తనకు మాత్రమే స్వాధీనుడు కావలయునను స్వార్థము చేతనే, ఇతరులను బాధించు విధమున, కఠినముగ వ్యవహరించినది. గర్వభంగము లేత దశలో జరుగకూడదు. అందులకే కృష్ణుడామె గర్వము నెదుగనిచ్చి తుదకు శిరస్తాడన ఫలమును గాంచి, అప్పటికి ప్రాయశ్చిత్తార్హ పరిపాకము కలిగినదని యెంచి, దానికి భంగము చేయుటచే, ఇప్పుడామె కొంత శాంత చిత్తురాలైనది. కాని శిరస్తాడనమందలి దోషమును గ్రహించినను, పతి విషయము నందు మాత్రము ఆమె స్వార్థము పూర్తిగా తొలగలేదు.

భక్తి యొక్క పరాకాష్ఠయైన దివ్యోన్మాదమనెడు దశకు చేరుకొన్న రాధ సర్వమునందు కృష్ణునిచే గాంచుచు, యమునలో ప్రతిఫలించిన పూర్ణచంద్రుని కృష్ణునిగా భ్రమించి, అందు దుమికియు కృష్ణుని కృపచే ఆ భక్తురాలు బ్రతికినది. పతి అనుగ్రహము, పొందుటకు భక్తి యోగమే మిన్నయని గ్రహించిన సత్య, భక్తి యోగము నుపదేశింపు కృష్ణుని కోరినది. ప్రేమ స్వార్థ పూరితము కారాదని గ్రహించి, రాధను క్షమింపుమనుచు వినయముతో, భక్తి మార్గోపదేశము చేయుమని అర్థించినది. నారదుని వలన, "భక్తి లేని, జ్ఞాన పరిపాకమే లేద"నియు, 'భక్తి లేక ముక్తి లేదని'యు తెలిసికొనినది (పైది. పు.94). "ఈశ్వరుడు మహోపనిషత్సారము, అష్టభార్యలును అష్ట వైభవములు, పదునారు వేల వ్రేతలును జీవసంఘము, అందు ఉత్తమోత్తమః జన్మ రాధ" అనెడు సత్యమును గ్రహించినది. నారదు డనినట్లుగా చిరకాల శ్రమమున గాని అభ్యసింప నేరని ఈ భక్తి యోగము, భక్తాగ్రేసర యగు రాధ సంస్పర్శమున సత్యకు లభించినది. శ్రీకృష్ణుని కేవలము శృంగార పురుషునిగా భావించిన ప్రేమ గర్వితయగు సత్యభామ, రాధ భక్తి ప్రదర్శనా దర్శనముచే గర్వభంగము కల్గి భక్తురాలిగ మారినది.

## రుక్మిణిచే గర్వభంగము :

సత్యభామ ప్రణయ గర్వమునకు రుక్మిణిచే మరల మరియొక విధముగ కూడ భంగము జరిగినట్లు "శ్రీకృష్ణాతి మానుషతత్త్వ" ప్రబంధమున చిత్రింపబడినది. గర్వము ఆమె ప్రకృతిలోనే ఉన్నది. గర్వభంగ మొకమారు జరిగినను అది అణగారినదే కాని పూర్తిగా వైదొలగలే దనునట్లు ఈ ప్రబంధమున చిత్రింపబడినది. తనకన్నను మతిమంతురాలు హరి భక్తాగ్రేసర శ్రేష్ఠ యెందును లేనట్లు దలంచి, సత్య అహంకరించగా, కృష్ణుడు పరీక్షకు పూనుకొనెను. నీ హృదయ కమలము నందు నివసించు అత్యంత ప్రీతి పాత్రుడెవ్వరని ఆత్మాతిశయముతో సత్య ప్రశ్నింపగా, హనుమంతుడని కృష్ణుడు బదులిచ్చెను. అంతట కృష్ణునకు బదులు తానే, గరుత్మంతునితో, "కృష్ణుడు పిలిచినాడని చెప్పి హనుమంతుని తోడ్కొని రమ్మని" అధికారముతో ఆజ్ఞ నిచ్చి పంపినది. రామాకృతి నొకదానిని గాక యన్యము తలపని 'పావని', రా జాలనని కుపితుడై పలుకగా, గరుత్మంతుడు తిరిగి వచ్చి, సత్యభామకు అది యెరింగించును. శ్రీకృష్ణుడామెకు గర్వభంగము చేసి జ్ఞానోదయము కల్గింపదలచి, సీతారాముడు రమ్మని పిల్చెనని "పావని"తో చెప్పుమని, గరుత్మంతుని తిరిగి పంపును. రామలక్ష్మణులుగా తానును, బలరాముడును, రూపములు ధరింపగలమనియు, సీతగా సత్యభామ కనిపింపవలెననియు, లేనిచో హనుమంతుడు 'పురిని వార్ధిలో కలుప గలడనియు హెచ్చరించును. ఎంత ప్రయత్నించినను, సీతా స్వరూపము పొందలేకపోవుటచే, రానున్న ప్రమాదమును తలచి, భయపడి, తమ దోషమును గ్రహించి, చివరకు అసూయను విడిచి రుక్మిణి 'పదారవిందములను పట్టి', 'నీవ తప్ప గతి యెవ్వరు లేరనుచు' శరణాగతురాలై ప్రార్థించి, "నాథుని గౌరవంబు బుర రక్షా భిక్ష వీక్షింపవే" (5-2-150) అని ప్రాధేయపడినది,

ఇట్లు రుక్మిణిచే సీతారూపము ధరింపచేయుటచే సత్యభామలో ప్రణయగర్వభంగము జరిగినట్లు వర్ణింపబడగ, "వాసా లక్ష్మీనారాయణరెడ్డి వ్రాసిన "శ్రీ హలధరు గర్వ భంగము" (గాంధారగాథ) అను హరికథయందు పై వృత్తాంతమొకింత మార్పుతో సత్యభామా "సౌందర్య ధన ఆభిజాత్య గర్వ భంగములకై ఉద్దేశింపబడినట్లు చిత్రింపబడినది. సర్వాలంకృతయు, లావణ్య విలాసవతియునగు సత్యభామ దర్పణమున తన రూప సందర్శనమునకు తానే పరవశించి పోయి తన పతి, భగవానుడను సత్యమును విస్మరించి, సౌందర్య గర్వముతో

*"ఎంతటి నోముల నోచితి*
*నింతులలో నెవ్వరేని నిట్టికురూపిన్*
*కాంతునిగా బడసిరె మున్*
*పొంతకు, రానీయ బుద్ధి పుట్టదునాకున్"* ..*(శ్రీహలధరు గర్వభంగము -హరి-పు.8)*

అని పతిని నిందించుచుండినది. 'సత్యా వచ్చితి' నని ప్రియమార పలుకరించుచు, పతి చేరువకు వచ్చి ప్రేమను ప్రకటించినను పలుకదు.

సత్యకింతటి గర్వముండుటకు, తండ్రి యిచ్చిన 'స్యమంతకమే' కారణమని గ్రహించిన కృష్ణుడు ఆమెకు గర్వభంగము చేయవలెనని నిశ్చయించుకొనినాడు. తనను మించిన బలవంతులెవరు లేరని బలగర్వముచే వర్తించు బలరామునకును, 'సుగమనాత్ముడను' గర్వముచే, తన స్వామినే, తనను మోయుమని యడుగు గరుత్మంతునకును, ధన, సౌందర్య గర్వితయగు సత్యభామకును, హిమవంతమున కుత్తుర దిశ యందు రామధ్యానమగ్నుడైన రామభక్తుడగు హనుమంతుడే గుణపాఠము నేర్పగలడని నిశ్చయించి, ఆ కార్యనిర్వహణకు నారదుని సహాయము నర్థించినాడు. రాముడుండుగా వేరొకడు 'బలరాముడు' కాలేడను హనుమంతుని మాటలకు కోపించి, బలరాముడాతనిని నెదిగించుటకు, 'ఘనులగు యాదవ బలము నంపగా, హనుమంతుడు వారినందరిని వాలమున గట్టి సాగరమున వీచి, బలరాముని బల గర్వమునకు భంగమును కల్గించినాడు. కృష్ణా దేశమున గరుత్మంతుడు, హనుమంతుని దగ్గరకు పోయి బలరాముడు రమ్మనెనని పిలువగా, 'బలరాముడెవ్వడని' కోపముతో, ఆ రామభక్తుడు, అతనిని చెంతకు 'బిలిచి' వింతగ మోదగా', గరుడుని గర్వమంతట నంతరించినది. ఇక సౌందర్య గర్వితయైన సత్యభామకు గుణపాఠము నేర్పు నుద్దేశముతో గరుత్మంతుని నంపి, పట్టాభిరాముడు పిలువ రమ్మనెనని, తోడ్కొని రమ్మనగా, హనుమంతుడా తనిని ననుసరించుచు వచ్చి, వీణను తన చెంతనుంచిన నారదుడు తిరిగిరాకపోవుటచే అతనికి గరుత్మంతుని యెడ కూడ సందేహము కలిగి, తన భూరివాలమును అతని వెంట నంప, దానిని చూచి భీతిల్లి, కృష్ణుడు రాముని రూపమును, నితర జనులు అతని సోదరుల పరిజనముల రూపమును పొందగా, 'సీత లేని కొఱత' తీరుటకు', "నీవు తక్షణంబపోయి, సత్యను సీతగా రమ్మని చెప్పు" మని గరుత్మంతుని యాదేశింపగా, అతడుపోయి, అష్టభార్యలున్నను సత్యనే పిలిచి నాడనుచు ఆమె అహమును పెంచెను. ఆమెయు నంతిపురిం జేరి యిరుగు వారి నడుగ, వారు సీతవేషము యుగధర్మము ననుసరించి యుండునని చెప్పగా, నామె "వెంటనే జడలు ధరించి, నారచీర గట్టి పసుపు మేనెల్ల పూసి కుంకుమ నుదుట దట్టముగ నలది, భూషణములు మార్చు జేసికొని" రఘువరుని రూపమున నున్న కృష్ణుని కడకు వచ్చినది. అంత శ్రమించి యలంకరించు కొనినను, ఆమె మనసులో రాజసగుణము ప్రభుత్వము చేయు కతమున, సాత్వికురాలైన సీత రూపమును సాధింప లేకపోయినది.

ఆమె రూపధారణను చూచి హరి పరిహసింపగా, సత్యభామ 'తా సీతను కాజాలనని భీతిచెంది", "సీతాభామగా నేర, నా తప్పును క్షమియింపుమా" (పైది పు.26) అని అర్థించినది

గరుత్మంతుని, రుక్మిణి చెంతకంపి, పిలిపించును. సత్యభామ ఎంతగానో శ్రమించియు పొందలేని సీతారూపమును సత్త్వగుణ ప్రధానయగు రుక్మిణి, అనాయాసముగ సాధించినది. ఇందు సత్యభామకు కృష్ణుడే గర్వభంగము చేసి, రుక్మిణి వలన గుణపాఠమును పరోక్షముగా బోధించినాడు.

జానపదులు 'చెంచీత కథ' అను పాటయందు సత్యను గూర్చి చెంచితచే ఎత్తిపొడుపు మాటలనిపించి, ముదమొందినారు. శ్రీకృష్ణుని లాలన పాలనలచే, సత్యభామ మొదలగు కాంతలెల్ల మదిని గర్వించి, శ్రీకాంతునితో మాటలు చాలించి, యుండగా, వారి గర్వ మడపదలంచి, వారికంటె హెచ్చైన దానిని తెత్తునని ప్రతిన బూని, 'చెంచిత' నొకదానిని వివాహమాడి తెచ్చినాడు. సత్యభామాది సవతులెల్లరు ఆ సతిని చూచి, వెరగంది కోపముతో, "పుల్లు దుప్పుల వెంట తిరుగు, ఆ చెంచిత తమతో సమానము కాదని, వాదులాటకు దిగగా, చెంచిత యూరకొనక, తల్లిదండ్రుల మాటలెక్కించక, తన అన్నకు తలవంపు తెచ్చినదని మగనిని బలవంతముగ పిలిపించుకున్నదని రుక్మిణిని ఎకసెక్కమాడినది. సత్యభామను మాత్రము ఒక్కమాటతో విడువలేదు. "చంచలాక్షి పారిజాతము కయి మగని వంచనా చేసినా డెరుగవా" (చెంచీతకథ - పు - 190) అని పారిజాతాపహరణము నాటి సత్య మానినీత్వ ప్రదర్శనను వంచన యని కించపరచినది. తమతో చెంచిత సాటి గాదను సత్యభామతో

"రోసముతో నెన్ని వేసాముల్వేసినా సాటి యౌదువే భామినీ " (పైది పు. 191) అని పారిజాతమునకై సత్య పూనిన అలుకను వేషమని ఎగతాళి చేసినది. వివాహవిషయమున రుక్మిణి సాహసమును జానపదులు మెచ్చకపోయినను, నొచ్చుకొనలేదు. కాని పారిజాతాపహరణ విషయమున సత్యభామ వర్తనమునకు కోపగించుకొనిన జానపదులు, ఏదో ఒక పాత్ర నెపమున ఆమెను విమర్శింపక మానలేదు.

జానపదుల దృష్టిలో సత్యభామ 'గర్విష్టి'. రుక్మిణిపై వీరికున్న గౌరవము, సానుభూతి సత్యపై లేదు. ఆ మహానుభావురాలగు రుక్మిణీదేవికి అర్హమైన పారిజాతము, సత్యకు దక్కుట వీరికి నచ్చలేదు. పురాణేతిహాస ప్రబంధ నాటక కవులు పారిజాతమును, సత్యభామ పెరట నాటించి, దానిని ఆమె సొంతము చేసినను, ఆ దివ్యపుష్పములను ఆ 'అహంకారి' అనుభవించుట జానపదులకు మాత్ర మిష్టము లేదు.

*"చిగుళ్ళు ఆకులతోనూ మొగ్గలుపువ్వులతోనూ*
*కాయలు పండ్లూ తోటి చెట్టూ వికశించీయుండే*
*వట్టి మ్రాను క్రిందా పట్టెమంచంవేసీ చెలికత్తెలతో*
*సత్యభామా తాపవ్వళించి యుండే"* ......*(పారుజాత తరు పల్లవి-పు-24)*

కాని *"పూచిన పువులన్నీ రుక్మిణి కడకపుడూ వెళ్ళే*
*తుమ్మెదలయి, పువులు అన్నీ రుక్మిణిపయి వ్రాలే"* *(పైది)*

ఇట్లు చెట్టును సత్యకు దక్కించినను, పూవులను మాత్రము రుక్మిణి పరము చేసి తృప్తిపడినారు. కాని అంతటితో ఆగక "వేశ్యాకాంతవు గనుక నీవు పువులన్ని ముట్టరాదు అంటరాదు" అని కృష్ణునిచే వేశ్యయని తిట్టించినారు. "చివరకు నీకు మిగిలినది. వట్టిమాను, యీ రవ్వాయేలనీ" అని నారదునిచే సత్యభామను ఎగతాళి చేయించి, సత్యభామకు సరియైన గర్వభంగ మయినదని సంతసించినారు.

# ఆరవ ప్రకరణము
# సత్యభామ - ఆలంకారిక సమన్వయము

## నాయికా లక్షణములు :

ఒక స్త్రీ పాత్ర చిత్రణము చేయునపుడు కవులు వర్ణించిన ఆమె స్వరూప స్వభావాదులనే గాక, ఆ పాత్ర ఆలంకారికముగ, తీర్చి దిద్దబడిన విధమును కూడ శాస్త్రదృష్టితో పరిశీలింప వలసియున్నది. మొదట, నాయికా భేదములను, అవస్థా భేదములను గూర్చి చర్చించిన పిమ్మట సత్యభామ పాత్రమున కవ్వానిని అన్వయించుట జరుగును.

భానుసూరి వ్రాసిన రసమంజరి స్వీయ, పరకీయ, సామాన్య భేదములచే నాయికలు ముప్విధములని నిర్దేశించినది.[1]

భర్తయందు మాత్రమే ప్రేమ కలది స్వీయ అనియు[2], ఇతరులకు తెలియకుండ జారుని యందనురాగము కలది పరకీయ అనియు, ఇది మరల కన్య, పరోఢ అని రెండు రకములనియు, మరొకనిపై ఇష్టము చూపునది పరోఢ అనియు, తండ్రి అధీనములో నుండునదియు, వివాహము కానిదియు, కన్య అనియు,[3] ధనము మాత్రమే నిమిత్తముగ సకల పురుషుల యందును ప్రేమగలది "సామాన్య" అనియు రసమంజరి చెప్పుచున్నది4.

*"సమాన కులశీలేన యోనోఢావహ్నిసాక్షికం సా స్వీయా" (భా. ప్ర. 4 - 211)*

అను "భావప్రకాశనకారుని" నిర్వచనమును బట్టి సమాన కులశీలములు కల వరుడు, వహ్నిసాక్షికముగ వివాహము చేసికొనినచో ఆమె స్వీయ యగునని గ్రహింపనగును.

*"నముంచతి, ప్రియం స్వీయా సంపత్స్వపి విపత్స్వపి" (భా. ప్ర. పైది 4 - 213)*

*"శీల సత్యార్జవోపేతా రహః సంభోగ లాలసా" (పైది.4 - 214)*

అనగా స్వీయ, సంపదలలో గాని, ఆపదలలో గాని ప్రియుని విడనాడదు. శీలము, సత్యము, ఋజుత్వములతో కూడియుండును. రహః సంభోగ లాలసగ నుండును.

సత్యభామ సమాన కులశీలములు గల వరుడైన కృష్ణుని, అగ్నిసాక్షిగ వివాహ మాడినట్లును, వినయము, ఋజుత్వము మున్నగు గుణములు కల్గియున్నట్లును, శాస్త్రములందు చెప్పబడిన పతివ్రతా ధర్మముల నాచరించి యున్నట్లును వివిధ సాహిత్య ప్రక్రియలందంతటను వర్ణింపబడి యుండుటచే సత్యభామ, పై ఆలంకారిక లక్షణానుసారము "స్వీయ"యే యగుచున్నది.

స్వీయ, "ముగ్ధ, మధ్య, ప్రగల్భ" అని మూడు విధములు[5], ప్రగల్భయు మానము అనగా ప్రియుని అపరాధమునకు కోపము దాల్చునపుడు ఒక్కొక్కతెయు ధీర, అధీర, ధీరాధీర అను భేదములతో నొప్పుదురనియు,[6] ధీరాధీరాదులు జ్యేష్ఠ, కనిష్ఠ భేదములచే ఒక్కొక్కరు మరల రెండేసి విధములుగ, భాసింతురనియు[7] తెలియుచున్నది. సత్యభామ మానవతియై ప్రవర్తించు ఘట్టములందు ఈ ధీరాధీరాది భేదములు సాకల్యముగ వివరింపబడును.

---

*1. "వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్" ప్రచురించిన రసమంజరి ఇచట ఆధారముగ స్వీకరింపబడినది. రసమంజరి - ప్ర. 1. - పు - 4*
*2. రస - పైది - 1- పు - 4*
*3. పైది - 1 - 24*
*4. రసమంజరి - 1 - పు - 34*
*5. రసమంజరి - 1 -పు - 5*
*6. పైది - 1 - పు - 13*
*7. పైది - 1 - పు. 20*

ఇట్లు స్వీయ భేదముచే నొప్పు పదునారుగురు నాయికలును మరల ఎనిమిదేసి దశావిశేషములచే ప్రోషితభర్తృక, ఖండిత, కలహాంతరిత, విప్రలబ్ధ, విరహోత్కంఠిత, వాసకసజ్జిక, స్వాధీనపతిక, అభిసారిక అని, ఎనిమిది విధములగుచున్నారు.[1] ఇట్లు వీరు నూట యిరువది యెనమండుగు రగుచున్నారనియు, మరల అందు ఉత్తమ, అధమ భేదములు లెక్కించినచో మున్నూట యెనుబది నాలుగు భేదము లేర్పడుననియు తెలియుచున్నది.[2]

*వరుఁడు కైవసమైన వనిత స్వాధీన భ*
*ర్తృక, ప్రియాగమవేళ గృహముఁదనువు*
*సవరించు నింతి వాసకసజ్జ, పతి రాక*
*తడవుండ నుత్కంఠఁదాల్చు నింతి*
*విరహోత్క, సంకేత మరసి నాథుడు లేమి*
*వెస నార్తయౌ కాంత విప్రలబ్ధ,*
*విభుడన్యసతి బొంది, వేఁకువ రాఁగుందు*
*నబల ఖండిత, యల్క నధిపుఁదెగడి*
*అనుశయము జెందు సతి కలహాంతరిత, ని*
*జేశుఁడు విదేశ గతుఁడైనఁగృశతఁదాల్చు*
*నతివ ప్రోషిత పతిక, కాంతాభిసరణ*
*శీల యభిసారికాఖ్యయై చెలువు మెఱయు"* ....(2-40)

అని కావ్యాలంకార సంగ్రహము అష్ట విధ శృంగార నాయికా లక్షణములను నిర్వచించినది.

ఈ అవస్థా భేదములే గాక, జాతిని బట్టి నాయికలు పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని, భేదములచే మరల నాలుగు విధము లగుచున్నారు.

శృంగార రస ప్రధానములైన పారిజాతాపహరణ, సత్యభామాసాంత్వనాది ప్రాచీన ప్రబంధములందును, సాత్రాజితీ పరిణయము, సత్యభామా వివాహము, సత్యభామా - కృష్ణ సంవాదము, శుద్ధాంధ్ర పారిజాతాపహరణము మున్నగు ఆధునిక ప్రబంధములందును, భామాకలాపమునందును, సతీపతిదానవిలాసము, రుక్మిణీ సత్యభామా సంవాదము, విష్ణు పారిజాతము మున్నగు యక్షగానముల యందును, శ్రీకృష్ణతులాభారము, నరకాసురవధ, దీపావళి, రాధాకృష్ణ, పారిజాతాపహరణము మొదలగు నాటకముల యందును, సత్యావివాహము, తులసీదళ మాహాత్మ్యము మొదలగు హరికథల యందును, శ్రీ పారుజాత తరు పల్లవి, సత్యభామ సరసము మొదలగ గల కొన్ని జానపద గేయము లందును సత్యభామ నాయిక.

వీని యందలి ఈ నాయిక ఆ యా సందర్భములందు అభినయించెడి అష్ట విధ నాయికావస్థలను, లక్ష్య లక్షణపురస్సరముగ ఇచట అన్వయింపబడును.

పైన పేర్కొనిన గ్రంథములందే గాక, భారత, హరివంశ, ఉత్తర హరివంశ, భాగవత, విష్ణు, బ్రహ్మ, పద్మ పురాణాదుల యందును, జైమినీ భారతము నందును, విష్ణు మాయానాటక, విజయ విలాసాది ప్రముఖ ప్రబంధములందును, బాలకృష్ణ లీలావిలాసాది యక్షగానము లందును, కొన్ని నాటక, హరికథ, జానపద గేయము లందును, సత్య పాత్ర చిత్రితమై యున్నది. కాని వీని యందలి సత్య, శృంగార నాయిక కాకపోవుటచే, ఆమెకు

1. *రస - 2 - పు - 44*
2. *పైది. 2 - పు - 44*

పైన వర్ణింప బడిన నాయికా లక్షణము లన్నియు నన్వయింప వీలుపడదు, కాని ఆ యా సందర్భములందు సత్య ప్రవర్తనను అనుశీలించుచు, ఆమె పొందెడు అవస్థా భేదమును బట్టి ఆమె స్వాభావిక ప్రవృత్తిని కూడ నిర్ణయింపవచ్చును.

శ్రీకృష్ణుడు బహుపత్నీకుడగుటచే సత్యభామ ఆ యా సమయములందు భిన్నభిన్న అవస్థా భేదములను పొందుట జరిగినది. ఆ యా గ్రంథములం దాయా ఘట్టములలో గోచరించెడు సత్యభామ, లోనగు అవస్థా భేదములను శాస్త్ర దృష్టితో పరిశీలించుచు ఆమె వస్తుతః "స్వాధీన పతిక" అని నిరూపించుటయే ప్రకృతోద్దేశము.

## పురాణేతిహాసములలో :

మొదట పురాణేతిహాసము లందలి సత్యభామను పరిశీలింతము. వీనియందు సత్యభామ నాయిక కాకపోయినను, ఆ యా సందర్భముల యందలి ఆమె ప్రవర్తనను బట్టియు, ప్రదర్శితములగు గుణ విశేషములను బట్టియు, ఆమెకు ఈ నాయికా లక్షణముల నన్వయింపవచ్చును. .

భైరవకవి హరివంశమునందు మాత్రమే, సత్య స్వాధీన భర్తృకతయే గాక ఆమె ఇతర అవస్థా భేదములు కూడ వర్ణింపబడగ, ఇతర పురాణేతిహాసములన్నిటి యందును సత్యభామ కేవలము "స్వాధీనపతిక" గ మాత్రమే చిత్రింప బడినది. బహుపత్నీకుడైన కృష్ణుడు సత్యాకాంతకు మాత్రము ఇతర కాంతలకన్నను అధికముగ చనవులిచ్చి, ప్రత్యేకమైన అనురాగమును చూపి ఆమెకు తానధీనుడనునట్లు ప్రవర్తించుట పురాణేతిహాసము లందంతటను కనిపించును. మూలములందు కన్నను అనువాదములందు సత్యభామ స్వాధీన భర్తృకత మరింత ప్రకాశమాన మగుటయు అందందు గమనింపగలము.

*"కాంతో రతి గుణా కృష్టో న జహాతి యదన్తికమ్*
*విచిత్ర విభ్రమాసక్తా సాస్యాత్ స్వాధీన భర్తృకా" ...(సా. ద. - 3 - 114)*

అనెడు లక్షణానుసారము, కాంతుడు రతి గుణాకృష్టుడై ఎవతె చెంతను పాయడో, విచిత్ర విభ్రమాసక్తయగు ఆ నాయిక స్వాధీన పతిక యగును.

భారతమునందు, శ్రీకృష్ణుడు అరణ్యావాసము చేయుచున్న పాండునందనులను చూడదలచిన వాడై "ప్రియంబున సత్యభామా సమన్వితముగ" (అరణ్య - 4-152) పోవును. బహుకాంతా కాంతుడయ్యు కృష్ణుడు సత్యభామను మాత్రమే, అందును "ప్రియమున", వెంట నిడుకొనిపోవుట, అతడామె నేవేళ బాసియుండలేడను విషయమునే నిరూపించును.

సత్యభామ "కృష్ణవల్లభ" (భార. అరణ్య. - 5 - 290), "కృష్ణ భామిని" యయ్యు (పైది - 5 -293) బహుసపత్నీయుత యగుటచే, తననాతడు వీడునేమో యనెడు భయ మెల్లవేళల వెంటాడుట వలన, "కమలదళాక్షుం బూని వశగతుని జేసి యనూన స్నేహానుభావయుక్తి దలిర్ప" వలయు ననెడు ఆశతో, ఐదుగురు పతులను తనయెడల నను రక్తులగునట్లు చేసికొని స్వాధీనపతికయై వర్తిల్లు ద్రౌపదిని చూసి ఆమె విశేష సౌభాగ్యమునకు హేతువేమని అడిగినది. కృష్ణుని ప్రియభామినియై వర్తిల్లు సత్య నిజమునకట్లు అడుగవలసిన అవసరమే లేదు. "వాసుదేవుండును బ్రియాసహితంబుగా రథారూఢుండై ద్వారవతీపురంబున కరిగె" (పైది 5 - 324) నని సత్యను, కవి, కృష్ణ ప్రియగానే పేర్కొని సత్య స్వాధీనపతిక యనుటను సూచించినాడు.

ఎఱ్ఱన హరివంశమునందును, నాచన సోముని ఉత్తర హరివంశమునందును సత్యభామ స్వాధీన భర్తృకత స్పష్టముగ వెల్లడియగుచున్నది.

తన తండ్రియగు సత్రాజిత్తును, శతధన్వుడు మణిమీద ఆశచే, వధించి, మణి నపహరింపగా, సత్యభామ ఆ విషయమును వారణావతమున నున్న హరికినెరింగింప, హరియు "అవ్వామనయన మనసుల్తో నున్న యుమ్మలికయు మానెడు పంతంబు మాటలొక్కింత కొఱత వడంక యుండగఁబలుకుటయే గాక (హరి. పూ. భా. - 3 - 205), అపకారిని పట్టి చంపి (పైది - 213), సతికి సాంత్వనమును కల్గించినాడు.

అనికైనను నీమెను బాసిపోవడు నరకునితో యుద్ధమునకేగు తరి,"సత్యభామను రావించి తత్సహితుండై" పోయెనని హరివంశమును (ఉ. భా. 4-125),"అప్పుడ సత్యభామతో" "నేగె" నని ఉత్తర హరివంశమును (1-138), చెప్పుచున్నవి. వీరవనిత యగు సత్యభామకు యుద్ధాసక్తి యున్నది. ఆ విషయ మెరిగిన వాడు కావుననే, యుద్ధము చేయుచు, తా నలసిపోయిన సమయమున, ఈమెను చూచి "చంద్రవదన, శార్ఙ్గమిందు, నీవు సమరంబె కోరుదు, నవసరంబువచ్చె..." అని, సతి ఆశయానుసారముగ విల్లునిచ్చి, రణమునకు ప్రోత్సహించును.

"సదా సాకూతా జ్ఞాకర ప్రియతమా స్వాధీన పతికా" ... (రస - 2 - పు - 74) అనెడు రసమంజరి లక్షణానుసారముగ, ఎప్పుడును సాభిప్రాయములగు సంజ్ఞలచే నెరుకవడు నాజ్ఞలను నెరవేర్చెడు ప్రియతముడు కలది "స్వాధీనపతిక", అని తెలియుచున్నది. హరి, సత్యభామ మనసులోని కోరికను గ్రహించి, ఆ మనోరథసిద్ధికి ఒక అవకాశమును కల్పించి, ఆమెకు ప్రియమును కల్గించుటచే ఇచట ఆమె, పై లక్షణానుసారము స్వాధీనపతికయే యగును.

అష్ట మహిషులలో శ్రీహరి ప్రియసతి సత్యభామ. కావుననే "అఖిలలోక రక్షకుని చెల్వ" (హరి. ఉ. భా. 4 - 164) అని కవిచే వర్ణింప బడినది. నరకునితో పోరు సమయమున సత్యను చూచిన, ఆ అసురుడు "ఈ వారిజ నయన యెవ్వ రేర్పడ జెపుమా" అని అడుగ, "ఈ భామ, సత్యభామ యనునది, మదీయ ప్రేయసి" (పైది 4 - 152) అని కృష్ణుడు గర్వముతో చెప్పుకొనుటయు అతని సత్యా ప్రియత్వమునే తెలియపరచును.

విరోధులు వెరచునట్లు, ఖేచరులు ప్రశంసించునట్లు యుద్ధము చేసిన సత్యను చూచి "ప్రీతుడై పీతాంబరుడు," ఆమెను కౌగలించుకుని చెక్కిళ్ళపై గల చెమటను తుడిచి, అలసిపోతివి చాలు ననుచు తన మెడలోని హారమును తీసి ఆమె మెడలో వేసి సతిని అలరించెను. హరికి కౌస్తుభాభరణము కంటెను ప్రియమైనది, అఖిలలోక విఖ్యాతమై, వెల వెట్టరాని పెంపుల దనర్చునట్టిది, తన కాంతితో జగతి నెల్లనాడు జనాలోక చంద్రికగా చేయునట్టిది, ముఖ్యముగ రుక్మిణి యంత యదియు దొల్లి "కాంక్షించి యెన్నడు గాన లేదు" (హరి-4-171), అట్టి నేవళంబీనాడు,తలవని విధముగ సత్యభామకు దక్కినది. ఇదిసత్యభామ స్వాధీన భర్తృకతనే నిరూపించుచున్నది.

"ఉత్తర హరివంశము" నందును సత్య యిట్టి అదృష్టవంతురాలుగనే కనిపించును.ఈమె వీర సాహసములకు మెచ్చిన పతి "లాలిత కంఠాభరణముతో నతివకు లీలాపరీరంభము" నిచ్చినాడు. ఆపదకమునకై పట్టమహిషి యగు రుక్మిణి మున్ను నుపేంద్రుని "ఏచు" చుండెడిదట. అతడును పలువిధములుగ తప్పించుకొను చుండెను. "అట్లు డాచిన సొమ్ము", ఈనాడు "ఇచటన్ మదిఁగోరని సత్యభామకున్" చేరినది (పైది 1-168). "నోఁచిన వారి సొమ్ములవి నోమని వారికి వచ్చునే ధరన్" అని లాలిత కంఠాభరణమును పొందినసత్యా సౌభాగ్యమును, కవి ప్రశంసించుటయు, సత్య స్వాధీన భర్తృకతనే సూచించుచున్నది.

*"మధురానువర్తి యగు తన*
*యధిపతిచే నెప్పుడర్పితాభరణాదిన్*
*బ్రధిత యగుచుండు కోమలి*
*కథిత స్వాధీన భర్తృకా సంజ్ఞయిలన్"* ..... *(కా. చూ. 3 - 58)*

అనెడు "కావ్యాలంకార చూడామణి" నిర్వచనమును బట్టి, ఇచట సత్యభామ స్వాధీన పతిక యనుట స్పష్టమగుచున్నది.

ఇట్లు సత్య కోరని భాగ్యములను కూడ పొందగల్గుచుండగ, ఇతర కాంతలు కోరియు, కొన్నిటిని పొందలేకపోవుటయు, హరివంశాదుల యందు కనిపించుచున్నది. ప్రద్యుమ్నుని పొందిన తర్వాత, రుక్మిణి తనకు మరొక పుత్రుని కూడ ప్రసాదింపుమని కోరగా, కృష్ణుడు "....... ఓ, వనజదళాక్షీ! నీకుఁదగవా యిటులాడుట నన్ను నీవె వేఁడిన నటు చేయకుండుట ఘటిల్లునె.." (ఉ. హరి. 2 - 79) అని అనును. కృష్ణుడును ఆమె కోరికను నెరవేర్చుటకై తపము చేయగ, శివుడు ప్రత్యక్షమై మన్మథుని ప్రద్యుమ్నుడను పేర నీకు ప్రథమ పుత్రునిగ అనుగ్రహించి యుంటిని కదా, అని అనుటచే, రుక్మిణి కోరిక తీరక, యటులే యుండిపోయినది. అట్లే హరివంశమునందును రుక్మిణి, పుత్రకాంక్ష తీరక నిరాశ చెందినట్లు చిత్రింపబడినది.[1]

కృష్ణుడు శివుని ప్రార్థించియు పుత్ర సంతాన వరమును పొందలేకపోవును. రుక్మిణి సంతానమును కోరి ప్రార్థింపగా, కృష్ణుడందులకై కైలాస గిరికిపోయి పండ్రెండు సంవత్సరములు తపము చేసి తిరిగి వచ్చెను. ఇది రుక్మిణీకృష్ణులకు సంబంధించిన ఆంతరంగిక వ్యవహారము. ఇతరులకు, ముఖ్యముగ ఇతర సపత్నీ కాంతలకు నెరింగింప అవసరము లేని విషయము. కాని కృష్ణుడు ఇతర వృత్తాంతములతోపాటు, కైలాస యాత్రాప్రసంగమును, పార్వతీపతి వలన తాను పొందిన ఒక వరమును గూర్చియు, "సత్యభామా రుక్మిణుల సన్నిధిని" నెరింగించెను. (ఉ. హరి. 3-108). ఇట్లు అగ్రమహిషియగుట వలనను, ఆమె మనోరథసిద్ధికొరకే తాను తపమున కేగి యుండుట వలనను, ఆమెకా విషయముల నెరింగించుట సమంజసమే. కాని ఆమెతో పాటు సత్యభామకును చెప్పుట, అతడు సత్యకు ప్రత్యేకమైన స్థాన మిచ్చినాడను అంశమునే స్థిరపరచు చున్నది.

సత్య పతి హృదయమునం దాక్రమించుకొనిన స్థానమును గాని, ఆమెకుగల భర్తృ వాల్లభ్యము కాని, అగ్రమహిషియే కాదు, అష్ట మహిషులలో మరెవ్వరును పొందియుండ లేదనుట, ఉత్తర హరివంశము నిరూపించుచున్నది. హంసడిభకుల రాయబారిగ కృష్ణుని కడకు వెడలి, తిరిగి వచ్చిన, విప్రుడైన జనార్దనుడు, హరి కొలువు నందలి విశేషములను వారికి నెరింగించునపుడు, మూల హరివంశమున, భీష్మక తనయ యైన రుక్మిణీ దేవితో కలిసియున్న కృష్ణుని చూచితిని అని, అనినట్లుండగ,[2] ఉత్తర హరివంశమున

*"సత్యభామా సఖీ కటాక్షముల గముల*
*జూరగొనుచున్న దేవకీ సుతునిఁగంటి"* ......*(ఉ. హరి - 4-181)*

అని యున్నది. ఈ ఘట్టమున మూలమునకన్నను, అనువాదమునందు కృష్ణుడు సత్యా వల్లభుడుగ ధృవీకరింపబడినాడు. సభామండపమునందున్నను, సత్యభామ పైనే ఆ బహుకాంతావల్లభుని చూపులు నిలచుటయు, ఆ సభ యందు సత్య తప్ప, మరియొక కాంత లేకుండటయు, సత్య స్వాధీన భర్తృకతనే చాటును.

---

*1. హరి - ఉ. భా - 6 - 59*
*2. సం. హరి. భ. వ. - 117 - 8*

అమరమాతచే "వనితల కెల్ల నెక్కుడనవాలిన పేర్మి వహించు"నట్టిదని ప్రశంసింప బడుటకును "అనన్య విలాస మెలర్ప నిత్య యౌవన రుచి నొప్పుఁగాత" యని (హరి. ఉ. భా. 4 - 211) వరమును పొందుటకును కారణమీమె సౌభాగ్యమే. పతి స్వాధీనుడగుట వలననే అట్టి సౌభాగ్యము కల్గినది.

*"దేవీ, నీహృదయేశుఁడు*
*దేవ సమానుఁడు సమస్త దేవనివహావి*
*ప్లావకుని నరకుఁగూల్చిమ*
*హా విక్రమ కేళిఁద్రిజగదభయం బొసఁగెన్" ....(హరి. ఉ. భా. 4 - 205)* అని శచీదేవి సత్య ముందు, కృష్ణుని ప్రశంసించును.

పైకి కృష్ణుని పరాక్రమమును స్తుతించుచున్నట్లు కనిపించుచున్నది కాని నిజమున కిచట శచి సత్య సౌభాగ్యమునే ప్రశంసించుచున్నది. దేవ లోక కంటకుడైన నరకుని చంపి, ముల్లోకుల భీతిని పారద్రోలిన ఆ మహావీరుని ప్రియభార్య యొక్క సౌభాగ్యము చూచిన శచికి, ప్రశంసాభావముతో పాటు కించిత్తు అసూయకూడ కల్గియుండును. బహువనితా వల్లభుడైన "కృష్ణుని గూర్చి", "నీహృదయేశుడని" సత్యతో శచి యనుటలోనె, ఆమె సత్య స్వాధీనభర్తృకతను గ్రహించిన దనుట తెల్లమగును. అట్టి సౌభాగ్యము, కృష్ణ కాంతలలోనే కాదు, లోకమున నేకాంతకును దక్కదు. అందుచేతనే "నీ సౌభాగ్యంబనన్య దుర్లభ సంభావనోపభోగ్యంబు" అని కొనియాడుచు "నిన్నుఁజూచి ప్రియంబు నొందితి, నీ యభిమతం బొక్కటిఁగావింపఁ గోరెద", అని అభినందన పూర్వకముగ పలికినది. అందులకు నాకేమిటం గొఱంత లేదు" (హరి ఉ. భా. - 4 - 206) అని, "వినమ్రయగుచు" ఈ స్వాధీనపతిక పలుకుటలో నెట్టి ఆశ్చర్యమును లేదు.

ఎట్లన హరివంశమున నందనోద్యానము నందలి "అవ్వార మహీరముం దనసొమ్ము సేతక్రై", "చిత్తవిభుని' సత్య "మెత్తన వేడగ"నే (పైది 4 - 217), హరి, పారిజాతము నుత్పాటించి ప్రియకాంత మెచ్చి యలర, దేవలోకము వీడుచుండగ, తన నెదుర్కొను దేవతలతో పోరి, దానిని సాధించి, ఆమెకిచ్చును. (పైది 222). కావున, రసమంజరి లక్షణాను సార మిచట సత్యభామ స్వాధీనపతికయే యగుచున్నది. అంతే కాదు, కృష్ణుడు

*"ఎలరారు క్రొవ్విరులెత్తులు గట్టియొ*
*య్యారంపుఁగొమ్మడి నలవరించి*
*పరువంపుఁ బుప్పొడి బాగుగాఁదీర్చిన*
*యలకలపైఁబొలుపారనలఁది*
*జిగి దేరు నెసకంపుఁజిగురు చెక్కున నీడ*
*గానరా నవతంసకం బొనర్చి*
*నవకంబు మీరు క్రొన్నన దండ సవరించి*
*వలి చన్నుఁగవకు జెన్నొలయ జేసి*
*సర్వకాలసమృద్ధి నాశ్చర్యమైన*
*పారిజాతంబుసిరియెల్లఁబ్రణయమలర*
*సత్యభామకు నిచ్చినిచ్చలుఁబ్రమోద*
*జలధినోలాడె సరసతాకలన వెలయ ..... (హరి. ఉ. భా. - 4 - 270)*

"ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికామతా" (3-40) అనెడు ప్రతాపరుద్రీయ లక్షణానుసారము పతిచే, బహుకేళీ విలాసములచే లాలింపబడిన ఈమె స్వాధీనపతిక అగును. ఈ పద్యము సత్య స్వాధీన భర్తృకతకు ఉత్తమమైన ఉదాహరణము.

బాణాసుర వధార్థమేగు పతిని చూచి, సత్యభామ బాణుని సొమ్మైన పశువులయొక్క పాలను తాగిన వారికి గొప్పబలమును, ముసలి తనములేని నిత్యయౌవనమును కలుగు ననియు అందుచే, అతనిని కయ్యమున ఓడించియైనను తన కిష్టమైన పశువులను తెమ్మనుచు

*తే॥ ధర్మమెడలక తగు కార్య తత్త్వమునకు*
*నేమియును గీడుగాకున్న నిట్లు సేయు...." ...(హరి. ఉ. భా. 8. 266)*

మని శాసించినది. బాణధనము కొరకై వరుణునునితో పోరి యుద్ధమున గెలుపొందినప్పటికిని, బాణుడు చేసిన "సమయంబు" తెలియపరచుచు, తనను మన్నింపదలచిన మనిచి పసుల మీది తలపు మానుమని అర్థించు వరుణుని ప్రార్థనను విని, ధర్మమెడలక తగు కార్యతత్త్వమునకు నేమియు కీడు గాకున్ననే బాణధనము తెమ్మని సత్య హెచ్చరించి యుండుట వలన, ఆమె ఆజ్ఞను పాటింపవలసి వచ్చుటచే కృష్ణుడా పశుధనమును మరలింప లేకపోయినాడు.

స్వాధీన పతిక సాధారణముగ భర్తృవాల్లభ్యము కలిగియుండును. సత్య యందు ఇది వలసినంత కనిపించును. రుక్మిణి చెంత నుండగానే కృష్ణుడు, 'సత్యా ముఖంబు చూచి' (ఉ. హరి. 3 - 109), నీతో నేను జూదమాడునప్పుడు రుక్మిణియును రుక్మిణితో, ఆడునపుడు నీవును, గమనింప వలయునని ప్రేమతో అనగా, సత్యభామ,

*"వాదులాని తోడ వాట్రీని తోడను*
*బూతు తోడ దిండి పోతు తోడ*
*నటమటీని తోడ నడయరి తోడను*
*వెలకు నెత్తమాడ వెరవు గాదు" ... (ఉ. హరి. - 3 - 112)*

అని చనవుతో ధైర్యముగ సమాధానమిచ్చినది. అంతేకాదు, అతనిని జూదరిగ, వక్రమముగ వాదము చేయువానిగ, సోమరిగ, కపటునిగ, నిందించినది. అక్కడనే ఉన్న పట్ట మహిషియగు రుక్మిణి కిట్టి ధైర్యము లేదు. ఆమె మౌనముగ ఉండిపోయినది. సత్య పలుకుల కులికి, హరి జాంబవతిని తోడ్కొని రమ్మని, కబురంపగా, అది గమనించిన, సత్య, నాతోడ నాడనేరుపు గలదా? అని 'సవాలు' చేయుచు, నీవును నీ పరివారమును కలిసి రండు, మిమ్మందరిని గెలిచెదనని, సవతులను పరివారమనుచు గొంతు కొసరు లేక పలికిన "ప్రగల్భ" ఈమె. అంతే కాదు, "తొలి తొలి రుక్మిణీ రమణితో నెరవాదివి నెత్తమాడుమా" (పైది 3- 118) అని ఆదేశించినది. ఆ మాటలకు కృష్ణుడు "కోపము గన్నుల గ్రోలి నవ్వె"నే కాని, దానిని ప్రదర్శింప లేదు. సత్యభామపై కోపము తెచ్చుకొనుట అతనికి అసాధ్యమైన పని. ఆమె ఆజ్ఞాబద్ధుడై వర్తించి, తొలి మారు రుక్మిణితో నాడి, ఆ తరువాత నెత్తము లాడ "సత్యభామ కరము గరమున గీలించి కమలనాభుడిందు రమ్మని" (పైది - 3 - 126) బ్రతిమాలుకొనినాడు. పంతములాడినట్లుగనే, నెత్తములాడి "శౌరిఁబలుమరు గెలిచినది" (పైది 128). పతిని తన అధీనము నందుంచుకొనుటలో జీవిత రంగమున అలవోకగా గెలువ గలిగిన సత్యభామ, క్రీడారంగమున నాతనిని గెలిచి విలుచుటలో నాశ్చర్యము లేదు కదా!

నేమాని భైరవకవి రచించిన హరివంశములోని ఐదవ ఆశ్వాసమున, పారిజాతాపహరణ, పుణ్యకవ్రత కథా ఘట్టములు ప్రధానాంశములు. ఇందలి సత్యభామ ఖండితగ, స్వాధీన పతికగ దర్శనమిచ్చును.

"అన్యోపభోగ సంచిహ్నితః ప్రాతరాగచ్ఛతి పతిర్యస్యాః సాఖండితా" (2-పు. 51) అని "రసమంజరి" ఖండితా లక్షణమును నిర్వచించినది. అన్యస్త్రీతో సంభోగించిన గుర్తులు కలవాడై, పతి వేకువను రాగా, ఏ నాయిక కోపించునో అది ఖండితయగును. వేకువ అనగా ఇతర వేళలకు సుపలక్షణమని, "ప్రాతరిత్యుపలక్షణమ్" (పైది) అనుటచే తెలియనగును. "అస్యాశ్చేష్టాః అస్ఫుటాలాప చింతా సంతాప నిశ్వాస తూష్ణీం భావాశ్రుపాతాదయః" .(2 - పు. 52) అను రసమంజరి లక్షణము వలన అస్ఫుటమైన మాట, చింత, సంతాపము, నిట్టూర్పు, మౌనము, కన్నీరు విడుచుట, ఖండితా చేష్టలని తెలియు చున్నది.

రుక్మిణికి కృష్ణుడు పారిజాతము నిచ్చినాడని చెలి చెప్పగనే, సత్యభామ, యీర్ష్యను పొంది క్రోధాన్వితయై "విజనంబైన తమో గృహంబు సొచ్చినది". రుక్మిణీ సమాగమ లబ్ధుడై తిరిగి వచ్చిన పతిని చూచి, ఈర్ష్యాసూయ కోపములకు లోనైన దగుటచే, సత్యభామ చింత, సంతాపము ప్రదర్శించుచు, నిట్టూర్పు విడుచుచు, పతి చెంతకు వచ్చినను పలుకకుండ మౌనము వహించినది. కన్నీరును కార్చినది. ఇట్టివి ఖండిత చేష్టలు.

ఆమెను లాలించుటకై చెంతకు హరి రాగా, "నేత్రాంచితవారి వెసం దుడిచి" ఆ మానవతి

*"నీవే నా వాఁడని మున్*
*భావంబున నమ్మి మర్లు పడి యీ రీతి*
*న్నీవలన మోస పోయితిఁ*
*గావున నీస్నేహ మన్యకాంక్షితమయ్యెన్"* ... *(భై. హరి.5 - 53)*

అనియు ఈర్ష్యా కషాయితయై నేరములెన్ని కోపగించు కొనినది కావున ఇచట సత్యభామ ఖండితయగుచున్నది.

వక్రోక్తులచే మధ్యా - ధీరయు, రుదిత ప్రధానములగు పరుషోక్తులచే మధ్య - ధీరాధీరయు, పరుషోక్తులచే మధ్య - అధీరయు భర్త యెడల కోపమును చూపునని తెలియుచున్నది.[1]

*"మొదల నతిహితము చేయుచుఁ*
*దుదఁ దప్పింపంగఁజేయ దోసము సుమ్మీ"* ...*(పైది 5 - 66)* అనియు రుదిత ప్రధానములగు పరుషోక్తులచే కోపమును ప్రకటించుటచే ఇచట సత్యభామ "ఖండితా - మధ్య - ధీరాధీర" అగును. స్వీయాదులు మరల అన్య సంభోగ దుఃఖిత, వక్రోక్తి గర్విత, మానవతులని మూడు విధములని తెలియుచున్నది.[2] అన్యస్త్రీతో నాయకుడు సంభోగించి నందులకు వగచునది అన్య సంభోగ దుఃఖిత. వక్రోక్తి గర్విత మరల 'ప్రేమగర్విత' 'సౌందర్య గర్విత' అని రెండు విధములు. మానము కలది మానవతి.

ప్రియుని తప్పిదమును సూచించునట్టి చేష్ట మాన మనబడును. అది లఘువు, మధ్యమము, గురువు అని మూడు విధములు. కొంచెము పాటి యత్నముచే తీర్ప శక్య మగునది లఘువు-కష్టయత్నముచే తీర్ప నగునది మధ్యమము-కష్టతర యత్నముచే తీరశక్య మగునది గురువు. అసాధ్యమగునది రసాభాసమే. అన్యస్త్రీని చూచుట లోనగు కారణముల వలన పుట్టునది లఘువు పొరపాటున వేరొకతె పేర తన్ను పిలచుట మున్నగు కారణముల వలన పుట్టునది మధ్యమము. అన్యస్త్రీ సంగమము మొదలగు కారణముల వలన పుట్టునది

---

1. *సాహిత్య దర్పణము - 3 - 104*
2. *రసమంజరి - 1 - పు - 36*

గురువు. వేరు విషయము లందు కుతూహలము పుట్టించుటచే లఘుమానమును, బొంకులు, ఒట్లు పెట్టుకొనుట వలన మధ్యమానమును, పాదములకు ప్రణమిల్లుట, భూషణాదికముల నిచ్చుట వలన గురుమానమును తీర్చ శక్యమగునని తెలియుచున్నది.[1]

తన ప్రియపతి, సవతి రుక్మిణిని చేరి దివ్యపారిజాత పుష్ప ప్రదానముచే ఆమె యెడల పక్షపాతమును చూపి, తన నుదాసీన పరచినాడని సత్యభామ ఈర్ష్యాక్రోధములకు లోనైనది. కావున ఆమె "మానవతి" అగుచున్నది. ఎంత లాలించినను ఆమె కోపము ఉపశమింప లేదు. దివ్య భూరుహమును కానుకగ నర్పింతునని ప్రతిన చేసిన తరువాతనే ఆమె గురుమానము తొలగి "ప్రసన్న" యైనది.

*"పరిణీతత్వే సతి భర్తు రధికస్నేహాజ్యేష్ఠా, భర్తుర్న్యూన స్నేహా, కనిష్ఠా"*

*.......(రస మంజరి.1-పు. 20)*

అనెడు లక్షణానుసారము, భర్త యొక్క అధికానురాగమును పొందిన సత్యభామ జ్యేష్ఠయు, అగుచున్నది.

నాయికలలో మరల ఉత్తమ, మధ్యమ, అధమ భేదములున్నవి. ప్రియుడు అహితమొనర్చినను, అతనికి హితమే చేయునది ఉత్తమ అనియు, ప్రియుడు హితము చేసిన హితము, అహితము చేసిన అహితమును చేయునది మధ్యమ, ప్రియుడు హితము చేసినను, అహితము చేయునది అధమ అని రసమంజరి నిర్వచించుచున్నది.[2] అల్ప కారణముననే కోపాసూయాదులు పొందినను, మరల అల్ప కారణముల చేతనే కోపమును మరచి సంతోషాతిశయము పొందునది "ఉత్తమ నాయిక" అని రసార్ణవ సుధాకరము వలన తెలియుచున్నది.[3]

పతి, సవతికి పారిజాతము నిచ్చినందులకు తీవ్రఈర్ష్యాద్వేషములకు లోనయ్యు, సత్యభామ, అతడు పారిజాత ద్రుమమును తెచ్చి యిచ్చెద ననగానే పూర్వపు క్రోధాసూయా దులను మరచి ప్రసన్నయై, "సంతసంబు" ప్రకటించినది (భై. హరి.5- 77). కావున ఇందు ఆమె "ఉత్తమ" అగుచున్నది.

పారిజాతాపహరణేతివృత్తాంతము ప్రధానముగ గల పై ఘట్టమున, సత్యభామ ఖండిత గానే చిత్రీకరింపబడినను, ఆమె స్వాధీన భర్తృకతయు అంతర్లీనముగ నంతట వ్యాపించియే యున్నది. సత్య "జలరుహనేత్రు ప్రాణమన జాలి"నదని (భైరి. హరి. 5-31) కవియే ప్రశంసించి యున్నాడు. కంసారియు రుక్మిణికి దివ్యపుష్ప మిచ్చినను, సత్య యెడల ప్రణయాపరాధము చేసి యుండుట వలన "భయముతో శీఘ్రగమనుడై" ఆమె సౌధరాజంబు నకు చేరి, సత్య తనకు ప్రాణపద మనుటను నిరూపించినాడు. "అతి భీతుడై నల్ల నల్లన

---

1. *'ప్రియాపరాధ సూచికా చేష్టా మానః స చ లఘుర్మధ్యమో*
*గురుశ్చ అల్పాపనేయో లఘుః, కష్టాపనేయో మధ్యమః*
*కష్టతరాపనేయో గురుః అసాధ్యస్తురసాభాసఏవ*
*అన్య స్త్రీ దర్శనాదిజన్మా లఘుః, గోత్రస్ఖలనాదిజన్మా మధ్యమః*
*అపర స్త్రీ సంగమ జన్మా గురుః, అన్యథా సిద్ధ కుతూహలాద్యప*
*నేయో లఘుః, అన్యథా వా దశపథాద్యపనే యో మధ్యమః,*
*చరణ పాత భూషణాద్యపనేయో గురుః" ....(రసమంజరి - 1- పు.39)*
2. *రస మంజరి -2 - పు. - 94 - 96*
3. *రసార్ణవ సుధాకరము - 1 - 151*

సత్యమందిరమున" (పైది 34) కడుగిడుట శ్రీకృష్ణునకు సత్య యెడల గల భీతి ప్రీతులనే సూచించును. సత్య కనుంగవ నొల్కుచున్న కన్నీటిని తుడిచి ప్రేమతో

*"మదవతులందెందెందును*
*బదపడి నినుఁదక్క మైత్రి బహుమానంబుల్*
*హృదయేశ్వరి లేవు......"* ....(*పైది. 5 - 50*)

అనియు, ధరణికి గంధశక్తి, జలధాళికి శబ్దగుణము, అగ్నికి శుచి, దివాకరమూర్తికి తేజము, కళాధరునకు కాంతి వలె, సత్య పై ప్రేమ స్థిరమైనదని, శాశ్వతమైనదని స్పష్టము చేసినాడు. అంతే కాదు, "నన్ను భక్తుడని తల్చెదవేని యనుగ్రహింపుమీ" (5-59) అని భగవానుడా ప్రణయమూర్తి ముందు భక్తుడైనాడు. ఇది, కృష్ణుడు మెర మెచ్చులకై అనిన మాటలు కావు. సత్య పలుకులును శ్రీకృష్ణుడామెకు స్వాధీనుడై యుండె ననియే తెలియజేయును.

కృష్ణుడు, రుక్మిణీ మీద గల అధికానురాగముచే పుష్పము నీయలేదు. రుక్మిణీ తన చెంత నుండుట వలన దానిని నీయవలసి వచ్చినదని సత్యకు అతడు వివరించి, "ఇది నా యపరాధంబు సహింపుము" (పైది 72) అని క్షమాపణను కూడ కోరినాడు. సత్య కోరిన, పారిజాత పుష్పము లెన్నియైనను గాని, లేక, పారిజాతద్రుమమునే గాని పెకిల్చి తెచ్చి, ఆమె గృహంబున చేర్చగలనని శపథము చేసి ఆమెను ప్రసన్నము చేసినాడు. సత్యయు "ధీర! సురద్రుమంబుఁగొని తేరఁగశక్యమ యేని కోపముం దీరును" (పైది - 76) అని ఆదేశించునట్లు అనగలిగినది.

పారిజాతము కొరకై నారదునిచే ఇంద్రునకు సందేశమంపునపుడు "నేనును సత్యభామ కొఱకు దివంబున నుండి పారిజాతం బిచ్చుటకుఁ దెచ్చెదనని ప్రతిజ్ఞ చేసితిఁ, దత్ప్రతిజ్ఞా వాక్యంబెట్లనృతంబు సేసెద" (పైది. 95) అని అనుటయు, పారిజాత మీయనిచో, యుద్ధమున నెదుర్కొందుననియు కృష్ణుడు హెచ్చరించుటయు, "స్త్రీ నిమిత్తంబు పారిజాతంబు గొనిపోయెనని స్వర్లోకసులు విమనస్కులయ్యెద" రనియు, దీనివలన "వాసుదేవునికి స్త్రీ వశ్యకత ప్రకటింపబడు"ననియు (5-113) కృష్ణునితో విన్నవింపుమని నారదునితో ఇంద్రుడనుట, కృష్ణుని సత్యాధీనతనే చాటును. సాత్యకీ సమేతుడై, నందనవనము సొచ్చి, పారిజాతమును హరి పెకిలింపగ, దానికి అభ్యంతరము చూపు ఇంద్రునితో, హరి

"అమర నాథ! విను మంగన పూనిన, పుణ్యకార్యార్థ మమర భూరుహంబు గొంటి" ... (5-169) అని సమాధాన మిచ్చినాడు. "ఈశ్వరునావాహనంబు చేసి", యుద్ధ విజయ వరమును, పారిజాత తరు లాభమును పొంది, ప్రియసతికి పారిజాతమును నర్పించి, ఆమెను "ప్రహృష్టాత్మ" చేసినాడు. సత్య పుణ్యక వ్రతమునకై "జంబూ ద్వీపంబు వలన సకల యోగ్య వస్తు కలాపంబులను" "తేరం బంచినాడు". దాన ప్రతి గ్రహీతయైన నారదుని 'దలంచి' రప్పించి, "....ప్రథమ కల్పము నాకొనగూర్పు నేర్పునన్" (5-76) అని సత్యభామ కోరినట్లుగానే, ఆమెచే తన భార్యలందరి కన్నను ముందుగా, పుణ్యక వ్రతమును చేయించినాడు.

ఇట్లు ఇందు సర్వ విధముల శ్రీకృష్ణుడు సత్యా ప్రియంకరుడై ప్రవర్తించుటచే, "సత్యభామ స్వాధీన పతిక" అగుచున్నది.

భాగవతము నందు, సత్రాజిత్తును చంపి, మణి నపహరించి, సత్యభామకు దుఃఖము కల్గించిన శతధన్వుని కృష్ణుడు వధించి, ఆమెకు సాంత్వనము కల్గించుటయే గాక, "సత్యభామా ప్రియంకరుడు గావున సత్రాజిత్తునకుం బరలోక క్రియలు సేయించి" (భాగ.10-ఉ.భా.95) మరింత ఊరటను కల్గించినట్లుగ వర్ణింప బడినది. కృష్ణుడు సత్యాధీను డగుటచే

సత్య అభ్యర్థనమైనను, ఆదేశమైనను దానిని మీరి నడువలేడు. నరకాసుర వధార్థ మేగుచున్న కృష్ణునితో "ప్రాణేశ! మన్నించి నన్ నీ వెంటం గొని పొమ్ము" అని అర్థించినది. శ్రీకృష్ణుడును సత్యను విడిచి యుండ లేడు. కావుననే "వత్తు వేగమ" అని ఈమెకు నమ్మకము కలుగునట్లు చెప్పుచు, యుద్ధ రంగము భీతావహ మగుటచే "వలదు వలదని" ఆమె రాకను నివారింప బూనినాడు. కాని ఆమె "తనకు మ్రొక్కగ" చివరకు ఆమెను తోడ్కొని పోక తప్పలేదు.

సత్య భూమ్యంశ కావున, హరి నరకాసుర వధార్థమై సత్యను గొంపోవుట ఒక ముఖ్య కారణమే అయినను, అదియే మూల కారణము కాదు. అదే అయినచో నరకాసురవధ కాగానే, ఆమెను ద్వారక యందు విడిచి తాను మాత్రము అమరావతికేగి యుండెడి వాడు. కాని కృష్ణుడు సత్యా ప్రియుడగుటచేతనే స్వర్గమునకు సహితము సత్యాకాంతా సహాయుడై యేగెను.

హరి నరకాసురునితో యుద్ధమునకు పూనుకొన తలపగా, అతనికి మున్ను సత్యభామయే పూనుకొని ముందుకు రాగా,దనుజాలను తాను గెలువ గల ననియు, ఆమె తలపడ నవసరము లేదనియు, ఆమె పూనిక కడ్డువాటు వేయబూనినను, చివరకు "మానవేనిన్, మా విల్లందు కొనుము లీలం గేలన్" (భాగ - 10 - ఉ.భా - 172), అని తన విల్లందించి, ఆమె మనోరథంబును నెయ్యంబుతో నెరవేర్చెను. అసమాన పరాక్రమమును చూపి, వైరిని నెదిరించిన సత్యను చూచి "గురు విజయముఁ గైకొమ్మా" (పైది. 187) అని అభినందించి, ".... మెచ్చితి నిచ్చెదఁ గొమ్మాభరణములు నీవు గోరిన వెల్లన్" అనుచు సల్లాపములతో సంతోషింప చేసెను. నరకాసుర వధానంతరము "సత్య కోరిన నందనవనంబు సొచ్చి" పారిజాతోత్పాటనము చేసి, (పైది. 216), అడ్డుపడిన ఇంద్రాదుల నిర్జించి, "హరి" మహా ప్రేమాభిరామయగు సత్యభామతో గ్రీడించు మహోద్యానంబున "సంస్థాపించెను" (పైది. 218). కావ్యాలంకార చూడామణి లక్షణానుసార మిచట సత్య స్వాధీనపతిక అని నిరూపింప బడుచున్నది.

మడికి సింగిన విరచిత ద్విపద భాగవతమును, పారిజాతమును చూచిన సత్య 'అత్యుదాత్తతఁబ్రీతి హరి వేడుటయును వేగమె శౌరి యా వృక్షంబుఁబెఱికి, నాగారిపై నిడి' (10 పు. 120), అట్లు పారిజాతమును తెచ్చి, "సత్యభామ గృహమున, నారూఢ గతి నిల్పె" నని (పైది - పు. 121) వర్ణించుచు, సత్యను స్వాధీన పతికగానే చిత్రించినది.

మడికి సింగిన విరచితమే యగు పద్మపురాణములోని పారిజాతాపహరణ ఘట్టమున, సత్యభామ స్వాధీనభర్తృకగనే కనిపించును. నరకాసుర వధానంతరము సత్యాకృష్ణులు అమరావతికి రాగా, శచీదేవి, పారిజాత సుమములు, అమరులకు మాత్రమే అర్హమనుచు సత్యకీయక, అవమానించగా, అమానిని

*"పారిజాత మున్నయట్టి ప్రాభవమున నన్ను దా*
*జీరి కైన గొనక పలికె జిష్ణు దేవి యిప్పుడీ*
*భూరుహమును ద్వార వతికిఁబూని తెచ్చి తేని నా*
*కోరికలు ఫలించు గృష్ణ! గోపికా మనోహరా!" ....(సిం. పద్మ. పు. ఉ. భా.10-114)*

అని పారిజాతాపహరణమునకై ఆదేశించగా "ఆ రమణీ లలామకు బ్రియంబుగ, వే చని" (పైది 10-116) పారిజాతోత్పాటనము చేసెను. అంతే కాదు, దేవ యోగ్యమైన పారిజాతమును నవని నిడుట తగవు కాదని వేడుచు దానినిచ్చి పొమ్మని, ప్రార్థించు నింద్రునితో, ఆ సత్యాపతి, 'నీభార్యవలన అవమానింపబడిన సత్యభామ కొరకై, ఈ తరువు నిచ్చుచున్నాను, నేను భూలోకమున నున్నంత వరకు అది ఉండునని' అని ప్రియసతి ఆజ్ఞాపాలనకు గల

కారణమును చెప్పుచు, భువిని పారిజాత ముండెడి కాలావధిని కూడ తానే నిర్ణయించినాడు. ఒక్క నిమిషము కూడ పుడమి నుండుటకు వీలులేదని ఇంద్రుడు భావింపగా, కృష్ణుడు అది తన అవతార కాలము వరకు నిలువ వలసినదే యని గట్టిగా నిర్దేశించి శచీ గర్వభంగము చేసి, సత్యకు ప్రియమును కల్గించినాడు. సత్యయు పారిజాతము తన గృహాంగణమున నిలువగ, "అతివలందు" 'మహిత లీలఁగృష్ణు మన్నన నఖిల భోగాఢ్యయై వెలింగెను' (పైది 10-126)•రసమంజరి లక్షణానుసారము ఇచట సత్యభామ "స్వాధీన పతిక" యే యగును.

"పిసుపాటి చిదంబర శాస్త్రి" యనువదించిన "పద్మపురాణము" నందు సత్యభామ ఖండిత, స్వాధీనపతికయు నగుచున్నది. నారదుడు పారిజాతమును శ్రీకృష్ణునకీయగా, "అంతట సత్యను మరచి గృష్ణుడా పుష్పములు తక్కు నిజ వధూటుల కొసంగగా" సత్యాపతి ప్రణయాపరాధమునకు కుపిత యగుటచే ఖండితయు, రుదిత ప్రధాన పురుషోక్తులు పలుకుటచే "మధ్యా - ధీరాధీర"యు అగుచున్నది.

తులాపురుష దానమునకై కృష్ణుని అంగీకారమును కోరగా, అతడు

*"అడుగుము లతాంగి,సంశయంబుడిగినీవు*
*చెప్పఁదగనిది యనుచును జేయ రాని*
*దనుచు నీయఁగఁ గూడని దనుచు నొకటి*
*నీ యెడల లేదు సుమి నాకు నిక్కువముగ"* ... (4 ఉ. ఖం-320)

అనియు అనును. ఈ మాటలును కృష్ణుడు సత్యాప్రియంకరుడును, స్వాధీనుడనుటనే నిరూపించును. "మానవజాతిజ నైన నాకు, దేవతలకును బ్రాప్తింపని భాగ్యంబు ప్రాప్తింప నేమి కారణమొ చెపుమ" (పైది. 321) అని కృష్ణుని నామె అడుగును. దేవతలకు కూడ ప్రాప్తింపని భాగ్యము అనగా సకల లోకారాధ్యుడైన కృష్ణుడు తనకు పతి యగుటయే గాక,తనకు వశవర్తియై వర్తించుట! సత్యభామ యొక్క యీ పలుకులే ఆమె స్వాధీన పతిక యనుటను స్పష్టము చేయుచున్నవి.

"పిల్లలమర్రి పినవీరభద్రు"ని "జైమిని భారతము"న సత్యభామ పాత్ర అత్యల్పకాలము మాత్రమే నిల్చినను, అందును ఆమె "స్వాధీన పతిక"గనే చిత్రిత మగుట కనగలము. ధర్మజుని పనుపున, కృష్ణుని అశ్వమేధయాగమునకై ఆహ్వానింపవచ్చిన భీముడు, అతనితో సరసాలాపములకు దిగి

*"స్త్రీలోలుఁడగుటకు త్రైలోక్యము నెఱుంగ*
*ధరకుఁదెచ్చిన వేల్పు తరువు సాక్షి"* .....(జై - భార - 1 - 126)

అని సస్నేహముగ మేలమాడుట, కృష్ణుని సత్యాధీనతనే నిరూపించుచున్నది.

ధర్మరాజు చేసెడు అశ్వమేధ యాగోత్సవమున, వ్యాసుని పలుకులాదరించి అత్రి అనసూయాది దంపతులతోపాటు రుక్మిణీ కృష్ణులును ధర్మజుని అభిషేకించు చుండిరి. అట్టిసమయమున, సత్యభామాగారంబున కేతెంచిన నారదుడు, హరి నీకూరిమి ప్రియుడందువు గాని ఇపుడు రుక్మిణికే పెద్దతనము నిచ్చినాడని, కలహబుద్ధితో ఆమెలో అసూయ రేకెత్తింప ప్రయత్నింపగా, స్వాధీన పతిక ననెడు ఆత్మ విశ్వాసముగల సత్యభామ ఇందుల కేమాత్రము కలంగక, ప్రాణేశ్వరుడు తన నేవేళ మరువ లేడనుచు నారదునికి జ్ఞానోదయము కలుగునట్లు "తన కేళీ సౌధంబున నున్నమురారిఁ జూపి" (పైది. 8-181) అతనిని ఆశ్చర్యపరచినది. ఇది హరి లీలలను చెప్పునట్టి ఘట్టమే యయ్యును, హరికిగల సత్యా ప్రియత్వమును, సత్యస్వాధీన భర్తృకతను కూడ వెల్లడి చేయుచున్నది.

శ్రీవెన్నెలకంటి సూరనార్య ప్రణీతమైన "విష్ణు పురాణము" నందును, సత్యభామ స్వాధీన పతికగ నే చిత్రింప బడినది. వారణావతమున పాండుసుతుల గూడి ప్రమదంబుతో నున్న హరికడకు సత్యభామ రుదెంచి, "ఉడుగని బాష్ప పూరముల" అవ్విభుపాదపద్మముల దడుపుచు "నర్ధరాత్రి శతధన్వుడు తండ్రిని అకారణముగ చంపి శమంతకము నపహరించు టను అపారపు దుఃఖము తోడ జెప్పిన" వెఱగంది శౌరి

*"తెఱవా! మీ తండ్రినిట్లు దెగి చంపిన యా*
*మొఱకు శతధన్వునిపుడ*
*నఱకెద మోమాట లేక నా చక్రమునన్"* .....*(సూ. వి. పు.6-283)* అనివాగ్దానము చేసి, "సత్యభామ నూరార్చి" ఆ తులువను చంపి, ఆమె కోరికను తీర్చెను. ప్రతీకారము తీర్చుమని ఆమె అతనిని నోరు తెరచి యడుగ లేదు. కాని, హరి ఆమె మనోభావములను గుర్తించి, కోరికను నెరవేర్చినాడు. కావున రసమంజరి లక్షణానుసార మీమె ఇచట "స్వాధీన పతిక" యని చెప్పవచ్చును. ఇందును కృష్ణుడు ఏ సమయమునను సత్యను వీడియుండలేని వానిగ చిత్రింప బడినాడు. నరకాసురవధార్థ మేగు నపుడును, సత్యను వెంటనిడుకొని పోయెను.

సత్యభామ అదితి వలన, సార్వకాలంబు "ముదిమియు, విరూపములేని యౌవనమును, సంతతానవద్య సౌభాగ్యములును, వరములుగ పొందుటకు" (పైది 8-118) ఆమె స్వాధీన భర్తృకతయు ఒక ముఖ్య కారణ మగుచున్నది. ఇట్టి అపురూపమైన వరము కృష్ణ కాంతలలో నీమెకే దక్కినది. నందనోద్యానము నందలి దివ్య భూజమును చూడగనే అమరపతి భార్య భాగ్యమునకీమె అసూయ పడుచు, పారిజాతమును తన గృహాంగణమున నిలుపుమని భర్తృ వాల్లభ్యముతో ఆదేశించినది (8-125). తనపై చనవు కల్గినచో పారిజాతమును తన పాలు చేసి సపతులెవ్వరు తనతో సాటి కారను సత్యమును భర్త నిరూపింప వలయునని ఆజ్ఞాపించినది. వెంటనే కృష్ణుడు "సత్యభామ పలుకాదరణీయము చేసి", "ఆ తరువు కూకటి వేళ్ళకు బెల్లగించి" (పైది 8 - 126), భువికి కొనిపోవ సిద్ధపడినాడు. హరి ప్రయత్నమునకు వనపాలకు లడ్డుపడి తగదనుచు వారింపగ, అతడేమియు పలుకక, నవ్వుచు నూరకుండగా, సత్య, తనకు తానుగ కలుగజేసికొనుచు పౌలోమియు, ఇంద్రుడును ఎక్కడి వారని ప్రశ్నించుచు, వారిరువురును ఎవ్వరికంటెను నధికులు కారనియు, జలధి పుట్టిన పారిజాతము అఖిలలోక సమము కావున, అది వారి సొంతము కాదనియు, శచీనాథుని కంటెను, తన మగడగు శౌరి, బల్లిదుడనుట లోకమెరిగిన నిజమనుచు అంతటితో నాగక, తన మగనిని, పరోక్షముగ యుద్ధమునకు ప్రేరేపించిన (8-133) "ప్రగల్భ" సత్య. రసమంజరి లక్షణానుసారము సాకూతముగ పతిని తన ఆజ్ఞానువర్తిగ చేసి కొనిన ఈ సత్యభామ స్వాధీన పతిక యనుటలో సందేహము లేదు. అనేక కాంతావల్లభుడైన హరిని "నా మగడు" (పైది 8-132) అనుచు సర్వాతిశాయియైన ఆత్మవిశ్వాసముతో, దేవలోక వాసుల ముందు పలికి, తాను స్వాధీనపతిక ననెడు నంశమును ప్రకటించినది. అంతే కాదు, యుద్ధము నందోడిన ఇంద్రుని కై, శచీదేవి, కృష్ణునితో "దేవ వరేణ్యు తప్పులు మదిన్ బరికింపక భర్తృభిక్ష నాకీవలయున్ జుమీ" (పైది 8-140) అని మ్రొక్కుచు విన్నవింప వలసి వచ్చినది. స్వాధీనపతికనని భావించు శచీదేవి ఈ స్వాధీన పతిక భర్తను, భర్తృభిక్షకై యాచింపవలసి వచ్చినది.

కృష్ణుని మాటలు కూడ, సత్యభామ కాతడు స్వాధీనుడే యనుటను మరింత స్థిరపరచును. "పురుహూతా! విను పారిజాత కుసుమంబుల్ సత్యభామా మనోహరముల్ గావున నిమ్మహీజము మదీయ ద్వారకన్ నిల్పి, యీ యరవిందానన కోర్కి దీర్చెద..." అని,

తన ఉద్దేశమును చెప్పి, "మహాత్మా, దీనికై నీవు కోప రసావేశము జెంద నేటికి నిలింప ప్రేరితోద్యోగివై" (8-142) అని ఆశ్చర్యమును ప్రకటించినాడు. శ్రీకృష్ణునకు అతనికి చర్య, అర్థములేని విషయ మనిపించినది. ఎవరి వస్తువైనను సరే, సత్యభామ కోరినచో, అది ఆమెకే చెంది తీర వలయును. దానిని తానెట్లైనను సాధించి, ఆమెకిచ్చి తనను సత్యా విధేయునిగ నిరూపించు కొనును. అట్లుండ, ఇంద్రుడు సత్యభామ కోరిన పారిజాత మీయననుట, కృష్ణునకు వింతగ తోచినది. ఆదివ్య పారిజాతమును అధమ లోకమునకు గొంపోవుట తగదని ఇంద్రుడు ముందు బాధ పడినను, సత్యభామ స్వాధీన భర్తృకతను గుర్తించిన వాడగుటచే "ఐనను నీ పత్నియగు సత్యభామకుఁబ్రీతి గావుననిది పెద్ద లెస్స" (8-143) అని సమాధానపడినాడు. కృష్ణుడును "అంతఃపుర సమీపంబున సత్యభామా నివాసంబున భాసిల్లు నుద్యానవన మధ్యంబునఁబారిజాతంబు బ్రతిష్టించి" (పైది 8-144) సవతులెవ్వరు ఆమెతోడ "సవతుగార"ని, నిరూపించి, సత్యభామ స్వాధీన భర్తృకతను లోకమునకు స్పష్టము చేసినాడు.

జనమంచి శేషాద్రి శర్మ రచించిన "బ్రహ్మ పురాణమునందును" సత్యభామ స్వాధీన పతికగ కనిపించును. నరకాసుర వధానంతరము నందనవనములోని పారిజాతమును చూడగనే, అది కావలయుననుచు "దీనిని గొని ద్వారకాపురిని నిల్పుము నాకు మనః ప్రియంబుగన్" (4-93-69) అని భర్తృ వాల్లభ్యముతో నాదేశించినది. "....మది యందుఁ బొల్చేడిని నయ్యది తీర్చుట నీదు భారమై పరఁగెడుఁ గాదె" (పైది 70) అని పతికి కర్తవ్యమును కూడ గుర్తు చేసినది. అంతే కాదు. రుక్మిణీ జాంబవతుల కన్నను సత్యయే మనోహర సుఖవృద్ధి గూర్చునన్న కృష్ణుని మాటలు నిజమని నిరూపింపు మనినది కృష్ణుడును,

*"వనితరో! యింత దూరమిటు వాంఛనుదీనిని దెల్పనేల? యి*
*ప్పని యొక గొప్పయే యిపుడె పంతము మీఱఫలింపఁజేయుదున్" ...*

*.......(బ్రహ్మ. పు-4-93-75)*

అని పారిజాతోత్పాటనము చేసి ఇంద్రునితో తలపడి దానిని సాధించును. ఇది సత్య స్వాధీన భర్తృకతనే నిరూపించును.

యుద్ధానంతరము, కృష్ణుడు ఇంద్రునితో "సత్యభామ వచన సంగతి గ్రహియించి నాఁడఁ గాని, వాంఛఁగూడిఁ గాదు" (115) అనుటయు, "మనోహర ద్రుమ వరంబున్ నిష్కుటంబందు నిల్పి సత్య మనోభీష్టము తీర్చుటయు" (పైది. 122) సత్య స్వాధీన పతిక యనుటనే నిర్ధారణము చేయుచున్నది.

## ప్రబంధములలో :

తిమ్మన పారిజాతాపహరణమునందు సత్యభామ ఖండితగ, స్వాధీన పతికగను చిత్రింప బడినది. ఆంధ్రసాహిత్యము నందలి ఇతర గ్రంథములన్నిటి కంటెను, ఈ ప్రబంధమునందు సత్య స్వాధీన భర్తృకత మిన్నగ ప్రకాశమాన మగుట చూడగలము.

సత్యభామ, కృష్ణుని పదియారువేల యెనమండ్రు భార్యలలో "మగని కూరిమి" అధికముగ కలదానినని భావించునట్టిది. ఎల్లవేళల నీమెకు పతిని గూర్చియే చింతయున్నట్లు కనిపించును. ఒకదినమున శృంగారవనమున చంద్రోపలవేది గూర్చొని యుండి, చెలితో సరసగోష్ఠి చేయుచు "శౌరి గుణముల ప్రాక్రుచ్చి వర్ణించు" నవసరమున, రుక్మిణీకాంత గృహమునుండి వచ్చిన చెలి సురముని వచ్చి, అతులిత మహిమాన్వితమైన దివ్యకుసు మమ్ము నమ్మురారి కిచ్చుటయు, దాని నతడు "గారవమెసగ" రుక్మిణికొసగె" ననియు, ఆకారణమున రుక్మిణికి ఇనుమడించిన అందమును, వైభవమును వర్ణించుచు చివరకు,

"పతిఁగూర్చు దాన నాయంతటి వారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్, వంతుకు వచ్చు సత్య గరువంబిఁక జెల్లదటంచు" నారదుడామెను గూర్చి, చులకనగ పలికిన మాటలను కూడ నుదహరించినది. అది వినిన అమ్మానిని "వ్రేటుపడ్డ యురగాంగనయుం బలె", క్రోధావేశముతో బుసలు కొట్టుచు, "నేయ వోయ భగ్గన దరికొన్న భీషణ హుతాశన కీల" వలె మండి పడినది.

*"నా మొగమాటకై వలని నాటకముల్ ఘటియించి రుక్మిణీ*
*కామిని మీఁదటం గలుగు గౌరవముం గృపయు బ్రియంబుఁదా*
*నేమియుఁ గాననీక యిట నిన్ని దినంబులు నన్నుఁదేల్చె..." ....(పారి. 1-89)*

అని తన నాథుడు చేసిన మోసమునకు పరితపించుచు తన పూర్వ వైభవములను పలుమారు స్మరించుకొనుచు, మానహాని కల్గినందులకై కుమిలిపోవుచు, చివరకు "జనితామర్షమున" "కోప సదనంబున" ప్రవేశించినది. (పైది 1-98).

సత్య పరిస్థితిని ముందుగనే ఊహించిన ఆ దక్షిణ నాయకుడు తత్తరపాటుతో నచటికి వచ్చినాడు. చెలి వలన వినిన కుసుమోదంతము సత్యమే అనునట్లుగ "పారిజాత కుసుమాగత నూతన దివ్య వాసన"లతో వచ్చి, సత్య కోపతాపముల నధికము చేసినాడు. ఏమియు నెరుగని వానివలె మై తొడవునేల ధరింపవనియు, సన్నకావుల నెందును మానలేవు, తెలుపేటికి కట్టితి వనియు, వీటికా రుచులు కెందలిరాకు మోవి తులకింపగ చేయక యున్కి యేమి, అని అడుగుచు "నాయెడ నిక్కము దప్పు గల్గెనో" అని అమాయికుని వలె ప్రశ్నించినాడు. సత్య అతని వైపు కన్నెత్తియైనను చూడలేదు.

*"పలుకులఁదేనెలుట్టిపడఁబల్కవు నేఁడిది యేల? వాలుఁగ*
*న్నుల నునుసిగ్గు నూల్కొనఁగనుంగొనవేల? యురఃస్థలంబుఁ జ*
*న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగి కౌఁగిటఁ జేర్ప వేటికే?" ....(పారి-1-117)*

అని రత్యోదాసీనము యెడ సత్య విముఖతకు కారణము నడిగినాడు. సాహిత్యదర్పణ లక్షణానుసారము కోపమును బయటకు చూపక రతి యెడల ఉదాసీనత చూపునది "ప్రౌఢా - ధీర' అగును.[1] ఇచట సత్యభామ, ప్రియుని యెడల రత్యోదాసీనము చూపి పతిని అలయించుటచే ఇప్పట్టున ఆమె "ప్రౌఢా - ధీర" అగుచున్నది.

"పాయని యనురక్తి నీ యెడన యగ్గలమై కనుపట్టు నాకు" అని తన అనురాగాతి శయమును ప్రకటించుకొనుచు, నిలువలేక ఆమె "పై చెరం గొడియ"గా, చే విరిదమ్మిచే వ్రేయుటకునై యుంకించి జంకించినది. కోపమును మాన్పుటకై, ఆమె పాదములకు ప్రేమతో మ్రొక్కగ, "పేరలుక నున్నఆ లతాంగి" అతని శిరమును వామపాదముతో తొలగం ద్రోచినది. "తర్జయే త్తాడయేదన్యా" (సా. ద. 3-107) అని ప్రౌఢా అధీర లక్షణము. ఇచట సత్యభామ చేవిరి దమ్మి వ్రేయుటకై నుంకించుట, వామ పాదమున పతి శిరమును తొలగ ద్రోయుట అను, తర్జన తాడనములను కావించిన దగుటచే సత్య "ప్రౌఢా-అధీర" యగుచున్నది.

తాడనమును పొందియు, రసికావతంసుడైన ఆ కుహనా గోపాలు డద్దానికి కోపింపక, అది "మన్నన" గ భావించి "అల్క మానవు గదా యికనైన నరాళకుంతలా" అని బ్రతిమాలుకొనినాడు.అంతట ఈర్ష్యా కషాయితయైన సత్య

*"ఈనయగారవుం బ్రియములీ పసలీ మొగమెచ్చుమాటలే*
*లా! నిను నమ్మియుండిన ఫలంబిదె తోడనకల్గె నాకు" .....(1-125)*

అని అతని చర్యల నీసడించుకొనినది. అతని కపట ప్రవృత్తిని విమర్శించినది. తనకు

---

1. *సాహిత్య దర్పణము 3-104*

జరిగిన అవమానము కారణముగ ఏర్పడబోవు విషయముల నూహించుకొని భీతిల్లుచు, "మాన రహితమైన బ్రతుకు మానిని కేలా?" అని నిర్ణయించుకొని "నన్ను నా తోడి సవతులు నగక మున్న పంతమలరంగ నిన్ను మెప్పింతుఁ గాన" అని ప్రాణ త్యాగమునకు సిద్ధమైనది. చివరకు "నను నెవ్వతెఁగఁజూచితి"వని గరువదనముతో ప్రశ్నించుచు, అధికమైన శోకముతో "ప్రాణ విభు కట్టెదుట" "నేడ్చి" నది (పైది 1 - 133). ఇచట సత్యభామ రుదితప్రధానమైన పరుషోక్తులచే కోపమును ప్రకటించినది. కావున, సాహిత్యదర్పణ లక్షణానుసారము ఇచట "మధ్యా - ధీరాధీర" అగుచున్నది. సాపరాధుడైన ప్రియుని కనుగొనగానే సత్యకు వేడి నిట్టూర్పు దళంబుగా నిగిడె"ను. పతిని ఆదరింపక ఉదాసీన పరచినది. "పలుకుల దేనెలుట్టి పడ బల్కు" సత్య ఇపుడు మౌనము వహించినది-తీరని క్రోధ దుఃఖములకు లోనై చివరకు ఏడ్చినది. పతి తన సవతికి పారిజాత కుసుమ ప్రదానము చేసి, ఆమె యెడల ప్రత్యేకానురాగము చూపి, ఆమెను నానంద పరచి, తన నుపేక్ష చేసినాడను ఈర్ష్యచే కుపితయైన సత్యభామ అతనిని పరుషోక్తులతో, వక్రోక్తులతో నిందించుచు, పరిహసించుచు, తన అలుకను ప్రదర్శించినది కావున ఇప్పట్టున సత్యభామ 'ఖండిత నాయిక' యగుచున్నది.

ఈ లక్షణముల నాధారముగ చేసికొనియే కాబోలు శ్రీ కె.వి.ఆర్. నరసింహము గారు "భరత శాస్త్రము ననుసరించి ఖండిత నాయికా పాత్రము నభినయించు నటుడీ పద్యములనే మాతృకలుగ బెట్టుకొని తన యవయవ విన్యాసమును దిద్దుకొనవచ్చును" అని తిమ్మన ఖండిత నాయికా పాత్ర చిత్రణమును ప్రశంసించినారు.[1]

కాని యీ ఒక్క ఘట్టమునే ఆధారముగ చేసి కొని కొందరు, పారిజాతాపహరణము నందలి సత్యభామ "ఖండితయే" అని అభిప్రాయపడినట్లును తోచుచున్నది. "పారిజాతాపహరణము నందు నాయకుడు దక్షిణుడు. నాయిక ఖండిత" అని శ్రీ శిష్టా లక్ష్మీ కాంత శాస్త్రిగారును[2], "ఈతడు సృజించిన పాత్ర ఖండిత నాయిక యగు సత్యభామ" అని శ్రీ కె.వి.ఆర్.నరసింహము గారును[3] పారిజాతాపహరణమునందలి సత్యభామ "ఖండిత నాయిక" అనియే అభిప్రాయపడినారు. ఈ ఘట్టమున అనగా ప్రథమాశ్వాసమున మాత్రమే సత్యభామ ఖండితనాయికగ కనిపించును. కాని ఈమె వస్తుతః స్వాధీనపతిక. స్వాధీన పతికననెడు భావమున్న వనిత మాత్రమే ఖండిత కాగలదు.

పారిజాతాపహరణమునందలి వివిధ ఘట్టములను, అనగా ప్రబంధాది నుండి ప్రబంధాంతము వరకు సునిశితముగ పరిశీలించిన సత్యభామ స్వాభావికముగ స్వాధీన పతికయే యనుట సుస్పష్టము కాగలదు.

సమతాభిమానవతులైన అష్ట మహిషు లందరిని కృష్ణుడు "సరిగా జ్యాద్రియును, "భోజ జనపాల సుత రుక్మిణి"ని, "తరుణీమణి సాత్రాజితి నిరువుర మన్నించి మిగుల" "చనవులిచ్చు" చుండెను (1-41). అగ్రమహిషితో సమానముగ చనవులను పొందగలిగినదీ సత్యభామ మాత్రమే. అందుచేతనే ఈమె కులము రూపముల విషయములందే గాక "మగని కూరిమి"యు అధికముగ కలదాన ననుచును అగ్రమహిషితో పోటీ పడినది.సత్యభామ అట్లు భావించుటలో అనౌచిత్య మేమియు లేదు.

---

*1. ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు - పు. 46*

*2. విజయనగరాంధ్ర కవులు - పుట 208*

*3. ఆంధ్ర ప్రబంధము - అవతరణ వికాసములు - పుట - 39*

*"వారి లోపల సౌందర్యవతియు మాన*
*వతియు మహనీయ సౌభాగ్యవతియు నైన*
*సత్య ... ... ... .... ... ...... ...... ...."* ....(పారి - 1 - 70)

అని కవియే సత్యభామ సవతులందరిలోను భర్తృవాల్లభ్య మధికముగ కలదనుటను "మహనీయ సౌభాగ్యవతి" అను ప్రయోగముచే సూచించినాడు. సత్యభామ తన ప్రేమచే, సౌందర్యముచే, పతిని మిగుల ఆకట్టుకొనినది. పతియు, ఆమెకు పట్టమహిషితో సమానముగ చనవు లిచ్చినాడని కవి ముందే పేర్కొనినాడు. నిజమునకు, కృష్ణుడు సమానముగ కాదు, రుక్మిణి కన్నను అధికముగనే సత్యకు చనవులిచ్చినాడు.

*"కలలోన నైన నవ్వుల కైన నా మాట*
*జవ దాఁట వెరచునో చంద్రవదన !*
*యే పదార్థంబునా యెదటఁబెట్టక మున్న*
*యెవ్వారి కొసఁగడో యిగురుఁబోడి !*
*చెలులు నాతో నేమి చెప్పుదురో యని*
*లంచంబు లిచ్చునో చంచలాక్షి !*
*తోడి చేడియలునా తోడివంతులకు రా*
*సయిరింపఁ జాలఁడో సన్నుతాంగి"* ........(పారి - 1 - 94)

అని సత్య చెలితో పలికిన పలుకులచే, పతి ఆమె కెంత యధీనుడై వర్తిల్లుచుండెనో యనుటను స్పష్టము చేయుచున్నది. ఇంతటి అనురాగము కాని, ప్రత్యేకత కాని, హరి మరి యే యితర కాంతకును చూపించినట్లగుపింపదు.

"ఇవి సత్య మగనికి చేసిననిబంధనల" ని కొందరందురు[1]. కాని, ఇవి సత్య చేసిన, నిబంధనలు కావు. సత్యాధీనుడైన కృష్ణుడు తనకు తానుగ జేసికొనిన నియమములు. ఈ విషయము కృష్ణుని చేతలలోను, మాటలలోను స్పష్టము కాగలదు. అతడిచ్చిన చనవుల కారణమున దేవకీదేవి తనకు సత్యభామ పెద్దకోడలు కాకపోయినను, "తనదు కోడండ్రలోన బెద్దయుఁగ మన్నించు" చుండెడిది (పైది 1-130). ఈ కారణములచే సత్యలో పతి పైన ఒక విధమైన అధికారము కూడ సంక్రమించినది. అందువలననే పతి తనకు తానై ఆమెకు విధేయుడై మసలుకొనుటయే కాదు, ఆమె ఆజ్ఞాపించిన కార్యమది యెట్టిదైనను వెన్వెంటనే నిర్వహించి తీరును.

సత్యభామ స్వాధీనభర్తృక యనెడు విషయము, మూలమైన సంస్కృత హరివంశము నందు కన్నను ఈ ప్రబంధమున మరింత స్పష్టమగుచున్నది. ఈ ప్రబంధమునందు సత్యమాటలలోను ప్రవర్తనలలోనే గాక, ప్రతి యొక్కరి పలుకుల యందును, పనుల యందును, ఆమె స్వాధీన భర్తృకత ధ్వనించును.

సురముని వచ్చి పారిజాతము నీయగ, దానిని కృష్ణుడు, రుక్మిణి తన సమీపమునందు కూర్చొని యుండుట వలన ఆ పుష్పము నామె చేతికిచ్చినట్లు మాత్రమే మూలము నందున్నది.

*"తద్ వృక్ష రాజ కుసుమం రుక్మిణ్యాః ప్రదదౌ హరిః*
*పార్శ్వస్థా సా హి కృష్ణస్య భోజ్యానరవరాఽభవత్"* ...(హరి.వి.వ. 65-15)

కాని, ఈ ప్రబంధమున, శ్రీకృష్ణుడు అట్లు పారిజాతము లభింపగనే గొప్ప తర్జన భర్జనలకు లోనగును. రుక్మిణీకాంత గృహంబులోన కృష్ణుడుండు సమయమున నారదుడు

---

1. "సత్య మగనికి గొన్ని నిబంధనము లేర్పాటు చేసినది"
-పుట్టపర్తి నారాయణాచార్యులు - ప్రబంధనాయికలు - పు. 25

వచ్చి పుష్పు మాతని కీయగా, ఎదుటనున్న పట్టపురాణిని కనుంగొనినాడు. 'ఇది భోజాత్మజ కిచ్చినచో' (పైది 1.54) అని అనుకొనినాడు. కాని, వెంటనే, ఎచటనో యున్న ప్రియసతియైన సత్య తలపున నిలువగ "కినుకతో నేమంచు నూహించునో మది సాత్రాజితి" అని ఆ మానవతిని తలచి భయపడినాడు. అంతేకాదు, "దానికే నిపుడు ప్రేమంబంపినన్" బాగుండునని కూడ భావించినాడు. "దానికే నిపుడు ప్రేమం బంపినన్" "ఇది భోజాత్మజ కిచ్చినన్" - ఈ మాటలలోనే ఉన్నది, అతని ప్రేమలోని తారతమ్యము; అతడెంతగా సత్యకధీనుడో అనెడు సత్యమును! రుక్మిణి యింట నున్నప్పుడు "దానికి పంపిన దీనిని చులకన చేసినట్లుండునేమో నని సందేహించుచు, "ఇందు నేనున్కి జెల్లదువో యేరికి బంపగా" అని నిర్ణయించుకొని, "కనుఁగవ చిన్ననవ్వు దొలఁకన్" 'మునినాధుని కనుసన్న' తో, పుష్పమును రుక్మిణి కిచ్చినాడు (పై 1-55).

నిజమునకు ఆలోచించి చూచిన, శ్రీకృష్ణుడు సత్య యింట నుండగా నిట్టి సందర్భమే వచ్చియుండిన యెడల, రుక్మిణిని గూర్చి తలంచియైన నుండడు. శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావు గారు తన "పంచకన్యలు"లో, ననినట్లుగ "రుక్మిణీ మొదలగు ఇతరకాంతలు ఏదో అధికారమును పురస్కరించుకొని ఆయన శరీరమును కొంత కాలము తమ స్వాధీనమందుంచు కొనగలిగిరేమో గాని, ఆయన హృదయమును మాత్రము సత్యభామ దోచుకొని తన సొంతముచేసి వైచికొన్నది".[1] ఇట్లు తిమ్మన తన అనువాదమునందు సత్యభామ స్వాధీన భర్తృకతకు మెరుగులు దిద్దినాడు.

ఇక నారదుని మాటలును, చేతలును "సత్య స్వాధీనపతిక" యను విషయమునే రుజువు పరచును. నారదుడు ముముక్షువు. మోక్షార్థియై ఉత్తమ మార్గాచరణమున కృష్ణుని రూపమున నున్న విష్ణువు నారాధించినాడు. అయినను భగవంతుడు తనకు వశుడు కాలేదు. ప్రణయరూపిణి యైన సత్య, కామ బుద్ధితో, అకలంకమగు ప్రేమను జూపి, పతియగు శ్రీకృష్ణుని వశంవదు డగునట్లుగ చేసికొన గలిగినది. సాత్త్వికమైన భక్తితో నారదుడు సాధించలేని ఆ మహత్కార్యమును, వైవాహికమైన ప్రణయరూపమైన భక్తి ప్రదర్శనచే హరిని తనవశము చేసికొన గలిగినది సత్య. ఆ "స్వాధీన భర్తృకతయే", భక్తుడైన నారదునిలో ఆమె యెడల అసూయాభావమును జనింపచేసి యుండును. సహజముగ కలహభోజనుడగు సురముని కిపుడొక అపూర్వావకాశము దొరకినది. అందుచేతనే పారిజాత కుసుమ ప్రదాన వేళ ఆ సుమ మహిమ ప్రశంసతో పాటు, అప్రస్తుతమైన సత్యా ప్రసంగమును దెచ్చి, ఆమెను విమర్శింప బూనినాడు. నిజమునకు, పరిశీలించి చూచిన ఆ నిందారోపణ యందును, సత్య స్వాధీనపతిక యనెడు నిజమే దాగియున్నది.

*"హరి బహిః ప్రాణంబవగుట, నేడెఱుఁగంగ*
*వచ్చె నీ కిపుడిది యిచ్చెఁగాన"* ......*(1-58)*

అని నారదు డొక ప్రకటనను రుక్మిణి ముందు చేసినాడు. "నీకిపుడిది యిచ్చె గాన నేఁడెరుగంగ వచ్చె" అనుటచే హరికి నీవు బహిఃప్రాణ మనుట ఈ దినమే వ్యక్తమయినది. అనగా నింతవరకు తాను మాత్రమేగాదు, అందరును సత్యయే బహిః ప్రాణమనిదలంచుచుండిరట! కాని శ్రీకృష్ణుడు ఆ దివ్య కుసుమోత్తమము నామె కిచ్చుట కది కారణము కాదు. ఆమె యింటనున్నపు డామెకు నిచ్చుటయే తగియుండునని భావించుట చేతను, నారదుని కనుసన్నల కారణముగాను పారిజాతము నిచ్చినాడు. నిజమునకు జూడ, ఆ మాయా మానుష విగ్రహునకు దివ్యపుష్పము లభించిన వేళయందు, పదియారు వేల యెనమండుగురు

1. *పంచకన్యలు - పు. 23*

భార్యలలోను అతని మదియందు మొదట మెదిలినది సత్యయే కదా! ఆమెకు వశంవదుడు కాని వాడైనచో పట్టమహిషి యింట నున్నవేళ అట్టి దివ్య కుసుమము లభించినవేళ, ఎట్టి సంశయము లేక దానిని యామెకే యిచ్చి యుండెడి వాడు. ఇంతటి ఆలోచనలకు, తర్జన భర్జనలకు నవసరమేమున్నది? "సత్యభామ కన్సన్నల ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై' యనెడు మాటను, నారదుడు విని యున్నాడట. "నిక్కుచు విఱ్ఱవీగుచు కాంతల నీమె గణింపక పోవుటకు కారణము, పతి యామెకెంతయు ననురక్తుడై వర్తిల్లుట వలననే కదా మరి సవతు లెవ్వరికి నిట్టి గర్వమున్నట్లు లేదే? దీనిని బట్టి చూచినను, హరి సత్యకు అధీనుడనుట స్పష్టము.

అమె కెట్టి దుశ్శకునములు గోచరించినను "ప్రాణనాథుఁడొండొక చపలాక్షిఁగూడి నను నొల్లని చెయ్దము లేని సేసెనో" అనియే శంకించును. తన బంధువులకు గాని, తనభర్తకు గాని, తనకు గాని, ధన ఆరోగ్యాది విషయములందు గాని కష్టములేమి యైనను రావచ్చును గదా? కాని యీమెకు మాత్ర మిట్టి అనుమానమే కలిగినది. దాని వలన దుఃఖము పుట్టినది. స్వాధీనపతికనని తలంచు మానినికి ఇంతకంటె వేరు ప్రమాదమేమి యుండును? షోడశ సహస్రాంగనా కాంతు డతడు. సత్య పలుకులు వినిన, ఆమెకు మాత్రమే అతడు భర్త అనిపించును.

సత్య పలుకుల యందును, చేతల యందును అమె స్వాధీన పతిక యనెడు విషయము స్థిరపడుచుండును. త్రిలోకాధిపతి పట్టపురాణి యగు శచీదేవియును పతి యురమున నిల్చిన లక్ష్మియును, విరించి నాలుకపై వసించు సరస్వతియును హరుని అర్థశరీరమునే ఆక్రమించు కొనిన పార్వతియును, స్వాధీన పతికలు. వారు మాత్రమే ధరించుట కర్హమైన పారిజాతమును, రుక్మిణి దాల్చిన కతన ఆమెయు స్వాధీనపతికగ మారు ప్రమాదమున్నదేమో అనెడు భయము కలిగిన దీమెకు. కుసుమ ధారణచే, రుక్మిణి "సానఁబట్టిన మకరాంకు శస్త్ర మనఁగ" తేజరిల్లినదని చెలి చెప్పినది. ఇది మరింత ప్రమాదకరమైనది. పతి యనురాగ సామ్రాజ్యమునకు తానే పట్టపురాణి. ఆ కుసుమ ధారణచే సవతి యుజ్వల శృంగార మూర్తియై ప్రజ్వరిల్లిన, ఇక పతి, తన ఆధీనములో నిల్చునా? అమె భయము మరింత పెరుగునట్లుగ "... పతిఁగూర్చి దాన నా యంతటి వారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్, వంతుకు వచ్చు సత్య గరువంబికఁజెల్లదని" నారదుడు పలికినాడని చెలి తెలిపినది. ఏ ప్రమాదము వచ్చినను భరింపగలదు గాని, పత్యనురాగ విషయమున నెట్టి యవాంతరము వచ్చినను, అనుమానము వచ్చినను ఈ మానిని సహింపలేదు. నిజమున కామె వల్లభుడు "ఇన్ని దినంబులున్ సవతులిందరలో గడు గారవంబున" "కన్నుల గప్పుకొనంగ నుండినవాడు" (1.88). అట్టివాడీనాడు తనకు సవతుల యెదుట నంతటి భయంకరమైన అవమానము కలిగించుట సహింప లేనట్టిది.

*"అతుల మహానుభావమని యవ్విరిఁదానొక పెద్ద సేసియ*
*చ్యుతునకు నిచ్చకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా*
*నతఁడు ప్రియంబు గల్గునెడ నర్పణ సేసినఁజేసెఁగాక" ...(1-84)*

---

1. *"జలజాక్షి యిది పారిజాత ప్రసూనంబు .*
*నరులకుధరియింప నరిదినూవె*
*పౌలోమి పార్వతి పద్మ పద్మజు రాణి*
*యును శిరంబునఁదాల్తురనుదినంబు" ..... (పారి. 1-58)*

అని అనినదే గాని, "ప్రియంబు గల్గునెడ"కు బదులు సవతి పేరును జెప్పుట కిష్టపడలేదు. రుక్మిణి యతని ప్రియురాలైన కావచ్చును కాని యట్లనుకొనుట కామెకు మనస్కరించదు. తన స్వాధీనపతికాహంకార మంతయు నచట వ్రెళ్ళగక్కినది.[1]

"ఏమేమీ! కలహాశనుండచటికై యేతించి యిట్లాడెనా? యా మాట ల్చెవి యొగ్గి తావినియెనా యా గోపికావల్లభుండు" అనుచు, "ధూర్త గోపాలుడు సేసిన చెయిద మేమి చెప్పుదు, మనమెరియదె ప్రాణమైన మగడిట్లయినన్" (పైది 1-86) అని అడుగుటలోను స్వాధీనుడైన పతి, తన అధీనము తప్పి అన్యాసక్తుడై తన నుపేక్ష చేసినాడు కదా యనెడు కోపము, దుఃఖము గోచరించును. "సత్య చేతిలోని కీలు బొమ్మ శౌరి. కావున ఆమె కోపమంతయు నాతని పయి మళ్ళినది"[2] అని శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు, సత్య స్వాధీన భర్తృకతను సూచించినారు.

సత్య కోప గృహ ప్రవేశమును, ఈమె స్వాధీన భర్తృకతనే నిరూపించును. భర్త తన నన్వేషించుచు వచ్చును, కోపకారణ మరసి తననోదార్చును అనెడు విశ్వాస ముండుటచేతనే, అట్లీమె చేయగలిగినది. అది నిజమని నిరూపించునట్లుగ

*"అరదము నెక్కి కేతన పటాంచల చంచలమైన తాల్మితో*
*దురగజవంబు మున్గడవఁద్రోచి కడంగెడు తత్తరంబుతోఁ*
*దిరిగెడు బండి కండ్ల పగిదిన్ భ్రమియించు మనంబుతోడనా*
*హరి, సనుదెంచెసత్య నముదంచిత కాంచన సౌధ వీథికిన్"* ...(పారి.1-104)

సత్య యనిన శ్రీకృష్ణునకు గల భీతి ప్రీతు లిందు స్పష్ట మగుచున్నవి. అంత ప్రియమైనది గావుననే యింతటి భీతి. మూలమునందలి కృష్ణుని రాకలో, అంతటి ఆందోళనము, భీతి, కనిపింపవు. సర్వగ్రాహియైన కృష్ణుడు, రుక్మిణి కడ నారదుడుండుట చూచి, ఏదో కార్యార్థమేగునట్లు అచట నుండి వెడలి[3] సత్యా భవనమునకు వచ్చును[4].

సత్య మధుర వచనములు, శృంగార కలాపములు హరికి ఆనందమును గూర్చునట్టివి. అట్టి శృంగారమూర్తి శోక తప్తయైన చూడలేడు. కుపితయై పరుండిన ప్రేయసి దరి చేరి, వీవనతో మందముగ విసురుచు సేవలు జేసినాడు (1-109).

"ఒక్క నిముసమైన నీవు దయ గన్గొనకుండిన నిల్వ నేర్తునే" (1-116) అని "ప్రేమతో" బ్రతిమాలుకొని నాడా సత్యాపతి. రుక్మిణీ సత్య లిరువురకును మిగుల చనవులిచ్చినను, నిజమున కాయన యనురాగమంతయు సత్య మీదనే. రుక్మిణికి చేసిన మన్నన కేవలము మెరమెచ్చుల కొరకే. శరీరము ద్వారముగనే పెర వనితల విషయమున తాను ప్రేమ చూపింతుననియు, అదియు, ముఖ ప్రీతి కొరకే యనెడు విషయము నిప్పుట్టున ఆమెకు తెలుపుట, అవసరమైనది.

*"మనమున మాటలంగ్రియల మన్నన లీనొక నాఁడు నెట్టికా*
*మినులకు గారవంబు మెర మెచ్చులకై పచరింతుఁగాని, పా*
*యని యనురక్తి నీయెడనె యగ్గలమై కనుపట్టు నాకు, నీ*
*పనిచిన పంపు సేయుటయ ప్రాభవమౌటది నీవెరుంగవే?"* .....(పైది-1-118)

---

1. *యస్వీ. జోగారావు - సారస్వత నీరాజనము .... పు. 68*
2. *విజయనగరాంధ్ర కవులు - పు. 250*
3. సం. హరి. వి.ప. - *66 - 1*
4. పైది - *66 - 2*

అనెడు శ్రీకృష్ణుని మాటల వలన, మనో వాక్కర్మల నాతడామె కధీనుడనియు, ఆమె ఆజ్ఞానువర్తి యనియు విదితమగుచున్నది.

ఎంత బ్రతిమాలు కొనినను అప్పాటలగంధికి కోపోపశమనము గాకపోవుటచే చివరకామె పాదములకు శిరముంచి "మ్రొక్కి" నాడు. పేరలుక నున్న ఆ లతాంగి "జలజాతాసన వాసవాది సుర పూజా భాజనంబై తనర్చు లతాంతాయుధు కన్న తండ్రి శిరమును" "వామ పాదంబునం దొలగం ద్రోచి" నది. అయినప్పటికిని రసికావతంసుడైన "కుహనా గోపాలుడు" కోపమును పొందక "ఉద్దీపిత మన్మథ రాజ్య ప్రాపితుడై", "నను భవదీయ దాసుని మనంబున నెయ్యపు గిన్క బూని తాచిన యది నాకు మన్ననయ" అని "కూరిమి బయలు పడంగ"గ ఆనందముతో పల్కినాడు. మహావిష్ణువు అవతారమైన కృష్ణుడు భార్య పాదములకు మ్రొక్కినట్లు వర్ణించుట రసభంగమనియు, కృష్ణునకు గౌరవహాని యనియు సత్య వామపాదమున పతిశిరమును దొలగ ద్రోచుట ఆమె అహంకారముగ గనుపించు ననియు ఒక వాదమున్నది. "కాని యది రసిక జనానుభవైక వేద్యమనియు, గామ శాస్త్ర సమ్మతంబని దెలియవలయు" నని నాగపూడి కుప్పుస్వామయ్యగారు పై దానిని సమర్థించుచు చెప్పిరి[1]. గురుమానముచే కోపించిన నాయికను అనునయించుటకు పాద ప్రణామమే తగినదని ఆలంకారికులును సమ్మతించిరి. "నాథుల్నేరము లేయ బేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారము ల్నేర్తురే?" అని కవియే ఆమె చర్యను సమర్థించినాడు. కృష్ణుడును భవదీయ దాసుడననుచు, ఆమెపై గల తనకు గల అనురాగాతిశయమును, విధేయతను ప్రకటించుకొనినాడు. ఆమె ప్రేమకు తగినంత చనవునిచ్చినాడు. అందుచేతనే ఆమె పతి శిరమును "తొలగం ద్రోచినది". ఆమె స్వాధీన పతిక యనుటకిది యొక గొప్ప నిదర్శనము.

పతి తన నుపేక్ష చేసినాడనియు మానము పోయినదనియు తలచి, అమ్మానవతి ప్రాణ త్యాగము చేయుదునని చెప్పుచు, చివరకు దుఃఖము పట్టజాలక యేడ్చినది. నిజమునకామె యేడ్పునకు కారణము, తన ప్రియమైన శమంతకాదు లేయితర యువతికి దక్కునో యనుట కంటె తనకు స్వాధీనుడైన పతి మరి యేకాంతకధీనుడై పోవునో యనెడు భయము, బాధయే!

చివరకు హరి, కేవలముఒక పుష్పము కొరకు ఇంతవంత ఎందులకని ఓదార్చుచు ఇంద్రుని ఓడించియైన పారిజాత వృక్షమును తెచ్చి యిచ్చెదనని శపథము చేసి తాను సత్యా ప్రియుడనుటను ప్రకటించుకొనినాడు. సరసాలాపముల చేతను, వినోద కథలు చేతను సాత్రాజితిని ప్రేమరసాంబోధి నోలలార్చి, కడు సమ్మానంబు గావించి, చివరకు తన ప్రతిన ప్రకారము పారిజాతమును సాధించి, తాను సత్యా విధేయుడనుటను నిరూపించినాడు.

భర్తృ సాంత్వనానంతరము సత్య, నాథుడు ఉప్పొంగునట్లు జలకంబులాడి, మడుగు చీరగట్టి, మైపూత అలది మణి భూషాదుల నలంకరించుకుని, చెంగలువలను, కొప్పునందు ధరించినది (2-14). ఇట్లు సత్య, ప్రియవాల్లభ్య పాత్రమగు శృంగారవేషము నేవేళ మరువదు. అందుచేతనే శ్రీకృష్ణునికి ఈమె యనిన ప్రత్యేక ఆకర్షణ.

ఈమె కోపోపశమనము జరిగిన తరువాత, నారదుడు, తాను నాటిన కలహ బీజమెంత వరకు మొలకెత్తినదో చూడవచ్చినాడు. ప్రసన్నచిత్తయై ప్రత్యక్షమైన సత్యభామను చూడగానే అతనికి ఆశాభంగమే కల్గినది. జరిగిన విషయములను గ్రహించి యుండును. అందుచేతనే సత్య భర్తృ వాల్లభ్యమును ప్రశంసింపకుండ నుండలేక పోయినాడు. మూలమున నారదుడు

1. నాగపూడి కుప్పుస్వామయ్య - పరిమళోల్లాస వ్యాఖ్యా సహిత పారిజాతాపహరణము - పు. 67

"ఎప్పటివలె పతివ్రతవై విశేష సౌభాగ్యశాలివై యుండు" మని సత్యను ఆశీర్వదింపగ[1], తిమ్మన ప్రబంధమున సురముని సత్యభామ స్వాధీన భర్తృకత అనన్య సాధ్యము, అసాధారణ మనునట్లు ఇట్లు ప్రశంసించును.

*"పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధు సం*
*తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంతల్చూచి లజ్జింపఁగా*
*నతుల ప్రాభవ వైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించు నీ*
*కితర స్త్రీ జన బుద్ధి దీవనలు నేనే మిచ్చెద న్మానినీ"* .... (పారి-2-24)

ఇందు సత్యభామ భర్తృవాల్లభ్యము దేవమునికి కూడ ఆశ్చర్యము కల్గించినట్లు తోచును.

*"అనికైనం బతి నిన్నుఁబాసి చనునో ప్రాణంబు ప్రాణంబుగా*
*నినుమన్నింపఁడొ నీ మనోరథములన్నెయ్యంబుతోఁజేయడో*
*చనవుల్నీవలె నెవ్వరేఁ గనిరొ నీ సౌభాగ్యమింతింతయే*
*నినుఁబోలం గల రబ్జగంధులన వింటే యెందు సాత్రాజితీ"* ..... (పారి. 2.25)

అని నారదుడాడిన మాటలు సత్యభామ తిరుగలేని స్వాధీన భర్తృకతనే చాటును. అంతేకాదు, అన్ని విధములగు సౌభాగ్యములకు తోడు,

*"…. .. …. …. …. ….. …. ….*
*నీకు మగఁడు గోరిన కోర్కుల్*
*ఘటియించుఁగాక తానెం*
*తటి కార్యంబైన డించి నా దీవెనలన్"* ....(పైది 2 - 26)

అని ఆశీర్వదించి సత్యభామ స్వాధీన భర్తృకత మరింత పెరుగునట్లు చేసినాడు.

మూల హరివంశమునందు శ్రీకృష్ణుడు సాత్యకితో కలిసి పారిజాతాపహరణమునకై దివి కేగినట్లుండగ[2], ఈ ప్రబంధమున "దానును సత్యభామయును" "విహగాధిపునెక్కి" (పైది 2-76) దివి కేగును. నరకాసుర వధార్థమునాడే కాదు, పారిజాతోత్పాటన సమయమునను సత్యభామను వెంటనిడుకొని పోవుట చూడ నారదు డనినట్లు అనికైన సత్యను బాసి చనలేని కృష్ణుని సత్యా ప్రియత్వమునే సుస్పష్టము చేయును. మార్గమధ్యమున మేరుపర్వత[3] నాక వర్ణనములు[4] చేయుచు అమరావతియందు నందనవన శోభను[5] వర్ణించుచు ప్రియసతిని నలరించినాడు. ఇట్టి భాగ్యము కృష్ణకాంతలలో వేరెవ్వరికిని దక్కలేదు.

స్వర్గమున ఒక వేలుపు జాణ తన పెంపుడు చిలుకచే కృష్ణుని పిలిపించగ, అతడు రహస్యముగ అనుభవింపవలసిన మధురానుభూతిని కూడ విడిచి, ఆ వేలుపు పడతి

"కోప కందళిత కలుషాయితాక్షీ వలనంబు"ల "తన్నదల్చు చుండగ "సత్యభామకా కలికి తెరంగు, శౌరి, కడకన్నుల సన్నల జూపి" నాడు (పైది 3-20).

నందనోద్యాన సీమ యందలి పారిజాతమును చూడగనే ఆతురతతో

*"... ... .... ........ .... .... ఏల తామసం*
*బీ విబుధాధి నాయక మహీరుహముం బెకలించి లోక సం*
*భావితమైన నీ పలుకుఁబంతము సెల్ల మదీయ గేహకే*
*ళీ వనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా!"* ......(పారి 4-11)

---

1. సం. హరి - వి - ప. 67 - 45
2. సం. హరి. వి. ప. - 73 - 4
3. పారి. 2 - (85 - 96)
4. పైది 2 - (97 - 101)
5. పైది 3- (53-57)

అని అనురాగముతో కర్తవ్యమును సూచించుట, సత్యభామ భర్తృ వాల్లభ్యమునకు మరియొక యుదాహరణము. ఆమె పతియు, అందులకు "భవదిష్టం బేను గావింతు నంగన" (పైది 4-12) అని పలికి, మరునాడు పారిజాతమును నుత్పాటించినాడు. కాని ఆ సమయమున ఆ పారిజాతము ఇంద్రాణిదనియు, వంచనతో కొనిపోవుట తగదనియు చెప్పుచు నందనోద్యాన పాలకు లడ్డుపడిరి. వారితో 'నేమే వచియింప బూను హృదయేశ్వరుని గర సంజ్ఞ మాన్చి' నది (4-58). ఈదివ్యభూరుహమునకు ఇంద్రుడు కాని, ఇంద్రాణి కాని సొంతదారులు కారనియు, వార్థిపొడమిన ఇందిరను కౌస్తుభమును చేకొనిన హరియే, వార్థి నుండి పొడమినదే యగు దీనిని కూడ చేకొన గలడనియు, వాదించుచు, ఇదిగో, నావిభునిచే, పారిజాతవృక్షమునుపెకిలింపచేసికొని పోవుచున్నాననుచు

*పలుకులేటికిఁదా వీర పత్నియేని*
*మీ శచీదేవి తనదు ప్రాణేశుడైన*
*మఘవునిట బంపి సత్యభామా విధేయు*
*వలన మరలంగ గొనుటెపో వాసితనము" .....(పారి - 4-59)*

అని దిట్ట తనముతో పలికినది. "ఈ పద్యమును బురస్కరించుకొని చూడగా సత్య గర్వోక్తులు పలికి నట్లు గాన వచ్చుచున్నది. కాని నిజము విచారింప నా మాటలన్నియు యాథార్థ్యములే కాని యన్యములు గావు"[1]. సత్యభామా విధేయుడట కృష్ణుడు. ఆమె కెంతటి విశ్వాసము! ఎంత గర్వము! నిజమే మరి, అన్నిమాట లిట్లీమె అనుచున్నను నోరెత్తక నిలిచినాడా సత్యాపతి. నరకుని యెదిరించిన వీరవనిత తాను. నరకునినే పరిమార్చిన జగదేకవీరు డాతడు. అట్టి మహావీరుడు, పరతత్త్వము తనకు భర్త యగుటయే కాదు, పరమ విధేయుడు కూడ!

దేవ కాంతల వలపును, దేవ మాత నుతుల నందుకొన్నవాడు తనకు విధేయుడై యుండుట వలననే ఆమె కింకను గర్వము పెరిగినది. ఆ కారణము చేతనే ఇంద్రాదులను సహితము లెక్కచేయ లేదు. శ్రీకృష్ణుడు సత్యావిధేయుడగుట వలననే, సోదరుని వనమున, బంధువుగ నడుగు పెట్టి, సతికి నానందము కలిగించుటకై దివ్య నగము నపహరించియైనను కానుకగ నివ్వబూనినాడు.

"ఆమెయే సత్యభామా విధేయుడని ఢంకా వేసి చాటుకొన్నది. కృష్ణమూర్తి యెంత యింద్రియ లంపటుఁడైనను మానావమానములును సుఖదుఃఖములును లేని మ్రాని బొమ్మ గాదు గదా! ఒక్కసారియైనను మనసు విరగకుండునా"[2] అని పుట్టపర్తి నారాయణాచార్యులు గారు తమ భయమును ప్రదర్శించుకొనిరి. కాని "నిక్కముగా గృష్ణు డమ్మహాదేవి చెప్పినట్లంతయు నాడుచుండెను, గావున సత్యభామా విధేయుడని తన మగనిని దా జెప్పినది యొప్పెయగుం గాని తప్పు గాదు" అని కుప్పుస్వామయ్య గారు సమర్థించినారు[3].

కృష్ణుడు దక్షిణ నాయకుడే అయినప్పటికిని సత్యపై ప్రత్యేకాభిమానమున్నవాడు గావున సత్య యనిన ఆ మాటలకు సంతోషించియే యుండును. కోపనయై చే విరి దమ్మిచే వ్రేయుటకునై యుంకించి జంకించినపుడు గాని, వామపాదమున శిరమును దొలగంద్రోచి నపుడు గాని, ఆ రసికావతంసు డధికముగ సంతోషించెనే గాని కుపితుడు కాలేదు. ఆ రసిక చక్రవర్తి నిజముగ సత్యావిధేయుడే. లేనిచో ఆ మాట సతి యనుచుండగా మారాడక

---

1. *పి. యశోదా రెడ్డి - పారిజాతాపహరణ పర్యాలోచనము - పు. 141*
2. *ప్రబంధ నాయికలు - పు. 38*
3. *పారిజాతాపహరణము - పరిమళోల్లాస వ్యాఖ్య పీఠిక - పు. 24*

నిలిచియుండగలడా? "అలంకారికముగ చూచిన నిందెట్టి దోషమును గానరాదు. సత్యభామ శృంగార నాయికలలో స్వాధీనపతిక. ఈ పద మావిషయమునే తెలియజేయుచున్నది. ఆ పదము దోష దూషితమగుచో ఆలంకారిక శాస్త్రమునుండి స్వాధీనపతికను తీసివేయవలసి వచ్చును"[1] అని వై. రాధాకృష్ణారావుగారు సమర్థించినారు.

సత్య తాను వీరపత్నినని చాటుకొనినది. దానికి తగినట్లుగ ఇంద్రాదులతో వీరోచితముగ పోరాడి జయము సంపాదించి ఆమె మాటలను నిజము చేసినాడు. పోరాటము నడుమ, తన మ్రోలనున్న "కామిని నెమ్మోమున దృష్టి నిల్పి" (85-19) "మచ్చటులాస్త్ర ఘట్టన మనంబున నెంచక నానగేడియై వచ్చినవాడు చూచితివే వాసవునిం, గమలాయతేక్షణా" (5-20) అని ఇంద్రునిగూర్చి పరిహాసముగ పలికి సతికి సంతసము గలిగించి, "చూడుము నన్ను" అని సత్య ప్రశంసలకై, విజృంభించినాడు. ఇంద్రుడు తనకు నమస్కరింపగా, హరి "నీ వలన లేదొక తప్పును నీ మరంద లీకొమ్మ వదాన్య భూరుహముఁగోరినఁ దెచ్చితిఁగాని, కొమ్ము, నీ సొమ్ము" (5.39) అని అనుచు తన రాకకును పారిజాతోత్పాటనమునకును గల కారణము, సత్యభామ యెడల గల ప్రత్యేకానురాగమే యను విషయమును ధ్వనింప జేసినాడు.

ద్రౌపదియు సత్యభామ వంటి స్వాధీనపతికయే. సౌగంధికము యొక్క అపూర్వ రామణీయకత కచ్చెరువు పడిన, ద్రౌపది "అక్కటా యిది యొక్క పువ్వు యయ్యు నపూర్వంబై మనో నయనానందకరంబైనది, యిట్టి కుసుమంబులు కడుంబెక్కులు గావలదె యవి కురంగటం గలవేని తెచ్చి యిచ్చి నాకు మనః ప్రియంబు జేయు" మని (భార. ఆరణ్య - 3 - 311) కోరగా, భీముడద్దానికై బయలుదేరి కుబేర వనమునందలి వానిని చూసి, యక్ష, రాక్షసులతో భీకరముగ పోరి, సాధించును. తన ప్రయత్నమున కడ్డువాట్లు వేయు వనపాల కులైన రాక్షసులతో, ఇతడు "ద్రౌపదీ హృదయ ప్రియం బొనరింపఁగాఁ బూని యిక్కమలా కరంబున బుష్పముల్ గొనవచ్చితిన్" (పై ది - 3 - 362) అని సౌగంధికాపహరణమునకు గల కారణమును వివరించును. మహారాజపుత్రియయ్యు, తమ దోషకారణముగ అరణ్యవాసము చేయు చున్నదియు, పాండవులైన తమకందరకు భార్యయు నైన ద్రౌపది యెడల, ఆమె భర్తలలో ఒకడైన భీముడు, ఇట్లు ఇష్టము నెరపుటలో ఎట్టి ఆశ్చర్యమును లేదు. కాని, బహు కాంతాకాంతుడైన కృష్ణుడు, ఇంద్రునితో "నీ మరందలీ కొమ్మ వదాన్య భూరుహము గోరిన దెచ్చితి" నని, తనకామె మాత్రమే భార్యయనునట్లు పల్కుట మాత్రము అసాధారణమైన సత్య స్వాధీనభర్తృకతనే నిరూపించును.

పారిజాతాపహరణ విజయానంతరము శౌరి "విక్రమ కళా సంలబ్ధ తత్ప్రేయసీ సంధాసిద్ధిఁ గృతార్థుడై" (5-41) భువికి సంతోషముతో మరలినాడు. ఇంద్రుని పరాభవము కాని, కల్పనగ హరణము కాని, అతని కోరిక కాదు. ప్రేయసీ ప్రతిజ్ఞా సిద్ధియే కృష్ణుని లక్ష్యము. యుద్ధ సమయంబున ప్రియ భార్య చెంతనే యుండి యున్నది. అయినను తిరుగు ప్రయాణము నడుమ, "వాసవుతోడి కయ్యమున వార్తలు చెప్పి" సంతసింప జేసినాడు. ప్రియురాలి వాంఛితము నెరవేర్చుటచే "మోము దమ్మి నుల్లాసము మందహాసము దొలంకి"నది. ఇంటికి చేరువరకు నాగలేక, మధ్యలోనే తన "వధూమణి"కి, "వేలుపుమ్రాని పూవులం జేసిన సొమ్ము

1. వై. రాధాకృష్ణారావు - త్రివేణి - పు. 42, 43

లంగముల జేర్చి "ఆదరించెను" (5-42). భూలోకమునకు విచ్చేసిన వెంటనే "ప్రతిన వచ్చెఁగదా యిదె పారిజాత"మనుచు (5-49) దానిని దేవికి సమర్పించి, సంతసమును కలిగించినాడు.

మూలమున హరి, సత్యతో నీకెంత కాలమిష్టమో అంతవరకు పారిజాతము నీ యింట నిలుప గలనని ప్రతిన చేసినను[1] ఒక సంవత్సర కాలము మాత్రమే నిలుప గలిగినాడు.[2] కాని ఈ ప్రబంధమున వాగ్దానము చేసినట్లుగానే తన జీవితకాలము వరకు ఆమెకు పెరటి చెట్టుగ చేసి[3] సత్యా ప్రియంకరుడనని నిరూపించుకొనినాడు.

సవతులకును "సత్య స్వాధీన భర్తృక" యనెడు విషయము, మరింత స్పష్ట మయినది. సత్య వలె తామడిగిన భర్త చేయునా? చేయక పోవచ్చును. కాని సత్యకా నేర్పున్నది. అందుచేతనే వారు, సత్యాకృష్ణుల అనుకూల దాంపత్యమును ప్రశంసించుచు

*"సతులఁట! ప్రాణనాథులఁట! సారెకు నైక్యము లైన మోహసం*
*గతులఁట! యేమి సెప్ప! బల ఘస్మరుఁబోర జయించి కల్పక*
*క్షితి రుహము న్నిజేశ్వరికిఁ గృష్ణుఁడు దానిటఁదెచ్చెన్........"* .... *(పారి 5 - 51)*

అనుచు సత్య స్వాధీన భర్తృకతను సంస్తుతించిరి. వారును, కృష్ణునకు సత్య మాత్రమే భార్య యనునట్లు "నిజేశ్వరికి గృష్ణుడు" తెచ్చెనని అనుకొనిరి.

పారిజాతమును "పెట్టు చెట్టు జేసి" కొని, సత్య సవతులనే కాదు, "త్రిభువనేశ్వరి యనంగ బొలుచు పౌలోమి"ని గూడ "గెలిచినది". (5-54).నిజమునకు పౌలోమియును స్వాధీనపతికయే. పతి యగు నింద్రుడు ఆమె నంకపీఠముం జేరిచి సోగ వెండ్రుకల జిక్కులు వాపి, వియన్నదీ నవాంభోరుహ నాళ సూత్రములం బొందుగ పారిజాత సుమముల సరులను గూర్చి, ఆమె నిండు కొప్పునందు సంతోషముతో నింపును. (పైది 4-8). పారిజాతమును శచికి సొంతమగునట్లు ఇంద్రుడు ఇచ్చినాడు. ఆ "కుసుమ కోమల యాజ్ఞ"చే దేటిగములు సైతము దీని చెంగట నటింపను, బువ్వుల తావి గ్రోలను భయంబు నొందునట! అట్టి వృక్షమును, సత్య ప్రోద్బలముచే శ్రీకృష్ణుడు హరించినాడని తెలిసి, శచీపతి కోపముతో తమ్మునిపై దండెత్తి వీరోచితముగ పోరాడినాడు. సత్యా శచీదేవు లిరువురును స్వాధీన పతికలే గావున, "వేల్పుమ్రాని యందు వేడుక పడు కూర్మి సతుల కోర్కి దీర్ప జాలి" "హరియు హరియు" "అన్యోన్య జయ కాంక్షతో" అన్నదమ్ముల మనుమాట మరచి పోరాడినారు. (5-23). వీరపత్నినని సత్య ప్రకటించు కొనినట్లుగనే హరియే చివరకు గెలిచినాడు. ఈ కారణముగ ఇరువురును స్వాధీనభర్తృకలే యైనను, శచీదేవి కన్నను, సత్యయే ఒక మెట్టు పైనున్నది.

సత్య శచీదేవిని మరియొక విషయమున మించవలసియున్నది.

ఇంతవరకును పతివ్రతలలో నగ్రగణ్యయగు నరుంధతియు, పతి శరీరము నందర్థ భాగమును ఆక్రమించుకొన గలిగిన పార్వతియు మహనీయమగు పుణ్యక వ్రతము నాచరించిరి. పౌలోమియు నాచరించినది (5-55). అన్నిట ఆమెను మించిన సత్య ఈ వ్రతాచరణము వలనను ఆమెను మించి తాను "స్వాధీనపతికామణు"లలో నగ్రగణ్య యనుటను ప్రకటింప వలయును. ఈ వ్రతాచరణము వలన పతి మరింత అధీనుడగును. అందులకై తీవ్ర నియమ భరితమైన వ్రతము నాచరించుటకును పూనుకొనినది.

---

*1. సం. హరి. వి. ప. 67 - 32*
*2 పైది. 76-26*
*3. పారి. 5 - 40*

దాన సమయమున భర్తను దానము చేయబడుటకై అంగీకరింప చేయుమని నారదు డనగానే, సత్య "ప్రాణ వల్లభుని ప్రేమ రసాల వీక్షణంబునం గనుంగొని", "మోము వాంచి' "మధు కైటభ మర్దన చిత్తగించితే, మునిపతి మాట" (పైది 5-77) అని సిగ్గుతో, చనవుతో నడిగినది. పదియారువేల యేడుగురు సవతులు తన ముందరున్నారు. హరి వారికిని సొంతమే యగును. కాని అతడు వారెవ్వరి అనుమతిని పొందలేదు. అభిప్రాయమైనను అడుగలేదు. మీదు మిక్కిలి "నవ చంద్రాలిక! నీకు నేల యనుమానం బాగమోక్తంబుగాన విచారింపక ధార వోయు" మని ప్రోత్సహించినాడు. ఇప్పట్టున సాభిప్రాయ సంజ్ఞలచే తన ఆజ్ఞను పతిచే నెరవేర్చు కొనిన సత్య, రసమంజరి లక్షణానుసారము స్వాధీనపతికయే యగు చున్నది.

సవతులందరును చెంతనుండియు, తమకేమాత్రము హక్కులేనట్లు మాట్లాడకుం డుటయు, ధారాదత్తము చేయునప్పుడు హరి వలదనక సంతసముతో అంగీకరించుట చూచిన సత్య స్వాధీనపతిక యనుట రుజువగుచున్నది. ధారాదత్తము చేయు స్వామ్యమామెకు మాత్రమే యిచ్చుట వలన, సవతులు సిగ్గుతో ముఖములను వంచుకొనినారు.

"శ్రీకృష్ణ పరమాత్మకు జగములన్నియు లోకువై యుండ అతడు సత్యభామకు లోకువ"[1] అని అంకయ్యగారనిన మాటలలో కొంత నిజమున్నది. లోకువ వలె గన్పట్టు చనవునామె భర్త నుండి సంపాదించు కొనగలిగినది. అందుచేతనే "పరమ ముని మానసాలాన బంధనమున గుదుర పడకుండు యాదవ కుంజరంబై"న శ్రీకృష్ణుడు"వికచ రాజీవనేత్ర" యైన సత్య చేత "వేల్పుమ్రాన గమ్మఁబూవుల దండచే గట్టువడి పోయి"నాడు (పైది 5-80). ఈమె స్వాధీన భర్తృకత ఈ కారణముగ లోకమునకు మరియొక మారు ప్రకటితమైనది. శ్రీకృష్ణుడు, సత్యప్రేమ పాశములకు కట్టువడి పోయినాడని తెలిసికొనియే వ్రతాంతమున నాతనిని తిరిగి యిచ్చివేయు నప్పుడు నారదుడు "నీ మనోహరునిఁ జేకొను మిచ్చెద" (పైది 5-88) అని సత్యతో ననినాడు.

కావ్యమందు ప్రయుక్తములైన సంబోధనలను చూచినను, సత్య స్వాధీనపతికయే యనుట స్పష్టమగును. వైతాళికులు శ్రీ కృష్ణుని మేల్కొల్పుచు "సాత్రాజితీ ప్రియ" యనిరి (పైది 2-56). కృష్ణ మహిమల, నవతారములను స్మరించుచు స్తుతించు నెడ అమరమాత అదితి కూడ, చివరకు "సత్యభామా ధవా" (3-38) అనియే సంబోధించినది. గోవిందుడు నిజముగ "సత్యా చంద్రముఖీ వరుడే" (పైది 5-91).

"నాకు జూడ సత్యాదేవి భార్యగను, కృష్ణమూర్తి పెనిమిటిగను గాన రారు. కృష్ణుడు దనకు బూర్తిగ లోబడిన శృంగార ప్రియుడే యనుకొందుము. ఆ చాపల్యముచేఁదనకు గొంత యధికారము నెక్కువ నిచ్చి యుండవచ్చును. నిజముగ దాను గౌరవింపదగిన భర్త కదా! అట్టి యెడ బ్రణయ స్వరూపిణియగు సత్య తన యధికారము నింత వెక్కసముగ జెలాయించ వచ్చునా? మగనిని బూరి కన్న హీనముగఁ జూచుచున్నదే"[2] అని పుట్టపర్తి నారాయణాచార్యులు గారు తమ బాధను వ్యక్తము చేసినారు.

నిజమునకు శ్రీకృష్ణు డామెకు నితర కాంతల కన్న నెక్కుడగు చనవు నిచ్చుట చేతనే, ఇన్ని విధములుగ నధికారము చూపగలిగినది. శిష్ట్లా లక్ష్మీకాంతశాస్త్రి గారనినట్లుగా "ఆమె యందు మిగిలిన సవతుల కంటె నొక విశిష్టగుణమున్నది. అదియే రాజసము. అది యామెను ప్రతి విషయము నందు సవతులను మించిన వ్యక్తిగా చేసినది. శ్రీకృష్ణుని దాసునిగా

---

1. వి. అంకయ్య - సాహిత్య చంద్రిక - పు.27

2. పుట్టపర్తి నారాయణాచార్యులు - ప్రబంధనాయికలు - పు. 36, 37

నొనరించినది."[1] ఆమె చేష్టలలోను, పలుకులలోను దోషమున్నట్లు గన్పించినను, నిజమునకవి ప్రణయాధిక్యము వలన జనించినవే గాని, వేరు గాదు. ఆ కారణము చేతనే ఆమె యేమి చేసినను, పలికినను ఆనందముగా స్వీకరించినాడా రసిక చక్రవర్తి.

నిజమునకు పారిజాతాపహరణ మనెడు ఈ ప్రబంధ నామమే "సత్య స్వాధీనపతిక" యనెడు విషయమును చాటు చున్నది. పారిజాతాపహరణమునకు మూల కారకురాలీమె. ఈమెను తృప్తి పరచుటకై హరి దానిని అపహరింప వలసి వచ్చినది. అనగా పతి యీామె కెంత అధీనుడో, దీని వలన విదితమగు చున్నది. స్వాధీనపతికయయ్యు కొంటె కృష్ణయ్య కపట నాటకముల వలన సత్యభామ లోకమున ఖండిత నాయికగనే ప్రసిద్ధి కెక్కినది.

'స్వాధీన పతికా నాయికకు ఉత్తమోదాహరణము సత్యభామయే అనిపించును. కృష్ణయ్యా నామె తన కొంగునకు ముడి వేసికో గలిగినట్లు ఏ స్త్రీ తన భర్తను వశము చేసికో గలిగినది'[2]? అని చన్నాప్రగడ తిరుపతిరావు గారనిన మాట లెంతయు సత్యము. ఈమె స్వాధీనపతిక యనుట ఆమెకు మాత్రమే కాదు, సవతులకును తెలియును. నారదుని కలహ సంభ్రమపరత వలన ఆ సత్యము మరియొక మారు నిరూపితమైనది. చివరకు పౌలోమికిని, అమరాధిపతికిని అమరమాతకును ఈ సత్య మవగతమైనది. ఇట్లు భూలోకమునందు మాత్రమే గాక, నాక లోకమునందు కూడ తన అసామాన్యమైన స్వాధీన భర్తృకతను నిరూపించుకొనిన స్త్రీ, ప్రపంచ సాహిత్యమున ఈ "సత్యభామ" యొకతెయే యనిపించును.

పారిజాతాపహరణము నందలి సత్య ప్రౌఢ. సాహిత్యదర్పణ లక్షణానుసారము స్మరాంధురాలును, సంపూర్ణ యౌవనము కలది, సమస్త రతి కోవిదయు, ఉన్నతములైన శృంగార చేష్టలు కలదియు, అల్ప లజ్జ కలదియు, నాయకుని వశీకరించు కొనునట్టిదియు నగు స్త్రీ ప్రగల్భ లేక ప్రౌఢ అగును[3].

జాతి భేదముచే పద్మిని, చిత్రిణీ శంఖిని, హస్తిని అను నాలుగు విధములుగ వర్గీకరింపబడిన నాయికలలో, పద్మిని జాతి స్త్రీ ఉత్తమ తరగతికి చెందును. కురంగశాబ నయనయు, పూర్ణేందు ముఖియు, పీన ఉత్తుంగ కుచయు, శిరీష పుష్పమువలె మృదువైనదియు, లజ్జావతియు, మానినియు, అల్పాహారమును భుజించునదియు, పద్మ ముఖియు, దేవాది పూజలందు ఆసక్తి కలదియు, హంస భాషిణియు, సులలిత వేషయు, హంసీ గమనయు, త్రివళి లలిత మధ్యయు, తెల్లని వస్త్రములను ధరించునదియు పద్మినీ జాతి స్త్రీఅని తెలియుచున్నది.[4] సత్య "పాటల గంధి" (పారి 1-120), "ఇందువిభాస్య" (పైది 1-115), "హాయన మాత్ర కురంగ లోచన" (పైది 2-97), "ఏణీశాబ విలోల నేత్ర" (పైది 2-91), "లలితాంగి" (పైది 1-109), "కిన్నెరకంఠి" (పైది 2-89) "గంభీరవేది గమన" (పైది 2-93), కెందలి రాకు మోవి కలది (పైది 1-115), కావున ఈమె పద్మినీ జాతి స్త్రీయగును.

పద్మినీ జాతి స్త్రీలకు తెల్ల చీరలును, చిత్రిణీ జాతి స్త్రీలకు ఎర్రని చీరలును సమ్మతములని శృంగార శాస్త్ర సూత్రకారులు చెప్పిరి. ఖండితయై యున్న సత్యను చూచి కృష్ణుడు "సన్నగావు లీవెందును మానలేవు తెలుపేటికి గట్టితి?" (పారి 1-115) అని అడుగును. దీనిని బట్టి సత్యభామకు ఎర్ర చీరలే ఇష్టమని, దానినే కట్టుననియు

1. "విజయనగరాంధ్ర కవులు" - పు-259
2. పంచకన్యలు- పు.23
3. "స్మరాంధా గాఢతారుణ్యా సమస్తరతికోవిదా భావోన్నతాదర వ్రీడా ప్రగల్భాక్రాంతనాయకా" సాహిత్యదర్పణము. 3-102
4. త్ర్యంబక మఖిన్ - అనంగరంగ - ధర్మాకూతం - సుందరకాండ వ్యాఖ్య - పు - 119

తెలియుచున్నది. ఇంత మాత్రముచే సత్యను చిత్రిణీ జాతి స్త్రీగ పొరపడరాదు. సత్యభామయే కాదు, ప్రముఖప్రబంధ కాంతలు పెక్కుగును ఎర్ర చీరలను ధరించుటయే పరిపాటిగ కనిపించుచున్నది.

మనుచరిత్రమున వరూధినియు[1], ఆముక్తమాల్యద యందు గోదాదేవియు,[2] విజయ విలాసముననను,[3] సుభద్రాపరిణయముననను సుభద్రయు,[4] అష్టమహిషీకల్యాణమున లక్షణయు,[5] రాధికా సాంత్వనమున రాధయు,[6] ఎర్రని చీరలనే ధరించినట్లు వర్ణింప బడినారు.

ఆ నాడు శృంగార నాయికలుద్దీపమునకై ఎర్రని చీరలు ధరించినట్లు కనిపించుచున్నది. ఖండితయగు సత్య నననయించు కృష్ణుడు "ఇందునిభాస్య మై తొడవులేల ధరింపవు" (పైది 1-115) అని ఆశ్చర్యపడును. దీనిని బట్టి కోపముతో నున్న సత్య ఆనాడు నగలను ధరింప లేదనియు, లేకున్న నిత్యము ధరించు చుండెడిదనియు అవగతమగును. కావున, దీనివలన సత్య "నిత్య మణిహార భూషిత" యనియు స్పష్టమగు చున్నది. పై లక్షణములను బట్టి చూచిన సత్యభామ శాస్త్రకారుడు చెప్పిన పద్మినీ జాతి స్త్రీ యనుట రూఢి యగుచున్నది. భర్త యొక్క అధికానురాగము పొందిన దగుటచే "జ్యేష్ఠయు" నగును.

పారిజాతమును నీ పెరటి చెట్టు చేతునని కృష్ణుడు ప్రతిన సలుపగనే అంబుద శ్యాముని గర్జిత మధుర వాక్యములచే సత్యామానిని "నీపలతిక వోలెం గనుపట్టె"ను (పారి 1-137). అనగా పతి వాగ్దానము వినినంత మాత్రమున తొంటి తన ఈర్ష్యా క్రోధములను మరచి, పులకించినది. కావున సత్యభామ "ఉత్తమ నాయిక" అగుచున్నది.

విజయ విలాసమునందు సత్యభామ అత్యల్పకాలము నిలుచు పాత్రయే అయినప్పటికిని ఇందును ఆమె శ్రీహరి ప్రియురాలిగనే చిత్రింపబడినది. సుభద్రను చేపట్టుటకై సన్యాసి వేషమున అర్జునుడు ద్వారకకు రాగా, "సుభద్రకునై యతి వేషముఁబూని ఉన్న యర్జునుఁడు సుఁడీ" అనెడురహస్యమును "రుక్మిణీ సత్యలతో"మాత్రమే కృష్ణుడు చెప్పును. పట్టమహిషికి అతడంతటి నిగూఢ రహస్యమునెరింగించుటలో నర్థమున్నది. కాని పదియారువేల యేడుగురు కాంతలలో నొకతైన సత్యభామకును, అగ్రమహిషితో సమానముగ నెరింగించి నాడనగా, అది సత్య స్వాధీన భర్తృకతనే తేటతెల్లము చేయును.

లింగనమఖి కామేశ్వరకవి విరచితమైన "సత్యభామా సాంత్వనము"లో సత్యభామ ప్రోషిత భర్తృకగ, ఖండితగ, స్వాధీనపతికగా కనిపించును.

"దేశాంతర గతే భర్తరి సంతాప వ్యాకులా ప్రోషిత భర్తృకా" (రసమంజరి 2- పు. 45) అనుటచే పతి దేశాంతరము పోగా తాపముచే తల్లడిల్లునది ప్రోషిత భర్తృక అనబడునని తెలియును.

ఈ ప్రబంధమున శ్రీకృష్ణుడు నరకాసుర వధార్థము ద్వారకనువిడిచిపెట్టి పోగా, సత్యభామ విరహముతో తపించుట కారంభించును. "ఇదుగో ముకుందుడ"ని చెలులనగా చిత్రతల మధ్యమునన్ సదయుని గనుఁగొని "యావిభు పదములపై" "భగ్నాశయై" "వ్రాలి సోలి" నది (పు. 74). "సొగసగు విరిసెజ్జఁ బొరలుచు" సత్య పలుమారు పతి "రూపును,

---

1. *"తత నితంబాభోగ ధవళాంశుకములోని యంగదట్టపుఁగావిరంగువలన"*
   *మను.చ. 2-27*
2. *"చందురు కావి జేబమర" - ఆము. 5-90*
3. *"చందిరి కావిపావడ పిసాళిరుచుల్సరిగంచు చీరపై జిందులుద్రొక్క" విజ.వి.2-130*
4. *"జిలుగు చందురు కావి జేబు పావడ"తో - కూచిమంచి జగ్గకవి - సుభ. పరి. 4-67*
5. *"మెఱయు చెంగావొప్పు మీఱంగఁగట్టి" - అ.మ.కల్యా. - పు. 270*
6. *"వలిపె చెంగావి పావడ కశల్ బిగియంచి" - రాధికా ... 1-63*

విలాసము"ను, "రేకయు" "రతుల నేర్పు"ను, మదిలో "నూరక తలపోయు"చు, "విరహ జ్వాలా కరాళాంగియై", మాటికి విధిని నిందించుచు, చివరకు "విరహ తాపము కతన", చిత్త భ్రమకు కూడ లోనైనది (పు - 109). పతి దేశాంతరగతుడు కాగా, విరహముచే, సత్య ఇట్లు తల్లడిల్లినది. కావున ప్రోషిత భర్తృక యగు చున్నది.

'మానవతి! వెఙ్జుతన మీవు పూనకున్న, నిలువరింపదు ప్రాణమ్ము నిజమ్ము సుమ్ము' (పైది పు.89) అని మన్మథాస్త్రములచే గాయపడి తపించు కృష్ణునివి, సేదదీర్చి పరిచర్యలచే తనియించి వెఙ్జుతనము చూపిన సత్య ప్రగల్భ యగును.

నరకుని అధీనములో నున్న "పదారువేల రాచ కన్నియ"లను శ్రీకృష్ణుడు పరిగ్రహించి వారితో కూడి "కందర్ప సామ్రాజ్య మేలింపుచుండె" నని తెలిసికొనిన సత్య అసూయచే పొగిలిపోయి,"పరువు తప్పితి"నని బాధపడుచు లాలింప దరి చేరిన పతిని కనుగొనగానే ఏడ్చుచు,

*"రసికుడఁవు నీవు నీవంటి ప్రౌఢుడిందుఁ*
*జేర నుచితంబె యిటువంటి చెలిమి గలుగ*
*దెలిసి విహరించు నీకు నేఁదెలుప గలనె*
*వల్లవీ దాస యిఁకనేల వట్టి యాస"* ...(*సత్య. సాం - 4 - పు -155*)

అను పలు వక్రోక్తులతో, ఈర్ష్యా క్రోధములను ప్రకటించినది. కావున ఇచట ఈమె "ఖండితా - మధ్య - ధీరాధీర యగును.

అంతేకాదు, క్రోధాతిశయముచే అగురుమాన "చక్కని శౌరి"ని "కంకణ ధ్వనులు అతిశయించగా, "జడ గొట్టినది." ఆమెపాదములపై, మోము జేర్చి,శౌరి సాగిలపడగా "హరి జారు సికపై మనసు కినుక దీరఁగఁ దన్నెను"(పైది 4-పు. 161) ఇట్లు కోపముచే తాడనము చేయుటచే నిప్పట్టున సత్య "ఖండితా - ప్రౌఢ - అధీర" అగును.

ఈ ప్రబంధమునంతటను సత్య స్వాధీన భర్తృకతను ప్రకటిత మగుట చూడ గలము. అష్ట మహిషీ కాంతుడైన కృష్ణుడు వసంతోత్స వానంతరము "శృంగార రస సీమ" యగు సత్యతో మాత్రము క్రీడించుటయు (పైది పు. 2-65, 69), నరకాసుర వధార్థము ద్వారకను విడిచి ప్రాగ్జ్యోతిష పుర సమీపమున విడిది చేసిన ఆ బహు కాంతాకాంతుడు "సత్యపై చెందిన మోహముతో" దానినెడబాసి యీ వేళ దాళజాల" ననియు పలు విధముల తపించుచు "తనువులు వేఱైనను మన మనసులు చెలి యేకమగుట మఱచితి వేమొ" (పైది 3-పు. 89) అని సత్యను తలచుకొని పలవించుచు "ఒక్క దిన మొక్క యుగముగా నున్నది" (పైది 3-పు. 90) అని విరహతప్తుడగుటయు, "అనికి దళకర్త పంపక యకట నేనె యేల వచ్చితి" (పైది. పు.92) అని విరహతాపముచే ఆత్మనింద చేసికొనుటయు అతని సత్యా ప్రియత్వమునే నిరూపించును. అంతేకాదు,

*"మొక్కలి దొరలచే మ్రొక్కించు కొనువాడ*
*ముగుదరో నీకు నే మ్రొక్క నెంతు*
*గడి మన్నె వారూడిగము సేయఁదగువాఁడ*
*నువిద నీపాదంబు లొత్త నెంతుఁ*
*బరులచేఁగాళాంజి పట్టించు కొనువాఁడ*
*భామ నీ తమలంబుఁబట్ట నెంతు*
*నరులచేఁబావడల్ హవణించు కొను వాఁడ*
*వెలఁది చేలను నీకు వీవనెంతు"* ......(*పైది 3-పు. 90*)

అని పలవించు కృష్ణుడు, శృంగార రసఖని యగు సత్య కెంతటి దాసానుదాసుడో వ్యక్తమగును. వెలయాండ్ర పొందుజేయుమని ఉద్బోధించిన కలవింకుని చూచి, కోపముతో వనజదళాక్షులా మదవారణ యానకు సాటి వత్తురే? అని ప్రశ్నించును. సత్యను తలచి రతి గుణాకృష్టుడై పలవించుటచే సాహిత్యదర్పణ లక్షణానుసారము సత్య స్వాధీనపతిక యనియే బలపడుచున్నది. అంతేకాదు, చివరికి సత్యను యుద్ధరంగమునకు రప్పించు కొనుటయు, జయోత్సాహముతో వైరి నెదిరించు వీర నారిని చూచి "ఏను నీ దాసుఁడను గాన యిపుడు లలన! కలన నాచేత గెలిపించ దలఁచ వలయు" (పైది పు. -143) అని ఆ శృంగార దేవతను, భక్తునికి వలె ప్రార్థించుటయు పై విషయమునే సమర్థించును.

సత్య నిందించునపుడు కాని, పాదతాడనము చేసినపుడు కాని, కుపితుడు కాకపోగా "అల్ల నల్లన" సత్య కాలి "బొటన వ్రేలును" మెల్లన హరి పంటనంటి మొరముచు (పైది పు. 161) సరసతతో ప్రవర్తించి, సత్యకు సాంత్వనము కల్గించుట చూడగా, సత్య స్వాధీన పతిక యనెడు విషయము మరింత స్పష్టముగ నిరూపిత మగుచున్నది. పతి లాలనా నంతరము, ఆమె పూర్వపు క్రోధాదులను మరచి ప్రసన్నయై అతని నలరించుటచే సత్యభామ ఉత్తమ నాయిక యగును.

అష్ట మహిషీ కల్యాణము నందు సత్యభామ అవస్థా భేదము లేవియు వర్ణితములు కాలేదు. "చంద్రభాను చరిత్ర" యందు సంతాన లాభము కోరి అడుగ దలచియు అడుగ లేదు. 'సత్యా వనిత తలపెరిగి చూడ్కుల, ననుపమ వాంఛితము లొదవ హరి కరుణించె' ను (1-94). ప్రియసతి యడుగకుండానే ఆమె మనసెరిగి మనోరథ సిద్ధిని కల్గించుటచే ఇందలి సత్య, రసమంజరి లక్షణానుసారము స్వాధీనపతికయే యగును.

చింతలపూడి యెల్లనార్యుడు రచించిన "విష్ణుమాయా నాటకము" నందలి ప్రథమాశ్వాసమున గోచరించు సత్యభామ ఖండితగ దర్శన మిచ్చినను, స్వాధీనపతికగ కూడ నిరూపితమగును. పతి తనకు మాత్రమే గాక, రుక్మిణ్యాది సవతు లందరికిని పారిజాత ద్రుమము నిచ్చి నాడనియును, వారందరితో నతడు క్రీడించు చున్నాడనియును చెలులు వచ్చి చెప్పగానే, రోషకషాయిత స్వాంతయై ఏడ్చుచు

*"పారిజాతంబు భువి సత్య భామ యింటఁ*
*గాని మరి యొండొరుల యిండ్ల గలుగ దనఁగ*
*గలుగఁజేసితె తక్కిన పొలతులిండ్ల*
*నేమి మందుల వలపించిరింత నిన్ను"* .....(విష్ణు మా. నా. ప్ర. 1-201)

అని నిందించినది. కావున ఇచట సత్యభామ "ఖండితయు, రుదిత ప్రధానమైన పరుషోక్తు లాడుటచే ఆమె "మధ్య-ధీరాధీరయు" అగుచున్నది.

సపత్నీ విషయ రోష విషాదంబున శంకాతకంబు లేక, యవ్వీరు లన్నియు వెన్నునిపై దిగుపాఱం బోయించినది. పారంబోయించుట తాడనము వంటిదే, కావున ఇచట సత్య "ప్రౌఢ - అధీర" అగుచున్నది. సపత్నులతో పతి చేరుట వలన క్రోధము చెందుటచే, సత్య "మానవతి" యనియు, ఆమెకు కల్గినది "ఈర్ష్యా మాన" మనియు, అందును అది "గురుమాన" మనియు తెలియుచున్నది.

సత్యభామ స్వాధీన పతిక యనుట యీ ఆశ్వాసమునందంతట ప్రతిపాదింప బడినది. ఆశ్వాస ప్రారంభమున శుకమహర్షి కృష్ణుని "సత్యభామా మనస్స్వామి" అని వర్ణించును. (పైది 30). పదహారువేల యెనమండ్రుకు సొంతమగు స్వామిని "సత్యభామా మనస్స్వామి" అని పేర్కొనుటయే సత్య స్వాధీనభర్తృకతను స్పష్టము చేయు చున్నది. షోడశ సహస్రాంగనా

కాంతుడైన కృష్ణుడు, పారిజాతతరు లాభానంతరము "సత్యభామ హృదయం బెటులుండునో" యని పరీక్షించుటకై నాటకమాడ కడంగుట, అతనికామె యెడల గల ప్రత్యేకమైన చనవును అభిమానమును సూచించును.నిజమైన పారిజాతమును మాత్రము సత్య యింటనే యుంచి, సత్య హృదయ మారయ దలచి, ఆ జగన్నాటక సూత్రధారి రుక్మిణ్యాది కాంతల కేళీ వనంబుల నొక్కొక్క పారిజాత వృక్షమును నిల్పినాడు.

సత్యకు సురతరు లాభ గర్వము, మనోహర నవరూప గర్వము ననంగ వికార విహార గర్వములతో పాటు "పరమహితాత్ముడై విభుడు పాయని గర్వము" నున్నది. అంతేకాదు, అది సత్యతో పాటు ఆమె చెలులకును గర్వము నిచ్చినది. సత్య స్వాధీనభర్తృకతకు మురిసి పోవుచుండు సత్య చెలులు, విష్ణు మాయచే రుక్మిణికిని పారిజాతము దక్కగా, విష్ణుమాయా నాటక మెరుంగలేక "నీ కంటెను గూర్చునా వనిత గృష్ణునకున్?" (పైది - 194) అని చాల ఆశ్చర్యపడినారు. నిజమునకు కృష్ణునకు, అందరతివలకన్నను సత్యభామయే గూర్చు సఖి. ఖండితయైన సత్య "గగన కవాటార్గళంబు బిగించి" చెంగలువపాన్పున మేను వైచి పొరలుచుండగ అచట కృష్ణుడును, విరహముతో ఒక బహిర్మంటపమున కుసుమ శయ్యపై పవళించి నయ్యంతి సంతాప శాంతికై విరహధర్మం బవలంబించెను.అంతేకాదు "అమ్మూర్తి నచటనుండి రుక్మిణ్యాది ప్రధాన దేవీ జనంబులయందును షోడశ సహస్ర సుందరీ సందోహంబునందు, ననురక్తి దాల్చిన రూపంబుల గ్రీడించుచు జిత్ర కౌశలంబుల నారాత్రి గడిపి, ప్రభాతంబున నా మాయారూపంబులన్నియునుపసంహరించెను" (పైది 1-203). దీనిని బట్టి చూచిన కృష్ణుడు సవతులకడ, కేవలము తనమాయా రూపములను మాత్రమే ఉంచినాడని తెలియుచున్నది. మరునాడు నర్మసచివుడగు గోవింశర్మ రాగా, కృష్ణుడు తన కేళీ మాయావిధానము తెలిపి సత్యభామకుఁ గోపశాంతి సేయుము పొమ్ము"... (పైది 205) అని ఆనతి యిచ్చును. ఇట్లు సత్య మనశ్శల్యము తొలగించి ఆమె యెడల తనకు గల ప్రత్యేకాభిమానమును ప్రదర్శించినాడు. కాని రుక్మిణ్యాదులకు తన మాయాకేళీ విధాన రహస్య విచ్ఛేదనము చేయ పూనుకొనలేదు. కావున వీనినన్నిటిని బట్టి చూడ సత్యభామ యీ ఘట్టమున "స్వాధీనపతిక" యగుచున్నది.

చెంగల్వ కాళకవి విరచితమైన "రాజగోపాల విలాస"మున సత్యభామ స్వాధీన పతికగ నిరూపింప బడినది. చంపకవనమున శ్రీకృష్ణుడు వనవిహారము చేయుచు, అష్ట విధ శృంగార నాయికల వలె చెలగుచున్న తనయష్ట మహిషుల స్వభావములను తెలియగోరి, వారి వారి నాయా జాడల నుండ నియమించెను[1]. అష్టమహిషులు ప్రతి ఒక్కరును, తమనె పతి వలచెనని యెంచుచుండిరి. హరి తానాడెడు నాటకమునకు ఆ యా భార్యల దూతికల నందరిని తనకు సుముఖులుగ చేసికొనెను. ఇతర కాంతలనందరిని ముందు విరహమునకు లోనుచేసి ఆ తరువాత శ్రీహరి వారిని అనుగ్రహించును. కాని "సత్యభామ" యెడల మాత్రము స్వాధీనుడై ప్రవర్తించును. పరిచారికలు తనను పలువిధసేవలతో సేవించు చుండగా సత్య రాజసముతో కొలువుండగా "వినయ మీరీతి మూర్తిభవించె ననగ, వెన్ను డరుదెంచి" నాడట (రాజ.గో.వి.4-27). సత్యభామ ముందు మాత్ర మతడంతటి వినయముతో నడచుకొనును. పతిచే సేవలందుకొను ఆక్రాంత నాయిక సత్య

---

1. *"అష్ట విధ నాయికల లీల లలర గోరి*
*యష్టమహిషుల నలజాడ కనువు పరచె" ... రాజ. గో. 1-91*

*"కలకంఠీమణు లొక్కనాఁడు నను శృంగారింపఁగాఁ జూచి వా*
*రల వారింపుచు నేర్పుమీఱ కొనగోరన్ పెన్నెరుల్‌దువ్వి, నీ*
*వలరుందండలు గొప్పునం దురుము నొయ్యారంబు లేమెచ్చ నా*
*తలిరున్ వాతెఱ మెచ్చుగా నడుగుచందం బందమై యుండెగా". (రాజ. గో.వి-4.35)*

అని గర్వముతో ఆ ప్రగల్భ, తన స్వాధీన భర్తృకతను మరి మరి స్మరించుకొనినది. ప్రియునిచే ఇంతగా లాలింపబడిన ఈమె ప్రతాపరుద్రీయ లక్షణానుసారము స్వాధీనపతికయే యగును.

*"బాలేందూపమ ఫాల! యేల యిఁక నీ భావాతి సంగోపనం*
*బేలీలన్ విహరింప నీవు మదిలో నేలాగు చింతింతువో*
*యా లీలన్ సమకూర్చు వాఁడ భవదాయత్తంబు చిత్తంబు నీ*
*వేళల్ గాచుక సేవ సేయుటకునై వేమారు నేఁ గోరుదున్" ....(రాజ. గో. వి. 4-38)*

అని సత్య అభీష్టానుసారము సేవ చేయుట కుత్సాహము చూపుచు, అట్టి సేవలుచేయ "వేమారు" కోరుకొనినాడు. ప్రియురాలి సాభిప్రాయములైన మాటలందలి అర్థమును గ్రహించి, ఆమె ఆజ్ఞను కృష్ణుడు పాటించుట వలన రసమంజరి లక్షణానుసారము ఇచట ఆమె స్వాధీనపతికయే కాగలదు. కాళిందీ వటకుంజ పుంజముల క్రీడించు నెడ "హాళిందేటులు" ఆమె "కటాక్షముల"ను పద్మములని భ్రమించి డాయగా, కృష్ణుడు "చేనాళీకంబున జోపి" "వారించి" సతి కింపైన సేవలు చేసినాడు (పైది 4 - 34). అంతేకాదు, సత్యకొరకై శ్రీకృష్ణుడితరవనితలను కూడ వంచించును. ఆమెయు, కృష్ణుడు తనపై చూపు అపార ప్రేమానురాగ విశేషములను గుర్తించినది. కావుననే అశేషభామినీ వలయము నెల్ల నీవు నెఱవంచన సేయుట నన్ను నెంచియే" (పైది 4-39) అని గర్వముగ అడిగినది.

అష్ట మహిషులందు ఇట్లు అష్టవిధ నాయికల లీలల చూడ గోరిన కృష్ణుడు, రుక్మిణిని కలహాంతరితగను, భద్రను అభిసారికగను, లక్షణను వాసకసజ్జికగను, జాంబవతిని విప్రలబ్ధగను, మిత్రవిందను ఖండితగను, సుదంతను విరహోత్కంఠితగను, కాళిందిని ప్రోషిత భర్తృకగను చూచెనే కాని, వారిలో నెవ్వరిని స్వాధీనపతికగ చూడలేదు. ఒక్క సత్యభామనే స్వాధీన పతికగ చూడదలచెను. దీనికి కారణము సత్యభామ స్వాభావికముగనే స్వాధీనపతికయై యుండుటయే!

జంగాహనుమయ్య చౌదరి వ్రాసిన సత్యావివాహమను శుద్ధాంధ్ర ప్రబంధమునందును అడవి సాంబశివరాయకవి విరచితమైన "సాత్రాజితీ పరిణయము" నందును సత్యభామా కృష్ణుల ప్రణయము, పరిణయములే ప్రధానేతివృత్తాంతము. వీని యందలి సత్యభామ 'ముగ్ధ'.

*"ప్రథమావ తీర్ణ యౌవన మదనవికారా రతౌ వామా*
*కథితామృదుశ్చమానే సమధికలజ్జావతీ ముగ్ధా" ... (సా. ద. 3-100)*

అనెడు సాహిత్యదర్పణ లక్షణానుసారము, క్రొత్తగా నంకురించిన యౌవనమును, మదనవికారమును కలదియు, రతియందు కొంచెము ప్రతికూలత చూపునదియు, మృదువైన ప్రణయ కోపము గలదియు మిక్కిలి లజ్జ కలదియునగు స్త్రీ "ముగ్ధ" అని తెలియుచున్నది. సాత్రాజితీ పరిణయమున

*"కన్నెవు గాని ప్రోడవటుగావు తలంపగ నీదు జవ్వనం*
*బెన్నఁగ గండుతేటి చరియింపని క్రొన్నన వంటిది..." ....(సాత్రా. ప. 3-38)*

అని సత్యను గూర్చి చెలులనుటను బట్టి సత్య "ప్రథమావతీర్ణ యౌవన" అని తెలియును. కన్యయైన సత్య చెలుల ప్రోద్బలముచే హరికి తనమనసు నెరింగింప లేఖ వ్రాయు తరి తనకోర్కె దెలుప, సిగ్గుచే "ననువుగ నన్యార్థయుక్తమై తగ వ్రాసిన"దే గాని తనమనసులోని

మదన బాధనంతయు వివరింప లేకపోయిన సమధిక లజ్జావతి (పైది 117). ప్రథమ సమాగమమునకై చెలులు తనను తోడ్కొనిరాగ, సత్య అడుగులలో తడబాటు, సంకోచము ప్రదర్శించినది. క్రొత్తగా అంకురించిన యౌవనము, మదన వికారము కల్గి, రతి యందుకొంత ప్రతికూలత చూపుచు, మిక్కిలి లజ్జను ప్రదర్శించుటచే ఇందలిసత్య "ముగ్ధ" యగును.

నిజమునకీ ప్రబంధము సత్యాకృష్ణుల ప్రేమ, వివాహములనే ప్రధానేతి వృత్తాంతముగ కలదియయ్యు, కథతో సంబంధము లేకపోయినను, కవి కావ్యాంతమున, స్వాభావికము, జగత్ప్రసిద్ధము కాబోవుచున్న సత్య స్వాధీనభర్తృకతను స్మరింపకుండ నుండలేక పోయినాడు.పారిజాతపహరణ కథ నొక పద్యమున వర్ణించి (5-115) సత్యకు కృష్ణుడెంతటి స్వాధీనుడో సూచింప జేసినాడు. దక్షిణనాయకుడయ్యు కృష్ణుడు సత్య యెడ అనుకూల నాయకుని వలె వర్తించుటచే

*"భాగ్యమన్న సత్యభామదే కాక నెం*
*దైనఁగలదె యింద్రుననుఁగు చెలి క*
*చములకయిన పారిజాతముల్ గయిచేసి*
*ప్రియుఁడు గారవింపఁబెంపునందె"* ..... *(సా్త్రా. ప. 5-116)*

అని సత్య భాగ్యమును కవి ప్రశంసించినాడు. ఈ సత్యా సౌభాగ్య ప్రశంస ఆమె స్వాధీన భర్తృకతనే నిర్ధరించుచున్నది.

దివి రంగాచార్యులు రచించిన "శ్రీకృష్ణాతిమానుషతత్త్వము" నందలి సత్యభామ విప్రలబ్ధ, ఖండిత, స్వాధీన పతిక. విరహముచే పతికి లేఖ నంపుడు విప్రలబ్ధగ, పారిజాతమును రుక్మిణికి నిచ్చినాడనుచు, పరుషోక్తులాడునపుడు ఖండితగ కనిపించును.

నరకుని చెరలోని షోడశ సహస్రాంగనలను, కృష్ణుడెంత నిరుత్సాహ పరచుచున్నను వినక, తమను స్వీకరింపుమని అర్థింపగా, సత్య సమ్మతించిననే తాను వారిని స్వీకరింప గలడు కావున "నిరుత్తరుడై కనుగొనలను నిజభామ వైపు గూరిచి కలయం గనుగొనెను". అది గ్రహించి వారును సాత్రాజితికి ప్రణమిల్లి, ప్రాధేయపడి (3-1-111) ఆమె సమ్మతిని బడసినారు. షోడశ సహస్రాంగనలను స్వీకరించు విషయమున అష్ట మహిషులలో సత్య అంగీకారమునకే యెదురుచూసి, ఆమె యెడల ప్రేమతో కూడిన భయమును ప్రకటించిన కృష్ణుడు సత్యా స్వాధీనుడే యనుట నిశ్చయము.

శ్రీకృష్ణుని పరీక్షించుటకై ఒక మారు నారదుడు ద్వారకకు రాగా, ఆ యా యింట ఒక్కొక్క నాయిక తత్త్వము స్పష్టముగా వెల్లడియైనది. నారదునకు రుక్మిణి భక్తురాలుగా, జాంబవతి ప్రణయినిగా దర్శనమీయగా, "సత్యభామ" మాత్రము"స్వాధీన పతిక"యై దర్శనమిచ్చినది (పైది. 132).

## భామాకలాపములో :

సిద్ధేంద్రయోగి విరచితమైన భామాకలాపము, విప్రలంభ శృంగార రస ప్రధానమైనది. ఇందలి సత్యభామ ఆ యా సందర్భములందు అష్ట విధ నాయికావస్థలన్నింటిని అభినయించును.

భామా కలాపమున కుపోద్ఘాతము వ్రాయుచు బందా కనకలింగేశ్వరరావుగారు "... భామా కలాపంలోని సత్య స్వాధీనపతిక, కలహాంతరిత, వాసక సజ్జిక" ... అని అనినారు[1]. "సిద్ధేంద్రుని చిత్రణలో నామె విప్రలబ్ధ"[2] అని యస్వీ జోగారావు గారు భావించినారు.

1. *భామాకలాపము - ఆం. ప్ర. సం. నాట. అకాడమీ ముద్రణ - ఉపోద్ఘాతము, పు. 11*
2. *ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - ద్వి భా - పు. 33*

ఇందు సత్యభామ విరహమే ప్రధానాంశ మగుటచే అట్లు భావించుట జరిగి యుండవచ్చును. కాని ఇందు సత్య అష్ట విధ నాయికావస్థ లన్నింటిని అభినయించుట మనము చూడగలము. ప్రారంభము నుండి అంతము వరకును సత్యభామయే "అష్ట విధ నాయికలుగా మారి, తత్తతవస్థా భేదములను అభినయించు చున్నది. "అని పోణంగి అప్పారావు గారును[1], "ఒక్క సత్యభామయే అష్ట విధ నాయికా రూపంలో అభినయించడానికి అనువుగా భాగవతులు కథను దిద్దుకున్నారు" అని ఆరుద్రగారు[2]ను, అభిప్రాయపడుట, పై విషయమును సమర్థించు చున్నది.

గ్రంథారంభము నందే సత్యభామ మనకు కలహాంతరితగ సాక్షాత్కరించును. పతిని తిరస్కరించి పిమ్మట అందుకై దుఃఖించునది కలహాంతరిత[3]. చేరవచ్చిన పతిని విదిలించుకొని, అతడువెడలిపోయిన తరువాత

*"తాపమోర్చుకోనైతి దయగ మాటలాడ నైతి*
*చెప్పినట్లు సేవ జేసి చరణముల నొత్త నైతి*
*.... .... ..... .... ముందె కౌగిలించనైతి*
*కొంగు పరచి వాని వలపు గ్రుమ్మరించుకో నైతి" .....(భామా. పు. 10)*

అని చెలి ముందు పశ్చాత్తాప పడుటచే సత్య "కలహాంతరిత".

సంకేత స్థానమునందు ప్రియుని కానక మదిలో తల్లడిల్లునది విప్రలబ్ధ. నిర్వేదము, నిశ్వాసము సకులను దూరుట, చింత, కన్నీరు విడచుట, మూర్ఛ మొదలగునవి ఆమె చేష్టలనియు తెలియును.[4] సంకేత స్థానమున నాథుని కానకపోవుటచేసత్య

*"అళిరవముల కులికి పడితినమ్మా కొమ్మా*
*యెలనాగ కృష్ణ దేవుని*
*గులుకుచు నిటు దోడి తేవె కుంజరయాన" ..... (భామా. పు. 31)*

అని విరహము తాళలేక చెలిని అర్థించుచు, "మగడు యింతులపై దయమాలి యున్న ప్రాణముల్ దాచనేల యీ ప్రాయమేల" ... (పైది పు. 83) అని మూర్ఛిల్లిన సత్య - విప్రలబ్ధగ కనిపించును.

సంకేతస్థలమునకు భర్త రానందునకు కారణము నెవతె యాలోచించునో ఆనాయిక విరహోత్కంఠిత.[5] "ముదముతో ద్వారకాపురి కేగినాడేమొ......" (పైది- పు.26) అనియు

"నా నాథుకా రుక్మిణి మందు పెట్టెనేమో (పైది - పు. 37) అని పతిరాక లోని, ఆలస్యమునకు ఉత్కంఠయై కారణము లడుగుచు

*"ఇంత ప్రొద్దయ్యె నేడిక శ్రీకాంతడిటకు రాడాయె..*
*ఎందుకే యీ గంధము ఎందుకే యీ బంధము*
*ఎవరు చూచిన యందము*
*ఇందుముఖి! మోవితేనె విందు జేయ రమ్మనవె" ...(పైది. పు. 44)*

అని సర్వాలంకారములను రోయుచు పతికై పరితపించుచు, చెలితో తన దుఃఖమును వెళ్ళపోసికొనుచుండు సత్య విరహోత్కంఠిత యగుచున్నది.

---

1. *సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము - సం. పు. 2 - పు. 773*
2. *సమగ్రాంధ్ర సాహిత్యము - 11 - పు. 198*
3. *రసమంజరి - 2 - పు. 56*
4. *రసమంజరి - 2 - పు. 60*
5. *పైది - 2 - పు. 64*

ఒకానొకనాడు ఏకాంతమున సత్య పడకటింటిలో, హంస తూలికాతల్పమున పవళించి యుండగా, వారిరువురిలో ఎవరు చక్కని వారని కృష్ణుడు అడుగ, సత్య తానేనని అత్మాతిశయముతో సమాధానమీయ, కృష్ణుడలిగి అచటి నుండి పోవును. కృష్ణుడు "ద్వారకాపురి కేగినాడేమొ" అని తలచి సత్య ఖేదము నొంది, విరహముతో తపించుచు "ఓయమ్మా! పతిని టోడుక రాగదే" అని చెలిని అర్థించు వేళ "ప్రోషిత భర్తృక" యగును. "నేడు నా ప్రియుడు వచ్చెడు దినము అని నిశ్చయించుకొని ఎవతె సంభోగ సామగ్రిని సిద్ధ పరచుకొనునో ఆమె వాసకసజ్జ"[1]

"మొనసిన విరుల పాన్పు పయిన ముదిత యున్నదనుమీ" (పైది పు. 60) అని చెలితో చెప్పి పంపు నపుడు సత్య "వాసక సజ్జిక" యగును.

ఎవతె ప్రియుని కడకు తానే యేగునో లేదా ఎవతె ప్రియుని తన కడకు రప్పించుకొనునో ఆ నాయిక అభిసారిక.[2] "కుందరదానా! నా మందిరమునకును, సుందరాంగు దేగదే" (పు-43) అని ప్రియుని తనకడకు రప్పించుకొను సత్య "అభిసారిక" యగును. ప్రియుడు తన చెంతకురాగా, అతడు సవతియగు రుక్మిణి కడ నుండి వచ్చినాడను ఈర్ష్యా క్రోధములతో "ఎల్లప్పుడు నెడబాయకుండునట్టి రుక్మిణీదేవి యొద్ద సెలవు పొందియే వచ్చినారా? దొంగతనముగ వచ్చినారా?" (పైది పు. 85) అనియు వక్రోక్తులాడి పతిని ఖేద పరుచునెడ ఖండితగను, "లేమలందరు జూడ జడతో వేమరు నిను గొట్టకుంటే" (పైది పు. 86) అని బెదిరించునపుడు "-ప్రౌఢ - అధీర" గ సత్య గోచరించును.

స్వాధీనపతికగ నీమె కనిపించు ఘట్టము లిందనేకములు గలవు. కృష్ణుని "ప్రాణ సఖి" తానే యను నమ్మకము ఈమె కున్నది (పైది పు. 56) .

*"పదియారువేల కోమలందరిలోన*
*రామరో గోపాలమూర్తికి ప్రేమపాత్రనైన సత్యభామనే"* ....(*పైది. 13*)

అనియు చెప్పుకోగలిగిన ఆత్మవిశ్వాస మున్నది. అట్లు చెప్పుకొనుటయే కాదు. ఆ విషయమును నిరూపించుకొనినది కూడ;

*"అట్టహాసము చేసి సురల నట్టె గెలిచి పారిజాతపు*
*చెట్టు తెచ్చినాదు పెరట బెట్టి, వేనాటించుకున్న సత్యభామనే"* .... (*పైది*)

అని తన స్వాధీన భర్తృకతను చాటుకొనినది. పతి "ఏ నాడైన, వేగమే తావచ్చి వెలదీ రమ్మని బిలిచి అలమి, కౌగిట చేర్చున"ట. సౌందర్య గర్వితయై పతిని అవమానించుట వలన అతడామెను విడిచి తొలగి, సవతులను చేరినను, తాను స్వాధీనపతికనను భావము మాత్రము ఆమె నుండి దూరము కాలేదు. పతి రాననినాడని తెలిసిన వెంటనే ఈమె మూర్ఛితురాలు కాగా, కృష్ణుడా విషయము తెలిసి, వెంటనే వచ్చును. ప్రేమతో నామెను లాలింప చెంతచేరగా,

*"భామనా నాపేరు అల్ల భామ రుక్మిణి యనుచున్న*
*ప్రేమ నడచియు నాదు చెంతకు సామి, నినురప్పింపకున్న* ।సత్య।
*మంచిదిర పదియారువేల మించుబోడులలోను గౌగి*
*లించుమని నీచేత బ్రతిమాలించు కోకుంటేను"* ....(*భామా. పు. 86*) ।సత్య।

అని చనవుతోను, ఆత్మవిశ్వాసముతోను పంతములాడ గలిగిన సత్య "ప్రౌఢా-స్వాధీనపతిక" యగును. ఇంతటి ధైర్యము, చనవు మరియే యితర కృష్ణకాంతకు నున్నట్లు కనిపింపదు. పతి ఆమెకు స్వాధీనుడు కనుకనే ఆమె చేయు నిందారోపణము లన్నియు సహనముతో విని, తనను నమ్ముమని పలు విధముల ఆమెను అర్థించును.

---

*1. రసమంజరి - 2 - పు - 68*
*2. పైది - 2 - పు - 78*

## యక్షగానములలో :

యక్షగానములు జానపదుల అభిరుచి కనుగుణముగ వ్రాయబడిన వగుటచే, సత్యనిందు పరిపూర్ణ స్వాధీనపతికగ చిత్రించుట జరుగక పోయినను, కావ్యాంతము నందైనను సూచన మాత్రముగ నైనను ఆ అంశము చెప్పబడును.

శాహజి రచించిన సతీపతి దానవిలాసమునందు సత్యభామ వాసక సజ్జికగను, స్వాధీనపతికగను, "రుక్మిణీ సత్యభామా సంవాదము" నందు విప్రలబ్ధగను, కలహాంతరితగను, అభిసారికగను, స్వాధీనపతికగను, గోచరించును. పారిజాతాపహరణ ప్రబంధము తరువాత సత్య "స్వాధీన భర్తృకత"ను, లోకమునకు మరింత సుస్పష్టము చేయగలిగినదీ "సతీ పతిదాన విలాస యక్షగానమే". సత్యభామ నారదుని వలన పురుషదాన మాహాత్మ్యము నెరింగి, పతిని సురమునికి దాన మిచ్చుటయు, తిరిగి పతిని గ్రహింప లేక తపించు తరి, రుక్మిణి తులసీదళ మాహాత్మ్యముచే పతిని విడిపింప చేయుటయు నితివృత్తముగ గల యీ యక్షగానమున తులసీదళ మాహాత్మ్యము కన్నను సత్యభామ స్వాధీనభర్తృకతయే, అధికముగ వర్ణింప బడినది.

పతి వచ్చు సమయమున సర్వాలంకార భూషితయైన సత్యభామ అతనిని ఎదుర్కొనుచు

*"రావయ్య రావయ్య కృష్ణ రతిఁగూడుందాము*
*ఈవేళ నేను నీరాక కెదురెదురె చూచు చుంటి" ...(సతీపతిదానవిలాసము - పు. 8)*

అనునెడ వాసక సజ్జికగ కనిపించును.

పారిజాతాపహరణము వలెనె, ఈ యక్షగాన మందంతటను సత్య స్వాధీనభర్తృకత గోచరించుచుండును. సత్య తనకు గల అనితర భర్తృవాల్లభ్యమునిందు కనబరిచినది. శృంగార వనమున కనుపించిన సురమునిని జూచి సత్య "నన్నెల్లప్పుడు విష్ణు వెడఁబాయక యుండుట కుపాయము దెలుపవయ్యా" (పు. 7) అని అడుగగా "పురుషదానముఁ జేసిన నీపురుషుఁడైన శ్రీకృష్ణుఁడు నిన్నెడఁబాయకుండును.. ఇందుకుఁ బురుషుఁడు స్త్రీకి లోకువై యుండిన నీ దానము కొనసాగును" అని అనును. అందుల కామె "నేనేది చెప్పిన నది వినును. కృష్ణుడు ఇప్పుడు తనకే లోకువై యున్నాఁడు" అని ఆత్మవిశ్వాసముతో ప్రకటించి "మీరు సుమూహర్తము విచారించుకొని యుండరయ్యా" (పు. 7) అని ఆదేశించు సత్య స్వాధీనపతికగనే కనిపించును. ఆమె మాటలకు తగినట్లుగ కృష్ణుడును ఆమె కధీనుడై ప్రవర్తించుటయు కలదు. తన కోరికొకటి ఉన్నదని, దానిని అతడు తీర్చవలయునని ఆమె అనురాగముతో నర్థించు నెడ

*"బోటి యీ వింత మాటలేలాడేవే నా గుణమెఱుగవ*
*నేటి దాఁక నీవు సెప్పినదెల్ల జవదాటినానటనే?*
*కలనైనఁగాని నవ్వులకైనఁగాని కలికిరో పరియాచకములకైనఁగాని*
*ఎలమి నీవు కోరిన కోర్కె గాదని నేనేమైనఁబలికి నానటవే*
*......(సతీ - ప.దా.వి.యక్ష-పు-9)*

అనెడు శ్రీహరి పలుకులు, అతడు సత్యాధీనుడనుటనే నిరూపించును. 'పురుష దానమునకై' అనుమతిని ఆమె కోరునెడ "వినవే భామామణి మంచి తలంపుఁదలంచితివి. వేయివేల కాలాలకున్ను నీవే స్త్రీవి, నేనే పురుషుఁడనుగా నుండవచ్చును. నామనసులో మునుపుగానే దోచెను. నీతో జెప్పిన నేమందువో యని వెరచియుంటిని. ఈకార్యము నీవే నాతోఁజెప్పి

యుంటివి. నాకుఁజాలా సంతోషమాయెను. అటులనే చేసికొనవే..'' (పైది పు.10) అని సంతోషముతో ప్రోత్సహించినాడు. దాన ప్రదాన సమయమున, నారదుడు జగన్నాథుని దానముగా గ్రహించుటకు భయపడగా'',... "మీరేమి సెప్పిన, నది వినును. ఊరికేదానం తీసుకొనరోయి'' (పైది. పు.11) అని భర్తపై గల వాల్లభ్యముతో ప్రగల్భతతో పలుకును. ఆమె పలికినట్లుగానే హరియు, సురముని అభీష్టానుసారముగా, మునిని అనుసరించుచు మున్యా శ్రమమునకు పోవును. అంతేకాదు, హరి చర్యలను గని ఆశ్చర్యపడి బలభద్రుడు 'వెఱ్ఱిపట్టెనా' అని భయమును ప్రకటింపగ "ఈ మునీశ్వరుడు బలిమినిఁబిలుచుకొని పోలేదు. సత్యభామ నన్నెల్లప్పు డెడబాయకుండవలెనని యితనికి దానము సేసెను. కాఁగానితని యధీనమై వెంబడిఁ బోవుచున్నాను.'' (పైది పు. 13) అని తాను సత్యాజ్ఞాను వర్తియై వర్తిల్లు వాడనని ప్రకటించుకొనినాడు. అష్ట మహిషీకాంతుని అట్టి ప్రవర్తనను చూచి, కినుక వహించిన అతని కాంతలతో, సత్య. "నా చెలువుని నేను దానము సేసితిఁబోవె'' అనియు "శ్రీకృష్ణుడు దన సొమ్ము గాదటె'' అనియు సపత్నులను గదమాయించ గలిగినది (పు. 12). "పట్టపురాణి రుక్మిణి ప్రాణేశుఁడంటె చెల్లు'' అని అసూయతో పలికెడు సవతులను జూచి, "మాటలేలాడరె యిఁక మీ మనసు ముట్టి చూచుకోరె'' (పైది) అని ఆత్మ విశ్వాసముతో పలుకు ఆమె పలుకులు, నిజమున కామె భర్తృవాల్లభ్యమునే స్పష్టము చేయును. "కృష్ణుడు సరసములోనై బాధ దెచ్చె'' అనియు, "తనకుఁగృష్ణుని లొంగఁజేసె'' అనియు, కృష్ణుని చర్యలను చూసి విమర్శించు ప్రజల పలుకులును సత్యస్వాధీనభర్తృకతనే నిరూపించును. ఇందరు ఇంతగా సత్యను విమర్శించినను శ్రీహరి మాత్రము చివరవరకు ఆమె నేమియు ననకుండుట చూచిన అతడామె కెంతగా ఆధీనుడై యున్నాడో అనుట స్పష్టము చేయును.

పతియైన శ్రీకృష్ణుని సందేశము నందుకొని సత్యభామ శృంగారవనమున చేరిన తరి, అతడు సవతి రుక్మిణీదేవితో కూడి యున్నాడనెడు విషయము తెలిసికొని, చెలిచే తన పతిని రప్పించుకొని, అతనితో క్రీడించు సందర్భమున రుక్మిణి అచ్చటకు వచ్చుటయు, సపత్నుల నడుమ సంవాదము పొడముటయు, దాని నేవిధముగను వారింప శక్యము గాకపోవుటచే పతి వారి నెడబాయుటయు, అది జూచి విరహతప్తలైన సపత్ను లిరువురు సఖ్యము నెరపుచు పతిని చేరి ప్రార్థింపగా హరి వారిని అనుగ్రహించుటయు "రుక్మిణీ సత్యభామా సంవాద మనెడు యక్షగానమునందలి యితివృత్తాంతము.

కృష్ణుడు సత్యభామను శృంగార వనమునకు రమ్మని పిలిపింపగా, అలంకరించుకొని, సర్వాలంకార భూషితయై

*"అందెలుఘల్లని మ్రోయఁబాదములయందు*
*నందముగను జనులందఱు జూడఁగ*
*నిందువదన తెలివొందెడి నడల''* ...(రుక్మి. సత్య. సం.యక్ష. పు. 50)

పతిని అభిసరించుటకై శృంగార వనమునకు వచ్చినతరి, అభిసారికయై కనిపించును. సంకేత స్థలమున పతిని గానక, వంచితయై,

*వలపున శృంగార వనమునఁగ్రీడ*
*సేయ వచ్చెదనంచుఁజెలువుగానన్ను*
*నీయెడఁబొమ్మనియింక రాఁడాయె*
*నే రమణీమణి యింటనున్నాఁడొ''* ....(పైది పు.52)

అని విరహముతో తపించునెడ విప్రలబ్ధ యగుచున్నది. ఎంత ప్రార్థించినను సపత్నుల

సంవాదము నివారింపబడక పోవుటచే, వారి నెడబాసి హరి వేరొక చోటకు వెడలిపోవగా,

*"చెలువుండు కొసరంగఁజెలిమి సేయ నైతిఁగా*
*అలుక తీర్పనైతిఁగా అయ్యయ్యో పోతిఁగా*
*గోపాల రాయని గుణము తెలియక మదిని*
*రావేల చేసితిని రతిఁబెనఁగ నైతిని"* ...(పైది పు. 60)

అని విరహముతోను, పశ్చాత్తాపముతోను తపించు నెడ సత్య కలహాంతరిత యగుచున్నది. ఇందును శ్రీకృష్ణుడు సత్యా ప్రియత్వమును ప్రదర్శింపక పోలేదు. రుక్మిణితో కూడి యున్న శ్రీకృష్ణుని సత్యభామతో జత చేర్చుటకై గోపాలు డొకడు, యశోదాదేవి యేమో రహస్యముగా మాట్లాడవలెనని, నిన్ను "పిలుచుకురమ్మ"ని నన్ను పంపినదని అనృతమాడి, హరి బయటకు వచ్చిన తదుపరి, తాను చేసిన మోసమును గూర్చి చెప్పగ, హరి కుపితుడు కాకపోగా, మిదుమిక్కిలి సంతసించి, "మహాచాతుర్యం చేసితివోయి" (పైది పు.. 54) అని ప్రశంసించును. అసదృశ ప్రణయ సామ్రాజ్యాధిపతులు సత్యాకృష్ణులు. రుక్మిణీదేవితో వాదులాటకు దిగిన సత్యను జూచి, అక్క అయిన రుక్మిణితో మర్యాదతో మాట్లాడుమని కృష్ణుడు చనవుతో మందలింపగ, వెంటనే ప్రియసతి కుపితయగుట చూచి, సహింపలేక, పట్టమహిషి తన యెదుట నుండగనే, అతడు

"ఎలనాగ నీవే మనిన నెడఁబాయ జాలనె నిన్ను" (పు. 58) అని ఆమె యెడల తనకు గల ప్రత్యేకానురాగమును ప్రకటించుకొనినాడు.

మాతృభూత కవి రచించిన పారిజాతాపహరణ యక్షగానము నందలి సత్యభామ విరహోత్కంఠితగ, కలహాంతరితగ, విప్రలబ్ధగ, ఖండితగ, స్వాధీనపతికగ దర్శనమిచ్చును.

*"హరి చెంత లేక చిత్తం*
*బిర వొందదు, అతని వద్ద కేగిన చెలి యీ*
*వరకుం గృష్ణుని తోడ్కొని*
*మఱీ రాదిక నేమి సేతు మదవతులారా"* ...(పారి. యక్ష 2-95)

అని విరహమును ప్రదర్శించుచు ప్రవేశించు సత్య, ఇచట "విరహోత్కంఠిత" యగుచున్నది.

అన్యకాంతా సంభోగ చిహ్నములతో హరి రాగా,

*"అరయ నా వాఁకిటికి వచ్చి నట్టి హరిని*
*ముదిత, రావద్దు పొమ్మని మోసపోతి"* ....(పైది 2-105) అనెడు సత్యభామ, మొదట కోపముతో పతిని విదిలించుకొని, ఆ తరువాత తన తొందర పాటునకు పశ్చాత్తాపము చెందు సత్య "కలహాంతరిత" యగును.

తాపమోర్వలేక, ఆమె శృంగారవనికి వచ్చి

*"ఈ జాబు నీ వొసగిఁయా*
*రాజీవదళాక్షు నిటకు రమ్మను చెలియా'* ...(పైది 3-163)

అని చెలి మాధవిని రాయబార మంపునపుడును, పతిరాకపోవుటచే తాపాతిశయ కారణమున, "మిగుల వొగిలి యేమియు దోచక మూర్ఛ చెంది"నపుడు సత్య "విప్రలబ్ధ"యు, కృష్ణుడామెను గ్రహించుటకై రుక్మిణీ గృహమునుండి రాగా, "అల దాని నంటి, నీవు నన్నంటేవేమిరా" (పైది 4-256) అని నిందించునపుడు "ఖండిత"యు అగును.

ఇందు మొదట శ్రీకృష్ణుడు సత్యకు స్వాధీనునివలె కనిపింపక పోయినను, అతడు స్వాధీనుడై ప్రవర్తించిన ఘట్టములు ననేకము లిందుగలవు. పారిజాతాపహరణ ప్రబంధములో వలెనె, ఇందును రుక్మిణి యింట నుండువేళ నారదుని వలన పారిజాతము లభ్యమైనపుడు

కృష్ణుడు రుక్మిణీ సత్యలలో నెవ్వరి కీయవలయునను, సందిగ్ధమునకు లోనగును. "ఇందీవరాక్షి రుక్మిణి యిందిర గావున నామె కిప్పింపవయా" అని నారదుడనుట చేతనే రుక్మిణి కిచ్చును.

మొదట రుక్మిణిని వీడలేక, సత్య పిలిపించినను పోక, ఆమెను అలయింప చేసినను, ఆ తరువాత ఆమె కడకు వచ్చి, ఆ కోపన కావించిన పాదతాడనమును సహించుటయు, "ఈవుల చెట్టు నీవిటకుఁదేవలయు" అని ఆమె ఆదేశించినట్లు, సాధించి తెచ్చి యిచ్చుట చేతను ఇచట సత్య స్వాధీనపతికయే యగును.

పారిజాతాపహరణ వృత్తాంతమే ప్రధానముగ గల తరిగొండ వెంగమాంబ రచించిన విష్ణుపారిజాత యక్షగానమునందు శృంగార నాయికయగు సత్యభామ ఖండితగను, కలహాంతరితగను, విప్రలబ్ధగను, స్వాధీనపతికగను కనిపించును.

## నాటకములలో :

బహుజనపల్లి లక్ష్మీకాంతము గారు వ్రాసిన "సాత్రాజితీయ" నాటకము నందు సత్యభామా కృష్ణుల వివాహమే ప్రధానేతివృత్తాంతము. ఇందుసత్యభామ అష్ట విధావస్థలలో "విరహోత్కంఠిత", "స్వాధీన పతిక" అను అవస్థా భేదములు పొందుట జరిగినది.

సత్య ఇందు "ముగ్ధ". శమంతకాన్వేషణకై ఏగిన కృష్ణుడు, తాను వాగ్దానము చేసినవిధముగా నెల దినములయ్యు, తిరిగి రాకపోవుటచే అతడు మణికొరకు పోయెనా లేక రుక్మిణి అతనిని వశముచేసికొనెనా అనుచు, అతడు తడవు చేయుటకు గల కారణమునరసినది (పు. 62). కావున ఆమెఇచట "విరహోత్కంఠిత" అయినది. ఉద్యానవనమున కన్యయైన సాత్రాజితిని గాంచిన కృష్ణుడు, తనను అనుగ్రహింపునియు, తనకాంతలందరిలో ఆమెకే ప్రాధాన్యమిత్తు ననియు, అనుచు, తనను కన్నెత్తి చూడుమని అర్థింపగా సత్య "ప్రియా! నేను స్వతంత్రురాలను కాదుగదా? మా తండ్రి, మా పినతండ్రి కారణమున గోలుపోయిన శ్యమంతక మాణిక్యం బేలాగు నైన పరిగ్రహించి తెచ్చి నాతండ్రికి తెచ్చిన నంతయు జక్కంబడును. కరుణించి తదన్వేషణమునకై త్వరపడి యేగి తెచ్చి నన్ను అనుగ్రహింపవలయు" నని అనగానే (పు. 37, 38), కృష్ణుడును "దేవీ! నీవు మేరువు దెమ్మన్న నేను తేకుందునా?" అని అనుచు, ఆ మణిని అన్వేషించుటకై బయలుదేరును. (పైది పు. 38). కన్యయే యైనను, ఇందు సత్యభామ నాయకుని అజ్ఞాపించి, కార్యము సాధింప బూనినది. కావున ఇచట ఆమె "స్వాధీనపతిక" యనియే చెప్పవచ్చును. తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధమునే అనుసరించిన చిలకమర్తి లక్ష్మీనరసింహము గారి "పారిజాతాపహరణ నాటకము నందలి, సత్యభామయు, ఖండిత, స్వాధీనపతికగ చిత్రింపబడినది.

వి.వి.ఏ. ఆచార్య వ్రాసిన "దీపావళి నాటకము"న సత్యభామ విప్రలబ్ధ, ఖండిత, స్వాధీనపతికగ అవస్థా భేదములను పొందినది. చేసిన వాగ్దానమును కృష్ణుడు, భంగపరచుటచే, విరహముతో సత్యభామ ఉద్యాన వనమునకు వచ్చి

> "నీ మాటలె నా బాటలు సుమ్మని
> నాటకమాడీ నను మురిపించిన
> బాసలు నమ్మి మోసపోతినే" .....*(దీపా. నాట. పు. 49)*

అని తపించుటచే, నిచట ఆమె విప్రలబ్ధ యగుచున్నది. కృష్ణుడు ఆలస్యముగా రాగా, సత్యభామ, ఇంతకాలమునకు దర్శన మిచ్చినాడని, కోపించి, తన నాతడు బ్రతిమాలు కొనుచుండగా "... నీ గడుసు పోకల మాటలు నా మనస్సుకున్ బంధము వేయలే విక సపత్నుల వద్దకె పొమ్ము ధూర్తుడా" (పైది పు. 51) అని పలు వక్రోక్తులతో, తన కోపమును

ప్రదర్శించుటచే, నిచట ఆమె "ఖండిత" అగును. గోపికాసంగతుడై, ప్రణయాపరాధము గావించిన కృష్ణుడు ప్రేమరసైకమూర్తి సత్యాపతి నీ విధేయుండగు దానుడు గాడె మరాళగామినీ" (పైది పు. 50), అని కోపనయైన సత్యను సాంత్వన పరచుచు, తనను తాను "సత్యాపతి" గా పేర్కొనుటయే కాదు, తానామెకు "దాసు" డనియు అంగీకరించినాడు. "ప్రాణములోని ప్రాణమగు భామిని నీవెగదా..." (పైది) అని కూడ ప్రకటించినాడు. అంతేకాదు. సమస్త కార్యములు ఆమె ప్రేమను పొందుటకే చేయుదు ననుటను బట్టి, అతడు సత్యభామ కెంతగా అధీనుడో తెలియుచున్నది. కృష్ణుని దృష్టిలో సత్య, సూర్యుని వంటిది కాగా, ఆమె సవతులు మిణుగురు పురుగులు. "ఎన్నివేల మిణుగురు పురుగులైననూ ఒక్క సూర్యునకు సాటి రాగలవా? వారందరూ ఏకమైననూ నీ కాలి గోటికి దీటగుదురా?" (పైది పు. 53) అని అడుగటయే కాదు, సత్య లేని నాడు, తానే లేడనియు, తనకు లోకములే లేవనియు, సత్యతో తనకు గల అభేదత్వమును ప్రకటించుకొనినాడు. ఇట్లనుటయే కాదు, తన మాటలు విశ్వసింపని సత్యతో "పోనీ, పరీక్షింప రాదా? ఇదివర కెప్పుడైన నీ మాటలకు గీటు దాటితినా" అని ప్రేమ పరీక్షకు కూడ సిద్ధమైనాడు. "నాకు దీనావనుడను పేరు నీ దివ్యప్రేమ నుండి లభించినదే గదా?" అనియు 'సాత్రాజితీ ప్రేమయే, సత్యాపతికి సర్వదా సంరక్షకము' అనియు పలికినాడు.

సత్యభామయు "నిన్ను నేనే సంరక్షించుకొను సౌభాగ్య సావకాశమే నాకు కలిగిన శాశ్వతముగా శ్రీకృష్ణుడు సత్యావిధేయుడే గదా?" అని, తన శౌర్యప్రదర్శనము వలన అతనిని రక్షించి, శాశ్వతముగా నాతనిని తన విధేయుని చేసికొన దలచినది. (పైది -54). శ్రీకృష్ణుడును అట్టి అవకాశము రాగలదని పలికి ఆ మానినిని తేర్చినాడు. నరకాసురుని తోడి యుద్ధమునందు కృష్ణుడు వీరావేశముతో నరకునితో వాదులాడు వేళ, తనను "దనుజరాడ్గర్వ విలయ మండితుడ"నని తెలుపుకొనుచు, అంతటితో ఆగక, "సత్యభామా ప్రియుండ" నని కూడ ప్రకటించుకొనుటయు (పైది పు. 69), తాను వాగ్దానము చేసినట్లు సత్యభామకు తనను సంరక్షించు నవకాశమిచ్చుటయు చూడగా (పు. 74) సత్యభామ స్వాధీనపతిక యనుట నిర్ధారణమగును.

ప్రణయ గర్వితయైన సత్యభామా గర్వభంగమే ప్రధానముగా గల ముత్తరాజు సుబ్బారావు గారి "శ్రీకృష్ణతులాభార నాటకము" నందును, సత్యభామ ఖండితగ, స్వాధీనపతికగ, కనిపించును. తన నుదాసీన పరచి, సవతి రుక్మిణికి యింటికేగి వచ్చినాడను ఈర్ష్యా క్రోధము లతో సత్యభామ, "పతి లాలింపులను లెక్క చేయక, "కుటిలజన విరోధీ! ఈ నయగారపు బల్కులు నీ తెచ్చుకోలు వలపులు నీకు వెన్నతోఁబెట్టిన విద్యలు గదా!" (పు. 40) అని మిక్కిలి వక్రోక్తులతో ఖేదపరచుటచే, ఖండిత అగును. సత్యభామ స్వాధీన భర్తృకయనుట, ఈనాటకమున పలుచోట్ల నిరూపింపబడినది. తన ప్రియమైన పారిజాత మపహరింపబడుటకు సత్యయు, సత్యాపతియు కారణమని భావించు శచీదేవి "శ్రీకృష్ణుని భక్తవత్సలతను ప్రశంసించు బృహస్పతి మాటలను సహింపలేక", అతడు భక్తవత్సలుడో, భార్యావత్సలుడో మొన్ననే తెలియలేదా?" (పైది పు. 9) అని మండిపడుటయు, సత్యభామా గర్వభంగము చేయుటకై నిర్ణయించుకొనిన నారదుడు "ఆ సత్యభామా విధేయుండు, నా సత్యభామా గర్వాపహరణోద్యమంబునకు సహకారియగునా?" (పైది 14) అని శంకించుటయు, నారదు డాడబోవు నాటకమునకు సహకరింప నంగీకరించియు కృష్ణుడు, తాను రుక్మిణి యింటి నుండి వేగముగా వెడలి వచ్చుచు... "సత్య నా దర్శనమునకై యెంత పరితపించుచున్నదో? నన్నెంత కఠిన హృదయుడని దూరుచున్నదో?" (పు. 35) యని భయపడుటయు సత్య స్వాధీనభర్తృకతనే తెల్లము చేయును.

తులాభారానంతరము, రుక్మిణి భక్తికిని, సత్యా గర్వభంగమునకును ముదమొందిన నారదుడు "ఇక సత్యభామా విధేయుడు రుక్మిణీ విధేయుడగు, ఏమనియెదవు?" అని సత్యను చూచి పరిహసించును. ఈ పరీక్ష కేవలము సత్యలో నతిశయించి యున్న రక్తిని భక్తిగా మార్చుటకు జరిగినదే. నారదుని మాటలే, శ్రీకృష్ణుడంతవరకు సత్యభామా విధేయుడై యుండెనను నిజమును చాటుచున్నవి. నారదుని నాటకమునకు కృష్ణుడు సహకరించినను, చివరకు సత్యతో నాతడు "సత్యా! నావలన నీవు కష్టముల పాలు గావలసి వచ్చె గదా" (పైది పు. 79) అని బాధను వ్యక్తపరచుటయు, అతనికి సత్య యెడల గల ప్రేమాతిశయమునే స్పష్టము చేయుచున్నది. వీని నన్నిటిని బట్టి చూడ ఇందు సత్య స్వాధీనపతిక యనుట రూఢియగుచున్నది.

## హరికథలలో :

"శ్రీకృష్ణతులాభారమ"ను హరికథయందు సత్యభామ ఖండిత, స్వాధీనపతికయు నగును. రుక్మిణి చెంతకేగి తిరిగి వచ్చిన పతిని చూడగానే, ఈర్ష్యావిలచిత్తయై "ఔరా మోసగాడా!" అనుచు "ఏ రీతి నిట కరుదెంచితివి"? అని గద్దించుచు

*"సుందరియా, వైభవంబునకు ఇందిరయా ననుబోలగల్లు*
*చందముదా, రుక్మిణినిం గని నా యెడ*
*నిరాదరణ యొనర్చితివి ! ధరాస్థలిని"* ......(పు.20),

అని మందలించినది. కుటిల వచనములచే పతికి ఖేదము కలిగించుచు తన కోపమును చూపినది కావున, సత్య ఇచట "ఖండితా - ప్రౌఢ - ధీరాధీర" అగును.

"కలికిరో! నీ కోర్కెను దీర్తు ననుచు కరములు శిరమున మోపి వాగ్దానము చేయగానే సత్య శాంతించినది. కావున "ఉత్తమ" యని తెలియనగును. ఇందును సత్య పరుషోక్తులకు, వక్రోక్తులకు కృష్ణుడు కుపితుడు గాకుండుటయు, ఆమె అభీష్టానుసారముగ దాన మీయబడుటకు సమ్మతించుటయు, సత్య స్వాధీనభర్తృకతనే చాటును.

కొప్పరపు గోపాలకృష్ణమూర్తి గారి "శ్రీకృష్ణ భాగవతము" (సత్యా వివాహము) అనెడు హరికథయందును, నరకాసురునితోడి యుద్ధమున కేగు పతి వెంట తానును వత్తునని, పట్టు బట్టు సత్యను, హరి నివారింపబూనియు "తన మనవి చిత్తగింపుమని ఆమె మరల అర్థింపగ, వలదని అన్నందులకామె కోపమునందుటచేత "రమ్మటంచు" ఆమె కోపమునకు భయపడి తోడ్కొనిపోయినాడు. ఆ భయము, ప్రియముచేత కల్గినదే. కావున ఇదియును సత్య స్వాధీనపతిక యనుటనే తెల్లముచేయును.

## జానపద గేయములలో :

జానపద సాహిత్యమునందును సత్యభామ పొందిన వివిధావస్థలు వర్ణితములై యున్నవి. స్త్రీల పౌరాణిక పాటలయందు, సత్య స్వాధీనపతిక, ఖండితగ, వాసకసజ్జికగ, విరహోత్కంఠితగ కనిపించును.

అక్రూరుని యింటికి విందు కేగుచున్నానని బొంకి, రుక్మిణీ సీమంతపు వేడుకలకేగినాడని తెలిసి, ఈర్ష్యతో సత్య

*"అక్రూరుడె సతి యాయెన అతి వేగంబున మీకు*
*అక్రూరుని గని యాతని నడుమెక్కడ - నడిగితిరో"* ...(రుక్మిణీసీమంతము. 165)

అని పలు వక్రోక్తులతో ప్రియుని ఖేదపరచునపుడు ఖండితగ కనిపించును.

"సత్యభామ సరస"మను పాటయందు, కృష్ణుడు అన్యకాంతా సంభోగ చిహ్నముతో నడుగిడగా "చెక్కిళ్ళ కాటుక లెట్లు వచ్చినవని" అనియు, "మెడలు పరిమళ మేమిటో కృష్ణ! చెపుమా" అనియు, "చీని చీనాంబ్రాలు మరి పసుపులాయె", "పరమాత్మ నీ పెదవి పగిలున్నదేమి" అని కారణము లడుగుచు "మాటమాటకు బొంకులాడకు నీవు" (పు. 171) అని అసత్యమాడుచున్న పతిని హెచ్చరించుచు "సతత మా సతి యింట వుండకపోతె - యిచ్చోటికి మిమ్ము యెవరు రమ్మనిరి, వచ్చి మమ్మొ యింత తడవు వుడికించనేల", (పైది పు. 172) అని వక్రోక్తులతో నిందించునెడ, సత్య "ఖండితగ కనిపించును.

"అలకరే పుయ్యరే అరుగుల్ల మీద చిలకరే కస్తూరి శ్రీఘ్రుంబుగాను" (పైది. 168) అనుచు గృహాలంకరణమునకు సంబంధించిన ఆజ్ఞలను చెలులకిచ్చి, "శృంగార రాయులకు చంగల్వపాన్పు -గడువేగ వేయించి" (పైది. పు. 169) అన్నిరకముల పూలను చాలపరచి పొల్పుగ నలంకరింపజేసి, "పచ్చిపసుపు పన్నీరు జలకంబులాడి పచ్చ పట్టూ చీర బాగుగా గట్టి - నల్లపట్టూ రవికె నాతి తొడిగి, గజదంత చిక్కట్ల తలచిక్కు దీసి - ముత్యంపు కురు లన్ని బాగుగ దువ్వి, పాపిట నడుమ ముత్యాలు గూర్చి, మొగలి రేకులను మల్లెలను దురిమి, చుక్క బొట్టు నుదట చక్కగా తీర్చి, వెలగల ముక్కెర బెట్టి, తన ముత్యాల నత్తమర బెట్టి,నాల్వేలు విలువగల నాను మెడ వేసుకొని" (పైది. పు. 170), ఇట్లనేక విధముల నలంకరించుకొని, పతికై ఆతురతతో నెదురుచూచు తరి సత్య వాసకసజ్జిక యగుచున్నది.

*"జాము పోయెను రెండు జాములయిపోయె*
*వేళకు రాడాయె నీల వర్ణుండు - గోపస్త్రీలతోడినవ్వుతూనూ*
*మరిచెనే నా మీది మక్కువలు అన్ని..."  .....(సత్యభామసరసము పు. 170)*

అని చెలి ముందు అతని ఆలస్యమునకు కారణముల నరయుచు విరహముచే తపించు సత్య విరహోత్కంఠితగ చిత్రితము.

జానపదుల సృష్టియందును, సత్య స్వాధీనపతికగ కూడ గోచరించినది. శ్రీకృష్ణుడు తన వాడే యనియు, పతి యెక్కుడగు కూరిమిని తానే పొందిన దనెడు భావ మామె కున్నది. పారిజాత కుసుమమును రుక్మిణికిచ్చినాడని తెలియగనే "ఇందరి సవతులలోపలనూ, నాకంటెక్కువ అని తలచెన రుక్మిణి నిపుడు" (శ్రీ పారుజాతపల్లవి - పు.20)" అని ఆశ్చర్యముతో ప్రశ్నించినది. కృష్ణుడును ఆమె భావమునకు తగినట్లుగనే ప్రవర్తించినాడు. కోప గృహమున అలుకతోనున్న "మత్స్యాక్షి"కి, చెలిచేతిలో నున్న "సురటినందుకొని విసరి" సేవలు చేసినాడు (పైది. పు. 21). అంతేకాదు.

*"మదిరాక్షీ! జనులాడే మాటలకూ వెరచీ యీ పువ్వూ*
*మొఖమాటమ్మున ఇచ్చితి గానీ మోహమ్మున గాదే" (పైది. పు. 22)* అనియు,

*"నీ వాణ్ణీ గానటవే నీకూ తప్పితినయినా*
*నీ పంపే వచ్చితి నిపుడూ నీ బంటను గానా"  ...(పైది. పు. 22)*

అనియు పలుకుచు, తానామెకు విధేయుడనుటను ప్రకటించుకొనుచు, "పద్మనాభుండు సత్యభామ పాదములపై వరిగినాడ"ట (పు. 22). ఈ జానపదుల సత్యభామ భర్తయెడ, నయ భయములు కలదగుటచే, తన్నుద్ధు

*"వక్కా పువ్వూ యింతికినీ వొసగితి కాగా యికనూ*
*చక్కని పారిజాతం కొని తెస్తును సరసవనములో దీ*
*యెక్కువతో నాటింతూ నీ పూలవనములోనూ" ...(పైది. పు. 22)*

అని సతిముందు ప్రతిన చేయుటయే గాక, అమరావతి కరిగి "పారిజాతమును పెల్లగించీ" కయ్యమునకు వచ్చిన ఇంద్రాదుల నోడించి, చెట్టును ప్రియ సతి కర్పించి, తాను సత్యా ధీనుడనుటను నిరూపించినాడు.

"రుక్మిణీదేవి సీమంతమ"ను పాటయందు తనను మోసగించి రుక్మిణీ సీమంతమున కరిగినాడని యెరింగి అలక గృహమున పవ్వళించిన సత్య, కోపమును పోగొట్టదలచి "ఇంతి-చేతి వీవను పుచ్చుకు తానే విసరి"నాడు. (పు. 165) అతని దృష్టిలో సత్య యితర కాంతలకన్నను, పట్టమహిషికన్నను అధికమైనది. చివరకు "నీవాడనె సతి" అని తానామె కధీనుడనుట నెరింగించినాడు.

సత్యభామసరసము అనుపాట యందు, ఆలస్యముగా వచ్చిన పతి యెడల కోపించి గ్రక్కున గడియ పెట్టి సత్య, అలుకను ప్రదర్శింపగా, సరసంపుమాటలచే సతిని అనునయింప జూచి ఫలితము కానకపోవుటచే, చివరకు "పద్మాక్షి నీకాళ్ళు పట్టెదా నేను" (పు. 171) అని బ్రతిమాలుకొనినాడు. కోప మింకను తనియని సతిని జూచి, అత్తింటికి వచ్చునపుడు మీ పుట్టింటి వారేమని చెప్పి పంపినారని అడుగ, 'మిమ్ము శిక్షింపుమని విన్నపము లాయె' అనిచనవుతోను గరువతనముతోను పలికినది. అందులకా రసిక చక్రవర్తి, "కొట్టుమ"ని 'బంగారపు - కోల చేతికి"చ్చినాడు. ఇంతటి చనవు ప్రేమ, హరి మరియే యితర కాంతకును చూపించినట్లు కనపడదు.

కృష్ణుని ప్రియసతిగ, పతి గుండెలో నిలిచి, సవతుల గుండెలలో అలజడిని రేకెత్తించినదీ స్వాధీనపతిక. పారిజాతమును రుక్మిణి కిచ్చునపుడు సత్య యాతని మదిలోనే నిల్చినది కాబోలు. ఆ విషయమును రుక్మిణి గుర్తించినట్లున్నది.

*"ఆ పువ్వు - తనకు యిచ్చెనేకోమలీ*
*యిచ్చి నీలావర్ణుడు - తనలోను - తాను తాపంబొందెను*
*ఆ వేళ అప్పగించి - ఆ పారిజాతమే కొంచు బోయె*
*దాని కాళ్ళను బట్టుచు కృష్ణుడు - దాని పెరట నేసెనే"*

*...(రుక్మిణీ దేవి ముచ్చట్లు - పు.178)*

అనుచు రుక్మిణీ దేవి పల్కిన పలుకులు, సత్య స్వాధీన పతికయనుటనే నిరూపించును.

తన కింతగా వశుడైన శ్రీకృష్ణుడు "ముందు జన్మలో మగడు ఔటకూ" 'పతిని దాన' మిచ్చు వ్రతమును జేయ సంకల్పించినది. "ఆ వ్రతము చేయవేమొ సిగ్గు చేతనూ" అని నారదు డనుమానముగా పలుక,

*"గోపికామనోహరుండు గోపాలకృష్ణమూర్తి*
*భర్త నాకమరియుండ సిగ్గు లేటికి" ...(తులసీదళము పు. 192)*

అని ఆత్మ విశ్వాసముతో పలికినది, ఆ స్వాధీన పతిక.

సత్యభామ స్వాధీన భర్తృకత, జానపదుల దృష్టికి అహంకారముగ కనిపించినది కాబోలు. అందుచేతనే ఈ పాటలలో పెక్కింటియందు "సత్యా గర్వభంగమే" ప్రధానాంశముగ గనుపించుచున్నది. అయినను, వాని యందు గూడ సత్య స్వాధీనపతిక యనెడు విషయము ధ్వనితము కాగలదు. హరి సత్యకధీనుడైన వాడగుటచే తాను సంపాదించిన అపురూప సంపద లన్నియును ఆమెకే అధీనము గావించినాడు. ఇది సతులకు, ముఖ్యముగ రుక్మిణికి అసూయనే గలిగించినది. మునికి, పతిని తొందరపడి దానమిచ్చి చివరకు చిక్కులలో దగుల్కొనిన సత్యను జూచి రుక్మిణి

*"నావద్ద ధనము లేదెన్నడయిన గాని విభు*
*డెంత సొమ్ము తెచ్చినాను నాకు యిచ్చెనా*
*తనకు సత్రాజిత్తు డిచ్చినట్టి గొప్పముత్యసరులు*
*విభుడు నీకు దాచి యిచ్చె వేడ్కతోడనూ*
*యింద్రపదవి బోయి చూచి తెచ్చినట్టి కనకమెల్ల*
*యింపుగానూ నీకు యిచ్చె కృష్ణ మూర్తియూ*
*నరకసురుని సంహరించి తెచ్చినా మూల ధనము*
*నీ యింట దాచినాడు మోదమందియూ*
*పెండ్లి నాడు కట్టినపాలపూసలే గాని*
*యితర సొమ్ములేవియును నాకు లేవుగా" ....(తులసీదళము. పు.196)*

అనికోపముతోను, అసూయతోను కుతకుతలాడుట, సత్య స్వాధీన భర్తృకతనే స్పష్టము చేయును. ఇది కేవలము అసూయతో రుక్మిణి అనిన మాటలు కావు. నిజమనుటకు నిదర్శనము కూడ ఉన్నది.

*"ముగుదురో నిన్ననే చూడకుంటెను*
*వొక్క నిమిషము వొక్క యేడుగా దోచు- కమలాక్షి!*
*చిగురు బోణిరో నేను యెవరి కోసమ్మే -*
*యింత పదార్థము తెచ్చి నీయింటపెడుదు" ...(సత్యభామ సరసము - పు.172)*

అని సత్యతో వక్కాణించుట సత్యభామ స్వాధీనభర్తృకతను చాటుచున్నది.

ఇట్లు శృంగార నాయిక యగు "సత్యభామ" ఆంధ్ర సాహిత్యములోని పలు ప్రక్రియలందును, ఆ యా సందర్భములలో అష్టవిధావస్థలలో భిన్నభిన్నమైన అవస్థా భేదములను పొందుట కనిపించినను, ప్రతి గ్రంథమునందును ఆమె తప్పని సరిగ స్వాధీనపతికగ మాత్రము సాక్షాత్కరించుట జరుగుచున్నది.దీనిని బట్టి సత్యభామ 'వస్తుతః స్వాధీనపతిక" అని చెప్పవలసి వచ్చుచున్నది.

ప్రియుని వశీకరించుకొనుట ప్రగల్భా లక్షణమని సాహిత్యదర్పణము[1] నిర్వచించుట వలన స్వాధీనపతిక యైన సత్య ప్రగల్భయే యగును.

"ఒక్కొక్కప్పు డీమె విరహోత్కంఠిత వలెను, వాసక సజ్జికవలెను, కలహాంతరిత వలెను, విప్రలబ్ధ వలెను, అభిసారికవలెను కనిపిస్తుంది. స్వాధీనపతిక ఐన ఈమె పరస్పర విరుద్ధాలైన ఇన్ని నాయికా భేదాలకెట్టు సరితూగింది అని శంకించుట సహజమే. కాని సత్యభామా ప్రియుడు ఏకపత్నీవ్రతుడు కాడు. బహు భార్యావల్లభుడు. అందుకే కవులు ఆ యా సన్నివేశాలను పురస్కరించుకొని అన్నితీరుల చిత్రించినారు" అని[2] పి. యశోదారెడ్డిగారు సత్య వివిధమైన నాయికావస్థలను పొందుటకు గల కారణములను వివరించుచు,ఆమె స్వాభావికముగ స్వాధీనపతిక యనియే అంగీకరించినారు.

ఈ విస్తారమైన పరిశీలనము వలన సత్యభామ "వస్తుతః స్వాధీనపతిక" యని భావింపనగును.

---

*ఇచట పేర్కొనబడిన పాటలన్నియు ఆంధ్రసారస్వత పరిషత్తు వారు ప్రచురించిన "స్త్రీల పౌరాణిక పాటలు" అను పుస్తకమునుండి గ్రహింపబడినవి*

*1. సా. ద. - 3 - 102*

*2. సత్యభామా వైభవం - ఆంధ్రప్రభ దినపత్రిక - 1979 అక్టోబరు 20*

# ఏడవ ప్రకరణము

# మనస్తత్వ శాస్త్ర దృష్టిలో సత్యభామ పాత్ర విశ్లేషణము

## సత్యభామ మూర్తిమత్వము (Personality)

అయిదవ ప్రకరణమునందు లౌకిక దృష్టితో, కవుల చిత్రణములోని సత్యభామ పాత్రను పరిశీలించుట జరిగినది. ఈ ప్రకరణము నందు మనో విజ్ఞానశాస్త్ర (మనస్తత్వ శాస్త్ర) దృష్టితో సత్యభామ పాత్రను విశ్లేషించుట జరుగుచున్నది. ఇది శాస్త్రమునకు సంబంధించిన పరిశీలన యగుటచే, పై ప్రకరణము నందలి పరిశీలనకు భిన్నమైన కొన్ని లక్షణము లిందు కనిపింపవచ్చును.

ఒక వ్యక్తి ప్రవర్తనలోని భేదములను, అందలి సంగతములను మనోవైజ్ఞానికుడు తెలిసికొన వలసి యున్నది. మూర్తి మత్వ విజ్ఞాని యొక్క పని .అతి క్లిష్టమైనది. వ్యక్తి ప్రవర్తనలో, భేదములు అనంతములుగ నుండుట వలన అతని ప్రవర్తనను నిర్దిష్టమైన వర్గములుగ విభజించుట కష్టమగును.

ఒక వ్యక్తి యొక్క విలక్షణమైన ప్రవర్తనను ఆలోచనను నిర్ణయించు అతని మానసిక, భౌతిక వ్యవస్థలయొక్క (Psychophysical Systems) గతిశీలక వ్యవస్థాపనయే (Dynamic Organisation) మూర్తిమత్వము అని తెలియనగును.[1]

ఒక వ్యక్తి మూర్తిమత్వ గుణ గణములను గూర్చి తెలిసికొనుటకు ముఖ్యముగ రెండు విషయములను గమనించుట అవసరము. 1. ఒక మూర్తిమత్వలక్షణము విలక్షణముగ ఉండి, కొంత కాలము స్థిరముగ నుండవలెను. 2. మనము తెలిసికొనుటకు ఎన్నిక చేసిన మూర్తిమత్వపు అంశములు ప్రత్యేకమైనవిగ నుండ వలయును. అనగా ఇతరుల నుండి ఆ వ్యక్తిని ప్రత్యేకించి వేరుపరచి తెలిసికొనదగిన లక్షణమై యుండవలెను.

ఒక వ్యక్తిలోని మానసిక శారీరక లక్షణములే అతనిని విలక్షణమైన వ్యక్తిగా నిలుపును. అతని శారీరక నిర్మాణము మానసిక ప్రవృత్తి, బుద్ధి నైశిత్యము, అతని ప్రవర్తనాసరళి - ఇవి అతని విలక్షణతను ప్రదర్శించునవి. అతని జీవితానుభవములు, అనువంశిక అంశములు, అతని వ్యక్తిత్వము పెరుగుటకు దోహదము చేయునట్టివి. ఒక వ్యక్తి ఒక సందర్భములో ఒక విధమైన వ్యక్తిత్వమును ప్రదర్శించిన దానికి అతని జీవితములోని పూర్వానుభవములును ఒక కారణమై యుండును.

ఒకే వ్యక్తిలో అనేకమైన మూర్తిమత్వ లక్షణాంశములున్నను అవి ఆయా పరిస్థితుల యందు మార్పు చెందుచున్నను, మౌలిక లక్షణాంశములు, మాత్రము, ఎన్నిటికిని మారవని కాటిల్, ఐసెక్, ఆల్పోర్ట్ మున్నగు శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుచున్నారు. షేక్స్పియర్ నాటకములందలి పాత్రలను, ముఖ్యముగా లియర్, హేమ్లట్, ఒఫీలియా మొదలగు పాత్రలను, కొందరు మనో విజ్ఞానశాస్త్ర దృక్పథముతో విశ్లేషణ చేసి, కొన్ని మానసిక, నాడీ రుగ్మతల అపవ్యవస్థలు (Mental & Nervous Disorder) ఏట్లేర్పడునో, ఉదహరించుటకు ఈ పాత్రలను లక్ష్యములుగ కూడ చూపినారు. ఇవి నాటకములందలి పాత్రలే యయ్యు, వానిని ప్రాణమున్న వ్యక్తులకు వలె భావించి మనో విశ్లేషణ జరుపుటకు ఆ పాత్రల సజీవత్వమే కారణము.

---

*1. "The dynamic organisation within the individual of those Psychophysical systems that determine his characterstic behaviour and thought" Allport - Dictionary of Psychology - P. 380, 381.*

సత్యభామయు ఒక సజీవపాత్రయే. ఈమె ఇతర పాత్రలకన్నను విలక్షణముగ కనిపించు నట్టి పాత్ర, కావున ఆ పాత్ర యొక్క మూర్తి మత్వమును, శాస్త్రీయ దృష్టితో విశ్లేషించుట ఉచితమే అగును.

శ్రీకృష్ణునికి గల పదియారు వేల యెనమండ్రు భార్యలలో అష్టమహిషులు ముఖ్యులు. శ్రీకృష్ణుని భార్యలని అనినప్పుడు, ముఖ్యముగ రుక్మిణీ సత్యభామలే మన మనో నేత్రముల ముందు సాక్షాత్కరించుట సహజము. వీరిరువురే, శ్రీకృష్ణుని ప్రియభామలుగా వరలిరి. ఇందరు కాంతలున్న ఆ గోపాలకృష్ణుడు, అగ్రమహిషితో సమానముగ, ఆమె కన్నను అధికముగ కూడ, సత్యభామను ప్రేమించుటకు ఆమెలోని విలక్షణతయే కారణమనిపించును. తెలుగు సాహిత్యమున ఎన్నియో వందల కావ్యములున్నవి. వేల కొలది పాత్రలున్నవి. కాని వానిలో మన మనసున నిలుచు పాత్రలు మాత్రము వ్రేళ్ళమీద లెక్కింపవచ్చును. అట్టి పాత్రలలో సత్యభామ పాత్ర యొకటి. ఆ పాత్రను పురాణేతిహాస కవులు మాత్రమే కాదు. ప్రబంధ, భామా కలాప, యక్షగాన, నాటక, హరికథ, జానపదము లనెడు వివిధ ప్రక్రియలకు సంబంధించిన కవులు కూడ, ఎంతో ప్రేమతో ఆదరించినారు. ఆమె కింతటి ప్రాధాన్యము కల్గుటకు ఆమెలోని 'వైవిధ్యమే' కారణము.

శ్రీ కృష్ణునకే కాదు, కవులకును, సామాన్య జనులకును కూడ సత్యభామ ప్రీతి పాత్ర మగుటకు, ఆమెలో ఇతర కాంతల కన్న విభిన్నమైన వైవిధ్య ముండుటయే కారణము. పారిజాత పుష్పమును రుక్మిణి కిచ్చినందుల కితర సపత్నులు అసూయా క్రోధములను నిగ్రహించుకొనగా, సత్యభామ మాత్రమే, క్రోధాసూయలను బహిర్గతము చేసి, పతి శిరమును తాడనము చేసి, నిందోక్తులు పలికి ఏడ్చి, చివరకు పంతము సాధించుకొనినట్లు "పారిజాతాపహరణ" ప్రబంధ యక్షగాన, నాటకాదులందు, చిత్రితమైనది. అదే విధముగా దివ్య పారిజాతమును చూడగానే అది కావలయునని పట్టుబట్టి, పతి వలన సంపాదించు కొనుటయు, పురాణేతిహాసముల వలన తెలియనగును. ఇదే స్థితిలో మరియొక కృష్ణకాంత యున్నచో అట్లు ప్రవర్తించి యుండదేమో ననిపించుచున్నది. యుద్ధ రంగమునకు వెడలుచున్న భర్తతో, ఇతర కాంతలేమియు ననక ఉదాసీనముగ నుండగా, సత్య మాత్రము వెంట వచ్చి తీరెదనని, పంతము పట్టి, నెగ్గుట పోతన భాగవతమునందును విష్ణు పారిజాత యక్షగానము, దీపావళి నాటకము మున్నగు వానిలోను కనిపించును. ఇట్లు ఇతర కృష్ణ కాంతలెవరిలో లేని, విలక్షణత, సత్యభామలో మాత్రమే కనిపించుట వలనను, ఆ గుణములును స్థిర గుణములవలె అనిపించుటచేతను, వానిని ఆధారముగ చేసికొని, సత్యభామ మూర్తిమత్వ విశ్లేషణ మిచట చేయబడుచున్నది.

కవులు సత్యనేవిధముగ చిత్రించినను ఆమెలోని మౌలికమైన మూర్తిమత్వ లక్షణాంశము లను మాత్రము వర్ణించుట మరువలేదు.

## ఫ్రాయిడ్ నిర్దేశించిన మూర్తిమత్వ నిర్మాణము :

మూర్తిమత్వము, 'ఇడ్' (id) లేదా 'అచిత్తు', 'ఈగో' (Ego) లేదా 'అహము, 'సూపర్ ఈగో (Super ego) లేదా 'అధ్యహము' అను మూడు భాగముల నిర్మాణమని మనోవిశ్లేషణా స్థాపకుడైన ఫ్రాయిడ్ విశ్వాసము.[1] ఇడ్ లేక అచిత్తు మన పుట్టుకతోనే ప్రారంభమగును. అచిత్తు జీవసంబంధ ప్రేరకముల యొక్కయు, ప్రేరకములను తృప్తిపరచు 'సహజాత'

1. *According to Freudin concept the human Personality consists of three important structures id, ego and super ego. M.B. - Ghorpade - Essentials of Psychology P. 466.*

పరిచర్యల యొక్కయు, ఒక రకమైన ఉగ్రాణము (Store house) గా భావింపవచ్చును. మనో విశ్లేషణ (Psychoanalysis) సిద్ధాంతము ప్రకారము లైంగిక, విధ్వంసాత్మక (Destructive) అంతర్నోదములు (Urges) , ముఖ్య ప్రేరకములు లేదా సహజాత ఉత్సుకతలు (Instinctive drives) అగును. ఈ ప్రేరకముల శక్తిని 'కాముకత' లేదా 'లిబిడో' (Libido) అందురు.

ఈ 'ఇడ్' అనునది మానసికమైన కోరికలన్నింటికిని మూల స్థానము. దీనికి మంచి చెడు అను విచక్షణా జ్ఞానముండదు. అన్ని రకములైన కోరికలు దీని నుండి పుట్టును. తాను చూచినది కోరుకొనినది అది సాంఘికముగా గాని నైతికముగా గాని, జీవిత వాస్తవికతలకు కాని, విరుద్ధమైనను, అది తనకు వెంటనే చెంది తీరవలయును, అది ఎట్లైనను సాధించి తీరవలయునను పట్టుదల 'ఇడ్' ప్రభావమునకు లోనైన వ్యక్తిలో అధికముగ నుండును.[1]

వ్యక్తి తన చుట్టునున్న వాతావరణ సంపర్కము లోనికి వచ్చినపుడు 'ఈగో' ఏర్పడును. అందుకొరకే దీనిని (Social Self) అని కూడ అనుట కలదు. అహము (ఈగో), అచిత్తు (ఇడ్) నకు సాధారణముగ కళ్ళెము వేయును. ప్రపంచములో సమర్థవంతముగా వ్యవహరించుటకై అభ్యసింప వలసిన ప్రవర్తనల, ఆలోచనల యొక్క విస్తృత విధానములతో అహము కూడి యుండును. ఇది ప్రేరకములను (motives) తృప్తిపరచుటను ఆలస్యము చేసి, వానిని సాంఘికముగ అమోదయోగ్యమైన పద్ధతుల ద్వారా తృప్తిపరచును. ఒక వ్యక్తిని 'ఈగో' క్రమశిక్షణలో ఉంచును. వ్యక్తి జీవనము కొఱకు పనిచేయుటను, ఇతరులతో విభిన్న పద్ధతులలో సంబంధమేర్పరచుకొని వ్యవహరించుటను, జీవిత వాస్తవములతో సర్దుబాటు చేసికొని జీవించుటను, ఇది నెరవేర్చును. ఫ్రాయిడ్ అహము (ఈగో)ను వాస్తవికతా సూత్రసేవ (in the service of the reality principle) చేయునిదిగా వర్ణించినాడు.[2]

అధ్యహము లేక సూపర్ ఈగో అనునది, చాల వరకు మనము "అంతరాత్మ" అని పిలుచు దానితో సమానమైనట్టిది. ఇందు, అహము (ఈగో), అచిత్తుల (ఇడ్) చర్యల మీది మూర్తి మత్వ వికాస కాలములో సంపాదింప బడిన నిరోధకములుగ, (Restraints) ఉండును. "ఇడ్" ప్రేరకములను తృప్తి పరచుటకు అహము (ఈగో) చేయు కార్యములను, అధ్యహము

---

1. *"The id is thought of as a store house of biological motives (hunger, thirst, sex etc.) and instinctive response tendencies aimed at their instant satisfaction.*
*(M.B. Ghor Pade - Essentials of Psychology - P. 466)*

2. *"The 'id' is however bridled or restrained by ego which is actually the effect of the ways in which we are taught to behave and think in dealing effectively with the world around us (reality). One of the effects which the ego produces on the id is that it delays the satisfaction of its motives and channels its energy into socially and culturally accepted directions. The guiding principle of the 'ego' is the contradiction of 'id', the pleasure principle. The ego tries to postpone or renounce immediate gratification in order to avoid unpleasant consequences and gain better rewards in future. Thus according to Freud, the ego develops out of the 'id', Contacts with reality and at the same time serves as a sort of 'regulatory principle' Checking all its actions and channelising them in socially accepted ways". (Essentials of Psychology - P. 466, 467).*

(సూపర్ ఈగో) తప్పని నిందించి, వ్యక్తిలోని నైతిక విలువలను ఇది కాపాడును. దీనినే నైతిక శక్తి అని కూడ అనవచ్చును. ఆదర్శముల కొరకును, బాల్య దశలో సంపాదించిన అహము (ఈగో) ఆదర్శముల కొరకును ఒక వ్యక్తి పని చేయునట్లు అధ్యహము చేయును. అచిత్తు (ఇడ్) యొక్క ప్రేరకములను లేదా సహజాతములకు చెందిన శక్తిని అనగా కాముకతను[1] (లిబిడో), సాధారణముగా అహము (ఈగో), అధ్యహములు (సూపర్ఈగో) నిరోధించు చుండును. అట్టి సమయములందు ఈ శక్తి అహము, అధ్యహములకు అంగీకారమైన ఇతర మార్గముల ద్వారా వ్యక్త మగుటకు విస్థాపనము (Displacement) చెందును. మరి యొక విషయమును కలదు. "అచిత్తు (ఇడ్) తరచుగా, అహము (ఈగో), అధ్యహము (సూపర్ ఈగో)లతో సంఘర్షణకు లోనగుటచే వ్యాకులత (Anxiety) కలుగుచుండును. అట్లు వ్యాకులతకు లోనైన వ్యక్తి దానిని తగ్గించుకొనుటకై పలు మార్గములను అన్వేషించుచుండును.[2]

## సత్యభామలో - 'అచిత్తు' (ఇడ్) ప్రాబల్యము :

సత్యభామలో, ఈగో, సూపర్ ఈగోల కన్న 'ఇడ్' యొక్క ప్రభావ మధికముగ నున్నది. ఈ విషయము ఆంధ్ర సాహిత్యమునందలి వివిధ గ్రంథములందు చిత్రింపబడిన సత్యభామ యొక్క పాత్రను పరిశీలించిన సువిదితము కాగలదు.

శ్రీకృష్ణుడు, గిరి, శస్త్ర సలిల దహన పవన దుర్గమమైనదియు, మురాసుర పాశ పరివృత మైనదియునగు ప్రాగ్జ్యోతిషపురమునకు, లోక కంటకుడైన నరకాసురుని వధించుటకై పోవుచున్నాడు. ఇతర కృష్ణ పత్నులెవ్వరును తాము కూడ వత్తుమని ఒక్క మాట కూడ అనలేదు. కాని సత్యభామ మాత్రము, తానును, కూడ వత్తునని పంతము పట్టుట పోతన భాగవతమున చూడగలము.

*"దేవా! నీవునిశాట సంఘములనుద్దీపించి చెండాడ నీ,*
*ప్రావీణ్యంబులు చూడఁగోరుదుఁగదా! ప్రాణేశ మన్నించినన్*
*నీవెంటం గొని పొమ్ము నేఁడు........." .......(భాగ - 10- ఉ - భా - 151)*

అని బ్రతిమాలుకొనినది. సత్యకు ఆ భీకర రణరంగము యొక్క తీవ్రత గూర్చి తెలియదేమోనని భావించిన కృష్ణుడు, భీషణ రణరంగము గురించి వర్ణించుచు, "కన్య నీవేడ! రణరంగ గమన మేడ!" అని వారింప చూచినను. "దానవులైన నేమి, మఱి దైత్య సమూహములైననేమి నీ మానిత బాహు దుర్గముల మాటున నుండఁగ నేమి శంక"? (పైది. 155) అని వాదించి, అతనిని ఒప్పించి, సత్య పంతము నెరవేర్చు కొనినది. విష్ణు పారిజాత యక్షగానము నందును,

*"తోయజేక్షణ! నీ బాహు దుర్గయుగము*
*నడుమ యుండగ భయమంద నాకు గలదె*
*కాన నీవెంట వత్తు నిక్కముగ"* ........*(పు. 117)* అని, అతని వెంట పోవును.

'దీపావళి' నాటకమునందు శ్రీకృష్ణుడు నరకాసుర వధను గూర్చి నిశ్చయించుటకు ముందే సత్య "ఆదుష్ట దానవుని భ్రష్టత కనులార గాంచుటకై నేనునూ, మీ వెంట యుద్ధ క్షేత్రము నకు వచ్చెద" నని (పు. 60) బయలు దేరును. అట్టి మంకుపట్టు వలదని, హరి వారించు చున్నను ఆ దానవుని వధానంతరమే పతి మాట వినగలనని దృఢముగా సమాధానమిచ్చును. (పైది. పు. 61)

సత్యభామ వీరోత్సాహము గల వీర వనితయే. కాని కదనరంగమునకు అబలలు

1. *Essentials of Psychology P-467*
2. *Essentials of Psychology - P - 467.*

రారాదని పతి వారించుచున్నను, పట్టు బట్టి ఆ భీకరమైన రణరంగమునకు భర్తతో వచ్చుటకు ఆమె లోని ఈగో, సూపర్ ఈగోల మించిన 'ఇడ్' ఆధిక్యమే కారణమగును.

ఇదే విధముగ భాగవతమునందును, సత్యభామా సాంత్వనమందును, పతి వలదని వారించు చున్నను ఆమె యుద్ధమునకు పూనుకొనును. ఇందును ఎవరి మాటలను లెక్కచేయని, తనపంతమే నెగ్గవలయు నను ఆమె ప్రవృత్తి స్పష్టమగును. ఇదియు 'ఇడ్' ప్రభావమే. పారిజాతాపహరణ ఘట్టమున నీమెలోని ఈ 'ఇడ్' ప్రభావము మరింత సుస్పష్ట మగును. దివ్యలోకమున కనిపించిన పారిజాత వృక్షమును చూడగానే అది తనకు కావలయునని కోరుకొనినది హరివంశమున 'అవ్వర మహీరుహముం దన సొమ్ము సేతకై" "చిత్త విభుని" 'మెత్తన' వేడినదనియు (ఉ. భా - 4 - 217), భాగవతమున "కోరిన" దనియు (10-ఉ.భా - 214) చెప్పబడినది విష్ణు పురాణమున, "ద్వారకాపురికి నీ పారిజాతము గొని యరిగి, మదీయ గృహాంగణమున నుపవనంబుల లోన నునుచుము ........" అని (8-11) ఆదేశించినది. అట్లే మూలానుసారముగ అనువదింపబడిన నేమాని భైరవకవి హరివంశమున "ధీర! సురద్రుమంబుఁగొని తేరఁగ శక్యమ యేని, కోపముం దీరును, మన్మనోరథము తెట్టలు పెట్టిన యట్ల సూవె" ..... (భై - హరి. ఉ. భా - 5.76) అని ఆదేశించునట్లు అనును

పారిజాతాపహరణ ప్రబంధమునందు, పారిజాతమును చూచిన సత్య

*"................ ఏల తామసం,*
*బీ విబుధాదినాయక మహీరుహముం బెకలించి లోకసం*
*భావితమైన నీ పలుకు ఁబంతము సెల్ల మదీయ గేహ కే*
*శీవనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా"* .....*(పారి 4-11)*

అని అసహనమును చూపును.

*"ఇటువంటి ప్రేమ నీకిపుడు గల్గినను*
*తటుకున ఁబారిజాత ప్రసూనంబు*
*గ్రక్కున గొని దెచ్చి కరుణతో నిచ్చి*
*మక్కువతో నన్నేలు మదన గోపాల"* .....*(పారి-యక్ష-4-261)*

అని "పారిజాతాపహరణ యక్షగాన" సత్య పట్టు పట్టును. పుష్పమునకు బదులు చెట్టునే తెత్తునని అతడనగానే,

*ఎలిమి నింద్రాదులు నెదిరించిరేని*
*నిలిచి జయింపగ నేర్తువు నీవు*
*కావున వేడితె ఁగడు వేగమునను*
*ఈవుల చెట్టు నీవిటకుఁ దేవలయు"* ....*(పైది 4-పు-266)* అని ఆదేశించును.

అట్లే పారిజాతాపహరణ నాటకమునందును "రుక్మిణి దగ్గరనున్న పారిజాత పుష్పము నాకిప్పింపుడు" (పు. 34) అని మొండితనముతో అడుగుటయే కాదు, వృక్షమునే తెచ్చి యీగలనని అనగానే అందులకు మరింత సంతోషించును. 'ఇడ్' లక్షణ మిట్లు మరింత విపులముగా చెప్పబడినది.

"The id is completely selfish, concerned only with the immediate gratification of instinctual needs without reference to reality or moral considerations"

(-- James C.coleman. Abnormal Psychology and Modern life. 5th Edition - P. 55)

మానవ కాంతయై యుండియు, తాను దివ్యలోకమున కేగుటయే అపూర్వము. అట్టి యెడ, తాను కోరుకొనినది ఒక సాధారణ పుష్పమును కాదు. దేవతాధిపతి యగు ఇంద్రుని నందన వనమందలి అపూర్వమును మహా మహిమాన్వితమును, జాతి స్మరత్వము కల్గించు నట్టిదియు నగు వదాన్య నగమును! ఇదియే మరియొక కాంతయై యుండిన యెడల, అట్టి కోరికను పొంది యుండలేదు. ఒకవేళ అట్టి కోరిక ఆమెలో కల్గినను, అది సాధించుట కష్టమని గాని, అట్టి దివ్య వృక్షము తన కర్హము కాదని గాని, ఆలోచనము చేసి, ఆ కోరికను అణచివేసి కొని యుండును. ఆ వృక్షము కావలయునని తాను కోరుకొనినను, అది ఇంద్రుడిచ్చుటకు ఇష్టపడడని సత్యకు తెలియును. పతి వారితో యుద్ధము చేయవలసి వచ్చుననియు తెలియును. దాని ఫలిత మేమగునో కూడ ఆలోచింపలేదు ఆమె. ఒకరి సొమ్మును, సొంతము చేసికొన కోరుట నీతి మంతముకాదు. పతిని ఒక వస్తువును నపహరించుటకై అట్లు యుద్ధమునకు ప్రోత్సహించుట న్యాయము కాదనెడు విచక్షణను ఆమె కోల్పోవుటకు కారణము, ఆమెలోని ఈగో, సూపర్ ఈగోలను అధిగమించిన 'ఇడ్' ప్రభావమే!

వింత వింత కోరికలు కల్గుటందరికిని సహజమే. 'ఇడ్'లో జన్మించిన అవాంఛనీయమైన కోరికలను 'ఈగో' 'సూపర్' ఈగోలు అంగీకరింపవు. అట్టి కోరికలు అచేతనములోనికి (Unconscious) నెట్టివేయ బడును. కాని 'ఇడ్' అధిక్యము కలవారి కోరికలు ఒక క్రమశిక్షణలో ఉండవు. సత్యలో ఈ 'ఇడ్' ఆధిక్యము కారణముగానే, ఇట్లు కష్టతరమైన అసాధారణమైన వస్తువులకై పట్టు పట్టుట జరిగినది. ఆమెను తృప్తిపరచుటకై కృష్ణుడు పారిజాతాపహరణము చేయుటయు జరిగినది.

కృష్ణుడు తనను వీడి, సవతి రుక్మిణి చెంత కేగినాడు. కాని అతనిని తన స్వాధీనములోనే ఉంచుకొనవలయును. అతనికి తన చెలిచే, కబురంపినను రాలేదు. సత్య పోయి పిలువగా, కృష్ణుడు

*"రానుపోనే యొకరింటికి రాదగవే చెలియా*
*కాని యా మాటల కేమిగాని యూరకే పోగదవే" .....(బాలకృష్ణ. లీ. వి యక్ష పు. 125)*

అని పొమ్మని విదిలించుకొనుచున్నను, వీడక, అతనిని, తన సవతిని, నిందించుచునే "తనరిన భోజకన్య వంటిదాన గానటర" (పైది - పు - 127) అని అనుచు తన నేలు కొనుమని అర్థించినది.

ఈ యక్షగానము నందే గాక, పలు యక్షగానము లందును ఇట్టి సత్యభామనే మనము చూడగలము. పతి తననుండి వేరు కాకూడదు. అతడు తననే అంటిపెట్టుకొని ఉండవలయును. అది నెరవేర్చుకొనుటకై, తన మానావమానములను సహితము మరచి, మరల, మరల సవతి యింటికి వచ్చి, పతిని రారమ్మని పిలుచును. అట్లు సవతి యింటికి వచ్చుట, సవతితో కయ్యమాడుట అనుచితమని పతి హెచ్చరించుచున్నను, వినదు. చివర కాతడు తన చెంతకు వచ్చిన తరువాతనే శాంతించును. ఇది సత్యలోని 'ఇడ్' ఆధిక్యమునే చెప్పును. తన కోరికలోని సామంజస్యమును కాని ఔచిత్యమును కాని ఆలోచింపక, తన పట్టుదల నెరవేరుటయే ప్రధానముగ ఇందు ఆమె భావించినది. తన వలెనే, అతడు రుక్మిణికిని భర్త. ఆమెతో అతడుండుటయు ఉచితమే అగును. కాని ఈమె దృష్టిలో అట్లు కాదు. ఎట్లైనను అతడు తనకే వశంవదుడై యుండ వలయును. అందులకై సవతి యింటికే పోయి పోట్లాడి వచ్చినది.

శ్రీకృష్ణ తులాభార నాటకమునందును, సత్యలోని 'ఇడ్' యొక్క ప్రాబల్యము సుస్పష్టముగ సూచింపబడినది. పుట్టిన దినపు విందని రుక్మిణి కృష్ణుని ఆహ్వానింప రాగా, ఆనాడు తాను మెట్టిన దినమని, అందుచే తన యింటికే అతడు రావలయునని, పతిని

పట్టుకొని లాగును (పు. 25). అగ్రమహిషి యొక్క పుట్టిన దినపు విందునకై ఇతర సపత్నులందరును ఆ ఉత్సవమునకు పోవుచుండగా సత్య మాత్రము, ఒక ప్రత్యేక కారణమును కల్పించుకొని, పోలేదు. అంతేకాదు, పతిని కూడ నిలిపివేయ ప్రయత్నించినది. ఇది సత్యలోని 'ఇడ్' ఆధిక్యమును సూచించును. అదే విధముగ తులాభారము తూచుట విచిత్రముగా నున్నదనియు అది ప్రమాదమేదైనను కలుగచేయ వచ్చునని భర్త హెచ్చరించు చున్నను *'దానిమిచ్చిన యుత్తరక్షణమే మిమ్ము బ్రతి గ్రహింపకున్న నే జీవింపగలనా? మీకింత మాత్రము తెలియదా" (శ్రీకృష్ణ. తు. నాట. పు. 44)* అని సమాధానమిచ్చును. ఇదే విధముగ 'శ్రీకృష్ణ తులాభారమను హరికథ' యందును, సమాధానమిచ్చును (పు. 21). ఇట్లు తాను తలచిన పని సాంఘికము గాను, నైతికము గాను అనుచితమై యొప్పుచున్నను, అసంగతమై యున్నను, సత్య లెక్కచేయక దానిని నెరవేర్చి తీరవలయునని పట్టుబట్టుట ఆమెలోని ఈగో, సూపర్ ఈగోలను మించిన 'ఇడ్' ప్రాబల్యమునే తెలియపరచును.

## ఎరిక్‌బార్న్ నిర్దేశించిన మూర్తిమత్వ నిర్మాణము :

ఫ్రాయిడ్ చెప్పిన పై సిద్ధాంతము వంటి సిద్ధాంతమునే దాదాపు మరియొక దానిని బార్న్ మహాశయుడును చెప్పినాడు. ఇతని సిద్ధాంతము ప్రకారము మానవ మూర్తిమత్వము మూడు "ఈగోస్టేట్" లచే నిర్మింపబడియుండును. అవి చైల్డ్ ఈగోస్టేట్ (Child ego State) అడల్ట్ ఈగో స్టేట్‌ (Adult Ego) పేరంట్ ఈగో స్టేట్ (parent ego state)[1]

ఆశ్వాల్డ్ సమ్మెరిటన్ 'ఈగోదశ'ను ఇట్లు నిర్వచించినాడు.

"Ego state" means 'state of ego' or state of I. Thus the I is Central. it is the person who is in an 'ego state' at any moment not an ego state which takes over the person; it is the person, the 'I' who is in control"

(Transactional Analysis - Basic Cocepts - P. 8)

దీనివలన 'ఈగో' దశలో నున్న వ్యక్తిలో 'నా', 'నాది' అను భావమే ప్రధాన కేంద్రముగ నుండుననియు, ఎప్పటికైనా ఒక వ్యక్తి ఈగో దశలో ఉండును కాని, ఈగో దశ ఆ వ్యక్తిని ఆక్రమించదనియు తెలియుచున్నది. వ్యక్తి ఆలోచనా సరళి అనుభూతులు, ప్రవర్తన వీని నాధారముగ ఈ 'ఈగోదశలు' నిర్ణయింపబడును. ప్రతి వ్యక్తిలోను పై మూడు ఈగోదశలు నుండును. కాని కొందరిలో ఒక్కొక్క దశ అధిక ప్రాబల్యము వహించుచుండుట వలన, వారిని ఆ దశలోనున్న వ్యక్తులుగ పేర్కొనుట జరుగును. తల్లిదండ్రులచే కాని, ఆ స్థానమందున్న వారి నుండి, మన జీవితముపై అధికారము కల్గిన వ్యక్తుల వలన కాని, సంపాదితమైనది "పేరంట్ ఈగో స్టేట్".[2] తొందఱగా "పండుకొనుము" "క్రమము తప్పక చదువుము", చిన్నపిల్ల వలె ప్రవర్తింపకుము" "ఇట్లు చేయుట ప్రమాదము" మొదలైన తండ్రి యిచ్చు ఆదేశములు, హెచ్చరికలు వంటివి, మనము ఒక చిన్నపిల్లవాని ముందు

1. *"According to Berne the human personality is composed of three ego states, Which he designates as child, adult and parent and which are somewhat similar to Frueds 'id, ego and super ego' respectively - The essentials of Psychology - P. 534.*
2. *"The Parent ego state is that part of personality which has been borrowed from our biological parents or from those who took their place, and from parental or authoritarian figures in our early life. It is that part of us which is concerned with making the world a safe and pleasant place to live in".*

*Oswald Summerton - Transactional Analysis-Basic Concepts - P. 7, 8*

అనిన అది సమంజసముగను, ఉచితముగను ఉండును. కాని సమవయస్కుడైన ఒక వ్యక్తిని ఇట్లు హెచ్చరించుచు, ఆదేశించుచున్నట్లు మాట్లాడిన మనలను వారు అపార్థము చేసికొన వచ్చును. వయసునకు, మించిన అధికార ధోరణి, ఈ (పేరంట్ ఈగో) దశ యందున్న వ్యక్తిలో కనిపించును. మనమున్న 'అడల్ట్ ఈగోస్టేట్' వలన, హేతుబద్ధముగా ఆలోచించి విచక్షణా శక్తితో నిర్ణయములు గైకొని నడుచుకొనుట జరుగును[1]

బాల్యావస్థతో కూడినది చైల్డ్ ఈగో స్టేట్. ఈ స్థితిలో మన ఆలోచనలు, ప్రవర్తనలు అంతయు పసితనమునే పోలియుండును. అనగా సంతోషము వచ్చిన పొంగిపోవుట, దుఃఖము వచ్చిన క్రుంగిపోవుట, తనను ఇతరులు మెచ్చుకొనవలయునని కోరుకొనుట, తన ప్రత్యేకత గుర్తింపబడ వలయునని ఆశించుట మున్నగునవి ఈ దశయందున్న వ్యక్తి కల్గియుండును.[2] కొన్నిమారులు ఈ దశయందున్నప్పుడు మనము ఇతరుల విమర్శనలను సహృదయముతో స్వీకరింపలేక, ద్వేష పూరితులగుటయు, జరుగును. ఇట్టి ప్రవర్తన పెక్కు సందర్భములందు మిక్కిలి అసమంజసముగ కూడ అనిపించును.[3]

ఇట్టి విభిన్న దశలలో నుండు మనము ఆయాదశల ఆధిక్యము కారణముగా మనకు తెలియకుండగనే ఒక్కొక్కమారు ఎదుటివారిని బాధించుటయు జరుగుచుండును. మనోవిశ్లేషణ చేసికొనిన వ్యక్తి తనలోని ఈ బలహీనతను తొలగించుకొని, ఇతరులతో సహజముగ ప్రవర్తింప గలడు. ఒక దానిని చూచినపుడు సంభ్రమముతో పట్టలేనంతగ ఆనంద ప్రకటనము చేయుటయు, 'ఇది నాకు కావలయునని' పట్టు బట్టుటయు చిన్నపిల్లను వలె తలవంచుటయు, నాట్యభంగిమలను, అధికముగ శారీరకమైన కదలికలను ప్రదర్శించుటయు, చైల్డ్ ఈగో స్టేట్ యొక్క లక్షణములే.[4]

## సత్య - చైల్డ్ ఈగో స్టేట్ మూర్తి మత్వము :-

ఆంధ్ర సాహిత్యమున, చాల వరకు, సత్యభామ వయసు పరముగ, ప్రౌఢగానే చిత్రిత మగుట గమనించియున్నాము. కాని ప్రవర్తనాపరముగ ఆమె మూర్తిమత్వము మాత్రము "చైల్డ్ ఈగో స్టేట్" లోనే అధికముగ నున్నది.

సత్యభామ పారిజాత వృక్షమును చూడగానే అది కావలయునని కోరుట, ఆమెఉన్న చైల్డ్ ఈగోస్టేట్‌ను నిరూపించును. అంతేకాదు. సత్యభామ దుఃఖమును కాని సంతోషమును కాని నిగ్రహించుకొనలేదు. సింగన పద్మపురాణమున, శచీదేవి పారిజాత పుష్పమును నరకాంత యైన సత్యకు అర్హము కాదనియు, అమర భోగ్యము లనుచు, తాను ధరించి, సత్యను

1. *Oswald summerton - Transactional Analysis - P. 8.*
2. *"The Child ego state is that part of personality which we bring with us from Birth through Child hood; it is that part of us which gurgles with joy whimpers, with distress, shouts, for glee, feels sad or miserable wants to be important and well spoken of" - Oswald Summerton - Transactional Analysis - Basic Concepts - P. 8*
3. *"The Child in our behaviour is actually a carry over of our early child-hood attitudes and thinking i.e. breaking down under stiff opposition like a child or reacting to criticism by others with spitefulness or behaving in a negative manner. There are typical child like responses which are often very inappropriate in many situations". Essentials of psychology - P - 534.*
4. *"For the child ego state besides such words as "haire', 'wow', 'good' 'oh', 'I want' there are body postures such as tilted head, a dancing gait, a lot of movement which are behavioural indications of child ego state" - Transactional Analysis - Basic concepts - P. 10.*

అవమానింపగా అవజ్ఞాభారముతో క్రుంగుచు సత్య, పతితో, తనకు జరిగిన పరాభవమును వివరించి, "ఇప్పుడీ, భూరూహమును ద్వారవతికిఁబూని తెచ్చితేని నాకోరికలు ఫలించుఁ గృష్ణ" (10-114) అని ఆదేశించును.

"నేమాని భైరవ కవి హరివంశమున నారదముని మందార పుష్పము నీయగా, ఎట్టి శంకయు లేక, నీ ఇష్టము జనమున కిచ్చినావనుచు (5-64) కోపగించు కొనుచు, జీవితముపై విరక్తి చెంది తపమునకు అనుజ్ఞ కోరును (పైది. 5-56). చివరకు పారిజాతమును తెచ్చి యిచ్చెదనని అనగానే పూర్వ కోపము నంత మరచి "ప్రసన్న"యైనది (5-75). అదే విధముగ పారిజాతాపహరణ ప్రబంధము నందును.

*"ఓ చెలి! శౌరికిచ్చెనట యొక్క లతాంతము దెచ్చి నారదుం*
*డా చపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్విరి యిట్టి మాటలా*
*హా చెవులన్వినంబడి యు, ఁబ్రాణము దాల్చెద మేన నింతగా*
*నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మొయి నున్న దాననో"* ........ *(పారి 1-90)*

అని భర్త పారిజాత పుష్పమును సవతి కిచ్చినంత మాత్రమునకే మానహానిగా భావించి ప్రాణత్యాగము చేయవలె ననెడు నిర్ణయమునకే వచ్చినది. అనగా దుఃఖము నేమాత్రము భరింపలేని ఈమె మనస్తత్వమును అది చూపును.

"భర్త అందరికన్నను, తనకింత కాలము చనవు లిచ్చుటచే సవతులు తలలు పైకెత్తి చూడలేనంతగా తనయెడ భయమును కల్గియుండిరి. కాని ఈనాడు ఇట్టి అవమానము జరుగుటచే వారు తనను లెక్కచేయరు. వారు తనను చూచి నవ్వుదురని భీతిల్లినది.

*"ఆ, వన్నియు వాసియు దఱిగి వారుననుం దలలెత్తిచూడఁగా*
*సన్నలఁ జాయలం బలుక సైతునే ప్రాణము లెంత తీపొకో"* .....*(పైది-1-88)*

అని కలవర పడినది. తన భర్త సవతికి పుష్ప మిచ్చిన విషయము తెలిసినచో, సవతులు ఇక తన ప్రాధాన్యమును గమనింపరు. తాను వారి ముందు చులకనై పోవుటచే ఇక ప్రాణములతో నుండుట అనవసరమని భావించినది.

అదే విధముగ కృష్ణుడు సత్యకు చనవులెక్కువనిచ్చుటచే, దేవకీదేవి తనదు కోడండ్రులోన ఆమెను పెద్దగ మన్నించుచుండును. కాని ఈనాడిట్టి అవమానము జరుగుటచే "అసాధ్వి సేవసేయబోవంగ నాకింక సిగ్గు గాదె" (పైది పారి 1.130) అని కుమిలినది. తన ప్రత్యేకతను, గొప్పతనము నందరు గుర్తింపవలయు ననెడు తపన ఆమె మాటలలో వినిపించును. పారిజాత పుష్పమును సవతి కిచ్చి నందులకు ఏడ్చినది. మ్రొక్కిన పతి శిరమును తన్నినది, నిందించినది. చివరకు కృష్ణుడు పారిజాతము తెచ్చి యిచ్చెదనని ప్రతిన చేయగానే మేఘ గర్జనకు పులకించు నీపలతిక వలె పులకించినది (పైది. 1-137).

"ప్రియవస్తు సంపాదనకై హటము చేయచు నాగడము లెన్నియో చేసి చేసి యవి తప్పులని తెలిసికొనక తిరిగి యావస్తువునకై ప్రయత్నించు మురిపంపు పాపవలె నీమెయు నలుక పూనినది.[1]" అను పి. యశోదారెడ్డి గారి మాటలు ఒక విధముగ సత్య ఉన్న "చైల్డ్ ఈగో" స్టేటునే సూచించు చున్నది.

పారిజాతమును తెచ్చి యిచ్చి కృష్ణుడు "ప్రతిన వచ్చెఁగదా, యిదె పారిజాత" మనుచు నర్పింపగా "హర్షమంది ప్రాణ విభుఁబెక్కు మాఱులు ప్రస్తుతించి"నది. (పైది. 5.50). ఇట్లు దుఃఖము కలుగగా, అంతులేని ఆవేదనకు గురి యగుట, ప్రాణత్యాగము

*1. పారిజాతాపహరణ పర్యాలోచనము - పు. 138.*

చేయదలచుట, సంతోషము కలిగినపుడు ఉద్వేగముతో పులకించుటయు చూడ సత్య చైల్డ్ ఈగో స్టేట్‌లో అధికముగ నున్న దనుటను తెలియచెప్పును. పారిజాత వృక్ష ప్రతిష్ఠాపన చేతను పుణ్యకవ్రతాచరణము చేతను, పారిజాత పుష్పములను సవతులకు దానము చేయుట వలనను, సత్య ప్రాభవము, ఖ్యాతి ఇనుమడింపగ ఆమెలోని "చైల్డ్‌నకు" తృప్తి కల్గినది.

అదే విధముగ "విష్ణుపారిజాత యక్షగానము"నందును

*"సురమహీజంబు కన్నుల జూచి నిన్ను*
*పొందు దందాక పొందను పోర కృష్ణా"* ...(విష్ణు. పారి. యక్ష పు. 114)

అని విదిలించుకొనుటయు సత్య ఉన్న "చైల్డ్ ఈగో స్టేట్" నే చెప్పును.

"పారిజాతాపహరణ నాటకము" నందు శ్రీకృష్ణుడు, దిక్పాలులతో యుద్ధము చేయుట తప్పదని చెప్పిన తరువాత కూడ, తన కోరికను విడువదు. బృహస్పతి సంధిని చేయ వచ్చుచున్నాడని కృష్ణుడు సందేహింపగా "మీరు మరియొక లాగున జేయరు గాని యా మ్రాకు, మన మధీనమున నుండునట్లే సంధి చేయుదురు గాక" (పు. 82) అని హెచ్చరించును. దేవ నగమైన పారిజాతమును కోరుట అవాంఛనీయమనిగాని, అనుచితమని గాని, సత్య గ్రహింపలేదు. పై సందర్భములు, సత్యను స్వాధీనపతిక యని నిరూపించుటకు తోడ్పడినను, మనస్తత్త్వశాస్త్ర దృష్టితో చూచిన, సత్యభామ పారిజాతాపహరణకు పతిని ప్రేరేపించుట ఆమె ఉన్న 'చైల్డ్ ఈగో స్టేట్' నే తెలియచేయును.

విష్ణుమాయా నాటక ప్రబంధమున సవతులకు కూడ, పారిజాత వృక్ష మిచ్చినందులకు కన్నీరు నించుచు (1-199) పతిని నిందించుచు (1-200-202) ఆ విరులను పతిపై "దిగ పాఱబోయించు"ను (1-203).

'సత్యభామా సాంత్వన' ప్రబంధమున తనపతి, పదియారువేల కన్యలను వివాహ మాడినాడను అసూయతో ఏడ్చుచు (పు. 154), అతనిని నిందించుచు, (పు. 155-160) చివరకు జడతోకొట్టి (పు. 158) పాదతాడనము కూడ చేయును (4-పు. 193). భర్తను నిందించుట, తన్నుట మొదలైనవన్నియు సత్యభామ ఉన్న 'చైల్డ్ ఈగో స్టేట్'ను నిరూపించును. భర్తతో ఆమె సంతోషముగా గడుపు సమయము లందు ఆమె ఉన్న 'అడల్ట్ ఈగో స్టేట్' మూర్తిమత్వము ప్రకటితమగును.

సత్యభామ "పేరంట్ ఈగో స్టేట్‌లో"ను లేకపోలేదు. పారిజాతాపహరణము చేయు సమయమున, దానిని నివారింపబూను నందనవన పాలకులతో చిరునవ్వుతో ఏదో చెప్ప బోవుచున్న హృదయేశ్వరుని, "గరసంజ్ఞ మాన్చి"నది (పారి. 4.57). భర్తను చిన్నవానికివలె, అదుపులో ఉంచుట ఆమె ఉన్న 'పేరంట్ ఈగో స్టేట్'ను సూచించును. అంతేకాదు. పారిజాతము కావలయునని భావించినచో శచి, తనదు ప్రాణేశుడైన ఇంద్రుని ఇటకు పంపి "సత్యభామా విధేయు వలన మరలంగఁగొనుటె పో, వాసితనము" (పైది. 4.58) అని హెచ్చరించుచు, పరోక్షముగ భర్తను యుద్ధమునకు సన్నద్ధుని కమ్మని సూచించినది.

కాని ఇట్టి దశలకన్నను, సత్యభామ అధికముగ 'చైల్డ్ ఈగో స్టేట్' లో ఉండుటయే మనము గమనింప వచ్చును

పై పరిశీలన వలన సత్యభామలో ఈగో, సూపర్ ఈగోల కన్నను 'ఇడ్' యొక్క ప్రాబల్య మధికముగ నున్నదనియు, యువతి యైనప్పటికిని ఆమె 'అడల్ట్ ఈగో స్టేట్', 'పేరంట్ ఈగో స్టేట్' కన్నను 'చైల్డ్ ఈగో స్టేట్' లోనే ఎక్కువగా ఉన్నదనియు, దీని వలననే ఆమెలో, కోరిన కోరిక తీరవలయు నను పట్టుదలయు, మొండితనమును అధికముగ ప్రదర్శితములగు చుండెననియు, కోరినది లభ్యము కానపుడు ఏడ్చుట, ఎదుటి వారిని నిందించుట, దండించుట మున్నగునవి కూడ చేయుచుండిన దనియు తెలియుచున్నది.

## సత్యభామ - భద్రతారాహిత్యభావము (Feeling of Insecurity)

సత్య, శ్రీకృష్ణుని ప్రాణము కన్నను మిన్నగా భావించును. అతడు రుక్మిణి యింటి కేగినాడు. ఆ సమయమున సత్యభామ తన శృంగార వనమున చెలితో శౌరి గుణములను గూర్చి వాక్రుచ్చి వర్ణించుచుండినది. నిజమునకు అచట నంతయు మనోహరమైన వాతావరణము నెలకొనియున్నది. అలికులారావములు కాని కిసలాయాకుల కోకిల కాకు కాకలీ, కలకల నాదములు కాని, కమ్మని తమ్మి కొలంకు తెమ్మెరులు కాని, అప్పటి ఆమె "బుద్ధికి నేమియు నింపు"గా లేకుండెను. (పారి 1-72). అంతలో 'దక్షిణాంస చూచుక నయన ప్రకంపన'లు కలుగగా, "ప్రాణనాథుఁడొండొక చపలాక్షిఁగూడి నను నొల్లని చెయ్దము లేమి సేసెనో" (పైది. 1.73) అనియే సందేహించి కలవరపడినది.

మనోహర వాతావరణము నందు సహితము, సత్యభామ మనశ్శాంతిని కోల్పోవుచు ఏ అపశకునము కల్గినను, ఈ విధముగానే అనుమానించుచు, ఆందోళన పడుటకు కారణమేమి?

మనస్తత్వ శాస్త్ర దృష్టితో చూచిన, దీనికి ఆమెలోని భద్రతారాహిత్య భావమే (Feeling of Insecurity) ముఖ్య కారణ మనిపించు చున్నది. తనకో, తన భర్తకో ధనమునకు సంబంధించిన విషయములో గాని, ప్రాణమునకు సంబంధించిన విషయములో గాని, ఆరోగ్యమునకు సంబంధించిన విషయములో గాని అనుమానమో, ఆందోళనయో, పొందక, పై విధముగ అనుమానించుటకు ఆమెలోని భద్రతారాహిత్య భావమే కారణము. ఈ తీవ్రమైన భద్రతారాహిత్య భావము 'మనశ్శాంతి లేక పోవుట', 'పిరికితనము', అమితోద్రేకము 'భయాందోళనము' మొదలగు ఉపలక్షణముల ద్వారా వెల్లడి యగును.[1]

భర్త ప్రేమ చాల కలదియు, సౌందర్యవతియు, భాగ్యవతియు నైన సత్యలో భద్రతారాహిత్యము కలుగువలసిన అవసర మేమున్నదని అనిపింపవచ్చును. సత్యకు జీవితమున భర్తకు మించిన భాగ్యము లేదు. అతడు బహు కాంతా కాంతుడగుట వలన, అతని ప్రేమకు సంబంధించిన భద్రత విషయముగ ఆమె ఎల్లవేళల, కలవరపడు చుండును.

భారతమునందును ఇట్టి సత్యభామ కనిపించును. ఆమె, అరణ్యవాసము చేయుచున్న పంచ భర్తృకయైన ద్రౌపదిని చూడ నేగినది. పతుల నంతగా వశంవదులగు నట్లు చేసికొని మెలగుచున్న ద్రౌపదిని చూచి సత్య ఆశ్చర్యపోయినది. ద్రౌపది భర్త లొకరిని మించి ఒకరు ఆమె యెడ అనురక్తులుగా నుండుటయు, కింకరపాటు లేకుండుటయు చూచి, విస్మితురాలై, అట్టి ఆమె సౌభాగ్యమునకు 'వ్రతములా? మంత్రౌషధములా? సరస నైపథ్య కర్మ కౌశలమా? చతుర విభ్రమోల్లాస రేఖయా? ఏది కారణమని ప్రశ్నించుచు

*"ఏనును నీవలన నిజము*
*గానిది యంతమును నెఱిఁగి కమల దళాక్షుం*
*బూని వశగతునిఁజేసి య*
*నూన స్నేహాను భావయుక్తిఁదలిర్తున్* ......*(భార - ఆరణ్య - 5.292)*

అని కుతూహలముతో అడిగినది. కృష్ణ ప్రియయై యుండియు సత్యభామ యిట్లు అడుగుటను చూచి, తననామె దుష్టవనిత వలె భావించు చున్నట్లుగా ద్రౌపది తలచి, ఇంచుక కోపముతో

1. *"Feelings of insecurity may have widely differing effects on behaviour; but pervasive and chronic feelings of insecurity typically lead to fearfulness, apprehension and failure to participate fully in one's world".*
*(James E. Coleman - Abnormal Psychology and Modern Life - 5th Edition - p. 103)*

"పురుషోత్తమ వనితవుగాఁ దగవు నీవు" (పైది. 5.294) అని మందలించినది. భర్త సత్యా ప్రియుని గానే ప్రవర్తించుచున్నను అతడు, బహుకాంతా కాంతుడగుటచే ఏ క్షణమునందైన ఏ స్త్రీకైనను వశంగతు డగునను సందేహమును, తన భద్రతకు, కీడు వాటిల్లు ననెడు భయమును సత్య కెల్లవేళల నున్నది. స్త్రీ వివాహమైన తరువాత భర్తయే తన సర్వస్వమని భావించును. అతని నీడలోనే తనకు భద్రత యుండునని నమ్మును. పతి తనను గాక, పరస్త్రీ వైపు చూచినను తన భద్రతకు ప్రమాదము కల్గుచున్నట్లుగానే ఆమె ఆందోళన పడుట సహజము. అట్టి యెడ పదారువేల యేడుగురు సవతులున్న సత్యకు భద్రతారాహిత్య భావముండుటలో వింతలేదు.

నిజమునకు పుణ్యకవ్రతము చేయుటకు కూడ ఆమెలోని భద్రతారాహిత్యభావమే ప్రధాన కారణమనిపించును. "తానుంబతియున్, మనమున నఱుగొఱ లెఱుఁగక" యుండుటకే (పారి. 5.62), అనగా తనకు పూర్తిగా భద్రత కలుగుట కొరకే ఆ వ్రతమును నాచరించినట్లు అనిపించుచున్నది.

ఇదే విధముగ భామా కలాపము నందును, నాటకములు, జానపద గేయములందును చిత్రింపబడిన, సత్యభామలో ఈ "భద్రతా రాహిత్య" భావమున్నట్లు కనిపించును. "ఎవతో వానిని కేళికి రమ్మని కిటుకు పరచి, మందు లాలించి పతికి దాంబూలముతో బెట్టె" (పై. పు. 37) అని సత్యభామ సందేహించుటయు, "సతీపతి దాన విలాస యక్షగానము" లో "వినవయ్యా! నారద మునీంద్రా! మీకు సకలమును దెలిసి యుండునే, నన్నెల్లప్పుడు విష్ణు వెడఁబాయక యుండుట కుపాయము దెలుపవయ్యా" (పు. 7) అని అడుగుటయు, శ్రీకృష్ణ తులాభార నాటకమునందును "నాపై దయ యుంచి యేదైన నొక వ్రతమునో, మంత్రమునో తంత్రమునో సెలవిచ్చి పుణ్యము కట్టుకొను"డని (పు. 31) నారదుని, అర్థించుటయు, సత్యలోని 'భద్రతారాహిత్య భావమునే' తెలియ చేయును. అక్రూరుని ఇంటికి విందున కేగుచున్నాని కృష్ణుడు సత్యభామతో చెప్పి వెడలును. అందుల కంగీకారము చూపియు, అతడేగ గానే సత్య, అతనిపై సందేహముతో

*"అతివరో! వినవే కృష్ణుడు యెచ్చటి కేగినొతానూ*
*అక్రూరుని యింటికి విందు అరగించవలెనానీ*
*అక్కరో కృష్ణుడు యెక్కడికేగెనొ తాను*
*హరి ఎక్కడనున్నాడో ఆ వృత్తాంతము దెలియా*
*అతివేగమ్మున రమ్ము"......... (రుక్మిణీదేవి సీమంతము. పు. 154)*

అని జానపద సత్య చెలిని పంపుటయు, సత్యభామలోని భద్రతారాహిత్య భావమునే స్పష్టము చేయుచున్నది. ఇట్టి ఉదాహరణములు మరెన్నో కలవు.

ఇట్లు తెలుగు సాహిత్యములోని అన్ని ప్రక్రియల యందును, సత్యభామ భద్రతారాహిత్య భావముతో ఆందోళన పడునట్టిదిగ చిత్రత మగుట మనము చూడగలము. దీనిని బట్టి 'భద్రతారాహిత్య భావము' (Feeling of insecurity) సత్యభామ మూర్తిమత్వ లక్షణాంశములలో ఒకటి యనుట స్పష్టమగుచున్నది.

## *Frustration* (కుంఠనము)

సత్యభామలో కల్గిన ఈర్ష్యాక్రోధములకు కారణమేమి అనుటను పరిశీలింతము. సత్యభామ కృష్ణుని ప్రాణాధికముగ ప్రేమించినదనుట సువిదితము. అతని ప్రేమనంతయు తానే గుత్తకొనవలయునని కోరుకొనినది. దానికై వ్రతములు నోములు కూడ చేసి యుండినది. షోడశ సహస్రాంగనా వల్లభుడైన కృష్ణుడు తనకే వశంవదుడై, సత్యభామా విధేయునిగ, సత్యాపతిగ ఉండవలయునని ఆమె కోరిక. ఇదియే ఆమె లక్ష్యము.

"గమ్యచర్యా శీలతకు అడ్డంకులు కలుగుట వలన వ్యక్తిలో జనించు నిస్పృహాత్మక ప్రక్రియయే కుంఠనము. కుంఠనమునకు ఇతర కారణము లున్నప్పటికిని ముఖ్యముగా ప్రేరణాత్మక సంఘర్షణముల కారణముగాను, లక్ష్యసాధనకు ఆటంకములు కలుగుట వలనను ఏర్పడును".[1] ఈ ఆటంకములు (1) స్థితిగతమైనవి. (situational obstacles) (2) పరస్పర వ్యక్తుల సంబంధమైనవి. (Inter personal Obstacles) (3) వ్యక్తిలోనివి (Intra- Personal Obstacles) అని మూడు విధములుగ నుండును.

సత్యభామకు కల్గిన కుంఠనమునకు కారణము పరస్పర వ్యక్తి సంబంధమైన ఆటంకములే. పతి ప్రేమనంతయు తానే పొందవలననెడు లక్ష్యమునకు, తనకు మిగుల ప్రియమైన వల్లభుడు, తన నుదాసీన పరచి సవతి రుక్మిణికి పారిజాత పుష్పమిచ్చుట, తనను వీడి సవతి యింట నుండుట మున్నగు ఆటంకముల కారణమున, సత్యభామలో కుంఠనము (Frustration) ఏర్పడినది. ఈ కారణమున, ఆమెలో అంతులేని క్రోధావేశము లేర్పడగా, కోపసదనము కేగినది. కుంఠనము వలన కోపము కలుగుట సహజము.[2]

నేమాని భైరవి కవి హరి వంశమునందు, సత్య సవతికి పారిజాతపుష్ప ప్రదానము చేయుటవలన, కుంఠనమునకు లోనై "రోషకలిత చేతనాధూతయై తమోగృహంబు సొచ్చినది (5.23). పారిజాతాపహరణ ప్రబంధము నందును సత్య కుంఠనమునకు లోనైనట్లు కనిపించును. సత్యకు కృష్ణుడు ప్రాణమైన మగడు. అరమరలులేని కూరిమి ననగి పెనగి, కొరతలులేని కోర్కులతో కూడి మాడి, కపట మెరుగని మమతలతో కలసి మెలసి యున్న విభుడతడు (1-94). సత్య, పతిప్రేమనంతయు తానే గుత్త కొనవలెనను లక్ష్యముతో, కోరికతో జీవించునది. సవతులకు ధనమచ్చి పుచ్చుకున్నను సహింపగలదు కాని, చనవులిచ్చి పుచ్చుకున్న ఆమె జీవిత లక్ష్యమున కాఘాతము కల్గుననియే ఈ మానిని భయపడినది. తనను మరచి, పారిజాత పుష్పమును సవతి రుక్మిణి కిచ్చుటచే పతి ప్రేమ నంతటిని తానే పొందవలెననెడు ఆమె లక్ష్యమునకు ఆటంకము కల్గుటచే, కుంఠన మేర్పడి "అమర్షము" జనింపగా అనగా కోపము కలుగగా "కోపసదనము'న కేగినది (పైది. 1-98). ఇందు మానహాని సంభవించి నందున కోపమును తీవ్రముగ నున్నది. విష్ణుమాయా నాటకము ప్రబంధము నందలి సత్య కోపమునకును కుంఠనము ఒక కారణముగా కనిపించుచున్నది. పారిజాతమును తనకు మాత్రమే గాక, సవతులకు కూడ నిచ్చుటచే కేళీ మందిరమునకు పోయి ఆ మానవతి తలుపులు వేసికొనినది (పైది. 1.203). అదే విధముగ పారిజాత పుష్పమును సవతి కిచ్చినందులకును పతి తనకడకు రానని అనుట వలనను, సత్య క్రోధావేశములు చెంది "కోపాగారమునకు" వచ్చినది (4. పు. 226).

రాధాకృష్ణ నాటకమున, తనను వంచించి రాధను చేరెనని తీవ్ర కోపమును ప్రకటించును (పు. 64). అక్రూరుని ఇంటి విందని వంచించి, రుక్మిణి సీమంతోత్సవమునకు కేగినాడను కోపముతో మానహాని కల్గినదనియు తలచి జానపద సత్య పూరింటిలో 'పవళించినది' (రుక్మిణీదేవి సీమంతోత్సవము. పు. 158).

---

1. *"Psychologists use the term 'Frustration' to indicate the behaviour that results from difficulties in the satisfaction of our motives. Although there are many other sources from which frustration may result. The conflict of motives and the blocking of the goal of directed behaviour are the two most important sources of frustration" - Essentials of Psychology-P.245.*

2. *"Where biological motives are concerned anger may inevitably result when a motive is frustrated in some way" Essentials of Psychology - P. 268.*

## దౌర్జన్యము : (Aggression)

కుంఠనము వలన వ్యక్తులలో రకరకములైన అవాంఛనీయ ఫలితము లేర్పడుచుండును. స్వల్పకాల ఫలితముల పరిస్థితిని బట్టి, రకరకముల ప్రవర్తనా లక్షణాంశములుగా వ్యక్తమై, ఆ పరిస్థితులు తొలగిపోగానే అవి కూడ తొలగిపోవును. కుంఠనము ఫలితముగా వ్యక్తి, విధ్వంసకత (Destructiveness) ప్రత్యక్ష దౌర్జన్యము (Direct aggressiveness) విస్థాపిత దౌర్జన్యము (Displaced aggression) ఉదాసీనత (Apathy), స్వైర కల్పన (Fantasy) పునరావృతము (Stereo Typing) మున్నగు వానికి పాల్పడవచ్చును. దౌర్జన్యమనగా ఎదుటి వ్యక్తిని ఎదుర్కొనుట. ఇది పుట్టుకతో వచ్చు ప్రేరకము (Motive) కాదు. ఉత్సుకత అవసరము. ఈ రెండింటిని సూచించు సామాన్య పదమే ప్రేరకము (Motive). దౌర్జన్యము పరిస్థితులనుబట్టి వ్యక్తిలో ఏర్పడునట్టిది. దౌర్జన్యము, కుంఠనమునకు మరియొక ఫలితమని భావింపబడు చున్నను, అది యొకటి మాత్రమే మూలకారణము కాదనియు మానహాని కూడ ప్రత్యక్ష దౌర్జన్యమునకు ఒక కారణమని తెలియుచున్నది.[1] సత్యభామలో కుంఠనము వలన కన్నను ముఖ్యముగా మానహాని వలన దౌర్జన్యమునకు పాలుపడుట జరిగినది. "మానరహితమైన బ్రదుకు మానిని కేల" అని ప్రాణత్యాగము చేయునంతటి మానినీత్వము కలది సత్య.

దౌర్జన్యమనగా కొట్టుట చంపుట వంటి హింసాత్మకమైన కార్యమే అయియుండ వలయునని లేదు. తన నవమానించిన వ్యక్తిని నిందించుట, వాగ్యుద్ధము చేయుట, ఎగతాళి చేయుట కూడ దౌర్జన్యమే అగును. చివరకు తనను తాను శిక్షించుకొనుటచే అనగా, ఆత్మహత్యా ప్రయత్నము ద్వారా కూడ, వ్యక్తి, దౌర్జన్యమును ప్రదర్శింపగలదు.[2] పారిజాత పుష్పమును సవతికిచ్చి, తన నవమానించుటచే, మాన హాని జరిగినందులకు సత్యభామ పతిని నిందించుట భైరవ కవి హరివంశమునను పారిజాతాపహరణ ప్రబంధ యక్షగాన నాటకాదులందును కనిపించును. భైరవ కవి హరివంశమునందు కన్నను పారిజాతాపహరణ ప్రబంధమున సత్యలోని దౌర్జన్య ప్రవృత్తి స్పష్టముగ వర్ణింపబడినది. సత్యను సాంత్వన పరచుచున్న కృష్ణుడు తనను కడగంటనైనను చూడు మనుచు, పైట చెంగు పట్టుకొనగా, అమె తన చేతిలోని విరిదమ్మిచే కొట్టుదునని జంకించుటయు" (పారి.1-119) తన పాదముల కాతడు శిరముంచి మ్రొక్కగా, "వామపాదంబునం దొలగం ద్రోచుటయు" (పైది. 1-121) అమె కోపమింకను ఉపశమింపక పోవుటచే "పసుల కాపరనియు" (1.125) "గట్టివ చేతలుం బసలుఁ గల్ల దనంబులు నీవు పుట్టఁగాఁ బుట్టిన"వని (పైది. 1.127) పతిని పలు విధములుగా నిందించుటయు, పరిహసించుటయు సత్యలోని ప్రత్యక్ష దౌర్జన్యమునే తెలియచేయును. తీవ్రకోపమునకు గురియగుటచే పై కార్యముల వలన కూడ కోప ముపశమింపక పోవుట వలన, మానరహితమైన బ్రతుకు వలదనుచు, "నన్ను నాతోడి సవతులు నగక మున్న పంత మలరంగ నిన్ను మెప్పింతుఁగాక" (పైది. 1.131) అని ఆత్మహత్యకు కూడ సిద్ధమగుదు నని సూచించినది.

---

1. "Recent evidence further suggests that frustration is not the only source of aggression. Many other factors are involved in it. For instance injury, insult and threat may evoke aggression more Swiftly and decisively than sheer frustration" (Essentials of Psychology - P.237)
2. Aggressive behaviour may take various forms. violence may occur in extreme conditions; however abusive language verbal attacks of stronger or milder nature may occur more frequently than destructive and violent acts. sometimes aggression may take the form of self-Chastisement". Essentials of Psychology - P. 238.

విష్ణుమాయానాటక ప్రబంధమునందు, పారిజాత వృక్షమును పతి తనతో సమానముగ సవతికి కూడ నిచ్చెనను కోపముతో, అతనిని నిందించి, సవతి పంపిన పారిజాత విరులను అతనిపై 'దిగపాఱం బోయించి" నది. (1.203).

సత్యభామా సాంత్వనమున, తన ప్రియవల్లభు డనుకొను హరి, నరకుని చెరలోని పదారువేల కాంతలను చేపట్టి సుఖభోగముల ననుభవించు చున్నాడను కోపముతో అతడు సాంత్వన పరచుచున్నను వినక, జడతో కొట్టి (పుః 158) చివరకు పాదతాడనము కూడ చేసినది (పు. 161). భామా కలాపములో, పతి తనను వీడి, సవతిని చేరినాడను కోపమును తాళలేక,

*నాదుజన్మంబు నీ రీతి నదయ మౌట*
*వాని దలచుక ప్రాణముల్ వదలుదాన* .... *(భామా. మినర్వా్ప్రెస్. పు. 65)*

అని ఆత్మహత్యా ప్రయత్నమును చెలికి వివరించును. అంతేకాదు. పతి తనకు దూరమగుటకు సవతులే కారణమనియు, రుక్మిణి అభిమానము తీయింతుననియు, భద్ర బుగ్గలు నులుముదుననియు కృష్ణుని వేమరు జడతో కొట్టుదుననియు బెదిరించినది (పైది. పు. 76). అంతేకాదు. "కేల్మోడిచి" మన్నింపు కోరు పతిని 'ధూర్తుడా' అని తన్నినది (పైది. పు. 77).

పారిజాతాపహరణ యక్షగానము నందును, మానహాని జరిగినదనుచు, మ్రొక్కిన పతి శిరమును తాడనము చేయును (4 పు. 241).

"శ్రీకృష్ణ తులాభార హరికథ" యందు, తొందరపడి నారదునకు పతిని దానము చేసియు, తిరిగి అతనిని గ్రహింపలేక పతి పాదములను సహితము తాకనీయని నారదుని మోసమునకు కోపావేశములు చెంది, సురమునిని నిందించుచు, ప్రాణేశ్వరుడు తనకు దక్కనిచో ప్రాయోపవేశము చేసెదనని బెదరించుచు "పరిశుద్ధ ప్రదేశమున గూర్చుండి పద్మాసనాసీనయై ప్రాణాయామంబును బట్టి, వాయువులను బంధించు ప్రయత్నము చేసినది (పు. 30, 31). దౌర్జన్య మనెడు ఈ లక్షణాంశము, పరిస్థితులను బట్టియు, వ్యక్తిని బట్టియు నుండును. ఒకే వ్యక్తి అందరిపైనను ఒకే విధముగా దౌర్జన్య ప్రవర్తన చూపడు. సత్యభామ, ప్రబంధము లందు, తన భర్త ముందే దౌర్జన్యమును చూపినది. కాని, తనను నిందించిన నారదుని కాని, పరోక్షముగా మానహాని కల్గించిన రుక్మిణిపై కాని దౌర్జన్యమునకు పూనుకొనలేదు.

చిన్నతనమున ఇట్టి దౌర్జన్యమును చూపి, ఎదుటి వారి నుండి మంచి ఫలితము పొందుటకు అలవాటు పడిన వారే, పెద్ద అయిన తరువాత కూడ, తనకు ఎదుటివాని ప్రేమ కావలసియున్నను అతని వలన బాధ కల్గినను, తిరిగి అతని నుండి మంచి ఫలితము పొందుటకై ఇట్లు పట్టు పట్టుట, పోట్లాడుట మొదలగు దౌర్జన్యకరమగు పనులు చేయుచుందురట![1]

కాని సత్యభామ బాల్యమును గూర్చిన విశేషములను ప్రాచీన పురాణేతి హాసము లేవియు వర్ణింపక పోవుట వలన, పై విషయము సత్య యెడల ఎంతవరకు సమంజసమనుట చెప్పలేము. శిక్షించుట వలన దౌర్జన్య ప్రవృత్తి అధిక మగునని తెలియుచున్నది.[2] అందుచేతనే కాబోలు మానవ స్వభావమెరిగిన శ్రీకృష్ణుడు, సత్య చర్యల యెడల సహనము చూపి సాంత్వనము కల్గించినాడు.

"The 'id' is the source of instinctual drives which are considered to be of two types. (a) Constructive drives primarily of a Sexual nature,

---

1. *Essentials of Psychology - P. 238*
2. *"Often punishment of aggressive behaviour may lead to greater rather than lesser aggression" (Essentials of Psychology P- 238)*

which constitute the 'libido' or basic energy of life, and (b) destructive drives which tend toward agression, destruction and mentual death".
(Abnormal Psychology and Modern life. 5th Edition - P - 55)..

పై పరిశీలనము బట్టి చూచిన, సత్యభామ తన భర్తను పరుష వాక్కుల నిందించుట, పాదతాడనము చేయుట మున్నగు దౌర్జన్య చర్యలకు పూనుకొనుటకును, ఆత్మహత్య చేసికొందునని బెదిరించుటకును ఆమెలో ఏర్పడిన, కుంఠనము, మానహానియు, "ఇడ్" యొక్క ప్రాబల్యమును కారణములని తెలియనగును.

## విస్థాపితత్వము : (Displacement)

కృష్ణకాంతలలో నెవరికిని లేని వీరత్వము సత్యభామకు మాత్రమే ఉండుటకును, యుద్ధ కళాచతురుగ ఆమె భాసించుటకును ఒక కారణమున్నదని తోచుచున్నది. దౌర్జన్యప్రవృత్తి కలవారిలో 'విస్థాపితత్వము (Displacement) జరిగి, క్రీడలు మొదలైన వానిలో, లోకామోదము పొందు విధముగ దౌర్జన్య ప్రదర్శన కవకాశము కల్గుచుండుననియు తెలియుచున్నది.[1] సత్యభామ దుష్టురాలు కాదు. ఆమెలోని దౌర్జన్య ప్రవృత్తియు, తీవ్ర తరమైనది కాదు. కాని అంతయో, ఇంతయో ఆ ప్రవృత్తి ఆమెలో ఉండి యున్నట్లుగానే కనిపించుచున్నది. లోకమున వ్యక్తి, తన దౌర్జన్యమును ఎల్లవేళల, అందరి ముందు చూపించుటకు వీలుపడక పోవుటచే, అది సాంఘికముగ ఆమోదయోగ్యమైన పద్ధతిలో బహిర్గతముచేయు చుండును. బహుశః ఆ కారణము చేతనే కాబోలు, సత్యభామ అసమాన యుద్ధ వీరాంగనగ తన చతురత నంతయు కనబరుప గల్గినది.

## ప్రతి గమనము (Regression) :

మహా వీరాంగనగ, నరకాసురుని వంటి వీరుని అలయించినది, లోకైక నాయకుడైన కృష్ణుని ఆడించినదియు నగు సత్య కొన్నిమారులు పసిపిల్లవలె ఏడ్చుటకు కారణమేమి? వ్యక్తి సమతౌల్యము (Balance), ఉద్వేగ ఘాతములు (Emotional Conflicts) కుంఠనములు మానసిక సంఘర్షణములు మొదలగు అవాంఛనీయ కారణముల వలన దెబ్బ తినెడి పరిస్థితి కల్గినపుడు, వ్యక్తి మనసు రకరకములైన ప్రక్కదారులు (Detours) తొక్కును. వీనినే రక్షణతంత్రములు (Defensive Mechanism) అని అందురు. ఇవి ముఖ్యమైన సర్దుబాటు పద్ధతులు. వీని ఉనికి, ఉద్దేశము వ్యక్తికి పూర్తిగా తెలియదు. ఇవి వ్యక్తుల జీవితములు భగ్నము కాకుండ కాపాడు రక్షక కవాటముల వంటివి. ఇవి 'దమనము (Repression), ప్రక్షేపణము (Projection), "విస్థాపనము (Displacement)", "స్వైరకల్పన (Fantacy)", "హేతువాద వివరణము (Rationalisation)", ప్రతిగమనము (Regression), తాదాత్మ్యకరణము (Identification)", "ప్రతిచర్యా విధానము (Reaction Formation)". ప్రతిగమనములో వ్యక్తి గడ్డు సమస్యలను నెదుర్కొనలేక ఒక చిన్న పిల్ల వానివలె ఏడ్చుట, వస్తువులను నేలకు కొట్టుట, భార్యాపిల్లలతో పోట్లాడుట మున్నగునవి చేయును. ఇందులో వ్యక్తి బాల్యదశలో అవలంబించిన అలవాట్లవైపు మళ్ళును.[2]

---

1. *"Aggressive impulses are often displaced in such socially acceptable substitutes as athletics, racing, and other sports where aggression is expressed in new ways that are socially acceptable and rewarding such as winning". (Essentials of Psychology - P. 484)*
2. *"Regression is a defensive reaction involving a retreat in the face of stress to the use of reaction patterns which were appropriate at an earlier level of development. It involves a modification of behaviour in the direction of more primitive, infantile modes of behaviour".*
(James. C. Coleman. Abnormal Psychology and Modern Life - I Edition P - 92).

దీనిని బట్టి చూచిన, సత్యభామ కృష్ణునిచూచి "నన్ను నెవ్వతిగాఁజూచితివి" అని అదలించుటయు (పారి. 1-132) చివరకు ఏడ్చుటయు, ఆమెలోని ప్రతి గమనమునే చెప్పును ఇట్లు ఏడ్చుట, భైరవికవి హరివంశము నందును (5-42), విష్ణు మాయా నాటక ప్రబంధము నందును (1-199), సత్యభామా సాంత్వనమునందును (పు. 154), ఇంకను పెక్కింటను కనిపించును.

ప్రతిగమన చర్య వలన సమస్యా పరిష్కారము జరిగి తీరవలెనని లేదు. దీని వలన వ్యక్తి ప్రావీణ్యమునకు కొరత ఏర్పడదు. ఈ ప్రతిగమనము బాలబాలికలకే కాదు. వ్యక్తి ఏ వయస్సులో నున్నను కలుగ వచ్చును. దీని తీవ్రత ఆ యా వ్యక్తులను బట్టి వేర్వేరుగ నుండును. అధికముగ ఇతరుల రక్షణలో నుండు వారికిని, ఎక్కువగ ఇతరులపై ఆధారపడి ఉండు వారికిని కొంత మానసిక అపరిపక్వత కలవారికిని, ఈ ప్రతి గమనము తరచుగ కల్గు చుండును.[1] ప్రతి ఒక్కరికిని సంఘర్షణలు, కుంఠనములు ఉండుట సహజము. అదే విధముగ రక్షణోపాయముల నుపయోగించుటయు సహజమే. ఇది అపసామాన్యము (Abnormality) కాదు. కాని ఆ తంత్రములు ఫలవంతము కాకపోయినచో, ఆ వ్యక్తి అధికముగ వ్యాకులత అనుభవించినచో, అది అపసామాన్య మగును. "ఇన్ని దినంబులు న్నవతు లిందఱలోఁగడు గారవంబునం గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁగప్పు కొనంగనుండె" .... (పారి. 1.88) అని, సత్య చెలితో చెప్పుకొనినది. అనగా దీనిని బట్టి సత్య కృష్ణుని రక్షణ లోనే ఉంచబడినట్లుగా తెలియనగును. "అని కైనం బతి బాసి పోవడు" (పైది - 225). ఇట్లు సత్య ఎల్లవేళల పతి రక్షణలోనే ఉండెడిది. పతి నేరములను నెన్నుచు "నిన్ను నమ్మి నా గుట్టును దేజము న్మిగులఁగోల్పడి పోయితి" (పైది. 1-127) అనుటను బట్టి, ఆమె కృష్ణునిపై మిగుల ఆధారపడి జీవించు చున్న దనుటయు స్పష్టము.

ఈకారణమువలననే సత్య అంతగ ప్రతిగమనమునకు లోనైనది. ఈ ప్రతిగమనము తరువాత సత్య జీవితమున ఎట్టి లోటుపాట్లు కల్గినట్లుగాని, ఆమెలో సమర్థత తగ్గినట్లుగాని ఈ ప్రబంధమున కనిపింపదు. మిగిలిన గ్రంథములందును ఆవిధముగానే ఉన్నది.

ఈ రక్షణతంత్రములు ఎంతవరకు అవసరమో అంతవరకే ఉపయోగించుకొనవలెను. అప్పుడే అది ఆరోగ్యవంతమగును. ఇదియే స్థాయిని మించిన, హద్దులు దాటిన అపసామాన్య లక్షణముగా భావింపవలసి వచ్చును. సత్యభామయు తన పట్టుదల సాగువరకు మాత్రమే అత్యల్పకాలము వరకే, ప్రదర్శించినది. ఇట్టివి సామాన్య జీవితము నందును, ఎదురగు నట్టివే. తీవ్రోద్రేకముల వలన వ్యక్తి మనసు చాంచల్యము పొందకుండ, సమతౌల్యము చెడకుండ, ఈ ప్రతిగమనమను రక్షణ తంత్రము కాపాడుచున్నది. ఇట్టి ప్రదర్శనచేసిన వ్యక్తి కొంతసేపటికి సాధారణ మానసిక స్వస్థతను పొంది, తన దైనందిన చర్యలలో యథాతథముగ పాల్గొనుచుండును. సత్యభామయు అంతే,! హరివంశమునందును, పారిజాతాపహరణ, విష్ణుమాయా నాటక ప్రబంధాదులందును, భామా కలాపమునందును యక్షగానాదులందును మానహాని జరిగినందుల కంతగా కోపము ప్రదర్శించి పతిని నిందించి, ఏడ్చి, ఆగడములు చేసినను సాంత్వనము పొందగానే, అంతటిని మరచి తన నిత్య జీవిత కార్యక్రమమును యథావిధిగ కొనసాగించినట్లు వర్ణితము.

---

1. *"It may appear frequently in people who are over protected and unduly dependent than among the people who are mature both emotionally or intellectually.*
   *Essentials of Psychology - P. 485.*

ఇట్లు వ్యక్తులు వివిధ రక్షణోపాయముల నుపయోగించి సమస్యలను సర్దుబాటు చేసికొనుట వారి మూర్తి మత్వములో ఒక ప్రధానమైన లక్షణాంశముగా భావింప బడుచున్నది, మనుష్యులయొక్క లక్షణాంశములను, సామర్థ్యములను, వైఖరులను, అభిరుచులను, వారి ప్రత్యేకమైన ప్రేరకములను, వారి ప్రత్యేక సర్దుబాటు రీతులను రక్షణోపాయములను పరిశీలించుట వలన మనము వారి మూర్తిమత్వమును, లక్షణీకరింప వచ్చును.

## హిస్టరికల్ మూర్తిమత్వము : (Hysterical Personality)

ఒక వ్యక్తి తీవ్ర కుంఠనమునకు (Frustration) గురియైనపుడు అతడు నాడీరుగ్మతలు (Psychoneurosis) మనోవిక్షిప్తులు (Psychosis) అను రెండు రకముల మానసిక అపవ్యవస్థితులకు (Mental Disorder) గురియగు అవకాశమున్నది. నాడీరుగ్మతు లనునవి వ్యక్తులలో అల్పదశలో ఉన్న మనోవ్యాధులు. దీని వలన వ్యక్తి యొక్క మూర్తిమత్వము పూర్తిగా దెబ్బ తినదు. మనోవిక్షిప్తుల వలె, ఇవి ప్రమాదకరమైనవి కావు. నాడీర్మతల వలన బాధితులైన వారిని పిచ్చివారిగ భావింప నవసరము లేదు. వీరు తీవ్రమైన హింసాత్మకమైన చర్యలకు పూనుకొనరు. వ్యక్తి మనసులో 'ఇడ్' (అచిత్తు) 'ఈగో' (అహము) 'సూపర్ ఈగో' ల (అధ్యహము) మధ్య సంఘర్షణ లేర్పడును. ఈ పీడనలు దుర్భరము కాగా, అప్పుడు భిన్న భిన్న నాడీరుగ్మతలు అంకురించును. వీనిని చాల వరకు మానసిక చికిత్స ద్వారా సరిచేయ వచ్చును.

మానసిక నాడీ రుగ్మతలలో, హిస్టీరియా ఒకటి. జీవిత సమస్యలను ఎదుర్కొనలేక వ్యక్తి జీవనయాతనల నుండి పారిపోవుటకు, ప్రయత్నించు అసమర్థత ఇది. ఇది, మానసిక సంఘర్షణ అసాధారణముగా తీవ్రమై, దమనము సాపేక్షముగా, సంపూర్ణమైనపుడు, ఆ సంఘర్షణ ఒక శారీరక లక్షణముగా మారును. శరీరములో ఒక భాగమునకు పక్షవాతము వచ్చుట, పరిమిత ప్రదేశములో స్పర్శజ్ఞానము నశించుట అంధత్వము, చెవుడు, లేదా మూర్ఛ వంటి మరియొక రకమైన అశక్తత, ఇట్లు ఏదేని ఒక అశక్తతను పొందుట జరుగును.

హిస్టీరియా అనగా ప్రేరకముల సంఘర్షణ, శారీరక లక్షణముగా పరివర్తనము చెందుట అని అర్థము. ఈ రుగ్మత ఉన్నవ్యక్తికి అది ఒక రుగ్మత అను విషయము తెలియనే తెలియదు. కొంతమందిలో 'హిస్టరికల్ మూర్తిమత్వ ముండును. ఇది హిస్టీరియా కాదు. కాని ఆరుగ్మతకు లోనగు వారికి ఉండు లక్షణముల వంటివే వీరికిని ఉండును. ముఖ్యముగా ఇది స్త్రీలలో అధికముగ నుండును. హిస్టరికల్ (హిస్ట్రియానిక్) మూర్తిమత్వ లక్షణము లిట్లు పేర్కొనబడినవి.

అపరిపక్వత, ఉత్తేజము చెందుట, ఉద్వేగము పొందుట, అనూహ్యమైన భావోద్రేకములను ప్రదర్శించుట ఇతరుల దృష్టిని ఆకర్షించుటకు నాటకీయతను ప్రదర్శించుట (ప్రదర్శనత్వము) మున్నగునవి చేయునని తెలియుచున్నది. ఈ నాటకీయత ప్రదర్శించు చున్నట్లు కొన్ని మారులు ఆ వ్యక్తికే తెలిసి ఉండక పోవచ్చును కూడ! ఎదుటివానికి శృంగారోద్రేకము కల్గించు నట్లు కనిపించుట (Seductive) కూడ వీరి లక్షణము. వీరిని హిస్ట్రియానిక్ మూర్తి మత్వము కలవారిగ కూడ పేర్కొనబడుట కలదు.[1] స్వార్థపరత్వము

---

1. *"This type of personality is characterised by immaturity, excitability, emotional instability and self dramatization. Whether or not the individual is aware of his motives, such self-dramatization is attention seeking and often seductive.*
*Such persons who have also been referred to as histrionic personalities are usually self-centred, vain and quite concerned about the approval of others".*
*Abnormal Psychology and Modern Life - 5th Edition. - P. 374.*

(ego centred), అహము, కూడ అధికముగ నుండును. వీరిలో ప్రదర్శనత్వము (Exhibitionism) అధికము. తలనొప్పి, మొదలగునవి కల్గును. ఆత్మాభిమానము వీరికి అధికముగ నుండును. ఉద్విగ్నత అధికముగ నుండుటయు ఒకరిపై అధికముగ ఆధారపడుటయు, మొండి పట్టుదల, ప్రచోదనాత్మకమైన ప్రవర్తన (impulsive), ఇతరులు తనను పట్టించు కొనవలయునను తాపత్రయ ముండుటయు, కాపట్యము చూపుటయు, తమ శక్తి సామర్థ్యములతో తృప్తిపడక, ఎదుటివారు మాత్రమే కాదు, లోకములోని అందరును తమను, గొప్ప వ్యక్తిగా గుర్తింపవలెనను తపనయు, వీరిలో ఎక్కువగ నుండునని తెలియుచున్నది.[1]

సత్యభామలో పైన వర్ణించిన హిస్టరికల్ మూర్తిమత్వ లక్షణము లుండుట గుర్తింప వచ్చును. ముఖ్యముగా పారిజాతాపహరణ ప్రబంధమునందలి సత్యభామలో, ఈ మూర్తిమత్వ ముండుట చూడగలము. పురాణేతిహాస ప్రబంధ, యక్షగాన, నాటక హరికథాదులం దన్నిట, సత్యభామ పారిజాతమును చూడగానే కావలయునని కోరినట్లుగ వర్ణింపబడి యున్నది. ఇది ఆమెలోని ఉద్విగ్నమైన (Emotional), ప్రచోదనాత్మకమైన (Impulsive) ప్రవర్తనను, కోరినది వెంటనే కావలయుననెడు మొండి పట్టుదలను తెలియచేయును. పారిజాత పుష్పము తనకు గాక, సవతి కిచ్చుట సహింప లేక పోయినది.

*"నారదమౌని మందార సూనముఁదెచ్చి*
*యిచ్చినఁగేల్సాచి పుచ్చుకొనుచు*
*నన్నేడనాడి మానసమున శంకింప*
*కిష్టజనంబున కిచ్చి తీవు"* .....*(ఖై. హరి- 5 - 63)*

అని కృష్ణుని నిందించును. అనగా పారిజాతము తనకు తప్ప మరి యెవ్వరికి నిచ్చి యుండరాదను స్వార్థమున్నది (ego - centred). అదే విధముగా పారిజాతాపహరణ ప్రబంధము నందును, "ఏ పదార్థంబు నాయెదుట బెట్టకమున్న, యెవ్వారి కొసఁగఁడో యిగురుఁబోఁడి (1-94) అని చెలితో చెప్పుకొనినది. అనగా ఏ వస్తువైనను పతి తనకే ముందు ఇచ్చి తీరవలయుని ఆమె భావము.

"ఓ చెలి! శౌరికిచ్చెనట యొక్క లతాంతము దెచ్చి నారదుండా, చపలాక్షి కిచ్చెనట యాతఁడు నవ్విరి" (1-90) నని, ఆ పుష్పము తనకు గాక రుక్మిణి కిచ్చుట అపరాధమని తలచినది. ఇది ఆమెలోని స్వార్థమునే తెలియ చేయును.

అదేవిధముగ, విష్ణుమాయా నాటక ప్రబంధమున

*"పారిజాతంబు భువి సత్యభామ యింటఁ*
*గాని మరి యొండొరుల యిండ్ల, ఁగలుగ దనగ*
*గలుగఁ జేసితి తక్కిన పొలతులిండ్ల*
*నేమి మందుల వలపించి రింత నిన్ను"* .....*(1.201)*

అని పతిని గద్దించి అడిగినది. పారిజాత వృక్షము తనకే ఉండవలయును, ఇతర కాంత లెవరికిని ఉండరాదని ఈమె భావము.

సత్యభామ సౌందర్యవతి యనుట మున్నే నిరూపింపబడి యున్నది. ఆమె తన చేష్టలచే

---

1. "The patients who develop hysterical Symptoms commonly have typical personality, are dramatic, exhibitionistic, ego centred, emotional, dependent, seductive, attention seeking. Superficial, and undependable unpredictable; suggestible, (Jaspers - 1946) Abraham Verghees - Introduction to Psychiatry - P. 55)

కూడ భర్తను వశీకరించుకొను నట్టిది. పతి తనను లాలింప రాగా, అతనిని పాద తాడనము చేసియు, కోపము తీరక

*"....... మానినీ తిలకమప్పుడు మేయర దోఁప నిక్కివీ*
*డిన కచ పంక్తి బల్మరుముడి న్వేడ దోపుచుఁ బై చెరంగు గ్ర*
*క్కునఁ జనుదోయి జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింప జం*
*కెన నెఱిచూపు చూచి పలికెం జలితాధర పల్లవాగ్రయై"* ....(పారి 1.124)

ఇచట సత్య చేష్టలు, నారీజనులు సంభ్రమ వశమున చేయునట్టివే యైనను ఇందు పతిని లోగొను శృంగారపరమైనవి (Seductive) కూడ అగును. "కాముకుని లోఁగొను నదనున గూడ నిట్టివానిని నొనర్తురనియు దెలియ నయ్యెడును" అని దూసిరామమూర్తిగారు దీనిని శృంగార చేష్టలుగానే భావించిరి.[1] పారిజాతాపహరణ యక్షగానమునను ఇదే విధముగ ప్రవర్తించినది (4-247).

అమరావతి యందు, జలక్రీడలాడు తరి యందు కూడ సత్య పతిని తన సుందర శృంగారాత్మక శరీరముచే ఆకర్షించెడు ఆమె ప్రవృత్తి మనము గమనింప గలము (పారి. 4.25). విష్ణుమాయా నాటకమున సత్య, శోభన యౌవన గర్వమును, మనోహర నవరూప గర్వమును నంగవికార విహార గర్వమును పరమహితాత్ముడై విభుడు పాయని గర్వమును కలది (1-150) భామా కలాపమున, చెలితో

*"కలకంఠిరో వానిని కసిదీరను*
*కౌగలింప మనసాయె మగువా, నేడు*
*మనవిని విని నామగని తోడితేవే"* ......(భామా. పు. 33)

అని సత్య అర్థించుటయు ఆమెలోని శృంగారాత్మక ప్రవృత్తినే చెప్పును. రాధాకృష్ణ నాటకమున, సౌందర్య, ప్రణయ గర్విత యగు సత్య "అనురాగబంధమున బాహుబంధమున ఆజ్ఞా బంధమున నాధుని గట్టి వైచితిని" (పు. 19) అని స్వాతిశయముతో అనును. పతి పారిజాతపుష్పమును సవతి కిచ్చుట వలన "నిను నమ్మియుండిన ఫలింబిదె తోడన కల్గెనాకు (పారి 1-125) అనియు, "నిను నమ్మి నాగుట్టును దేజము న్మిగుల గోల్పడిపోయితి నేమి సేయుదున్" (పైది. 127) అనియు, "నన్ను నాతోడి సవతులు నగకమున్న, పంతమలరంగ నిన్ను మెప్పింతుఁ గాక" ....(పైది-131) అనియు సత్య అనుటలో పతి దృష్టి, తన పైనే కేంద్రీకృతము కావలయు ననెడు ఆమె స్వభావమును, తన మాట చెల్లి తీరవలయునను మొండితనమును కూడ స్పష్టమగును.

రాధాకృష్ణ నాటకమున, రాధ మీద అసూయతో సత్య 'నా బాహు బంధమే నీకు నివాస మంటివి కదా! ఈ మాటకు నిదర్శనమేమి? అన్నమాట జరుపుకొనుట యేది? ఇప్పుడే బృందావనమునకు ప్రయాణము బెట్టుకొనిన నీకు మనసు కుదురేది?" (పు. 35) అని భర్తను నిలదీయును. ఈ మాటలు ఆమెలోని మొండితనమును స్వార్థమును, తెలియ పరచును.

తన మాటే నెగ్గవలయునను తాపత్రయము ఈ మూర్తి మత్వము కలవారి లక్షణము. ఉత్తర హరివంశమున, తృతీయాశ్వాసమున జూదమాడ, కృష్ణుడు రమ్మని పిలువగా, అతనిని సత్య కించపరచినది. కృష్ణుడు కోపముతో, జాంబవతిని పిలిపింప యత్నింపగా, అది సహింపలేక తానై, అతనితో నెత్తములాడ వచ్చియు, ముందుగా రుక్మిణితో ఆడి గెల్చి ఆ తరువాత తనతో ఆడవచ్చునని అనినది (3-118). అదే విధముగ సూరన 'విష్ణుపురాణము నందును', పారిజాతాపహరణమునకు అడ్డుపడు వన పాలకులతో పతికన్న ముందు, తాను

---

1. *పారిజాతాపహరణము. సురభి వ్యాఖ్య - పు.93*

కల్పించుకొని మాట్లాడి, పతి ఉద్దేశమును కూడ తెలిసి కొనకుండానే, అతనిని యుద్ధమునకు సిద్ధమగునట్లు చేసినది (8.133).

ఈ విధమైన మూర్తిమత్వము కల వ్యక్తులు దేనినైనను నాటకీయముగ ప్రదర్శింతురు. పారిజాత విషయముగ కోపము వచ్చిన సత్య, సాధారణమైన పద్ధతిలో ధానిని పతి ముందు ప్రకటించి యుండవచ్చును కదా! కాని అట్లు చేయలేదు. భైరవ కవి హరివంశమున ఎఱ్ఱ చీరకు బదులు "నీలపటంబు గట్టి" తమోగృహంబు సొచ్చి" "లలాటంబున ధవళ పటంబు జుట్టి సరసతారుణ చందనంబు మేన నలంది" నిజ శరీరంబును నలంకార శూన్యంబుగా జేయుచు నేక బద్ధ వేణియై నిజ దాసదాసీ జనంబునకు విచారంబు ఘటించు చుండెను" (5-23).

పారిజాతాపహరణ ప్రబంధమున సత్యభామ ప్రదర్శించిన కోపము మరింత నాటకీయ ముగ నున్నది. కోపగృహమున ప్రవేశించిన సత్య

*"మాసిన చీర గట్టికొని మౌనముతోడ నిరస్తభూషయై*
*వాసెన కట్టు గట్టి నిడు వాలిక గస్తురి పట్టు వెట్టి లో*
*గాసిలి చీకటింటి కడకంకటిపై జలదాంత చంద్రరే*
*ఖా సదృశాంగియై పొరలె గాఢమనోజవిషాద వేదనన్" ....(పారి-1-99)*

తలనొప్పి లేకపోయినను కస్తూరి పట్టు పెట్టినది. దినమును ఇష్టముతో కట్టుకొనెడు సన్నకావులకు బదులు మాసిన తెల్ల చీర కట్టినది. అట్లు చీరమార్చుటకు కాని, నగలు తీసివేయుటకు కాని, కస్తూరిపట్టు పెట్టుటకు కాని, అవసర మేమున్నది? అదియును చీకటింట మూల నున్న మంచముపై పొర్లవలసిన అవసర మేమి? తనకు కోపము వచ్చినదనుట చెలులకు, ముఖ్యముగ పతికి తెలియ వలయును. చివరకు పతి శిరమును తాడనము చేసి, అతనిని నిందించి, ఏడ్చి, పంతము నెరవేర్చుకొనినది.

అదే విధముగ యక్షగాన సత్యయు, పారిజాత పుష్ప కారణముగ కల్గిన కోపముతో

*"కోరి ఆభరణ దుకూలముల్ రోసి*
*మెట్టెలు జిగడలు మెడలోన నతడు*
*కట్టిన బొట్టు ముక్కెర మాత్రముంచి*
*యన్ని సొమ్ములు దీసి యావల వేసి*
*చిన్న బోవుచు మైలచీర కట్టుకొని*
*చురుకుగా నుదుట కస్తురి పట్టుబెట్టి*
*కరగుచు నొకమూలగా పూరి చవికె*
*గట్టించి దానిలోగా నుల్కత్రాళ్ళ*
*మట్టుగా నల్లిన మంచంబు మీద" ....(విష్ణు పారి. యక్ష. పు. 35)*

ప్రాయోపవేశము చేయుచున్నట్లు పవ్వళించినది. జానపద సత్యయు అదే విధముగా

*"నాకంటెక్కువ అని తలచెన రుక్మిణినిపుడు*
*అని తలకాయను బిగియించి తరుణి మౌనము చేత*
*సొలయుచు నవరత్నమ్ములు కలసిన సొమ్ములు నల్చించె*
*చెదిరిన కొప్పును విడిచి శిథిలముగా ముడుచుకొని*
*సొలయుచు నవరత్నమ్ములు కలసిన మందిరములు దాటి*
*పూరింటిలో నొక్కా కీలడగు మంచము పయి*
*చీరొక్కటి పరుచుకు పవళించెను........" ....(శ్రీ పారిజాత. పల్లవి. పు. 20)*

ఈమె వేషము చూడగానె కృష్ణునకు, ఆమె కోపము వచ్చిన విషయమును, ఆ కోప తీవ్రతయు గ్రహింపగలడు. అట్లు తెలియవలయు ననియే ఇట్లు చేసినది. అంతేకాదు. పతి రాగా, అతనిని నిందించి, చివరకు తాను ఏడ్చినది. ఈ ఒక్క సందర్భమునందే కాదు. విష్ణుమాయా నాటక ప్రబంధమున పారిజాత వృక్షము తనకు మాత్రమే గాక, సవతులకు కూడ దక్కుట విని; అది సహింపని సత్య 'తాల్మిలేక యేడ్చుచు, దనులత గంపింప గద్గద స్వరంబున' (1-199) అతనిని నిందించుచు, శంకాంతకంబు లేక యవ్వీరు లన్నియు, వెన్నునిపై దిగ పాఱంబోయించి" "తత్సన్నిధానంబు విడిచి" "లోనికిం జని గగన కవాటార్గళంబు బిగియించి" పాన్పుపై పొరలినది (1-203). సత్యకు, అంతకు ముందే పారిజాతము లభించి యున్నప్పుడు రుక్మిణి గాని, ఇతర సపత్నులు గాని అట్లు చేసియుండ లేదు. సత్యభామ మాత్రమే ఇట్లు ప్రవర్తించుచున్నది.

సత్యభామా సాంత్వనమునందును, పదియారువేల కన్యలను కృష్ణుడు చేపట్టినందులకు ఇతర కాంతల వలె గాక, సత్య మాత్రము ఏడ్చుచు, కోపముతో జడతో కొట్టి, పాదతాడనము కూడ చేసినది (పు. 161).

భామా కలాపమున "నీ అభిమానమును, నే తీయించకుంటే భామనా"? "జడతో వేమరు నిన్ను గొట్టకుంటె భామనా?" (పు. 86) అని చెంతకు వచ్చిన పతిని బెదిరించినది.

కృష్ణ తులాభారనాటకములోని సత్య, పతిని తులాభార వ్రతమునకు అంగీకరింప చేయుటకై కోపవేషము వేయును. "ఈ నగల భద్రమొనర్పుము. కోప గృహమున కేగి కోప వేషము దాల్చెద. అబలకు వీరాధి వీరునేని లోబరచు కొన సమర్థములగు సాధనములు కోపాశ్రువులే గదా!" (పు. 34) అని కోపన వేషము వేసికొని కార్యము సాధించు కొనును.

అక్రూరుని యింటి విందునకని చెప్పి తనను వంచించి, రుక్మిణీ సీమంతమునకు హరి యేగినాడని తెలిసిన జానపద సత్య 'మూర్ఛిల్లినది' (రుక్మిణీ దేవి సీమంతము. పు. 158)

*"అతి దుఃఖముతో భామా భూషనమ్ములు సల్లించి*
*మైల వస్త్రములు గట్టెను మత్సరంబులాతోను*
*పూరింటిలో నొక్కా కీలడుగూ మంచమునా*
*అలంకార గృహములకేగీ పవళించెను సత్యాంగాన"*

*.....(రుక్మిణీ దేవి సీమంతము-పు-158)*

అంతేకాదు. పతి దరిచేరరాగా అతనిని పలు వక్రోక్తులతో దూషించినది. ఇట్లు తనకోపము నంతయు కోపవేషధారణతో, దూషణలతో, దండనలతో, ఏడుపుతో నాటకీయముగ ప్రదర్శించినది.

ఈ హిస్టరికల్ మూర్తిమత్వము గల వ్యక్తులలో ప్రియమైన వస్తువు తమకే సొంతము కావలె ననెడు భావము (Possessiveness) అధికముగా నుండును. సత్యలో ఆ భావమున్న దనుట స్పష్టము. వీరు ఉద్రేకమును నిగ్రహించుకొనలేక ఆత్మహత్యా ప్రయత్నము చేయుదమని అనుటయు కలదు. అది కేవలము బెదిరింపే.[1] సత్యయు ఆత్మహత్య చేసికొనెదనని ప్రకటించుట ఇందు మున్నే చూచి యున్నాము.

సత్యభామ పారిజాత వృక్షము సంపాదించుకొని నపుడు కాని, పతి ఆమె యింటనే ఉన్నపుడు కాని, రుక్మిణ్యాది కాంత లెవ్వరును, ఈమె వలె ఆగ్రహావేశాదులను ప్రదర్శింపలేదు.

---

*1. To obtain their ends they will at times restore to pseduo threats of suicide - James D. Page - Abnormal Psychology P.120*

పై పరిశీలనము వలన సత్యభామ విలువైన వస్తు వేది యైనను సవతులందరిలో, తనకే ముందుగా దక్కవలయునను మొండిపట్టుదలయు, అది మహా మహిమాన్వితమైన అద్భుతమైన పారిజాతపు వృక్షము వంటిదైనను, తనకు తప్ప ఇతరు లెవరికిని దక్కకూడ దనియును, పతి తనకే వశుడై యుండవలె ననెడు స్వార్థమును, పతి దృష్టినాకర్షించు తపనయు కలవ్యక్తిగా నిరూపింప బడుటచే ఆమెను హిస్టరికల్ మూర్తిమత్వము కల వ్యక్తిగ పేర్కొనవచ్చును.

పారిజాతము సత్యకు దక్కినందులకు రుక్మిణికి అసూయ కలుగక పోలేదు. ఆమె "కృతక దరహాస మచ్చువడ" పుణ్యకవ్రతమునకు (పారి. 5-74) వచ్చినదే కాని, సత్యవలె కోపతాపములను ప్రదర్శింపలేదు. కాని అది సత్యభామయే యైన, అచట ఇంత ప్రశాంతముగ ప్రవర్తించి యుండ లేదు. యక్షగానాదులందు గ్రామ్యజానాకర్షణకై రుక్మిణ్యాదులు, సత్యపై పారిజాత విషయకముగ అసూయ చెంది కలహమునకు దిగినట్లు వర్ణింపబడి యున్నారు. కాని పురాణేతిహాసాలందు రుక్మిణ్యాదులట్లు ప్రవర్తించినట్లు లేదు.

సత్యలో ఉన్నది హిస్టీరియా కాదు. హిస్టరికల్ మూర్తిమత్వము. ఇది ఒక హద్దులో ఉన్నపుడు తీవ్రమైన నాడీరుగ్మత కాలేదు. ఇదియే హద్దు మీరిన హిస్టీరియా వ్యాధి యగును. పురుషులకు వలె, స్త్రీలకు, తమలోని మానసిక సంఘర్షణలను బయటకు స్వేచ్ఛగా ప్రకటించుకొను అవకాశము లేక, అణచివేసి కొనుచుండుట వలన ఈ అపవ్యవస్థత (Dis-order) వీరిలో అధికముగ కనిపించు చుండును. హద్దు మీరిన ఇది శారీరకమైన రోగముగ మారును. కాని సత్యది రుగ్మత కాదు. ఇది ఒక రకమైన వ్యక్తిత్వము. కృష్ణుడు సాంత్వన పరుపగానే సత్యభామ కోపతాపాదులను ఉపశమింప చేసికొనుట అన్ని గ్రంథములందు కనిపించుచున్నది. కావున ఇది ఆమె మూర్తిమత్వమనియే యనిపించుచున్నది.



# ఆధార గ్రంథముల పట్టిక

## పురాణేతిహాసాదులు :


అక్కనామాత్యుడు - బాలకృష్ణ లీలావిలాసము : యక్షగానములు, తంజావూరు సంపు-11
ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, విశాఖపట్టణము 1976

అచ్యుత కవి - పౌ - శ్రీమదభినవాంధ్ర విష్ణు పురాణము

అచ్యుతరాముడు, మల్లాది - సత్యామోద చంద్రోదయము (నాటకము)

అనంత కృష్ణశర్మ, రాళ్ళపల్లి - శాలివాహన గాథాసప్తశతీ సారము, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైద్రాబాదు, 1964.

ఎల్లన, చింతలపూడి - విష్ణుమాయా నాటకము (ప్రబంధము) ప్రాచ్య పరిశోధనాలయాంధ్ర శాఖా ప్రచురణములు, మద్రాసు 1934

ఎఱ్ఱన - హరివంశము, (పరిష్కర్త) వేలూరి శివరామశాస్త్రి, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1967

కవిత్రయము - భారతము, వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1964

కాళకవి, చెంగల్వ - రాజగోపాల విలాసము (ప్రబంధము) మద్రాసు ఓరియంటల్ సిరీస్, తంజావూరు, సరస్వతీ మహల్ సిరీస్,నెం. 33, 1951.

కామేశ్వర కవి, లింగనమఖి - సత్యభామా సాంత్వనము, ఆర్టు ప్రెస్, మచిలీపట్నం శృంగార కావ్య గ్రంథమండలి, 1932

కృష్ణశ్రీ (సంపాదకుడు) - స్త్రీల పౌరాణికపు పాటలు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైద్రాబాదు 1963

కృష్ణదేవ రాయలు - ఆముక్తమాల్యద - వావిళ్ళరామస్వామి అండ్ సన్స్, 1962.
ఆముక్తమాల్యదానంజీవినీ వ్యాఖ్య - వేదం వేంకటరాయశాస్త్రి అండ్ సన్సు : మద్రాసు, 1964

గోపాలకృష్ణ మూర్తి, కొప్పరపు - శ్రీకృష్ణ భాగవతము, (సత్యావివాహము) (హరికథ) కోటీశ్వరముద్రాక్షరశాల నరసరావుపేట, 1943

చిదంబరశాస్త్రి, పిసుపాటి - పద్మపురాణము - చిదంబర గ్రంథమాల కాకినాడ-1956

జగ్గకవి, కూచిమంచి - సుభద్రా పరిణయము, ఎన్ అప్పలస్వామి అండ్ సన్సు, పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు : రాజమండ్రి, 1947.

| | | |
|---|---|---|
| తిమ్మన, నంది | - | పారిజాతాపహరణము.<br>1. (పరిష్కర్త) నాగపూడి కుప్పుస్వామయ్య, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1978<br>2. (పరిష్కర్త) దూసిరామమూర్తి, సురభి వ్యాఖ్యాన సహితము, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1968.<br>3. పారిజాతాపహరణము, (సంపా) తాపీధర్మారావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్ హైద్రాబాదు - 1966.<br>4. విశ్వనాథ సత్యనారాయణ, పీఠిక, ఎమెస్కో-సంప్రదాయ సాహితి, 1970.<br>5. (పరిష్కర్త) ఉత్పల వేంకట నరసింహాచార్యులు. వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు. |
| తిమ్మయ | - | ద్విపద భారతము (అరణ్య పర్వము) ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు, వాల్తేరు. 1950. |
| తిరుపతి పాత్రకవి, కాకరపర్తి | - | సత్యభామా కృష్ణ సంవాదము (ప్రబంధము) సుందర రామ శాస్త్రులవారి శారదాంబ విలాస ముద్రాక్షరశాల, మద్రాసు 1893. |
| తిరువేంగళ నాథుడు, తాళ్ళపాక | - | అష్టమహిషీ కళ్యాణము (ప్రబంధము) తిరుమల తిరుపతి దేవస్థానము ప్రెస్, మద్రాసు 1937. |
| ధూర్జటి | - | శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము, వెంకట్రామా అండ్ కో మద్రాసు. 1967 |
| నరసింహకవి, అల్లాడు | - | నారదీయ పురాణము, ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రెరీ అండ్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, హైద్రాబాదు. |
| నరసింహము, విశ్వనాథ | - | హరి వంశ పురాణము - వివరములు లేవు. |
| పినవీర భద్రుడు, పిల్లలమఱ్ఱి | - | జైమినీ భారతము, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, మద్రాసు 1963. |
| పెద్దన, అల్లసాని | - | మనుచరిత్ర, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు 1964 |
| పోతన | | భాగవతము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదారాబాదు. 1964 |
| ప్రభుదత్త బ్రహ్మచారి | - | శ్రీకృష్ణ కల్యాణములు, (వచనము) భాగవత గ్రంథమాల, బందరు 1969 |
| భాగయ్య చెర్విరాల | - | శ్రీకృష్ణ పారిజాతము (యక్షగానము) చంద నారాయణశ్రేష్ఠి, బుక్‌సెల్లరు, సికింద్రాబాదు 195 |

భావనారాయణ, కలిదిండి - విష్ణుపురాణము, ఆనంద ముద్రణాలయము, మద్రాసు 1931

భైరవ కవి, నేమాని - హరివంశము, ఉత్తర భాగము, సుధర్మా పబ్లికేషన్సు; హైదరాబాదు - 29.

మల్లన, తరిగొప్పుల - చంద్రభాను చరిత్ర (ప్రబంధము), ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణ, బ్రిటిష్ మోడీల్ ముద్రాక్షరశాల, మద్రాసు 1922

మాతృభూతకవి - పారిజాతాపహరణము (యక్షగానము), ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, 1960

ముద్దు పళని - రాధికా సాంత్వనము, ఎమెస్కో ప్రచురణ 1972

రంగాచార్యులు, దివి - శ్రీకృష్ణేతి మానుషతత్త్వము (ప్రబంధము) విద్యా పరిషత్ ప్రచురణ, గుంటూరు

ద్వి. ఖం. - 1960

తృ. ఖం. - 1961

పం. ఖం. - 1964

రామకృష్ణుడు, తెనాలి - పాండురంగ మాహాత్మ్యము, వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్సు 1962

రామప్పరాజు, రంగరాజు - సాంబోపాఖ్యానము, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, కాకినాడ, 1932

రామరాజ భూషణుడు - వసుచరిత్ర, వావిళ్ళరామస్వామి అండ్ సన్సు, 1962

రామామాత్యుడు - దేవీభాగవతము, వాణీముద్రాక్షరశాల, బెజవాడ, 1928

రామకృష్ణ శాస్త్రి, కేతవరపు - శ్రీకృష్ణ తులాభారము (హరికథ) వివరములు లభించలేదు. మచిలీపట్నం - 1933

లక్ష్మీకాంతము, బలిజేపల్లి - సాత్రాజితీయము (నాటకము) చంద్రికా ముద్రాక్షర శాల, గుంటూరు. 1914

లక్ష్మీనరసింహము, చిలకమర్తి - నరకాసురవధ అను ప్రసన్నయాదవ నాటకము కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, రాజమండ్రి, 1959

లక్ష్మీనరసింహము, చిలకమర్తి - పారిజాతాపహరణము (నాటకము) గునేశ్వరరావు బ్రదర్స్; రాజమహేంద్రవరము, 1909

లక్ష్మీనరసింహము, పానుగంటి - రాధాకృష్ణ నాటకము, సరస్వతీ బుక్ డిపో. విజయవాడ, 1978.

| | | |
|---|---|---|
| లక్ష్మీనారాయణ రెడ్డి, వాసా | - | శ్రీహలధరు గర్వభంగము (గాంధారకథ) హరికథ, మోహన్ ప్రింటింగ్ వర్క్సు, నెల్లూరు; 1954. |
| లక్ష్మీసరస్వతి, యేలూరిపాటి | - | శ్రీహరివంశము (వచనము) సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి 1961. |
| విశ్వేశ్వరరావు, అయ్యగారి | - | శ్రీకృష్ణ జాంబవంత యుద్ధం (నాటకము) కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు; రాజమండ్రి 1960 |
| వేంకన్న, చేమకూర | - | విజయ విలాసము, (తాపీ ధర్మారావుహృదయోల్లాస వ్యాఖ్య) విశిష్టరచనలు, హైద్రాబాదు 1968. |
| వెంగమాంబ, తరిగొండ | - | విష్ణుపారిజాతము (యక్షగానము), ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1965 |
| వేంకటకవి, గోపీనాథము | - | బ్రహ్మవై (క్రై) వర్తపురాణము (శ్రీకృష్ణఖండము), గుజనీప్రతి, వివరములు లేవు. |
| వేంకటప్పలాచార్య, వేదాల | - | దీపావళి నాటకము, ఆంధ్రరత్న బుక్ డిపో, తెనాలి, 1972. |
| శాహజి | - | రుక్మిణీ సత్యభామా సంవాదము; సతీపతి దానవిలాసము; (యక్షగానములు) తంజావూరు సంపు. 10, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు 1973. |
| శేషాద్రిశర్మ, జనమంచి | - | బ్రహ్మపురాణము - వావిళ్ళరామస్వామి అండ్ సన్సు - 1930 |
| శ్రీనాథుడు | - | కాశీఖండము - వావిళ్ళ రామశాస్త్రులు అండ్‌సన్స్, మద్రాసు - 1962. |
| శ్రీరామ నృసింహమూర్తి కవులు | - | శ్రీమదాంధ్ర భాగవతము, శ్రీరామ నృసింహ గ్రంథ రత్నమాల, ఉప్పులూరు, 1956. |
| శ్రీనారు నార్య | - | పారిజాతాపహరణము |
| | | శుద్ధాంధ్ర నిర్వచన ప్రబంధము (అచ్చతెలుగు మెచ్చుల ప్రచ్చు ముచ్చులి), లలితా ప్రింటర్సు, కడప. |
| సరస్వతీ దేవి, ఇల్లిందల (సేకరణ) | - | జాతిరత్నాలు, శివాజీప్రెస్ (పాటలు) సికింద్రాబాద్ |
| సాంబశివ రాయ కవి, అడవి | - | సాత్రాజితీ పరిణయము (ప్రబంధము) ఆంధ్ర గ్రంథ రత్నాకర కార్యాలయము గుడివాడ - 1924 |
| సిద్ధేంద్రయోగి | - | 1. భామాకలాపము - ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైద్రాబాదు (వివరములు లభించలేదు). |
| | | 2. మంజువాణీ ప్రెస్, ఏలూరు 1906. |
| | | 3. వేదాంతం పార్వతీశ్వరశాస్త్రి, మినర్వాప్రెస్. మచిలీపట్నం 1964. |

సింగన, మడికి - పద్మపురాణము (ఉత్తర ఖండము) వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాల, మద్రాసు 1898.

- ద్విపద భాగవతము, తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణ - 23, తంజావూరు, 1950.

సీతారామస్వామి, తాడేపల్లి - విష్ణుపురాణము, విబుధరంజనీ ముద్రాక్షరశాల, ఏలూరు, 1904

సీతాపతిరావు, బసవరాజు - సాత్రాజితీ పరిణయము (నాటకము) వాణీ ముద్రాక్షరశాల, బెజవాడ, 1915

సుందర రామయ్య, అయినాపురపు - శ్రీకృష్ణ విలాసము, (అష్ట మహిషీకళ్యాణము నాటకము) శ్రీమేరీముద్రాలయము, రామవరము, 1922.

సుబ్రహ్మణ్య భాగవతార్, పరిమి - శమంతక మణి అను సత్యభామా కళ్యాణము హరికథ, కొండేపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు రాజమండ్రి - 1958.

సుబ్బారావు వావిలికొలను - సుభద్రావిజయము (నాటకము) వైజయంతీ ముద్రాక్షరశాల, మద్రాసు, 1911

సుబ్బారావు, ముత్తరాజు - శ్రీకృష్ణ తులాభారము (నాటకము), సరస్వతీ బుక్‌డిపో, విజయవాడ-1976.

సూరన పింగళి - కళాపూర్ణోదయము, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, మద్రాసు, 1962

సూరన పింగళి - ప్రభావతీ ప్రద్యుమ్నము, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, మద్రాసు 1958.

సూరన, వెన్నెలకంటి, - విష్ణు పురాణము, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు, 1955

సోమన - ద్విపద భారతము - సంపు.3 విశ్వకళాపరిషత్తు, వాల్తేరు, 1950

సోమన, నాచన - ఉత్తర హరివంశము, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు 1961.

హనుమయ్య చౌదరి, జంగా - సత్యావివాహము, శుద్ధాంధ్ర నిర్వచన ప్రబంధము, ఆంధ్ర గ్రంథాలయ ముద్రశాల, బెజవాడ 1925

## విమర్శ గ్రంథములు :

అంకయ్య, వి - సాహిత్య చంద్రిక - వేంకటేశ్వర గ్రంథమాల పొన్నూరు, 1965.

ఆరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యము, ఎమ్. శేషాచలం అండ్‌కో, మద్రాసు, 1965.

ఇరావతీ కర్వే - యుగాంతం (అను) బాల చంద్ర ఆప్టే, సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, 1979.

కామశాస్త్రి - కొల్లూరు - ఆంధ్ర ధర్మసింధు సారము, ఎమ్‌ప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్, మద్రాసు, 1888

కాశీ విశ్వనాథ శర్మ, సాలగ్రామ - భారతనారి, (వివరములు లభించలేదు) బెల్లూరు- 1950

కుటుంబరాయ శర్మ, బి.వి. - తిమ్మన కవితా వైభవము, యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ, సికింద్రాబాదు. 1975

కృష్ణమాచార్యులు, ఎక్కిరాల - కళ్యాణ సంస్కృతి, ది వరల్డ్ టీచర్సు ట్రస్టు, విశాఖపట్నం.

క్లిఫర్డ్ టి మార్గన్, రిచర్డ్ ఎ.కింగ్ - మనోవిజ్ఞాన పరిచయము (అను) అన్నపురెడ్డి, వేంకటేశ్వరరెడ్డి, జి.ఫణీంద్రనాథ్, హెచ్.వి.ఆర్. నరసింగరావు, ఎ.వి.వి.నరసింహమూర్తి, తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1977.

చంద్ర శేఖర రెడ్డి, ర్యాచపాళెం - శిల్ప ప్రభావతి, శారదా ప్రింటింగ్ ప్రెస్, కమలానగర్, అనంతపురం, 1961.

జోగారావు, యస్.వి. - ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు 1961.

జోగారావు, యస్.వి. - సారస్వత నీరాజనము, క్వాలిటీ పబ్లికేషన్సు, విజయవాడ, 1966.

తిరుపతి రావు, చెన్నాప్రగడ - పంచకన్యలు, సుజన రంజనీ ముద్రశాల, రాజమండ్రి, 1969.

నరసింహము, కె.వి.ఆర్. - ఆంధ్ర ప్రబంధము అవతరణ వికాసములు, ఆంధ్రా యూనివర్సిటీ వాల్తేరు. 1965

నరసింహశాస్త్రి, కేశవపంతుల - ప్రబంధ పాత్రలు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైద్రాబాదు, 1977

నాగయ్య, జి - ఉత్తర హరివంశ విమర్శనము - వివరములు దొరకలేదు.

నారాయణాచార్యులు, పుట్టపర్తి - ప్రబంధనాయికలు, రాజశేఖర బుక్ డిపో, ఆళ్ళగడ్డ పోస్టు, కర్నూలు జిల్లా, 1981.

నాగయ్య, సముద్రాల - సాహితీ సుధాలహరి, క్రాంతి ముద్రణాలయము, మద్రాసు 1973.

పెద్దన్న, విన్నకోట - కావ్యాలంకార చూడామణి, వేదము వేంకట రాయశాస్త్రి బ్రదర్స్, మద్రాసు 1964

ప్రసాదరాయ కులపతి - ఆంధ్ర భాగవత విమర్శ, శ్రీనివాస పవర్ ప్రెస్ అండ్ జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు.

మాధవ రావు, విన్నకోట - కావ్యరీతులు, ఆంధ్రప్రబంధ వాఙ్మయ పరిణామము, ఎమ్. శేషాచలం అండ్‌కో.

యశోదారెడ్డి, పి - తెలుగులో హరివంశము, సుధర్మా పబ్లికేషన్సు హైద్రాబాదు, 1973

యశోదారెడ్డి, పి - పారిజాతాపహరణ పర్యాలోచనము, సుధర్మా పబ్లికేషన్సు హైద్రాబాదు 1973.

రామనాధ శాస్త్రి, ధారా - ఆంధ్ర వాఙ్మయము - శ్రీకృష్ణ కథ, ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్, విశాఖపట్నం.

రామకృష్ణాచార్య, నండూరి - తిక్కన భారత దర్శనము, కవితా ప్రభాస గ్రంథ మండలి, రాజమహేంద్రవరము, 1969

రామరాజు, బి - అష్టదిగ్గజములు, అష్ట దిగ్గజముల వర్ధంత్యుత్సవోపన్యాసములు, అష్టదిగ్గజ వర్ధంత్యుత్సవ సమితి, హైద్రాబాదు, 1960.

రాధాకృష్ణారావు, వై - త్రివేణి, గంగాధర పబ్లికేషన్సు, విజయవాడ 1973.

రామానుజరావు, దేవులపల్లి - సారస్వత నవనీతము, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైద్రాబాదు.

రామరాజ భూషణుడు - కావ్యాలంకార సంగ్రహము, (నరస భూపాలీయము) ఎమ్.శేషాచలం అండ్ కో, మచిలీపట్టణము, 1965

లక్ష్మీకాంత శాస్త్రి,శిష్టా - విజయ నగరాంధ్ర కవులు, నిర్మలా పబ్లికేషన్సు, విజయవాడ

వరలక్ష్మి, జె - యుగ యుగాల్లో భారత మహిళ, ప్రియదర్శిని ప్రచురణ, హైద్రాబాదు, 1977.

వెంకటసుబ్బయ్య, అప్పజోడు - మహాభారతము - మానవ స్వభావ చిత్రణము, ప్రగతి గీతా ప్రెస్, హైద్రాబాదు - 1977.

వేంకటావధాని, దివాకర్ల - కావ్యలహరి, సాహితీ సాంస్కృతిక సంస్థ, సికింద్రాబాదు, 1971

వేంకట రామరెడ్డి, దొడ్లా - శ్రీకృష్ణ చరిత్రము, వాయునందన ముద్రాక్షరశాల, కావలి, 1947

వేంకట రాయశాస్త్రి వేదము - ఆంధ్ర సాహిత్యదర్పణము, వేదం వేంకట రాయశాస్త్రి అండ్ బ్రదర్సు, మద్రాసు

సత్యనారాయణ, కాశీభొట్ల - ఆంధ్రకవుల ఔచిత్య విచార చర్చ, సాహిత్య అకాడమీ, హైద్రాబాదు

సత్యనారాయణ, విశ్వనాథ - కావ్య పరీమళము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైద్రాబాదు, 1970

సత్యనారాయణ, విశ్వనాథ - సాహిత్య సురభి, ఎన్.ఎస్.అండ్ కో; విజయవాడ, 1964.

శేషయ్య, చాగంటి, - ఆంధ్ర కవితరంగణి, 7వ సంపుటము, హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయము కపిలేశ్వర పురము, 1959

శేషాచల శర్మ, పాలడుగు - కూర్మరాజీయము, సత్పురోహిత సంఘము, కుందేరు, 1970

శ్రీనివాసరావు, జంగమకోటి - వివాహ నిషేధ ధర్మప్రదీపిక, థియసఫికల్ సొసైటీ, మద్రాసు 1907

## విజ్ఞాన సర్వస్వములు :

సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము - సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశ సమితి, హైద్రాబాదు, 1960

## నిఘంటువులు :

శబ్ద రత్నాకరము - బి. సీతారామాచార్యులు, చెన్నపట్టణ దేశభాషా గ్రంథ కరణ సభ, 1981.

శబ్దార్థ కల్పతరువు - శ్రీ వాసవీ గ్రంథ ప్రచురణ సమితి, మచిలీపట్నం - 1961

సూర్యారాయాంధ్ర నిఘంటువు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైద్రాబాద్ - 1982.

## వ్యాసములు :

నారాయణరావు, చిలుకూరి - పారిజాతాపహరణము, భారతి జూలై, 1941

నారాయణాచార్యులు, పుటపర్తి - 'సమర రంగంలో సత్యభామ' ఆంధ్రప్రభ, దినపత్రిక, అక్టోబరు 31, 1978

యశోదారెడ్డి, పి. - సత్యభామా వైభవము, ఆంధ్రపత్రిక, దినపత్రిక, అక్టోబరు, 1979.

వేంకట రమణారావు, దేవరాజు - సత్యభామా - శ్యామ శీలపోషణ, భారతి, మార్చి 1942

## సంస్కృత గ్రంథములు :

కాళిదాసు - అభిజ్ఞాన శాకుంతలము - ఎ.బి. గజేంద్ర గణ్కర్, పాపులర్ బుక్ స్టోర్, టవర్ రోడ్డు, సూరత్, 1951

కాళిదాసు - మాళవికాగ్నిమిత్రము, ఆంధ్ర కరదీపికా వ్యాఖ్యాన సహితమ్, శ్రీపరమేశ్వర పబ్లికేషన్సు, హైదారాబాదు 1973.

జయదేవుడు - గీత గోవిందము. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు.

వాల్మీకి - రామాయణము - శ్రీరామా బుక్ డిపో, సికింద్రాబాదు.

వ్యాసుడు - భారతము వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు (ప్రథమ ముద్రణ), 1929

వ్యాసుడు - పద్మపురాణము, గురుమండల సిరీస్ నెం. 18, 5- క్లైవ్ రోడ్, కలకత్తా, 1959

వ్యాసుడు - 1. భాగవతము - 1. శ్రీధరాచార్య విరచిత భావార్థ దీపికాఖ్యాయా, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, 1927

2. వీరరాఘవీయ వ్యాఖ్యోపేతమ్
విజయ ముద్రశాల - చిత్తూరు 1976

3. శ్రీగౌడీయ మఠము - గుంటూరు - 1982

వ్యాసుడు - బ్రహ్మపురాణము - వావిళ్ళ

వ్యాసుడు - విష్ణుపురాణము (పరిష్కర్త-ఇయ్యుణ్ణి జగన్నాథాచార్యుడు), జ్ఞానసూర్యోదయ ముద్రాక్షరశాల, మద్రాసు, 1882

వ్యాసుడు - హరివంశము, భారత భావదీప వ్యాఖ్యా సహితమ్, చిత్రశాలాప్రెస్, పూనా, 1957

హర్షుడు - రత్నావళి, వివరములు లభించలేదు.

## లక్షణ గ్రంథములు :

అమరుకము - శృంగార దీపికా సహితము, జోతిష్మతీ ముద్రాక్షర శాల, ముత్యాలపేట, మద్రాసు

గౌతమ సూత్రములు - ఆర్య భారత గ్రంథ మాలిక, ఆర్య భారతీప్రెస్, మద్రాసు - 1927

త్ర్యంబక మఖిన్ - అనంగరంగ - ధర్మాకూతం, ఈ. ఎమ్. ఎస్. ఎస్ - మహల్‌లైబ్రేరి, తంజావూరు, 1951.

మనుస్మృతి - వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1928

నారద భక్తి సూత్రములు - శ్రీరామకృష్ణ మఠము, మద్రాసు - 4, 1971

భానుసూరి - రసమంజరి, వేదం వేంకట రాయశాస్త్రి అండ్ బ్రదర్స్, మద్రాసు, 1950

విద్యానాథుడు - ప్రతాపరుద్రీయము - పరిష్కర్త - ఉత్పల వేంకట నరసింహాచార్యులు, వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1954.

విశ్వనాథ కవిరాజు - సాహిత్య దర్పణము, చౌకాంబా సాంస్క్రిట్ సిరీస్, వారణాసి, 1967

శారదా తనయుడు - భావప్రకాశనము, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, హైద్రాబాదు 1973

సర్వజ్ఞ సింగభూపాలుడు - రసార్ణవ సుధాకరము, గార్డెన్ ప్రెస్, మద్రాసు, 1950.

**ఆంగ్ల గ్రంథములు :**

Abraham Varghees - Introduction to psychiatry

Annamma Abraham - The Christian Literature Society, Madras - 1983.

Eric Berne - Transactional Analysis in psycho Therapy, Bollantine Books, New York, 1978.

Gorphade, M.B. - Essentials of Psychology, Himalaya Publishing House, Bombay 1977

Hermaba Chatterjee Sastry - The Social Background of the forms of the marriages in ancient India (Vol. I), Sanskrit pustak Bandar, Calcutta 1972

James, C. Coleman - Abnormal Psychology and Modern Life (I Edition) Scott Foresman and Comapny, Chicago, Atlanta, New York, 1950

James C. Coleman - Abnormal Psychology and Modern Life (5th Edition) D.B. Toraporevala Sons and Co., Private Limited, 1976

James D. Page - Abnormal Psychology (A Clinical approach to Psychological deviants), Tata MC Graw Hill Publishing Company Limited, New Delhi 1974.

Marjorie Boulton - The Anatomy of Drama. Routledg and Kagan Paul Ltd., London, 1968

Oswald summerton - Transactional Analysis Basic Concepts Manohar Publications, New Delhi 1979.

**DICTIONARIES :**

Chaplin, J.P. - Dictionary of Psychology, Deil Publishing and Company, I.N.C. New York, 1982.

Vettom Mani - Puranic Encyclopaedia Motilala Banarasi das, Delhi (Varanasi) 1979



- డాక్టర్. పి. ఎన్. పార్వతీదేవి

తల్లిదండ్రులు : సంపూర్ణదేవి, నారాయణ అయ్యర్

విద్యాభ్యాసము : ఎస్.ఎస్.ఎల్.సి. - (రాజాహైస్కూలు - తుని)
పి.యుసి., బి.ఏ. - (క్వీన్ మేరీస్ కళాశాల, మద్రాసు)

బి.ఏ. రెండవ సంవత్సరములో (జనరల్ తెలుగు)
కాంచనపల్లి కనకమ్మ బంగారు పతకం.

బి.ఏ.లో - సర్వ ప్రథమురాలిగా
(మద్రాసు విశ్వ విద్యాలయము)

ఎమ్.ఏ. - సర్వప్రథమురాలిగా
(ఆంధ్ర విశ్వ విద్యాలయము, విశాఖపట్టణము)

పిహెచ్.డి., - నాగార్జున విశ్వవిద్యాలయము

ఉద్యోగము : రీడరు., & తెలుగు శాఖాధ్యక్షులు
మారిస్టెల్లా కళాశాల, విజయవాడ-8.

ఇతర రచనలు : పునాదిలేని భవంతి (నవల) వనితా జ్యోతిలో సీరియలుగా, ఒక క్రైస్తవ మత గ్రంథము - (తమిళము నుండి తెలుగునకు), అనేక సాహిత్య వ్యాసములు, కథలు, అనువాద కథలు (తమిళం నుండి తెలుగునకు) - వాఙ్మయి, వనితాజ్యోతి, ఆంధ్రజ్యోతి, అభినందన, విశ్వరచన, విపులలో ప్రచురితములు

ఇతర వివరములు : పలు సాహిత్య సభలలో ఉపన్యాసములు
20 పైగా రేడియో ప్రసంగములు